

# ఆంధ్ర లొయోల (స్వయంప్రతిపత్తి) కళాశాల

విజయవాడ - 520 008

# అమ్మనుడి ప్రత్యేక సంచిక

తెలుగుజాతి పత్రిక

Vol 19 - Issue 01- Spl Edition - March 2024, ISSN No. 2582-8738

# తెలుగు సాహిత్యం - సామాజిక స్పృహ

## జాతీయ సదస్సు - 2024

తేది : 13, 14 మార్చి 2024

సంపాదకులు :

ఫా. డా. జి.ఏ.పి. కిశోర్, ఎస్.జె., ప్రిన్సిపల్

డా. కోలా శేఖర్, తెలుగు శాఖాధిపతి

# తెలుగు సాహిత్యం - సామాజిక స్పృహ

జాతీయ సదస్సు-2024

ప్రత్యేక సంచిక


సంపాదకులు:

**ఫా. డా. జి.ఏ.పి. కిశోర్,** ఎస్.జె., ప్రిన్సిపల్

**డా. కోలా శేఖర్,** అధ్యక్షులు, తెలుగు,సంస్కృతం &హిందీ శాఖలు

**శ్రీ రహ్మానుద్దీన్,** స్వతంత్ర పరిశోధకుడు



ప్రచురణ:

**ప్రాచ్యభాషా పరిషత్, ఆంధ్ర లొయోల (స్వ) కళాశాల**

విజయవాడ. 2024

**SOCIAL CONSCIOUSNESS IN TELUGU LITERATURE**

National Seminar-2024

First Edition: March 2024

AMMANUDI Spl. Edition

Vol - 19, Issue 01, ISSN No. 2582-8738

Editors:

FR. DR. G.A.P. KISHORE, S.J., Principal

DR. KOLA SEKHAR, HoD, Department of Oriental Languages

SRI RAHMANUDDIN, Independent Researcher



For Copies:

Dept. Of Oriental Languages

Andhra Loyola College (A)

Vijayawada-08

Designed by:

Rajani Graphics

Note: The editorial team and the college have nothing to do with the views of the authors. These are just their personal opinions. (రచయితల అభిప్రాయాలతో సంపాదక వర్గమునకు మరియు కళాశాలకు ఎటువంటి సంబంధం లేదు. ఇవి కేవలం వారి వ్యక్తిగత అభిప్రాయాలు మాత్రమే.)

# ముందుమాట

ఆంధ్ర లొయోల (స్వ) కళాశాల, 70 వసంతాలు పూర్తి చేసుకొని మరో నూతన వసంతంలోకి అడుగిడుతున్న శుభ సందర్భం. తెలుగు నేల మీద ఎవరికీ సాధ్యం కానీ ఎన్నో రికార్డులను నెలకొల్పింది. తెలుగు శాఖ అదే పందాను కొనసాగిస్తూ ఉంది. 70 సంవత్సరాల సుదీర్ఘమైన అనుభవం కలిగిన తెలుగు శాఖ, 1000 ఏళ్ళ తెలుగు సాహిత్యంలోని భిన్న దృక్పథాలతో అనేక జాతీయ సదస్సులను నిర్వహించడం జరిగింది.

ఈ సంవత్సరం నిర్వహించిన "తెలుగు సాహిత్యం- సామాజిక స్పృహ" జాతీయ సదస్సు విశేష ప్రాధాన్యతను సంతరించుకుంది. దేశవ్యాప్తంగా వివిధ విశ్వవిద్యాలయాలు, పరిశోధన సంస్థల నుండి వచ్చిన పరిశోధకులు తమ అమూల్యమైన పరిశోధనా ఫలితాలను సమర్పించారు.

సదస్సులో సమర్పించబడిన  పరిశోధన పత్రాలు తెలుగు సాహిత్యంలోని వివిధ కోణాలను ఆవిష్కరించాయి. ప్రతి పత్రం తనదైన ప్రత్యేకతను కలిగి ఉంది.

ప్రధానంగా ఈ పత్రాలు కింది అంశాలపై దృష్టి సారించాయి:

1. సామాజిక స్పృహ - సాహిత్య ప్రతిబింబాలు

2. దళిత, స్త్రీవాద సాహిత్యం

3. ప్రాంతీయ సాహిత్య అధ్యయనం

4. భాషా పరిరక్షణ - సవాళ్లు

5. నవల, కథ, కవిత - సామాజిక దృక్పథం

6. అనువాద సాహిత్యం - సామాజిక స్పృహ

జాతీయ సదస్సు 2024 కళాశాల ప్రిన్సిపల్ & సదస్సు సంచాలకులు ఫా. డా. జి.ఏ.పి. కిశోర్ ఎస్.జె. గారి స్వాగతోపన్యాసంతో ప్రారంభమయ్యింది. ప్రాచ్య భాషల శాఖాధిపతి & సదస్సు సమన్వయకర్త డా. కోలా శేఖర్ రెండు రోజుల జాతీయ సదస్సు విశేషాలను వివరించారు. ప్రారంభ సమావేశానికి సీనియర్ రీజినల్ డైరెక్టర్, ఇగ్నో, డా. దోనేపూడి రామాంజనేయ శర్మ ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. కళాశాల విద్యాశాఖ, అకాడెమిక్ ఆఫీసర్, డా. టి. జాన్ కిరణ్ బాబు కీలకోపన్యాసం చేశారు. కళాశాల పూర్వ తెలుగు శాఖాధిపతి ఆచార్య గుమ్మా సాంబశివరావు ఆత్మీయ అతిథిగా పాల్గొన్నారు. ముగింపు సమావేశానికి ముఖ్య అతిథిగా భారతీయ భాషా

శాస్త్రజ్ఞుల సంఘం అధ్యక్షులు ఆచార్య గారపాటి ఉమామహేశ్వరరావు పాల్గొన్నారు. హైదరాబాద్ సిటీ కళాశాల, తెలుగు శాఖాధ్యక్షులు డా. కోయి కోటేశ్వరరావు మరియు ఆంధ్ర విశ్వవిద్యాలయం, అసోసియేట్ ప్రొఫెసర్ డా. కె. రత్న శేఖర్ గౌరవ అతిథులుగా పాల్గొన్నారు. ప్రాచ్య భాషల శాఖాధిపతి & సదస్సు సమన్వయకర్త డా. కోలా శేఖర్ రెండు రోజుల జాతీయ సదస్సు నివేదికతో కార్యక్రమాన్ని ముగించారు.

ప్రత్యేకంగా పేర్కొనదగ్గ అంశం ఏమిటంటే, ఈ సదస్సులో ప్రత్యక్షంగా 51 మంది, ఆన్‌లైన్‌లో 39 మంది పత్ర సమర్పణ చేయడం ద్వారా సాంకేతిక పరిజ్ఞానాన్ని సమర్థవంతంగా వినియోగించుకోవడం జరిగింది. ఇది భవిష్యత్తులో నిర్వహించబడే సదస్సులకు ఒక మార్గదర్శకంగా నిలుస్తుంది.

పరిశోధన దృక్పథంతో పంపిన పత్రాలను ముద్రించి యు.జి.సి. కేర్ లిస్ట్ జర్నల్ అమ్మనుడి ద్వారా ప్రత్యేక సంచికగా తీసుకొస్తున్నాం. ఈ అవకాశాన్ని కల్పించిన శ్రీ సామల రమేష్ బాబు గారికి, ఆచార్య గారపాటి ఉమామహేశ్వరరావు గారికి, శ్రీ రహ్మానుద్దీన్ గారికి ప్రత్యేక ధన్యవాదాలు.

ఈ సదస్సు విజయవంతం కావడానికి సహకరించిన అందరికీ ప్రత్యేక కృతజ్ఞతలు. ముఖ్యంగా:

రెండు రోజుల జాతీయ సదస్సు నిర్వహణకు అవకాశం కల్పించిన కళాశాల యాజమాన్యానికి మరియు ఫా. డా. జి.ఏ.పి. కిశోర్ ఎస్.జె., ప్రిన్సిపల్ గారికి కృతజ్ఞతలు. జాతీయ సదస్సు నిర్వహణలో తమ సహాయ సహకారాలు అందించిన డా. ఆర్. రవీంద్రభాస్, శ్రీ జి. మాథ్యూ శ్రీరంగం, డా. వై. విజయానందరాజు గార్లకు ధన్యవాదాలు.

ఈ ప్రత్యేక సంచిక ద్వారా తెలుగు సాహిత్య పరిశోధన రంగానికి ఒక గొప్ప సంకలనాన్ని అందించగలిగామనే విశ్వాసం ఉంది. భవిష్యత్ పరిశోధకులకు ఇది ఒక విలువైన వనరుగా ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాము.

**డా. కోలా శేఖర్**

సదస్సు సమన్వయకర్త

# విషయ సూచిక

******

# 1. సావిత్రిబాయి ఫూలే కవిత్వం - సామాజిక స్పృహ

**డా.ఎం.మంజుశ్రీ**

అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలుగు శాఖ,

తారా ప్రభుత్వ డిగ్రీ కళాశాల,

సంగారెడ్డి, తెలంగాణ రాష్ట్రం

సంప్రదింపులు : 9959626733,

వేగుచిరునామా: darlamanjusri@gmail.com

**కీలక పదాలు**: అనువాద కవిత, సావిత్రిబాయి పూలే, ఆచార్య వి.కృష్ణ, దళిత సాహిత్యం, బహుజన సాహిత్యం.

**పత్ర సారాంశం**: సావిత్రిబాయి పూలే చాలామందికి ఒక ఉపాధ్యాయినిగా తెలుసు. కానీ, ఆమె మరాఠీలో కవిత్వం రాశారు. దాన్ని తెలుగులోకి ఆచార్య వి. కృష్ణ అనువాదం చేశారు. సమకాలీన సంప్రదాయంతో ముడిపడిన అనేక అంశాలను శాస్త్రీయ దృక్పథంతో ఆలోచించాలని తన కవిత్వం ద్వారా ఖండించారు. ఈమె కవిత్వం గురించి తెలుగులో అంతగా ప్రాచుర్యంలోకి రాలేదు. ఈమె చిన్ని కృష్ణ అనువాదం ద్వారా ఆమె కవిత్వాన్ని అర్థం చేసుకుంటున్నారు. కవిత్వాన్ని చదవడం ద్వారా ఆనాటి సమకాలీన పరిస్థితులు ఆ పరిస్థితులలో సంప్రదాయ భావాలు కొన్ని సామాజిక వర్గాలపై చూపుతున్న ప్రభావం, ఆ ప్రభావాన్ని తప్పించుకోలేని పరిస్థితుల్లో ఆ ప్రజలు చైతన్యవంతులు కావడం వంటి అంశాలు తన కవిత్వంలో సావిత్రిబాయి పూలే చర్చించారు. ఈ పరిశోధన పత్రాన్ని అనువర్తిత పద్ధతిలో విశ్లేషిస్తాను.

సావిత్రిబాయి జీవితం- పరిచయం:

సావిత్రిబాయి పూలే (1831–1897) భారతీయ తొలి మహిళా ఉపాధ్యాయినిగా, సంఘసంస్కర్తగా, కవయిత్రిగా ప్రసిద్ధిచెందారు.తన 9వ యేటనే 12 సంవత్సరాల వయసులో ఉన్న మహాత్మాజ్యోతిరావు బాపూలేని వివాహం చేసుకున్నారు. ఆయన గొప్ప సంఘసంస్కర్త. స్త్రీకి విద్య అవసరమని భావించిన సంస్కర్త కావడంతో సావిత్రిబాయి పూలేని చదివించారు. ఆమె మహారాష్ట్రలోనిసతారా జిల్లాలో నయాగావ్ అనే గ్రామంలో, 1831 జనవరి 3న ఒక రైతు కుటుంబంలో జన్మించారు.జ్యోతీరావు పూలె ప్రోత్సాహంతోనే ఇంట్లోనే అక్షరాభ్యాసం చేసి విద్యావంతురాలైంది. అహ్మద్ నగర్ లో ఉపాధ్యాయ శిక్షణ పొంది, 1848 లో భర్త జ్యోతిరావుతో కలిసి క్రింది కులాల బాలికల కోసం పూణేలో మొదటి పాఠశాలను ప్రారంభించిన గొప్ప సంస్కర్త. ఆమె మానవ హక్కుల గురించి ఇతర సామాజిక సమస్యల గురించి స్త్రీలను చైతన్యపరచడానికి 1852లో మహిళా సేవామండల్ అనే మహిళా సంఘాన్ని కూడా స్థాపించారు. లింగ సమస్యలకు తోడుగా, కుల పితృస్వామ్య వ్యవస్థల అణచివేతకు వ్యతిరేకంగా స్త్రీల సాధికారిత కోసం ఈ సంస్థ కృషిచేసింది. మహిళా హక్కులే మానవ హక్కులని తొలిసారిగా నినదించినది సావిత్రిబాయి పూలే. అసత్యాలతో, అగ్రవర్ణ దురహంకారపు నిచ్చెనమెట్ల కులవ్యవస్థగా నిర్మాణమైన సమాజంలో సత్యాన్ని శోధించడానికి 1873 లో తన భర్త మహాత్మా పూలేతో కలసి "సత్యశోధక్ సమాజ్ "ను ప్రారంభించి బాల్యవివాహలకు, మూఢనమ్మకాలకు, సతీసహగమనానికి వ్యతిరేకంగా, వితంతువు పునర్వివాహల కొరకు అసమాన బ్రాహ్మణ వ్యవస్థకు వ్యతిరేకంగా బలమైన ఉద్యమం నడిపారు. బాల్యంలోనే వైధవ్యాన్ని అనుభవించే ఎంతో మంది ఆడపిల్లలకు అన్నం పెట్టి ఆశ్రయం కల్పించారు. గర్భవతులైన వారికి పురుళ్లు పోసి వారి కళ్లల్లో వెలుగు చూసారు. అలా పురుడు పోసుకుని తన వద్దే వదిలేసి పోయిన ఓ బిడ్డను అక్కున చేర్చుకున్నారు.యశ్వంత్ గా నామకరణం చేసి తమ ఆశయాలకు, ఆకాంక్షలకు అనుగుణంగా పెంచి పెద్ద

చేసారు.వితంతువులకు శిరోముండనం చేయడాన్ని తీవ్రంగా ఖండించి, క్షురకులను చైతన్యపర్చి, వితంతువులకు శిరోముండనం చేయబోమంటూ క్షురకుల చేత 1860లో సమ్మె చేయించారు. తరువాత 1873 సెప్టెంబరు 24న ''సత్యశోధక్ సమాజ్'' అనే సామాజిక, ఆధ్యాత్మిక సంస్థను ప్రారంభించి, సత్యశోధన కోసం ఉద్యమాన్ని నడిపారు పూలే. ఈ సత్యశోధక్ సమాజ్ మహిళా విభాగం సావిత్రీబాయి నేతృత్వంలో నడిచేది. వివాహాలు వంటి శుభ కార్యాలను పురోహితులు లేకుండా నిర్వహించే విధానాన్ని ఈ సంస్థ ప్రారంభించింది. 1873 డిసెంబరు 25న భార్యను కోల్పోయిన ఒక యువకునికి తన స్నేహితురాలి కుమార్తెతో సత్యశోధక్ సమాజ్ ఆధ్వర్యాన సావిత్రీబాయి వివాహం జరిపించారు. 1868 నుంచి సావిత్రీబాయి అంటరానితనానికి వ్యతిరేకంగా పోరాడారు. 1870లో ఒకసారి, 1896లో మరోసారి దేశంలో తీవ్ర దుర్భిక్షం ఏర్పడినప్పుడు పూలే దంపతులు చేసిన కృషి అనన్య సామాన్యం. కరువు వాతపడిన కుటుంబాలలోని అనాథ బాలలను దాదాపు 2,000 మందిని అక్కున చేర్చుకున్నారు. తమ పాఠశాలల్లో విద్యార్థులకు మధ్యాహ్న భోజనం ప్రారంభించారు.

సాహిత్రిబాయి పూలే కవిత్వం 'కావ్యపూలే':

సావిత్రిబాయి సంఘ సంస్కర్తగానే గాదు, రచయిత్రిగా కూడా వేగుచుక్కగా నిలిచారు. 1854లో ఆమె తన కవితా సంపుటి 'కావ్యపూలే'ను మరాఠీలో ప్రచురించారు. మరో కవితా సంపుటి 'పావన కాశీ సుబోధ్ రత్నాకర్'ను 1891లో ప్రచురించారు. ఆమె ఉపన్యాసాల్లో కొన్ని 1892లో పుస్తకరూపంలో వచ్చాయి. మరాఠీలోని ఆమె రచనలు ఆంగ్లం, హిందీ భాషలలోకి అనువాదమయ్యాయి. హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటికి చెందిన ప్రసిద్ధ కవి, పరిశోధకులు, అధ్యాపకులు ఆచార్య వి.కృష్ణ అనువాద గ్రంథం 'సాహిత్రిబాయి పూలేకవితలు' ''కావ్యపూలు'' గ్రంథాన్ని అన్వేషి రీసెర్చ్ సంస్థ, హైదరాబాదు వారు 2017లో ప్రచురించారు. ఈ అనువాద పుస్తకాన్ని ఆధారంగా చేసుకొని ఈ పత్రంలో ఆమె కవిత్వంలో కనిపించే వివిధాంశాలలో ప్రతిబింబించే సామాజిక స్పృహను విశ్లేషించే ప్రయత్నం చేస్తాను.

సాహిత్రిబాయి పూలే తన 'కావ్యపూలే' కవితాసంపుటిని తన భర్తకు అంకితమిచ్చారు. అంకితం చేస్తూ రాసిన వాక్యాల్లో ఆమె తన భర్త కలిగించిన సామాజిక చైతన్యాన్ని కూడా ప్రతిఫలిస్తుంది.

*''కురిపించావు నామీద*

*విశాల భావ వెల్లువ*

*సమస్తం నిండిపోయెను హృదయం*

*తెలియదు నీ ఉపకారం*

*అనంతమని''* పేర్కొంటూ తన అంకితాన్ని కొనసాగించారు సావిత్రిబాయి పూలే.

ఈ కవితాసంపుటిలో 38 ఖండికలు ఉన్నాయి. ప్రతి కవితలోను ఆమె పడిన సంఘర్షణ, సామాజిక ప్రతిఫలనం, సామాజిక స్పృహ, సామాజిక చైతన్యం వ్యక్తమవుతున్నాయి.

సామాజిక స్పృహ అంటే?

సామాజిక స్పృహ అనేది మార్క్సిస్టు సాహిత్య భావన. దీన్ని ఆంగ్లంలో social consciousness అంటారు. దీన్ని వివరిస్తూ కార్ల్ మార్క్స్ ఇలా అన్నారు. "In the social production of their life, men enter into definite relations that are indispensable and independent of their will; these relations of production correspond to a definite stage of development of their material forces of production. The sum total of these relations of production constitutes the economic structure

of society — the real foundation, on which rises a legal and political superstructure and to which correspond definite forms of social consciousness. The mode of production of material life determines the social, political and intellectual life process in general. It is not the consciousness of men that determines their being, but, on the contrary, their social being that determines their consciousness." ( Karl Marx, "Economic Manuscripts: A Contribution to the Critique of Political Economy 1859". www.marxists.org.)

దీని సారాంశాన్ని పరిశీలిస్తే, మానవుడు నిత్యం సామాజిక ఉత్పత్తులతో వివిధ సంబంధాలు కలిగి ఉంటాడు. ప్రత్యక్షంగానో,పరోక్షంగా అవన్నీ మానవుల ఆర్థికస్థితిగతులపై ప్రభావాన్ని చూపిస్తాయి. నిజానికి ఇవన్నీ ఉపపరితలంలో కనిపించినా, వాటి ప్రభావం అంతా పునాదిలోనే ఉంటుంది. పునాదిలో ఉన్న ఆర్థికస్థితి గతుల వల్ల ఉపరితంలోని మానవ సంబంధాలు వారి సామాజిక, సాంస్కృతిక కోణాల్ని నిర్ణయిస్తాయి. సమాజంలో ఈ వ్యత్యాసాలను గుర్తించి, వారి రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక కారణాలను తెలుసుకొని అవి అలా రూపొందడానికి, వాటి ప్రభావానికి గురవుతున్న వారి ప్రతిస్పందనలను సాహిత్యంలో వ్యక్తీకరించడం ద్వారా సామాజిక స్పృహను గుర్తించగలుగుతాం.

సామాజిక స్పృహను సులభంగా చెప్పుకోవాలంటే సమాజంలో భిన్నవైరుధ్యాలు, ఆ వైరుధ్యాలకు గల కారణాలను తెలిసి, వాటి పరిష్కారాల్ని సూచించేలా సృజనీకరించగలిగితే అది సామాజిక స్పృహగల రచన అవుతుంది. ఒక సామూహిక జీవనంలో వైయక్తిక స్థితి గతుల్ని శాస్త్రీయంగా గుర్తించగల చైతన్యం లేదా అవగాహన సామాజిక స్పృహకు సంబంధించినదవుతుంది. తమ హక్కులతో పాటు, తమ బాధ్యతలను కూడా గుర్తెరిగి ప్రవర్తించడంలో సామాజిక స్పృహ ఉంటుంది. సామాజిక స్పృహ కొంతమందిలో వివిధ నమ్మకాలపై కూడా ఆధారపడి ఉంటుంది. అవి మత విశ్వాసాలు కావచ్చు, వంశానుగతంగా వచ్చినవి పక్షుల మధుర గీతాలాపనలు పువ్వుల మీద వాలే రంగురంగుల సీతాకోక చిలుకలు సందడి చేయును ప్రతి నిమిషం ప్రకృతి సమస్తం కావచ్చు.ఓ మహాత్మ జ్యోతిబా! దీనులు శూద్రులు అతి శూద్రులు నీ వైపే చూస్తున్నారు జ్ఞానంతో మా మనస్సులను నింపండి
మాకు బాగా తెలుసు మీ జ్ఞానంతోనే మాకు ముక్తి లభిస్తుందిఈ సైద్ధాంతిక అవగాహనతో సాహిత్రిబాయి పూలే కవిత్వంలో ప్రతిఫలించే సామాజిక స్పృహను కింది విధంగా గమనించవచ్చు.

**ప్రత్యామ్నాయ ప్రతీకలు- పురాణ స్పృహ:**

సాహిత్రిబాయి పూలే తన కావ్యపూలే కవితాసంపుటిలో మొదటి కవిత 'ఆత్మకథనం'లో తన గ్రామాన్ని భారతదేశానికి ప్రతీకగా వర్ణించినట్లనిపిస్తుంది.

*''కష్టజీవుల గ్రామం నా గ్రామం*

*ఎన్నెన్నో జనజాతుల సమాహారం*

*సుఖ సంతోషాలు*

*పాడి పంటలతో నా గ్రామం*

*వ్యవసాయం కోసం కురిసెను వర్షం అపారం*

*....*

*బలి చక్రవర్తి మహనీయుడు*

*రైతులు ఎంతో ఔదార్యవంతులు*

*నాకు అనిపిస్తుంది*

*నా గ్రామం*

*బలి మహారాజు రాజధానిలా ఉందని*

*కాదు మేము నిరాశపరులం*

*ఆ మహాదాత యొద్దకు*

*నిజమైన వారసులం''* అని మొదటి నుండీ కష్టపడే తత్త్వమున్న దేశంగా భారతదేశం గొప్పతనాన్ని వివరించారు. ఈ కవితను ఆచార్య కాత్యాయనీ విద్మహేగారు విశ్లేషిస్తూ ఇలా అన్నారు. *''పౌరాణిక చరిత్ర దేవతల ప్రయోజనాల కోసం దానవులను దుర్మార్గులుగా చిత్రించి అణచివేసింది. అణచివేయబడినవాళ్ల పక్షం ఆమె తీసుకున్నది. దేవదానవులు ఒకే తండ్రి బిడ్డలు. కశ్యప ప్రజాపతి వాళ్ళ తండ్రి. తల్లులు మాత్రమే వేరువేరు.అదితి సంతానం దేవతలు . దితి సంతానం దానవులు. ఇంద్ర సింహాసనం మాత్రం ఎప్పుడూ దేవతలదే. దానికోసం సంఘర్షించిన ప్రతి సందర్భంలో దేవతల పక్షాన విష్ణువు ఎదో ఒక పద్ధతిలో దానవులను అణచివేస్తూ వచ్చాడు. గెలిచినవాళ్లు రాసిన చరిత్రలో దానవులు ప్రతినాయకులు అయినారు. ఈ పౌరాణిక చరిత్రను తిరగరాయటం భారతీయ సమాజంలో సమాన న్యాయం నిరాకరించి బడిన వర్గాల సహజ ఆకాంక్ష అయింది. ఆ క్రమంలోనే సావిత్రి బాయి బలి ని దానవీరుడిగా నిలబెట్టి ఉంటుంది.'' ( సారంగ అంతర్జాల పత్రిక, సంచిక: 1 నవంబర్ 2018).*దీన్ని బట్టి సాహిత్రిబాయికి భారతీయ పురాణాల పట్ల స్పష్టమైన ''స్పృహ'' ఉందని చెప్పుకోవచ్చు.

**భారతీయ సంఘసంస్కరణలపైసామాజిక స్పృహ:**

సాహిత్రిబాయికి భారతీయ సమాజంలో కుల, వర్గ వ్యవస్థలపై, వివిధ మూఢ విశ్వాసాలపై స్పష్టమైన అవగాహన ఉన్నట్లు ఆమె చేసిన సంఘసంస్కరణ కార్యక్రమాలతో పాటు, ఆమె రాసిన కవితలను బట్టి కూడా చెప్పవచ్చు. శూద్రుల పక్షాన నిలబడి, వారి చదువు, వివిధ అవకాశాల కోసం పోరాడిన మహాత్మాజ్యోతిబాపూలే గురించి ఒక కవిత 'జ్యోతిబాకు వందనాలు'లో ఇలా వర్ణించారామె.

*''ఓ మహాత్మా జ్యోతిబా!*

*దీనులు శూద్రులు అతి శూద్రులు*

*నీ వైపే చూస్తున్నారు*

*జ్ఞానంతో*

*మా మనస్సులను నింపండి*

*మాకు బాగా తెలుసు*

*మీ జ్ఞానంతోనే మాకు ముక్తి లభిస్తుంది''* జ్యోతిబాపూలే, ఆయన రాసిన రచనలు పురాణాల గురించీ సామాజిక విషయాల గురించీ చదివితే మూఢవిశ్వాసాల పట్ల ఆయనకు ఎంత వ్యతిరేకత ఉందో, కొన్ని వర్గాలను మరికొన్ని వర్గాలు ఏ విధంగా దోపిడీ చేశాయో చాలా స్పష్టంగా అర్థం అవుతుంది. ఆయన రాసిన 'గులాంగిరి' గ్రంథం దీనికి ప్రత్యక్ష ఉదాహరణ. అందుకని అటువంటి వారి రచనలు, అటువంటి వారి సంఘసంస్కరణలు, అటువంటి వారి జ్ఞానం ఈ దేశానికి అవసరం అనడం ద్వారా సావిత్రిబాయి పూలేకున్న సామాజిక స్పృహ స్పష్టమవుతుంది. వీటితో పాటు 36, 37 కవితలు 'ప్రపంచమార్గం', 'జ్యోతిబా సందేశం' (పుట: 78-79), 38 వ కవిత 'సావిత్రి-జ్యోతిబా సంభాషణ' (పుట: 81) కవితల్లో మహాత్మాజ్యోతిబాపూలే చేసిన సామాజిక సంస్కరణలను ప్రస్తావించడం, వాటిని ఆచరించడం ద్వారా సామాజిక పరివర్తన జరుగుతుందనీ, పీడిత వర్గాలు కనీస అవసరాలకు నోచుకొని ఆత్మగౌరవంతో జీవించగలరనే ఆకాంక్షను వ్యక్తం చేశారు.

విద్య వివేకాన్నిస్తుందనే ప్రబోధం:

'వారిని మనుషులని ఎలా అనను?' అనే శీర్షికతో విద్య ప్రాధాన్యాన్ని వివరిస్తూ గొప్ప సామాజిక స్పృహతో సావిత్రిబాయి పూలే కవిత్వాన్ని వర్ణించారు.

*''విద్య లేదు జ్ఞానం లేదు*

*చదువుకుని విద్యావంతులు కావాలనే ఆలోచన లేదు.*

*తెలివి ఉన్నా వ్యర్థంగా కోల్పోతారు.*

*వారిని మనుషులని ఎలా అనను?*

*చేతులు ముడుచుకుని కూర్చుంటారు.*

*పశువులు కూడ అలా కూర్చోవు*

*ఆలోచన లేదు, ఆచరణ లేదు.*

*వారిని మనుషులని ఎలా అనను?''* అని ఒక సుదీర్ఘమైన కవిత రాశారు . చదువుకోకుండా ఉంటే సమాజం గురించి తెలియదనీ, ఇంటి నిండా పిల్లల్ని కనడం మాత్రం తెలుసుననీ, ఆపిల్లల్ని పోషించడానికి కావలసిన వనరులు ఎలా వస్తాయో మాత్రం తెలియదనీ వర్ణిస్తూ అధిక సంతానం అధిక కష్టాలకు కారణమని సందేశాన్ని కూడా అందిస్తారు.

*''జ్యోతిష్యం, పంచాంగం,*

*హస్త రేఖల చుట్టూ తిరిగెదరు మూర్ఖులు*

*స్వర్గం నరకం కల్పనలో మునిగి పోయెదరు పశువుల జీవితంలో కూడ*

*ఇలాంటి భ్రమలకు లేదు ఎలాంటి స్థానం*

*వారిని మనుషులని ఎలా అనను?''* అనడం ద్వారా సావిత్రిబాయికి శ్రమపట్ల, వాస్తవికత పట్ల తనకున్న సామాజిక స్పృహ స్పష్టంగా తెలుస్తుంది. ఆమెలోని భౌతికవాదానికి ఈ కవిత చక్కని నిదర్శనం. తమ దారిద్ర్యానికి కారణాలు తెలుసుకోవాలని భార్యను హింస పెట్టకూడదని అటువంటి వారిని పశువులతో సమానమని చెప్తూ చివరికి తమ బానిసత్వానికి కారణం ఏమిటో తెలుసుకోవాలని కూడా ప్రబోధిస్తారు మాత్రం తెలుసుకోకపోతే వాళ్ళ మనుషులని అనుకోలేమని నిందిస్తారు.

*''బానిసత్వం గురించి బాధ పడని వారు*

*అభివృద్ధి సంకల్పం లేని వారు*

*మానవత్వాన్ని అణగద్రొక్కే వారు*

*వారిని మనుషులని ఎలా అనను?*

*పశు పక్షులు, క్రిమి కీటకాలు,*

*వానరులు నరులు పుట్టుక గిట్టుక సమస్త*

*చరాచరులకు సమానం*

*ఈ మాత్రం జీవిత సత్యం కూడ తెలియని వారు*

*వారిని మనుషులని ఎలా అనను?''*

సావిత్రిబాయిగారి ఈ కవిత ఇంగ్లీష్ అనువాద పాదాలు మరికొన్ని వెబ్సైట్లో విస్తృతంగా ప్రచారంలో ఉన్నాయి.

If you have no knowledge, have no education,

And you yearn not for the same,

You posses intellect but work not on the same,

How then can you be called a human being?

……….

Birds, animals, monkeys, human beings too,

All go through life and death

But if you gain no knowledge about this,

How then can you be called a human being?

ఈ కవిత మాత్రమే కాదు, 'విద్య- అజ్ఞానం', 'చదువుకోసం చైతన్యులు కండి' ' గొప్ప ఆస్తి', మొదలైన పేర్లతో మరికొన్ని కవితల్లో కూడా విద్య ప్రాధాన్యాన్ని చెప్పారు.

**జ్ఞాన మార్గంగా ఆంగ్ల విద్య :**

ఇంగ్లీషు నేర్చుకో' పేరుతో రాసిన కవితలో ఇంగ్లీష్ వలన ప్రపంచ జ్ఞానాన్ని ఎలా అవగాహన చేసుకోవచ్చు వివరించారు.

**''స్వావలంబన ఉద్యోగం, జ్ఞానం కోసం**

**కావాలి ప్రవృత్తి, నిరంతర ప్రయత్నం**

**కష్టించి కూడబెట్టు జ్ఞానధనం**

**విద్య లేని వాడు వింత జంతువు**

**గ్రహించు విద్యను**

**సోమరిబోతులా కూర్చోకు**

**శూద్రులు, అతి శూద్రుల దుఖాన్ని దూరం చేయుట**

**ఇంగ్లీషు విద్యను అభ్యసించుటకు**

**లభించెను విలువైన అవకాశం**

**ఇంగ్లీషు చదివి కుల భేదాల**

**గోడలను కూల గొట్టు**

**భట్ బ్రాహ్మణులు రచించిన కుతంత్రాల**

**శాస్త్ర పురాణాలను పడ గొట్టు''** దీనితో పాటు '***ఇంగ్లీష్ తల్లి***' అనే కవిత కూడా రాశారు. శూద్రులు ఉన్నతని 'ఇంగ్లీష్ తల్లి' ఆకాంక్షిస్తుందని ఫీష్వాల రాజ్యాన్ని ఆ మూర్ఖుల రాజ్యాన్ని నాశనం చేస్తుందనీ, శత్రువులకు నిజమైన జ్ఞానాన్ని కొత్త జీవితాన్ని ఇస్తుందని అందుచేత ఇంగ్లీష్ తల్లిని ఒక మానవత్వానికి ప్రతికగా ఆమె వర్ణించడంలో ప్రపంచ జ్ఞానం పట్ల అనుకున్న అవగాహనను తెలుసుకోవచ్చు.

భారతీయులకు మాత్రమే కాకుండా ప్రపంచదేశాలకు ఆంగ్ల విద్య ద్వారా వచ్చిన శాస్త్రీయమైన అవగాహనను సావిత్రిబాయి పూలే కవిత్వంలో కూడా గమనిస్తాం. ఆంగ్ల విద్యను అభ్యసించండంటూ కొన్ని కవితలను వర్ణించారు.

**భారతీయ సామాజిక నిర్మాణం - సావిత్రిబాయి అవగాహన:**

భారతీయ సామాజిక నిర్మాణం చాతుర్వర్ణ వ్యవస్థ పై ఆధారపడి ఉంది. కేవలం నాలుగు కులాలే కాకుండా కులాల్లో మరల అంతర్వే భాగాలు వాటిలో ఒకదానిపై ఒక కులం ఆధిపత్యాన్ని చలాయించడం దాని వలన ఆర్థిక రాజకీయ సామాజిక రంగాలలో ఒక్కొక్క కులం అణచివేతకు గురవుతూ ఉంటుంది. మను స్మృతి ఆధారంగా ఈ వర్ణ వ్యవస్థ అమల్లోకి రావడం అది పటిష్టంగా వివిధ రాజ్యాలలో అమలు కావడంతో కొన్ని సంవత్సరాలుగా శూద్రులు, అతిశూద్రులు అణచివేతకు గురి కాబడ్డారు. దీన్ని ఆసరా చేసుకుని సావిత్రిబాయి పూలే అనేక కవితలను తన ' కావ్యపూలే'లో వర్ణించారు.

''శూద్రులంటే..?'' నీ కవితలు మూలవాసీ సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. జ్యోతిబాపూలే తన 'గులాంగిరి' గ్రంథంలో కూడా ఈ మూలవాసీ సిద్ధాంతాన్నే చెప్పారు. ఆర్యులు ఇతర దేశాల నుండి ఈ దేశంలోకి వచ్చి ఆధిపత్యాన్ని చెలాయించి, కుల వ్యవస్థకు కారణమై, శూద్రులు, అతి శూద్రులు వంటి కుల విభజన చేశారని, నిజానికి ఈ ఆధిపత్య వర్ణాలు ఈ దేశానికి చెందినవారు కాదని ఆ గ్రంథంలో వివరించారు. అది అవగాహనతో ఈ కవిత మనకు కనిపిస్తుంది.

*''శూద్ర పదం యొక్క/సరైన అర్థం - నేటివ్/ దండెత్తి వచ్చిన విదేశీలు /మనల శూద్రులని ముద్ర వేశారు''*

*''పరాజిత శూద్రులు బానిసలయ్యారు /ఇరానీయులు బ్రాహ్మణులకు మరియు బ్రాహ్మణులు /ఆంగ్లేయులకు అప్పుడయ్యారు ఉగ్ర శూద్రులు''* *"అసలు ఇండియాకు రాజులు/ శూద్రులే/ వారి పేరు నేటీవ్స్"*

*"పరాక్రమ శూరులు మన పూర్వీకులు/ ఆ ప్రతాప వీరుల/ వంశజులం మనం"* అనడం ద్వారా శూద్రులు ఆత్మవిశ్వాసాన్ని ఆత్మ గౌరవాన్ని పాదుకొల్పే ప్రయత్నం చేశారు.

**ముగింపు:**

సావిత్రిబాయి పూలే సమాజం పట్లా, ఈ సమాజంలో భిన్న వైరుధ్యాల పట్లా, వ్యత్యాసాల పట్లా వివిధ సామాజిక అంతస్థుల పట్లా ఒక స్పష్టమైన అవగాహన ,ఒక సామాజిక స్పృహ ఉన్న రచయిత్రిగా ఈ కావ్యపూలే' ద్వారా తెలుస్తోంది. సావిత్రిబాయిపూలే తన కవిత్వానికి ఒక సామాజిక ప్రయోజనం ఉండాలనే బలమైన ఆకాంక్షగా కూడా ఈ కవితా సంపుటిని బట్టి తెలుస్తుంది. ఆమెకున్న సామాజిక అవగాహన, సామాజిక స్పృహ, సామాజిక చైతన్యం , సంఘసంస్కరణల పట్ల ఆమెకున్న నిబద్ధతను, సేవను గుర్తించి పూణే మహిళా విశ్వవిద్యాలయానికి సావిత్రిబాయి పూలే పేరు పెట్టారు. భారత ప్రభుత్వం కూడా 1998లో తపాలా బిళ్లను ప్రత్యేకంగా విడుదల చేసి గౌరవించింది.

**ఆధారాలు:**


- Karl Marx, "Economic Manuscripts: A Contribution to the Critique of Political Economy 1859". www.marxists.org
- సావిత్రిబాయి పూలే కవితలు 'కావ్యపూలు', (2017). తెలుగు అనువాదం. కృష్ణ.వి.హైదరాబాద్ : అన్వేషి రీసెర్చ్ సెంటర్ ఫర్ ఉమెన్ వింగ్.
- కాత్యాయనీ విద్మహే, ' సారంగ అంతర్జాల పత్రిక, సంచిక: 1 నవంబర్ 2018. తొలి ఆధునిక కవయిత్రి సావిత్రి బాయి పూలే – సారంగ (saarangabooks.com)
- సావిత్రిబాయి పూలే - వికీపీడియా (wikipedia.org)
- Few poems by Savitribai Phule | Dr. B. R. Ambedkar's Caravan (drambedkarbooks.com)


********

# 2. గోపాత్రుడు నవల - సామాజిక స్పృహ

**డా. నేమాని శారద**

**తెలుగు అధ్యాపకురాలు,**

**డా.వి.యస్.కృష్ణా ప్రభుత్వ డిగ్రీ కళాశాల,**

**విశాఖపట్నం.**

**వ్యాస సంగ్రహం:**

శ్రీ K.N.Y.పతంజలిగారు రచించిన గొప్పధ్వనిప్రధానమైన నవలిక 'గోపాత్రుడు'. ఇందులోకథ పరిమాణం రీత్యా కథ కన్నా పెద్దది, నవలకన్నా చిన్నది. అందువల్లనే రచయిత దీనిని 'నవలిక'గా ప్రకటించారు. పతంజలి ప్రపంచ సాహిత్యాన్ని లోతుగా విస్తృతంగా అధ్యయనం చేసిన రచయిత. వారి రచనలలో వాస్తవికత గోచరిస్తుంది. అనుకరణలు ఉండవు. తన చుట్టూ ఉన్న సమాజంలో తనకు బాగాతెలిసిన వ్యక్తులజీవితాలనే తనరచనలకు ముడిసరుకుగా రచయిత ఎన్నుకున్నారు. గోపాత్రుడు నవలకు కూడా వాస్తవికత హద్దులు దాటనిదే. లోకంలో అందరికీతెలిసిన ఒకనిజాన్ని, నిజంగా అంగీకరించడంలో కూడా ఆర్థికపరమైన, నైతికపరమైన, కులపరమైన, రాజకీయపరమైన, అధికారం, బలమైనా ఎలా ప్రభావం చూపుతాయో చక్కని వ్యంగ్యభరితమైన శైలిలో రాసిన నవల ఈ గోపాత్రుడు. ఈ నవల ద్వారా రచయిత సామాజికచైతన్యాన్ని, సమాజపు విలువలపట్ల లోతైన అవగాహనను, దానిని పాఠకులకు అందించిన విధానాన్ని వివరించాలని అనుకుంటున్నాను.

**Key Words:**

**గోపాత్రుడు, వీర బొబ్బిలి, జ్ఞాని, పోలీసోడిలాంటి, బల్లపరుపు.**

**ఉపోద్ఘాతం:**

సంఘానికి చైతన్యం తప్పనిసరి. సమాజ పరిణామంలో సాహిత్యం కూడా ప్రధానపాత్ర పోషిస్తుంది. మానవజీవితాలను శాసించే శక్తులను అర్థం చేసుకుంటూ, వాటివలన కలిగే మార్పులను ఊహిస్తూ సాహిత్యం సృష్టించబడుతుంది. సమాజంలో ఒకడైన రచయిత సమాజం నుండే ప్రేరణ పొందుతూ రచనలు చేస్తాడు. జీవితంలో ఎదురయ్యే సమస్యలను రచనలలో విశ్లేషిస్తాడు, తర్కిస్తాడు, పరిష్కారాలను చూపుతాడు, ఈరచనలను చదివిన సహృదయుడైన పాఠకుడు లోపాలను దిద్దుకుంటూ ఉత్తమసమాజనిర్మాణదిశగా తన ప్రయాణాన్ని మలుచుకుంటాడు. రచయిత యొక్క రచన, రచయిత యొక్క స్వీయ దృక్పథాన్ని, భావనలనే గాక సామాజికమనస్తత్వాన్ని కూడా ప్రతిబింబిస్తుంది. కాబట్టి సాహిత్యం సామాజిక స్పృహ కలిగి ఉండాలనేది నిర్వివాదాంశం.

సాహిత్యం అంటే మానవుడిని గూర్చిన అధ్యయనమే అంటాడు మాక్సిం గోర్కి.

**-గోర్కి అనువాదం సి. ప్రసాద్, 'వసుధ' మే 1971**

శ్రీ K.N.Y. పతంజలిగారు రచించిన 'గోపాత్రుడు' నవలిక గొప్ప సామాజికస్పృహ కలిగిన రచయిత కలం నుండి జాలువారిన ధ్వన్యాత్మక గ్రంథం. ఈ నవలికలో వ్యంగ్యం అవధులు దాటింది. దీనిని తెలుగు సాహిత్యంలో ఒక ఉత్తమ నవలగా చెప్పవచ్చు. ఈ నవలికలో కథ భూమి గుండ్రంగా వుందా? బల్లపరుపుగా వుందా? అనే విషయంపై ఒకఊరిలో ప్రజలమధ్య జరిగిన చర్చ. చివరికి ఏమైంది? లోకంలో అందరికీ తెలిసిన ఒక సత్యాన్ని నిరూపించడంలో బంధుత్వాలు, ఆర్థికపరమైన సంబంధాలు, కులాలు, రాజకీయాలు, అధికారం, బలంవంటివి ఎటువంటి పాత్ర పోషించాయో రచయిత అత్యంత వ్యంగ్యంగా చెప్పిన తీరు అద్భుతం. ఒక

నిజాన్ని నిర్భయంగా ప్రకటించడంలో ఎన్ని స్వార్థాలు మనుషులపై ప్రభావం చూపుతాయో ఈ నవలికలో వివరించారు రచయిత. మన వ్యవస్థలోని లోపాలను కళ్ళకు కట్టినట్లు వివరించారు.

**రచయిత పరిచయం:**

కాకర్లపూడి నరసింగ యోగ పతంజలి K.N.Y.పతంజలిగా సుప్రసిద్ధులు. వీరు 1952 మార్చ్ 29న విజయనగరం జిల్లా అలమండ గ్రామంలో జన్మించారు. 2009 మార్చ్ 19న విశాఖపట్నంలో మరణించారు. వీరు వృత్తిరీత్యా విలేఖరి, సంపాదకుడు, ప్రవృత్తిరీత్యా రచయితగా వాసికెక్కారు. పతంజలి తండ్రిగారు గోపాలరాజుగారు వైద్యులు, గొప్ప సాహిత్యాభిలాషులు. పతాంజలిగారికి ఈసాహిత్యాభిలాష తండ్రినుండి అబ్బినదే. విజయనగరంలో డిగ్రీ చేసి, 1975లో ఈనాడు పత్రిక సబ్ఎడిటర్ గా చేరారు.

**రచనలు:**

ఖాకీవనం, పెంపుడు జంతువులు, వేట కథలు, రాజుగారు (నవల), వీర బొబ్బిలి.

**పురస్కారాలు:**

రావిశాస్త్రి రచనా పురస్కారం, చాసో స్ఫూర్తి పురస్కారం, కృష్ణవంశీ సింధూరం సినిమాకు ఉత్తమ మాటల రచయితగా బంగారు నంది.

**కథాసారాంశం:**

ఇందులో కథానాయకుడనదగ్గ గోపాత్రుడు ఒకనాటి ఉదయం ఊరి రచ్చబండ దగ్గర కూచుని భూమి బల్లపరుపుగా ఉందని అంటాడు. ఊరంతా వచ్చి భూమి గుండ్రంగా ఉందని చెప్పినా వినడు. తనకి ఈ విషయం తన తండ్రి చెప్పాడని, తిరిగి స్వయంగా తండ్రి వచ్చి చెప్తే తప్ప తాను ఈ విషయం అంగీకరించనని చెప్తాడు. అయితే గోపాత్రుడు తండ్రి చనిపోయి అప్పటికి ఎనిమిది సంవత్సరాలు అయింది.

రంగరాజు మాస్టారు ఆఊరి ఉపాధ్యాయుడు. అతడుకూడా భూమిగుండ్రంగా ఉందనే వాదించి గోపాత్రుని ఒప్పించలేక ఇంటికి వస్తాడు. ఇంటికి వచ్చాక బాగా ఆలోచిస్తాడు. అతనికి గోపాత్రునిపై జాలివేస్తుంది. గోపాత్రునికి వ్యతిరేకంగా ఉన్నవాడు చింతలపాటి చిన్నవాడు జ్ఞాని, కానీ అహంఎక్కువ. మాస్టారిని ఏమాత్రం గౌరవించడు. కానీ గోపాత్రుడు అజ్ఞాని, కానీ శీలం గుణసంపదలు ఉన్నవాడు. తనకి డబ్బులు తీసుకోకుండా మందులిస్తాడు. అందువల్ల గుణశీలాలు ఉన్న అజ్ఞాని గోపాత్రునికే ఓటు వేయాలనుకుంటాడు.

రంగరాజు మాస్టారు గోపాత్రునితో

“............ అభిప్రాయాలు కలిగి వుండడం ఎంత ముఖ్యమో వాటిని ఎదుటి మనిషికి తెలియకుండా కప్పెట్టి ఉంచడం అంతే ముఖ్యం. జీవితానుభవం మీద చెప్తున్నాను, లోకంతో ఎన్నడూ ఏకీభవించకు. కానీ ఆ సంగతి లోకానికి తెలీయనివ్వకు.

-‘గోపాత్రుడు’ పే. నెం. 40

ఫకీర్రాజు ఆఊరి పెద్దమనిషి. అతనికి గోపాత్రునిపై అభిమానం ఉంది. కానీ ప్రస్తుతం అతనికి పెదనాయుడుతో వ్యవహారం ఉంది కాబట్టి భూమిగుండ్రంగా ఉందనే వాదిస్తాడు. అయితే గోపాత్రునికి సహాయం చేయాలనుకుని రొంగలి అమ్మన్నను పిలిచి భూమి బల్లపరుపుగా ఉందని చెప్పమని, లేదంటే తన దగ్గర తీసుకున్న 25 రూపాయలు అప్పు నిలుచున్న పళంగా కట్టమని చెప్తాడు. 25 రూపాయల బాకీ తీరుతుంది కాబట్టి రొంగలి అమ్మన్న భూమిబల్లపరుపుగా ఉందని ఒప్పుకుంటాడు. అయితే కొంత సమయానికి డబ్బు కన్నా కులం గొప్పదని భావించి తమ వెలమకులపు పెద్ద ముత్యాలనాయుడు దగ్గరికి వెళ్లి ఈఊరిలో వెలమలందరూ, రాజుల మాట వినాలంటున్నారని చెప్పి తగాదా పెంచుతాడు.

విషయం తెలిసిన ఫకీర్రాజు వెలమలందరూ భూమిగుండ్రంగా ఉందంటే, మా రాజులందరూ ఇంకో మాట మీద ఉండాలిగా అని పెదరాజుని ఎగదోస్తాడు.

ఐదవ తరగతి వరకు చదివిన పెదరాజుకు భూమిగుండ్రంగా ఉంటుందని తెలుసు. కానీ ఊర్లో వెలమలకీ, రాజులకీ పేచీ కాబట్టి భూమి బల్లపరుపుగా ఉందని వాదిస్తాడు. ఊర్లో మంగళ్ళు, చాకళ్ళు, కంసాళ్ళు, మాదిగలు అందరూ రాజులు వైపు చేరుతారు.

అయితే వెలమలలోనే కొన్ని ఇంటి పేర్లు కలవారు మాత్ర ఊరి రాజకీయాలను శాసిస్తున్నారనే నెపంతో రెండుగ్రూపులుగా చీలిపోతారు. రొంగలిబుజ్జి రెండవగ్రూపుకు నాయకత్వం వహించి తర్వాత వచ్చే ఎలక్షన్లలో తనను ప్రెసిడెంటుగా చేస్తామని రాజుల దగ్గర మాట తీసుకొని వారి గ్రూపులో చేరిపోతాడు.

ఊరులోని మాలల తరపున సోములు కూడా హరిజనులకు ఒక్కోఇల్లు కట్టించి యిస్తారనే మాట తీసుకుని రాజుల పక్షం చేరిపోతాడు.

ఊరిలో మూడే కుటుంబాలున్న కోమట్లు ఏ ఒకరి పక్షాన చేరినా తమ వ్యాపారినికే దెబ్బ అని ఏ గ్రూపులో చేరమంటారు.

ముత్యాల నాయుడుతో పాటు ఉన్న కొందరు వెలమలు, రాజులంటే గిట్టని ఇతర కులాలలోని కొన్ని కుటుంబాలు భూమి గుండ్రంగా వుందనే గ్రూపులో ఉంటాయి. ఊరిలోని చిన్న వృత్తుల వారందరూ వీరికి తమ సహాయాలను అందివ్వడం మానేస్తారు. ఈవెలిని భరించలేని వెలమలు, రాజులని యుద్ధానికి పిలుస్తారు. ఒక మంచిరోజున అలమంద ఊరి బయట అందరూ కొట్టుకొని ఎవరు గెలిస్తే వారి మాటనుబట్టి భూమిఆకారాన్ని నిర్ణయించాలనే ఒప్పందానికి వస్తారు.

అసలు రోజు అందరూ ఆయుధాలతో వచ్చి, ఈ పక్షం, ఆ పక్షం అనుకోకుండా ఎవరిపై తమకు వ్యక్తిగత కక్షలుంటే వారిపై పగ తీర్చుకోవాలని అనుకుంటారు. వీరు కొట్టుకుంటుండగా పోలీసులువచ్చి అందర్నీ అరెస్టుచేసి లాఠీలతో గట్టిగా వడ్డిస్తారు. S.I. వచ్చి అందరిని కూర్చోబెట్టి భూమిగుండ్రంగా కానీ, బల్లపరుపుగా గానీలేదని, అది పోలీసోడిలాఠీలా ఉంటుందని, అర్థం కాకపోతే మరొక్కమారు వివరంగా చెప్తానని చెప్పి వారిని మెజిస్ట్రేట్ ముందర హాజరు పరుస్తాడు.

మెజిస్ట్రేట్ కేస్ పూర్వాపరాలను బాగా పరిశీలించి ఈ క్రింది **తీర్పు**నిస్తాడు.

**"మన జ్ఞానానికి సార్ధకత లేదు. మనవిశ్వాసాలమీద మనకు విశ్వాసం లేదు. మన విలువల మీద మనకు గౌరవం లేదు...... తోటివాళ్లమీద మమకారంలేదు... మన జ్ఞానానికి, విశ్వాసానికి పొంతన లేదు, విశ్వాసానికి, ఆచరణకు పొందిక లేదు. భూమి బల్లపరుపుగా ఉన్నప్పుడు మాత్రమే ఇలాంటిజీవితం కళ్ళబడుతుంది. మన భూమి బల్లపరుపుగా ఉన్నది గనుకనే మన సమాజం ఇలా ఉంది.........."** అని తీర్పు ముగిస్తాడు.

**-గోపాత్రుడు పేజీ- 81**

**పాత్రచిత్రణ:**

ఈ నవలిక నవలంత పరిణామం కలిగినది కాదు. ఒక పెద్ద కథలాంటిది. అందువల్ల సంఘటనా ప్రాధాన్యమేగానీ పాత్ర చిత్రణలకు అవకాశం తక్కువ. అయితే ఈ నవలికలో ఒక ప్రత్యేక పాత్రను గురించి ప్రత్యేకంగా పేర్కొని తీరాలి. అది వీరబొబ్బిలి. ఇది ఒక మాటలు నేర్చిన కుక్క. గొప్ప జ్ఞాని.

నువ్వు కుక్కవి, నోరు పారేసుకోవద్దని రొంగలిఅమ్మన్నతో వీరబొబ్బిలి **"నీకూ నాకూ సాపత్యమేమిటోయ్? చదివిందంతా నిజమని నమ్మే మీరెక్కడ? విన్నదంతా నిజంకాదని ఎరిగిన నేనెక్కడ? ఎదుటివారి విశ్వాసాల్ని సహించలేని నువ్వెక్కడ? నిన్ను కూడా అర్థం చేసుకొని, నీ హక్కుని కూడా గౌరవించగలిగిన నేనెక్కడ?"** అంటుంది.

**-గోపాత్రుడు పేజీ - 19**

నిజానికి భూమి గేదెకొమ్ములా ఉంటుందని తెలిసిన జ్ఞాని వీరబొబ్బిలి. అయితే ఆ విషయం బొబ్బిలి ఎవరికి చెప్పదు. ఎందుకంటే జ్ఞానం అమూల్యమైనది. దానిని ప్రదర్శించకూడదు.

**"జ్ఞానియైనవాడు కొండలాగా తొణకదు, మూర్ఖులతో వాదించదు. భోజనం పెట్టే వాడితో అసలు వాదించదు..."**

**-గోపాత్రుడు పేజీ-51**

అనే పరమ సత్యం తెలిసిన మహామేధావి వీర బొబ్బిలి.

**"రైతులు, రాజులు అలమందసంతలో కొట్టుకుంటారన్నప్పుడు వీరబొబ్బిలి- ఫకీర్రాజుతో...... గెలిచిన వాడి విశ్వాసాన్ని ఓడిపోయిన వాడి నెత్తికేసి రుద్దవచ్చున్నమాట..."**

**-గోపాత్రుడు పేజి- 70**

అంటూ బలవంతునిదే తుది నిర్ణయం అది తప్పైనా, ఒప్పైనా ఇది ఎంతవరకూ సమంజసమనే ప్రశ్నను వీరబొబ్బిలి ద్వారా పలికిస్తాడు రచయిత.

**ముగింపు:**

ఈనవలికలో రచయితపతంజలిగారి వ్యంగ్య వైభవం పతాకస్థాయినిచేరింది. సమాజంలో సత్యనిరూపణ అనేది ఎంత బ్రహ్మ పదార్థమో ఈ నవలిక ద్వారా స్పష్టం చేశారు. రచయిత మనసమాజంలోని లోపాలను, లోటుపాట్లను, వ్యక్తుల అవకాశవాదాన్ని, అత్యాశను, అధికారమదాన్ని పరితల కళ్ళకు కట్టించారు.

సునిశితమైన చక్కటిహాస్యం, ప్రారంభం నుండి చివరి వరకు ఆపకుండా చదివించే శైలి, సంభాషణా చాతుర్యం, పాత్రోచిత భాషా ప్రయోగం ఈ నవలికకు మరింత వన్నె తెచ్చే అంశాలు. సహృదయ పాఠకుడిని ఆలోచనలో పడవేసే ఉత్తమనవల పతంజలిగారి గోపాత్రుడు.

**"గోపాత్రుడులాంటి చీమూ-నెత్తురూ, సిగ్గూ-లజ్జా ఉన్న తెలుగుకథ నేను రాయలేకపోయినందుకు సిగ్గుపడుతున్నాను. మిత్రుడు పతంజలి దీనిని ఎంతో చాకచక్యంగా రాసినందుకు ఎంతో ఆనందిస్తున్నాను."**

**-పురాణం సుబ్రహ్మణ్య శర్మ, గోపాత్రుడు - ముందుమాట**

సమాజప్రక్షాళనకు అవసరమైన ఇలాంటి మంచిసాహిత్యం తెలుగులో మరింతగా రావాలని ఆకాంక్షిస్తున్నాను.

**ఉపయుక్త గ్రంథ సూచి:**


- గోపాత్రుడు- K.N.Y. పతంజలి, new student book centre, Vijayawada-2
- KNY పతంజలి - వికీపీడియా- అంతర్జాలం
- సాహిత్య శిల్ప సమీక్ష- పింగళి లక్ష్మీకాంతం - నవ చేతన పబ్లికేషన్స్ 2015/115
- తెలుగు జానపద విజ్ఞానం, సమాజం, సంస్కృతి(2000), పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
- తెలుగు నవలల్లో సామాజిక చైతన్యం- డా.పి. సంజీవమ్మ, అభ్యుదయ రచయితల సంఘం, కడప, 1985.


*********

# 3. పరిపాలనా వ్యవస్థలో తెలుగు వినియోగం

**డా. కె. సరళ**

తెలుగు శాఖాధ్యక్షులు

శ్రీ దుర్గా మల్లేశ్వర సిద్ధార్థ మహిళా కళాశాల

విజయవాడ - 10.

9848316383

తెలుగు మన మాతృభాష. తేనెలోని తియ్యదనం కలగలిసి ఎంతో మాధుర్యంతో లక్షణమైన భావ ఉచ్చారణ కలిగిన గొప్పది మన తెలుగు భాష. '**దేశ భాషలందు తెలుగు లెస్స**' అని **శ్రీ కృష్ణ దేవరాయులు** అన్న మాట లోకం అంతా విస్తరించింది. తెలుగు ప్రపంచం మొత్తంలో మధురమైన భాష.

తెలుగు భారత దేశం యొక్క దక్షిణం వైపు ద్రవిడ భాగంలో జన్మించింది. తెలుగుకి ఆంధ్రం, తెనుగు, తెలుంగు అనేవి పర్యాయపదాలు. తెలుగు అనే పదం త్రిళింగ అనే సంస్కృత పదం నుండి ఆవిర్భించింది.

క్రీ.శ 1వ శతాబ్దం నుంచి తెలుగు ప్రచారంలో ఉంది. 1వ శతాబ్దానికి చెందిన శాతవాహన రాజైన హలుని గాథా సప్తశతిలో తెలుగు పదాలున్నాయి. క్రీ.శ 200 కాలం నుంచి తెలుగు భాష మరింత గుర్తింపు పొందింది. ఇలా 300 పెరిగే కొద్దీ తెలుగు భాష **సాహిత్యంలోనూ, శతకాలలోనూ, పద్యాలలోనూ** అభివృద్ధి చెందింది.

అధికంగా మాట్లాడే భాషల్లో భారతదేశంలో 3వ స్థానం, అంతర్జాతీయంగా 15వ స్థానాన్ని మన తెలుగు భాష దక్కించుకుంది. తెలుగు భాషని మాట్లాడేవారు మన భారతదేశంలో 750 లక్షలు, ప్రపంచ వ్యాప్తంగా 960 లక్షల మంది ఉన్నారు.

తెలుగు భాష గొప్పతనాన్ని **ఆది కవి నన్నయ్య, వేమన, త్యాగరాజు, అన్నమయ్య, గురజాడ అప్పారావు, కుదుకూరి వీరేశ లింగం, టంగుటూరి ప్రకాశం పంతులు** ఇలా ఎంతో మంది ప్రాచీన కాలం నుంచి ఆధునిక కాలం వరకు వివరిస్తూనే ఉన్నారు. పర భాష వారిలో కూడా ఒక తమిళ మహా కవి సుబ్రహ్మణ్య భారతి గారు '**సుందర తెలుంగు**' అని మన తెలుగుని మెచ్చుకున్నారు. మరియు ఒక ఇటలీ తత్వవేత్త తెలుగును '**ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్**' అని పిలిచారు.

**తెలుగు భాష ప్రాముఖ్యతలు ఎన్నో, వాటిలో కొన్ని:**

- తెలుగు అక్షరాలు:

తెలుగు వర్ణమాలలో 52 అక్షరాలు ఉన్నాయి వాటిలో 16 అచ్చులు, 32 హల్లులు ఉన్నాయి. వీటి ఉచ్చారణకి ప్రాముఖ్యత ఉంది.

క, ఖ, గ, ఘ → వీటిని ఉచ్చారించేటప్పుడు మన పొట్ట కండరాలు కదులుతాయి.

చ, ఛ, జ, ఝ → ఆ వీటిని ఉచ్చారించేటప్పుడు ఛాతి భాగం కదులుతుంది.

ట, ఠ, డ, ఢ → వీటిని ఉచ్చారించేటప్పుడు స్వర పేటిక కదులుతుంది.

త, థ, ద, ధ → వీటిని ఉచ్చారించేటప్పుడు నాలుక మరియు క్రింది దవడ కదులుతుంది.

ప, ఫ, బ, భ → వీటిని ఉచ్చారించేటప్పుడు పెదాలు కదులుతాయి.

య, ర, ల, వ → వీటిని ఉచ్చారించేటప్పుడు ముఖము మరియు దవడ కండరాలు కదులుతాయి.

→మన శరీరంలో ముఖ్యమైన కండరాలన్నీ కేవలం ఉచ్చారణకే ఉండడం అనే విషయం మన తెలుగు భాషలోనే చూడగలం.

- తెలుగు లిపి:

ప్రపంచ వ్యాప్తంగా అంతర్జాతీయ భాషాలిపి నార్వాహణక ప్రకారం అందమైన లిపిలో మన తెలుగు భాష 2వ స్థానం.ని పొందింది. ఉచ్చారణలోనే కాదు, వ్రాసేటప్పుడు కూడా ప్రయోజనాలున్నాయి. తెలుగు అక్షరాలను వ్రాసేటప్పుడు గుండ్రంగా తిప్పటం వల్ల మన చేతి కండరాలు చిన్నప్పటి లేదా చిన్న వయసు నుంచే గట్టి బడతాయి, అలాగే తెలుగు భాష అక్షరాలను సాధనగా వ్రాస్తుంటే పర భాష అక్షరాలను వ్రాసేటప్పుడు మరియు చిత్రాలు చేపేటప్పుడు సులువుగా అనిపిస్తాయి.

**ప్రకృతి నుంచి పదాలు:**

మనిషికి ప్రకృతి సంబంధం ఉంది. అలాగే ప్రకృతికి మనిషి మాట్లాడే భాషకి కూడా సంబంధం ఉంది. మనిషికీ తన భావ ప్రకటన కోసం ప్రకృతిని సహజంగా ఉపయోగించుకుంటాడు.

ఉదాహరణకి - నత్త నడక, వేపకాయంత వెర్రి, చిలక పలుకులు మొదలగునవి. ఈ ఇలాంటి పదాలు మన తెలుగు భాషలో గమనిస్తాము . వీటి వల్ల మన ప్రకృతి అలవాట్లు మరియు మనిషి పోలికలు అర్థం అవుతాయి.

- **తెలుగు సామెతలు**

ప్రపంచ భాషలు అన్నిటిలోనూ ఒక్క తెలుగు భాషలోనే అత్యధిక సామెతలున్నాయి. మన తెలుగు భాషలో ఉండే **పద్యాలు, నీతి వాక్యాలు, శతకాలు, సామెతలు** చిన్న వయసు నుండి నేర్చుకోవడం వల్ల మనిషి యొక్క వ్యక్తిత్వ వికాశం పెరుగుతుంది.

- **తెలుగు మహనీయులు**

భారత దేశపు కీర్తి, గౌరవం అన్ని మన జాతి జెండాలోనే ఉన్నాయి. అలాంటి జెండాను రూపొందించింది మన తెలుగు భాషకు చెందిన మహానేత పింగళి వెంకయ్య గారు. అలాంటి ఆయన పుట్టినట్టువంటి రాష్ట్ర భాషను దేశం అంతా తెలుసుకోవలసిన అవసరం ఉంది.

తెలుగు భాషకు చెందిన స్వాతంత్ర సమరయోధులలో రాణీ రుద్రమ్మదేవి, అల్లూరి సీతారామ రాజు మరియు సంగ సంస్కర్తలలో గురజాడ అప్పారావు, గుఱ్ఱం జాషువా మొదలగునంటి వారు మన రాష్ట్రానికి మరియు దేశం యొక్క సమాజానికి ఎంతో మేలు చేసారు. వారు చేసిన ధైర్య సాహసాలకు మన భాషే ప్రతీక.

ఇలా తెలుగు భాష గొప్పతనాలు వర్ణనాతీతం, కానీ అలాంటి అమ్మలాంటి భాష ఇప్పటి కాలం వారు మర్చిపోతున్నారు. ఎన్ని ప్రదేశాలు విహరించినా చివరికి ఇంటికి చేరుకోవాలి అన్నట్టు. ఎన్ని పర భాషలు నేర్చుకున్నా చివరికి మన తెలుగు భాషే మనికి మూలం. తెలుగు వారిగా పుట్టినందుకు గర్విద్దాం, తెలుగు భాష మాట్లాడదాం.

********

# 4. సంపద సృష్టిలో తెలుగు

**డా. ఐ. మంజుల**

తెలుగు అధ్యాపకులు

శ్రీ దుర్గామల్లేశ్వర సిద్ధార్థ మహిళా కళాశాల

విజయ వాడ -10.

9440328 638

మనిషి తన భావోద్వేలను, భావాలను వ్యక్తపరచడానికి తే ఎన్నో భారులను కనిపెట్టారు. ఆ అనేక భాషలో దక్షిణ భారతీయ ప్రాంతంలో ఉండే మనుషుల హృదయాల్లో ఉండే భారు "తెలుగు భాష" తెలుగు భాష వినడానికి హాయిగా, పలకడానికి మధురంగా, చూడటానికి సౌందర్యంగా ఉంటుంది.

క్రీ.పూ 400 సంవత్సరాల పూర్వం నుండి తెలుగు వాడుకలో ఉంది అని శాస్త్రవేత్తలు అంచనా వేశారు. తెలుగు తన ప్రాచీనత వల్లే కాకుండా ఎంతో అందమైన, మా ప్రత్యేకమైన లిపి కలిగియుండి వెండితెలుగు వ్యాకరణం వలన కూడా ఎంతో ప్రసిద్ధి చెందింది ప్రపంచ వ్యాప్తంగా అత్యంత అందమైన లిపి కలిగి ఉన్న భాషల్లో తెలుగు 2వ స్థానాన్ని అందుకుంది.

**తెలుగు వల్ల అనుకూలాలు, ఆవశ్యకతలు :**

మనిషికి ఉండే గాఢ భావోద్వేగాలు, సంక్లిష్టమైన భావాలు, ఆలోచనలు వ్యక్తపరచడానికి తెలుగు ఒక సజావుగా, సామర్థ్యంగా ఉన్న భాష. మనిషి శరీరంలో ఉండే 72 వేల నాడులు తెలుగు మాటలు పలుకుతున్న- -ప్పుడు ఉత్తేజమువుతాయి. అన్ని భాషలకన్నా తెలుగు భాష ఈ విధంగా మానవ శరీరానికి సహాయం చేస్తుంది.

ఆంధ్ర ప్రదేశ్ మరియు తెలంగాణలో నివసించేవారి సాంప్రదాయం, తెలుగు సాంప్రదాయం తెలుగు వాడుకలో ఉండటం వలన భవిష్యత్తరాలకు మన సాంప్రదాయాలు, ఆచారాలు అందుతాయి. తెలుగు పాటలు, సాహిత్య రచనలు, సంగీతాలు, కావ్యాలు, పూరాణాలు అయిన రామాయణ, మహాభారతాలు తెలుగులో వినడం వల్ల తెలుగు ప్రజలలో ఒక కొత్త ఉద్వేగాలు ప్రజలలో నిలుస్తుంది.

తెలుగు ప్రజల అస్థిత్వానికి తెలుగు భాష ప్రతీక, తెలుగులో మాట్లాడటం ద్వారా మన ఉనికి ఎప్పటికి 'ఇక్కడే ఉంటుంది ప్ర పత్రికారంగంలోనూ, సినిమారంగంలోనూ. సాంస్కృతిక సంరక్షణ ఇటువంటి క్షేత్రాలతో తెలుగు వారికి ఎన్నో అవకాశాలు సులభంగా లభిస్తాయి.

తెలుగు భాషని వృత్తిగా చేసుకుని ఎందరో మహానుభావులు ఉపాధి కల్పించుకున్నారు. తెలుగు వారి ప్రత్యేక కళలైన " **బుర్రకథలు, హరికథలు**", మన తెలుగులో మన పూరాణాలన్ని కళ్ళకు కట్టినట్లు వివరిస్తారు. దాని ద్వారా సంపాదించుకుంటున్నారు.

**తెలుగు పై సాహిత్యకారుల విశ్లేషణ :-**

శ్రీ శ్రీ శ్రీ విజయనగర సామ్రాజ్య మహారాజు శ్రీ కృష్ణదేవరాయులు తన పుస్తకం అయిన ఆముక్తమాల్యద రచనలో తెలుగు గురించి ఈ విధంగా వర్ణించారు.

**" దేశ భాషలందు తెలుగు లెస్స "**

అనగా దేశంలో అన్ని భాషలకన్నా తెలుగు గొప్పది. అంతే కాక ఆయన తన ఆస్థాన భాషగా తెలుగుని ప్రకటించారు.

తెలుగులో ప్రతీ పదం చివర అచ్చుల శబ్దంతో ముగుస్తుంది. ఇటాలియన్ భాష కూడా ఈ విధంగానే ఉంటుంది అందుకే 14 వ శతాబ్దానికి చెందిన '**నికోలా డి' అనే ఐటాలీ**' దేశస్తుడు, తెలుగుని '**ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్**' అని సంభోదించారు.

అంతేకాక **డా. రాబర్ట్** అనే ప్రముఖ రచనకర్త తన పుస్తకము అయిన ' **ది మ్యాన్ హు న్యూ ఇన్ఫినిటీ** ' లో తెలుగు అంత సుందరమైన భాష మరొకటి లేదు అని లిఖించారు.

కర్ణాటక సంగీతంలో శ్రేష్ఠులైన త్యాగరాజులు, ముత్తుస్వామి, శ్రీ శాస్త్రి, అన్నమయ్య వీరందురూ వారి | స్వరకల్పనలు, సంగీత కచేరీలు తెలుగు లోనే అత్యధికంగా చేశారు.

తమిళనాడు రాజు అయిన ' **రాజ రాజ నరేంద్రుడు** • తెలుగు పై ఉన్న అభిమానంతో తన ఆస్థాన పండితుడు అయిన నన్నయను తెలుగులో మహాభారతమును అనువాదించమని కోరారు దా. ఆయన సంకల్పం వల్లనే మనకు 'శ్రీ' మద్రాంధ్ర మహాభారతం' మనకి అందినది.

<u>**తెలుగు సాహిత్యం మరియు వ్యాకరణం :**</u>

పూర్వకాలంలో వేమన శతకం, సుమతేశతకం, దాశరథి శతకం వల్ల, ఆ మహానుభావులు మనకు అందించడం వలన మన పిల్లలకు మనం నీతులు చెబుతున్నాము. ఆధునిక కాలంలో జరిగే సమస్యలకు సాహిత్యంతో వ్యక్తిగత సమాధానాలు అందించి ప్రజలలో చైతన్యం నింపారు ఎందరో మహానుభావులు. వారిలో శ్రీశ్రీ, సినారె, దేవులపల్లి కృష్ణశాస్త్రి, సత్యనారాయణ ఇలాంటి వారు ఉండడం వల్లే తెలుగు ఇప్పటికి గొప్ప భాషగా నిలచించింది ప్రజలలో చైతన్యం నింపేలా శ్రీశ్రీ రాసిన " మహాప్రస్థానం" గురించి ప్రత్యేకంగా మాట్లాడాలి ఉదాహరణకు

**పతితులారా, భ్రష్టులారా,**

**బాధాసర్ప ద్రష్టులారా,**

**ఏడవకండి ఏడవకండి**

**వస్తున్నాయి, వస్తున్నాయి,**

**జగన్నాథ రథచక్రాలొస్తున్నాయి.**

ఈ విధంగా వీరు తెలుగు సాహిత్యకారుల. గానే కాకుండా సంఘ సంస్కర్తలుగా వారి సహాయం వారు చేశారు, ఎంతో ప్రజలకు జ్ఞానం, ప్రసాదించారు.

<u>**తెలుగు పద్యాల విశిష్ఠత :**</u>

14 వ శతాబ్దానికి చెందిన **దేవజ్ఞన సూర్యులు** తన రచన అయినటువంటి ' **రామకృష్ణ విలోమ**' లో విచిత్రమైన, ప్రత్యేకమైన అంశాన్ని రచించారు . విటునుండి చదివినా ఒకే భావం, ఒకే శబ్దంలా ఉండే పదాలను వాడటాన్ని '**పత్రికాపదకోశం**' అని అంటారు ఉదాహరణకు కిటికి, కచిక, ముఖ్యము మొదలైనవి. ఇలాంటి పదాలతో ఆయన ' **రామకృష్ణ విలోమ** ' అనే రచనలో 40 శ్లోకాలు లిఖించారు. ఆ శ్లోకాల ప్రత్యేకత ఏమనగా ఆ పద్యాలను ముందునుండి చదివితే **మహాభారతం** చివరి నుండి చదివితే **రామాయణం** భావం వచ్చేలా రచించారు. ఉదాహరణ

**"శ్రీయాదవం భవ్యలతోమ దేవం**

**సంహారదాముక్తి ముతా సుభూతాం|| "**

అనగా, శ్రీ యాదవం అనగా శ్రీ కృష్ణుడు, తను చెప్పినటువంటి గీతలో వివరించినట్టు, ధర్మం దుర్మార్గాన్ని ఎల్లప్పుడు సంహరిస్తుంది అని భావము. **భారతాన్ని** వివరిస్తుంది. ఇప్పుడు అదే పద్యం చివరి నుండి

**"తాంభుసుతా ముక్తి ముదారహసం**

**వందే యతో లవ్య భవం దయా శ్రీ ||"**

అనగా తామర పువ్వుల వలె వికసించే అందమైన నవ్వు కలిగిన శ్రీ సీతామహాలక్ష్మి నేను నమస్కరిస్తున్నాను. ఈ పద్య భావం రామయణంలోని ఒక అంశాన్ని వర్ణిస్తుంది.

ఈ విధంగా రెండు అర్థాలు కలిగిన ఒకే పద్యాన్ని వేరే భాషల్లో దొరకడం చాలా కష్టమైన పని .

తెలుగు వ్యాకరణాన్ని '**శ్రీనాథుడు**' ప్రారంభించారు, ' **పరవస్తు చిన్నయసూరి గారు** ' ఇంకా అభివృద్ధి చేశారు. తెలుగు పద్యాలను చంధస్సు ద్వారా రచిస్తారు. వాటిలో **ఉత్పలమాల, చంపకమాల, మత్తేభం, శార్దులం** 4 ప్రత్యేకంగా లిఖిస్తారు రచనకారులు.

తెలుగు భాషా వ్యాకరణంలో సంధులు, సమాసాలు, విభక్తులు, సామెతలు ఇలా అనేక అంశాలతో తెలుగుని అలంకరిస్తారు రచనకారులు అందుకే తెలుగు వ్యాకరణాన్ని వెండివ్యాకరణం అని కూడా అంటారు.

**ఉపసంహారం :**

తెలుగు పదం **త్రిలింగము** అనే పదం నుండి ఆవిర్భవించింది. త్రిలింగము అనగా మూడు శివ క్షేత్రాలు కాళేశ్వరము, శ్రీశైలము, భీమేశ్వరము. తెలుగు ఎంతో పురాతనమైన మరియు ప్రత్యేకమైన భాష లిఖిత పూర్వకంగా ఉన్న తెలుగు శాసనాలు అయిన ' **నాగబు**' మొదలైనవి ఇప్పటికీ ఉన్నాయి.

మాతృభాష మాట్లాడటానికే కాకుండా వ్యక్తిగత వికాసానికి చాలా సహాయం చేస్తుంది అమ్మదనం లొ కమ్మదనం తెలుగు లో ఉంది ఒక మనిషి భావాలను వ్యక్తపరచదానికి ఇంత సామర్థ్యంగా ఉన్న తెలుగు వారసత్వాన్ని ఆదరిద్దాము.

"మన భాషా, మన కీర్తి, మన గుర్తింపు"

ధర్మో రక్షతి రక్షితః

********

# 5. వేము రాములు బాలగేయ సంపుటి "విరులు" - నైతిక విలువలు

**డా. శీలం ఇందిర**

తెలుగు ఉపన్యాసకురాలు,

ప్రభుత్వ డిగ్రీ కళాశాల,

మధిర, ఖమ్మంజిల్లా.

చరవాణి – 9553359879

Mail - seelamindira1981@gmail.com

**కీలక పదాలు**: వేము రాములు - విరులు - బాలగేయ సాహిత్యం - అక్షరం - స్నేహం - మాతృభాష గొప్పతనం - దేశభక్తి - క్రమశిక్షణ - నైతిక విలువలు.

**వ్యాస సంగ్రహం :**

శ్రీ వేము రాములు గారు 1974 లో ఖమ్మం జిల్లా మధిర మండలం నిదానపురం గ్రామం నందు జన్మించారు. వృత్తిరీత్యా ఈయన తెలుగు ఉపాధ్యాయులు, ప్రవృత్తి రచనలు చేయటం. గత ఐదు సంవత్సరాల నుంచి రచనా వ్యాసంగాన్ని ప్రవృత్తిగా ఎంచుకొని అవిరామంగా కృషి చేస్తూ శతకాలు, నాటికలు, కథలు, గేయాలు, కవితలు, దేశభక్తి పాటలు, గేయ కథలు రాస్తున్నారు అనేక సంస్థల నుంచి ప్రశంసా పత్రాలు, పురస్కారాలు అందుకున్నారు.

ఈయన రచించిన విరులు బాలగేయ సంపుటి శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం. ఆర్థిక సహాయంతో ముద్రితమైంది. ఈ పుస్తకాన్ని తన తమ్ముడైన వేము భాస్కరరావుకు, తన తల్లి దానమ్మకు అంకితం ఇచ్చారు.

ఈ బాలగేయ సంపుటిలో బాలలు ఎంతో ఆనందంగా పాడుకోవడానికి వీలుగా చక్కటి గేయాలు ఉన్నాయి. బాల గేయాలు రాయటం ఏమంత తేలికైన విషయం కాదు. బాలల ఊహలకు - ఇష్టాలకు ప్రాధాన్యత ఇవ్వాలి భాష వారికి అందుబాటులో ఉండటంతోపాటు విజ్ఞానం వినోదం వికాసాలకు చోటు ఉండాలి. పెద్దల సాహిత్యం రాసేటప్పుడు ఉన్న స్వేచ్ఛ బాలసాహిత్యం రాసేటప్పుడు ఉండదు. రాము గారు స్వయంగా ఆయన బాల సాహిత్యం పై రచనలు చేయటమే కాకుండా తన విద్యార్థులచే కూడా పద్యమేవ జయతే అంటూ పద్యాలు రాయించారు.

మానవుడు సంఘజీవి. సంఘాన్ని అతిక్రమించి ఏ పని చేయలేడు. తను అభివృద్ధి చెందుతూ తోటి వారి యోగక్షేమాలను చూడటం మంచి ప్రవర్తనతో క్రమశిక్షణాయుతమైన జీవితాన్ని గడపటం అందరి బాధ్యత. బాల్య దశ నుంచే ఉన్నత విలువలు నేర్చుకుంటే జీవితంలో ఉత్తమ పౌరులుగా ఎదగటానికి అవకాశం ఉంటుంది.

వేము రాము గారి విరులు బాలగేయాలలో విద్యార్థులకు ఎన్నో నైతిక విలువలతో కూడిన మంచి విషయాలు చెప్పబడ్డాయి. వాటిని మనం పరిశీలిద్దాం.

**పత్రము:**

పెద్దలను గౌరవించాలి, ఇతరులకు ఉపకారం చేయాలి, ప్రతీకార స్వభావం ఉండకూడదు, కలలు కంటూ వాటిని నిజం చేసుకోవాలని “కారము” అనే కవితా సంపుటి లో తెలియజేశారు.

పెద్దలకు చేయు నమస్కారము

ఇతరులకు చేయాలి ఉపకారము

తీర్చుకోవద్దుర ప్రతీకారము

కలలను చేసుకొనుము సకారము

(కారము - పుట -17)

తల్లిదండ్రులకు, గురువులకు, అన్నదాత అయిన రైతుకు, వీర సైనికులకు,ఇష్ట దైవానికి నిత్యం కృతజ్ఞతలు చెప్పాలనే నీతిని "జేజేలు" అనే గేయంలో తెలియజేశారు.

జేజేలు అమ్మ జేజేలు

జన్మను ఇచ్చిన అమ్మకు

నడకలు నేర్పిన నాన్నకు

చదువు నేర్పిన గురువులకు

అన్నం పెట్టే అన్నదాతలకు

దేశాన్ని కాచే వీర సైనికులకు

సదా నన్ను కాపాడే దైవానికి

జేజేలమ్మ జేజేల

(జేజేలు- పుట-55)

తల్లిదండ్రులు, గురువులు, ఇతరపెద్దలు చెప్పిన మాటలు వినాలని చదువుపైన మనసుపెట్టి చెడు లక్షణాలను విడిచిపెట్టి మంచి బుద్ధితో మెలగాలని "పూదోట" "సుద్దులు" అనే గేయాలలో తెలియజేశారు.

అమ్మ చెప్పు మాట వినుము

గురువు మాట ఆలకించు

పెద్దల మాటను మరువకు

చదువు పైన మనసు పెట్టు

( పూదోట- పుట-57)

అల్లరి చేయకుము

మంచిని వీడకుము

కల్లలు ఆడకుము

నిందలు వేయకుము

(సుద్దులు - పుట-68)

"గాంధీ" అన్న గేయంలో గాంధీ గారి జీవితాన్ని, భావాలను, అహింసా ధర్మం గొప్పతనాన్ని, అందరినీ ఐకమత్యంగా ఉంచిన నాయకత్వ లక్షణాలను బాలలకు అర్థమయ్యే భాషలో వివరించారు.

పోరు బందరులో పుట్టే

తెల్ల దొరలను ఎదిరించె

పోరాటములు సాగించె

స్వాతంత్ర్యమును మనకు తెచ్చే. (గాంధీ- పుట-76)

"ఉందాం" గేయంలో ప్రజలంతా ఐకమత్యం కలిగి ఏక భావనతో ఉండాలని, విలువలతో జీవించాలని, మంచితనం ఉండాలని, కులమత బేధాలు చూపక, ధనిక పేద తేడా లేక ప్రేమతో కలిసి ఉండాలని తెలియజేశారు.

మన మాతృభాష తెలుగు. ఇది ఎంతో మధురమైనదని దీన్ని ఆదరించాలని, తెలుగు భాష గొప్పతనాన్ని "తెలుగు భాష" అనే గేయంలో తెలియజేశారు.

మధురమైన తెలుగు భాష

మల్లె వంటి తెలుగు భాష

జాను తెలుగు భాష

ఇంటి వేల్పు తెలుగు భాష (తెలుగు భాష- పుట-88)

“జెండా” అనే గేయంలో జెండా యొక్క గొప్పతనాన్ని దానిలో ఒక్కొక్క రంగు యొక్క విశిష్టత్వాన్ని తెలియజేసి , జెండాను అందరూ గౌరవించాలని తెలియజేశారు.

వీరులు మోసిన జెండా

పోరు సాగించే జెండా

స్వేచ్ఛను తెచ్చిన జెండా

భారత ఆశల జెండా (జెండా – పుట - 38)

స్నేహం ఎంతో అమూల్యమైనది. మంచి స్నేహితులు దొరకటం ఎంతో అదృష్టం స్నేహానికి మించినవి ఏమీ లేవు అది ఒక తరగని బలం లాంటిది. ఎలాంటి కష్టనష్టాలు ఎదురైనా మంచి స్నేహితులు ఉంటే ఆ సమస్యల నుంచి తేలిగ్గా బయటపడవచ్చు అనే జీవన సత్యాన్ని "స్నేహం" అనే గేయంలో తెలియజేశారు.

చదువుకు మించింది లేదు. దాని విలువ అనంతము. అక్షరం అజ్ఞానాన్ని తొలగించి విజ్ఞానాన్ని పెంచుతుంది ఇది మనిషికి కీర్తిని డబ్బును అందిస్తుంది మనలో అజ్ఞానం అనే తిమిరాన్ని తొలగించుతుంది అని “అక్షరం” అన్న గేయంలో అక్షరం గొప్పతనాన్ని తెలియజేశారు.

అక్షరాల విలువ అక్షయము

అక్షరం విలువ అనంతము

అక్షరం మనిషికి యశస్సు

అక్షరం మనిషికి ఉషస్సు (అక్షరం - పుట -106)

జీవితంలో అభివృద్ధి చెందాలంటే క్రమశిక్షణ అవసరం. చిన్నతనం నుండే మొదలు కావాలి. మంచి అలవాట్లు మంచి జీవనానికి నాంది. ప్రయత్న పూర్వకంగా వాటిని అభ్యాసం చేయాలి అప్పుడే ఇప్పటి బాలలు రేపటి చక్కటి పౌరులుగా ఎదగటానికి వీలవుతుంది.

శుభ్రత ఆరోగ్యమని తెలుసుకో

క్రమంగా నిత్య కృత్యాలు తీర్చుకో

ప్రాత కాలమందు చదవరా

చదువు బాగా నీకు వచ్చును రా(మంచి అలవాట్లు - పుట -114)

చిన్న వయసులో చక్కగా ఆటలాడటం వల్ల ఆరోగ్యం బాగుంటుంది రక్తప్రసరణ జరిగి ఆకలి పెరుగుతుంది రోజు కొంతసేపు పిల్లలు క్రీడల ద్వారా చేసే వ్యాయామం వల్ల ఉత్సాహంగా ఉల్లాసంగా ఉంటారు ఆటల వల్ల శరీరం పటిష్టంగా ఉండటమే కాకుండా

జీవితంలో సహజమని తేలికగా తీసుకునే నేర్పు అలబడుతుంది ఓటమి కలిగినప్పుడు దాన్ని ఎదుర్కొనే ధైర్యం వస్తుందని "ఆటపాటలు" అనే గేయం లో తెలియజేశారు.బాల్యం నుండే ఆడుము

బాల్యం నుండే అడుము
బాల్యం నుండే పాడుము
భవితను మార్చుకునేలా
ఆడుతూ పాడుతూ ఉండాలి

చదువులెన్నో చదవాలి
వినయము తోటి మెలగాలి
విజ్ఞానాన్ని నేర్వాలి
మంచిగా జీవించాలి (ఆటపాటలు - పుట -118)

సెల్ ఫోన్ వాడకం వల్ల లాభాల కంటే నష్టాలే ఎక్కువ. టెక్నాలజీని ఎంతవరకో అంతవరకే ఉపయోగించుకోవాలి తప్ప వాటికి బానిస కాకూడదు. దానివల్ల సమయం వృధా అవటంతో పాటు విద్యార్థులకు చదువుపై ఆసక్తి తగ్గుతుంది. అనవసరపు వ్యక్తులతో మాట్లాడటం వల్ల కొన్ని సందర్భాలలో కుటుంబాలు కూడా కూలిపోతున్నాయి అవసరం ఉంటేనే ఫోన్ వాడాలి అనే నీతిని "సెల్ ఫోన్" అనే బాల గేయంలో తెలియజేశారు.

**ముగింపు :** ఈ విధంగా వేము రాములు తమ "విరులు" అనే బాలగేయ సంపుటిలో నైతిక మానవీ య విలువలను గూర్చి తెలియజేశారు.

**ఉపయుక్త గ్రంథ సూచి:**

1.ద్వానాశాస్త్రి డా, తెలుగు సాహిత్య చరిత్ర, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, అబిడ్స్ హైదరాబాద్, తృతీయ ముద్రణ జూన్ 2007.

2.నారాయణ రెడ్డి. సి. డా, ఆధునికాంధ్ర కవిత్వము సాంప్రదాయాలు- ప్రయోగాలు- విశాలాంధ్ర పబ్లికేషన్స్, హైదరాబాద్, తృతీయ ముద్రణ- జనవరి 2006.

3.రాములు వేము, విరులు, దివిజ ఆఫ్సెట్ ప్రింటర్స్, గన్నవరం కృష్ణాజిల్లా, ప్రథమ ముద్రణ 2021.1. .ద్వా.నా.శాస్త్రి - తెలుగు సాహిత్య చరిత్ర.

********

# 6. వడలి రాధాకృష్ణ ''మనసు మూలాల్లోకి'' కథాసంపుటి - గ్రామీణజీవనం

**డాక్టర్ లంకిపల్లె జ్యోతీశ్వర నాయుడు,**

యమ్.ఎ., బి.ఎడ్., పి. హెచ్‌డి.,

ఆంధ్రోపన్యాసకులు,

విశ్వోదయ ప్రభుత్వ డిగ్రీ కళాశాల,

వెంకటగిరి, తిరుపతి (జిల్లా).

దేశాభ్యున్నతికి గ్రామాలే పట్టుగొమ్మలు. ప్రశాంత వాతావరణానికి, జీవనానికి విలయాలు గ్రామాలే. అసలు గ్రామం అంటే జనవదాలని వల్లెలనీ అంటారు. జనాలు నివసించే ప్రాంతాన్ని జనపదం అంటారు. ఇప్పుడు గ్రామము అంటున్నారు. దేశం సాంకేతిక వరంగా ఎంత అభ్యున్నతి సాధించినా, ఎంత టెక్నాలజీ పెరిగినా, ఎన్ని కృత్రిమ వసతులు మానవుడు కనుగొన్నా, ఎంత ధనాన్ని అర్జించినా ప్రకృతి ధర్మాన్ని అవన్ని తీర్చలేవు. మనిషికి ఆకలి, నిద్ర, జననం, మరణం లాంటివన్నీ ప్రకృతి ధర్మాలే. అయితే వీటిలో ఆకలిని తీర్చే ఒకే ఒక దారి ఆహారం తీసుకోవడం. ఈ ఆహారం అనేది ఒక ఊరికి, ఒక పట్నానికి, ఒకదేశానికి అని పరిమితం కాకుండా పుట్టిన ప్రతిజీవికి అవసరం ఈ ఆకలి తీరదం. ఇంతటి అవసరాన్ని తీర్చేచి ప్రకృతి అందాలతో అలరారే గ్రామాలు. ఈ వల్లెటూళ్ళు వచ్చని వంట పొలాల్లో వంట వండించకపోతే ఈ ప్రకృతి ధర్మమే నెరవేరదు. అందుకే దేశానికి ప్రాణం గ్రామాలు. గ్రామాల్లో నివసించే పల్లె ప్రజలు వెన్నెముక వంటి వారని నానుడి.

ఒక వ్యవసాయం అనే కాకుండా, మానవ విలువలకు, బంధాలకు, ఆచార వ్యవహారాలకు, మన సంస్కృతీ సాంప్రదాయాలకు, ప్రేమాభిమానాలకు గౌరవ మర్యాదలకు, ప్రకృతిలోని సహజ అందాలకు ఇలా ఎన్నెన్నో విలువల నెలవులు ఈ గ్రామాలు. ఇప్పటికీ ఇంత నగరీకరణ జరుగుతున్నా కూడా మన పల్లెల్లోని విలువల వల్ల ప్రపంచంలోని దేశాల్లో మనదేశం పట్ల ఒక గౌరవ అభిప్రాయం ఉంది. ప్రకృతి విలువలతో, మానవ విలువలతో వర్ధిల్లుతున్న గ్రామాలు దేశానికి ఎంతటి ప్రయోజనాన్ని చేకురుస్తున్నామో, విలువలను ఎలా కాపాడుతున్నాయో వడలి రాధాకృష్ణగారు ఆయన రచనలో అడుగడుగునా ప్రస్తావించారు.

గ్రామీణ ప్రాంతంలో చదువు సంధ్యలు నేర్చిన వదలి రాధాకృష్ణ ఆ ప్రాంతాల, వరిసరాలతోటి, ప్రకృతి అందాలతోటి, గ్రామీణ జీవన విలువలతోటి రచించిన కథాసంపుటి "మనసు మూలాల్లోకి". వద్దెనిమిది కథల ఈ సమాహారంలో దాదాపు ప్రతి కథలో గ్రామీణ జీవనం కనబడతుంది. ఈ కథా సంపుటిలో మొదటి కథ "తొలి పొద్దు కల" ఇది గ్రామీణ జీవనానికి అద్దంపట్టే కథ. కోస్తా జిల్లాలు పచ్చదనానికి, పంటచేలకూ పెట్టింది పేరు. పచ్చని తివాచీ పరిచినట్లుండే వరిపంట పండే మాగాణి పొలాలు, కొబ్బరి చెట్లు, చెరువులు చల్లని వాతావరణం ఇదీ కోస్తా వల్లెల అందం. పొద్దుటి నుండి సాయంత్రం వరకు కలుషితం లేని ఆహ్లాదకర వాతావరణంలో వ్యవసాయం పని చేసుకుని సాయంత్రానికి ఇంటికి చేరే రైతన్న గ్రామీణ జీవన సరళికి వెన్నెముక. అయితే ప్రపంచీకరణ ప్రభావంతో కోస్తా తీరప్రాంతాలలో పచ్చగా కళకళలాడే వంట పొలాలు కను మరుగయి పోయి రొయ్యల కయ్యలు విస్తరించి, మధ్య దళారీలు లక్షాధికారులై ఉత్పత్తిదారులు బికారీలు మారిపోతున్న గ్రామీణ జీవన విషాదాన్ని వదలి మనకు ఆలోచన కలిగే విధంగా "తొలిపొద్దుకల" కథలో రచించారు.

గ్రామీణ జీవనంలో భాగమైన వ్యవసాయం, వంట బాగున్నప్పుడు ఆ పొలాల అందం, ఉ దయాన్నే నారుమడులు వేయాలని, వరి నాటాలనీ, మదులు దున్నాలనీ, కలుపు తీయాలనీ వరుగులు తీసే గ్రామీణుల దైనందిన జీవితాన్ని చక్కగా రచించారు. వంట వేయక ముందు, శుభ్రం చేసిన మాగాణి పొలం, నల్లని కారుమబ్బులు వచ్చి భూమి మీదే ఉన్నాయా అన్నట్లు ఉంటాయనీ, వరిపంట వేసిన

తర్వాత నెలకి వచ్చని తివాచీ నేల మీద పరిచినట్లు ఉంటుందనీ, వరిపంట వండి కోతకు వచ్చేసరికి బంగారు వన్నెలో భూమాతకు బంగారం చేయించి అద్దితే అందం వరిపంట పైరుకి ఉందని రచయిత గ్రామీణ జీవనంలో మాగాణి అందాలకు సొబగులద్దారు. అయితే వర్షం కురవక బీటలు తీసిన భూమి వగుళ్ళు రైతన్న బ్రతుకుల్లో బీటలు పడేటట్లు చేసింది. ఈ నేపథ్యంలో రైతన్న వచ్చని పంట పొలాలను ముందుంచుకుని కదువు నిండక బాధ పడుతున్న సమయంలో అమాయకులైన గ్రామీణులను దళారీలు వచ్చి వంట పొలాలను రొయ్యల చెరువులుగా మార్చమన్న దుష్ప్రచారం బాగా ప్రభావం చూపించిందని తెలుస్తుంది. గ్రామీణ జీవనం సాగాల్సిన రీతిలో సాగడం లేదని రచయిత ఆవేదన ఈ రచనలో తెలుస్తుంది. ఇప్పుడు కులవృత్తులు లేవు, కుండలు చేసే కుమ్మరోడు లేడు. మగ్గం నేసే సాలోడు లేదు. కత్తులు పట్టే కమ్మరోదు లేదు. వడ్రంగోళ్ళు అయితే సరేసరి. చివరికి గడ్డం గీయడానికి కూడా ఎవరూ మిగల్లేదు. ఎవరిగడ్డం వారు గీసుకొనే మిషన్లు వచ్చాయి. తరతరాలుగా నమ్ముకొని బ్రతికిన సాంప్రదాయ వృత్తులన్నీ మాయమైనాయి. దేశానికి వెన్నెముక అని గొప్పలు చెప్పే రైతు పదానికి అర్థం మారి పోయింది.

నాలాంటోడు ఎవడో ఒకదు బయట పడ్డాడు కానీ ! శానామంది వెన్నెముకలు విరిగిపోయినాయి. కూలీనాలీ వనోళ్ళు పొట్ట సేత్తో పట్టుకొని పోయినారు. విసారిస్తే పట్నం పొరిపోయి రోగాల బారినపడి అయిన కాడికి రెక్కల్ని అమ్మేసుకుని బ్రతుకుతున్నారట, అని 'తొలిపొద్దుకల' కథలో ఒక రైతు చెప్పిన మాటల్ని రచయిత కోనసీమ భాషలో రచించారు. ఈ విధంగా గ్రామీణ జీవన విధానంలో ఉన్న ఆనందాన్ని, ఆహ్లాదాన్ని, అమాయకపుతనాన్నీ, వారి జీవన ఒడిదుడుకులను వదలి రాధాకృష్ణ మనకు గ్రామీణ జీవనం ఇలా ఉంటుందా అన్నట్లు సాంక్షాత్కరించారు.

'మనసు మూలాల్లోకి' అని కథాసంపుటికి పేరు పెట్టిన వదలి అదే పేరులో ఒక కథ వ్రాసారు. ఈ కథలో ఇప్పుడున్న గ్రామీణ వాతావరణం కాక పూర్వపు గ్రామీణ వాతావరణం ప్రస్ఫుటమవుతుంది. జీవనయానంలో చదువు సంధ్యల కోసమో, ఉద్యోగ ఉపాదుల కోసమో వుట్టిపెరిగిన వల్లెల్ని విడిచి పట్టణాలకో, వరాయి ప్రాంతాలకో వలసపోయి ఐశ్వర్యంతో తులతూగుతూ వయసు పైబడి జీవితాంతం ఆవలి తీరానికి చేరువవుతున్న సమయంలో యీ సుఖాలు, యీ దుఃఖాలు, సంవదలూ నిజంగా ప్రశాంతతనివ్వడం లేదని, వుట్టి పెరిగిన వల్లెల్లోనే అక్కడి మనుషుల మధ్యే, ఆ ప్రకృతి ఒడిలోనే నిజమైన ప్రశాంతత లభిస్తుందని, ఆ మనసులలోనే యింకా ఆనాటి అమాయకత్వమూ, మంచితనమూ మిగిలి ఉన్నాయని తెలుసుకోవడానికి రచయిత సంధించిన గ్రామీణాస్త్రం ఈ మనసుమూలాల్లోకి కథ.

భారతదేశంలో అందులోనూ సంస్కృతికి పట్టుగొమ్మ అయిన ఆంధ్రదేశంలో ఓ వల్లెటూరులో పుట్టి, డాక్టరుగా ఎదిగిన వ్యక్తి మంచి సర్జన్గా లండన్లో స్థిరపడి అక్కడి యాంత్రిక జీవితంలో తలమునకలై జీవిత చరమాంకంలో తను పుట్టి పెరిగిన ఊరు వస్తాడు. తను పుట్టి పెరిగిన ఊరు విశాఖ స్టీల్ ప్లాంట్ ధర్మమా అని కనుమంగయిందని అతని స్నేహితుడు చెప్తాడు. అయితే ప్రశాంత వాతావరణం ఉన్న ఇంకొక గ్రామమంలో ఉంటానంటారు. ఆ గ్రామానికి వెళ్ళే తీరు రచయిత గ్రామీణ జీవనానికి అద్దంపడుతుంది.

గోస్తనీ నది మీద ఐల్లికట్టు దాటాలి. ఎప్పుడో తాతగారితో చిన్నప్పుడు వేంద్ర అగ్రహారం వెళ్ళాలంటే బల్లకట్టు దాటిన గుర్తు డాక్టరుకి. ఇంకా ఈ రోజు కూడా బల్లకట్టు. అదే కాదు ఊరికి అవతల మరో కాలువ - దాని మీద మరో ఐల్లకట్టు, కూలిపోయిన కర్రల వంతెనకు అడ్డుకొని నీటి ప్రవాహానికి అంతరాయం కల్గిస్తున్న తూటి మొక్కలు. బల్లకట్టు వింతగానూ, కొత్తగానూ ఉంటుంది డాక్టరుకి ఐల్లకట్టు గెంటుతున్న గుర్రం తాతకి డబ్బులు ఇస్తాడు డాక్టర్. అక్కడి రోడ్లు మట్టివి. కొంచెం గాలికే ఎగిరిపోతుంది. అక్కడక్కడ వరచిన ఎర్రకంకర, నల్లమట్టికి భిన్నంగా ఉంది. రెండు బజారులు తిరిగిన డాక్టరు అతని స్నేహితుడు ఊరి ప్రెసిడెంటుని కలుస్తాడు. ఈ ఊరు ఇంతవరకేనా అనుకుంటుంటే, వేంద్ర గ్రామస్తుడు విని అవునందీ- రెండువైపులా వేంద్రను కావలించుకున్న గోస్తనీనది అంటూ, ఇటు ఐల్లకట్టు, అతిపురాతనమైన రామలింగేశ్వరుడు, గోపాలస్వామి దేవాలయాలు, వందేళ్ళనాటి పెద్ద మర్రిచెట్టు నిజం చెప్పాలంటే వేంద్రను తలచుకుంటే వేదం గుర్తుకు వస్తుంది అని ఆ గ్రామం గురించి చెప్తున్న యువకుడు.

ఊరి మధ్యన పెద్దగా ఉన్న మర్రిచెట్టు వంద సంవత్సరాలు పైబర్ శాఖోపశాఖల్ని, ఊదల్ని విస్తరించుకొని ఉంది. దాని నీడ మటుకు ఎంతో దూరం విస్తరించి ఉంది. ప్రతి సంవత్సరం ఆగష్టు నెలలో కాల్వలు పొంగి ప్రవహించడం, అక్కడ సర్వసాధారణం. ఇతర గ్రామాలు, వక్క పట్టణాలు ముంపుకు గురవుతుంటాయి. వేంద్రమటుకు ఎప్పుడూ మునిగిపోలేదు. ప్రపంచం మొత్తం కరువుతో అల్లాడినా వేంద్ర మటుకు ఎప్పుడూ సస్యశ్యామలమే. ఇరువైపుల నుండి కావలించుకున్న నదులు రెండూ ఎండిపోవు. ఊరి వచ్చదనాన్ని వాడనివ్వవు. ఇలా 'మనసు మూలాల్లోకి' కథలో గ్రామీణ వాతావరణాన్ని జీవనాన్ని ఎంతో ముచ్చట గొలిపే విధంగా రచయిత రచించారు. పాఠకులకు కూడా ఆ ఊరు వెళ్ళాలి అనిపించేటట్లు రచన చేశారు.

పోశయ్య ఆహ్వానం అందుకుని ఒకసారి జన్మించిన ఊరు చూద్దామనే తపనతో దసరా శెలవులు కావడం ఇల్ల అమళ్ళదిన్నె వస్తాడు అతను. "పుట్టిన పుడమి మట్టిదనాన్ని పురుడు పోసుకుని పెరిగి ఎగురుతున్న పైరు పరిమళాన్ని ఆస్వాదించనివాడు, మాతృకల మార్దవం ముందు ఏనాటికైనా ఒదిగి పోవాల్సిందే" పల్లెటూరి పెళ్ళిహడావుడి ఒకప్పటి పోశయ్య పాలేరు తనాన్ని గుర్తు చేసుకుంటారు. అమళ్ళదిన్నె గ్రామంలో పొలాలు, సన్నటి పాయలు, పొలంగట్లపై వారులు తీరిన తెల్లని కొంగలు, దూరంగా తాటి చెట్లు, అ ఊరులో పారే నక్కల కాలువ, ప్రపంచంతో తనకేమీ సంబంధం లేనట్లు నిశ్చలంగా పారుతుంటుంది. అయితే ఈ మధ్యకాలంలో పెట్టిన ఫ్యాక్టరీ పుణ్యమా అని నీరు అంతా మురికిగా మారింది. అయినా రాజీవడ్ అందులోనే ఏపుగా పెరిగిన తామరతూడులు, ప్రక్కన మల్లేశం బాబాయిగారి మాగాణి పొలాలు. చిన్నప్పుడు నింగి నేలల మధ్య నేస్తాలతో కేరింతలు కొట్టుకుంటూ కలతిరిగిన పొలాలు.

గ్రామీణ జీవనం ముఖ్యంగా పండుగలకు, ఆచారాలకు పెద్ద పీట వేస్తారు గ్రామస్థులు. ఏ పండుగను ఏ విధంగా జరిపే ఆదారం పెద్దలు నేర్పించారో ఆ పద్ధతిలోనే సాగిపోయే విధంగా ఇప్పటి తరాలవారు కూడా సాంప్రదాయాలను కాపాడుకుంటుంటారు. 'అమళ్ళదిన్నె' గ్రామం దసరా పండుగకు 'శమీపూజ'కు బాగా విశిష్టత ఉంది. పోశయ్య తన కామందుని దసరాకు శమీపూజ చేస్తారు ఉండయ్యా అని బ్రతిమాలేసరికి అతని అభిమానానికి బద్ధుడై ఉంటాడు. ఊరు అంతా దసరా పండుగ సందడి నెలకొని ఉంది. విఖసన స్వామివారి పడిలో జమ్మిచెట్టు క్రింద జమ్మికొమ్మను ప్రాణప్రతిష్ఠ చేస్తున్న పంతులుగారు. బేసిని నిండా బియ్యం నింపుకొని పూజా సామగ్రి, దక్షిణలతో కావల్సినవన్ని పూజారికి అందజేసింది పోశయ్య భార్య అచ్చమ్మ శమీపూజ జరిపేటప్పుడు పూజారి మంత్రాలతో అక్కడి వాతావరణం ఆధ్యాత్మికంగా మారిపోయింది. పంతుల వారు సంకల్పం చదివే సమయంలో తన పేరు చదవటం ఒకింత సంభ్రమానికి గురిచేస్తుంది. అవునండీ! ఈ గుడి మీ పెద్దలు కట్టించింది. అందుకనీ ప్రతి సంవత్సరం శమీపూజ మీ వంశస్థుల పేరుమీదుగానే జరుపుతాము అని ఆ ఊరు వారు చెప్పడంతో అక్కడి మానవ విలువలు ఆచారాలు, సాంస్కృతిక వైభవాలు అన్నీ గోచరిస్తాయి. సాంస్కృతిక వైభవాన్ని, పుట్టెడు సంతోషాన్నిచ్చే పుడమిని, మట్టి వాసనలని తెగనమ్మి కానిచోట బ్రతికే తీరుకూ గ్రామీణ జీవనంలోని సాంస్కృతిక, ఆదార విలువలకూ తేడా స్పష్టమయ్యే విధంగా ఈ కథా రచన చేశారు వదలి రాధాకృష్ణ.

ఈ విధంగా "మనసు మూలాల్లోకి" కథా సంపుటిలోని కథల్లో గ్రామీణ జీవన విధానాన్ని వదలి పాఠకుల హృదయాలలో గ్రామీణ జీవన విలువలు పెరిగే విధంగా రచించారు. గ్రామీణ జీవన మంటే అక్కడి ఆహ్లాదకర వాతావరణంలో ప్రశాంతంగా బ్రతుకు బండి సాగిపోయేది కాదనీ! వారి వారి జీవనంలో కూడా ఒడిదుడుకులు ఉంటాయని కూడా వదలి కొన్నికథల్లో చెప్పారు.

ఆధారగ్రంధాలు

1. 'మనసు మూలాల్లోకి' కథా సంపుటి- వదలి రాధాకృష్ణ

2. తెలుగు కథ - తెలుగు ధనం (మహతి సమీక్ష - వ్యాస సంకలనం) యువభారతి ప్రచురణ హైదరాబాద్ 1972

*******

# 7. ఉమ్మడి మెదక్ జిల్లా కథా సాహిత్యం: సామాజిక స్పృహ

**జి. దుర్గా ప్రసాద్**

పరిశోధక విద్యార్థి

హైదరాబాద్ విశ్వ విద్యాలయం

ఫోన్ నెం. 9390883982

durgaprasadmudiraj0@gmail.Com

**పరిచయం**

మానవుడు సంఘజీవి. అంతే కాదు మేధోజీవి కూడా. సమాజంలో ఇరుగుపొరుగు వారితో, జంతువులూ, మొక్కలతోనూ చక్కగా సహజీవనం చేయగల నేర్పు, ఓర్పు గలవాడని తరతరాల చరిత్ర చెబుతున్నది. తన హక్కులూ బాధ్యతలే కాక, ఇతరుల హక్కులూ బాధ్యతలను గౌరవించటమన్న సర్దుబాటును అలవరచుకోవటమే అంచెలంచెలుగా మానవేతిహాసమైంది. అసలిలా మానవుడు తన చుట్టూ ఉన్న సమాజాన్ని గురించిన స్పృహతో జీవించటాన్నే సామాజిక స్పృహ అన్న పేరుతో పిలుస్తున్నారు. యీ స్పృహ చాలా పాత కాలంలోనే మనిషిలో ఉండేదనటనికి ఉదాహరణలు, అప్పట్లో వెలసిన సాహిత్యమేనని ఘంటాపథంగా చెప్పవచ్చును. ఈ క్రమ వికాసాన్ని, మనుస్మృతి మొదలు రామాయణ, మహాభారత కథాక్రమంలో చూడగలం. స్త్రీ పురుష బంధం, ప్రకృతితో మెలగాల్సిన పద్ధతీ, ప్రభుత్వంతో వ్యవహరించవలసిన తీరూ, భగవంతుని పట్ల విశ్వాసం. ఇవన్నీ వివరంగా కథల్లో జోడించి చెప్పిన తీరు అద్భుతం. ఇవన్నీ సక్రమంగా మనిషి ఆచరిస్తూ ఉంటేనే, సకల సృష్టి సుఖ శాంతులతో విలసిల్లుతుంది.

**ఉమ్మడి మెదక్ జిల్లా కథల్లో సామాజిక స్పృహ**

ఐతా చంద్రయ్య గారి పెద్ద మనసులు కథలో మనం శుభ్రంగా ఉండడం అంత అవసరమో, మన పరిసరాలను శుభ్రంగా ఉంచుకోవడం అంతే అవసరం అన్న కనీస అవగాహన లేని జనాలకు బుద్ధి చెప్పే విధంగా ఈ కథ చిత్రించాడు. కథలో ఒక వృద్ధాశ్రమానికి దగ్గరలో ఉన్న గ్రామంలో ఊరి వీధిలో నిండా చెత్తాచెదారం పేరుకుపోవడం, మోరీలు దుర్గంధం వెదజల్లడం, మోరీలలో పందులు తిరగడంతో వృద్ధాశ్రమంలో ఉండే వృద్ధులంతా కలిసి యుద్ధానికి వచ్చే సైనికుల్లా ఒక్కొక్క వీరికి ముగ్గురు చొప్పున ఊరు ఊరంతా శుభ్రం చేసి మీటింగ్ పెడతారు. ఊరిలోని వారంతా గుమిగూడి ఊరిలోని మోరీలన్నీ చెత్తతో నిండి నీళ్లు పారకుండా ఉండడం వల్ల దాంట్లో దోమలు తయారవుతాయని, అంటు రోగాలు వస్తాయని ఈరోజు మీ ఊరిని మేం శుభ్రం చేసాము. రేపటి నుండి మీ ఊరు మీరే శుభ్రం చేసుకోవాలి. అన్నిటికీ ప్రభుత్వం మీద ఆధారపడితే ఏం లాభం. మన పని మనం చేసుకుంటే మనకి నయం మన వీధులు మనమే శుభ్రం చేసుకుంటే అంటు జ్వరాలు, రోగాలు రాకుండా ఉంటాయని చెప్తారు.

చంద్రయ్య గారి నన్ను ముట్టుకోకు నామాల కాకి కథలో మనిషి సంఘజీవి. మనిషి సమాజంతో కలిసి జీవించాలి. కష్టసుఖాల్లో కలుసుకొని ఒకరికొకరు సహకరించుకోవాలి. కానీ మురళి అందుకు భిన్నం తన తల్లి చనిపోతే చావుకు ఊరిలో వారెవ్వరూరారు. కారణం మురళి ఊరిలో ఏ శుభకార్యానికైనా, చెడుకార్యానికైనా ఎవరు పిలిచినా వెళ్ళడు. పైగా నేను వెళ్లకపోతే కార్యం ఆగిపోతుందా అని సమర్థించుకుంటాడు. తల్లి శవం దుర్గంధం రావడంతో ఏం చేయాలో తోచదు. ఎవరు రాకపోయేసరికి తను చేసిన తప్పు తెలుసుకుంటాడు. చివరికి తన స్నేహితుడి ద్వారా స్వయం సేవకులు పదిమంది రావడం తల్లి శవయాత్ర సజావుగా జరిగిపోవడం కష్టాల్లో నుంచి అవలీలుగా గట్టెక్కినట్టు అనిపించి మురళి శరీరంలోని అనుబంధం కృతజ్ఞతా భావంతో నిండిపోతుంది. (నిజమే మనిషి సంఘజీవి నేను ఇప్పటి నుంచి సంఘం కోసం జీవిస్తాను. నన్ను ముట్టుకోకు నామాల కాకి అంటూ ఏ కాకిగా మిగిలిపోను.) ఇంగితం పుట: 93

ఐతా చంద్రయ్య గారి చిట్టా చమక్కు కథలో అవయవ దాన ఆవశ్యకతను ఈ కథ ద్వారా చిత్రించే ప్రయత్నం చేశాడు రచయిత. కథలో పాపారావు అనేక పాపాలు చేసి చనిపోయిన తర్వాత యమధర్మరాజు సమక్షంలో చిత్ర గుప్తుడు అతని తప్పులను ఒక్కొక్కటి చెప్తూ ఒక్కొక్క దానికి ఒక్కొక్క శిక్ష అని చెప్తాడు. చివరికి అతని ఖాతాలో కొండంత పుణ్యం కూడా జమైందని చిత్రగుప్తుడు చెప్తాడు. పాపారావు పార్థివ శరీరంలో నుంచి ముఖ్యమైన అవయవాలు తీసి చావు బతుకుల్లో ఉన్న నలుగురి రోగులకు ఇచ్చి వారిని బతికించారు. దాంతో ఇతని పుణ్యం పద్దు కైలాస పర్వతమంత పెరిగింది అంటాడు చిత్రగుప్తుడు. అవును యమ రాజా (నేను బతికున్నప్పుడు ఆరోగ్య శిబిరాలకు వెళ్లాను. చచ్చాక నా కళ్ళను, కిడ్నీలను తీసుకోవచ్చని రాసిచ్చా ఈ విధంగా దానం చేశాను అంటాడు.) పొద్దు తిరిగింది. పుట: 119 యమధర్మరాజు నీ పాపాలకంటే పుణ్యం పాలు ఎక్కువైంది కాబట్టి నేరుగా నిన్ను స్వర్గానికి పంపిస్తున్నానంటాడు.

ఐతా చంద్రయ్య గారి నింగి చేరిన జాబిలి కథలో నిరంజన్ ఐఏఎస్ అధికారి అతని స్నేహితుడు సురేష్ కోటీశ్వరుడైన అతని పెళ్లి సాదాసీదాగా ఒక అనాథాశ్రమంలో అనాథల మధ్యలో జరుగుతుంది. నిరంజన్ భార్య అనిత అనాథాశ్రమంలోని పిల్లల్ని చూసి ఒక్కొక్కరి పరిస్థితి భర్త ద్వారా తెలుసుకుంటుంది. అక్కడ చదువుకున్న వారు ఎందరెందరో మానవోత్తములు ఆర్థికంగా, హార్థికంగాను సహాయం చేయడం వల్ల గొప్ప గొప్ప ఉద్యోగాలు సాధిస్తున్నారని అంటాడు నిరంజన్. పెళ్లికూతురు కూడా ఇక్కడే పెరిగిన అమ్మాయి. మానవత్వం జాగృతమైన ఏ మనిషికైనా ఇది దైవ సన్నిధిలా అనిపిస్తుంది. మానవ సేవయే మాధవసేవ కదా కొందరు ఆర్థికంగా సహాయం చేయడం. కొందరు క్రియాశీలకంగా ఇక్కడే పనిచేస్తూ సమాజం రుణం తీర్చుకుంటున్నారని ఇక్కడే అనాధ శరణాలయంలో పెరిగి గొప్ప స్థితిలో ఉన్న వెంకట్రావు గారు ఈ పెళ్లి ఖర్చు భరిస్తున్నారని అంటాడు. మనలో చాలామంది వేలకు వేల డబ్బు ఖర్చు పెట్టి పెళ్లిళ్లు, పుట్టినరోజులు ఇలా ఎన్నో జరుపుకుంటాం. దానిలో కొంత డబ్బు అయినా ఇలాంటి అనాధ శరణాలయాలకు దానం చేయడం వల్ల ఎందరో జీవితాల్లో వెలుగునింప వచ్చని అంటాడు నిరంజన్.

సిద్దంకి యాదగిరి గారి మార్పు కథలో డబ్బు కోసం చిన్న పిల్లలని అడుక్కునే వృత్తిలోకి లాగి బిచ్చగాళ్ళుగా చేస్తే సునీల్ అనే ఉపాధ్యాయుడు సహాయంతో హాస్టల్లో చేరి చదువుకోవడం ఇందులోని చిత్రించాడు. సునీల్ కు సికింద్రాబాద్ రైల్వే స్టేషన్ లో 8 ఏళ్ల పిల్లవాడు కాళ్ళ మీద పడతాడు. సునీల్ ఇలా అడుక్కోకపోతే బడికి పోయి చదువుకోవచ్చు కదరా అంటే పిల్లవాడు తమని చదువనివ్వరని, మేం అడుక్కొచ్చి మా అయ్యవ్వలకు రోజు పైసలు ఇవ్వకపోతే తిండి పెట్టరని అంటాడు. హాస్టల్ కు పంపిస్తా వెళ్తావా హాస్టల్లో మూడు పూటలు భోజనం, రోజుకు ఒక కోడిగుడ్డు, దుప్పట్లు, బట్టలు అన్ని ఫ్రీగా ఇస్తారని చదువుకుంటే మంచి నౌకరి వస్తుందని మీ బతుకులు మారాలంటే మీరు చదువుకోవాలని హాస్టల్లో చేర్పిస్తాడు.

ఐతా చంద్రయ్య గారి ఉభయ తారకము కథలో కార్గిల్ యుద్ధంలో ప్రాణాలర్పించిన సైనికుని కూతురు శారదను సారధి కానీ కట్నం లేకుండా పెళ్లి చేసుకుంటాడు. రోడ్డు మీద అడుక్కునే వాళ్ళు ఎవరైనా చేయి చాస్తే ఎంతో కొంత దానం చేయడం. రోడ్డుమీద అరటి తొక్కనో, ఇటుక ముక్కను కనబడితే దాన్ని తీసి జాగ్రత్తగా చెత్తకుండీలో వేయడం చూసి అతని స్నేహితులంతా అతను అమాయక చక్రవర్తని నవ్వుకోవడం. పండగలకి హాస్పిటల్లో రోగులకు పండ్లు, ఖైదీలకు స్వీట్స్ పంచడం, పండగలకు సాధారణ బట్టలు వేసుకోవడం ఆ డబ్బుతో పేదలకు ఎంతో కొంత సహాయం చేయవచ్చు అనుకొనే మనస్తత్వం. స్నేహితులు ఈ దేశం కుల్లునంత కడిగేయగలమా, దారిద్రాన్ని తరిమేయగలవా అంటే (దేశంలో, సమాజంలో ప్రతివాడు నేనొక్కడినే ఏమి చేయగలనని చేతులు ముడుచుకొని కూర్చుంటే ఎట్లా, దేశ సరిహద్దుల్ని కంటికి రెప్పలా కాపాడుతున్న మన వీర జవానులు ఎవరికి వారే నేనొక్కడినే యుద్ధం చేయకుంటే ఏమవుతుందనుకుంటే ఈ దేశం గత ఏమవుతుందో తెలుసా? అందరూ ఈ దేశ పురోగతికి తలా ఓ చెయ్యి వేస్తే దేన్నైనా సాధించగలం కదా) పల్లె నా తల్లి పుట: 120 అనడం తన సామాజిక స్పృహను, సామాజిక బాధ్యత తెలియజేస్తుంది. తన భార్యకు పిల్లలు పుట్టరని

తెలిసి అనాథాశ్రమం నుండి ఒక ఆడపిల్లను దత్తత తీసుకోవడం చూసి నువ్వు చాలా గొప్పోడివిరా ఎన్ని రోజులు నిన్ను తప్పుగా అర్థం చేసుకున్నాం నిజంగా నువ్వు సంఘసంస్కర్తవు, దేశభక్తుడు రా అంటూ స్నేహితులు తమ తప్పు తెలుసుకుంటారు.

ఐతా చంద్రయ్య గారి మబ్బు తెరలు కథలో ఆర్మీలో పనిచేసే సుధీర్ యుద్ధంలో కాలు విరిగిపోవడంతో మాజీ సైనికుల కోటాలో లెక్చరర్ ఉద్యోగంతో జీవిస్తుంటాడు. ఆర్మీలో ఉన్నప్పుడు కార్గిల్ ప్రాంతంలో ఒక తెలుగు కుటుంబం జిహాద్ రాక్షస మూకల దాడిలో తల్లిదండ్రి చనిపోతే మిగిలిన పదేళ్ల పాపను చేరదీసి తమ అమ్మమ్మ వాళ్ళ ఇంటికి వరంగల్ కు తీసుకు వచ్చి వారి ఇంటికి పంపుతాడు. ప్రతినెల కొంత డబ్బు పంపి ఆ అమ్మాయి చదువుకోవాడానికి సహాయపడతాడు. బాగా చదువుకున్న ఆ అమ్మాయి ప్రభుత్వ ఉద్యోగం సాధిస్తుంది. జాహ్నవి తనకు చేసిన సహాయానికి సుధీర్ కు కృతజ్ఞత చెప్తూ తను ఆరోజు తనని చేరదీయకపోతే తన జీవితం ఇలా ఉండేది కాదని సుధీర్ కు ఋణపడి ఉన్నానంటే ఒక సగటు మనిషిగా ఇది తన బాధ్యత అంటాడు.

సూర్య కాలనీలో నివాసం ఉండే రామానుజం గొప్ప లాయర్. గ్రేసీ అనే కుక్కను పెంచుకుంటూ దానికి పాలు, బిస్కెట్లు పెట్టి విదేశీ సబ్బుతో స్నానం చేయించేవాడు. ఈయన కాలనీ అధ్యక్షుడు రోడ్లు, విద్యుత్ స్తంభాలు, చెత్త వేయడానికి అనువైన స్థలాలు, నీళ్ల ట్యాంకును, ఆరేడు కిలోమీటర్ల సిసి రోడ్డు, చెత్తకుండీలు, ఒక పార్కు, గ్రంథాలయం, బ్యాంకు, కమ్యూనిటీ హాలు రామానుజం ప్రయత్నంతో అన్ని ఏర్పడతాయి. రామానుజన్ చేసిన సేవలకు ఒక కళా సాంస్కృతిక, సామాజిక సేవా సంస్థ సేవారత్న పురస్కారాన్ని ప్రకటిస్తుంది. అలాంటి రామానుజంకు ఇద్దరు ముసలి తల్లిదండ్రులు. ఆరు నెలలకు ఒకసారి వచ్చి పోయే కొడుకు కోసం జీవత్సవంలా ఎదురు చూస్తూ ఉంటారు. కానీ వారిని పట్టించుకోకుండా పట్నంలో ఉంటూ కాలనీలు ఉద్ధరించడం, కుక్కలను అపరూపంగా సాగటం, అవార్డు అందుకోవడం ఇది కాదు మానవత్వం. కనీసం అతను పెంచుతున్న కుక్కపాటి విలువ చేయరా వారి తల్లిదండ్రులు. కుక్కపై ఓలకబోసే ప్రేమలో వెంట్రుక ప్రాణమైన వీళ్ళ మీద చూపవచ్చు కదా కన్న తల్లిదండ్రులను పట్టించుకోని వాడు సేవారత్న అయితేనేం భారత రత్న అయితేనేం తన భాధ్యత మరిచిన వాడు మూర్ఖుడితో సమానం.

బెల్లంకొండ సంపత్ కుమార్ గారి బడి గంట కథలో జ్వరం వచ్చిన పిల్లవాణ్ణి మందు మాకు వేయకుండా మూఢవిశ్వాసాల వల్ల ఎట్లా నాశనం చేస్తారో తెలిపే కథ. పిల్లవాడు జ్వరంతో బాధపడుతుంటే తల్లిదండ్రులు వారం రోజుల నుండి మంత్రాలు వేయడం, ఊదు పొగలు వేయడం, తాయతులు కట్టడం ఇలా చేస్తూ జ్వరం తగ్గడం లేదని అనుకుంటారు. వారం రోజుల నుండి పాఠశాలకు విద్యార్థి రావడం లేదని ఇంటికి వెళ్లి పిల్లవాణ్ణి పరామర్శిస్తూ (ఇంత జ్వరం ఉంటే మీరు భూత వైద్యాలు చేస్తున్నారట ఇవేవీ నిజం కావు ఆలస్యం చేస్తే ప్రాణాలకే ప్రమాదం మూఢనమ్మకాలను వదిలి మంచి వైద్యం చేయించండి) పల్లెపూల వాన పుట: 33 అని చెప్పి కారులో పట్టణానికి తీసుకువెళ్తారు. ఇప్పటికే చాలా సమయం అయిపోయి పిల్లవాడు చనిపోతాడు.

అంతర్నేత్రం కథలో మనం సమాజంతో ఎలా ఉంటామో సమాజం కూడా మనతో అలాగే ఉంటుందని చెప్పి కథ ఇది. కథలో పార్వతి భర్త బాగా డబ్బున్నవాడు. తమ ఊరి నుండి పట్నంకు పని మీద వచ్చిన వారికి వంట చేసి పెట్టడం. పని పూర్తి కాని వారు రాత్రికి వారి ఇంట్లోనే ఉండి వెళ్ళడం ఇంటికి ఎవరు వచ్చినా ప్రేమతో చూసుకునేది. భర్త మన ఊరు దగ్గరే కదా నువ్వు వండి పెట్టడం వల్లే వారి ఇక్కడికి వస్తున్నారని అంటాడు. భార్య (మనం మానవ మాత్రలమండి సంపాదించిన దాన్ని సద్వినియోగం చేయడం అంటే ఇదేనండి. ఇది గృహస్థ ధర్మం. మానవసేవే మాధవ సేవ అన్నారు కదా) పుట:123. ఒక రోజు భర్త పని మీద హైదరాబాద్ కు వెళ్తాడు. పార్వతి ఇంట్లో కాలు జారి మెట్లపై నుండి కింద పడుతుంది. భర్త హాస్పిటల్ కి వెళ్లి ఏమైందని అడగగా హార్ట్ స్ట్రోక్ వచ్చిందని వీళ్ళు వెంటనే తీసుకువచ్చారు కాబట్టి వెంటనే ట్రీట్మెంట్ ప్రారంభించాము. ఏమాత్రం ఆలస్యమైనా ప్రమాదం జరిగేది. ఇప్పుడు మీ భార్యకు ప్రాణాపాయం తప్పిందని అంటాడు. తన ఊరి వారు ఇంటికి రాకపోయి ఉంటే తన భార్య తనకు దక్కేది కాదని తను చేసిన మంచి తనకు తిరిగి వచ్చిందని అనుకుంటాడు.

ఐతా చంద్రయ్య గారి ఆనందనందనము కథలో పిల్లలే తమ సర్వస్వమని భావించే తల్లిదండ్రులను వారి వృద్ధాప్యంలో ప్రేమానురాగాలు కరువై ఆత్మాభిమానాన్ని చంపుకొని ఇంటిలో ఉండలేక కొందరు ఆత్మహత్యలకు పాల్పడితే కొందరు వృద్ధాశ్రమాల బాట పట్టారు. కథలో ఉన్నతంగా బతికిన చంద్రశేఖర్ రిటైర్మెంట్ తర్వాత వచ్చిన డబ్బులను ముగ్గురు కొడుకులకు సమానంగా పంచమనడంతో వాళ్ల పోరు భరించలేక తలా లక్ష రూపాయలు డిపాజిట్ చేయడం. డబ్బు అయిపోయిన తర్వాత ఇంటి వాతావరణం తుఫాను వెలసిన తీర ప్రాంతం లాగా ముందటి ప్రేమాభిమానాల మూలకు పడిపోవడం ఇంట్లో ఎవరూ పట్టించుకోకపోవడంతో, వృద్ధాశ్రమమే నయమని ఇంట్లో నుండి వెళ్లిపోతాడు. (మనషి చెయ్యని పాపానికి దేవుడు విధించే శిక్ష వృద్ధాప్యం దానికి ఐఏఎస్ అడుక్కునేవాడు అని తేడా లేదు కదన్నా) ఆనంద నందనము పుట :13

**ముగింపు**

*ఉమ్మడి మెదక్ జిల్లా కథా సాహిత్యంలోని కథల్లో* చాలా వరకు కథలు సమాజంలోని సామాజిక అసమానతలను తొలగించడానికి, సమసమాజ నిర్మాణానికి, సామాజిక అభివృద్ధికి తోడ్పడే కథలున్నాయి. భారత్ లోనే గాక ప్రపంచం నలుమూలలో సామాజిక దౌర్బల్యాలు, దుశ్చర్యలు, నేరాలు జరుగుతున్నాయి. వీటికి మూలం మూఢ విశ్వాసాలు, నిరక్షరాశ్యత, మతమౌఢ్యాలు వీటికి ఉదాహరణలు; అంటరానితనం, బాల్యవివాహాలు, సతీ సహగమనం, మానవ బలులు వగైరా. ఇలాంటి సామాజిక జాడ్యాలను రూపుమాపడానికి ఈ కథలు ఎంతగానో తోడ్పడతాయి.

**ఉపయుక్త గ్రంథ సూచి**


- చంద్రయ్య, ఐతా. 2012 *ఇంగితం.* సిద్దిపేట్: జాతీయ సాహిత్య పరిషత్
- చంద్రయ్య, ఐతా. 2017. *పల్లె నాతల్లి.* సిద్దిపేట్: భారతీ ప్రచురణలు
- సంపత్ కుమార్, బెల్లంకొండ. 2017. *పల్లె పూలవాన.* హైదరాబాద్: తెలంగాణ బాల సాహిత్య పరిషత్
- యాదగిరి, సిద్దంకి. *తష్ఠ* 2016. హైదరాబాద్: తెలంగాణ రచయితల సంఘం
- వెంకటసుబ్బయ్య, వల్లంపాటి. 1995. *కథాశిల్పం.* హైదరాబాద్: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.
- దక్షిణామూర్తి, పోరంకి. *2009. కథానిక స్వరూప స్వభావాలు.* విజయవాడ: నవోదయ పబ్లిషర్స్.


*********

# 8. తెలుగు భాషా పరిరక్షణ - తక్షణ కర్తవ్యం

**రచయిత్రి పరిచయం - పేరు - అద్దంకి ప్రభావతి**

**9052277827**

తెలుగు భాష మీద అభిమానంతో శ్రీ శారదా నికేతనము ఓరియంటల్ డిగ్రీ కళాశాలలో BAOL ( భాషాప్రవీణ ) పూర్తి చేశాను . ఆచార్య నాగార్జున దూర విద్యా కేంద్రము ద్వారా తెలుగు MA చేశాను . రాష్ట్రీయ సంస్కృత విద్యా పీఠంలో సంస్కృత భాషలో ( ఆచార్య MA - సాహిత్యం ) మరియు శిక్షా శాస్త్రి ( B . ED ) పూర్తిచేశాను . 2012 లో కేంద్రీయ విద్యాలయంలో సంస్కృత ఉపాధ్యాయినిగా నా వృతి పయనం మొదలైనది . 2014 వ సంవత్సరం నుంచి భారతీయ విద్యా భవన్స్ పాఠశాలలో సంస్కృతం మరియు తెలుగు ఉపాధ్యాయినిగా పనిచేస్తున్నాను. విద్యార్థుల్లో భాషాభిరుచిని పెంచడానికి నా వంతు కృషి చేస్తూ దానిలో భాగంగా గురుపూర్ణిమ , హయగ్రీయ జయంతి , గీతా జయంతి మొదలైన కార్యకమాలలో శ్లోకాలు నేర్చుకుని , కార్యక్రమంలో పాల్గొనే విధంగా విద్యార్థులను ప్రోత్సహిస్తున్నాను . భాషా సంబంధిత పోటీలను నిర్వహించి మా పాఠశాల యాజమాన్యము ద్వారా బహుమతులను అందచేస్తున్నాము.

**ముఖ్య ఉద్దేశ్యం -**

తెలుగు భాషా పరిరక్షణలో భాగంగా ప్రాథమిక స్థాయిలో అంటే పాఠశాలలో తెలుగు భాషను ఉత్సాహపూర్వకంగా - క్రీడా పద్ధతుల ద్వారా బోధించి విద్యార్థులలో తెలుగు భాష పట్ల అభిరుచిని ఏర్పరచుట .

**అమ్మకు రక్షణ అవసరమా .... ?**

మన అందరికీ తొలి గురువు అమ్మ . అమ్మ ఒడిలో మొదటి సారిగా మనం వినే మాటలు - లాలిపాటలే మన భాష . అదే ఆంధ్రుల మాతృభాష " తెలుగు " . తేనె వలె తియ్యగా ఉండటం వల్లనేమో దీనిని ' తెనుగు ' అని కూడా అంటారు . సహజంగా మనం అమ్మకి ఇచ్చే గౌరవం , అమ్మ మీద చూపించే ప్రేమ మన మాతృభాషపైన కూడా చూపించాలి . మన మనసులోని భావాలని మనం మన మాతృభాషలో మాత్రమే స్పష్టంగా - సులువుగా ఎదుటివారికి అర్థం అయ్యేవిధంగా చెప్పగలము . ప్రస్తుతం తెలుగు భాష మాట్లాడేవారు ప్రపంచంలో అన్ని దేశాలలోను నివసిస్తున్నారు . ప్రపంచంలో ఎక్కువగా మాట్లాడే భాషలలో తెలుగు నాలుగవ స్థానంలో ఉందని పరిశోధనలు చెబుతున్నాయి. పాశ్చాత్య దేశీయుడు ' నికోలా ' 15వ శతాబ్దంలోనే - " ఇటాలియన్ ఆఫ్ ద ఈస్ట్ " అని కొనియాడాడు . " దేశ భాషలందు తెలుగు లెస్స " అని శ్రీ కృష్ణ దేవరాయలు చేత కీర్తించబడిన తెలుగు భాషని రక్షించుకోవాల్సిన పరిస్థితి ఏర్పడటం బాధాకరం . " తెలుగు తల్లి సాధుజన కల్పవల్లిరా " అని కీర్తించబడిన మన భాష తెలుగు వారి ఇండ్లలో వాడుక లోపం రావడం - ఆంగ్ల భాషా ప్రభావం అధికం అవ్వడమే తెలుగు భాషా రక్షణకు ఒక ప్రధాన కారణంగా మనం చెప్పుకోవచ్చు .

**మన ఇంట్లో తెలుగు –**

ఆంగ్ల ప్రభావం ఎక్కువగా ఉన్న ఈపోటీ ప్రపంచంలో దానికి ధీటుగా తెలుగుని నిలబెట్టే బాధ్యత తెలుగు వారి ఇంటి నుంచే మొదలు అవ్వాలి . ప్రస్తుతం పల్లెటూళ్ళలో కూడా ఆంగ్ల ప్రభావం కనిపిస్తూనే ఉంది . తెలుగు వారమైన మనమందరం రోజూ ఇంట్లో తెలుగు మాత్రమే మాట్లాడాలి అన్న భావనను మనలో పెంపొందించుకోవాలి. కొన్ని చిన్న సూత్రాల ద్వారా తెలుగు భాష ను అభివృద్ధి చేయడానికి ప్రయత్నిద్దాం .

- భాషాభిరుచిని పెంచే పొడుపుకథలు , సామెతలు , జాతీయాలు పిల్లలతో మాట్లాడాలి.
- సాధారణంగా వాడే పదాలు door , spoon ఇలాంటి పదాలకు బదులు తలుపు , చెంచా అంటూ మొదలు పెట్టాలి .

- జిజ్ఞాస ను పెంచే కథలు పిల్లలకి చెప్పాలి .
- బాలగేయాలు అభినయంతో నేర్పించాలి .
- చిన్న చిన్న పదాలతో వాక్య నిర్మాణాలు చేయించాలి .
- పదక్రీడలు - పద బంధాలు లాంటివి ఎలా చేయాలో పిల్లలకి చూపించాలి.
- ప్రతిరోజూ వార్తాపత్రికల్లో కనీసం పది వాక్యాలు వారితో చదివించాలి .
- పిల్లలు తప్పులు మాట్లాడుతున్నా వాటిని సరిదిద్దుతూ వారిని ప్రోత్సహించాలి.
- ప్రాంత మాండలిక పదాలను వాటి మార్పులను పిల్లలకి చెప్పాలి . ఉదా- pillow అనే పదాన్ని కొన్ని ప్రాంతాల్లో దిండు అనీ, కొన్ని చోట్ల తలగడ అనీ అంటారు.
- తెలుగు మాట్లాడినా - రాసినా చిన్న చిన్న ప్రోత్సాహక బహుమతులు ఇవ్వాలి.
- తెలుగులో వచ్చే వాణిజ్య మరియు వ్యాపార ప్రకటనలను చూపించాలి .

తల్లిదండ్రులకు ప్రతిబింబాలు. వారు మనల్ని చూస్తూ - గమనిస్తూ పెరుగుతారు. కనుక తలిదండ్రుల మంచి నడవడికే పిల్లల అభివృద్ధికి మరింత దోహదపడుతుంది.

**ఒడి నుంచి బడికి –**

ఆడుతూ - పాడుతూ చిన్న చిన్న పిల్లలు అమ్మ ఒడి నుంచి మొదటగా బుడి బుడి అడుగులతో వెళ్ళే మరో ఒడి " బడి " . అక్కడ ఉన్న గురువే తల్లి లాగా మారి విద్యార్థులకు ప్రేమగా పాఠాలు చెప్పాలి . ఆటలాడే మనసు - వయసు ఉన్న పిల్లలో వారికి ఇష్టమైన ఆటలనే సాధనంగా తీసుకుని వారికి పాఠాలు చెబితే అది మరింత ఉపయోగకరంగా ఉంటుంది . పదాలతో అంత్యాక్షరి , పదాలతో తెలుగు పాటలు - గేయాలు ఇవన్నీ పిల్లలలో బడికి వెళ్ళాలి అనే ఉత్సాహాన్ని నింపుతాయి . పిల్లవాడు చేసిన ప్రతి పనిని అమ్మ సంతోషపడి మెచ్చుకుని కొన్నిసార్లు ఏదో ఒక తాయిలం ఇస్తుంది . అలాగే ఉపాధ్యాయుడు కూడా విద్యార్థికి వీలైనన్ని ప్రోత్సాహక బహుమతులు ఇస్తూ లేదా ప్రోత్సాహకరమైన మాటలు మాట్లాడి , అభినందిస్తే విద్యార్థికి ఇంటికి - బడికి తేడా కన్పించదు . విద్యార్థి చేసే తప్పులను ప్రేమగా మందలిస్తూ సరిచేస్తే అపుడే అమ్మ ఒడి నుంచి వచ్చిన పిల్లలకి ఉపాధ్యాయులు అమ్మలాగే కన్పిస్తారు . సహజంగా కల్మషం లేని లేత మనసులు కలిగిన చిన్న చిన్న పిల్లలు ఉపాధ్యాయులు ఏమి చెప్పినా వింటారు. క్రమశిక్షణతో ఉంటారు .

**ప్రాథమిక స్థాయి నుంచి -**

నేటి కాలంలో పాఠశాలలో తెలుగు బోధించడం ఉపాధ్యాయునికి కఠినతరమే . అయినప్పటికీ కేవలం మార్కుల కోసం కాకుండా విద్యార్థి తెలుగు భాషనీ ఇష్టపడే విధంగా బోధించడం తెలుగు ని ప్రేమించే మన ఉపాధ్యాయులందరి బాధ్యత . ఉపాధ్యాయ శిక్షణలో మనం వివిధ బోధనా పద్ధతులను నేర్చుకున్నాము . వాటిలో అతి ముఖ్యమైన , విద్యార్థులకి అత్యంత ఇష్టమైనది క్రీడా పద్ధతి . దీని ద్వారా తెలుగు భాష లోని అన్ని పాఠ్యాంశాలను సులువుగా బోధించవచ్చు .ఎక్కువగా ప్రాథమిక స్థాయిలో ఈ పద్దతి ఎంతో లాభదాయకం . 'తెలుగులోనే మాట్లాడాలి. తెలుగులోనే రాయాలి. తెలుగులోనే పాలన చేయాలి. తెలుగు రాష్ట్రాల్లో ఈ మార్పు రావాలి' అని భారత ఉపరాష్ట్రపతి వెంకయ్యనాయుడు ఇటీవల పేర్కొన్నారు.

**క్రీడాపద్ధతి -**

దీని ద్వారా ముఖ్యంగా వర్ణమాల , ద్విత్వ - సంయుక్త పదాలు , భాషాభాగాలు , విభక్తి ప్రత్యయాలు , తెలుగు నెలలు , ఋతువులు , నక్షత్రాలు , తిథులు ఇలా ఎన్నో విషయాలను విద్యార్థులకి నేర్పించవచ్చు .

- అట్ట లేదా చార్టు ముక్కలను వివిధ ఆకారాల్లో తయారుచేసి రంగు రంగుల పదాలను రాసి తరగతి లో విద్యార్థులతో జత పరచుట ఒక క్రీడ .
- విద్యార్థుల పేర్లను ద్విత్వ - సంయుక్త - నక్షత్రాల పేర్లుగా మార్చి వారిని తరగతిలో అన్ని వైపులకు పంపి ఒక సమూహం తయారుచేసి నేర్పించుట.
- నల్లబల్లపై సుద్దముక్కతో పదవినోదాలు రాయించుట.
- అర్థాలు - పర్యాయపదాలు మొదటి అక్షరాలను మార్చి ఇచ్చి మరల అర్థవంతంగా జతచేయుట.
- క్రీడాస్థలంలో కూడా ప్రాచీన ఆటలైన వామన గుంటలు , పులి మేక , అష్టాచెమ్మా ఇలాంటి వాటిని కూడా పరిచయం చేయుట .
- తరగతిలో మొదటి ఐదు నిముషాలు ఉక్తలేఖనం ( dictation ) రాయించి విద్యార్థుల చేత దిద్దించుట .
- ప్రతి విద్యార్థి తనకు తెలిసిన ఏదో ఒక విషయాన్ని తెలుగులో మాట్లాడేలా అవకాశం కల్పించుట .

ఇలా క్రీడాపద్ధతి లో నేర్పించుట వలన విద్యార్థులలో తెలుగు భాషపై ఇష్టం పెరుగుతుంది. తరగతిలోని విద్యార్థులందరూ చురుకుగా పాల్గొంటారు. నేర్చుకున్న విషయాన్ని ఎక్కువకాలం గుర్తుంచుకుంటారు.

**ముగింపు -**

అమ్మ తన పిల్లలందరిని సమానంగానే చూస్తుంది . కానీ ప్రతి పిల్లవాడికి తన అమ్మంటే ఎనలేని ప్రేమ . అమ్మను అగౌరవపరిస్తే అసలు సహించలేడు. అయితే, పరభాషా ధ్యానంలో పడి మాతృ భాషనే మర్చిపోయే ప్రమాదం ఏర్పడింది. అలాగే మన అమ్మ భాష అయిన తెలుగును కూడా ప్రేమిస్తూ , ఇతర భాషలను నేర్చుకుంటూ జీవితపయనం కొనసాగించాలి. విశ్వనాథ సత్యనారాయణ , గురజాడ అప్పారావు వంటి గొప్ప కవుల సాహిత్యాలను మనం మననం చేసుకుంటూ భావి తరాలకి కొంత వరకైనా వాటిని చెప్పాలి . త్యాగయ్య - అన్నమయ్య మనకు అందించిన మృదు మధుర సంగీతాన్ని అందరికి పరిచయం చేయాలి. మన సంస్కృతిలోని ప్రతి పండుగను విధి-విధానాలతో బడిలో తప్పనిసరిగా ఆచరించాలి. ప్రకృతిలో జరిగే సహజమైన మార్పుల ద్వారా తెలుగు నెలలు - ఋతువులు ఎలా ఏర్పడ్డాయో పిల్లలకి తెలియ చెప్పాలి. కథలు చెప్పగలిగే నానమ్మ - అమ్మమ్మ - తాతయ్యలకు పిల్లలు ఎపుడు దగ్గరగా ఉండేలా చూడాలి.

తెలుగువారి మనుగడ - వారి జీవన విధానమైన తెలుగు భాషను పరిరక్షిస్తూ ప్రపంచానికి తేట తెనుగును వివిధ రంగాలలో రుచి చూపడం తెలుగువారమైన మనందరి కర్తవ్యం అని నేను భావిస్తున్నాను .

**పరిశోధనా గ్రంథాలు**

1. తెలుగు భాషా బోధనా ప్రకాశిక
2. తెలుగు భాషకు సి పి బ్రోన్ చేసిన సేవ
3. తెలుగు బోధనా పద్ధతులు
4. https://pib.gov.in/PressReleasePage.aspx?PRID=1750182
5. https://www.dishadaily.com/editpage/protecting-telugu-language-is-our-responsibility-247099

*********

# 9. సుమతీ శతకం - సామాజిక స్పృహ

**డా॥ కొణిదల పురుషోత్తం,**

తెలుగు అధ్యాపకులు,

శ్రీవేంకటేశ్వర ప్రాచ్య కళాశాల,

తిరుపతి.

సెల్ నెం. 98667 26032

**శతకం / ముక్తకం :-**

తెలుగు సాహిత్యంలో విభిన్న ప్రక్రియలు కలవు. అందులో 'శతకం' అనే సాహిత్య ప్రక్రియ ఒకటి. శతకాలలోని పద్యాలు స్వయం సంపూర్ణంగా వుంటాయి. శతకాలలో అష్టాదశ వర్ణనలకు, ప్రకృతి వర్ణనలకు తావులేదు. శతకంలోని పద్యాలు స్వతంత్రాలు కాబట్టి శతకాలను 'ముక్తక కావ్యాలు' అనవచ్చును. శతకాలలో వస్త్వైక్యం ఉండదు. కాబట్టి రసపోషణకు అంత అవకాశం వుండదు. కాని శృంగార, భక్తి, హాస్య, రస ప్రధానాలయిన తెలుగు శతకాలు కొన్ని లేకపోలేదు. భక్తి భావానికి శతకాలలో పెద్దపీట వేశారు. ఈ భక్తిరసం ఆ శతకాలలో అగ్రస్థానంలో నిలిచింది. అనేక నీతి బోధక శతకాలను రచించడమైంది. భక్తి శతకాలు కవి ఆత్మానుభూతి ప్రధానాలు. ఆ మాటకొస్తే ఏ శతకమైనా ఆత్మాశ్రయ ప్రధానమే. శతకంలో మౌలికంగా కవి తన ఆత్మాను భూతిని, మనసులోని భావాలను, తన అనుభవాలను నిర్భయంగా, నిజాయితీగా వెల్లడిస్తాడు. ఆత్మ పరిశీలనం చేసుకుని గత జీవిత దోషాలు స్మృతికి రావడంతో పశ్చాత్తాపం చెందుతాడు. తన మనస్సు నాకర్షించిన వేల్పు గుణాలనూ, మహిమనూ భావాలనూ వర్ణిస్తాడు. ఈ విధంగా చాలా శతకాలు కవి ఆత్మాశ్రయ కవితా రీతికి చెందినవి. తెలుగులో సహస్రాధికంగా శతకాలు వెలువడ్డాయి. వీటిలో భక్తి, వైరాగ్య, నీతి శతకాలు - ఇలా అనేక వర్గాలుగా విభజించు కోవచ్చును.

**నీతి శతకాలు :-** నీతి భావనలను వివరిస్తూ నీతి బోధ చేస్తూ వివరించే శతకాలే నీతి శతకాలు. ఇవి పూర్వగ్రంథాలనూ లోకానుభవాన్నీ ఆధారంగా చేసుకొని ఇహ జీవితాలను పురస్కరించుకుని రచించిన రచనలు. నీతి శతక కవి జీవిత సమస్యను చర్చిస్తాడు. ఇందులో ఉండే నీతులు మానవ సంఘంలోని వివిధ వ్యక్తులకు సంబంధించినవి. కాబట్టి నీతి శతకాలు సర్వజన హిత కరములైనవి.

నీతి శతకాలలో రాజనీతి, గృహనీతి, లోకనీతి, ప్రవృత్తి నీతి అనేవి ముఖ్యమైనవి. గృహనీతి లేదా సంసారనీతిలో - మాతా పితృ పుత్ర సంబంధాలు, అనుకూలవతి అయిన భార్య, పర స్త్రీల పట్ల చూపించాల్సిన గౌరవం, అనుసరించాల్సిన ప్రవర్తన, స్త్రీ ధర్మాలు, స్త్రీల పట్ల ఆనాటి పురుషుల దృష్టి అనే విషయాలు ప్రాముఖ్యం వహిస్తాయి. లోకనీతిలో ` లోకవృత్తం, సంఘ విమర్శ, చట్టాలు, ఆశ్రితులు, డబ్బు సంపాదన, సమకాలిక జీవితం, విషయ సంపద అనే అంశాలు ప్రస్తావనకు వస్తాయి. మానవుని నైతిక వర్తనం, సత్యం, దానం, దయ, లోభత్వం, శౌర్యం మొదలైనవి ప్రవృత్తి నీతిలోని ప్రధానాంశాలు.

**సుమతీశతక కర్త :-**

నీతి శతకాలలో కాలాన్ని బట్టి, గుణాన్నిబట్టి అగ్రగణ్యమైంది 'సుమతి శతకం'. క్రీ.శ. 13వ శతాబ్ధికి చెందిన బద్దెన సుమతి శతకాన్ని రచించాడని అంటారు. కానీ సర్వలక్షణ సార సంగ్రహం అనే గ్రంథంలో వేములవాడ భీమకవి సుమతి శతకాన్ని రచించినట్లు పేర్కొన్నాడు. ఇందులో ఉన్నవన్నీ కంద పద్యాలే. తెలుగు సాహిత్యంలో శతకాలకు ఒక ప్రత్యేకమైన స్థానం కలదు. అనేకమంది కవులు మానవాళి మనుగడ కోసం శతకాలను రచించుటకు పూనుకున్నారు. నీతి శతకాలలో సుమతీ శతకం ప్రజల ఆధరాభిమానాలకు

పాత్రమైంది. అలతి అలతి పదాలతో అల్లిన పద్యాలలో ఎన్నో గొప్ప నీతులు ఈ శతకంలో చూడవచ్చు. తెలుగు ప్రజల దైనందిన జీవితంలోనూ, వ్యవహరించే భాషలోను సుమతీ శతకంలోని నీతులు ఒక భాగమై పోయాయి. ప్రాథమిక విద్యాభ్యాసం నుంచే ఈ శతకాన్ని నేర్పించడం గర్వించదగ్గ అంశం. సుమతీశతక కారుడు సమాజాన్నంతా, లోకాన్నంతా బాగుచేసి అందరూ సుఖశాంతులతో ఉండాలనే సత్ సంకల్పంతో ఈ శతకానికి శ్రీకారం చుట్టాడు.

**జీవిత సత్యాలు :-**

సుమతీ శతకంలోని పద్యాలు ఆనాటి సామాజిక పరిస్థితులను గురించి పేర్కొనబడినవి. అందులో కొన్ని పద్యాలు మాత్రం ఏనాటికైనా మానవులందరూ దైనందిన జీవితంలో ఆచరించాల్సిన నీతులను బోధిస్తున్నాయి. బద్దెన తన ఇష్టదైవాన్ని ప్రార్థిస్తూ శతక రచనకు పూనుకోవడం ముదావహం. సాధారణంగా అనాదిగా బంధువులు, చుట్టాలు ఆపదలో అవసరానికి చేయూత నందివ్వడం పరిపాటి. మనకు ఆపదలో సహకరించని వారు ఉన్నా లేకున్నా ఒకటే అనే సత్యాన్ని ''అక్కరకు రాని చుట్టము'' - అనే పద్యంలో పేర్కొన్నారు.

'అదరము గదలియు గదలక' - మాట్లాడితే నోట్లో ముత్యాలు రాలిపోతాయన్నట్లుగా మౌనంగా వుండే అధికారి మదంతో వుండగా అతని వద్ద పని చేయడం పాపం అన్నాడు. ''అప్పిచ్చు వాడు, వైద్యుడు / నెప్పడు నెడతెగక బాఋ నేఋను, ద్విజుడున్ - మనిషి తన అవసరానికి అప్పుపుట్టని చోట, వైద్యుడు లేని గ్రామంలో, అనునిత్యం నీరు లభ్యం కాని చోట, మంచీ, చెడులు చెప్పే పురోహితుడు లేని గ్రామంలో నివసించకూడదు. 'అవసరానికి ఆదుకొనే వారే మన ఆప్తులు కదా! అలాంటి వారు లేని చోట వుండుట అత్యవసర కాలంలో మనకు సాయం చేసేవారు లేని చోట నివసించడం తగదున్నాడు.

**సామాజిక స్థితిగతులు :-**

''అల్లుని మంచి తనంబును / గొల్లని సాహిత్య విద్య, కోమలి నిజమున్'' - అప్పటి సమకాలీన సమాజంలో అల్లునికి అంత గొప్ప పేరు లేదు. ఈ రోజుల్లో అల్లుడు అంటే అత్త మామలకు చేదోడు వాదోడుగా ఆ కుటుంబంతో కలిసి మెలిసి వుంటున్నాడు. ఆరోజుల్లో అల్లునికి పెళ్ళై ఎన్ని సంవత్సరాలైన కొత్త అల్లుడిగానే గౌరవ మర్యాదలు చేయవలసి వచ్చేది. ఆ ఇబ్బందిని కవి ఇలా చెప్పి ఉండవచ్చు. అందుకే శతకాలు ఆనాటి సమాజపు తీరు తెన్నులను తెలియజేసాయి.

''ఆకొన్నకూడె అమృతము / తాకొంకక నిచ్చువాడె దాత ధరిత్రిన్'' - బాగా ఆకలిగా ఉన్నపుడు ఏమి తిన్నా రుచిగా ఉంటుంది. అందుకే ఆకలయ్యాకే భోజనం చేయడం ఉత్తమం. లేకుంటే అన్నం అరగక అనేక రోగాలకు కారణమవుతుందని మనం గ్రహించాలి. ఆకలైతేనే తినాలి. దానం చేసేటపుడు అవసరానికి తగినట్లు దానం చేయాలి. కష్టాలు వచ్చినపుడు భయపడకుండా ఎదురు నిల్చి పోరాడాలి.

''ఇమ్ముగ జదువని నోరును / 'అమ్మా' యని పిలిచి యన్న మడుగని నోరున్'' - ఇందులో మనిషి ఎలాంటి విలువలతో కూడిన జీవితాన్ని గడపాలో తెలిపాడు. చదివేటప్పుడు మనస్సు పెట్టి చక్కగా చదవాలి. జన్మ నిచ్చిన తల్లిని గౌరవించాలి, సంతోష పెట్టాలి. తల్లి దీవెనలు, ఆశీర్వాదం పొందుతుండాలి. కుటుంబం లో అందరితో ఎలా కలసి మెలసి ఉండాలో అనేది అంతరార్థం నోరు మంచిదైతే ఊరు మంచిది. వాక్పారుష్యమే మిన్న లాంటి సామెతల ప్రకారం. మంచిగా ప్రవర్తించి మంచిగా మాట్లాడి, మంచిని పెంపొందింప జేసుకోవాలి.

''ఉత్తమ గుణములు / నీచున కెత్తెఅగున గలుగ నేర్చు నెయ్యెడలన్ దా'' - ప్రస్తుతం సమాజంలో మంచి గుణములు కలవాడు గుర్తింపబడతాడు. నీచుడు మంచి గుణాలను అలవరచుకోలేడు. సమాజంలో మంచిగా గుర్తింపును పొందడం సాధ్యంకాని పని. మంచి గుణాలు నేర్చుకోవాలని ఆశక్తి లేనివాడు అధముడు. అది ఎలాగంటే ఇత్తడిని ఎన్ని మార్లు కరిగించినా బంగారంగా మారదు కదా!

**సత్ప్రవర్తన:-**

''ఎప్పటికెయ్యది ప్రస్తుత / యప్పటికామాటలాడి యన్యుల మనముల్'' - ఎలా ప్రవర్తించాలో ఏ సమయానికి ఏది తగినదో వివరించబడిరది. ముందుగా ప్రతి ఒక్కరూ మాట్లాడే విధానం నేర్చుకోవాలి. మన మాటల ద్వారా ఇతరుల హృదయాలను గాయపరచరాదు. ఎల్లప్పుడూ సత్యాన్నే పలకాలి అన్నాడు. అదే మన సంస్కృతి. సత్య మార్గంలో పయనించాలి. ధర్మమార్గం, ఆత్మ సంరక్షణ, స్వాధ్యాయ ప్రవచనాలు, దేవ పితృ కర్మల నుండి మరలకుము. తల్లి, దండ్రి, గురువు, అతిధులను దైవ సమానులుగా భావించి పూజించు మొ॥నవి తైత్తరీయ శిక్షావలి లో గురువులు శిష్యులకు బోధిస్తారు.

**పరనిద మహాపాపం :-**

''ఏఱకుమీ కసుగాయలు / దూఱకుమీ బంధు జనుల దోషము సుమ్మీ'' - లేతకాయలు కోయరాదు అవి పిందెలు వాటిలో పసరు ఉంటుంది. రుచికరంగా వుండవు. అవి తింటే అనారోగ్యం పాలవుతాం. అదే పండి పక్వానికి వచ్చిన వయితే రుచికరంగాను వుంటాయి. పిందెలు కోయడం పాపం కూడాను. చుట్టాలను నిందించ రాదు. రక్త సంబంధీకులూ, సగోత్రాలువారు అయినటువంటివారిని దూషించడం, చీదరించడం చాలా నేరం. పుణ్య కార్యాలలోను, క్రతువుల సమయం లోను బంధువులే వచ్చేది. అలాంటి వారిని దూషించుట అంటే నిన్ను నువ్వే దూషించుకున్నట్లే. సైనికులు వృత్తిధర్మం నిర్వహణలో వుంటూ ఒక్కోసారి మరణాలకు గురవుతుంటారు. అయినా వెనుదిరిగి రారు. జవాన్లు ఎంత ఆపద, కష్టం వచ్చినా తమ విధి నిర్వహణలోనే వుంటారు. ఎంతో అనుభవంతో, ముందు చూపుతో పెద్దలు చెప్పే మాటలను తప్పకుండా పాటించాలి. విని తీరాలి అని కవి అభిప్రాయం.

''ఓడలు బండ్లను వచ్చును / ఓడలు నా బండ్ల మీద నొప్పగవచ్చున్'' - అద్భుతమైన సందేశం. ధనవంతులమని గర్వించరాదు, కడు పేదవారమని బాధ పడరాదు. 'కలిమి లేములు కావడి కుండలు'. డబ్బు ఇప్పుడు ఉండవచ్చు. మరొకరోజు పోవచ్చు. పేదవాడు ధనికుడు కావచ్చు. కాబట్టి దేనికీ విర్ర వీగక అన్ని సమయాల్లోను వినయ విధేయతలతో ఉండాలి. ఏది ఉన్నా అది భగవంతుని ప్రసాదంగా భావించాలని సూచిస్తున్నాడు.

**వికసించని వ్యక్తిత్వం :-**

''కనకపు సింహాసనమున / శునకము గూర్చుండబెట్టి శుభలగ్నమునం'' - నీచుడయిన వానిని ఎంత గౌరవించినా అతని నీచస్వభావమును మార్చుకోడు. అందుకే శతకకర్త అలాంటి వారిని కుక్కతో పోల్చాడు. కుక్క పని మొరగడం, కరవడం, మీదకురకడం. అలాగే గౌరవ స్థానంలో ఉన్నా హీన గుణుడు గొప్పవారిని గుర్తించి గౌరవించలేడు. ఒక వ్యక్తి ఎలాంటి గొప్ప స్థితిలో ఉన్నా కూడా పదవీ గర్వంతో విర్ర వీగక ఉత్తములని గౌరవించాలని అన్యాపదేశం. నేడు మనం ఇలాంటి వారిని (రాజకీయ నాయకులను) అనేక మందిని అను నిత్యం చూస్తున్నాం...

**స్త్రీలు సాధికారత :-**

''కుల కాంత తోడ నెప్పుడు/గలహింపకు వట్టి తప్పు ఘటియింపకుమీ'' - భర్త, భార్య పట్ల ఎంత మర్యాదగా, నియమబద్ధంగా, జాగ్రత్తగా ఉండాలో వివరించాడు. భార్యతో తగాదా వేయకూడదు. ఆమె ఎల్లవేళలా భర్త, కుటుంబం అభ్యున్నతి కోసం పాటుపడుతుంది. అలాంటి స్త్రీ మనస్సును బాధపెట్టరాదు. ఆమె మీద నిందారోపణలు చేయరాదు. ఇంటి యందు ఇల్లాలు కంటి కన్నీరు కింద పడితే ఆ ఇంట్లో లక్ష్మీదేవి ఉండదు. అంటే భార్యను ఉత్తమురాలుగా పోల్చాడు. అందరి శ్రేయస్సును చూసే మహిళ ఆ ఇంటికి ఒక దేవత లాంటిదని పేర్కొన్నాడు.

**ఉద్వేగ నియంత్రణ :-** ''తన కోపమే తన శత్రువు / తన శాంతమె తనకు రక్ష దయ చుట్టంబౌ'' - ఈ పద్యంలో బద్దెన మన గుణాలే మన మిత్రులు, శత్రువులు అన్నాడు. ఎవరికైనా వారి ప్రవర్తనే, స్వభావాలే మంచినీ చెడునూ కలిగిస్తాయని భావం.

కోపం అనర్థాలకు మూలదాయకం. కోపం వచ్చినపుడు మానవుని శరీరం ఉద్రేకంతో కంపిస్తుంది. హృదయ స్పందన పెరిగి గుండెపోటు సంభవించవచ్చు. ఎదుటి వారిని నోటికొచ్చినట్లు మాట్లాడితే అంతా దూరమై పోతారు. కోపానికి మనం దూర్వాసుని కథ, కౌశికుని కథ, విశ్వామిత్రుని కథ గుర్తు తెచ్చుకోవాలి. తన శాంతమే తనని రక్షిస్తుంది. ఎవరైతే సహనంతో వుంటారో వారు అందరిచేత గౌరవింపబడతారు. హరిశ్చంద్రుడు సత్యంకోసం రాజ్యాన్ని వదలేసినా ఓర్పుతో అన్నీ సహించి చివరకు దేవతల మెప్పును పొందాడు. దయాగుణం, దానగుణం కలవాడు అందరి మన్ననలు పొందుతారు. చక్కగా మనస్సును స్వాధీనపరచుకుని సుఖశాంతులు కావాలంటే తృప్తిగా జీవించాలి.

**సజ్జన సాంగత్యం :_**

''ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ!'' - దుర్మార్గులు ఎలా వుంటారంటే పాముకన్నా, తేలుకున్నా ప్రమాదకారులు. విషపూరితమైన పాముకు నోట్లోనే విషం వుంటుంది. దానికి ప్రాణ భయం కలిగితేనే ఎవరినైనా కాటేస్తుంది. తేలుకు తోకలోనే విషముంటుంది. దుర్మార్గునికి ఒళ్ళంతా విషమే. విచక్షణా జ్ఞానం కల మానవుడు దురాత్ముడై జంతువుల కంటే నీచంగా తోటివారికి హానిచేస్తాడు. కావున దుర్మార్గుల వద్ద ఉండరాదు. వారితో స్నేహం చేయరాదు అన్న విషయాన్ని సులభమైన మాటలతో సూక్ష్మంగా వివరించడంలో బద్దెన నిపుణత వ్యక్తమవుతుంది.

''దనవారి కెంత కలిగిన దన భాగ్యమె తనకుగాక తథ్యము సుమతీ'' - ఇందులో ఎవరి సంపదలతో వారు ఆనందంగా జీవించాలనే సందేశం వుంది. మన ఆప్తుల సంపదలను ఎంత చెప్పుకున్నా అది మనకు స్వంతంకాదు. ధనవంతుడైన కుబేరుడు మిత్రుడుగా వున్న శివుడు బిచ్చమెత్తవలసి వచ్చింది. కావున తాను సంపాదించుకున్న తద దగ్గరున్న భాగ్యమే తనది కానీ ఇతరులది తనకే మాత్రం సహకరించదు. లయకారకుడైన శివుడు ఒక్క మాట చెప్తే కుబేరుడు ఎంతటి ధనాన్నైనా ఇస్తాడు కానీ అది పరులదే కదా! అందుకే మనసంపద, మన తృప్తిని మించిన సంతోషం మరెక్కడా లభించదని కవి పేర్కొన్నాడు.

**సద్భాషణం – సద్భూషణం :-**

''నీరే ప్రాణాధారము నోరే రసభరితమైన నుడువుల కెల్లన్'' - పంచభూతాలలోనిది, మానవ మనుగడకూ, సకల ప్రాణులకు ప్రాణాధారమైన నీటిని గూర్చి బద్దెన ప్రజలందరికీ ఒక హెచ్చరిక చేసాడు. నీరు ఎలా అందరికీ ప్రాణాధారమో, అలాగే మంచి మాటలు మాట్లాడటం వలన మానవుని సంస్కారం బయల్పడుతుంది. దానివల్ల అతనికి గౌరవ మర్యాదలు కలుగుతాయి. మనిషికి మర్యాదను మించిన జీవన మేముంటుంది. మహిళ ఏవిధంగా పురుషునికి అన్ని విధాలా సహకరిస్తూ, తల్లిలా, సలహాధారులా, సర్వ సౌకర్యాలకు ఆధారమో చెప్తూ మహిళ గౌరవాన్ని రెట్టింపు చేశాడు బద్దెను. మగువ చీర కట్టులో పొందే గౌరవం, మంచి గుర్తింపు, భారతీయ సంస్కృతికే తలమానికం అన్నాడు.

''పగ వల దెవ్వరితోడను'' - ఎవరితోను విరోధము పనికిరాదు. విరోధం విషంతో సమానం అందరితో మంచిగా స్నేహంగా మెలగడమే మానవత్వం. ఎవ్వరికైనా ఏ సమయంలోనైనా ధన బాధ, దారిద్ర్యం అనేది సంభవించవచ్చు.

''బలవంతుడు నా కేమని పలువురతో నిగ్రహించి పలుకుటమేలా'' - బలం అనేది కండ బలమేకాదు. బుద్ధి కుశలత, ధనం, కులం, జనం అనే బలాలు ఉంటాయి. ఎన్ని బలాలున్నా ఒక్కోసారి ఒంటరిగా మిగిలి పోయే ప్రమాదం వుంటుంది. ఆ సమయంలో ఎన్ని బలాలున్నా పనికి రావు. బలముందని విర్రవీగరాదు అని అంతరార్థం. మిడిసిపాటు మంచిది కాదు.

**ధర్మమే జయం :-**

''సరి తా వచ్చిన వచ్చును సలలితముగ నారికేళ సలిలము భంగిన్'' - సంపద లభించడం పూర్వజన్మ సుకృతం. మనం చేసే పనులు కొన్ని సమయాల్లో అనుకూలంగా నెరవేరవు. మన జన్మ సుకృతంకొద్దీ, మనం చేసిన దానధర్మాల వలన ఏ పనైనా సక్రమంగా

జరుగుతుంది. కావున మంచి చేయడం, సాయం చేయడం, దాన ధర్మాలు చేయడం కనీసం మాట సాయమైనా చేయాలి అని బద్దెన సందేశం.

**సంతానం సౌభాగ్యం :-**

''పుత్రోత్సాహము తండ్రికి పుత్రుడు జన్మించినపుడే పుట్టదు జనులా'' - పుత్రుడు పున్నామ నరకంనుండి కాపాడే వాడు అని ఐతిహ్యం. సంతానంలో పుత్రులైనా, పుత్రిక లైనా సద్గుణ సంపన్నులైతే తల్లి దండ్రులను చివర దాకా శ్రద్ధగా చూసుకుంటారు. అదే దుర్మార్గుడైన కుమారుడు ఉన్నా లేనట్లే. సంతానం సమాజంలో మంచిగా గుర్తింపు పొందితే తల్లి దండ్రులు సంతోషిస్తారు. సంతానం సత్ప్రవర్తన చాలా ముఖ్యమైనది. తల్లిదండ్రులు కోరుకునేది కూడా అదే.

**ముగింపు :-**

''మాటకు ప్రాణము సత్యము'' - సద్భాషణము - సద్భూషణము - మంచిమాట మంచి ఆభరణం లాంటిది. అందులోను సత్యం పలకడం. అనునిత్యం సత్య మార్గంలో పయనించడం ఉత్తముల లక్షణం. అందుకే ''సత్యం వద - ధర్మం చర'' అన్నారు. భారతంలోను ఆది పర్వంలోకూడా శకుంతల దుష్యంతునితో సత్యాన్ని గూర్చి ఒక మాట చెబుతుంది. వేయి అశ్వమేధ యాగాల ఫలితాన్ని త్రాసులో ఒకవైపు సత్యాన్ని మరోకవైపు వేసి తూచినచో త్రాసు ముల్లు సత్యం వైపే మొగ్గు చూపుతుంది. సత్యానికి అంతటి మహోన్నతమైన స్థానం కలదు. ఇలా ఈ శతకంలోని నీతులు భూత, భవిష్యత్, వర్తమాన కాలాలలో ఆచరించిన వారు సన్మార్గంలో పయనించగలరు.

**ఉపయుక్త గ్రంధం :**

1. సుమతీ శతకం - గొల్లపూడి వీరాస్వామిసన్
శ్రీ సీతారామా బుక్ డిపో
రాజమండ్రి
2. తెలుగు సాహిత్య చరిత్ర - డా. ద్వా.నా. శాస్త్రి
3. తెలుగు సాహిత్య సమీక్ష – డా. జి. నాగయ్య

********

# 10. మూఢం వీడిన "లత్త"

SADMEKA LALITHA

Assistant professor of Telugu

తెలంగాణ సారస్వత పరిషత్తు ప్రాచ్య కళాశాల, హైదరాబాద్

9652134812

sadmeka.lalitha@gmail.com

తెలంగాణ భాషకు పట్టం కడుతూ, యాసతో తెలంగాణ భాషకు జీవాన్ని పోస్తూ తెలంగాణ నేపథ్యాన్ని కథల్లో సహజంగా చిత్రిస్తూ మట్టి మనుషుల అంతరంగాన్ని మన ముందు ఆవిష్కరిస్తున్న రచయితలు ఎంతో మంది ఉన్నారు. అటువంటి రచయితల్లో శీలం భద్రయ్య గారిని ప్రత్యేకంగా ప్రస్తావించుకోవలసిన అవసరం ఉంది. వైవిధ్య భరితమైన కథనంతో వస్తువుని ఎంచుకుని, అభివ్యక్తీకరించే తీరులో చక్కని శిల్పాన్ని పాటిస్తూ, ఒక బలమైన సంఘటనను కథాంశంగా మలిచి, ఆ నేపథ్యానికి తగ్గట్టుగా భాషను ఎన్నుకోవడం శీలం భద్రయ్య గారి రచనల్లో ప్రతిఫలిస్తుంది. శీలం భద్రయ్య గారిలో ఉన్న ఆ రచనా శైలి, పాఠకుల్ని ఆయన రచనలు చదివించేలా చేస్తాయి. పాఠకుల్ని, కథ వెంట పరుగులు తీసేలా చేస్తుంది. కథలో సహజత్వం ఉంటేనే పాఠకులు ఆ రచనలతో తాదాత్మ్యానికి లోనవుతారు. తెలంగాణ సామెతలు, మాండలిక పదాలు శీలం భద్రయ్య గారి రచనల్లో, అలవోకగా కథా సందర్భానికి తగ్గట్టుగా వచ్చి చేరుతూ ఉంటాయి.

శీలం భద్రయ్య సూర్యాపేట జిల్లాలోని అన్నారం గ్రామంలో 1980 డిసెంబర్ 24న శీలం బుచ్చయ్య, యాదమ్మ దంపతులకు జన్మించారు. వృత్తిరీత్యా తెలుగు ఉపాధ్యాయుడు కావడం వల్ల, భాష పై గల అభిమానం గౌరవం ఆయనను రచనా రంగం వైపు మళ్ళించింది. రచయితగా నిలదొక్కునే ప్రయత్నంలోనే మంచి విలువలు ఉన్న రచయితగా పాఠకుల మనసులో చెరగని ముద్రను వేసుకున్నారు. రాసినవి చాలా తక్కువ రచనలే అయినా మనసుల్ని మెలిపెడుతూ, మానవ సంబంధాలకు విలువనిచ్చే సందేశాత్మక కథల్ని అందించారు. జీవితపు విలువలను తెలియజేసేలా, పాఠకుల్ని ఆలోచనల్లోకి తీసుకు వెళ్ళేలా వీరి కథలు ఉంటాయి.

అందులో 'లత్త ' అనే కథను గురించి విశ్లేషించాలనుకుంటే ఈ కథ 'లొట్టపీసు పూలు ' అనే కథా సంపుటిలో ఉంది. ఈ కథా సంపుటిలో మొత్తం 15 కథలు ఉన్నాయి. ఈ కథా సంపుటి 2020లో ప్రచురితమయ్యి, పాఠకుల ఆదరాభిమానాలను సంపాదించుకుంది. వైవిధ్యభరితమైన వస్తువుతో చారిత్రక, సామాజిక అంశాలకు ప్రాధాన్యతను ఇచ్చే కథలు, ఈ కథా సంపుటిలో చోటు చేసుకున్నాయి. సామాజిక రుగ్మతలను పారద్రోలి, సామాజిక బాధ్యతను పెంపొందించటమే లక్ష్యంగా వీరి రచనలు ఉంటాయి. లత్త అనే కథా శీర్షిక వింటేనే, పాఠకుల్లో ఆసక్తి కలిగి, కథను చదవాలని కుతూహలం కలుగుతుంది. శీర్షిక అనేది కథకు ఆయువుపట్టు లాంటిది అని అంటారు. అలాంటి శీర్షికలోనే తెలంగాణ మాండలిక పదాన్ని ప్రయోగించడం అనేది గమనిస్తే, రచయితకు గల భాషాభిమానం తెలుస్తుంది. ఈ కథ పత్రికలో ప్రచురితం అయింది. కథకు తగ్గట్టుగా, కథాంశాన్ని సూచించేటట్టుగా, రచయిత ఒక ఛాయ చిత్రాన్ని అందించారు. రచయితలో దాగివున్న సృజనాత్మకతకు తార్కాణంగా, ఛాయాచిత్రం ద్వారా కథ చెప్పడం, కథను చదివించేలా, పాఠకులలో ఉత్సుకతను రేకెత్తించడం అనే అంశాలు ప్రధానంగా మనకు కనిపిస్తాయి.

సమాజంలో ఎన్నో రుగ్మతలు ఉన్నాయి. ఆ రుగ్మతులను పారద్రోలి, మెరుగైన సమాజాన్ని నిర్మించుకోవడం అందరి బాధ్యత. రచయితగా శీలం భద్రయ్య గారు కూడా లత్త కథలో ఒక మూఢవిశ్వాసాన్ని నిర్మూలించే దిశగా, అక్షరాస్త్రాన్ని సమాజంపై సంధించాడు. చిన్న కథను ఎన్నుకొని, రెండు ప్రధాన పాత్రలతో కథను నడిపించారు. స్త్రీని కేంద్రంగా చేసుకొని, కథను నడిపించిన తీరు బాగుంది.

సమాజంలో వివక్ష చాలా రకాలుగా ఉంటుంది. అందులో స్త్రీ వివక్ష చాలా ఎక్కువగా ఉంటుంది. ఈ కథలో ప్రధాన పాత్రధారి అయిన లింగమ్మ చుట్టూనే కథ అంతా నడుస్తుంది. లింగమ్మకు నుదుటి భాగంలో సరిగా జుట్టు లేకపోవడం దారిద్ర్యానికి సంకేతంగా భావించి, ఆమె వివాహం విషయంలో చాలా అవమానాలు ఎదురవుతాయి. అటువంటి అమ్మాయిని వివాహం చేసుకుంటే కుటుంబానికి అరిష్టం అని భావిస్తారు. ఎన్నో ఆటంకాలు లింగమ్మ పెళ్లికి ఎదురైనప్పటికీ మల్లయ్య ధైర్యం చేసి, అమ్మకి అయిష్టం అయినప్పటికీ అవేవీ లెక్క చేయకుండా పెళ్లి సంబంధం ఖాయం చేసుకుంటాడు. కానీ అనుకోని హఠాత్పరిణామంలా లింగమ్మ తాత పెళ్లికి ముందు రోజు చనిపోతాడు. దాంతో లింగమ్మకు ఉన్న ఎగనాకుడు వల్లే తాత చనిపోయాడని, ఆమె నష్ట జాతకురాలని ఊరంతా అనుకోవడంతో మల్లయ్య తో జరగాల్సిన పెళ్లి ఆగిపోతుంది. అందరూ తాత చావుకు లింగమ్మ కారణమని అనుకుంటారు. కానీ ఆయన వృద్ధాప్యంలో ఉండి, అనారోగ్యంతో చనిపోయాడు అనే ఆలోచనే ఎవరికీ కలగదు.

సమాజంలో మూఢవిశ్వాసాలు మనుషుల్ని ఎంతలా ప్రభావితం చేస్తాయో? మన ఆలోచనా శక్తిని ఎంతలా క్షీణింప చేస్తున్నాయో? పై సంఘటన ద్వారా తెలుస్తుంది. మంచి కన్నా చెడు ఎక్కువగా వ్యాప్తి చెందుతుంది అంటారు కదా! అదే విధంగా సమాజం తిరోగమన దిశలో పని చేసేందుకు మూల కారణాలు ఏవైనా అవి తొందరగా ప్రజల్ని ప్రభావితం చేస్తాయి.

మూడు పెళ్లిళ్లు జరిగి, పెటాకులైన పెళ్ళికొడుకు నాలుగవ భార్యగా లింగమ్మ వివాహ జీవితంలోకి అడుగుపెడుతుంది. లింగమ్మకు పెళ్లి ఆలస్యంగా జరిగినా, మెట్టినింట తనకు ప్రతికూల పరిస్థితులు ఎదురైనా వాటిని తట్టుకొని, తన నేర్పుతో, ఓర్పుతో సంయమనంగా వ్యవహరించి, కుటుంబాన్ని చక్కదిద్దుకుంటుంది.

లింగమ్మ కథ సుఖాంతం కావడంతోనే రచయిత కథను ముగించవచ్చు. కానీ అక్కడితో రచయిత కథను ముగించలేదు. రచయిత శీలం భద్రయ్య కథను ప్రారంభించడంలోనూ, కథను ముగించడంలోనూ, చక్కని శిల్పాన్ని పాటించి, రచయితగా పాఠకుల హృదయస్పందనలను పట్టుకోవడంలో సఫలీకృతులయ్యారు. కథా ప్రారంభంలోనే ఫ్లాష్ బ్యాక్ టెక్నిక్ తో రచయిత కథను ప్రారంభిస్తారు. ఫ్లాష్ బ్యాక్ టెక్నిక్ ద్వారా రచయిత పాఠకులకు ఉత్కంఠతను కలిగిస్తాడు. కథ వెంబడి పరుగులు తీసేలా, చక్కని తెలంగాణ మాండలిక పదాలు అయిన ఎగ నాకుడు ( నుదుటి భాగంలో జుట్టు లేక పోవటం), జాలారు ( బట్టలు ఉతుక్కునే, అంట్లు తోముకునే స్థలం), భటువు (ఉంగరం), లత్త (దరిద్రం), ఇగురం ( పద్ధతి), వంటి నల్గొండ జిల్లా మాండలిక పదాలను ప్రయోగించాడు. కథ అంతా తెలంగాణ యాసతో "బిడ్డచ్చిన వేళ గొడ్డచ్చిన వేళ" , "కుడితిల పడ్డ ఎలుకయ్యింది" వంటి సందర్భానుసార సామెతలతో నడిచింది. కథా నేపథ్యం సహజంగా ఉంది.

లింగమ్మ తన కుటుంబంతో సంతోషంగా కాలం వెళ్లదీస్తున్నది. అనుకోకుండా ఓ రోజు బిచ్చగాడి రూపంలో, తనను నిరాకరించిన పెళ్ళికొడుకు మల్లయ్య తారసపడతాడు. మల్లయ్యని చూడగానే లింగమ్మలో గతం తాలూకు జ్ఞాపకాలు మెదులుతాయి. మల్లయ్య మతిస్థిమితం కోల్పోయి, నిరాశ్రయుడయ్యాడు అని తెలుసుకొని, అతన్ని ఆ స్థితిలో చూసి లింగమ్మ చలించిపోతుంది. తన భర్తకు, కుటుంబ సభ్యులకు విషయం అంతా చెప్పి, మల్లయ్య ఆరోగ్యం కుదుటపడే వరకు లింగమ్మ తన ఇంట్లోనే అతనికి ఆశ్రయం కల్పిస్తుంది. ఈ విధంగా రచయిత కథను ముగించారు.

ముగింపు సహజత్వానికి దూరంగా, కొంత కాల్పనికత ధోరణిలోనడిచింది అని అనిపిస్తుంది. కానీ పాఠకులకు వాస్తవికతతో పాటుగా కల్పనను జోడించి చెప్పినట్లయితేనే, రచన పట్ల అభిరుచి పెరుగుతుందని, రచనకు చదివించే లక్షణం ఉండాలంటే, కొన్ని ప్రమాణాలు పాటించక తప్పదని రచయిత శీలం భద్రయ్య గారి అభిప్రాయం కావచ్చు. పాఠకుల్లో పఠనీయతను పెంపొందించే దిశలో కొంత అవాస్తవీయత ఉన్నప్పటికీ, సమాజానికి చేరాల్సిన సందేశాన్ని మాత్రం రచయిత శీలం భద్రయ్య, తన కథలో ఎంతో లోతుగా ప్రస్తావించారు. సమాజంలో పాతుకుపోయి ఉన్న మూఢవిశ్వాసంపై అక్షరాన్ని అస్త్రంగా చేసుకొని సంధించాడు. సమాజంలో ఎన్నో

మూఢ విశ్వాసాలు ఉన్నాయి. ఆ మూడవిశ్వాసాల్నీ నిర్మూలించి, సమాజ పురోభివృద్ధిలో తోడ్పడవల్సిన బాధ్యత మన అందరిది. ఈ కథ ద్వారా రచయిత శీలం భద్రయ్య తన బాధ్యతను నిర్వర్తించడంలోనూ, సమాజ శ్రేయస్సులోనూ భాగస్వాములయ్యారు. తన అనుభవంలోకి వచ్చిన సంఘటనను కథగా మలిచి, లింగమ్మ పాత్ర ద్వారా మూఢవిశ్వాసాలు అనేవి సరైనవి కావు అని నిరూపించారు. మూఢ విశ్వాసాలను మనమే ఏర్పరచుకొని, ఒక అభద్రతా భావానికి లోనవుతాం. వాటిని బలంగా నమ్ముతాం. వాటి వల్ల మానసిక ప్రశాంతత దెబ్బతింటుంది మనోవైకల్యానికి దారితీస్తుంది.

**ముగింపు:**

మన వ్యక్తిత్వం, కష్టపడే తత్వం, ఆత్మవిశ్వాసం అనేవి మనల్ని ఉన్నత స్థాయికి చేరుస్తాయని, అంతేగాని శారీరక లోపాలు మన ఎదుగుదలకు ఆటంకాలు కావని గ్రహించాలి. మూఢవిశ్వాసాల్ని వదిలివేసి, ముందుగా మనల్ని మనం సంస్కరించుకోవాలి. అప్పుడే జీవితంలో ఎన్ని ఒడిదుడుకులు ఎదురైనా లెక్కచేయక, స్వయంకృషితో ముందడుగు వేయగలుగుతారు.

లింగమ్మను దారిద్రానికి సంకేతంగా భావించడానికి కారణం ఆమెకు ఉన్న ఒకే ఒక్క శారీరక లోపం ఎగానాకుడు. ఆ ఎగనాకుడు వల్లే ఆమె ఎన్నో అవమానాలకు గురైంది. అయినా తన వ్యక్తిత్వంతో మూఢ విశ్వాసాన్ని తిప్పికొట్టి, దరిద్రురాలు అన్న వారి నోరు మూయించింది. రచయిత శీలం భద్రయ్య సమాజాన్ని మేల్కొలిపి, ప్రభావితం చేసేలా, "మూఢవిశ్వాసాలపై గొడ్డలి పెట్టు లా" సామాజిక బాధ్యతతో కూడిన సందేశాన్నిచ్చేలా ఈ కథను అందించారు.

**ఆధార గ్రంథాలు:**


- భద్రయ్య. శీలం, లొట్టపీసు పూలు (తెలంగాణ కథలు),"లత్తె" కథ, శీలం ప్రచురణలు, నల్గొండ, ప్రథమ ముద్రణ: జూలై 2021.
- వెంకట సుబ్బయ్య, వల్లంపాటి. *కథాశిల్పం* ,ప్రథమ ముద్రణ (జనవరి,1995), విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్, హైదరాబాద్


********

# 11. 'కడుపు మీద కొట్టకుం(డి' దళిత కవితా సంకలనంలో సామాజికత

**గజవెల్లి ఈశ్వర్**

అసిస్టెంట్ (ప్రొఫెసర్ ఆఫ్ తెలుగు

తెలంగాణ సారస్వత పరిషత్ ఓరియంటల్ కళాశాల,

హైదరాబాద్. తెలంగాణ.

చరవాణి : 8341821965

మెయిల్ : gajavelli.eeshwar@gmail.com

**కీలక పదాలు :** ఆత్మగౌరవ (ప్రకటన, సాహిత్యపు తిరుగుబాటు, బహుజన రాజ్యాధికారం, దళిత ఉనికి, అస్తిత్వం, దళిత భాష, ఆవేశం, ఆర్తి, అనుభూతి, వాస్తవికత.

**ప(త ముఖ్య ఉద్దేశ్యం :**

సమాజాన్ని విడిచి సాహిత్యం, సాహిత్యాన్ని విడిచి సమాజం మనలేవు. ఇవి పరస్పరం ఒకదానికొకటి ఆకరాలు, పూరకాలుగా ఉంటాయి. 1930 లలో జాషువా, కుసుమ ధర్మన్న లాంటి కవులు దళిత సాహిత్యానికి ఒక బలమైన భూమికను పునాధిగా ఏర్పరచారు. ఆ పునాది 80, 90 దశకాల్లో ఒక (క్రమపద్ధతిని సంతరించుకుని స్థిరపడింది. ముఖ్యంగా 80వ దశకాల్లో దళిత సాహిత్యంలో బలమైన, కొత్త గొంతులు వినిపించాయి. విశ్వవిద్యాలయాలలో విద్యను అభ్యసిస్తున్న దళిత విద్యార్థులు తమ అనుభవాల నేపథ్యంలో కొత్త (ప్రశ్నలను దళిత కోణం నుండి లేవనెత్తి సాహిత్యం ముందు ఉంచారు.

మానవ సారం లేని పదాల కూర్పుగా దళిత సాహిత్యం ఉండడాన్ని, సామాజిక చైతన్యం లేకుండా సాహిత్యం ఉండడాన్ని దళిత సాహితీకారులు నిరసించారు. తమ సాహిత్యంలో సమాజానికి అవసరమైన మానవీయ విలువల్ని కూడగట్టి, మానవ అనుభవాల సామాజిక నేపథ్యంలో సాహిత్య సృష్టి చేశారు. అలా సాహిత్యంలో కొరవడుతున్న మానవీయ విలువల్ని, అంతిమంగా మనిషి అస్తిత్వానికి ఆలంబనగా దళిత కవిత్వం సృష్టించబడుతూ వచ్చింది.

గుండెడప్పు కనకయ్య సంపాదకత్వం వహించిన 'కడుపు మీద కొట్టకుం(డి' అనే ఈ దళిత కవితా సంకలనం పూర్తిగా మనిషి, సమాజం కేం(ద్రంగా ఒక బలమైన చర్చను లేవనెత్తింది. సమాజంలో మృగ్యమైన మానవీయ విలువల్ని, మనిషి మనిషిగా తనను తాను కోల్పోయిన వైనాన్ని అనేక కోణాల నుండి ఈ సంకలనంలోని కవులు చి(తించారు. ఈ సంకలనంలోని కవులలో ఆవేశం కంటే ఆర్తి, అనుభూతి కంటే అనుభవానికి, కల్పన కంటే వాస్తవికతకి ఎక్కువ (ప్రాధాన్యత ఇచ్చిన వైనం ఆకట్టుకుంటుంది.

(ప్రధాన సమాజానికి దూరంగా బతుకుతున్న దళితులు తమకు (ప్రధాన (స్రవంతి అయిన సమాజం నుండి ఎదురవుతున్న వివక్షను ఆర్తితో, అనుభవాల నేపథ్యంలో కఠిన వాస్తవిక సామాజికతని మన కళ్ళముందుంచే (ప్రయత్నం ఈ సంకలనంలో కనిపిస్తుంది.

**వివరణ :**

బలంగా పారుతున్న ఒక సెలయేరుని దారి మళ్ళించడం అనేది అత్యంత సాహసం, సవాళ్ళతో కూడిన (ప్రక్రియ. దానికి కొందరి (ప్రయత్నం, కొందరి సహాయం అవసరం. తెలుగు సాహిత్యపు తొలినాళ్ళలో వేసుకున్న నమ్మకాలను, ఆనవాళ్ళను సవాల్ చేస్తూ దళిత సాహిత్యం (ప్రవేశించే నాటికి దళిత వాదానికి ఒక భూమిక, సిద్ధాంతరూపు లేదు. అటువంటి సందర్భంలో దళిత సాహిత్యానికి తెలుగులో మద్ధతు (ప్రకటించి, భుజం ఇచ్చి నిలిచిన వారు ఇద్దరున్నారు. వారు విప్లవకవులు, బి.సి వాద కవులు. దళిత మేనిఫెస్టో, చిక్కనవుతున్న పాట ల ద్వారా వారు వారి మద్ధతును తెలిపారు. విప్లవ, బి.సి వాద కవులు కూడా వారు సమాజపు యొక్క నిచ్చెన మెట్ల

వ్యవస్థలోని అసమానతలను ప్రశ్నిస్తూ వచ్చిన వారే. అందుకే వీరు దళిత కవిత్వపు తాత్త్వికతను బాగా అర్థం చేసుకోగలిగారు. అయితే మద్దతు ఇచ్చేవారు, దళితుల బాధల గురించి రాసే బి.సి వాద కవులు రాసే సాహిత్యాన్ని దళిత సాహిత్యం అనవచ్చా అనే సందేహం వచ్చింది. ఆ సందేహాన్ని పటాపంచలు చేస్తూ సతీష్ చందర్ 'పాట పరాయి పల్లవి' (ఒక దశాబ్దాన్ని కుదిపేసిన దళిత కవిత్వం, 2016, పుట: 36) అంటూ రాశారు. దళితులు తమ వివక్షా బాధల అనుభవాల నుంచి రాసిందే నిజమైన గాఢతను, వాస్తవికతను కలిగి ఉంటుందని దళిత సాహిత్యకారులు అభిప్రాయపడ్డారు. ఈ అభిప్రాయం మూలంగా పుట్టిందే 'కడుపు మీద కొట్టకుండ్రి' దళిత కవితా సంకలనం.

**దళితులే తమ అనుభవాల్ని అక్షరాలుగా :**

అయిదుగురు దళిత కవులు, ఇద్దరు దళిత కవయిత్రులు రాసిన 45 కవితలు ఈ సంకలనంలో ఉన్నాయి. ఎన్నాళ్ళీ సహనం అంటూ సమాజాన్ని కవులు ప్రశ్నిస్తూ తమ ఆక్రోశాన్ని వెళ్ళగక్కుతున్నారు. కవులు, కవయిత్రులు అందరూ దళిత వర్గానికి చెందిన వారు కావటం మూలాన ఈ సంకలనంలోని కవితలు పదునుగా, సూటిగా, స్పష్టంగా సమాజాన్ని తూర్పార పట్టినట్టుగా కనిపిస్తున్నాయి. ప్రతి కవితలోనూ వారి వారి అనుభవ నేపథ్యంలోంచి కవులు మాట్లాడినట్టుగా పాఠకుడు అనుభూతి చెందడం ఈ సంకలనం యొక్క ప్రత్యేకత.

*ఇతివృత్తాల మూస ధోరణిలో*
*నా తల్లిని పని మనిషనే*
*నా తండ్రిని తోటమాలనీ*
*చిత్రించే ఊహల్ని ఇక*
*ఊహలుగానే మిగుల్చుకుంటాను*
*ఆ దేవుడే దిగొచ్చినా*
*మొదట ప్రాధాన్యత నా తల్లిదండ్రులకే*
*నేనిప్పుడు దళిత సౌందర్య తాత్త్వికుణ్ణి* *(వేంకటేశ్వరరావు, దార్ల, కడుపుమీద కొట్టకుండ్రి, పుట:34)*

ఈ కవిత్వంలో దార్ల వేంకటేశ్వరరావు తరతరాల ఇతిహాసాల చరిత్రని ఊహలుగా కొట్టిపడేస్తే తన ధిక్కారాన్ని ప్రకటిస్తాడు. దళితుల త్యాగాల్ని, ఈ సమాజపు నిర్మాణంలో వారి శ్రమ నిర్వహించిన పాత్రని తెలుగు సాహిత్యం పట్టించుకున్న పాపాన పోలేదు. నీచాతి నీచంగా దళితుల్ని అంటరాని వారుగా జమకట్టి పాలేర్లుగా, పాకీ పనివారుగా, తోట మాలిల్లా ముద్ర వేసింది. నిజానికి ఈ భూమిని చీల్చి, భూగర్భం నుంచి తిండి గింజలు తీసి కంచంలో పోసింది దళితులే. వారి శ్రమ లేకుండా జాషువా అన్నట్లు 'సస్యరమ పండి పులకింప సంశయించు' అటువంటి నిర్మాణాత్మక పాత్ర పోషించిన వారిని నీచంగా చూడటాన్ని ఆక్షేపిస్తూ దేవుడే దిగి వచ్చినా నేను నా తల్లిదండ్రులకే ప్రాధాన్యమిస్తా అంటాడు కవి. అది సరికొత్త దళిత తాత్త్వికతగా ప్రకటిస్తాడు. ఇందులో దళిత ఆత్మగౌరవం మనకి కనిపిస్తుంది.

*సమాజ ఆలోచన పొదల్లో జిక్కి*
*భూతలం నిండా కక్ష్యాతోరణాలు గట్టుకొని*
*ఒంటినిండా ఈర్ష్యా మాలలు ధరించి*
*నిప్పుల్లో పరుగెడుతూ*
*సితులను అంటిస్తూనే ఉంది* *(సుధాకర్, భట్టు. కడుపుమీద కొట్టకుండ్రి, పుట: 38)*

దళితుల అనుభవాలు అందరిలాంటి అనుభవాలు కావు. వివక్షల ముళ్ళ పొదల్లో నుండి సుదూర స్వప్నాల్ని కాంక్షిస్తారు వాళ్ళు. ఆ నేపథ్యంలో నుంచి వారి ఆలోచనలు, భావాలు వ్యక్తం అవుతాయి. వారి జీవితం, అనుభవం నుంచే ప్రతీకలు కవిత్వంలోకి వస్తాయి. ఒంటి నిండా ఈర్ష్యా మాలలు, తోరణాలు అనే ప్రతీకలు వాడడం ద్వారా తమకు అన్యాయం చేసిన మనువాదం పై కోపాన్ని ప్రకటిస్తున్నాడు కవి. సమాజపు ఆలోచన కులం అనే ముళ్ళపొదల్లో చిక్కుకుంది అని ఆక్రోశం వెలిబుచ్చుతున్నాడు.

**దళిత స్త్రీ ఆత్మగౌరవ ప్రకటన :**

తెలుగు సాహిత్యంలో మొదటి నుండి రాసింది పురుష కవులే. అక్కడక్కడా కొందరు స్త్రీలు కవిత్వం రాసినా అడుగడుగునా వారికి ఆంక్షలే ఎదురయ్యాయి. దీనికి కారణం పురుషాధిక్య భావజాలం. దళిత కవిత్వం దీనికి మినహాయింపు ఏమీ కాదు. కాని ఈ వర్గంలో చదువుకున్న స్త్రీల శాతం చాలా తక్కువ. అలా తమదైన స్త్రీ కోణం నుండి ఈ సంకలనంలో కవయిత్రులు కవిత్వం రాశారు.

*'గింజ ఎదిగింది, పెద్దదై నిలుచుంది*

*తలెత్తి చూసి మాట్లాడింది*

*నునువెచ్చటి అనుభూతితో*

*భూ కౌగిట్లో బంధీగా కురువంగనే*

*పాయలోలె ఇచ్చుకుని*

*నవనవలాడే మరో కొమ్మకు జీవమిత్తూ*

*తానొక సృష్టికర్తగా ఉండాలంటారు*

*ఈసారి నేను ఉండకూడదనుకుంటే...? (యం. రాజేశ్వరి, పుట: 39)*

స్త్రీ ఎప్పుడూ పురుషుడికి సుఖాన్ని ఇచ్చే సాధనంగానే ఉండాలి అనే భావన పురుషుడిలో ఉంది. తమ స్వీయ అస్తిత్వాన్ని, ఉనికిని సాహిత్యలోకి తీసుకొచ్చి పురుషాధిక్య భావనను విచ్ఛిన్నం చేశారు కవయిత్రులు. అసలు తను వికసించకుండా, నిరసన ప్రకటిస్తే అసలు ఈ సృష్టి నిలుస్తుందా, యం. రాజేశ్వరి తన కవిత్వంలో సృష్టినే స్తంభింపచేసే ప్రశ్నని సంధించింది.

**దళిత ఈ స్తటిక్ :**

దళిత సాహిత్యకారులు తమ పద ప్రయోగాల్ని, ప్రతీకల్ని, భావచిత్రాల్ని మిగతా కవుల కంటే భిన్నంగా వాడతారు. వారి భావజాలం, వివక్ష అనుభవం, వివిక్షకు గురి చేసే వారి సమూహాలు మొదలైన కారణాల దృష్ట్యా దళిత ఈస్థటిక్ వేరుగా ఉంటాయి. సంప్రదాయ కవిత్వ పద్ధతులను నియమాలను తోసిపెట్టి సరికొత్త కవితా చిత్రాలతో ముందుకొచ్చారు. దళిత కవులు. 'కడుపు మీద కొట్టకంప్రి' కవితా సంకలనంలో కూడా దళిత ఈస్థటిక్స్ సరికొత్తగా కనిపిస్తాయి.

*ఇది తప్పెట్లు ఉప్పెనలవుతున్న కాలం*

*మీ తోళ్ళు జాగ్రత్త (కాకాని సుధాకర్, పుట: 4)*

*సీసం కరిగిపోయిన చెవుల్ని ఏ రాక్ నుండో*

*విందుల కాహ్వానిస్తూ వేద ఘోషలు ? (దార్ల వేంకటేశ్వరరావు, పుట:02)*

*జమిడిక మోతలో నీకు*

*రహమాన్ సంగీతాన్ని వినిపిస్తాను. (జిలుకర శ్రీనివాస్, పుట: 37)*

*మరోక్షణంలో పండంటి నెత్తుటి మాటను కకనిపెడతాను*

*ఆ మాటను నీ ఈస్థటిక్ చనుబాలనిచ్చి చంపేయకు అది నా రక్తపు ముద్ద (జిలుకర శ్రీనివాస్, పుట: 58)*

పై కవితా పంక్తులలో ఉన్న ప్రతీకలు, కవితా చిత్రాలు దళిత సాహితీకారులకే ప్రత్యేకం. తప్పెట మోతలతో ఉప్పెన సృష్టించడం, ఎద్దు తోళ్ళని వలిచే సులువు తెలిసిన మాకు మీ వంటి తోళ్లు ఒలవడం పెద్ద పనేమీ కాదు అని హెచ్చరించడం, చెవులల్లో సీసాలు కరిగించి పోయించుకోవడం, ఈస్థటిక్ నియమాలతో నా కవిత్వాన్ని చూడకు అని ధిక్కారం ప్రకటించడం ఇవన్నీ ఈ సంకలనంలో దళిత కవులు చూపించిన కవిత్వ తాత్త్విక రూపాలు.

**ముగింపు :**

దేశంలో సంభవించిన కొన్ని అమానవీయ సంఘటనల వల్ల దళిత ఉద్యమం తీవ్రరూపం దాల్చింది. తత్ఫలితంగా దళిత సాహిత్యం సాంఘీక న్యాయాన్ని, సామాజిక పరివర్తనని కాంక్షిస్తూ ముందుకు సాగింది అన్ని రంగాలలో దళితులు తమ వాటాని ప్రాతినిధ్యాన్ని డిమాండ్ చేస్తారు. ఈ సాహిత్యం, ఉద్యమం మొత్తంగా ఒక సమానత్వంతో కూడిన సామాజికతని కలగన్నాయి. కడుపుమీద కొట్టకుంద్రి సంకలనంలో కూడా ఇదే సామాజికత మనకు కనిపిస్తుంది.

గుండెడప్పు కనకయ్య ఈ సంకలనాన్ని ఏ ఉద్దేశ్యంతో తీసుకువచ్చారో ఆ ఉద్దేశ్యాల్ని ఈ కవితా సంకలనం నెరవేర్చింది. వివిధ దేశంలోని ఉద్యమ సాహిత్యాలన్నింటికంటే తెలుగు నేలలోని దళిత ఉద్యమం, తత్ఫలితంగా వచ్చిన ఉద్యమ సాహిత్యం భిన్నంగా కనపడుతుంది. ఎందుకంటే తెలుగు నేలలో దళితులపై సాగిన అమానవీయ గమనకాండలు అన్నీ ఇన్నీ కావు. పదిరికుప్పం, కారంచేడు, చుండూరు, నీరుకొండ, వేంపేట వంటి దుస్సంఘటనలు దళిత కవులలో ఒక తీవ్రమైన ఆవేశాన్ని ఆగ్రహాన్ని దేరెత్తించాయి. అందుకే ఇక్కడి దళిత సాహిత్యంలో తిరుగుబాటు బావుటా రెపరెపలాడుతూ ఎగురుతూ ఉంటుంది.

**వనరుల జాబితా :**


1. కనకయ్య గుండెడప్పు,(సం), 2001, కడుపుమీద కొట్టకుంద్రి, సంకలనం, ఏ.పి దళిత్ రీసెర్చ్ సెంటర్, హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటి.

2. తెలంగాణ సారస్వత పరిషత్తు, శివారెడ్డి ఎల్లూరి(సం) 2020, తెలంగాణ దళిత సాహిత్యం, సంస్కృతి, కళారూపాలు, హైదరాబాద్.

3. ఎల్లయ్య వేముల, కక్క, 2014, ప్రజాశక్తి ప్రచురణలు, హైదరాబాద్.

4. అశోక్ కుమార్, కె.పి(సం), 2018, దళిత గీతాలు, నవ తెలంగాణ పబ్లిషింగ్ హౌజ్, హైదరాబాద్.

5. యాదయ్య గ్యార, 2001, రంపెకోత, దళిత పాటలు, దళిత సాంస్కృతిక వేదిక, హైదరాబాద్.


********

# 12. భాషా పరిరక్షణలో "పరిషత్తు"

**డా. బండారి ప్రేమ్ కుమార్**

అసిస్టెంట్ ప్రొఫెసర్,

తెలంగాణ సారస్వత పరిషత్తు ప్రాచ్య కళాశాల,

బొగ్గులకుంట, హైదరాబాదు.

ఫోన్ నం. 9492788752

మెయిల్: bandari.premkumar2014@gmail.com

**ఉపోద్ఘాతం:**

తెలుగు భాషను వ్యవహరించే రాష్ట్రాలలో ఇతర భాషలు రాజ్యమేలుతున్న తరుణంలో తెలుగు భాషా వ్యాప్తికై ఎన్నో సంస్థలను ఏర్పాటు చేశారు. వీటి ద్వారా భాషా విస్తృతిని పెంచి తెలుగు మాట్లాడేవారిలో ఆత్మస్థైర్యాన్ని పెంపొందించడానికి ఈ సంస్థలు ఎంతగానో కృషి చేశాయి. ఈ సంస్థల కృషివల్లే మన భాషా మూలాల్ని ముందు తరాలకు అందించగలుగుతున్నాము. అటువంటి సంస్థలలో తెలంగాణ సారస్వత పరిషత్తు ఒకటి.

భాషకు జీవం పోయడంలో భాషా విస్తృతికి 'తెలంగాణ సారస్వత పరిషత్తు' ఎంతగానో దోహదపడింది. భాషా పరిరక్షణకు ఎంతోమంది తమ ఆస్తుల్ని పణంగా పెట్టిన భాషా పరిరక్షణ సంస్థల్లో తెలంగాణ సారస్వత పరిషత్తును ప్రముఖంగా పేర్కొన వచ్చును. తరాలు మారుతున్న కొద్దీ భాషాభిమానుల ఆలోచనలకు, అభిరుచులకు అనుగుణంగా, పరిషత్తు కూడా నిత్య నూతనత్వాన్ని ఆపాదించుకుంటూ భాషా విస్తృతకై విభిన్నమైన, వినూత్నమైన కార్యక్రమాలకు శ్రీకారం చుడుతుంది. భాష ,సాహిత్యం, సంస్కృతి తెలుగుజాతి అస్తిత్వాన్ని చాటి చెప్పే అంశాలు. జాతి మనుగడను ఇనుమడింప చేయడంలో తెలుగు సంస్కృతి, సాంప్రదాయాలు, ఆచార వ్యవహారాలను ప్రపంచంలోని నలు దిశల వ్యాపింప చేయడంలో ఎన్నో సాహితీ సంస్థలు ఏర్పడ్డాయి.

సాహిత్య విస్తృతిలో సంస్థలకు ఎన్నో ఒడిదుడుకులు ఏర్పడిన తరుణంలో వాటిని నిలిపివేయడం జరిగింది. కానీ అన్నింటిని తట్టుకొని, ప్రభుత్వ వైఖరికి వ్యతిరేకంగా ఉద్యమించి, ఆనాటి నుంచి ఈనాటి వరకు సాహితీ విస్తృతిలో ముందంజలో ఉన్న, ఏకైక సంస్థ తెలంగాణ సారస్వత పరిషత్తు. ఎన్నో చారిత్రక, రాజకీయ, సాంస్కృతిక , సామాజిక కారణాలు పరిషత్ ఆవిర్భావానికి దారితీసాయి. ఎంతో మంది మహనీయుల కృషి ఫలితంగా పరిషత్తు, దశలవారీగా తన సాహిత్య కార్యక్రమాలను నిర్వహిస్తూ, వినూత్నమైన కార్యక్రమాలతో ఎప్పటికప్పుడూ కొత్తదనాన్ని జోడించుకుంటూ, సాహితీ లోకంలో అగ్రగామిగా నిలిచింది. నిజాం రాష్ట్ర ఆంధ్ర సారస్వత పరిషత్తు, ఆంధ్రసారస్వత పరిషత్తు, తెలంగాణ సారస్వత పరిషత్తు అంటూ పేర్లు మార్చుకున్నా, పరిషత్తు లక్ష్యం ఒకటే. అదే భాషా, సాహిత్య, సంస్కృతుల పరిరక్షణ. తెలంగాణ సారస్వత పరిషత్తు నిర్వహిస్తున్న కార్యక్రమాలు సాహిత్య సేవలో తమ ప్రత్యేకతను చాటి చెప్తున్నాయి. ప్రస్తుతం మరికొన్ని విశిష్టమైన సాహిత్య కార్యక్రమాల పరంపరతో సాహిత్య అభిమానులకు మరింతగా చేరువవుతూ, సాహిత్య పిపాసను పెంపొందించే దిశగా కృషి చేస్తుంది. సాహిత్య అభిలాషను కలిగించి, సాహితీ వాతావరణాన్ని పెంచి పోషించడమే ధ్యేయంగా తెలంగాణ సారస్వత పరిషత్తు, ప్రణాళిక బద్ధమైన కార్యక్రమాలను రూపొందిస్తుంది.

**తెలంగాణ సారస్వత పరిషత్తు ఆవిర్భావం:**

1921వివేకవర్ధని పాఠశాలలో నిజాం రాష్ట్ర 'హిందూ సంఘ సంస్కార సభ'లో ఆంధ్రులకు జరిగిన అవమానంతో మనస్తాపం చెందిన ఆంధ్రులు టేకుమల్ల రంగారావుగారి గృహంలో ఆంధ్రజన సంఘాన్ని స్థాపించారు. 11మంది సభ్యులతో కూడిన

ఆంధ్రజనసంఘం భాషా విస్తృతికై అనేక కార్యక్రమాలను ఏర్పాటు చేయాలనుకున్నారు. ఆంధ్ర జనసంఘం ఆవిర్భవించిన తరువాత దాని ప్రేరణతో జిల్లాలోని వివిధ శాఖలు ఆవిర్భవించాయి. ఆంధ్రజన కేంద్ర సంఘం (1923)లో ఏర్పాటు చేయబడింది. ఆంధ్ర జనసంఘం 1930 లో ఆంధ్రమహాసభగా రూపాంతరం చెందింది. ఈ ఆంధ్రమహాసభ ద్వారా 12 సభలు జరిగాయి. ఈ సభ ఎక్కువగా రాజకీయ అంశాలకే ప్రాధాన్యత ఇస్తూ ఉండటంవల్ల భాషాభిమానులు, పూర్తిగా సాహిత్యానికే పరిమితమైన సంస్థ ఉండాలని భావించారు. ఆ సమయంలో వాళ్ళ ఆలోచనల్లోంచి, 1943లో రెడ్డి హాస్టల్ ప్రాంగణంలో కార్యరూపం దాల్చిందే నిజాం రాష్ట్రాంధ్ర సారస్వత పరిషత్.

1943లో లోకనంది నారాయణ అధ్యక్షతన రెడ్డి హాస్టల్లో నిజాం రాష్ట్రాంధ్ర సారస్వత పరిషత్ 11 మంది సభ్యులతో ఏర్పాటు చేయబడింది. నిజాం రాష్ట్రం నుండి స్వాతంత్ర్యం పొందిన తర్వాత దీనికి ఆంధ్ర సారస్వత పరిషత్తుగా నామకరణం చేయడం జరిగింది. తెలంగాణ రాష్ట్ర ఆవిర్భావ అనంతరం 2015 ఆగస్టులో 'తెలంగాణ సారస్వత పరిషత్తు'గా రూపాంతరం చెందింది.

**సాహిత్య వ్యాప్తి – భాషా పరిరక్షణ:**

పరిషత్తు తెలుగు భాష పరిరక్షణకోసం వైవిధ్యమైనటువంటి కార్యక్రమాలెన్నింటినో చేపట్టింది. భాషా విస్తృతిలో భాగంగా పరీక్షల నిర్వహణకోసం రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో పరీక్షా కేంద్రాలను ఏర్పాటు చేశారు. వయోజన విద్యా పాఠశాలలు స్థాపించి, వయోజన విద్యకొరకు సదస్సులు, సమావేశాలు, గ్రంథాలయాలు, పుస్తక విక్రయశాల, తెలుగు పండిత శిక్షణ కళాశాల, ప్రాచ్య కళాశాలలు ఏర్పాటు చేసింది. అనేక విలువైన పుస్తకాలెన్నింటినో ముద్రించడం సంస్మరణ సభలు, స్మారక ఉపాన్యాసాలు, కార్యశాలలు, చర్చాగోష్టులు, పురస్కార ప్రధానోత్సవాలు, పరిణతవాణి ప్రసంగాలు వంటి వినూత్నమైన కార్యక్రమాలు నిర్వహిస్తుంది.

తెలంగాణ ప్రాంతంలో ఈ సంస్థ ఆరంభం నుంచి నేటివరకు నిర్విరామంగా తన కార్యకలాపాలను కొనసాగిస్తూ భాషా సాహిత్యాల పరిరక్షణలో ప్రముఖ పాత్ర పోషిస్తుంది. భాషావ్యాప్తి కోసం పరిషత్తు విశారదా పూర్వభాగం, ఉత్తరభాగం ప్రవేశపరీక్షలను ఏర్పాటు చేసి పరీక్షల నిర్వహణ ద్వారా తెలుగుపై ఆసక్తి గలవారికి ఉన్నత స్థాయిలో విద్యా, ఉద్యోగ పదోన్నతుల కోసం వెసులుబాటు కల్పించింది. విశారదా పరీక్షను సెకండ్ లాంగ్వేజ్ పరీక్షకు సమానంగా ప్రభుత్వం గుర్తించడం జరిగింది. పరీక్షల నిర్వహణ హైదరాబాద్ కేంద్రానికే పరిమితం కాకుండా రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో పరీక్ష కేంద్రాలను ఏర్పాటుచేసి భాషావ్యాప్తికై భగీరథ ప్రయత్నానికి పరిషత్తు పూనుకుంది.

ఈ విధమైన పరీక్షల ద్వారా ఎంతోమంది ఔత్సాహికులైన ఉపాధ్యాయులను తయారుచేసి తెలుగు భాషా మూలాలను నలువైపులకు ప్రసరింపజేయడానికి పరిషత్తు కారణమైంది. పరిషత్తు తెలుగు పరీక్షల నిర్వహణతోపాటు నిరక్షరాస్యత నిర్మూలనకోసం ఎంతగానో కృషి చేసింది. వయోజన విద్యా ప్రాముఖ్యతను తెలియజేయడంకోసం రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో సదస్సులు ఏర్పాటు చేసింది. వయోజన విద్య ద్వారా ఎంతోమందిని అక్షరాస్యులుగా మార్చడంలో, ఆనాటి సామాజిక స్థితిగతుల రీత్యా ప్రజల్లో చైతన్యం తీసుకురావడంలో పరిషత్తు పాత్ర ఎనలేనిది. అందులో భాగంగా (1950-54) రాష్ట్రమంతటా 34 వయోజన కేంద్రాలను ఏర్పాటు చేయడం జరిగింది.

తెలుగు పండితులకోసం ప్రత్యేకించి పరిషత్తు పండిత శిక్షణ కళాశాలను(1964)లో ఏర్పాటు చేసింది. వారికి శిక్షణనిచ్చి తెలుగు రాష్ట్రాలలో ఎంతోమంది తెలుగు ఉపాధ్యాయులుగా స్థిరపడటంలో ఎంతగానో కృషి చేసింది. సినారెగారు రాజ్యసభ సభ్యులుగా ఉన్నప్పుడు ప్రభుత్వ నిధులతో రెడ్డిల్యాబ్స్ అధినేత అంజిరెడ్డిగారి సౌజన్యంతో పండిత శిక్షణ కళాశాల భవన అంకురార్పణ జరిగింది. ఆనాటి సమాజంలో విద్యాసంస్థల్లో తెలుగు బోధించేవారే లేరు అన్న తరుణంలో పరిషత్తు ఎంతో మంది ఔత్సాహికులైనటువంటి

విద్యార్థులకు రాష్ట్రం లోని నలు మూలల తెలుగు అధ్యాపకులుగా స్థిర పడటానికి ఉపాధి అవకాశాలను కల్పించింది.ఒక వైపు నిరుద్యోగితను తొలగిస్తూ, తెలుగు భాషా పరిరక్షణకు వారదులను తయారు చేయడంలో పరిషత్తు సఫలీకృతమైంది.

దేశీయ భాషల పరిరక్షణకోసం, ప్రాంతీయ భాషల గొప్పతనాన్ని సమాజంలో నిలబెట్టడంకోసం ఏర్పాటు చేయబడిన కళాశాలలు ప్రాచ్య కళాశాలలు. ప్రాచ్య కళాశాలలో భాగంగా తెలుగు భాషా ఔన్నత్యాన్ని కాపాడటంకోసం నిష్ణాతులైన అధ్యాపకులను అందించడంకోసం ఈ కళాశాల ఏర్పాటు చేయబడింది. 1965 సంక్రాంతి నుంచి ఈ కళాశాల ప్రారంభమైంది. పిడిసి, బిఏఎల్, ఎమ్ఏఎల్ కోర్సుల నిర్వహణతో, తెలుగులో నిష్ణాతులైన విద్యార్థులను తయారు చేస్తుంది. ఈ కళాశాలలో దివాకర్ల వేంకటావధాని, పల్లా దుర్గయ్య, సినారె, పాకాల యశోదారెడ్డి, బిరుదురాజ రామరాజు వంటి సాహితీమూర్తులెందరో అధ్యాపకులుగా తమ సేవలను అందించారు. ప్రాచ్య కళాశాలలో చదివిన విద్యార్థులెందరో పాఠశాల, కళాశాల, విశ్వవిద్యాలయ స్థాయిల్లో ఉద్యోగ బాధ్యతల్ని నిర్వర్తిస్తున్నారు.

సదస్సులు, సభలు, సమావేశాలు నిర్వహించి ఆయా అంశాలపట్ల అవగాహన కలిగించి ప్రసంగకర్తలను సన్మానించడం. ప్రసంగకర్తలకు పురస్కారాలను ప్రధానం చేసి సాహిత్య రంగంలో వారు మరింత కృషి చేసేలా వారిని ప్రోత్సహిస్తుంది. సామాజిక, రాజకీయ, సాహిత్య, భాష సాంస్కృతిక రంగాలలో విశేషంగా కృషి చేసిన, వారి పేరిట సాహిత్య పురస్కారాలను ఏర్పాటు చేయడం జరిగింది.

**కార్యశాలలు:**

సాహితీవేత్తలతో విలువైన ప్రసంగాలు ఏర్పాటు చేయడం, వారి పేరుతో పురస్కారాలను ప్రధానం చేయడం, సంస్మరణ ప్రసంగాలు ఏర్పాటు చేయడం వంటివి పరిషత్ నిర్వహించే కార్యక్రమాల్లో పరిపాటి. కానీ ఈ కార్యక్రమాలకు భిన్నంగా పరిషత్తు, వక్త కేంద్రంగా కాకుండా వక్తలకు శ్రోతలకు మధ్య పరస్పర అవినాభావ సంబంధాన్ని కలిగించేందుకు విభిన్నంగా కార్యశాలలను ఏర్పాటు చేస్తుంది. వినడం దగ్గరే ఆగిపోకుండా, తమ ఆలోచనలను, అభిప్రాయాల్ని సందేహాల్ని నివృత్తి చేసుకునేందుకు సాహిత్య పాఠకులకు కూడా అవకాశాన్ని కలిగిస్తారు. సారస్వత పరిషత్ వేదిక ద్వారా తమ మేధాసంపత్తిని మరింతగా పెంచుకునేందుకు ఈ కార్యశాలలు ఎంతగానో ఉపయోగపడతాయి. కవిత్వం, పాట, నాటకం, కథ, నవల అంటూ విభిన్న ప్రక్రియలపై పరిషత్తు కార్యశాలలను నిర్వహిస్తుంది. ఈ కార్యశాలలకు ఆయా ప్రక్రియల్లో నిష్ణాతులైన, ప్రముఖుల్ని ఆహ్వానించి, వారి చేత సాహిత్య అభిమానులకు, సాహిత్య పాఠాల్ని అభ్యసన రూపంలో ఒరబడి దిద్దిస్తారు. ఈ కార్యశాలల్లో ఔత్సాహిక రచయితలకు తొలి అడుగులుగా, సాహిత్య ప్రస్థానం ప్రారంభించడానికి ఎంతగానో తోడ్పడతాయి. ప్రతి ప్రక్రియలోని మెళకువల్ని ఎంతో క్షుణ్ణంగా తెలుసుకోవడానికి, తమల్ని తాము సాహితీరంగంలో తీర్చిదిద్దుకోవడానికి, భవిష్యత్తులో ఉత్తమ రచయితలుగా ఎదగడంలో పరిషత్తు నిర్వహించే కార్యశాలలు కీలక పాత్ర వహిస్తాయి.

పరిషత్తు యువ రచయిత్రుల సమ్మేళనం పేరిట కార్యశాలను నిర్వహించింది. ఈ మహత్తరమైన కార్యక్రమం రూపొందించడంలో పరిషత్తు, సుదీర్ఘమైన ఆలోచన ప్రస్ఫుటం అవుతుంది. పరిషత్తు ఏ కార్యక్రమం నిర్వహించిన దాని వెనక సామాజిక ప్రయోజనం ఉంటుంది. అది అందరికీ ఆమోదయోగ్యంగా, దీర్ఘకాలిక ప్రయోజనాన్ని కలిగించే విధంగా రూపొందించడంలో పరిషత్తు ముందు చూపుతో వ్యవహరిస్తుంది. కుటుంబాన్ని చక్కదిద్దటంలో స్త్రీ పాత్ర ఎనలేనిది. స్త్రీ విజ్ఞతతో, సమయస్ఫూర్తితో వ్యవహరిస్తే ఆ కుటుంబ వ్యవస్థ పటిష్టంగా ఉంటుంది. ఇంట్లో స్త్రీ చదువుకుంటే ఆ కుటుంబాన్ని అక్షరాస్యత దిశలో నడిపించగలదంటారు కదా! అదేవిధంగా కేవలం స్త్రీలకు ప్రాధాన్యత ఇస్తూ, వారికి అవకాశం కల్పించినట్లయితే సాహిత్య వాతావరణంలో ఒక ఆరోగ్యవంతమైన పోటీ ఏర్పడుతుంది. తద్వారా సాహిత్య వ్యాప్తి త్వరితగతిగా జరుగుతుందనే ఒక మంచి ఆలోచనతో పరిషత్తు యువ రచయిత్రుల

సమ్మేళనాన్ని ఏర్పాటు చేసింది. ఈ కార్యక్రమంలో పాఠశాలల, కళాశాలల విద్యార్థినులు పాల్గొని, తమ రచనలను పరిచయం చేసుకున్నారు. అక్కడికి వచ్చిన సాహితీవేత్తలతో పరిచయాలు పెంచుకొని, వారి సూచనలు, సలహాలు తీసుకుని, భవిష్యత్తులో తమ రచనా వ్యాసంగాన్ని మరింతగా పెంపొందించుకునే దిశగా తెలంగాణ సారస్వత పరిషత్ వేదిక ద్వారా, యువ రచయిత్రులకు ఈ అవకాశాన్ని కల్పించింది. ఔత్సాహిక రచయితలు తమ బాధ్యతల్ని సమర్థవంతంగా నిర్వహించడంలో, సమాజాన్ని బాధ్యతాయుతంగా నడిపించడంలో పరిషత్తు పాత్ర ఎనలేనిది.

పరిషత్తు బాల సాహిత్యం పై ఎక్కువగా దృష్టిని కేంద్రీకరించింది. ఈ మధ్యే, బాల్యం నుంచే పిల్లల్లో, తెలుగు భాష ,సాహిత్యలపై మక్కువను పెంచేలా, వారిలో సృజనాత్మకతను వెలికితీస్తూ, బాలల సాహిత్యంలో భాగంగా, పిల్లల ద్వారా పుస్తకాలు రాయించి, ప్రచురించి, ఆవిష్కరించింది. చిన్న వయసులోనే భాషా, సాహిత్యాల వైపు మొగ్గు చూపేలా వారిని ప్రోత్సహిస్తూ, వారి ప్రతిభా పాటవాలకు మెరుగులు దిద్దిస్తూ, సృజనాత్మక రంగంలో వారి అడుగులు పడేలా కార్యక్రమాలెన్నింటినో రూపొందిస్తుంది. భాష సాహిత్యాల పరిరక్షణ విస్తృతి ఎక్కడ వేగంగా జరుగుతుందో? అక్కడ పరిషత్తు ముందుండి, భాషా సాహిత్యాల వ్యాప్తిలో ప్రముఖ పాత్ర పోషిస్తుంది.

**పరిణతవాణి ప్రసంగాలు:**

పరిషత్తు పరిణతవాణి అనే వినూత్నమైన కార్యక్రమాన్ని కూడా నిర్వహిస్తుంది. మొదట ఈ ప్రసంగాలను పరిషత్ అధ్యక్షులు ఆచార్య సి. నారాయణ రెడ్డి గారు ప్రారంభించారు. సాహిత్య రంగంలో విశేషంగా సేవలు అందించిన 65 ఏళ్లకు పైబడ్డ ప్రముఖుల్ని ఆహ్వానించి, వారి చేత ప్రసంగాలు ఇప్పించడం ఈ కార్యక్రమం ఉద్దేశం. సాహిత్య సృష్టిలో అనుభవ నైపుణ్యం, వయస్సు రీత్యా అనుభవం ఈ రెండు లక్షణాలను పరిగణలోకి తీసుకొని ప్రసంగకర్తలను ఎంపిక చేయడం జరుగుతుంది. 65 ఏళ్లకు పైబడి అంటే, అప్పటికే జీవితంలో ఎదురైన సంఘటనల ద్వారా, అనుభవాల ద్వారా, సమాజం పట్ల అవగాహన కలిగి ఉంటారు. అటువంటి వారి నోటి నుండి వచ్చే మాటలు పరిణతితో కూడి ఉంటాయి. కాబట్టి కార్యక్రమ లక్ష్యానికి అనుగుణంగా శీర్షికను కూడా ఎంతో ఔచిత్యవంతంగా పెట్టడం జరిగింది.

ఈ కార్యక్రమంలో ప్రసంగకర్తలు తమ జీవితానుభవాలను ఆత్మ కథన రూపంలో వ్యక్తీకరిస్తారు. ఆనాటి సామాజిక స్థితిగతులు, భాష, సంస్కృతి, సాహిత్యం ఎలా ఉండేవో చెబుతారు. వారి సాహిత్య ప్రస్థానం, ప్రముఖులతో ఉన్న సంబంధాలు, జీవితంలో వారు అధిగమించిన ఎత్తుపల్లాలు ఇలా అన్నింటిని ఒక క్రమ పద్ధతిలో, సమయాన్ని దృష్టిలో పెట్టుకుని చెబుతారు. ప్రసంగకర్తల స్వీయ అనుభవాల్లో ఆనాటి సామాజిక చరిత్ర తెలుస్తుంది. పరోక్ష కథనం కన్నా ప్రత్యక్ష కథనంలో ఎన్నో వాస్తవాలు తెలిసే అవకాశం ఉంటుంది. ప్రత్యక్ష కథనంలో ప్రసంగకర్తలు తమను పరిచయం చేసుకునే క్రమంలో, వారి కాలం నాటి సమాజాన్ని ప్రతిబింబిస్తూ, ఆనాటి జ్ఞాపకాలని యధాతథంగా మన ముందు ఉంచడానికి అవకాశం ఉంటుంది. వాస్తవాలు ఎక్కువగా ఈ ప్రసంగాల్లో ఆవిష్కృతమవుతాయి. వారి జీవితానికి సంబంధించిన పరిపూర్ణమైన వ్యక్తిత్వం మన కళ్ళ ముందు ఉంటుంది. ప్రసంగకర్తల సాహిత్య దృక్పథం, జీవిత దృక్పథం తెలుస్తాయి. ప్రసంగకర్తల జీవితపు పార్శ్వాల్ని చూడగలుగుతాం. వారి అంతరంగం ఆవిష్కరించబడుతుంది. భాషా విషయిక అంశాలు ఎన్నో వారి ప్రసంగాల్లో అలవోకగా వచ్చి చేరుతాయి. ఆ భాషా సంపదను ఒడిసి పట్టుకున్నట్లయితే, అపారమైన సాహిత్య సంపదను కాపాడుకోవచ్చు. సాహిత్యంలో చర్చనీయ అంశాలుగా ఉన్న, కొన్ని వాద, ప్రతివాదాలకు సమాధానాలు ప్రసంగకర్తల ప్రసంగాల్లో లభిస్తాయి. సాహిత్య వారధులుగా, విభిన్న రంగాల్లో ప్రముఖులు ఏ విధంగా కృషి చేస్తున్నారు? ఆ కృషి వెనక ఎదురయ్యే సవాళ్లు ఎలాంటివి? వాటిని వారు ఏ విధంగా అధిగమిస్తున్నారు? అనే అంశాలు తెలుస్తాయి. వివిధ మాధ్యమాల ద్వారా

సాహిత్య విస్తృతి ఏ విధంగా? జరుగుతుంది. ఆయా మాధ్యమాలు భాష, సంస్కృతి సాహిత్యాలకు ఏ విధంగా ప్రయత్నాలు చేపడుతున్నాయి. సాహిత్య వికాసంలో వాటి పాత్ర ఏ విధంగా ఉంది? అనే అంశాలు తెలుస్తాయి.

మొదట పరిణతవాణి ప్రసంగాలను 65 ఏళ్లకు పై బడ్డ వారితో ఏర్పాటు చేశారు. తర్వాత వయసును (60 ఏళ్లకు) కుదించి, ప్రత్యక్షంగా సాహిత్య సృజనలో పాలుపంచుకోకున్నా, స్వీయ రచనల్లో ప్రావీణ్యం లేకున్నా, సాహిత్యాన్ని పెంచి పోషించే దిశగా, సహాయ సహకారాలు అందిస్తున్న వారిని కూడా ప్రసంగకర్తలుగా ఎంపిక చేస్తున్నారు. తెలుగు వాళ్ళై, వివిధ అత్యున్నత పదవుల్లో ఉంటూ, భాష, సంస్కృతి, సాహిత్యాల అభివృద్ధికై అనేక కార్యక్రమాలు చేపడుతూ భాషా, సంస్కృతి, సాహిత్యాల వైభవానికి ఇతోధికంగా కృషిచేసిన, రాజకీయరంగ ప్రముఖులను కూడా పరిణత వాణి ప్రసంగాలకు ఆహ్వానించడం జరిగింది. సాహిత్యాన్ని సాధనంగా చేసుకుని, సామాజిక సేవా కార్యక్రమాల్లో పాలుపంచుకుంటూ, సామాజిక శ్రేయస్సును కాంక్షించి, బాధ్యతతో, సంఘసంస్కరణ కార్యక్రమాలు చేపట్టిన వారిని ప్రసంగకర్తలుగా ఎంపిక చేశారు. ఈ కార్యక్రమం తెలుగు వాళ్ళు సగర్వంగా చెప్పుకునే, కార్యక్రమాల్లో అగ్రస్థానంలో నిలుస్తుంది. తెలుగు భాష, సాహిత్యాల ద్వారా ఎటువంటి ఉపాధి అవకాశాలు లేవు అని, నిరుత్సాహంతో ఉన్న యువతకు, స్ఫూర్తిదాయకంగా ఈ ప్రసంగాలు ఉంటాయి. తెలుగు వాళ్ళు, తెలుగు భాష, సాహిత్యాల వారధులుగా మారి, అన్ని రంగాల్లో సృజనాత్మకతను ఆపాదించుకుని, సాహిత్యం ద్వారా ఆ రంగాలకు పరిపుష్టి కలిగించిన ప్రముఖుల జీవితాలు, వాటిని వారు ఆవిష్కరించుకున్న తీరు గమనిస్తే, తెలుగు భాషా, సాహిత్యాలపై అభిమానం పెరుగుతుంది. మాతృభాషలో ఉపాధి అవకాశాలపై యువత దృష్టిని సారిస్తుంది. ప్రముఖుల అనుభవాలు ద్వారా ఈనాటి తరం ఎంతో నేర్చుకోవాల్సి ఉంది. ఈ ప్రసంగాలు, యువత, తమను తాము తీర్చిదిద్దుకొని, భాషా సాహిత్య, సంస్కృతుల పరిరక్షణకై తమ వంతు బాధ్యతల్ని నిర్వర్తించేలా చేస్తాయి. ఈ పరిణతవాణి ప్రసంగాలు 80 మంది వ్యక్తుల ప్రసంగాలతో, 8 సంపుటాలుగా, పుస్తకాల రూపంలో వచ్చాయి. ఇప్పటికీ ,పరిషత్తు అధ్యక్షులు ఆచార్య ఎల్లూరి శివారెడ్డి, పరిషత్ ప్రధాన కార్యదర్శి డా. జుర్రు చెన్నయ్య గార్ల ఆధ్వర్యంలో, నిర్విఘ్నంగా పరిణతవాణి ప్రసంగాలు కొనసాగుతున్నాయి.

**నేను – నా రచనలు:**

పరిషత్తు ఈ మధ్యే నేను – నా రచనలు అనే కార్యక్రమాన్ని ప్రారంభించింది. పరిణతవాణి ప్రసంగాలు అనే కార్యక్రమం స్ఫూర్తితో ఈ కార్యక్రమాన్ని పరిషత్ అధ్యక్షులు ఆచార్య ఎల్లూరి శివారెడ్డి, ప్రధాన కార్యదర్శి డా. జుర్రు చెన్నయ్య గార్లు ప్రారంభించారు. పరిణతవాణి ప్రసంగాలు, నేను – నా రచనలు అనే కార్యక్రమాలకు కొంత వ్యత్యాసం ఉంది. ఈ రెండు కార్యక్రమాలలో ప్రసంగకర్తలు, తమ స్వీయ అనుభవాల్ని ఆత్మకథల రూపంలోనే వ్యక్తికరిస్తారు కానీ, వయసు పరిధి పరిణతవాణి ప్రసంగాలలో మాత్రమే కనిపిస్తుంది. పరోక్షంగా సాహిత్య సేవ చేస్తున్న వారి ప్రసంగాలు కూడా పరిణత వాణి ప్రసంగాలలో చోటుచేసుకున్నాయి.

నేను – నా రచనలు అనే కార్యక్రమంలో వయసు పరిధి లేదు. సాహిత్య సృజన అర్హతగా, రాశిలో కన్నా వాసిలో మేలైన రచనలు చేసిన వారిని కూడా ఈ కార్యక్రమానికి పరిషత్తు ఎంపిక చేస్తుంది. సాహిత్య ఒరవడి ఎలా జరిగింది? సాహిత్య ప్రస్థానంలో మొదటి ప్రయత్నం వంటి, సాహిత్య సంబంధిత అంశాలు ఎన్నో, ప్రసంగకర్తల ప్రసంగాల్లో చర్చకు వస్తాయి. ఆ అంశాలు ఈనాటి ఔత్సాహిక రచయితలకు, తమ రచనలను మరింత మెరుగు దిద్దుకోవటానికి ఉపయోగపడతాయి. ఈ కార్యక్రమం ఎంతో స్ఫూర్తిదాయకంగా ఉండి, సాహిత్య రంగంలో అడుగుపెట్టడానికి, తమ ప్రతిభ పాటవాలను ప్రదర్శించుకోవడానికి, ఆత్మవిశ్వాసాన్ని కలిగించేలా ఈ కార్యక్రమం రూపుదిద్దుకోవడం జరిగింది. వయసు పరిధి అనే అంశం పట్ల, నియమ నిబంధన లేనందు వల్ల, సాహిత్య ప్రముఖుల అంతరంగాలను, పలు ఆసక్తికర విషయాలను త్వరితగతిన తెలుసుకోవడానికి, సాహిత్య విస్తృతి వేగంగా జరగడానికి ఈ

కార్యక్రమం ఎంతగానో ఉపయోగపడుతుంది. ఎక్కువ స్థాయిలో సాహిత్య రంగ ప్రముఖుల చేత ప్రసంగాలు ఇప్పించడం ద్వారా, సాహిత్య పరిరక్షణ వేగంగా జరగడానికి అవకాశం ఉంటుంది. పరిషత్ రూపొందిస్తున్న ఏ కార్యక్రమమైనా సమాజానికి అనుగుణంగా, కొంత నూతనత్వాన్ని జోడించుకొని, ఇతర సాహిత్య సంస్థల కంటే భిన్నంగా కార్యక్రమాల్ని రూపొందిస్తూ, సాహిత్య సంస్థల్లో తలమానికంగా నిలుస్తుంది. నేను – నా రచనలు అనే కార్యక్రమం ద్వారా ఇప్పటివరకు ప్రముఖ సాహితీవేత్తలు అయిన, సలీం, మంగారి రాజేందర్ (జింబో),

డా. M.పురుషోత్తమాచార్యలు గారితో కలిపి మూడు ప్రసంగాలను ఏర్పాటు చేశారు. ఈ ప్రసంగకర్తల ప్రసంగాలను కూడా పుస్తకాలుగా, సంపుటాల రూపంలో తీసుకువచ్చేందుకు, పరిషత్తు, ప్రచురణ కార్యక్రమానికి శ్రీకారం చుట్టింది.

**ముగింపు:**

తెలంగాణ సారస్వత పరిషత్తు భాషా పరిరక్షణలకై చేసిన కృషిలో ఎప్పుడూ అగ్రస్థానంలో ఉంటుంది. సమాజంలో వస్తున్న మార్పుల దృష్ట్యా, తెలుగు భాష, సంస్కృతి సాహిత్యాలను పరిరక్షించుకునేందుకై పరిషత్తు ఎప్పటికప్పుడూ నిత్య నూతనత్వాన్ని ఆపాదించుకుంటూ విభిన్నమైన కార్యక్రమాలతో ముందంజలో ఉంటుంది. ప్రస్తుత తరానికి తెలుగు భాష సంస్కృతుల పట్ల మక్కువను కలిగించేలా ఎన్నో విశిష్టమైన కార్యక్రమాల పరంపరలో పరిషత్తు దూసుకుపోతుంది. ముఖ్యంగా యువతరంలో భాషాభిమానాన్ని పెంపొందించేలా తెలుగు భాష వారధిగా, సృజనాత్మక రంగంలో నైపుణ్యాలు అలవడేలా కార్యశాలలను నిర్వహిస్తుంది. వాటి ద్వారా తెలుగు భాష, సంస్కృతి, సాహిత్యాలను విస్తృతం చేయటమే లక్ష్యంగా పనిచేసినప్పటికీ, రాబోయే రోజుల్లో యువతరం తెలుగు భాష, సాహిత్యాల పట్ల మంచి ప్రావీణ్యతను సంపాదించుకొని, విభిన్న రంగాల్లో ఉపాధి, ఉద్యోగ అవకాశాలు పొంది, తెలుగు భాషను పరిపుష్టం చేస్తారనే ఒక గొప్ప ఆలోచనతోనే పరిషత్తు, భాషా పరిరక్షణలో క్రియాశీలకంగా పనిచేస్తుంది.

పరిషత్తు నిర్వహిస్తున్న గ్రంథాలయంలో ఎన్నో అమూల్యమైన విలువైన పుస్తకాలు ఉన్నాయి. పరిషత్తు వాటిని డిజిటలైజేషన్ చేసినట్లయితే భావితరాలకు మన తెలుగు భాష సాహిత్య సంపదను అందజేసిన వాళ్ళు అవుతారు. తద్వారా తెలుగు భాష, సాహిత్యాల్లోని అపారమైన జ్ఞాన సంపదను అందించి, తెలుగు భాష పై గౌరవ అభిమానాల్ని పెంపొందించేటట్లు చేయవచ్చు.పరిషత్తు నిర్వహించే కార్యక్రమాల రూప కల్పనలో, మారుతున్న సమాజానికి అనుగుణంగా మరికొంత కొత్తదనాన్ని జోడించుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ప్రస్తుతం తెలుగు భాషను అన్ని రంగాల్లో, ప్రపంచం నలుమూలల విస్తృతం చేయాలంటే సాంకేతికత తప్పనిసరి కాబట్టి, సాంకేతిక నైపుణ్యాల పట్ల శిక్షణ కలిగించే కార్యక్రమాలను ఏర్పాటు చేస్తే బాగుంటుంది. తెలుగు భాష సాహిత్యాల పట్ల ఆసక్తి కలిగిన విద్యార్థులను ఎంపిక చేసుకుని, తెలుగు భాషకు సాంకేతికతను జోడించుకొని, ముందుకు వెళ్లేలా వాళ్లకు సాంకేతిక రంగాల్లో నిష్ణాతులైన వారిచేత కార్యశాలలను ఏర్పాటు చేయించి, శిక్షణ ఇప్పించాలి. తద్వారా తెలుగు చదువుకున్న వారికి ఉపాధి, ఉద్యోగ అవకాశాలు పెరగటంతో పాటుగా తెలుగు భాష, సంస్కృతి సాహిత్యాన్ని ఎల్లలు దాటించి, విశ్వ వ్యాప్తం చేయడంలో పరిషత్తు చేసిన భాష సేవ ఎనలేదని చెప్పవచ్చు.

**ఆధార గ్రంథాలు:**

1. ఆంధ్ర సారస్వత పరిషత్తు చరిత్ర (1943- 1997), ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచురణ,హైదరాబాద్.

2. శ్రీనివాసులు. మంగళగిరి, ఆంధ్ర సారస్వత పరిషత్తు తెలుగు భాషా సాహిత్య సేవ, మంగళగిరి పబ్లికేషన్స్, మహబూబ్ నగర్, మొదటి ముద్రణ: జనవరి 2020

********

# 13. దిలావర్ కథలు-సామాజిక స్పృహ

**ఆలోతు తిరుపతి**

పరిశోధక విద్యార్థి

హైదరాబాద్ విశ్వ విద్యాలయం

ఫోన్ నెం. 9640649119

Thirupathia987@gmail.com

**పరిచయం:**

"హితేన సహితం సాహిత్యం" అనే అలంకారికుల నిర్వచనంలో హితాన్ని చేకూర్చి మేలును కోరుకునేది సాహిత్యం అని పేర్కొన్నారు. సాహిత్యం కాలాన్ని బట్టి, ప్రాంతాన్ని బట్టి, సంస్కృతిని బట్టి మార్పు చెందుతూ, సమాజాన్ని చైతన్యపరుస్తుంది. అంతటి గొప్ప చైతన్యాన్ని కల్గించే సాహిత్యం అనేక ప్రక్రియలుగా వెల్లడి అవుతుంది.

కొందరు సాహిత్య కారులు తమ అభిరుచిని బట్టి ఏదో ఒక ప్రక్రియను చేపట్టి సాహితీ వ్యాసంగాన్ని సృష్టించారు. కొందరు రచయితలు అన్ని ప్రక్రియలలో సాహిత్య సృజననుగావించి బహుముఖ ప్రజ్ఞాశాలురుగా వెలుగొందుతున్నారు. దిలావర్ ఇటు ఉపాధ్యాయ వృత్తిలోనూ, అటు సాహిత్య క్షేత్రంలోనూ కృషి చేస్తూ రెండు రంగాలలోను తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకున్న బహుముఖ ప్రజ్ఞాశాలి.

ప్రపంచీకరణ పేరుతో, దోపిడీ, పీడన, అణచివేత కేంద్రీకృతంగా దాడి చేస్తున్న సందర్భంలో దానికి వ్యతిరేకంగా వెల్లువైన ప్రతిఘటనను ప్రతిబింబించే సాహిత్యాన్ని ప్రపంచీకరించాల్సిన అవసరం నేడు ఎంతో ఉంది. ప్రతిఘటన సాహిత్యం ప్రపంచీకరించబడితేనే ఒక బలమైన ప్రభావాన్ని కలిగిస్తుందన్న సాహితీ వేత్తలలో దిలావర్ ఒకరు. యావత్ దక్షిణ భారతదేశంలో సుమారు పది శాతం ముస్లిం జనాభాతో అధికంగా ఉన్న జిల్లాగా పేరొందిన ప్రాంతంలోని కవులకు, రచయితలకు మాత్రం ముస్లిం జీవన చిత్రణ మీద స్పృహ చాలా తక్కువ అనే చెప్పాలి. అలాంటి అరుదైన అవకాశం దిలావర్ కి దక్కింది. గిరిజన ప్రాంతంలో చిన్న పాఠశాల ఉపాధ్యాయునిగా ప్రారంభమైన దిలావర్ సాహితీ ప్రస్థానం అంచె లంచలుగా ఎదిగి సాహితీ కారునిగా, ఉన్నత విద్యావంతునిగా, డాక్టరేట్ సంపాదించి కళాశాల ప్రిన్సిపాల్ స్థాయికి ఎదిగేలా చేసింది. ప్రపంచం మొత్తం మీద అది ఏ ప్రాంతమైనా, ఏ భాషైనా సామాన్యుడి జీవితం, అతని సమస్యలు, దిగుళ్ళు, అతని కన్నీళ్ళ భాష వాటి రంగు, రుచి, దుఃఖం, ఎగదన్నిన గుండెచప్పుడూ అతనిలోని ప్రేమ, ద్వేషం, భావోద్వేగాలు, వేదనలు, సంవేదనలు, అనుభవాలు, ఆలోచనలు, అనుభూతులు, ఒక్కటేనని నమ్మేకవి దిలావర్.

దిలావర్ ముస్లిం కవి. స్వయంకృషితో ఎదిగిన సాహిత్య కారుడు. ఆయన ఎల్లప్పుడూ సృజనాత్మక సాహిత్యం రాయడానికే ఇష్టపడతారు. గడిచిన జ్ఞాపకాలజోలికి వెళ్ళకుండా, ప్రస్తుత పరిస్థితులకు అనుగుణంగా తన సాహిత్య ప్రస్థానాన్ని కొనసాగిస్తున్నారు.

ప్రపంచీకరణ నేపథ్యంలో అభివృద్ధి పేరిట జరుగుతున్న మార్పుల వల్ల సమాజంపై తీవ్ర ప్రభావం పడుతుంది. మానవ సంబంధాలు క్రమక్రమంగా విచ్ఛిన్నమై స్వార్థపూరిత భావజాలం పెరిగింది. స్వప్రయోజనమే ధ్యేయంగా విలువలు, అనుబంధాలు, ఆప్యాయతలు, మానవతను పాతర వేయడం జరిగింది. మనిషిలో గూడుకట్టుకున్న స్వార్థమే మనవ సంబంధాల విఘాతానికి కారణమయింది. కథనూ, కవిత్వాన్ని రెండు చేతులా నడిపిస్తున్న ఖమ్మం జిల్లా రచయితలలో దిలావర్ ది ప్రత్యేక స్థానం. ఆయన కవిత్వంలోనూ, కథలల్లోనూ వ్యధార్త జీవన యధార్థ దృశ్యాలే కనిపిస్తాయి. లోకాన్ని, జీవితాన్ని ఆకాళింపు చేసుకున్న ఒక పెద్దాయన తన

పిల్లల్ని, కూర్చొపెట్టుకొని తన అనుభవసారాన్ని రంగరించినట్లుగా దిలావర్ కథలుంటాయి. జన్మత: ముస్లిం అయినా దిలావర్ భాష, భావంలో ఆ ఛాయలు అణు మాత్రమయిన కనిపించవు. ప్రత్యేక సందర్భాలలో తప్పిస్తే, అతను ముస్లిం అని గుర్తించడం కష్టం.

*"ఆధునిక తెలుగు కథా సాహిత్యం వికసించి వందేళ్ళు దాటినా తెలంగాణ ప్రాంత కథకులకు, కథలకు ఏమాత్రం చోటులేకుండా చేస్తున్న వివక్షదోరిణి కొనసాగుతుండడంతో తెలుగు కథా సాహిత్యంలో తెలంగాణ కథా సాహిత్యం తన అస్తిత్వాన్ని నిలుపుకోవడానికి పోరాడాల్సి వచ్చింది. ప్రచురించబడిన కథా సంపుటాలలో తెలంగాణ ప్రాంత కథలను అచ్చువేయడంలో చూపిన వివక్ష వల్లనైతేనేమి, తెలంగాణ ప్రాంత కథా రచయితలకు గుర్తింపు నివ్వకపోవడం వల్లనైతెనేమి ఇక్కడి రచయితలు సాహితీ విమర్శకులు తమ చరిత్రను తామే వెలికి తీసుకోవడానికి కృషి చేశారు."*(అయిలయ్య, బన్న. 2017: 7)

1901లో పురుడుపోసుకున్న తెలంగాణ కథా సాహిత్యం నూట పదేళ్ళుగా నూతనోత్తేజంతో పురోగమిస్తున్నది, వందేళ్ళ తెలంగాణ సామాజిక స్థితిగతుల్ని తనలో చేసుకొని ఇన్నాళ్ళపాటు నిరాదరణకు, సాహితీ విమర్శకుల వివక్షకు గురైన తెలంగాణ కథా సాహిత్యం ఎంత విస్తృతమైందో విశిష్టత గలదో తెలిసివస్తుంది. *"తెలంగాణ మొదటి కథ 1911లో ప్రారంభయింది. ఖమ్మం జిల్లాలో మొదటి కథ 1923లో ప్రారంభమయింది."*(నరసింహారావు, తాటికొండ. 2014: 13) తెలంగాణా అందులో ఖమ్మం జిల్లాలోని కథా రచయితలు కేవలం కథ చెప్పడం కోసం కథలు రాయలేదు. వారు రాజకీయ సాహిత్య, సామాజికోద్యమాలలో పాల్గొంటూ, సమాజాన్ని చైతన్యవంతం చేయడం కోసం వారు చెప్పదలచుకున్న విషయానికి ఏ ప్రక్రియ అవసరం అయితే ఆ ప్రక్రియను అవలంబించి సమాజానికి సందేశం ఇచ్చారు. ఖమ్మం జిల్లాలోని రచయితలు కవిత్వం, నవల, నాటకం, కథ, గేయం, వ్యాసం మొదలైన అన్ని ప్రక్రియలలో ఆరితేరిన ఉద్దండులున్నారు. వారిలో ఒకరైన డా.మహమ్మద్ దిలావర్ కథలను ఇప్పుడు విశ్లేషణ చేద్దాం. దిలావర్ మూడు కథాసంపుటాలను వెలువరించారు. 1.*మచ్చుబొమ్మ* 2.*కొండా....కోనల్లో* 3.*చంద్రుడు గియ్యని బొమ్మలు.*

డా.మహ్మద్ దిలావర్ ఇప్పటి వరకు ఆరు వచన కవితాసంపుటాలు, ఒక ధీర్ఘ కవితా సంపుటి, ఐదు నవలలు,(సమిథలు, ముగింపు, తుషార గీతిక, ఐ లవ్ ఇండియా, ఆలభ్యం, అముద్రితం), ఒక పద్యకావ్యం, రెండు గజళ్ళసంపుటాలు, రెండు వ్యాససంపుటాలు, మూడు కథాసంపుటాలు, పాటలు రచించారు.దిలావర్ కి వివిధ సాహిత్య ప్రక్రియలలో ప్రవేశం ఉంది. వీరు కవితలు, నవలలు, కథలు, వ్యాసాలు రాసారు. ఇవే కాకుండా పద్యకావ్యం, పాటలు రాశారు.

**జరీన కథ:**

దిలావర్ *జరీన* కథలో బురఖాకు తావు లేని. కూలీ బతుకుల రోజురోజుకూ దిగజారుతున్న ముస్లిం స్త్రీల జీవితాలను, లైంగిక దోపిడీని భర్త, కొడుకూ ఇద్దరూ గుట్కాలకు, తాగుడుకు బానిసలై చనిపోవడాన్ని, బతికుండే శవంలాగా మారిన తాగుబోతు తండ్రినీ ఇందులో చిత్రించారు. *జరీన* కథ పేద ముస్లింల జీవితాలను, దానిలోని దొంతరలను, కన్నీటి గొంతుతో చిత్రించారు. మదార్ బీ, హుసేన్ లకు ఆరో సంతానంగా జన్మించింది జరీన. ముగ్గురు అక్కలు, ఇద్దరు అన్నల తర్వాత జరీన పుడుతుంది. ఊరోళ్ళ కళ్ళూ, ఇరుగుపొరుగు వాళ్ళు కళ్ళు తన మీదనే పడేటంత అందగా పుట్టింది జరీన. చందమామ కూడా కన్నుకొట్టి తట్టు వెన్నెల ఒంటి రంగుతోని పుట్టింది. ఆ ఆరుగురి సంతానంలో జరీన చాలా అందంగా ఉండేది. కాలం గడిచిపోతుంది. చూస్తుండగానే హుసేన్ కూతుర్లు పెళ్ళీడుకు వచ్చారు. మదార్ బి వైపు చుట్టమైన రైల్వేలో ఉద్యోగం చేసే అతనితో వారి పెద్ద కూతురు గోరి బీ పెళ్ళి అయిపోయింది. హుసేన్ అక్క కొడుకు లత్తయ్యతో రెండో కూతురు జాన్ బీ పెళ్ళి జరిగిపోతుంది. మూడో కూతురు రజయాని సమీర్ కి ఇచ్చి పెళ్ళిళ్ళు చేస్తారు. పైసా కట్నం లేకుండా ముగ్గురు బిడ్డల పెళ్ళిళ్ళు చేస్తారు మదర్ బీ, హుసేన్ దంపతులు. కోడి పిల్లల్ని గద్ద తన్నుకుపోయినట్టు ముగ్గురు బిడ్డల్ని ముగ్గురు అల్లుళ్ళు తన్నుకుపోతారు. కట్నాలు లేకపోయినా ఆడపిల్లల పెళ్ళి అని అందినకాడికి అప్పులు చేశారు హుసేన్. అప్పులతోని వారి సంసారం కుదేలవుతుంది. మరలా గాడినపడే మార్గం కనిపించక ఇంట్లో గొడవలు పెరిగి, సంసారం మీద వీరక్తి కలిగి మత్తుకు

బానిస అవుతారు హుసేన్. ఆ సంసార బాధ్యతలు మదార్ బీ మీద పడటంతో తనకు వచ్చిన విద్య అయినా మడుగు బూరెలు, సద్దబూరెలు, బొబ్బడాలు, పెసర గారెలు చేసి బుట్టలో సర్ది జరీనని అమ్మడానికి పంపేది. కానీ అవి అమ్మడానికి జరీనకి చచ్చేంత సిగ్గనిపించేది. కానీ అమ్మక తప్పని పరిస్థితి లేకుంటే తాను, అమ్మ, బాపు అందరు కూడా ఉపాసం ఉండక తప్పదు.

జరీన అసలే అందగత్తె. అందులోన వయస్సులో ఉంది. డబ్బుతోని, దరిద్రంతోని వయసుకేం పని? తనని తనది. వయసు తెచ్చిన అందాలను దాస్కోలేక సతమతమయ్యేది జరీన. చాలీచాలని పికిలిపోయిన జాకెట్టు అతుకుల లంగా ఎవరిసిగ్గునైనా ఎట్లా దాత్తే? బందరు లడ్డు ఎదురుంగ ఉంటే ఎవరు మాత్రం లొట్టలేయ్యరు. ఎవరెన్ని ఆటలు పట్టించినా ఎవరెంత అవమానించినా వెంకటేశ్వర్లు సైగలతోటి జరీనాను సముదాయించేటోడు. అలాంటి అవమానాలు భరించలేక అవి నేను అమ్మను అని జరీన అంటే మాత్రం ఆరోజు గొడ్డును బాదినట్టు బాదేది మదార్ బి. ఏమీ చేయలేని హుసేన్ అలా చూస్తుండిపోయేవాడు.

ఒకసారి పెద్ద అక్క ఆరోగ్యం బాగాలేదని జరీనాని పంపిస్తారు. బావ సూపులతోటి జరీన ఒళ్ళంతా తడిమేతోడు. ఒకరోజు గోర్ బి స్నానానికి వెళ్ళడం గమనించి అమాంతం జరీనని వాటేసుకున్నాడు. చేతులు గుండె మీద అంటు ఇటు కదులుతుంటాయి. భయంతో జరీన వణికిపోతుంది. గోర్ బి రాంగనే వదిలిపెట్టి ఏమీ తెలియనట్టు ఉంటాడు భర్త. ఆ విషయం అక్కకు చెబితే, ఆమె భర్తకే సపోర్టు చేసింది. ఎలాగోలా ఆ నరకం నుండి బయటపడినా రెండో అక్క రూపంలో మరలా వేరే కూపంలోకి లాక్కుపోయింది. మక్కతోట యిాదు పోతుందనా జరీనని పంపిచమంటే వెళ్తుంది. జరీనని చూసిన సంది లత్తయ్య మనసు ఆగమాగం కాబట్టింది. ఒకరోజు జాన్ బి బర్రెకు పచ్చిపడ్డి కోసం చేనుకు వెళ్తుంది. గుంట నక్క లెక్క పొంచివున్న లత్తయ్యకు అవకాశం దొరికింది. మరదలు పైగా ఒంటరిగున్నది. యిడ్సిపెట్టడానికి లత్తయ్యమోటోడే కానీ ఎడ్డోడు కాదు. ఆ మోటు చేతుల్తో జరీనని దగ్గర గుంజుకుంటాడు. జరీన ఎంత బతిమాలినా వదలని లత్తయ్య జరీనాని బలవంతంగా లేపి నులక మంచంల కుదేసిండు. అక్కడ కూడా జరీన అందమే శాపంలా మారింది. అర్థం చేసుకుంటే అక్కలు లేరు పైగ భర్తలనే సమర్థిస్తారని జరీన భయంతో అక్కడ నుండి వచ్చేస్తుంది.

ఒకరోజు జరీనని వెంకటేశ్వర్లు హనుమంతుని గుడి దగ్గర కల్సి పెళ్ళి చేసుకుందామని, నేను మా వాళ్ళకు, నువ్వు మీ వాళ్ళకు చెప్పమనగానే జరీనలో ఏదో కొత్త ఆశ చిగురిస్తుంది. కానీ అటు వెంకటేశ్వర్లు తండ్రి ఒప్పుకోడు. పైగా హుసేన్ ఇంటికి వచ్చి బిడ్డను అదుపులో పెట్టుకోమని బెదిరించడంతో మదార్ బి జరీనాని భయంకరంగా కొడుతుంది. జరీనని మరచిపోలేక వెంకటేశ్వర్లు వశం కాదు. దాంతో తాగుడుకూ అలవాటు పడతాడు. బ్రతుకు మీద విరక్తి కలిగి తాగితాగి ఆసారతోనే ప్రాణం పోగొట్టుకున్నాడు.

మూడో అక్క భర్త సమీర్ వాళ్ళింటికి తీసుకెళ్ళే నెపంతో జరీనని తన వెంట తీసుకెళ్తారు. ఆఖరి రైలు వేళ్ళేదాకా టైంపాస్ చేసి. ఈ రోజు ఇక్కడే ఉండి మంచి సినిమా, ఓ బీర్, గుమగుమలాడే బిర్యాని తిని తెల్లారుజామున్నే ఎల్లిపోదాం అన్నాడు. ఆ మాటలలోని అర్థాన్ని గ్రహించిన జరీన సమీర్ కళ్ళల్లోకి చూడగానే అతని కళ్ళలోని ఆకలిని పసిగట్టింది. సమీర్ చెప్పినవన్ని తన కలలోకి వచ్చినవి. ఆమె మనసులో ఏదో మూలన చిన్న బలహీలన తలెత్తి చూసింది. తప్పు ఒక్కసారి చేసినా వందసార్లు చేసినా ఒకటే ఇయ్యన్నీ మల్ల దొరుకుతాయా అనుకుంటుంది.

కొంతకాలానికి జరీనకి పెళ్ళి సంబంధం చూసి పెళ్ళి చేస్తారు. పెళ్ళైన రాత్రి ఎంతో ఘోరంగా గడిచిపోతుంది. కొంతకాలానికి కూలీకి వెళ్ళమని అత్తపోరు పెట్టడంతో సాకలి ఈరమ్మ ముటాలో నాట్లకు వెళ్తుంది. అంతా జరీనని లొట్టలేసుకుంట చూస్తుండిపోతారు. ఆ వూరి ఆసారి రామ్మూర్తి అయితే మరీను. ఎలాగోలా ఆసీజన్ అయిపోతుంది. ఈలోగా జరీన మగబిడ్డను జన్మనిస్తుంది. ఒకసారి కంది చేనులో గడ్డికొస్తున్న జరీనని బలాత్కారం చేస్తారు రామ్మూర్తి. రానురాను రామ్మూర్తి జరీనాను బహిరంగంగానే కలుసుకోసాగాడు. భర్త జాఫర్, అత్తమామలు రామ్మూర్తి చేస్తున్న జులురిని ఓర్చుకోలేకపోయారు. ఏం చేస్తరు రామ్మూర్తి ఆ ఊరి పెద్దకాపు వాడికి ఎదురు తిరిగినోడు బతికి బట్టకట్టినోడు లేదు పైకి చెబితె పరువు పోతుందని. ఒకరోజు రాత్రికి రాత్రి అత్త మామ, జాఫర్. జరీన, కొడుకుతో

నవభారత్ కి మకాం మారుస్తారు. ఆ ప్రాంతం అప్పుడే పెరుగుతున్న ప్రాంతం. జాఫర్ సెంట్రింగ్ పని చేయసాగాడు. దాంట్లో కొంత ఆదాయం మెరుగు పడుతుంది. దాంతో గుడుంబకు, గుట్కకు బానిస అవుతాడు. అవి తగకపోతే వణకు వచ్చేది. దానికితోడూ పక్షవాతం వచ్చి చెయ్యి, కాలు పడిపోతాయి. మరలా బతుకు బండి జరీన మీదే పడుతుంది. దాంతో పచ్చిగడ్డి అమ్మడం, ఆ సీజన్ అవగానే కట్టెలు, అవి కూడా దొరకనప్పుడు కూరగాయలు అమ్మేది. ఆ ప్రయాణంలో అనుమాండ్ల గుడి కనిపించినప్పుడల్లా వెంకటేశ్వర్లు గుర్తుకు వస్తారు.

ఒకరోజు జరీనా ఊరెళుతుంది. బావిలో నీరు తోడేందుకు బొక్కన వేసి లాగబోయి జాఫర్ దాంట్లో పడి చనిపోతాడు. ఇంత జరిగినా ఏడవదు. కొడుకును ఐ.టి.ఐ చదివిచ్చింది నవభారత్ లో వెల్డర్ గా ఉద్యోగం రావడంతో మందు, గుట్కలకు అలవాటు అవుతాయి. తన అన్న బిడ్డ ఫాతిమాతో చాంద్ పాషా పెళ్ళి చేస్తుంది. రోజురోజుకు కొడుకులో మత్తు ఎక్కువ కాసాగింది. ఒకరోజు గొడవపడి ఫాతిమా వాళ్ళ ఇంటికి వెళ్తుంది. దాంతో చాద్ పాషా బాగా తాగి డ్యూటికి ఎగనామం పెట్టసాగారు. తల్లితోని ఏగలేక అప్పుడప్పుడు డ్యూటికి వెళ్ళడం జరిగింది. ఒకరోజు బాగా తాగి డ్యూటికి వెళ్ళి ట్రాలీ మీదపడి చాంద్ పాషా మరణిస్తారు. రెక్కలు విరిగిన పక్షిలాగ విలవిలలాడింది జరీనా. సింపిరి జుట్టుతోటి, మాసిన గుడ్డల తోటి ఒంటిసోయి లేకుండా రోజు కొడుకు సమాధి వద్ద వెళ్ళి వెర్రిగా నవ్వేది. అక్కడే పడుకునేది.

రావి చెట్టూ, వేప చెట్టూ కొమ్మలన్నీ ఆకులురాలి ఉత్తమోళ్ళు మిగిలినయ్. వాటి మొదట్లో ఎవరో నిప్పు పెడతారు. దాంతో ఆ రెండు చెట్టు కూలిపోక తప్పదనుకుంటుంది. ఇంతలో వెంకటేశ్వర్లు గుర్తుకొచ్చి పిచ్చినవ్వు నవ్వుకుంటుంది. తను ఇలా కావడానికి కారణం ఎవరు? తల్లా? తండ్రా? బావలా? భర్తనా? కొడుకా? తన జీవితం ఎందుకు ఇలా బూడిదగా మారింది? అక్కలు, బావలు, బాపు, భర్త, కొడుకు, దునియా మీద చెప్పలేనంత కోపం అసహ్యం వేస్తుంది జరీనకి. ఎన్నాళ్ళు నుండో గడ్డ కట్టిన దుఃఖం ఉప్పెన లెక్క తన్నుకొచ్చింది. అప్పుడు ఏడుస్తుంది జరీనా. ఆకాశం భూమి ఏకమయ్యేట్టు గుండెలు అవిసిపోయేట్టు ఏడ్చి, ఏడ్చి సొమ్మసిల్లి పడిపోతుంది.

**ముగింపు.**

జరీన కథలో దిలావర్ పేద ముస్లింల నిజ జీవితాన్ని ఆవిష్కరణ చేశారు. వారిలో ఆపరేషన్లు ఉండవు. అందుకే వారి సంతానం పెరిగిపోతుంది. వారి మతం ప్రకారం ఆపరేషన్లు చేసుకోరాదు. కట్టుబాట్లు ఎక్కువ. ఎందరో ముస్లింలు జరీనలాగా బలైనవారు ఉన్నారనేది దిలావర్ మాట. ఎందుకుంటే ఇది ఎక్కడో జరిగినట్లుగానే, ఆయన చూసినట్లుగానే పాఠకులను ఆ ప్రపంచంలోకి తీసుకెళ్ళారు రచయిత. ఈ కథ చదువుతున్నంత సేపు ఇది నిజంగా మన గ్రామంలో జరుగుతుందా, జరిగింది అనే ఆశ్చర్యానికి లోను కాక తప్పదు. అంత అద్భుతంగా ఈ కథని మలిచారు.

**ఉపయుక్త గ్రంథ సూచి:**


1.అయిలయ్య, బన్న. 2017. *తెలంగాణ కథ-పరామర్శ.* హన్మకొండ: నానీ ప్రచురణలు.

2.అయిలయ్య, బన్న. 2020. *ధార.* హన్మకొండ: నానీ ప్రచురణలు.

3.జాతశ్రీ. 2009. *ఆర్తారావం.* కొత్తగూడెం: ధరణి గ్రాఫిక్స్ మొదటి ముద్రణ.

4.దిలావర్. 2007. *మచ్చుబొమ్మ* (కథాసంపుటం)భద్రాద్రి కొత్తగూడెం జిల్లా: సమతా ప్రచురణలు.

5.నరసింహరావు, తాటికొండాల. 2018. *ఖమ్మం కథా సుధ.* హైదరాబాద్: స్పృహ సాహితీ సంస్థ ప్రచురణలు.

6.నారాయణ, సింగమనేని. 2009. *కథా కలనాళిక*(ఆర్తారావం ముందుమాట). కొత్తగూడెం: ధరణి గ్రాఫిక్స్ మొదటి ముద్రణ.

7.రాములు, బి.యస్. 2003. *యాభై ఏళ్ళ తెలుగు కథ తీరుతెన్నులు.* హైదరాబాద్: విశాల సాహితీ అకాడమీ ప్రచురణలు.


********

# 14. ఆచార్య ఎన్. గోపి "కాలాన్ని నిద్రపోనివ్వను" – సాంస్కృతిక జీవనం

**డా. జి. శైలమ్మ**

సహాయ ఆచార్యులు

ప్రచురణల శాఖ

ద్రావిడ విశ్వవిద్యాలయం

కుప్పం- 517426

చరవాణి: 9618361905

ఎన్. గోపి కలం నుండి వెలువడిన రచనలు వేనికదే గొప్పదిగా నిలుస్తుంది. కాలాన్ని నిద్రపోనివ్వను కవితా ఖండికలో మానవుని సాంఘిక జీవనం హృద్యంగా చిత్రించారు. ఒక్కో కవిత ఒక్కో అనుభవంలో దాగున్న అనుభూతిని వర్ణించారు. కాలంతో పరిగెత్త గలిగిన నాడే అనుకున్నది సాధించగలుగుతారు. అంతేకాదు కంటికి నిదుర పడితే సోమరితనం, మందగించే అవకాశం వుంది. అందుకే నిరంతర శ్రమ జీవనాన్ని ఎంచుకుని అనుసరించమంటారు.

మానవుని జీవితంలో ఆహారం ప్రధానమైంది. అది కొంతమందికి విస్తారంగా వుంటే మరికొంతమందికి అసలే లేదు. పస్తులతో కాలం వెల్లదీసే పరిస్థితి నేటికి వుందంటే అతిశయోక్తి కాదు.

- **రొట్టె:**

కొన్ని కుటుంబాలలో సూర్యుడు తూర్పున ఉదయిస్తాడు. కొంతమంది జీవితాల్లో పొయ్యి వెలిగితే ఆ రోజు వారి జీవితాల్లో ఉషోదయకాంతులు విరజిమ్ముతాయనటంలో మానవుని ప్రాథమిక అవసరాల్లో ఒకటైన ఆహారం, రొట్టె మానవునికి ప్రధానమైనవి.

**"తెల్లారటమంటే / మాయింట్లో రొట్టె సూర్యుడు ఉదయించటమే"** రొట్టెకు అనేక సాదృశ్యాలను ప్రయోగించాడు కవి. ఆకలి స్వప్నం, కాంతి చక్రం, శ్రమస్పర్శా సిద్ధాంతం, అసంఖ్యాక విన్యాసాల పర్యవసానం, తలలపైన సూర్యుడు. ఇలా రొట్టెను వర్ణిస్తారు. రొట్టెకు మనిషికున్న సంబంధం అనిర్వచనీయమైంది.

- **బొంత:**

నిదురించడానికి ఇంట్లో మంచంమీద దుప్పటి, రగ్గు, బొంత వంటివి ఉపయోగిస్తుంటాం. ఈ బొంత చిరిగిపోతే పడేసి కొత్తది కొంటాం. కొత్తది కొనే స్తోమత లేనివాళ్లు అతుకులు వేసి ఉపయోగించుకుంటారు. ఒకే బొంతను ఇంట్లో అందరు చాలకాలం ఉపయోగించుకున్నట్టు తెలుస్తుంది.

**"దీనిమీద కూచుంటే /మ్యాజిక్ చాపలా ఎగిరిపోయి /జ్ఞాపకాల దీవులకు చేరేస్తుంది"**

కుటుంబాలు కలిసి జీవించే క్రమంనుండి విడిపోయి జీవిస్తున్నారు. కలిసి జీవించిన కాలంలో అమ్మమ్మ, తాత అందరు అదే బొంతను ఉపయోగించుకుంటే వాళ్లు చనిపోయారు. కాని ఈ బొంత అనేక రంగులతో విమల్. డిజైన్లా సాటిరానన్నిడిజైన్లా తలపించేలా అతుకులు పడివున్నాయని బాధను సౌందర్యంగా వర్ణించడం కవిగొప్పతనం.

**"ఈ బొంత మీద పడుకున్నప్పుడల్లా / అమ్మా అమ్మమ్మా అక్కా అందరి వొడిలో/ ఏకకాలంలో సేదదీరినట్టుంటుంది"**

ఇంట్లో అందరికి బొంతంటే చాల ఇష్టం.

**మృత్యువు:** మరణం పుట్టిన జీవికి తప్పదు. అయితే ఈ మరణం ఇంటిల్లిపాదిని విషాదంలోకి నెడుతుంది. వాళ్లు మరణించిన వారి గురించి మరచిపోవాలంటే కొద్దిరోజులు పడుతుంది.

**"ప్రేమా వేదాంతాలు రంగరించిన / మందు బిళ్ళలను గంటకోసారి మింగిస్తుంది / ఎవరైనా ఎన్నాళ్లు కాపలా కాస్తారు?"**

ఏదైనా రోగమొస్తే మందులు వేసుకుంటారు. ఈ మందులకు కూడా రోగం తగ్గకపోతే ఇంత వరకు కాపాడిన ప్రాణం గాల్లో కలిసిపోతుంది. ఇక ఆ ఇంట్లో దుఃఖం ఆవహిస్తుంది. **"ఆ యిల్లు వర్షంలో మునిగిపోతుంది"** వర్షంలోనే వుంటే పోయిన వారు తిరిగొస్తారా రారుకదా దుఃఖాన్ని మరిచిపోవాలంటే మళ్లీ సూర్యుడు వుదయించాలి. ఆ కాంతిలో దుఃఖాన్ని రూపుమాపే శక్తుంది. టీ.వీ.లో వచ్చే కార్యక్రమాలు నవ్వులు చూస్తూ దుఃఖాన్ని మరచి పొమ్మంటాడు కవి.

**"దుఃఖానికి మరో పార్శ్వం హాస్యం/ ఒక కంట కన్నీరు మరోకంట పన్నీరు/ అదే జీవితం!"**

కవి హృదయంలో మానవుని జీవితాన్నికబళించే మృత్యువు. ఆ మృత్యువు చుట్టూ అలముకున్నబంధాన్ని వర్ణించారు. మనిషి దుఃఖాన్ని మరిచిపోయి సంతోషంగాను వుండగలడు. స్మృతి విస్మృతి సిద్ధాంతాన్ని కవి తెలియజేస్తారు.

- **నగరం:**

దేశంలో ఒకప్పుడు పల్లెలు పచ్చదనంతో, రకరకాల వర్ణాలతో వెలిగిపోతుండేవి. నగర జీవనానికి అలవాటు పడిన మానవుడు పల్లెనుండి నగరానికి వలస పోతుంటారు. క్రమంగా పల్లెలు అంతరించి పోతున్నాయి.

**"నగరం గలగలా నవ్వుతుంది గానీ / దానిలోంచి పల్లెలు రాలిపోతున్న చప్పుడు / పల్లెల సూర్యోదయాన్ని లాగేసుకుని / సిటీ నియాన్ లైటై వెలుగుతుంది"**

పల్లెలు, పల్లెల్లోని జనులుంటే దేశం సుభిక్షంగా వుంటుంది. కాని నగరాలు రావడం వల్ల పచ్చదనం తగ్గిపోయి మానవుని జీవన ప్రమాణం తగ్గిపోతుంది.

"విషాదమేమిటంటే / ఇప్పుడు నగరం నగరంలో వుండక / పల్లెల్లోకి కూడా ప్రసరిస్తుంది."

నగర విస్తరణలో పల్లెలు అంతమై పోతున్నాయి. ప్రపంచీకరణ ప్రభావం మానవుని ఆరోగ్యకరమైన జీవనంపై చెడుగా చూపుతున్న ప్రభావాన్ని తెలియజేశారు.

- **కాలం:**

రోజు ఒకేలా ఉండదు ఒక్కో రోజు ఒక్కోలా వుంటుంది. నిరంతర గమనంలో మనిషిలో అనేక అనుభవాలు పుడుతుంటాయి. ప్రకృతిలో వున్న సముద్రం అలలతో అలజడిగా వుంటుంది. చంద్రుడు రాత్రి కనిపిస్తాడు. వెన్నెల వెలుగులో ఉప్పొంగుతుంది సముద్రం. ఆకాశంలో చంద్రుడు వెన్నెలకి, కిందున్న సముద్రానికి ఉన్న సంబంధాన్ని కవి గుర్తించాడు. ప్రకృతి నిదురించడంలేదు. మనిషి నిదురిస్తున్నాడు. నిరంతర శ్రమ విజయానికి మార్గం ఏర్పడుతుంది.

**"ఆకాశం భూమికి వేసిన సంకెళ్లను ఛేదించడానికి / మనిషి నిలబడతాడు / కాలాన్ని నిద్రపోనివ్వక పోవటమే జీవితం / మరి సముద్రం సంగతి / సముద్రం ఎన్నటికీ చచ్చిపోదు"**

మానవ జీవితంలో కాలం గొప్పతనాన్ని కలిగుంది. సముద్రం ఆకాశాన్నందుకోవాలన్నట్టు కనిపిస్తుంది. కాని అందుకోలేక పోయినా ప్రయత్నం మాత్రం ఆపదు కదా. మానవ జీవితాన్ని తెలుసుకోవాల్సిన సత్యాన్ని కాలం విలువను, మానవుడు చేయాల్సిన నిరంతర ప్రయత్నాలను తెలియజేశారు.

- **ఆమె-అతడు:**

ప్రతి కుటుంబంలో ఎవరికి ఎవరో తెలియని అనుబంధంలో స్త్రీ పురుషుడు భార్య భర్తలవుతారు. పిల్లలు పుడతారు. వయస్సు పెరిగి వృద్ధులవుతారు. వారి పిల్లలకు పెళ్లిళ్లు చేసి ఆస్తులు సంపాదిస్తారు. వారు చనిపోగానే వారి పిల్లలు వారు సంపాదించిన ఆస్తి కోసం

వంతులేసుకుంటారు. ముందుగా భార్య చనిపోతే బ్రతికున్న భర్త కళ్లముందు పిల్లలు అమర్యాదగా ప్రవర్తిస్తే భార్య చనిపోయిన రోజే ఆ వృద్ధుడు చనిపోయుంటాడని కవి చాల చక్కగా వివరించాడు.

**"ఎముకల్తో మాట్లాడే / వృద్ధాప్యం శిలాతల్పంమీద / ఆమె-అతడు"**

ఈ కవితలో వృద్ధాప్యాన్ని చాల చక్కగా వర్ణించారు. "ఎముకల శిల్పం" ఈ వయస్సులో మరణం వేరుచేస్తే వారి మధ్య అలముకున్న పరిస్థితిని ఈ కవితలో కవి హృద్యంగా వర్ణించాడు.

**"తరాల అనుబంధాల పెనుభారాన్ని / అతని భుజాల మీద వొదిలేస్తూ"** వెళ్లిపోయింది. భర్త ముసలివాడు బతికున్నా చచ్చినట్టే వున్నాడు. ఒక సంవత్సరం పాటు జీవిశ్చవంలా జీవించాడు. ఆమె చనిపోయినరోజే చనిపోయి వుంటాడని, ఆ వృద్ధుని సున్నితమైన మనస్సుని ఆవిష్కరించారు.

**"పిల్లలు హఠాత్తుగా ఎడంగా జరిగారు / మొదటిసారిగా / ఆ ఇల్లొక / అర్థశాస్త్ర చర్చాసదస్సుగా మారింది."**

భార్య చనిపోయింది. పిల్లలు ఆస్తులకోసం గొడవపడి దూరంగా బంధాలు మరిచి జీవించారు. ఆ రోజే మరణించాడు ముసలితండ్రి. కంటిముందే కన్నబిడ్డలు అనుబంధాలు మరచి జీవించారు. కన్నతండ్రిపై ప్రేమను మరిచిపోయి జీవిస్తున్న విధానం నేటికాలంలో వుంది. సమాజంలో వృద్ధుల నిరాదరణకు గురౌతున్న విధానం హృద్యంగా వర్ణించారు.

- **బస్టాప్:**

పల్లెల్లో బస్సు రెండు మూడు ట్రిప్పులు తిరుగుతుంది. ఒక వేళ వచ్చినా బస్సులో నిండుగా జనాలతో కూచోడానికి తావు లేకుండా వుంటుంది. బస్టాప్ లో రకరకాల మనుషులు కలుస్తుంటారు. వారి బాధలు పంచుకుంటారు.

**"వస్తేగదా బస్సాగడానికి / వస్తేగిస్తే ఉబ్బిన పొట్టతో /చొంగ కారుస్తూ వొగరుస్తూ వెళ్ళిపోతుంది."**

ఈ బస్సు వచ్చి కొంతమందినెక్కించుకొని వెళ్ళిపోతుంది. బస్టాండు అనేకమంది సుఖదుఃఖాలను పంచుకునే చోటుగా కవి గుర్తిస్తాడు.

**"ముత్యాలన్నీ హారంలోకి నడిచి వచ్చినట్టు / ఎక్కడెక్కడి కన్నీళ్ళో ఇక్కడ కవోష్ణకాసారమై కలుస్తాయి."**

నిజమే బస్టాండు అన్ని ఊర్ల జనాలను కలుపుతుంది. రేకుల షెడ్డులు, ఒకప్పుడు బస్టాప్ లు. ఒక్కోసారి బస్సురాదు. ఊరెళ్లాల్సిన వారు ఆ బస్టాండుల్లోనె నిదురపోయేవారు. ఆ సన్నివేశాలు కవితలో దర్శనమిస్తాయి.

- **వరద:**

వరదలు రావాలంటే వానలు పడాల్సిందే. వానలు భూతాపానికి వచ్చి మేఘాలు ఆవిరితీసుకొని వానను ఇస్తాయి. ఈపని ఎవరూ చేయలేరు. అందుకే మేఘాలకు నమస్కరిస్తున్నానని అంటారు.

**"ఆకాశంలోకి భూమి పేల్చిన / పరిమళాల విస్ఫోటనం చినుకు / సముద్రాలకే మన నమస్కారం."**

చినుకు పడితే భూమి పంటలతో పచ్చదనంతో సంపదలతో వెలుగొందుతుంది. కవి ఆశావహ దృక్పథం ఈ కవితలో తెలుస్తుంది.

**ముగింపు:** ఆచార్య ఎన్. గోపిగారి "కాలాన్ని నిద్రపోనివ్వను" కవితా సంపుటిలో అనేక విషయాలను వర్ణించారు. సమాజంలో మానవుని చుట్టూ నెలకొన్న జీవితానుభవాల సమాహారం సాంస్కృతిక జీవనం హృద్యంగా వర్ణించారు.

**ఆధార గ్రంథం:**

ఎన్.గోపి – కాలాన్ని నిద్రపోనివ్వను. చైతన్య ప్రచురణలు, హైదరాబాద్. 1998.

*****

# 15. సురవరం జీవితం - సామాజిక స్పృహ

**డా. రాపోలు శ్రీనివాస్,**

తెలుగు అసోసియేట్ ప్రొఫెసర్,

తారా ప్రభుత్వ కళాశాల (స్వ. ప్ర),

సంగారెడ్డి. మొబైల్: 984805064.

తెలంగాణ ప్రాంతంలో ప్రతిభ ఎన్నడూ ప్రచారం కోరుకోలేదనీ, పల్లకీల కంటె పట్టెడు మెతుకుల ప్రశాంతతను కోరుకుందనీ, ఏనాడైనా తెలంగాణవాడు వెనుకబడిలేడనీ, ఆత్మాభిమానం గల తెలంగాణ భూమి పుత్రులు అన్ని రంగాలలో అడుగుముందుకు వేయగలరనీ నిరూపించిన తెలంగాణ బిడ్డ సురవరం ప్రతాపరెడ్డి. తెలంగాణ ఔన్నత్యం చాటడానికి అహరహరం తపించినవాడు సురవరం. గ్రంథాలయాలు, పత్రికలు స్థాపించి తెలంగాణ చరిత్రను వెలికితీసి సాంస్కృతిక పునరుజ్జీవనానికి కారకుడైనాడు. నిజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా అక్షరబాణాలు సంధిస్తూ అంధకారంలో కొట్టుమిట్టాడుతున్న తెలంగాణ ప్రజల్లో రాజకీయ చైతన్యదీప్తిని రగిలించిన తెలంగాణ వైతాళికుడు సురవరం. తలవంచని జర్నలిజానికి తలమానికంగా నిలుస్తూ రజాకార్ల దౌర్జన్యాలను ఎదిరిస్తూ, సమాజాన్ని చైతన్యవంతం చేయడానికి కలం ఎక్కుపెట్టి తనదైన శైలిలో తుపాకి తూటాల్లాంటి అక్షరాలను పత్రికల్లో సాలుపోస్తూ, అక్షరానికి ఉన్న అక్షయశక్తిని రుజువుపరచినవాడు ప్రతాపరెడ్డి. వీరు తమ రచనల ద్వారా తీసుకువచ్చిన సామాజి చైతన్యం వివరించడం ఈ వ్యాసం ఉద్దేశ్యం.

**కీలకపదాలు**

బహుముఖ ప్రజ్ఞాశాలి – రెడ్డిహాస్టల్ – గోలకొండ పత్రిక – ప్రజాహిత ఉద్యమాలు – సురవరం కథలు – కేంద్రసాహిత్య అకాడెమి అవార్డు – తెలంగాణాభిమాని – ఆంధ్రమహాసభ – గ్రంథాలయోద్యమం.

**బహుముఖ ప్రజ్ఞాశాలి**

సురవరం ప్రతాపరెడ్డి పత్రికా సంపాదకుడిగా, ఆంధ్రమహాసభ అధ్యక్షుడిగా, విద్యాలయాల నిర్మాతగా, పరిశోధకుడిగా, పరిష్కర్తగా, విమర్శకుడిగా, సంఘసంస్కర్తగా, గ్రంథ సంకలనకర్తగా, పండితుడిగా, రచయితగా, తెలుగు భాషోద్ధారకునిగా, రెడ్డిహాస్టల్ నిర్వాహకుడిగా, హైద్రాబాద్ అసెంబ్లీ ఎమ్మెల్యేగా, కార్యప్రేరకుడిగా, క్రియాశీల ఉద్యమకారుడిగా ఇలా అనేక పాత్రల్ని ఏకకాలంలో పోషించిన బహుముఖ ప్రజ్ఞాశాలి. ఈయన తలపెట్టిన కార్యక్రమాలన్నీ ఏ తరానికైనా ఆదర్శప్రాయాలు.

సురవరం ప్రతాపరెడ్డిగారు మే 28, 1896న మహబూబ్‌నగర్‌జిల్లా, గద్వాల సంస్థానంలోని ఇటిక్యాలపాడు గ్రామంలో సురవరం నారాయణరెడ్డి, రంగమ్మ దంపతులకు జన్మించాడు. కర్నూలులో ప్రాథమిక విద్య, నిజాంకాలేజీలో ఇంటర్‌విద్య పూర్తిచేసి, మద్రాస్ ప్రెసిడెన్సీ కళాశాలలో బి.ఏ., తిరువాన్‌కూరులో బి.ఎల్ చదివాడు. కొంతకాలం న్యాయవాద వృత్తి నిర్వహించాడు. అనేక భాషలు అభ్యసించాడు. ఈ సమయంలోనే జాతీయోద్యమ భావాల్ని అలవర్చుకొని హైదరాబాద్ రాష్ట్ర నిజాం రాజ్యంలో ప్రజల దుస్థితిని మార్చాలనుకున్నాడు. ప్రతాపరెడ్డి తన చదువు పూర్తికాగానే హైదరాబాద్ కొత్వాల్‌గా ఉన్న రాజబహదూర్ వేంకట్రామారెడ్డి ఆధ్వర్యంలోని రెడ్డిహాస్టల్ నిర్వహణ కోసం ఆయన కోరికపై వచ్చాడు. ఇక్కడ దశాబ్ది కాలం పనిచేసి రెడ్డిహస్టల్‌ను ఒక విద్యాలయంగా తీర్చిదిద్దాడు. ఇక్కడ 11వేల పుస్తకాలతో గ్రంథాలయాన్ని అభివృద్ధిపరచి తెలుగుభాషా, సాహిత్యాభివృద్ధికి కృషి చేశాడు.

**'గోలకొండ పత్రిక' స్థాపన :** తెలంగాణలో కవులే లేరని అన్న ముడుంబై వెంకట రాఘవాచార్యుల తేలిక మాటలను సవాలుగా తీసుకొని 354 మంది కవులతో కూడిన ''గోల్కొండ కవుల సంచిక'' గ్రంథాన్ని కవుల జీవిత విశేషాలతో సహా ప్రచురించి గ్రంథరూపంలోనే

సమాధానమిచ్చిన గొప్ప పరిశోధకుడు. సురవరం గోలకొండ పత్రిక ద్వారా తెలుగుభాషా సాహిత్యోద్యమాన్ని ఉజ్జీవింప జేయడమే కాకుండా, కొడిగట్టిపోయిన సాంఘిక చైతన్యాన్ని రగిల్చాడు. ఈ సంచికలో 354 మంది పండితుల పేర్లు, పద్యాలు, ఫోటోలు సైతం ప్రచురించాడు. ఇందులో 237 సంస్కృత శ్లోకాలు, 1418 తెలుగు పద్యాలు ఉన్నాయి. 23 సంవత్సరాలు గొల్కొండ పత్రికకు సంపాదకత్వం వహించి 15వందలకు పైగా వ్యాసాలు రాశాడు. ఆనాటి గోల్కొండ కార్యాలయం సాహితీ నిలయంగా మలచబడి, విద్వాంసుల సాహితీ చర్చలతో కళకళలాడేది.

కొత్వాల్ వెంకటరామారెడ్డిగారు సురవరంవారి సేవలు తెలుగుభాషా సాహిత్యాలకు అవసరమని భావించి మాడపాటి హనుమంతరావుగారి సహకారంతో 1926లో గోలకొండ పత్రిక స్థాపించడం జరిగింది. దాని బరువుబాధ్యతలను ప్రతాపరెడ్డిగారికి అప్పగించారు. సురవరం తన సంపాదకీయాల ద్వారా నిజాం దురాగతాలను నిలదీసేవాడు. తనను సూటిగా ప్రశ్నించినందుకు నిజాం ఆగ్రహించి సమాచారశాఖ అనుమతితోనే సంపాదకీయాలను ప్రచురించాలని నిబంధన విధించాడు. దాన్ని తిప్పికొడుతూ ప్రతాపరెడ్డి ప్రపంచ మేధావుల సూక్తులను సేకరించి సంపాదకీయాలకు బదులుగా ప్రచురించి నిజాంను ఎదురించాడు.

తెలుగు మాట్లాడడమే నేరమైన చోట తెలుగుపత్రిక వెలిసింది. ఈ పత్రికా సంపాదకునిగా సురవరం ప్రతాపరెడ్డి పీడిత ప్రజలకు అండగా నిలిచాడు. అనేక ప్రజాహిత ఉద్యమాలకు పురుడు పోశాడు. ఎక్కడ ప్రజల ప్రాథమిక హక్కులకు భంగం కలిగినా ఎదిరించాడు. రాజకీయ ఉద్యమాల స్ఫూర్తితో ప్రజల ప్రజాస్వామిక హక్కుల కోసం కృషి చేశాడు. అందులో భాగంగానే రాజకీయ స్వత్వములు రాశాడు. స్వత్వములు అంటే హక్కులు అని అర్థం. వివిధ దేశాలలో ప్రజలకు ఎలాంటి హక్కులు ఉన్నాయి, వాటిని సాధించుకోవడానికి వారు చేసిన కృషి ఎలాంటిది, అలాంటి హక్కులు మెరుగైన సమాజ నిర్మాణానికి ఎలా తోడ్పడుతున్నాయో ఈ పుస్తకం చెబుతుంది.

**బహుముఖ సాహితీవేత్త**

సురవరం ప్రతాపరెడ్డి సాహితీవేత్తగా అనేక ప్రక్రియలలో రచనలు చేశాడు. గోలకొండ పత్రిక నిర్వహణలో తలమునకలై ఉండికూడా తెలంగాణ ఔన్నత్యాన్ని చాటే వ్యాసాలు రాసి, పరిశోధనలు చేసి ఆదర్శంగా నిలిచాడు. సురవరం ఏదో ఒక ప్రక్రియలోనే కాకుండా కవిత్వం, కథ, నవల, నాటకం, వ్యాసం, సాహిత్య విమర్శ, అనువాదం, పత్రికా రచన ఇలా అన్నింటితోనూ రచనా వ్యాసంగం కొనసాగించారు. సంస్కృతం, ఉర్దూ, ఫార్సీ, ఇంగ్లీషు, హిందీ, కన్నడ భాషలలో ప్రావీణ్యం ఉన్నా, భాషాసేవకుడుగా తెలుగుకు సేవచేశాడు. ప్రతాపరెడ్డి భావుకుడైన రచయిత. కవితలు, కథలు, వ్యాసాలు రచించాడు. సురవరం కథలు నిజాంకాలం నాటి ప్రజల జీవితాన్ని ఉన్నదున్నట్లుగా చిత్రిస్తాయి. ఈ విధంగా తెలుగుభాషాభివృద్ధికి ఎనలేని సేవచేశాడు. 1955లోనే ఆంధ్రుల సాంఘిక చరిత్ర రచనకుగాను ''కేంద్ర సాహిత్య అకాడెమి'' అవార్డు లభించింది. ఇది ఒక అద్భుత పరిశోధక గ్రంథం. రాజుల కాలంలోని సామాన్య ప్రజల జీవన విధానాలను పరిశోధించి, చర్చించి చరిత్ర రచనకు కొత్త నిర్వచనం చెప్పిన గ్రంథమిది. సమాజంలోని అన్ని వర్గాల ప్రజలతో తన రచనల ద్వారా సాన్నిహిత్యాన్ని ఏర్పరచుకొని వారి జీవన విధానంలో మెరుగైన మార్పులు తీసుకురావడానికి సురవరం ప్రయత్నించాడు.

**సామాజిక కృషి**

సురవరం భాషా, సాహిత్య కృషికన్నా మించినది ఆయన సామాజిక కృషి మహత్తరమైనది. చాలా కార్యక్రమాలకు ఆయనే ప్రారంభకుడు. చాలా కార్యక్రమాలలో ఆయనే నాయకుడు, ప్రధాన కార్యకర్త. మరెన్నో కార్యక్రమాలకు ఆయన మేధాపరమైన, నైతికపరమైన సహాయ సహకారాలు అందించారు. నైజాం నిరంకుశ పాలనలో, తెలుగువారి అణచివేతను వ్యతిరేకిస్తూ సురవరం ప్రజలను చైతన్యవంతం చేసేందుకు, తెలుగుభాషా సంస్కృతుల వికాసానికి ఎనలేని కృషిచేశాడు. అన్యాయాన్ని సహించని అసలు

సిసలైన తెలంగాణాభిమాని ప్రతాపరెడ్డి. జీవిత చివరి దశలో రాజకీయాలలో కూడా ప్రవేశించి వనపర్తి అసెంబ్లీ నియోజకవర్గం నుంచి హైదరాబాదు రాష్ట్ర శాసనసభకు ఎన్నికయ్యాడు. 1952లో హైదరాబాదు రాష్ట్రానికి జరిగిన మొదటి ఎన్నికలలో కాంగ్రెసు పార్టీ తరఫున వనపర్తి నియోజకవర్గం నుండి శాసనసభకు ఎన్నికయ్యాడు. ప్రముఖ న్యాయవాది వి. రామచంద్రారెడ్డిపై విజయం సాధించాడు. కాని జిల్లా వ్యక్తి బూర్గుల రామకృష్ణారావు ముఖ్యమంత్రిగా ఉన్నప్పటికినీ ఇతనికి మంత్రిపదవి కూడా లభించలేదు. దానికి కారణం సురవరంగారికి గ్రూపు రాజకీయాలంటే గిట్టదు గనుక. ఇదే విషయాన్ని ఆప్తుడైన రంగాచార్యులకు లేఖరాస్తూ ''ఈ రాజకీయపు చీకటి బజారులో నేను, నావంటి వారు ఏమియును పనికిరారు'' అని పేర్కొన్నాడు. రాజకీయ రంగంలో ఇంతటి మేధావి, వ్యవహర్త నిలదొక్కుకోలేక పోయాడంటే రాజకీయ రంగం కేవలం చాణక్యశీలురకే సరిపోయే రంగమనే భావించాలి.

**ఆంధ్ర మహాసభ**

తెలుగు మాతృభాష దుస్థితిపై సురవరంవారు ఎంతగానో వ్యాకులపడ్డారు. 'తెలంగీ-బేడంగీ' అని తెలుగును ముక్కు మొఖంలేని భాషగా హేళన చేస్తున్నవేళ, చేవతో తెలుగు సాహిత్యానికి సేవచేసిన సాహితీమూర్తి సురవరం. హైదరాబాద్ సంస్థానంలో భాషాపరంగా, రాజకీయంగా మనం బలహీనులమై పోయామని, ఈ దుస్థితి రావడానికి లోపాలను కనుక్కోవాలని తపనపడ్డాడు. ఉర్దూ భాషతో రాజ్యమేలుతున్న హైకోర్టులోను, ఉస్మానియా విశ్వవిద్యాలయంలోను తెలుగు భాషకు చుక్కెదురు కావడాన్ని ఆయన నిరసించారు. నూటికి 90శాతం ఉన్న తెలుగు ప్రజలకు ఉర్దూభాషను విద్యాలయాలలో బోధనాభాషగా బలవంతంగా రుద్దుతుండడాన్ని ఆయన తప్పుపట్టాడు.

**గ్రంథాలయోద్యమం**

తెలంగాణాలో గ్రంథాలయోద్యమంలో ప్రముఖపాత్ర వహించాడు. 1942లో ఆంధ్ర గ్రంథాలయ మహాసభకు అధ్యక్షత వహించాడు. 1943లో ఖమ్మంలో జరిగిన గ్రంథాలయ మహాసభకు, 1944లో జరిగిన ఆంధ్ర సారస్వత పరిషత్తుకు అధ్యక్షులుగా ఉన్నాడు. 1951లో ప్రజావాణి అనే పత్రికను ప్రారంభించాడు. న్యాయవాదిగా జీవితం ప్రారంభించి, రచయితగా, కార్యకర్తగా, సంపాదకుడిగా జీవితం సాగించి తెలంగాణ ప్రజల హృదయాలలో చెరగని ముద్రవేసుకున్నాడు. ఆకాశవాణిలో ఎన్నో అమూల్య ప్రసంగాలు చేశాడు. ఇతనికి తెలంగాణ పల్లెపాటలు, తెలంగాణ సంస్కృతిపట్లగల అభిమానమే, ఆచార్య బిరుదురాజు రామరాజుగారిని తెలుగు జానపద గేయాలపై పరిశోధనకు పురిగొల్పింది. కేవలం 58 సంవత్సరాలు మాత్రమే జీవించిన వీరు 1953 ఆగష్టు 25న దివంగతుడైనాడు. తెలంగాణ తేజోమూర్తులలో అగ్రేసరుడైన సురవరం ప్రతాపరెడ్డి ధన్యజీవి.

**ఆధార గ్రంథాలు**

1. ప్రతాపరెడ్డి, సురవరం.(2015), సురవరం ప్రతాపరెడ్డి వ్యాసాలు, ఆంధ్రసారస్వత పరిషత్తు, హైద్రాబాద్-500 001.

2. పుష్పలత, సురవరం.(2012), తెలంగాణ వైతాళికుడు, సురవరం ప్రతాపరెడ్డి కథలు, వ్యాసాలు, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్, హైద్రాబాద్.

3. వెంకట రామారావు. జి. (2017), తెలంగాణ ప్రముఖులు, ప్రపంచ తెలుగు మహాసభల ప్రచురణ, తెలుగు అకాడెమి, హైద్రాబాద్

*********

# 16. యిక్కుర్తి నరసింహారావు గారి నాటిక 'పిడికిలి' సామాజిక అంశాలు

**డా|| జి. శ్రీనివాస్**, తెలుగు అధ్యాపకులు,

ప్రభుత్వ డిగ్రీ కళాశాల (A), రాజమహేంద్రవరం,

తూర్పుగోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్.

సెల్ : 9440766546

E-Mail.:gourarapusrinivas@gmail.com

ఉపోద్ఘాతము :

యిక్కుర్తి నరసింహారావుగారు గుంటూరు పట్టణంలో 1949 ఏప్రిల్ 23 వ తేదీన వీరరాఘవరావు, శకుంతలమ్మ పుణ్యదంపతులకు జన్మించారు. 1వ తరగతి నుండి 3 వ తరగతి వరకు కృష్ణాజిల్లా నూజివీడులో, 4, 5 వ తరగతులు శ్రీకాకుళం జిల్లా సాలూరులో ప్రాధమిక విద్యాభ్యాసం చేశారు. యిక్కుర్తి నరసింహారావుగారి తండ్రి వీరరాఘవరావు సాలూరు (శ్రీకాకుళం జిల్లా) లో సర్వేయర్‌గా ఉద్యోగం చేస్తుండగా మరణించారు. ఆయన మరణించడం వలన అక్కడ నుండి మాతామహుల ఇంటికి (గుంటూరు) వచ్చారు. 6వ తరగతి నుండి ఎస్.ఎస్.ఎల్.సి వరకు మాజేటి గురవయ్య హైస్కూల్ గుంటూరులో విద్యాభ్యాసం చేశారు. స్నేహితుల ప్రోత్సాహం, ఆత్మీయుల ఆదరణతో రాజమండ్రి రాత్రి కళాశాలలో పి.యు.సి, బి.ఎ. తెలుగు మెయిన్ సబ్జక్ట్‌గా చదివి ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. అన్నామలై విశ్వవిద్యాలయం నుండి డిస్టెన్స్ ఎడ్యుకేషన్ ద్వారా 1980 వ సంవత్సరంలో బి.ఈడి. చేశారు. ' పిడికిలి ' అనే నాటికను యిక్కుర్తి నరసింహారావు గారు రచించారు.

తెలుగు సాహిత్య చరిత్రలో నాటక సాహిత్యానిది ఒక ప్రత్యేకమైన శైలి. నాటకం దృశ్యకావ్యం. అందుకే ఎన్నో భాషలలో నాటకానికి ప్రత్యేక స్థానం ఉంది. నవరసాలను అలవోకగా రంగస్థలంపై ప్రదర్శించి ప్రేక్షకుల (పాఠకుల) హృదయాలను రంజింపచేయగల సత్తా నాటకానికి ఉంది. నాటకం కాలంతరాలలో విభిన్న రూపాలలోకి మారినా దాని ఉద్దేశం మూలసూత్రం మాత్రం సమాజ హితమే. తెలుగు సాహిత్యంలో ఎన్నో ఇతివృత్తాలతో నాటకాలు వచ్చాయి. ఎందరో కవులు నాటకాలను రచించారు. ఎన్నో గొప్ప నాటకాలు, నాటికలు జనాదరణ పొందాయి. గురజాడ అప్పారావు గారి కన్యాశుల్కం వంటి సామాజిక నేపథ్యం కలిగిన నాటకాలు మన తెలుగు సాహిత్యానికి దిశా నిర్దేశం చేశాయి. సాహిత్యంలో నాటకం కూడా తనవంతు పాత్రను ప్రత్యేకంగా సంతరించుకుంది. నేటి సినిమాలకు నాటకం మూలం అని మనందరికీ తెలిసిన విషయమే కదా!

అటువంటి పరంపరలో మన యిక్కుర్తి నరసింహారావు గారి కలం నుండి జాలువారిన నాటికలు ఎంతో ప్రాముఖ్యాన్ని పొంది సమాజ హితాన్ని చాటాయి. అందులో ఎంతో పేరును సంపాదించారు యిక్కుర్తి నరసింహారావు. నాటక సాహిత్య ప్రక్రియలో తనదైన ముద్రను వేసుకున్నారనుటలో అతిశయోక్తి లేదు. సమాజాన్ని ఇతివృత్తంగా చేసుకొని సాగిన వారి నాటక సాహిత్యం గొప్ప మేలుకొలుపుగా అందించారు. వారు రచించిన నాటికలలో సమాజంలోని కష్టాలు, పేదరికం, వెనుకబాటుతనం, నిరక్షరాస్యత, సామాజిక చైతన్యం వంటి అంశాలు కనిపిస్తాయి. బొమ్మలాట, సర్వేజనా సుఖినోభవంతు, నరజాతి చరిత్ర సమస్తం, ఉట్టి, సుఖీభవ నాటికలు సమాజాన్ని ప్రేరేపించేవిగాను, ప్రభావితం చేసేవిగాను కనిపిస్తాయి. వారి ప్రతి నాటిక ఏదో ఒక పరమార్థాన్ని కలిగిస్తుంది.

సమాజాన్ని నిశితంగా పరిశీలించిన వారి జీవితానుభవాలు స్పష్టంగా గోచరిస్తాయి. సమాజం ఎంతగా మానవుల జీవితాలపై ప్రభావం చూపుతుందో విశదీకరిస్తాయి. ప్రతినాటకం చిన్న చిన్న ఇతివృత్తాలతో నిండినదైనా గాని అందులో విశేషమైన ప్రయోజనాన్ని

చూపించారు. యిక్కుర్తి గారి నాటికలు ఏదో తెలియని గొప్ప చైతన్యాన్ని కలిగించాయి. సాధారణమైన అంశాలతో విశేషమైన ప్రయోజనాన్ని, వారి నాటికలను నిశితంగా పరిశీలిస్తే మనకు అందులోని సామాజిక స్థితిగతులు దర్శనమిస్తాయి.

పిడికిలి- సామాజిక అంశాలు

**ఇతివృత్తం :**

''ప్రపంచ కార్మికులారా ఏకంకండి'' అన్న మార్క్స్ ఇచ్చిన పిలుపును అందుకుని సంఘటితం అయినప్పుడు బానిస సంకెళ్ళను ఛేదించవచ్చునని నిరూపించేలాగా రాసిన నాటిక పిడికిలి. బిగించిన పిడికిలి సంఘటితమైన శక్తికి ప్రతీక. నిమ్నజాతుల మధ్య ఐకమత్యం తీసుకువచ్చేలా చైతన్యపరచిన నాటిక పిడికిలి. 'పిడికిలి' నాటిక సమాజానికి దూరంగా బతుకుతున్న నిరుపేదలు జీవించే అంటరానిగూడెం కథ ఇది. అక్కడంతా సమాజం చేత వెలివేయబడిన బడుగు బలహీనవర్గాలకు చెందిన నిరుపేదలు జీవిస్తారు. ఎందరో త్యాగనాధులు దేశానికి స్వాతంత్య్రం తెచ్చినా ఇంకా స్వేచ్ఛ లేక చీకటి గూళ్ళుగానే మిగిలిపోయిన జీవుల గాధ ఇది. నిరక్షరాస్యత, అమాయకత్వం, అంటరానితనం, అర్థంలేని ఆటవిక సాంప్రదాయాలు ప్రచ్ఛన్నంగా దెబ్బతీస్తుంటే, అవిచ్ఛన్నంగా సాగే భూస్వాముల అధికారం అహంకారం, నిరంకుశత్వం, ప్రత్యక్షంగానే దెబ్బతీస్తాయి.

అలాంటి ఎన్నో గ్రామాలలో ఒక అంటరానిగూడెం. ఆ గూడెంలో జరిగిన విషాధ సంఘటనల సమాహారమే ఈ పిడికిలి. చేతి వేళ్ళు ఐదు బిగిస్తేనే పిడికిలి కాని ఎప్పటికీ ఆ గూడాలలో చేతి వేళ్ళు ఎప్పటికీ కలవవు. అలా కలిస్తే కత్తిరించే భూస్వాములు, పెత్తనందార్లు ఎందరో ఉన్నారు. కులం, మతం, వర్గం, వర్ణం, జాతి, నీతి, కట్టు, బొట్టు అంటూ ఇంకా పాతాళానికి తొక్కే సమాజంలో నివసిస్తున్న ఎందరో అనాధుల ఆర్తి బయటకు రాకుండా త్రొక్కబడుతున్న అరాచకాలను, ఆకృత్యాలను, అత్యాచారాలను 'పిడికిలి' నాటిక దృశ్యకావ్యంగా చూపుతుంది. రచయిత చూసిన ఏ సంఘటన ఆయన మనోఫలకాన్ని ఆవిష్కరించిందో ఇలాంటి కథాంశాన్ని రూపుదిద్దుకునేలా చేసిందో అర్థంకాదు కాని`అది గొప్ప సంఘశక్తి, చైతన్య స్రవంతిలోకి మారుస్తుందని చెబుతుంది. రాజయ్య, చంద్రి కులాంతర వివాహం చేసుకున్నందుకు కుల పెద్ద పెద్దయ్య వారిని వెలి వేస్తాడు. సంఘ కట్టుబాట్లలో వాళ్ళ ప్రేమ మాడిపోతుంది. దాన్ని ఆసరాగా తీసుకుని నాగరాజులాంటి వారు చంద్రిపై అత్యాచారం చేయడానికి పూనుకుంటారు. నందిగాడు డబ్బుకోసం ఏపని అయినా చేసే రకం. ముసిలోడు కల్లుకు బానిసగా మారుతాడు. అన్నీ తెలిసినా తెలియనట్లు ఉంటాడు.

ఈ పిడికిలి నాటికలో గూడెంలోని వారిపై జరిగే దౌర్జన్యాలను రచయిత దృశ్యకావ్యంగా మలిచాడు. నిజమైన సమాజ స్థితిని కళ్ళకు కట్టినట్లుగా వర్ణించి పిడికిలి బిగించివేశాడు.

**సామాజిక రుగ్మత ` అంటరానితనం :**

సమాజంలో తక్కువ కులంలో పుట్టడం ఎవరి తప్పూ కాదు. జన్మత: ఎవ్వరు గొప్పవారు కాదు. వారి పరిస్థితులే వారి జీవితాలను మారుస్తాయి. నిరక్షరాశ్యత, ఆర్థిక స్వేచ్ఛ లేకపోవడం, సంస్కార భావాలు, సమాజంలో ఉన్నత స్థితికి చేరుకోలేని వారి అనైతికత భావజాలం పుట్టి పెరిగిన నేపథ్యం ` చైతన్యవంతమైన సమాజం వారికి దక్కకపోవడం అంటరానితనానికి కారణాలు. సమాజంలో ఉన్న అన్ని రుగ్మతలలో ఇది ఒకటి. మనిషి కేవలం తన అవసరాల కోసం వాడుకునేతత్వం ఉండకూడదు. డబ్బులేని పేదవాడి చేతగానితనాన్ని, అన్ని రకాలుగా వెనుకబడిన వాడి దీనావస్థను చూసి జాలిపడి బ్రతుకునివ్వాలే కానీ వాడి తలపై వామనపాదం వేయరాదు. ఈ నాటికలో నాగరాజు వంటి పెద్దమనుషులు కల్లుపోసి, డబ్బులిచ్చి తమ అవసరాల కోసం ఏమైనా చేయగలమని, తప్పులు చేసినా ఎదిరించేవాడు లేనప్పుడు తిరుగు లేదని విర్రవీగుతుంటారు. ఇటువంటి వారి వల్ల సమాజం వెనుకబడిపోతుంది. అందుకే పెత్తనందారీ వ్యవస్థ గొప్పగా ముందుకు సాగుతుంది.

'పిడికిలి' నాటికలో రాజయ్య, చంద్రి ప్రేమ వ్యవహారం తెలిసిన కులపెద్ద వారిని గూడెం నుండి వెలివేస్తాడు. లేదా డబ్బులు కట్టమని షరతు పెడతాడు. ప్రేమను చంపుకోలేని వారిద్దరు కలసి జీవించడం కోసం పడే ఆవేదన డబ్బుకోసం పడే అగచాట్లు కన్నీరు తెప్పిస్తాయి.

మన సమాజంలోని కొన్ని సంఘటనలు వారి జీవన పరిస్థితులు కూడా దారిని ఇంకా అణగారిపోయేలా చేస్తాయి. దానివల్ల పడే అవస్థలు భవిష్యత్తు తరాలను నాశనం చేస్తాయి. రచయిత ఈ నాటికలో వెనుకబడిన జాతుల మధ్య వైరం, ఇంకా మారుతున్న కాలానికి తమ బతుకులు మార్చుకోలేని వారి స్థితిని చూసి జాలిపడతాడు. అయితే నీతి జాతి ఔన్నత్యానికి ప్రతీక, కులం, జాతి తక్కువైనా నీతి తప్పి జీవించరాదని ఇందులో రాజయ్య చంద్రి పాత్రలు నిరూపించాయి. ఇది ఆలోచించదగిన విషయం. ఏదైనా సామాజిక రుగ్మతలలో ఒకటైన అంటరానితనం, పేదరికం వల్ల ఎన్నో బతుకులు బుగ్గిపాలు అవుతున్నాయని ఈ నాటకం ద్వారా రచయిత గొప్ప సందేశం ఇచ్చాడు.

**కులాంతర వివాహాలు :**

'పిడికిలి' నాటికలో రచయిత ప్రయోగించిన అంశం ప్రేమ పెళ్ళి అది కూడా కులాంతర, వర్ణాంతర వివాహం. మన సమాజం కులానికి, మతానికి, వర్గానికి ఎంతో ప్రాధాన్యతను ఇస్తుంది. వివాహాలు అనేవి తమ కులంలోనే జరగాలని, అది మన సాంప్రదాయమని అంటారు. ఉన్నత వర్గాలలోనే కాదు, వెనుకబడిన వర్గాలలోనూ అది కనిపిస్తుంది. కులం అంతగా ప్రభావం చూపుతుంది. కులంపట్ల అభిమానం గౌరవం, సమాజంలో ఒక ప్రత్యేకత సంతరించుకున్న తరువాత దాని అవసరం ఇంకా పెరిగిందని చెప్పాలి. వేర్వేరు కులాలకు, జాతులకు గూడాలకు చెందిన రాజయ్య, చంద్రి ప్రేమ పెళ్ళిదాకా పోకుండానే రాలిపోయింది. అక్కడ మనుషులకు తావులేదు. భావాలకు ఆస్కారం లేదు. అక్కడి వారికంతా కులమే ప్రధానం. దానికోసం చంపడానికి కూడా వెనుకాడరు. అంతగా కులం ప్రభావం సమాజం మీద ఉందని రచయిత కులాంతర వివాహాలు జరిగితేనే సమాజం సమతుల్యత జరుగుతుందని పిలుపునిచ్చాడు.

''మనువాడితే తప్పా! నేను సెంద్రి కాని పనేం సెయ్యలే సీకటి సిందులేయలే! మనువు సేసుకున్నాం ఆ భగవంతుడి సాచ్చిగా పెమాణికాలు సేసుకున్నాం తప్పంటి''

రచ్చబండ దగ్గర పెద్దల సమక్షంలో రాజయ్య అన్న మాటలివి.

కులాంతర వివాహాలు ఈ సమాజం ఒప్పుకోదు. కులం, గోత్రం, జాతి కలుషితం అవుతుందనే మూఢనమ్మకాలతో పంచాయితీ పెట్టి వారి జీవితాలను నాశనం చేసే సంస్కృతి ఆనాటి నుండి ఈనాటి వరకు మనం చూస్తూనే ఉన్నాం. రచయిత మాత్రం ఈ నాటికలో అలా వాళ్ళ జీవితాలను విడదీసినందుకు చివరకు వాళ్ళ జీవితాలు ఎలా మారాయో చూపించి ప్రశ్నగా ముగించాడు. అంటే మనం చేసే కొన్ని నిర్ణయాలు చివరకు ఎవరి జీవితాలు ఎలా మారతాయో ఈ నాటిక ద్వారా గొప్ప సందేశాన్ని రచయిత ఇచ్చారు.

**పేదవాడి పై దౌర్జన్యాలు :**

ఈ నాటికలో విలన్ నాగరాజు, మధాంధుడు, కామాందుడు. ఎక్కడ చిన్న అవకాశం దొరికినా వదలనివాడు. అవకాశాలు కల్పించి మరీ తన పనులను చేయించుకునే రకం. మునసబును చంపించి వాడి భార్యను లోబరచుకొని ఆస్తిని, ఆమెను అనుభవిస్తున్నాడు. లోకానికి మంచివాడిగా, మోతుబరిలాగా కనబడతాడు. నందిగాడు లాంటి వ్యసనపరులను కల్లుపోసి, డబ్బులిచ్చి తన అవసరాల కోసం వాడుకుంటాడు. దుర్మార్గమైన వాడు. గూడెంలో జరిగిన రాజయ్య, చంద్రిల విషయం తెలుసుకొని చంద్రిని లొంగదీసుకోవాలనుకుంటాడు. రాజయ్య నాగరాజుతో గొడవపడతాడు. నాగరాజు మనుషులను పంపించి దౌర్జన్యంగా దాడి చేయించి చంపిస్తాడు. తమకు అడ్డం వచ్చిన వారిని ఎలాగైనా అడ్డు తొలగించుకునే తత్వం కలవాడు. పేదవాడంటే చులకన, డబ్బు మదం వల్ల ఏవి చేసినా చెల్లుతుందని అనుకుంటాడు. వాడిని ఎదిరించలేక పేదవాడి గుండె భగభగమని ఉడుకుతుంది. కానీ ధైర్యం లేని ఆ గుండె అలాగే

ఉండిపోయింది. ఏమీ తెలియని అమాయకుడు రాజయ్య మరణవార్త గూడాన్ని కదిలించింది. పెద్దయ్య ముసిలోడు చంద్రి అందరు అక్కడకు చేరతారు. పెద్దయ్య తన కొడుకు మరణంతో కోపంతో ఊగుతాడు. నాగరాజుతో

''మడిసికాటు తిన్నోడికీ పిచ్చేంట్రా ఎర్రే ఎక్కుతాది / కాటేసినోడి రకతం తాగితేగాని ఆ ఎర్రిపోదురా''

అంటూ పెద్దయ్య నాగరాజు పైకి దూకుతాడు. పేదవాడి పిడికిలి బిగిస్తే ఎలా ఉంటుందో చూపిస్తామని అంటాడు. అందరూ ఏకమైపోతారు. నందిగాడి పెళ్ళాన్ని ఎలా నాగరాజు లొంగదీసుకున్నాడో తెలుసుకుని, నందిగాడు తిరగబడతాడు.

**స్త్రీల పై అత్యాచారాలు ` ఖండన :**

'పిడికిలి' మరో అంశాన్ని రచయిత నిస్పష్టంగా చూపించారు. అది స్త్రీల పై జరిగే అత్యాచారాలు ఈ నాటకంలో ఉన్నాయి. మోతుబరి మధాందుడు నాగరాజు, చంద్రి మీద మోజుపడతాడు. దాని పొందు కోసం చివరకు అది పెళ్ళాడే రాజయ్యను కూడా చంపిస్తాడు. చంద్రితో బేరం కుదుర్చుకుందామని రచ్చబండకు కట్టవలసిన కట్టడికోసం చూస్తున్న సమయంలో నాగరాజుతో ఆమె పలుకుతున్న మాట ద్వారా రచయితకున్న నాటకీయత మనకు కనిపిస్తుంది.

''నన్నొదిలేయండి మీకు దణ్ణం పెడతాను. నేను అలాంటి దాన్ని కాను.''

''నన్ను పాడుచేస్తే మీ కొరిగేదేంటయ్య కూలిసేసుకు బతికేదాన్ని గానీ వొల్లమ్ముకునేదాన్నికాను''

ఈ రెండు డైలాగులు వింటుంటే చంద్రి అమాయకత్వం, నాగరాజు దౌర్జన్యం, వాడిపై జుగుప్స, చంద్రిపై అంతులేని గౌరవం కలుగుతాయి. రచయిత అంతగా ఈ సన్నివేశాన్ని రూపుదిద్దారు. కామంతో కళ్ళుమూసుకుపోయిన నాగరాజు చంద్రితో సరసాలు ఆడి సొంతం చేసుకోవాలని చూస్తూనే ఉన్నాడు. లొంగదీసుకోవడానికి ప్రయత్నిస్తూనే ఉంటాడు నాగరాజు. చంద్రిపై బలవంతం చేయడానికి ముందుకు దూకాడు చంద్రి వాడితో... ''కులం తక్కువ దాన్నని కులంలోంచి ఎలేశారని కూటికిలేనోళ్ళమనీ, మా బతుకులతో ఆటలాడకండి. నేను పులిపిల్లను. నీలాంటి వెదవలున్నారనే మేము ఊరిబయట గూడెం కట్టుకొని జీవిస్తున్నాం. మేమే మిమ్మలను ఎలేశాం పగలు మా గాలి తగిలితే మైలుబడిపోయే మీకు పక్కలోకి మాత్రం అంటు మైలుకాదురా'' అంటూ శివంగిలా కఱ్ఱ తీసుకుని మీదకు ఎగబడుతుంది. రచయిత చంద్రి పాత్ర ద్వారా స్త్రీల పై నాగరాజు లాంటి వారు చేసే అత్యాచారాలను, ఎదిరించే తత్వాన్ని దృశ్యంగా మలిచారు. నిజంగా చంద్రి మాటలు చాకులుగా మారి వాడి గుండెలను చీల్చివేశాయి. కానీ వాడు మనిషికాదు. కామాంధుడు. నీతి జాతి లేని మధాందుడు.

**ముగింపు :**

రచయిత పేద కుటుంబంలోని వారి జీవితాలను అక్కడి వ్యవస్థను కళ్ళకు కట్టినట్లు చూపించి బలమైన కథగా మార్చి పిడికిలి బిగించారు. ఈ పిడికిలి బలంగా ఎప్పుడు ఉండాలని రచయిత చెప్పిన సందేశం అందరిని ఆలోచింపజేస్తుంది. ఆధునిక తెలుగు నాటకం (1989) అనే పరిశోధన గ్రంథం రాసిన గండవరపు సుబ్బిరామిరెడ్డి తన గ్రంథంలోని 13 వ అధ్యాయంలో యిక్కుర్తి నరసింహారావు గారి గురించి సముచితంగా ప్రస్తావించారు. ''సమాజంలో అంటరాని వారుగా, అస్పృశ్యులుగా అణగదొక్కబడిన నిమ్నకులాల మధ్య సంఘర్షణకు, అనైక్యతకు అద్దంపడుతూ, వారి బలహీనతలను మత్తుగా మార్చి స్వంత లాభం కోసం పెనుగులాడే పెద్దకులాల స్వార్థానికి సమగ్ర రూపకల్పన పిడికిలి'' నాటిక.

ఈ నాటికలో పాత్రోచిత సంభాషణలు మళ్ళీ మళ్ళీ వినిపించేంత సహజంగా, పసందుగా ఉన్నాయి. నిరక్షరాస్యుడు పలికే మాటల్లో కూడా లోతు కనిపిస్తుంది. అంటూ గండవరపు సుబ్బిరామిరెడ్డి యిక్కుర్తి నరసింహారావుల గురించి ప్రస్తావించడం విశేషం.

**ఆధార గ్రంథం :** యిక్కుర్తి నరసింహారావు ` పిడికిలి నాటిక

*********

# 17. మీ రాజ్యం మీరేలండి నవల – సీమ స్థితి

**బుక్కే ధనక నాయక్**

పరిశోధక విద్యార్థి, తెలుగు శాఖ

ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం

Ph : 8187056010,

dhanakanaikbukke111@gmail.com

**కీ వర్డ్స్ :** అస్పృశ్యత, జీతగాళ్లు, నక్సలైట్ తాగిలాలు, మలం, రాజకీయం.

మీ రాజ్యం మీరేలండి నవలాకర్త బండి నారాయణ స్వామి. నవలల్లో చాలా వరకూ కల్పనలకే ప్రాధాన్యముండవచ్చును కానీ, సామాజిక ఇతివృత్తం నేపథ్యంలో వచ్చిన నవలలు వాస్తవికచిత్రణలకే ఎక్కువ ప్రాతినిథ్యాన్ని కల్పించేయి. సంఘటనాత్మక కథాకథనాలతో ప్రాత్రచిత్రణలతో నవలలు వెలుగుచూస్తూంటాయి. ఈ వ్యాసం సుప్రసిద్ధ- నవలారచయిత, వివిధ విశిష్టపురస్కారాల స్వీకర్త బండి నారాయణస్వామి – "మీరాజ్యం మీరేలండి" నవలలో అనంతపురం జీవనానికి ప్రతింబింబంగా భాసిల్లే తావులను ఆవిష్కరిస్తుంది. నవల ప్రత్యేకతలు, నవలలో చిత్రితమైన సాంఘికజీవనవిధానాలు, అంటరానితనం, రాజకీయాధిపత్యం మొదలైన అంశాలను వివిధ కోణాలలో ఈ వ్యాసం చర్చిస్తుంది.

"ప్రజాకంటకుల గుండెల్లో తుపాకి చప్పుడు మోగింది. చీకటి నెత్తుటి మడుగులో తేలకుండా తూర్పున ఉదయం రానంది. ముఠానాయకులై తొంభైమంది భుజాలెక్కిన పదిమంది రెడ్లూ, చౌదరీలు హఠాత్తుగా మానవతా వాదులై ప్రజాస్వామికులై హాహాకారాలు చేస్తుంటే మల్లయ్య అడుగుతీస్తున్నాడు. తన గ్రామ విముక్తి వైపు. అగ్రశూద్ర కులాల రాజకీయ ఆధిపత్యం నుంచీ జాతి ముఖం వైపు. అగ్రశూద్ర కులాల రాజకీయ ఆధిపత్యం నుంచీ జాతి ముఖంపై రుద్దిన బ్రాహ్మణ కుల సంస్కృతి నుంచీ రాజకీయ పాలెగాళ్ళకు నిచ్చెనగా మారిన దళిత రౌడీల విషాదచరిత్రల నుంచీ తన కాళ్ళను పెల్లగించుకొని తీస్తున్నాడు మల్లయ్య. ప్రభుత్వ ఆస్తుల్ని దోచుకుతినే దొరల్ని గాడిదల మీద ఊరేగించే ప్రజాకోర్టుల వైపు. దళితుడు మరో దళిత కులం పట్ల అనుకంపన చెందే ఔన్నత్యం వైపు. సనాతన సంస్కృతిని చెమట పరం చేసే శూద్రకులాల మూలం వైపు. వ్యక్తిగతపు 'నేను' ను విచ్ఛేదమ్ చేసుకునే అద్వైత చింతన వైపూ, కమ్యూనిస్ట్ సమాజం వైపు" (నారాయణస్వామి, బండి., మీ రాజ్యం మీరేలండి, పుట.191) అంటూ ఒక సామాన్యవ్యక్తి ఎలా చైతన్యవంతుడయ్యాడో తెలిపాడు సుప్రసిద్ధ నవలాకారుడు బండి నారాయణ స్వామి.

- **నవల్లోని పాత్రలు:**

అనంతపురం జిల్లా సమాజ దర్పణంగా రూపుదిద్దుకున్న ఈ నవలకు మాదిగ వడ్డెర, కురుమ, దూదేకుల, చాకలి వంటి శూద్రకులాల సజీవ సమాజ జీవనచిత్రణ ఆయువుపట్టుగా ఉంది. రెడ్డి, కమ్మ బ్రాహ్మణ వంటి ఆధిపత్యకులాల వ్యవహార సరళిని కూడా రచయిత ఇందులో లోతుగా చర్చించారు. మాదిగ దేవన్న, బోయ భూమయ్య, వడ్డె లోకప్ప, గొర్ల తిరుపాలు వంటి తొలితరం మనుషులు, పండయ్య(మాదిగ), మల్లయ్య(బోయ), విరూపాక్షి (వడ్డెర), వెంకట లక్ష్మి (మాదిగ) వంటి రెండో తరం వారు, గోవిందు (చాకలి), భాస్కర నాయుడు (లింకుల చౌదరి) వంటి రౌడీలు, దళారీలూ, రాజారెడ్డి, కొండారెడ్డి, గంగుల రెడ్డి, వీరప్ప నాయుడు, గరుడ శేఖర నాయుడు వంటి ఆధిపత్య పాలక కులాలకు చెందినవారు ఈ వాస్తవిక నవలలో మనకు తారసపడతారు. సుమారు (1970-2000) మూడు దశాబ్దాల రాజకీయ సాంఘిక జీవనం ఈ నవలలో చిత్రితమైంది. ఈ జీవనం రాయలసీమ అందులోనూ ముఖ్యంగా అనంతపురం జిల్లా ప్రజల జీవనంగా ఉంది.

అనంతపురం పటటణానికి సమీపంలో పండమేరు గ్రామం వుంది. పండమేటిస్వామి సమాధి దగగరే గుడి వెలుస్తుంది. అంటరానితనం కారణంగా మాదిగలకు ఈ గుడిలో పరవేశం లేదు. మిగతా అన్నికులాల వాళళకు గుడిలో స్వామి దరశనం ఉంటుంది. తర్వాత పండమేటి గ్రామానికి తూర్పుదిక్కున వందమైళ్ల అవతల ఒక కుగ్రామంలో తాళపరతాలు దొరికినాయి, "ఆ తాళపత్రాల్లో పండమేటిస్వామి గురించిన శతక పద్యాలున్నాయి. ఆ పద్యాల్లో పండమేటి స్వామి పుట్టిన ఊరు చితరచేడు అని, అతని పూరవనామం కేశన్న అని, కులం మాదిగ, గోత్రం మందల అని తెలిసి పండమేటి పరజల్ని ఆశచరయపరిచింది." (అదే. పుట.165) దీనితో మధ్యలో పండమేటి స్వామి స్వయానా మాదిగ కులస్తుడనే నిజం వెలుగు చూస్తుంది. రెడ్లు, కమ్మలు ఏకమై వ్యతిరేకించినా, లెక్కచేయక మాదిగలు మొదటిసారి గుడిలోకి ప్రవేశించి తమ స్వామిని దర్శించుకుంటారు. ఈ ఘటనతో మాదిగలకు, బోయ, కురుమ, ఈడిగ, వడ్డెర వంటి ఇతర కులాలకు చెందినవారికీ మధ్య ఉన్న అంటరానితనం మూలంగా ఏర్పడిన అగాధం క్రమంగా తొలగిపోతుంది. ఇందులోని వస్తువు ఇదే అయినా దీనికి అనుబంధంగా అనేక సామాజికాంశాలు ముడిపడి ఉన్నాయి.

- **పేదరికంలో భార్యాభర్తలు**

ఈ నవలలో పేదదంపతుల బంధం అద్భుతంగా చెప్పబడింది. "ఒకసారి ఇరుగు పొరుగు వాళ్ళు తీర్థయాత్రలకు పోతుంటే పెద్దక్క కూడా పోయింది. మహానంది, అహోబిలం, శ్రీశైలం, యాగంటి, బ్రహ్మంగారి మఠం, అన్నీ దర్శించుకొని వచ్చింది. తీర్థయాత్రలకు మున్నూరు రూపాయల ఖర్చు పెట్టుకొని వచ్చింది. ఆమె తీర్థయాత్రలకు పోయిన ఆ మూడు రోజులూ ఉతతపోయి తిప్పన్న – నా భార్య తీర్థయాత్రలకు పోయిందీ, నా భార్య తీర్థయాత్రలకు పోయిందీ! అని ఊర్లో అందరికి చెప్పి సంతోషపడినాడు. పెద్దక్క మహానంది నుంచి తెచ్చిన విబూది పండునీ, శ్రీశైలం నుంచీ తెచ్చిన ప్రసాదాన్నీ అహోబిలం నుంచి తెచ్చిన నరసింహస్వామి పటాన్ని పిల్లోడు చూసినట్టు అబ్బురంగా చూసినాడు తిప్పన్న. తన తీర్థయాత్రల విషయాన్ని తన మొగుడు ఊరందరికి చెప్పుకుని సంతోషపడిన వైనాన్ని విని పెద్దక్క భోరుమని ఏడ్చిందంట. అయ్యో! పాపిష్టి దాన్ని! నా మొగుడు ఎంత తిక్కోడు అయితే మాత్రం, ఆయన్ని విడిచిపెట్టి తగుదునమ్మా! అని నేను ఒక్క దాన్నే తీర్థయాత్రలకు పోవల్లా? అయ్యో! నా తిక్క మొగున్ని పిల్చుకొని పోతే, ఇంకో మూడు నూర్లు ఖర్చు అయిపోతాయి కదా అనుకున్న లోభిముండని! భగవంతుడు నన్ను చెమిస్తాడా?" (అదే. పుట. 5) అని పశ్చాత్తాప పడుతుంది. ఈ సన్నివేశంలో నిరక్షరాస్యులైన దంపతులకు ఒకరిపై మరొకరికి ఎలాంటి ప్రేమానురాగాలున్నాయో నవలాకారుడు అద్భుతంగా చెప్పాడు. అదే ధనవంతులకు ఈ అక్షరాస్యులకు, ఉద్యోగులకు ఇలాంటి బంధమున్నట్లు చెప్పడం సాహసమే అవుతుంది.

- **అస్పృశ్యత:**

అంటరానితనం ఎంత దారుణంగా ఉందో బండి నారాయణ స్వామి స్పష్టంగా పేర్కొన్నాడు. భూమయ్య అనే వ్యక్తి తన తమ్ముని ఇలా మందలిస్తాడు.

"ఒలే! మాదిగొల్లతో సావాసాలేందిరా? బోయొల్లతో తిరుగు, వడ్డేవాల్లతో తిరుగు, గొల్లొల్లతో తిరుగు, పోయి పోయి మాదిగోల్లతో, మాలోల్లతో తిరుగుతానంటవేందిరా! ఈ కులాలన్నీ దేవుడు ఎందుకు పెట్టినాడు? నువ్వు బోయెల్లలో పుట్టుపో! నువ్వు రెడ్లలో పుట్టుపో! నీవు బాపనోల్లలో పుట్టుపో అని ఏ కులంలో పుట్టాల్సిన వాన్ని ఆ కులంలో ఎందుకు పుట్టిస్తాండాడు? ఒరే మల్లిగా, మనం మనుషులం. దేవుడు పుట్టీకపోతే మనం యాడుండే వాల్లం. ఈ పొద్దు నాలుగచ్చరాలు సదువుకున్నావో, లేదో కులం లేదు, గిలం లేదు అని వితండవాదం చేస్తావా? అసలు కులాలు పెట్టిందెవడ్రా దేవుడు! దేవుని కంటే నీకెక్కువ తెల్సా అని ఖయ్యి ఖయ్యిమని లేచేవాడు తమ్ముని మీదికి పూజారి భూమయ్య" (అదే. పుట. 21) అంటాడు. నవలాకారుడు బండి నారాయణ స్వామి. అనంతపురం జిల్లాలో అంటరానితనం ఏ స్థాయిలో ఉందో ఈ ఒక్క ఘటన చాలు చెప్పడానికి ఒక్క అనంతపురంలోనే కాదు రాయలసీమంతా ఇదే పరిస్థితి ఉంది.

ఒక దళిత బాలునికి అగరవ్ర్ణాల వారు బాత్‌రూంలో భోజనం పెడతారు. ఆ ఘటనతో ఆ బాలుడు ఎంతగానో ఆవేదన చెందుతాడు. ఈ విషయాన్ని రచయిత బండి నారాయణస్వామి ఇలా తెలిపాడు. "ఏం పాండూ! బాగున్నావా? అంది. ఈ మధ్య మన ఇంటికి రావడం లేదు? అని అడిగింది.... ``ఒరే పాండూ, రారా! ఈ బాత్‌రూమ్‌లోకి రా`` అని గునగునగా అరిచి బాత్ రూమ్‌లోకి దారి తీసింది. తను బాత్ రూమ్‌లోకి పోతూనే ఆ ఇసతరాకును తన రెండు చేతుల్లో పెట్టి, ఆప్యాయంగా తినరా, పాండూ! తిను నీళ్ళు తెస్తాను! అని వెళ్ళిపోయింది. అంత వరకూ తను గుపతవ్కకన్ కూర్చుని భోజనం చేయబోతున్నాడనే అనుకున్నాడు. బాత్ రూంలో అన్నం తినేదాన్ని ఊహించుకోలేక పోయినాడు. తనను వీళ్ళు భోజనానికి ఎందుకు పిలచల్లె? ఇంత అవమానం ఎందుకు చేయల్ల అనుకున్నాడు...వెంటనే ఛఛ అవమానమా? గుప్త ఎట్లాంటివాడు? గుప్త తల్లి ఎట్లాంటిది? ఎంత మంచి వాళ్ళు తనని ఎందుకు అవమానం చేస్తారు అనుకొని తింటాడు.

``ఇంకెప్పుడూ నాతో మాట్లాడొద్దు! ఏమీ?``

మీరంతా చాలా ఛీప్ మనుషులు అన్నాడు మా అనన్. నువ్వు అట్లాంటివానివి కాదని వాదించినాను. రుజువు చేస్తే పాండుగానితో స్నేహం విడిచి పెడతావా అన్నాడు మా అనన్. నేను నీ మీద నమమకంతో ఒప్పుకున్నాను. మా అన్నే కరెక్ట్! నీవు చాలా ఛీప్ నా కొడుకువి! ఎంత చీప్ నా కొడుకువి కాకపోతే అన్నానికి మొగం వాచినట్లు అట్ల బాత్‌రూములో తింటావు? థూ! థూ! ఇంకెప్పుడూ నాతో మాట్లాడొద్దు..." (అదే. పుట. 39) అంటూ దళితుడైన పాండుకు బాత్ రూంలో భోజనం పెడతారు. ఇలాంటి అమానవీయ మనసతత్వంగల మనుషులు కూడా ఉన్నారు. బొడ్డురాయికి ఒక దళిత బాలిక నీళ్ళు పోసిందని తెలుసుకున్న అగరవ్ర్ణ స్త్రీ ఆ విద్యార్థిని తీవ్రంగా మందలిస్తుంది. దాంతో ఆ బాలిక భయపడి దూరంగా వెళ్ళిపోతుంది. ఈ విషయాన్ని రచయిత బండి నారాయణ స్వామి ఇలా తెలిపాడు. "ఊర్లో ఇంతమంది ఉండారు. ఒకకరంటే ఒకకర్నా ఆ పాప మాదిగోల్ల పాప అని కనిపెటలేక పోయినారా? అని తన పకకన్ నోర్లు తెరుచుకొని నిలబడిన ఆడవాళ్ల మీద రంకెలేసింది.

దైవం దగగర్ కూడా ఇంత వర్ణ వివక్ష చూపడం అత్యంత హేయం. బుద్ధి తెలిసి, తెలియని పిలల్‌పట్ల అంత కోపం చూపడం దారుణం. దీనిని అమానుషంగా పేర్కొనవచ్చు. పసిబిడడల్ మనస్సును గాయపరచడమే కాకుండా భౌతికంగా దాడి చేయడం హీనమైన చరయగ్ా భావించాల్సి ఉంది. ఒక పక్క దళితులపై ఆధారపడి జీవిస్తూ ఆ దళితుల పైన్నే అగరవ్ర్ణాల వారు దాడులకు పాలపడుతున్నారు. అది మానసికంగా, శారీరకంగా కూడా కావచ్చు. దళితుల శరమ్ లేకపోతే అగరవ్ర్ణాలకు తిండి ఉందు. దాంతో ఆకలితో అలమటించి చావాల్సిందే. ఈ సత్యం దళితులకూ, అగరవ్ర్ణాలకు కూడా తెలుసు. అయినా దళితులు ఎప్పుడూ సహాయ నిరాకరణ పాటించలేదు.

❖ **మనిషి మలాన్ని ఎత్తుట:**

గతంలో అంటే ఐదు దశాబ్దాలప్పుడు మనిషి మలాన్ని దళితులు ఎత్తి గంపలో వేసుకొని మోసుకొని పోయేవాళ్ళు. ఈ విషయాన్ని బండి నారాయణ స్వామి ఇలా అంటాడు. "ఒక చేతికి ఇనుప గంప తీసుకొనేవాడు. ఇంకో చేతికి ఇనుపరేకు తీసుకునేవాడు. వీధిలోని జనాలు ఊపిరి బిగపట్టుకొని, ఆడవాళ్ళు ముఖం వికారంగా పెట్టి పైట చెంగుతో ముక్కు మూసుకొని గబగబ అడుగులేస్తూ పారిపోతుండగా, పండయ్య పెద్ద నాయన రోడ్డు వైపు నింపాదిగా నడిచి, చేతిలోని రేకుతో దొడ్డిలోని అమేధ్యాన్నంతా గంపలోని నూక్కోనొచ్చి నిర్వికారంగా ట్రాక్టరులోని డ్రమ్ములు నింపుతుండేవాడు. అదంతా తలచుకునేదానికి ఒకప్పుడు పండయ్యకు ఇష్టముండేది కాదు. ప్రస్తుతం అతనికి ఏమనిపిస్తుందంటే కడుపులోని పెద్ద పేగుల్లోనే అది తయారై ఉన్నప్పుడు లేని అసహ్యం, అది కాస్తా బైట పడినప్పుడు మాత్రం ఎందుకు కలగాలో? ఒక వేళ కలిగిందో అనుకో, శుభ్రం చేసేవాన్ని చూసి ఎందుకు అసహ్యించుకోవాలో? పుండును ముట్టుకొని పరీక్షించి శుభ్రం చేసే డాక్టర్ని గౌరవించారు గానీ, ఆమేద్యాన్ని ఊడ్చేసి, శుభ్రం చేసే వాన్ని గౌరవించరు. వాన్ని దూరంగా నెట్టి, వానికి ఊర్లో మంగలిని లేకుండా చేసి, చాకలిని లేకుండా చేసి వెలివేస్తారు. వంటింట్లో మసిగుడ్డ నల్లగా ఉందనీ, అందరూ కాళ్ళు తుడుచుకునే తివాచీ

మైలపడిందనీ ఆరోపించడం ఒక్క మనిషి జాతికీ చెల్లింది" (అదే. పుట. 40) అంటాడు బండి నారాయణ స్వామి. ఈ అమానవీయ అంశాన్ని హృదయ విదారకంగా చెప్పాడు రచయిత. ఈ పాకీ పనిని ఒకనాడు మాల మాదిగలు చేసేవారు. ఆ తర్వాత యానాది వారు చేసేవారు. కానీ నేడు చాలా వరకు యంత్రాలు వచ్చాయి. నేటి తరానికి తెలియని ఈ అంశాన్ని రచయిత కళ్ళకు కట్టినట్లు చిత్రించాడు.

❖ **నక్సలైట్లకి తాయిలాలు:**

లొంగిన నక్సలైట్లకు ప్రభుత్వం తాయిలాలిస్తుంది. వాటిని లొంగిన వారు అపురూపంగా తీసికుంటారు. అలా తీసికోవడాన్ని నవలా కారుడుగా బండి నారాయణ స్వామి వ్యంగ్యంగా విమర్శించాడు. ఆయన మాటలు ఇలా ఉన్నాయి. "లొంగిపోయే నక్సలైట్లకు ప్రభుత్వం ట్రాక్టర్లు మంజూరు చేస్తుంది. అంతో ఇంతో భూమి ఇస్తుంది. అప్పటికి దేశంలోని ప్రజలందరికీ ట్రాక్టర్లూ, భూములూ ఉన్నట్లూ, తమకు మాత్రమే లేనట్లు ఈ నక్సలైట్లు ఆ సదుపాయాలు తీసికుంటారు. వాళ్ళు ఒకప్పుడు భూమి లేని, ట్రాక్టర్లు లేని బీదసాదల కోసం పోరాటం జరిపిన వాళ్ళంట. విప్లవాన్ని సన్యసించిన ఏ మార్క్సిస్టూ మామూలు ప్రజల మాదిరి ఏదో ఇంత పనిచేసుకొని ప్రజల్లో బతికేదానికి ఇష్టపడడు. ఏ రెడ్డి మాదిరో, కమ్మాయన మాదిరో వర్తకుని మాదిరో బతికేదానికి చూస్తాడు. కానీ పూర్వజీవితంలో వీళ్ళందరినీ తూర్పార బట్టి ఉంటాడు. తానేదో నీతి స్వభావం కలవాడైనట్లు! జీవితంలోకి వచ్చేటప్పటికి తాను నమ్ముకున్న శ్రమ శక్తీ, డిగ్నిటీ ఆఫ్ లేబర్, ప్రొలిటేరియన్ కల్చర్సు ఇవన్నీ ఏమయి పోతాయో! తాము జీవితంలో అనుసరించలేని సిద్ధాంతాల్నీ, సూత్రాల్నీ దశాబ్దాలు దర్గాలుగా ప్రజలకు చెప్పుకుంటూ బతికి ఉంటారు. మనుషులు తాము తిట్టిన పనుల్నీ ఎక్కువగా చేస్తుంటారు. పాపం! చెడిపోయిన కమ్యూనిస్టులు మాత్రం మనుషులు కారా!" (అదే. పుట.171) అంటాడు బండి నారాయణ స్వామి. ఈ అంశంలో రచయిత చెప్పినవన్నీ వ్యంగ్యాస్త్రా లేననక తప్పదు. ఎంతో సునిశిత దృష్టితో సమాజాన్ని పరిశీలించి పాఠకుల కళ్ళకు కట్టినటు తెలిపాడు.

ఈ నవలను విశ్లేషిస్తూ ప్రముఖ విమర్శకుడు అంబటి సురేంద్రరాజు ఇలా అంటాడు. – "మాదిగ పండయ్య నవల చివరిలో భాస్కర చౌదరి పై ఎన్నికల్లో పోటీకి దిగుతాడు. ఎవరు వద్దన్నా వినడు. బేఖాతరు చేస్తారు. వద్దన్న వాళ్ళతో పండక్క ఒక్కటే మాట అంటాడు. కర్ణుడికి కిరీటా వచ్చినంక తప్ప అతని శక్తి సామాణ్యుల ప్రపంచానికి తెలిసి రాలేరు. ఈ సమయంలో మన మాదిగోళ్ళ భవిష్యత్తు కూడా అంతే! నవలకు ఇది భరత వాక్యం. బహుజన హితాయి! బహుజన సుఖాయ! ఈ రాజ్యం మీదెనండీ! మీ రాజ్యం మీరేలండీ! శూద్రుల కథ 'గాథగా' రూపాంతరం చెందిన అపురూపమైన సందర్భం స్వామి నవల" (అదే. పుట. 200) అంటూ ఈ నవలాతత్వాన్ని తెలియజేశాడు.

**ముగింపు:**

ఈ నవల మాదిగల చైతన్యానికి సంకేతంగా నిలుస్తుందనీ, అనంతపురం జిల్లా ప్రజా జీవనానికి ప్రతిబింబంగా నిలుస్తుందనీ, ఈ నవలలోని వస్తువు భావికాలంలో చరిత్రకారులకు ఆధారంగా నిలబడుతుందని చెప్పవచ్చు. దీనికి హేతువుగా నారాయణ స్వామికి సమాజం పట్ల ఉన్న అవగాహన, సామాజిక స్పృహయేనని చెప్పవచ్చు.

**ఆధార గ్రంథాలు:**


1 నారాయణస్వామి, బండి. (2001) మీ రాజ్యం మీరేలండి, అన్విక్ష్ కి పబ్లికేషన్స్, విజయవాడ

2 వెంకటసుబ్బయ్య, వల్లం పాటి (1998) నవలాశిల్పం, విశాలాంధ్ర పబ్లికేషన్స్ విజయవాడ

3 చంద్రశేఖర్ రెడ్డి, రాచపాళెం(20014) మన నవలలు – మన కథానికలు. కావ్య పబ్లికేషన్స్ కడప

4 రామమూర్తి శ్రీకరం (2019) సీమ బతుకులు, రాయలసీమ పబ్లికేషన్స్ కర్నూల్

5 రాజ కృష్ణ గొల్లమారి ,( 2020)రాయలసీమ రాజ్యం వ్యాసం, 2021 ABN e పేపర్ జూన్.


*******

# 18. కొలకలూరి ఇనాక్ నవలలు - శిల్పం

**జి.రమేష్ బాబు**

పరిశోధక విద్యార్థి

తెలుగు అధ్యయన శాఖ

శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి

చరవాణి : 70133 52029

garikapatirameshbabu32@gmail.com

ఉపోద్ఘాతం

ఆధునికాంధ్ర సాహిత్య నందనోద్యాన వనంలో సహస్ర నవ వసంత శోభావిలసితమైన విశిష్ట కావ్య ప్రక్రియ నవల. విశ్వవ్యాప్తమైన విజ్ఞానాన్ని తనలో ఇముడ్చుకోగల ప్రక్రియ నవల. Novel is a science of life నవల ఒక జీవిత విజ్ఞాన శాస్త్రం లాంటిది. 16వ శతాబ్దంలో ఆంగ్ల సాహిత్యంలో ప్రభవించిన నవల 19వ శతాబ్దంలో భారతదేశంలోని బెంగాల్‌లో అడుగు పెట్టింది. బంకించంద్రఛటర్జీ భారతీయ నవల రచనకు ఆద్యుడు. Novel అన్న ఆంగ్ల పదంను తెలుగులో నవల అన్న పేరు సూచించింది. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి నవలకు ఆ పేరు పెట్టింది ఇతడే. 'నవాన్ విశేషాన్ లాతి గృహాతీతి నవలా'అనగా నవీనమైన విషయాలు తెలుపునది అని నిర్వచించారు బ్రహ్మయ్యశాస్త్రిగారు. అంతకుముందు నవలకు వచన ప్రబంధం అనీ, నవీన ప్రబంధం అనీ కూడ పేర్లున్నాయి. కవిత్వం మీద తిరుగుబాటుగా నవల ప్రక్రియ ప్రారంభం అయ్యింది అని కొందరు విమర్శకులు పేర్కొన్నారు. కల్పనలతో కూడిన సుదీర్ఘ ఊహ నిర్మిత కథ నవల. కథ మానవ జీవిత పార్శ్వాన్ని చెపుతుంది. నవల మానవ జీవితాన్ని అన్ని పార్శ్వాలలో అధ్యయనం చేసి సమగ్రంగా చెబుతుంది. నవలలో కథ, కవిత్వం, నాటకం ఈ మూడు కలగలసిన సమాహార ప్రక్రియ. మధ్య తరగతి ఇతిహాసం అని కూడా దీనికి పేరు. తొలినాళ్ళలో జాతీయోద్యమ ప్రభావం, సంఘ సంస్కరణోద్యమ నేపథ్యంతో నవల ప్రక్రియ ప్రారంభం అయ్యింది. ఆంగ్ల విద్యావ్యాప్తి సంఘ సంస్కరణోద్యమం, పత్రికా వ్యాప్తి నవలా వికాసంకు దోహదం అయ్యాయి. తెలుగు నవలా రాశిలోను, వాశిలోను చాలా విశిష్టమైన స్థానం తెచ్చి పెట్టాయి. 1892లో న్యాపతి సుబ్బారావు సంపాదకత్వంలో వెలువడిన చింతామణి పత్రిక నవలను బాగా ప్రోత్సహించింది. నవలా రచనకు కావలసిన సూత్రాలను నిర్ణయించింది. నవలల పోటీలు నిర్వహించి నవలా సాహిత్యాన్ని ప్రాచుర్యంలోకి తెచ్చింది. నవలకు నాలుగు ముఖ్య లక్షణాలు నిర్దేశించింది. 1. వచనం కలిగి ఉండాలి 2. కథ కలిగి ఉండాలి 3. సుదీర్ఘత కలిగి ఉండాలి. 4. కల్పనలు కలిగి ఉండాలి అని నిర్దేశించారు. నవలకు జీవిత వాస్తవికత సామాజిక చైతన్యమే పునాది. మానవుడు తన అనుభవాలను, అనుభూతులను చెప్పుకోవటానికి విశాల వేదిక. నవల కాలానుగుణంగా వచ్చే ఉద్యమాలను, ధోరణులను వాదాలను తనలో ఇముడ్చుకుని నిత్యనూతనత్వం పొందింది. అందుకే అన్ని ప్రక్రియల కన్నా ఎక్కువ ప్రాచుర్యం పొందింది తెలుగు సాహిత్యంలో.

**కొలకలూరి ఇనాక్ నవల సాహిత్యం :**

తెలుగు సాహితీ లోకంలో ప్రసిద్ధి పొందిన రచయిత ఇనాక్. తెలుగు సాహిత్యంలోని అన్ని ప్రక్రియలలో రచనలు చేసి ఒక బలమైన ముద్రను సాహిత్యంపై ప్రతిష్ఠింప చేసుకున్నారు. గత 60 సంవత్సరాలుగా అలుపెరగనీ సాహితీ కృషి చేస్తున్నారు. తెలుగు సాహిత్యంలో ఆయన విరామం ఎరుగనీ రచయిత. ఒక నిరంతర సంవేదనశీలి. సుమారుగా 110కీ పైగా గ్రంథాలు రాశారు. అందులో నవల రచనకు ఒక విశిష్టమైన స్థానం ఉంది. 1961వ సంవత్సరం నుండి ఇనాక్ గారు నవల రచనను ప్రారంభించారు. ఇప్పటీ వరకు వారు మొత్తం 16 నవలలు రాశారు. అందులో 14 నవలలు ముద్రితం అయ్యాయి. రెండు నవలలు అముద్రితాలు. 1. సమత 2. అనాథ

3. సౌందర్యవతి 4. సౌభాగ్యవతి 5. ఇరులలో వీరులు 6. ఎక్కడుంది ప్రశాంతి 7. రెండు కళ్ళు - మూడుకాళ్ళు 8. సర్కారుగడ్డి 9. అనంత జీవనం 10. రంథి 11. కన్నతల్లి 12. పులులబోనులో నేను 13. పైమెట్టు 14. వలస . అముద్రి నవలల 1. మాజీమనిషి 2. ఈద్‌ముబారక్. ప్రముఖ సాహితీ విమర్శకురాలు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత ఆచార్య కాత్యాయనీ విద్మహేగారు అధ్యయన సౌలభ్యం కోసం ఇనాక్ గారి నవలను 3 రకాలుగ వర్గీకరించారు. 1. 60వ దశకపు నవలలు 2. 70వ దశకపు నవలలు 3. నూతన సహస్రాబ్ది నవలలు అని వర్గీకరించారు. నేను కార్చిన కన్నీరే నా సాహిత్యం అని ఇనాక్ గారు చెప్పుకున్నారు. తన జీవిత అనుభవానలు, తాను ఎదుర్కొన్న సమస్యలను, తన కళ్ళముందు జరిగిన యథార్థ సంఘటనలను ఆధారంగా చేసుకుని నవల నిర్మాణం చేశారు. ఈ వాస్తవిక ధోరణులే ఇనాక్ నవలకు ప్రాణం. కల్పనలు కన్నా వాస్తవిక అంశాలకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తారు. సజీవమైన భాషను ఉపయోగించి సజీవమైన పాత్రచిత్రణ చేస్తారు. సమకాలీన సామాజిక దృష్టి కోణంను జోడించి నవల నిర్మాణం చేస్తారు. సమాజంలోని దోపిడి, అణచివేత, వర్గ వివక్షకు వ్యతిరేకంగా సమాజాన్ని ప్రగతిశీల పథంలో నడిపించడానికి కృషి చేస్తున్నారు. తన నవల నిర్మాణంలో పటిష్టమైన, విశిష్టమైన శిల్పంను ఉపయోగిస్తారు.

**శిల్పం :**

శిల్పంను ఆంగ్లంలో Technique అని అంటారు. దీనికి అర్థం నైపుణ్యం. ఒక రచయిత రచనను చేసేటప్పుడు అతడు అనుసరించిన పద్ధతి, ప్రదర్శించిన నైపుణ్యం అంత ఇందులోనికి వస్తుంది. శిల్పం అంటే రచనారీతి శైలి, ప్రారంభం, ముగింపు, రచయిత వ్యక్తిత్వం, కథానిక చెప్పినతీరు. వస్తువంటే విషయం ఇతివృత్తం కథ, కథానిక రచనకు తీసుకున్న అంశం అవి చెప్పిన తీరు శిల్పం క్రిందికి వస్తాయి. వస్తువు మట్టి ముద్ద దాన్ని బొమ్మగా మలిస్తేనే ఆకారం రూపం. ఈ మలిచే ప్రక్రియ కథనం. ఈ ప్రక్రియకి సాంకేతికంగా శిల్పం అని పేరు. శిల్ప నిర్మాణానికి సంబంధించింది కథ. ఆ కథను ప్రథమ పురుషలో చెప్పాడా, ఉత్తమ పురుషలో చెప్పాడా, ఫ్లాష్ బ్యాక్‌లో చెప్పాడా? ఉత్కంఠత కోసం ఏ సన్నివేశం తరువాత దేన్ని సమకూర్చాడు. కథకు లేదా నవలకు పేరెలా పెట్టాడు ఇవి అన్ని చెప్పి తీరును శిల్పం అంటారు. శిల్పం పటిష్ఠంగా ఉంటేనే రచయిత తాను ఆశించిన ఫలితాన్ని పొందుతాడు. కథను చెప్పే పద్ధతి, భాష సొగసు శైలి అయితే సందర్భోచితంగా పాత్రలను ప్రవేశ పెట్టడం, ఆ పాత్రల స్వభావానికి అనుగుణంగా సంభాషణలను పలికించడం శిల్పం అవుతుంది. శిల్పం కళగా మారి పాత్రల హృదయాలను ఆవిష్కరించాలి. రాచమల్లు రామచంద్రారెడ్డిగారు రచనలో మూడు అంశాలకు ప్రాధాన్యత ఇచ్చారు. అవి వస్తువు, శిల్పం, అనుభూతి. ఈ మూడు సమానంగా ఉంటేనే రచన అనేది రాణిస్తుంది. ఏది లోపించిన రచన నిలపడదు. ముఖ్యంగా శిల్పం అని పేర్కొన్నారు. శిల్పం ఎత్తుగడ, ముగింపు, నడక పాత్రల మధ్య సంఘర్షణ, సంఘర్షణ తీవ్రం కావడం శిల్పంలో భాగం. శిల్ప రహస్యం తెలియడం వేరు, శిల్ప నిర్వహణ వేరు అంటారు చందు సుబ్బారావు. అది వాస్తవం శిల్ప రహస్యం తెలియటం వరకు విద్యార్థి దశ అది నేర్చుకొనే క్రమం దానిని సమర్థవంతంగా నిర్వహించటమే సృజనకళ అది సాధ్యమయినవారే చేయి తిరిగిన రచయిత అవుతారు. దీనినే ఆంగ్లేయులు Craft అన్నారు. భవనానికి మెట్లు ఎంతటి స్థాయిని ఇస్తాయో, రచనకు శిల్పం కూడా అలాంటి స్థాయినే ఇస్తుంది. పాశ్చాత్యులు నిర్వచించినట్లు Technique is really what T.S.Eliot means by convention any selection structure or distortion any form or rhythm imposed upon the world of action in this sense every thing is Technique.

**ఆచార్య ఇనాక్ గారి నవలా శిల్పం :**

తెలుగు సాహితీలోకంలో ఇనాక్ గారి శైలి శిల్పాలకు అశేష ఆదరణ ఉంది. నవలా శీర్షికా శిల్పం మొదలుకొని, వస్తు నిర్వహణ శిల్పం, సంఘటన శిల్పం, సంఘర్షణ శిల్పం, ముగింపు శిల్పం వరకు చాలా చక్కని సమన్వయం, నైపుణ్యం ప్రదర్శించి నవల నిర్మాణం చేస్తారు. తొణకని భావోద్రేకం, వస్తువుకు తగ్గట్టుగా నిర్మించటం నవలను తీర్చిదిద్దటం వారి శక్తి. వారి ఎత్తుగడ ముగింపులు నవలలను

మరవనివ్వవు. సాహిత్యంలో పాత్రలు వారు సంభాషణలు తర్కయుక్తంగా ఉండివెంటాడుతాయి. ఉత్కంఠతను రేకెత్తించే సందర్భాలుంటాయి. ఇవి పాఠకుడిని గబగబా ఆ ఉత్కంఠకు సమాధానాన్ని అన్వేషించే ఆత్రంలో ముందుకు నడిపిస్తాయి. రచనలో ఆ బిగువు ఇనాక్ గారి శిల్ప మర్మం. నవలా శీర్షిక, ఎత్తుగడ సన్నివేశ కల్పన, సంఘటన, పాత్రచిత్రణ, సంభాషణ ఔచిత్యం, వర్ణనా నైపుణ్యం, సంఘర్షణోత్పాదన, ఉత్కంఠ, పట్టు విడుపులు, ముగింపు వంటి ప్రధాన అంశాల సమాహార రూపం శిల్పానికి ఆకృతినీ జీవాన్ని కూరుస్తుంది. ఆచార్య కొలకలూరి మధుజ్యోతిగారు చెప్పినట్టు ఇనాక్ గారి సాహిత్య సముద్రంలోని శైలి శిల్పాలను లోతులను పరామర్శించటం సాగర మథనమే వారి సాహిత్యంలో వస్తు ప్రాధాన్యమెంతటిదో వారి రచనా సరళి కూడ అంతటి ప్రముఖమైంది. వారి కథ కథన శిల్పం దానికి ఉపయోగించే భాష ఈ రెండింటి కలయిక నవలలను అద్వితీయంగా నిలుపుతున్నాయి. ఇనాక్ గారు నవలల్లో ఉపయోగించిన శిల్పాన్ని తొమ్మిది రకాలుగా విభజించుకోవచ్చు. 1. వస్తు నిర్వహణ శిల్పం 2. శీర్షకా శిల్పం 3. ఎత్తుగడ శిల్పం 4. సన్నివేశ కల్పనా శిల్పం 5. సంఘటన శిల్పం 6. సంఘర్షణ శిల్పం 7. మనస్తత్వ చిత్రణ శిల్పం 8. ముగింపు శిల్పం 9. భాషా విశేషాలు - ఇవి అన్నీ కలగలిస్తే ఒక మంచి నవల అనేది తయారు అవుతుంది. నవల రచనకు వస్తు నిర్వహణ శిల్పం అనేది పునాది వంటిది. రచయిత నవల నిర్మాణంలో ఎలాంటి వస్తువును ఎన్నుకున్నారు అందులో పాత్రచిత్రణ, స్త్రీ, పురుషులు, జంతువులు, వాతావరణం అంత దీని క్రిందకు వస్తాయి. తొలి నాళ్ళలో 60వ దశకంలో రాసిన నవలల్లో స్వీయ జీవితానుభవాలనే వస్తువుగా స్వీకరించారు. సమత, అనాథ, సౌభాగ్యవతి, పులులబోనులో నేను లో ఈ ముద్ర స్పష్టంగా కనబడుతుంది. యువతీ, యువకుల మధ్య ప్రేమానురాగాలు ఈ నవలల్లో కనిపిస్తాయి. స్వాతంత్య్ర మేఘాలు కమ్ముకోవడంతో దళిత విద్యార్థులు కళాశాలలో, విశ్వవిద్యాలయంలో చదువుకునేటప్పుడు ఎదురయ్యే వివక్షత ఇందులో మనకు కనబడుతుంది. సమత నవలలో రాజారావు దళిత యువకుడు. గుంటూరులో బి.ఎ.ఆనర్స్ పూర్తి చేసి ఉద్యోగం సంపాదించి ఇష్టమైన అమ్మాయిని కులాంతర వివాహం చేసుకుంటాడు. ఐదు సంవత్సరాల కాలవ్యవధిలో నడుస్తుంది. ఈ నవల అంత ఆ యవ్వన కాలపు కళాశాల అనుభవాలు, స్నేహాలు, స్త్రీ, పురుష ఆకర్షణలు, ప్రేమలు, ఉద్వేగాలు, సంఘర్షణలు ఈ నవలకు వస్తువును ఇచ్చాయి. గొప్ప సన్నివేశ శిల్పం కూడా ఉంది. కొడుకును గుంటూరు పంపుతూ మన వంశంలో చదువుకున్న వారిలో మొదటి వ్యక్తివి నువ్వే ఈ సమాజంలో మనం ఎవరి కంటే తక్కువ కాదు అని కొడుకు మనసులో ఆత్మగౌరవ బీజాలు వేశాడు. కళాశాలలో అంటరానితనం వల్ల వివక్షకు గురైన మిగత విషయంలో వాళ్ళతో పోటీపడి విజయం పొందుతాడు. ఆది మానవుని నుండి అనంతమైన మానవ సమాజం రూపొందే క్రమంలో కులాలు, ఉపకులాలు ఏర్పడి మనుషుల మనస్సులు మంటగలసినాయి. రక్తంలో మార్పురావాలనీ వర్ణాంతర, కులాంతర వివాహాల వల్లనే సాధ్యం అవుతుంది అని మరదలు స్వర్ణను ఒప్పించి ప్రేమించిన అమ్మాయి సంధ్యను పెళ్ళి చేసుకుంటాడు. ఈ నవల ముగింపు శిల్పంలో ఈ కుల వ్యవస్థ రూపుమాపటానికి కులాంతర వివాహాలు కావాలి అనే సందేశం కూడా సూచించారు. సౌభాగ్యవతి నవలలోనూ ఇతివృత్తం చదువుకొనే యువతీ యువకుల ప్రేమల చుట్టునే అల్లబడింది. ఇందులో సంఘర్షణ శిల్పం, పాత్రచిత్రణ నైపుణ్యం, విశిష్టంగా కనబడుతుంది. మామ ఇంటికీ పెంపకం వచ్చినందువలన కలసి పెరగడం వలన బావా మరదళ్ళ మధ్య స్నేహ పూరితమైన సోదరభావం ఏర్పడుతుంది. అది చివరకు ప్రణయంగా దారితీస్తుంది. మానవ మనస్తత్వమే మనిషిలోని సమస్త భావాలకు ద్వంద్వలకు సంఘర్షణలకు మూలం. మనిషి మనస్సుల్లోని ఆరాటం, ప్రేమను నిజం చేసుకోవటానికి వసుమతి టిబి రోగంకు గురైన తన బావను రోగవిముక్తునీ చేసి సౌభాగ్యవతిగా మారటం ఈ నవలలో గొప్పశిల్పంను మనకు కనబరుస్తుంది.

అనాథ నవల 13 రాత్రులు నిద్రపోకుండా ఎంతో శ్రమించి రాసిన నవల. ఇది ఆంధ్రప్రభలో మంచి బహుమతి పొందినది. కులం కారణంగా, కురూపి అవ్వడం వలన దెయ్యం పిల్లగా పిలువబడి ఊరు నుండి వెలివేయబడిన పోలి తల్లి ఒక అనాథగా మారి ఎన్నో బాధలను భరించి హాస్టల్‌లో చేరి చివరకు దిక్కులేని ఒక అనాథను చేరతీసి ఆమెకు తల్లి అవుతుంది. ఈ నవలలో సంఘర్షణ శిల్పం

చాలా గొప్పగా చిత్రీకరించారు. పాత్రలు సజీవంగా మన కళ్ళకు కట్టినట్లుగా కనిపిస్తాయి. సందేశనాత్మక ముగింపును ఇచ్చారు. పులులబోనులో నేను ఇది ఇనాక్ గారి ఆత్మకథాత్మ నవల. కేంద్ర విశ్వవిద్యాలయంలో బి.ఎ.ఆనర్స్ చదువుకునేటప్పుడు ఆయన ఎదుర్కొన్న అవమానాలు, భంగపాట్లు, ఆత్మస్థైర్యంతో ఆయన చేసిన తిరుగుబాట్లు అన్ని ఇందులో ఉన్నాయి. కులవ్యవస్థ కనిపించని పులులబోను ఆ బోనులోచిక్కి మాననీ మానసిక గాయాలెన్నో పొంది చివరకు పులుల వాత పడకుండా చదువుకోవాలన్న తన లక్ష్యంను నెరవేర్చుకొని తననీ తాను నిలబెట్టుకొన్న ఆత్మస్థైర్యం గల యువకునిగా పోరాట పటిమగల విశిష్ట వ్యక్తిత్వం కలిగిన విద్యార్థిగా ఇందులో మనకు గోచరిస్తారు. ఇందులో సంఘటన, సంఘర్షణ శిల్పలు ఎంతో ఔన్నత్యంతో ముందుకు సాగినాయి. ఎక్కడుంది ప్రశాంతి నవలలో కరువును కేంద్రంగా తీసుకొని నవల నిర్మాణం చేశారు. ఒకే సమయంలో అటు భార్యను ఇటు బిడ్డను పోగొట్టుకున్న వ్యక్తి వేరొక పెళ్ళి చేసుకున్న ఆమె వద్ద నుండి కూడా తాను జీవితంలో ప్రశాంతతను పొందలేకపోతాడు. శీర్షిక శిల్పంలో ఉన్న ఎక్కడుంది ప్రశాంతి అన్న పేరు ఈ నవల అంతటా కూడా మనకు కనబడుతుంది. పాత్రల మధ్యన అంత: సంఘర్షణ ఇందులో కనబడుతుంది. రెండు కళ్ళు - మూడు కాళ్ళు నవలలో మానవత్వం నశించి మనుషలను వ్యాపార వస్తువులుగా చూసే బెనర్జీ లాంటి దుర్మార్గుల వలన అమాయకపు పసిబిడ్డలు తల్లిదండ్రుల వద్ద నుండి అపహరింపబడి వికలాంగులు లాగ మార్చబడి ఏ విధంగా దుర్భరమైన వేదనను అనుభవిస్తుంది. కళ్ళకు కట్టినట్లుగా వర్ణించారు.

నవల ముగింపు శిల్పంలో ఒక చైతన్యాత్మకమైన సందేశంను ఇచ్చారు. తమ జీవితం ఇలా దుర్భరంగ మారటానికి కారకుడైన బెనర్జీనీ సీత తన చేతి కర్ర సహాయంతో చంపివేసి అక్కడ ఉన్నవాళ్ళ అందరి జీవితాలలో వెలుగులు నింపుతుంది. రాయలసీమ జన జీవితాలను చిత్రిస్తూ ఇనాక్ గారు సర్కారుగడ్డి, అనంత జీవనం రెండు నవలలు రాశారు. ఇందులో సర్కారు గడ్డి అనావృష్టి గురించి, అనంత జీవనం అతివృష్టిని గురించి మన కళ్ళకు కట్టినట్లు చూపిస్తారు. రాయలసీమ ప్రజల బ్రతుకుచిత్రణను కరువు కారణంగా రాయలసీమలో ఆహారపు కొరత ఏర్పడుతుంది. పశువులు మేతకు కొరత ఏర్పడుతుంది. ప్రభుత్వం సర్కారు ప్రాంతం నుండి రాయలసీమకు గడ్డి పంపిణి చేస్తే ఆ గడ్డి దక్కకుండా ఏ విధంగా భూస్వాములు అడ్డుకుంటారు. దళితులతో పాటుగా దళితుల పశువులు కూడ ఏ విధంగా వివక్షతను గురి అవుతారో వివరించారు. రాయలసీమలో రైతులకు, పశువులకు మధ్య ఉన్న అవినావభావ సంబంధం ఇందులో రావుడు, లచ్చవుడు పాత్రలలో మనకు కనబడుతుంది. 9.11.1996 ప్రాంతంలో అనంతపురంలో వచ్చిన తుఫాను జన జీవితాలను ఎలా అస్తవ్యస్తం చేసింది. సామాన్య ప్రజల బ్రతుకులు ఏవిధంగా ఛిన్నా భిన్నం అయ్యాయి. ఇందులో సంఘటన శిల్పం ద్వారా రచయిత అభివ్యక్తీకరించారు. దీనికి ఉపయోగించిన కథ కథన శిల్పం చాలా విశిష్టం అయినది. అనంతపురంలో కురిసన వాన రాంపిరెడ్డి, వేంకటేశ్వరరెడ్డి లాంటి భూస్వాముల బూర్జువా వ్యవస్థను కూల్చివేసి తుఫాను అనంతరం ఒక ప్రజాస్వామ్య వ్యవస్థకు శంఖారావం ఊదినారు.

2018లో ఇనాక్ రాసిన రంధీనవల దళిత స్త్రీ ప్రాధాన్యంను మనకు తెలియజేస్తుంది. రచయిత జన్మస్థలమైన వేజండ్ల గ్రామ కుల వివక్షత ఈ నవలలో కనిపిస్తుంది. సువ్వి అనే పేరుగల సువార్త చుట్టూ అల్లుకొన్న నవల ఇది. చదువు కోసం గుంటూరుకు రోజు రైలులో వెళ్ళే సువ్వికీ ఆ ఊరి సంపన్న వర్గానికి చెందిన నాంచారయ్య ఏకైక కొడుకు రాముడు నుండి ఎదురైన సమస్య ఆమెను మానభంగం చెయ్యటానికి ప్రయత్నం చేసి విఫలుడై ఆమెను చంపటానికి వెళ్ళి చందరి చేతిలో పరాభవం పొంది చివరకు రైలు పట్టాల మీద తలపెట్టి మరణిస్తాడు. సువ్వి చందిరినీ పెళ్ళి చేసుకున్న చదువుకు ఆపకుండా తన చదువును పూర్తిచేసి తానుకన్న కలలు నెరవేర్చుకుంది. వస్తు నిర్వహణ శిల్పం మొదలుకొని, కథా కథన శిల్పం, సంఘర్షణ శిల్పం వరకు చాలా ఉత్కంఠతో నవల నిర్మాణం చేశాడు రచయిత. పైమెట్టు నవలలో మాదిగల ఉపకులం అయిన చిందు భోగం వారి గురించి కులవ్యవస్థలో కనిపించే అంతర్వివక్షను నైపథ్యంగా చేసుకుని నవలా నిర్మాణం జరిగింది. పైమెట్టు నవలలో వస్తువు దొరబాబు పెళ్ళి జరుగుతుందా! జరగదా! అన్నా సందిగ్ధ

స్థితిలో ప్రారంభం అవుతుంది. సందిగ్ధానికి తెరనుదించుతూ ఒక్కొక్క చిక్కు ముడిని విప్పుకొస్తు చివరకు పెళ్ళి జరిపి నవలను ముగిస్తారు. అక్క తమ్ముళ్ళ అనుబంధాలు మేనరిక వివాహంపై మమకారాలు మాదిగలకు వాళ్ళ ఉపకులాలకు మధ్యగల సంబంధాలను కలుపుకుంటూ నవల సాగుతుంది. కౌటుంబిక వ్యవస్థ నుండి సామాజిక వ్యవస్థలోకి విస్తరింపజేయడం ద్వారా నవల రచయిత ఇక్కడ విజయం సాధించాడు. మాదిగల పౌరోహితుడు అయిన మాదిగ దాసు ఆచార్య వ్యవహారాలను గొప్ప అభిమానంతో వర్ణించాడు. పెళ్ళంటే ఒక వరుడు ఒక వధువు కానీ ఇక్కడ ఇద్దరు వధువులు ఒకామె మేనత్త కూతురు బుజ్జి ఇంకొకరు మేనమామ చిట్టోడి కూతురు.

వలస నవల ఇందులో ఇనాక్‌గారు ఉపయోగించిన కథా కథన శిల్పం చాలా విశిష్టం అయినది. చైనాలోని వూహన్‌లో జనించిన కరోన వైరస్ ప్రపంచలోని అన్ని ప్రాంతాలకు వ్యాప్తి చెంది జన జీవితాలను ఎలా సంక్షోభింపచేసింది. ఏవిధంగా మారణకాండ సృష్టించింది, మనిషినీ మనిషి చూస్తూ భయపడే పరిస్థితులను ఎలా కల్పించింది. ఇందులో వివరించారు. 2020 మే 24 లాక్‌డౌన్ కారణంగా ప్రజలు అందరు చాలా ఇబ్బందులు ఎదుర్కొన్నారు. ఉద్యోగాలుపోవటం, ఉపాధిలేకపోవటం, బ్రతుకు తెరువు మార్గాలు మూసుకుపోవటం ఇది ఆనాటి దేశ ముఖచిత్రం. ఎక్కడో బీహర్ నుండి హైదరాబాద్‌కు పొట్టకూటి కోసం వచ్చిన కార్మికులు లాక్‌డౌన్ కారణంగా తిండిలేక ఆకలితో అనాథ చావులు చావటం ఇష్టంలేక హైదరాబాద్ నుండి బీహార్‌కు తమ సామానులను మూట కట్టుకుని కాలినడక 1400 కిలోమీటర్లు ప్రయాణం చేసి తమ స్వంత రాష్ట్రం బీహార్‌కు చేరుకోవటానికి రాంరతన్ అనే తమ నాయకుని నేతృత్వంలో ప్రయాణం ప్రారంభిస్తారు. ప్రభుత్వ కంటే కూడ వాళ్ళకు స్వచ్ఛంద సంస్థలే ఎక్కువ సహాయం చేసినట్లు నవలలో వివరించారు. కరోనా కష్టకాలం నాటి పరిస్థితులకు ఈ నవల దర్పణంలా నాటి పరిస్థితులను వర్ణిస్తుంది.

పైన వివరించిన విధంగా ఇనాక్ గారు తన నవలల్లో చాలా చక్కని శిల్పాన్ని ఉపయోగించారు. వస్తువు మొదలుకొని పాత్రచిత్రణ, సన్నివేశకల్పన, సంఘట, సంఘర్షణ శిల్పాలను చాలా గొప్పగా నిర్వహించారు. నవల యొక్క ముగింపు శిల్పంను కూడ సమర్థవంతంగా పోషించారు. కొన్ని నవలల్లో సందేశాత్మకం, ఇంకొన్ని నవలల్లో ప్రశ్నార్థకంగా, కొన్ని నవలల్లో ముగింపు పాఠకుల అభిప్రాయానికే విడిచిపెట్టారు. కులమతాలు లేని సమసమాజాన్ని రచయిత తన నవలలు ద్వారా ఆకాంక్షించారు. విద్య ద్వారా చైతన్యం పొందిన విద్యార్థులు కులమతాల అడ్డుగోడలు కూల్చివేయాలి అని కోరుకున్నారు.

పాదసూచికలు: ఆచార్య కొలకలూరి ఇనాక్ సాహిత్య సృష్టి-దృష్టి - పుట.515

**ఆధార గ్రంథాలు :**

1. ఇల్యా ఎహ్రెన్ బర్గ్ - రచయితా - శిల్పమూ
2. కృపాచారి గుజ్జర్లమూడి - ఆచార్య కొలకలూరి ఇనాక్ సాహితీ సమాలోచనం
3. వెంకట సుబ్బయ్య వల్లంపాటి - నవలా శిల్పం
4. వెంకట సుబ్బయ్య వల్లంపాటి - విమర్శా శిల్పం
5. సుబ్బారావు చందు - శిల్పదృష్టి
6. సుబ్బాచారి పులికొండ - తెలుగులో కుల పురాణాలు
7. చిట్టెమ్మ, ఎం - కొలకలూరి ఇనాక్ నవలా సాహిత్యం - ఒక పరిశీలన

********

# 19. వేమన శతక సాహిత్యం - సమాజిక స్పృహ

**డాక్టర్ బి. చక్రవర్తి**

అసిస్టెంట్ ప్రొఫెసర్

కర్ణాటక రాష్ట్ర సార్వత్రిక విశ్వవిద్యాలయం,మైసూరు.

చరవాణి : 9666454688

మైల్: chakravarthiksou@gmail.com

**ఉపోద్ఘాతం**

తెలుగు సాహిత్యంలో శతక ప్రక్రియది ఒక ప్రత్యేకమైన పద్ధతి. మిగిలిన సాహిత్య ప్రక్రియల్లాగా మౌనంగా పెద్దరికంగా మార్గదర్శిగా ముందుకు సాగిన ప్రక్రియ. శతక సాహిత్యం దాదాపు 12వ శతాబ్దం నుండి నేటి ఆధునిక యుగం దాకా కవులను ఆకర్షిస్తున్న ఏకైక ప్రక్రియ శతక సాహిత్యం. తెలుగు శతకం శాఖలుగా విస్తరిల్లి స్వరూపంలోనూ, స్వభావంలోనూ ఎంతో మార్పు చెందింది. భారతీయ భాషల్లో ఎందులోనూ శతక ప్రక్రియ తెలుగులోలాగా బహుముఖ వికాసాన్ని పొంది వైశిష్ట్యం పొందలేదు. నేటికీ ఏ మూలనో ఒకచోట శతకం వెలువడుతూనే వుంది. సజీవ స్రవంతి వలె అవిచ్ఛిన్నంగా సాగుతూ వస్తున్నది శతకమే అని శతక సాహిత్యం పై పరిశోధన చేసిన ఆచార్య కె. గోపాలకృష్ణ రావు అంచనా వేశారు.

**పరిచయం**

భగవంతుడు సృష్టించిన సమస్త జీవరాసులలో మానవజన్మ మహోన్నతమైంది. దేవుడు మనిషికి ఇచ్చిన వరం ఆలోచన శక్తి. మానవుడు తన మేధస్సుతో అనేక అద్భుతాలు సాదిస్తూ ముందుకు సాగుతున్నాడు. అనాగరికుడిగా జీవించిన ఆదిమ మానవుడు క్రమంగా నాగరిక ప్రపంచాన్ని సృష్టించుకున్నాడు. పదిమందితో కలిసి సంఘజీవి అయ్యాడు. ఈ సంఘ జీవనంలో వ్యక్తుల ఔన్నత్యాన్ని పెంచడానికి ధర్మం, న్యాయం, సత్యం, నీతి, నిజాయితీ మొదలైన సుగుణాలు మనిషిలో పెంపొందించడానికి కొన్ని మంచి సంప్రదాయాలను ప్రవేశపెట్టారు వీటినే సదాచారాలంటారు. వీటిని భిన్నమైనవి దురాచారాలు ఈ దురాచారాల నిర్మూలనకు చేసే ప్రయత్నాలను సంఘసంస్కరణలంటారు.

సంఘంలో ఉన్న దురాచారాలను రూపుమాపడానికి ఎందరో మహనీయులు కృషిచేశారు. అయితే వీరిలో ఒక్కొక్కరు ఒక్కో పంథాను అనుసరించారు. అటువంటి వారిలో వేమన కూడా వున్నారు. అయితే తమ బోధనల ద్వారా మధ్యయుగం నాటికి సంఘంలో ఉన్న దురాచారాలను నిరసిస్తూ సంఘాన్ని మేల్కొల్పే ప్రయత్నం చేసిన మహా పురుషులు.

వేమన కాలంనాటి తెలుగు సమాజం అన్ని రకాల దురాచారాలతో కూళ్ళిపోయింది. వీర శైవ, వైష్ణవమత ద్వేషాలు ఆ మతగురువులు చేస్తున్న వంచన అంతగా ప్రజల అజ్ఞానం కొంతమంది బ్రాహ్మణుల యజ్ఞ యాగాల పేరిట చేస్తున్న దుర్మార్గాలు మంత్ర తంత్రాలతో ప్రజల ప్రగాఢ విశ్వాసం సమాజాన్ని పట్టిపీడిస్తున్న వర్ణ వ్యవస్థ వేమన కాలం నాటికీ ప్రత్యక్ష సత్యాలు. జాతి, కుల, మత, వర్ణ బేదరహిత నాగరిక సమాజ నిర్మాణం వేమన ధ్యేయం. అయితే పైన చెప్పినవన్నీ అతని ఆశయానికి అడ్డు తగులుతున్నాయని వాటిని సమూలంగా నాశనం చేసి అభ్యుదయ సమాజ నిర్మాణ సాధనకు వేమన శంఖారావం పూరించాడు.

భాషలో కొంత భేదమున్నను వేమన ధోరణిలోనే కులమత బేధాలను నిశితంగా విమర్శించారు. 12వ శతాబ్దమున మత ధార్మికమైన విప్లవ మూర్తి అయిన బసవేశ్వరుడు కుల మత విభేదరహిత నాగరిక సమాజ నిర్మాణమునకు బ్రహ్మాండమైన ఉద్యమమును లేవదీసెను. ఆ మహాపురుషుని కృషి ఫలితంగా కర్ణాటక సమాజంలో ఒక నూతన చైతన్యము తెచ్చాను. మత సాంఘిక న్యాయం ఏర్పడెను.

**వర్ణవ్యవస్థ - అస్పృశ్యత**

మతంలో మూల తత్వానికి ఎప్పుడైతే దెబ్బ తగిలిందో అప్పుడది తత్వ రహితమైన మతంగా మాత్రమే నిలిచి కపట జీవిత విధానం ప్రారంభమైంది. అప్పటినుంచి చతుర్వర్ణాల నుండి వేరుపడి జాతులు, ఉపజాతులు ఉపోపజాతులుగా సృష్టించబడ్డాయి. బ్రాహ్మణులు మొదలు చండాలుర వరకు అందరూ తమకున్న ఒక జాతి కలదనుకొని సంతోషించిరి. చండాలురను బ్రాహ్మణులెంత దూరం నుంచి ఉంచబడిన డొక్కల వారు అను అడవి జాతి వారిని నా చిన్నతనమందు చూసినాను అని రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మగారు చెప్పారు.

మానవత్వ సాధనలో వేమనకు మొట్టమొదటి అవాంతరం వర్ణవ్యవస్థ. కులాల పుట్టుక గురించి మన ప్రాచీన గ్రంథాలలో అనేక రకరకాల కథలు చెప్పబడ్డాయి. వాటినన్నింటిలో అత్యంత ఎక్కువ ప్రచారంలో ఉన్నది పురుష సూక్తం లోనిది. చతుర్వర్ణాలు బ్రహ్మ నుండి బ్రహ్మ ముఖం నుండి భుజాల నుండి తొడల నుండి పాదాల నుండి ఉద్భవించారని చెప్పబడింది. విష్ణు మార్కండేయ పురాణాలలో మనిషి కులం ఒకేసారి పుట్టినట్లు వర్ణించబడింది. త్రేతాయుగం ద్వారా మనుషులు కులాలుగా చీలిపోలేదని వాయు పురాణం చెప్తున్నది. మహాభారతంలో జన్మత మనుషులలో కులాలు లేవని గుణాలు చేసే వృత్తులను బట్టి అవి ఏర్పడ్డాయని చెప్పబడింది.

Caste అనే పదం పోర్చుగీసు భాష నుండి తీసుకొని ఇండియాలోనే కులం అన్న పదానికి సమానార్థకంగా ఐరోపా పండితులు వాడటం ప్రారంభించారు. ఆంగ్ల నిఘంటువులు క్యాస్ట్ అన్న పదానికి A social class in India అన్న అర్థాన్నిస్తున్నాయి.

కులం అనే అర్థంలో సంస్కృతంలో వర్ణం అనే మాట వుంది. దీనికి రంగు అని అర్థం. బ్రాహ్మణుని ఒంటి రంగు నుండి ఇతరులరంగు గుర్తించడానికి ఈ పదం ప్రచారంలోకి వచ్చిందని దుబాయ్ రాశాడు. మహాభారతం శాంతిపురంలోని బృగు భరద్వాజ మహర్షులు జరిపే సంభాషణలు ఈ వర్ణ చర్చ వున్నది. భరద్వాజుని ప్రశ్నకు సమాధానం చెబుతూ భృగువు బ్రాహ్మణుల వర్ణం తెల్లదని క్షత్రియులు ఎర్రని వారిని వైశ్యులు పచ్చగా వుంటారని శూద్రులు నల్లని వారు సీతరక్త పీత నీలములు అని చెప్పాడు.

అయితే ఈ వర్ణాలు ఏర్పడడానికి భృగువు కారణం చెప్పాడు. నిజానికి కులాలన్నీ వేరుగా లేవు బ్రహ్మ సృష్టిలో అందరూ బ్రాహ్మణులు వారి వారి వృత్తుల వల్ల వివిధ కులాలుగా విడిపోయారు. బ్రాహ్మహిత కార్యాలకు దూరమై ఎర్రటి శరీర చాయతో క్షత్రియులుగా మారిపోయారు. వ్యవసాయంపై ఆసక్తి జనించి యజ్ఞ యాగాది కర్మలను నిర్లక్ష్యం చేసి వారందరూ వైశ్యులయ్యారు. ఇక విషయ వాంఛ పూరితులై అపరమార్గగాములై ఏ వృత్తిపడితే ఆ వృత్తిని స్వీకరించినవారు నిలబడిపోయి శూద్రులుగా మారిపోయారు. ఇది భృగు వచనం నరక కులం నరకులం అనేక కులాలుగా ముక్కలై పోవడానికి కారణం చెప్పిన స్వతహాగా మానవులంతా ఒకటే అని భృగువు ప్రబోధించాడు.

వేమన కాలంలో కుల వ్యవస్థ చాలా బలంగా ఉండేది. వృత్తుల కారణంగా ఏర్పడిన కులాలు అనంతర కాలంలో గనీభవించి మానవుల మధ్య విభేధాలను శాశ్వతం చేశాయి. కులవృత్తులను త్యజించి ఇతర వృత్తులను చేపట్టేవారు ప్రబలిపోయారు. అధిక ధనార్జన చేయగలిగిన వృత్తుల వైపే జనులు మొగ్గుచూపారు. కులానికి కర్మను నిర్ణయించే శక్తి సన్నగిల్లిందని అటు కన్నడ దేశంలో కూడా వర్ణ వ్యవస్థ చాలా ప్రభలంగా ఉన్నట్లు సర్వజ్ఞుణ్ణి వచనాల ద్వారా తెలుస్తున్నది. సర్వజ్ఞుడు నాటి సమాజంలో వర్ణ వ్యవస్థను తన వచనాల ద్వారా తీవ్రంగా ఖండించాడు.

ఆధునిక సమాజంలో ఈ కుల వ్యవస్థ కొత్తదారి పట్టింది ఒక కులం వారు ఇతర కులాల వారిని తక్కువగా చూడటం తమ కులం వారే అన్ని విషయాలు ముందుండాలని ఆశపడటం తమ కులం వేరే కులం వారే ఉన్నత స్థానాల్లో ఉండాలని తమ కులం మాత్రమే అభివృద్ధి చెందాలని భావన ఆధునిక వ్యవస్థలు రావడం ఒక వింత పరిణామంగా చెప్పవచ్చు.

వేమన సమానతను ప్రబో ంచే ఉద్యమానికి సమకాలీన పరిస్థితుల దోహదమే కాకుండా ఆ వర్ణ వ్యవస్థలోని అమానుషత్వం అతనికి బాధను కలిగించింది. మనుషుల మధ్య హెచ్చుతగ్గులను నిర్ణయించి మానవ గౌరవాన్ని కించపరిచినవి కులాలే అన్నది వేమన అభిప్రాయం.

**కులము హెచ్చుతగ్గు కొదవలు పనిలేదు**

**సానుజాతమయ్యె సకల కులము**

**హెచ్చుతగ్గు మాట లెట్లెరుంగ వచ్చు**

**విశ్వదాభిరామ వినురవేమ**

భూమిపై ఉన్న ప్రజలందరూ ఒకే కుటుంబంలోని సభ్యుల వలె మత భేదాలు వదలి మనసులు కలిగి మమతలు పెంచి మెలగవలెను అని వేమన ఉపదేశం. మానవున్ని ఒక కులచట్రంలో బిగించి పెట్టడం వేమనకి నచ్చలేదు. మానవుడు తన సాంఘిక వర్ణం ఏదో ఒక దానిలోనే సభ్యుడై వుంటున్నాడు. కానీ తన జాతి మొత్తంలో ఒక స్వతంత్ర సభ్యునిగా ఉండలేకపోతున్నాడని వేమన గుర్తించాడు. ప్రాథమికంగా మానవుడనే గుర్తింపునకు కోల్పోయాడని వేమన వాపోయాడు. నైతిక ప్రమాణాల దృష్ట్యా వర్ణవ్యవస్థ సమర్ధనీయం కాదని తేల్చి చెప్పాడు. జాతి ఐక్యతను ఇది భంగపరుస్తుందని హెచ్చరించాడు.

మనం నడిచే భూమి ఒకటే, తాగే నీరు ఒకటే, కాల్చు అగ్ని ఒకటై వుండగా మధ్యలో కులగోత్రాలు ఎక్కడివి అని వేమన సూటిగా హృదయం విప్పారున్నట్లుగా ప్రశ్నించాడు. వివేచనా రహితులు జ్ఞాన శూన్యులు మాత్రమే జాతి, కుల, మత భేదాలు పాటిస్తారని తెలిపారు. చతుర్వర్ణాలకు వెలిగా పుట్టిన సాంఘిక ధర్మానికి చిహ్నమైంది. అస్పృశ్యుల జీవితాలు మానవ హైన్యానికి బేకరీ తార్కాణాలుగా చెప్పవచ్చు. అగ్రవర్ణాల వారు సంఘంలో అనుభవిస్తున్న తీరు అన్నిటికి దూరంగా ఉన్న అస్పృశ్య దుస్థితి వేమన హృదయాన్ని గాయపరిచింది. వారి పట్ల అగ్రవర్ణాల ప్రవర్తన ఆయనలో క్రోధాగ్ని తర్కమనే ఆయుధాన్ని ఎత్తి పట్టుకొని వేమన వారి పక్షాన వాదించాడు.

**మాలవాని నేల మరి మరి నిందింప**

**ఒడల నున్న మాంస యొకటి గాదె**

**వానిలోన వెలుగు వాని కులంబేది**

**విశ్వదాభిరామ వినురవేమ**

ప్రవర్తన వాళ్ళనే గాని జన్మ చేత ఎవడూ మాల కాదని వేమన నొక్కి వక్కాణించడు. జాతి బేధాలను పాటించవద్దని తెలియజేశాడు.

**బ్రాహ్మణులు**

బ్రహ్మ వంశభవులు ప్రభలు లైవుండగా

నితర జాతులకును గతులు గలవే...

అని బ్రాహ్మణుల ఆదిక్యాన్ని వేమన గుర్తించాడు. వేరు జాతి వాడు విప్రుడు గాధయా అని జాత్యహంకార భావం విపరీతమైంది.

"కులము హెచ్చుతగ్గు గొడవలు పనిలేదు" అనే ప్రశ్నలు అక్కడక్కడ బయలుదేరాయి. ప్రయోజనం శూన్యమైంది. బ్రాహ్మణులు అంత్య జాతి వారిని తాకినప్పుడు ముట్టు తగిలినదని నీటిలో మునిగి స్నానం చేసేవారు. ఈ మారని శక్తులకు వేమన వ్యతిరేకంగా ప్రతిఘటించాడు.

**కులము చేతబట్టి గుంపించిన నేటికి**

**ఎందు ఉన్నచోట ప్రబలు విత్తు**

**ఏటి కులంబిక ఎక్కడి ద్విజుడచూ**

**విశ్వదాభిరామ వినురవేమ**

ఇది వేమన కాలంలో చలరేగిన ప్రతిఘటనా భావమే. ఆనాడు బ్రాహ్మణులు కొందరు యజ్ఞం చేసి, యజ్ఞానికి బలిగా ఇచ్చిన పశువుల మాంసాన్ని కాల్చి తినేవారు. మరికొందరు బ్రహ్మం గురించి తెలుసుకోకుండా మేము బ్రహ్మ స్వరూపమని ధాంభికం చెప్పుకునేవారు. వేదాన్ని పరిహసించేవారు మరికొందరు సోమయాజులై మకర కుండలములు ధరించి శాలువాలు కప్పుకుని తిరిగేవారు. కొందరు శూద్రులను తూలనాడేవారు, ధనం కొరకు ఆశపడేవారు. సత్యాన్ని వదిలి జారులై తిరిగేవారు వుండేవారు.

వేమన నిజానికి బ్రాహ్మణులందరినీ తిట్టలేదు. ఆనాడు బ్రాహ్మణుల ప్రాబల్యం ఎక్కువగా వుంది. వారిలో దురాచారాలను లోనైన వారి సంఖ్య అధికంగా వుండేది. కాబట్టి దురాచారాలకు లోనైన వారిని వేమన ఖండించాడు. మంచివారికి మాన్యతనిచ్చాడు.

**బ్రాహ్మణులకు సకల భాగ్యంబులీవచ్చు**

**గౌరవింపవచ్చు, కలయవచ్చు**

**జ్ఞాన మొసగి జనుల గడతీర్చునట్లయిన**

**విశ్వదాభిరామ వినురవేమ**

దీని ద్వారా వేమన కాలంలో బ్రాహ్మణులు వుండేవారని తెలుస్తుంది. బ్రాహ్మణులు స్నానం చేసి భోజనం చేసేవారు. స్నానం చేశాక మడిబట్టకట్టుకునేవారు. సంధ్యా వందనం చేసేవారు. ఇలాంటి బాహ్యాచార బ్రాహ్మణులను చూసిన వేమన ప్రశ్నించాడు. స్నానం చేసి భోజనం చేసే బ్రాహ్మణుడు సంధ్యావందనాలను ఎందుకు చేయాలి. స్నానమైన తర్వాత ఆవాచ్య శబ్దాలనుఎందుకు పలకాలి. మరల మరల అనుమానంతో స్నానం ఎందుకు చేయాలి. బ్రాహ్మణుడు స్నానం చేసి మలినంతో నిండి వున్న నీటితో మడిచేసిన తుండుబట్టను కట్టుకొనుట ఎందుకు నిజంగా అతడు పరిశుద్ధుడై వుంటే తెలుసో తెలియకో చేసిన పాపాలను క్షమించమని ప్రార్థించు సంధ్యావందన ఎందుకు అంటే అంతరిక స్నానం లేని బ్రాహ్మణుడు బాహ్యాచారానికి లోనై సందేహంలో పడ్డాడని దీనర్థం.

బ్రాహ్మణులు పవిత్రమని పరిశుద్ధమని నమ్మిన మడి వీర శైవులు లెక్కలో మడి కాదు. అంటే అది పరిశుద్ధమైనది కాదు.తీర్థ స్నానం చేసిన వారు ఎక్కువగా నొసటపైన శ్రీ గంధాన్ని పూసుకున్న వారు బూడిద శరీరానికి పూసుకున్నవారు. జద్యం ధరించినవారు స్వర్గానికి చేరుతారని బ్రాహ్మణులు ఈ క్రియలను చేసేవారు.రోజు నీటిలో మునిగి బ్రాహ్మణుడు స్వర్గానికి పోయేటట్లు అయితే ఆ బ్రాహ్మణుల్ని ఇలాగే నీటిలో మునిగిన కప్ప కూడా స్వర్గానికి పోవచ్చు కదా. శ్రీ గంధాన్ని ధరించిన వాడు నేరుగా స్వర్గానికి పోయేనట్లయితే శ్రీ గంధాన్ని రుద్దుకోవటానికి ఉపయోగించిన రాయి ఎందుకో స్వర్గానికి పోదు. బూడిద పూసుకున్నవాడు శ్రేష్ట స్వర్గాన్ని చేరినట్లయితే బూడిదలో పోర్లాడు గాడిద ఎందుకు స్వర్గానికి వెళ్లలేదు. ధరించిన వాడు స్వర్గానికి వెళ్ళినట్లయితే 108 దారాలతో కుట్టిన గంతను కప్పుకున్న బిక్షగాడు ఎందుకు స్వర్గానికి వెళ్లలేదు. అని బ్రాహ్మణులను నిలదీసి ప్రశ్నించాడు. కప్ప, గంధపురాయి, గాడిద, బిక్షగాడు మొదలైన దృష్టాంతాలు వడిసెల దెబ్బలలాగా స్ఫురిస్తాయి.

వేమన కాలాన తెలుగు సంఘంలో బ్రాహ్మణ జాతి అన్ని విధాల ఉన్నత స్థితిలో వుంది. ముఖ్యంగా విద్య వైజ్ఞానిక రంగాలలో వారు గొప్ప స్థానం కలదు. పల్లెటూరు బడిపంతులు మొదలు ప్రధాన అమత్య పదవి వరకు వారు లేని చోటే లేదు. పండితులుగా, ఉపాధ్యాయులుగా, పురోహితులుగా వారు సంఘంలో గొప్ప స్థానాన్ని ఆక్రమించారు. ఆ కాలంలో కొందరు బ్రాహ్మణుల దురాచారాలు వర్ణాతీతం. వారు సాక్షాత్తు బ్రహ్మ ముఖం నుండి జారిపడినట్లు వ్యవహరిస్తూ ధర్మశాస్త్రాలను కంఠస్థం చేసి దుర్మార్గంతో తక్కిన జాతులను హీనంగా చూసేవారు వారు. వారు చేసే తప్పులన్నీ ఒప్పులు గానే చలామణి అయ్యేవి. వారు చెప్పిందే వేదం వారు చెప్పిందే ధర్మం వారి మాటలకు

అడ్డు ఆపు లేదు. ఆనాటి ప్రజల్లో కూడా వారి పట్ల గొప్ప విశ్వాసం ఉండేది. పురాణాలు ధర్మశాస్త్రాలు వారి అఘాయిత్యాలకు అన్ని విధాల తోడ్పడుతుండేవి.

వేమన కొంతమంది బ్రాహ్మణులు చేస్తున్న దురాచారాలను తీవ్రంగా నిరసించాడు. బ్రాహ్మణులే కాదు అటువంటి నైతిక పతనమునకు దారి తీసే సంఘవిద్రోహకరమైన పనులు చేసే ఏ జాతి వారైనా అతనికి శత్రువులే. వేమనకు ప్రత్యేకంగా ఏ కులంపై ద్వేషం లేదు. అతని ద్వేషమంతా విధానాలపై ఆనాటి సమాజంలో శైవ, వైష్ణవ మత గురువు చేస్తున్న దుర్మార్గపు చేష్టలు వర్ణనాతీతం వీరు సంఘాన్ని శని దేవతల వలె నానా బాధలు పెట్టించారు. వీరు దుశ్చర్యలను వేమన తీవ్రంగా ఖండించాడు.

**మూఢనమ్మకాలు**

నాడు ప్రజలకు శకున శాస్త్రాలపై తమకు ఎక్కువగా నమ్మకం వుండేది. పాలపిట్ట శకనఫలం ఇస్తుందని నమ్మేవారు. బల్లి పలుకులు విని తమ పనులు విజయవంతమవుతాయని విశ్వసించేవారు. ఇంట్లో పలికి గూఒ దూరితే అది అశుభమని ఆ ఇల్లునే వదిలిపెట్టి వెళ్లేవారు. ఆకులన్నీ తింటే కాయసిద్ధి కలుగునని నమ్మేవారు.మంచి ముహూర్తం చూసి పెళ్లిళ్లు చేసేవారు. ఈ విధంగా చూస్తే దంపతులు ఏ అవాంతరాలు లేకుండా జీవిస్తారని ప్రజలు నమ్మకం దురదృష్టవశాత్తు ఇప్పటికీ అధిక సంఖ్యకులు ఈ నమ్మకాలను కొనసాగిస్తున్నారు. ఇటువంటి శకుని శాస్త్రాలను నమ్మే వారిని వేమన ఇలా ప్రశ్నించాడు.

**విప్రవరు ముహూర్త విభవము నమ్మచు**

**పెద్దలను గూర్చి పెండ్లి చేయు**

**నువిద ముండయౌ ముహూర్తము నిజమెట్లు**

**విశ్వదాభిరామ వినురవేమ**

బ్రాహ్మణులు నిర్ణయించిన ముహూర్తానికి పెళ్లిచేసిన ఆ స్త్రీ వెధవరాలైతే ఆ ముహూర్తం ఏ విధంగా నిజమవుతుందని వేమన సూటిగా ప్రశ్నించాడు. శకునాలపై నమ్మకం అధికంగా వుండేది. సర్వసాధారణంగా ప్రజలు చేయబోయే పనులు గురించి ఆలోచించేటప్పుడు లేక కార్యసాధనకు బయలుదేరేటప్పుడు ఎవరైనా రెండు సార్లు తమ్మితే మంచిదని నమ్మేవారు. కొందరు శని, గురు, నక్షత్ర ఫలాలను జ్యోతిష్యాన్ని నమ్మేవారు. మునగ చెట్టు పొగ వెళ్ళితే వర్షం కురవదని నాటి జనుల నమ్మకం. దేవునికి పెట్టిన నైవేద్యం తింటే పిల్లలు లేని వారికి పిల్లలు పుడతారని నమ్మకం వుండేది. ఇటువంటి మూఢనమ్మకాలను వేమన తన వచనాల ద్వారా తీవ్రంగా ఖండించారు.

**విగ్రహారాధన ఖండించుట**

సమాజంలో పలువురు పెద్దలు విగ్రహారాధనను ఖండించారు. వేమన కూడా విగ్రహారాధనకు తీవ్రంగా ఖండించారు. విగ్రహారాధన ప్రజల మూఢనమ్మకాలకు సంబంధించిన విషయంగా మీరు గుర్తించారు. ప్రజలను చైతన్యవంతులను చేయడానికి వీరి విశేష కృషి చేశారు.

వేమన ఏకేశ్వరోపాసకుడు మూడభక్తి అజ్ఞానానికి చిహ్నమని ప్రజలకు చాటి చెప్పాడు. విగ్రహారాధనను తీవ్రంగా ఖండించాడు. ఆ దేవుడు గొప్ప ఈ దేవుడు తక్కువ అని దేవతలతో ఈ మతం శ్రేష్టం ఆ మతం హీనం అని మతాలతో హెచ్చుతగ్గులు భేదాలు ఏర్పరిచి వాదులాడుకొనుచున్న మూఢ జనులలో చైతన్యం తీసుకురావడానికి ప్రయత్నించాడు.

**రాతి బొమ్మకెలా రంగైన వలువలు**

**గుళ్ళు గోపురములును కుంభములను**

**కూడూ గుడ్డ తాను కోరునా దేవుడా**

**విశ్వదాభిరామ వినరవేమ**

రాతి బొమ్మకు అందమైన గుడ్డలు ఎందుకు గోపురాలు ఎందుకు పూర్ణ కుంభాలెందుకు ఇవన్నీ కావాలని దేవుడు అడిగాడా అతడు ఆవిధంగా కోరితే దేవుడు ఎట్ల అవుతాడు. ఇదంతా ఆత్మవంచనకే ఇటువంటివి మానుకోమని వేమన ప్రజలకు బోధించాడు.

**దానధర్మాలు**

ప్రజలలో దాతృత్వం వుండాలని వేమన సూచించాడు. ముఖ్యంగా ధనవంతులు దాతృత్వంతో నలుగురికి పంచి పెట్టాలన్నాడు. అయితే ధనవంతులలో ఎక్కువ మంది లోభితనం కలిగి వుంటారని వీరిలో మార్పు రావాలని ఆకాంక్షించాడు.

**ధనము గూడ బెట్టి ధర్మంబు సేయక**

**తానుదినక లెస్స దాచుగాక**

**తేనెటీగ గూర్చి తెరువరి కియ్యదా**

**విశ్వదాభిరామ వినురవేమ**

ధనాన్ని కూడ పెట్టి దానధర్మాలు చేయక తానూ తినకుండా ఇతరులకు పెట్టకుండా దానం చేసేవాడిని తేనె కూర్చిపెట్టి ఇతరులకు ఇచ్చేది తేనెటీగతో పోల్చాడు.ధనవంతులలో లోభులున్నారని అటువంటి లోభివారిని అడగడం వలన ఎలాంటి లాభం లేదని వేమన తెలిపాడు. లోభులను బండ గోవులతో గొడ్డుటావులతో పోల్చి తిట్టాడు. కఠిన బుద్ధుల వద్దనున్న ధనాన్ని కోరడం కొండకింద పసిడి కోరిన చందమే అని అన్నాడు. నూటికో కోటికో ఒకదాత వుంటే వారి లోభివారి ప్రభావంతో అతను కూడా బిగుసుకుపోతున్నాడని వేమన అభిప్రాయపడ్డాడు.

**అన్నదానం**

ఈ జగత్తులో అన్నదానానికి మించిన ఉత్తమ దానం మరొకటి లేదు. అన్నము అన్ని జీవులకు జీవనాధారం ఏ దానం వల్ల తృప్తి పడని వారు అన్నదానం వలన సంతృప్తి చెందుతారు. కనుక అన్ని దానాల కన్నా అన్నదానం శ్రేష్టమైనది. వేమన అన్నదానం ఆవశ్యకతను తెలియజేశారు.

**అన్న మిడుటకన్న నదిక దానము లేదు**

**ఎన్ని చేయనేమి యెన్న బోరు**

**అన్నమెన్న జీవనాధార మవునయా**

**విశ్వదాభిరామ వినురవేమ**

అన్నదానానికి మించిన దానం లేదు. మిగతా ఎన్ని దానాలు చేసినా వాటిని పెద్దగా లెక్కించరు. అన్నం జీవనాధారమని వేమన అన్నదానం ప్రాధాన్యతను తెలియజేశాడు. అన్న దైవమున కన్నా మిన్న దైవంబున్నె అన్నమును దినక బ్రదుక గలడే నరుడు అన్నమే యనువు అన్నదానానికి మించిన దానం లేదని వేమన అభిప్రాయపడ్డాడు. అన్న మనకు మించింది ఈ ప్రపంచంలో మరొకటి లేదు అన్నమే సమస్త జీవులకు ప్రాణం వంటిదని అన్నదానం ప్రాధాన్యతను వివరించాడు.

**విద్య**

విద్యలేనివాడు వింత పసుపు అని పెద్దలన్నారు. విద్య నేర్చకుంటే లోకంలో బతుకు సాగించడం దుర్భరమవుతుంది. మానవుని అభివృద్ధికి తొలి సోపానము విద్య. విద్య అంటే ఎచటనైనను రాణించవచ్చును. మనతో చివరిదాకా వచ్చేది మన జ్ఞానమే. విద్య వలన వినయ, విధేయత, సంస్కారం పెంపొందుతాయి. విద్య వలన ధనము, కీర్తి, ప్రతిష్టలు లభిస్తాయి. అన్నదమ్ములు గానీ, దొంగలు గానీ, రాజులు గానీ, ఇతరులు ఎవరు గానీ, దోచ లేనటువంటి గొప్ప సంపద విద్య.

**చదువుకున్న సౌఖ్యంబులు లేవు**

**చదువు చదివినేని సరసు దగును**

**చదువు మర్మమేరికి చదవగ చూడుము**

**విశ్వదాభిరామ వినురవేమ**

చదువు గొప్పతనం గూర్చి చెప్పిన వేమన మరో సందర్భంలో చదువుకున్న వాడికంటే చాకలివాడు మేలని అభిప్రాయపడ్డారు. విద్య నేర్చుకోవడం కంటే సద్గుణాలను పెంపొందించుకోవడం ముఖ్యం. పిల్లలకు మంచి చదువు ఏర్పాటు చేయడం ప్రతి తండ్రి ప్రాథమిక కర్తవ్యం. విద్యార్థులను సరైన మార్గంలో నడిపించడం ప్రతి గురువు కర్తవ్యం. విద్యయే తల్లిదండ్రి, బుద్ధియే సోదరును అధ్వానమున గాచువాడే తనవాడు, సుఖముగా తానున్నదే రాజ్యమ్ము ఎంతటి పేదవాడినైనా విద్యావంతుడైతే ఎక్కడో ఒక చోట ఇక్కడో అక్కడో కడకు కోండ అంచులనైనా నెట్టుకు రాగలడు.

**ముగింపు**

మనతో ఎప్పటికీ వుండే సంపద జ్ఞానమని అన్నదమ్ములు గానీ,దొంగలు గానీ, రాజులు గానీ,ఎవరూ కూడా దానిని వాదులాడి దోచుకోలేరని అంతటి గొప్ప సంపద విద్య అని దాని ప్రాముఖ్యత వివరించాడు.కేవలం పుస్తకాలను చదవడం వంటి చెరుకు ఆకులను నమలడం వంటిది. అయితే గ్రంథాల్లోని సారాన్ని గ్రహించడమే చెరుకులోని రసాన్ని పొందడం. మాట పొందికను నేర్చుకోవడం విద్యలో భాగమే. ఎప్పుడు ఎలా మాట్లాడాలో తెలుసుకోవడం చాలా ముఖ్యం. మాటలు స్నేహితులని కూరుస్తాయి. ఉల్లాసాన్ని కలిగిస్తాయి. మాటలు వెగకు పుట్టిస్తాయి. హత్యలను ప్రేరేపిస్తాయి. మాటలు సంపదను ప్రాభావాన్ని తెస్తాయి. అందువలన మాటే అసలైన రత్నం. అవసరం వచ్చినప్పుడే మాట్లాడు అనవసరమైన అంతవరకే మాట్లాడు. అవసరమైనంతవరకే మాట్లాడు. ఆహ్లాదకరంగా అర్థవంతంగా మాట్లాడు. క్రమశిక్షణ, త్రికరణశుద్ధి, వాక్ శూచి నిశ్శబ్దమైన ఆర్భాటం లేని ఆచరణ చెప్పే సూక్తులను స్పష్టంగా పాటించడం ఇవి నిజంగా చదువు సంస్కారం ఉన్న వారి నుండి ఆశించే లక్షణాలు అని వేమన అభిప్రాయపడ్డాడు.

విద్య నేర్చుకున్న తర్వాత ఏదో ఒక వృత్తిని చేపట్టి తనకాళ్లపై తాను నిలబడాలి. నిరర్థకంగా వుండకూడదు. కష్టించే వారిని అదృష్టం వరిస్తుంది. సోమరులూ, నిస్వార్థపరులూ వున్న కాస్త ధనాన్ని పోగొట్టుకుంటారు. కనుక ప్రతివారు కష్టపడి పనిచేయాలి. నిజాయితీగా సమర్థవంతంగా పనిచేయాలి. మంచి ప్రతిభ నైపుణ్యం కలిసినప్పుడే సమర్థత వస్తుందని వేమన తెలియజేశాడు. ఈ విధంగా వేమన ఆటవేలది పద్యాల ద్వారా సంఘాన్ని సంస్కరించడానికి విశేషంగా కృషి చేశాడు.

**ఉపయుక్త గ్రంథాలు**

1. నాగయ్య, జి. (1983), తెలుగు సాహిత్య సమీక్ష, నవ్య పరిశోధక ప్రచురణ, తిరుపతి.

2. ద్వానా శాస్త్రి, (2007), తెలుగు సాహిత్య చరిత్ర, ప్రగతి పబ్లిషర్స్, హైదరాబాదు.

3. శ్రీ రామమూర్తి, కొర్లపాటి, (1996) ), తెలుగు సాహిత్య చరిత్ర, విశాలాంధ్ర పబ్లిషర్స్, హైదరాబాదు.

4. ఆరుద్ర, (2005), సమగాంధ్ర సాహిత్యం, తెలుగు అకాడమి, హైదరాబాదు.

5. విజయభారతి బి. (1980), తెలుగు సాహిత్య కోశము, తెలుగు అకాడమి, హైదరాబాదు.

********

# 20. తెనాలి మండల దళిత కవుల సామాజిక స్పృహ

**యం. భీమయ్య గారు,**

తెలుగు అధ్యాపకులు,

శ్రీ ఎ.బి.ఆర్. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, రేపల్లె,

ఫోన్ నెం.97054 45036.

Email Id: mbtelugudl@gmail.com

సమాజహితాన్ని కోరేది సాహిత్యం. అది విశ్వజనీనం. అందరి శ్రేయస్సును కోరుతుంది. ఆధునిక తెలుగు సాహిత్యంలో సమాజాన్ని చైతన్యపరచగల అనేక రచనా ప్రక్రియలు వచ్చాయి. కవులు తమ సమకాలీన సమాజంలో వారు చూసిన వాటిపై స్పందించి తమదైన శైలిలో రచనా వ్యాసంగం చేసినవారు ఎందరో ఉన్నారు. అట్టి వారిలో తెనాలి మండల దళిత కవులు ప్రధానంగా చెప్పవచ్చు. నూతక్కి అబ్రహం, అత్తోట రత్నకవి, పినపాటి జెర్మియా, పడపర్తి ఎజ్రా కవులు ప్రధానంగా చెప్పవచ్చు. వీరి రచనలు సమాజాన్ని చైతన్యాన్ని కలిగించేవి గ్రామ నామాలు ఒక సమాజం యొక్క భాషను, నాగరికతను సంస్కృతిని, భౌగోళిక నైసర్గిక పరిస్థితులను వెల్లడిరచే అపూర్వ సాధనాలుగా గోచరిస్తాయి. రచయితపై సమాజ ప్రభావం ఎక్కువగా ఉంటుంది. కావున సామాజిక స్పృహ గల రచనలు చేస్తారు.

**తెనాలి ప్రాచీనత:** తెనాలి చాలా పురాతన ప్రసిద్ధి కలిగిన ప్రాంతం అని రామలింగేశ్వర స్వామి దేవాలయంలోని బుద్ధ విగ్రహం చెబుతుంది. కళలకు, కాణాచి, కవులకు, రత్నగర్భ. గ్రాసా వాసాలకు, పాడిపంటలకు కొదవిలేని ప్రదేశం. వైద్యవిద్య నాగరికతలో దీనిది ప్రత్యేక స్థానం. తెనాలి పదం దిగ్వాచిని తెలియజేస్తుంది. మధ్యలో మూడు కాలువలు ప్రవహిస్తాయి. దీనికి చారిత్రక, రాజకీయ, సాంస్కృతిక నేపథ్యం ఉంది. నాటకరంగంలో అద్వితీయ ప్రతిభ గల వారున్నారు. సినీ, చిత్రకళ, శిల్పకళ, గాయకులు, సాహితీరంగంలో ప్రముఖులు ఉన్నారు. అన్నీ రంగాలలో అభ్యున్నతిని సాధించిన కారణంగా తెనాలిని ‘‘ఆంధ్రాపారిస్’’ అని వ్యవహరించారు.

**దళితులు:** భారతీయ సమాజం కులం పునాదులపై నిర్మాణమయ్యింది. చాతుర్వర్ణ వ్యవస్థ బయట నివశిస్తున్న ప్రజల్ని ఆనాడు పంచములు అని పిలిచేవారు. కులం అతిప్రాచీన కాలం నుండి ఉందనడానికి ఆధారాలు ఉన్నాయి. వృత్తిని బట్టి కులం ఏర్పడిరది. కొన్ని శతాబ్దాలుగా అస్పృశ్యులై వెలివేయబడిన దళితులకి అనేక పేర్లు ఉన్నాయి. ప్రధానంగా హరిజనులు, దళితులు ప్రస్తుత సమాజంలో దళిత శబ్ధానికి శబ్ధ రత్నకరము ఖండించబడిన, ఛేదించబడినది, చీల్చబడినది అని అర్థం. అలాగే సూర్యరాయాంధ్రుని నిఘంటువు కూడా. ఏది ఏమైన ప్రస్తుత కాలానికి అన్వయించినట్లయితే దళితులు అనే పదానికి సమాజం నుండి విడిగా చూడబడినవారు అని అర్థం చెబుతుంది. వర్ణ విభజన వల్ల పంచములుగా చూడబడి సంఘ బహిష్కృతులై అగ్రవర్ణాలచే నీచంగా చూడబడిన వారే దళితులని స్థూలంగా నిర్ధారించవచ్చు.

**దళిత సాహిత్యం:** దళిత స్పృహతో వ్రాసిన, స్పందనతో వ్రాసిన తేడా ఉంటుంది. దళితులు మరియు దళితేతరులు రాసిందంతా దళిత సాహిత్యం అనుబడుతుంది. నవ సమాజ ఆవిర్భావం కూడా వర్ణవివక్ష లేని సమాజంకోసం సృష్టించబడేదంతా అని నా అభిప్రాయం. దళిత సాహిత్యం దళిత సృహతో వ్రాసిన ప్రధములు జాషువా, బిర్నేడి, మోషే, భీమన్న, ధర్మన్న మొదలగువా . తెనాలి

మండల దళిత కవులు మధురకవి, నూతక్కి అబ్రహం `సరసకవి, పినపాటి జెర్మియా, భాగవతరత్న అత్తోటరత్న కవి పినపర్తి ఎజ్రా గార్లు ప్రముఖంగా చెప్పవచ్చు. వారి జీవితవిశేషాలు, సామాజిక నేపథ్యం, రచనకు తోడ్పడిన అంశాలు వారి కవితలలో కనిపిస్తాయి.

**నూతక్కి అబ్రహం కవి:** కొలకలూరు నివాసి నూతక్కిదానియేలు, కోటమ్మ గార్లకు 1923లో మార్చి 07వ తేదిన జన్మించారు. గుఱ్ఱం జాషువా గారి శిష్యులు. మత్కుణం, పావురం, జలరుహాక్షి, పరిపూర్ణుడు, మొదలగు రచనలు చేశారు. మాతృభాష మీద అభిమానం మెండు. సామాజిక సంక్షేమమే అతని ధ్యేయం. సమాజంలో ఉన్న దౌర్జన్యాన్ని ఎదిరించగలిగే స్వభావం తన రచనల్లో వ్యక్తమవుతున్నాయి. భాష కూడా వ్యవహారిక, సరళభాషను ప్రయోగించాడు. మత్కుణం కావ్యం 1951లో వ్రాశాడు. మత్కుణం అంటే నల్లి. జాషువా కవి కాళిదాసు మేఘసందేశం నేపథ్యాన్ని అనుసరించి గబ్బిలం రాస్తే, ఈ కవి గబ్బిలాన్ని అనుసరించి ఈ కావ్యాన్ని రాశాడు. పరిపూర్ణుడు భారతపర్వాల్లాగా 18 శీర్షికలు గలది. అన్ని పరిపూర్ణమైన, సమాజశ్రేయస్సు కోరిన వారిని గూర్చి వ్రాసారు.

**అత్తోటరత్న కవి:** అ.ర.క.గా ప్రసిద్ధి పొందిన దళిత కవి. సత్తెమ్మ, వినుకొండయ్య 26.4.1908లో జన్మించారు. వీరి సాహితీ గురువు కొండవీటి వెంకటకవి. జాషువా గారితో తనకు సన్నిహిత సంబంధాలున్నాయి వీరికి భాగవతరత్న అను బిరుదు కలదు. వీరి రచనలు హరిజనాభ్యుదయం యక్షగానం, కుశలవ మొదలగునవి ఆచార్య తుమాటి దోణప్ప గారు వీరి స్వీయరచనలు గూర్చి, హరికథ సర్వస్వంతో ప్రస్తావన చేశారు. హరిజనాభ్యుదయం 1950లో వ్రాసారు. దళితుల జీవన మనుగడ, ఆనాటి అస్పృశ్యతను తెలిపారు. అవిద్య, అజ్ఞానం వల్లనే ఆనాటి పంచములలో సామాజిక చైతన్యం స్తంభించిందన్నారు. వారిలో మార్పును అభివృద్ధిని కాంక్షించారు.

**పినపాటి జెర్మియం గారు:** పినపాటి వాసి 28.12.1925న తానియేలు, సువార్తమ్మలకు జన్మించారు. వృత్తి రిత్యా ఉపాధ్యాయుడు. సంగీత సాహిత్యంపై మక్కువ గలవాడు. వీరికి రత్నకవి, అబ్రహం గార్ల ప్రోత్సాహం ఉంది. వీరికి 1988 ఆనాటి గవర్నర్ కుముద్ బిన్ జోష్ గారి ద్వారా సన్మానం జరిగింది. తొలివెలుగు, అమృతోక్తులు, హతాశుడు, నగ్నసత్యాలు, మొ.వి, వీరి రచనలు. బిరుదు సరసకవి.

**పిడపర్తి ఎజ్రా:** 1923 మే 18 జకరయ్య, పున్నమ్మలకు జన్మించారు. వృత్తి రీత్యా ఉపాధ్యాయుడు. సాహిత్యంలో శక్తి కొలది సాంఘిక పరిస్థితులపై రచనలు చేశారు. అవినీతి, మొ.వి.

**సామాజిక స్పృహ:** సామాజిక స్పృహ అంటే సంఘసంబంధమైన జ్ఞప్తి, ఇచ్ఛ, గాఢమైన కోరిక అని సూర్యారాయాంధ్ర నిఘంటువు తెలియజేస్తుంది. అంటే రచయిత తాను సామాజిక జీవినని సమాజం లేనిదే తాను లేనని, తన ఉనికి, తన భద్రత, తన అభ్యుదయం సర్వస్వం సమాజశ్రేయస్సు మీదే ఆధారపడి ఉంటాయని అలాంటి శ్రేయస్సును చేకూర్చడానికి తానుకూడా ఒక సమిధిని సమర్పించాలని నిరంతరం సమాజ సంబంధ చైతన్యంతోను జీవిస్తూ తద్గత భావనలోనే నిమగ్నుడై తదనుగుణమైన రచన చేస్తే అలాంటి రచన సామాజిక స్పృహ, చైతన్యం గల రచనగా ప్రశంసింపబడుతుంది.

స్పృహ, చైతన్యం అనే పదాలు consciousness (కాన్సియస్‌నెస్) అనే పదానికి అనువాదాలు కాబట్టి మౌలిక పదచర్చ కూడా కొంత చేయాలి. వ్యక్తి అంతరంగానికి సంబంధించిన ఎరుక, జాగృతి అని, ఈ పదానికి అర్థం. మానవుడు సంఘజీవి. మానవ సమాజంలో ఒక వర్గానికి చెందిన వ్యక్తి, ఆవర్గంతో తనకు గల సంబంధబాంధవ్యాలను గురించి స్పృహను, ఇతర వర్గాలలోని సభ్యులతో ఏర్పరచుకున్న సంబంధ బాంధవ్యాలను గురించిన స్పృహను సామాజిక స్పృహ అని సాధారణంగా చెప్పవచ్చు. సృజన సాహిత్యంలో వాస్తవికత సామాజిక చైతన్యానికి ప్రతీక. ఎక్కడైతే వాస్తవికత ఉంటుందో అక్కడ సామాజిక సృహ ఉందని భావించవచ్చు. సామాజిక సృహ అంటే స్థూలంగా జీవితాన్ని, సమాజాన్ని, ఉన్నది ఉన్నట్లుగా చిత్రీకరించడం అని చెప్పవచ్చు.

**మత్కుణం కావ్యం:** సామాజిక స్పృహ గల నూతక్కి అబ్రహం గారిచే మత్కుణం కావ్యం వ్రాయబడినది.

జాషువా గారు కాళిదాసు మేఘసందేశం దృష్టిలో పెట్టుకుని గబ్బిలం కావ్యంరాస్తే, అబ్రహం కవి గబ్బిలం కావ్యం ప్రేరణతో మత్కుణం రచన సాగిందని చెప్పారు. మత్కుణం అనగా నల్లి, పేదవాని ప్రశస్తిగా నిలచినది ఖండిక. కవి గారు నిద్రించే సమయంలో నల్లి నిద్రాభంగం చేయగా బుద్ధ భగవానుని అహింస సిద్ధాంతం గుర్తుకు వచ్చి దానిని చంపకుండా పట్టుకొని దానితో తన గోడును వ్యక్తం చేశాడు. పేదవాని రక్తము నీకు ఆస్వాధ నర్హము కాదని నల్లికి అన్యోపదేశంగా తన మనోవ్యధను వ్యక్తం చేయడమే ఇందలి ఇతివృత్తం అని అబ్రహం కవి మత్కుణం కావ్య తొలిపీఠికలో తెలియజేసారు. చఱచఱ దిఱుగుచు దేహము

వఱయుచు సరిపడ్డచోటనాగుచు దిశలన్

పరికించుచు నల్లియొక తె

గురి తప్పి చుఱుక్కు మనంగ గుట్టెన్ వానిన్ -17

వాడు జగాల బ్రోచెడు ప్రభావిభవాడ్యుడు, వాని రెక్కలీ

నాడు శ్రమింపకున్న నరనాధులనాధులు కారె, భూమిపై

బూడిద రేగదే, కుడువం బొక్కెడు బువ్వకు విశ్వమాత పొ

ర్లాడి కృశించదే! కరువునందు వసించదే| దిక్కులేనిదై| -1

దళిత వర్గాలు రెక్కలు కష్టాన్ని ఆశ్రయించుకుని జీవిస్తారు. వారు శ్రమ శక్తిని పరిశ్రమగా నమ్ముకున్న ప్రజలు. ప్రపంచానికి భుక్తి సమకూర్చడానికి కష్టించేవారు కర్షక కార్మిక వర్గాలు. వీళ్ళు మాత్రం సుఖానికి నోచుకోని స్థితిలో ఉంటారని కవి ఆవేదన వ్యక్తం చేశారు. కవి కాలం నాటి సామాజిక స్థితి వ్యక్తమవుతుంది. మనల్ని ఆలోచింపజేస్తున్నాయి.

కుట్టితివని-నేనెవరికి

పెట్టదనర్హీలు తల్లి- పెట్టిన పుడమిన్

పుట్టునె పేదకు ధర్మము?

పుట్టినచో సర్వమిచట పుట్టినయట్లే. - 15

ఒకప్పుడు పంచములకు అధికారము లేదు కదా పెదవి విప్పిమాట్లాడే హక్కు మృగ్యం లేదు. సమాజంలో పేదవానికి న్యాయం ధర్మం ఎట్టి పరిస్థితులలో దొరకదని కవి ఆవేదన వ్యక్తం చేశారు. సామాజిక పరిస్థితిని తనదైన పద్ధతిలో వివరిస్తారు కవి. పల్లె ప్రజల జాతీయత కనిపిస్తాయి.

చందాల నిమ్మంచు చనుదెంచు నొకస్వామి

ఉన్న సర్వంబెల్ల ఊడ్చుకొనగ-నాటి సమాజంలో

ఏ విధంగా దోపిడి జరుగుతుందో తెలిపారు. జాతిని చైతన్యపరచారు. మానవులు శాస్త్రీయ దృక్పథం కలిగి ఉండాలన్నారు. మూఢనమ్మకాలు కూడదని చదువుకొని విజ్ఞానవంతులుగా జీవించమని ప్రబోధించాలి.

కలిమిలేనివాడ కష్టాలు పడువాడ

సకల జీవరాశిని సాకువాడ

నెత్తురోడ్చి బలము విత్తెడి మొనగాడ

పరువు గలిగి బ్రతుకు బక్కవాడ|

సమాజంలో దళితుల సామాజిక స్థితి తెలియజేశా .

పేదవారైన వారు ఆత్మాభిమానం గలవారని, శ్రమనే పరిశ్రమగా జీవించగలరని, మోసగించడం తెలియదని కవి భావన. పరువుగా జీవించమని వారిలో ఆత్మభిమానాన్ని చైతన్యాన్ని కలిగించారు.

ఇవ్విధి ధీనతన్ బలుకు
నీ నిరుపేద బలాబలంబులన్
గవ్వకు సాటి రావని ప
కాపక మంచును నవ్వబోకు - నా
కెవ్వరు సాటివత్తురు మహీ
తలమందు, పరాక్రమంబునన్
రవ్వలు రాల్పనే, కఱకు
రక్కసిరాజ్యము కాల్చివైవనే.
గుప్పింపగలను భగ్గునమండు పిడుగులన్
బ్రహ్మండమంతయు మారుమ్రోయ
వణికింపగలను విశ్వంభరాస్థలినెల్ల
మూడుపూటలు కూడుముట్టకుండ

జాతి శ్రమ దేశ ప్రగతి అవసరం. ఉత్పత్తి సాధనం దళితులు. సంపదను సృష్టించే వారు దళితులు. శ్రమశక్తి యొక్క ఔన్నత్యాన్ని మత్కుణం కావ్యాలలో కవి తెలిపారు.

"పరిపూర్ణుడు" అనే ఖండ కావ్యంలో -
ఎన్ని కోర్కెలరాసి కన్నీరు కార్చెనో, రమ్యమోహన పదార్థములగాంచి
ఎంత చంకలుగొట్టి ఇల నీరసించెనో, అందిన సౌఖ్యాలు పొందలేక....

అవిద్య, పేదరికం వలన దళితుల కోరికలు నశించినాయి. నిరాశకులోనై ఉన్నారని సుఖసంతోషాలు అందినట్లే అంది క్షణకాలంలో నశించిపోవుట వారి దీనస్థితిని వ్యక్తంచేశారు. వీరికి చదువు, అత్యంత ముఖ్యం. అందరూ చదువుకొని జీవితాన్ని చక్కగా మార్చుకోవాలని కవి భావన.

**హరిజనాభ్యుదయం:** అత్తోటరత్నకవి యక్షగానము కావ్యాన్ని వ్రాశారు. ఇది దళితుల స్థితిగతులు, జీవన మనుగడను తెలిపేది. అంటరానితనం చట్టమున్నంత మాత్రాన నశించదు. దానికి కడు ప్రచారబలం అవసరం అన్నారు.

హరిజనులు బహుకష్ట జీవులు ॥ తం ॥
రేయింబవలు శ్రమింతురువారు ॥ తం ॥
సోమరిపోతులు లేరా జాతిలో ॥ తం ॥
రక్తమాంసములు`రాల్చి పైరులన్ ॥ తం ॥
పండించి మన భారత ఖండమున్ ॥ తం ॥
నిండించి దరిద్రదేవతన్ ॥ తం ॥
ఖండించే మొనగాళ్ళు గావున ॥ తం ॥

వారి స్వభావికతను తెలుపుతూ హరిజనులు/దళితుల శ్రమ దేశ ప్రగతికి అవసరం అట్టి వారిని అస్పృశ్యులుగా చూడటం అమానుషం అంటాడు కవి. సమాజంలో మార్పు కోరాడు కవి.

**నగ్న సత్యాలు:** జెర్మియా కవి ఈ ఖండికలో పరిమిత కుటుంబం కట్టుబానిస, లేదు కొరత అనేక శీర్షికలో నిజజీవిత సత్యాలు ఏర్చి కూర్చి వ్రాశారు.

ఒకడు చంకన మరి యొకడు భుజాలపై / నధివసింప నొకడు అయ్యిచేయి

పట్టి నడుచువేళ భామకు నెలలాయె / ఏటికొక్క బిడ్డనేలనొక్కో! – 5

అధిక సంతానం వలదు. అది అనర్థదాయకం. పరిమిత కుటుంబం జాతి ప్రగతి అవసరం. కుటుంబ నియంత్రణ లేని కారణాన దేశప్రగతి దెబ్బతింటుంది. జనాభా సమస్యపై జాతి జనులలో జ్ఞానాన్ని, చైతనాన్ని, కలిగించారు జెర్మియా కవి.

**అవినీతి :** ఎజ్రాకవి నేటి సమాజంలో అవినీతి, అవాంఛనీయ పరిస్థితులు ఈ ఖండికలో వ్రాసారు.

పడతులు ఒంటరి పాటున / గుడుపుట కష్టము నిజముగ కఠినుల మధ్యన్

కడలిని దాటుట సులభము / గడపను దాటుట యువిధకు గండము సుమీ! - 62

సమాజంలో స్త్రీలకు స్వేచ్ఛ లేని స్థితి వెల్లడిరచారు. స్త్రీ స్వేచ్ఛను కాంక్షించి సామాజికంగా చైతన్యవంతం కావాలని కవి అంటారు. జాతిజనులలో మార్పురావాలి అని కవి కోరారు. వారి కనులముందు జరిగినవి చూచి చలించి మార్పుకై చేసిన రచనగా భావించాలి.

మింటి కెగిసిన ధరలతో / కంటికి కఱువాయె నిదుర కలతల చేతన్

మంటలు రేపెడి ఆకలి / కంటక ప్రాయముగ నుండు గడవగ దినముల్ - 70

నిత్యావసర వస్తువుల ధరలు వేగంగా పెరగడంతో పేదల బ్రతుకులు దినదిన గండంగా మారుతున్న స్థితిని కవి తెలిపారు. పద్యంలో భావం హృదయానికి హత్తుకుంటుంది. వారు జాషువా గారి శిష్యులు కావున భాష నుడికారపు సొగసులు వారి కావ్యాలయందు కనిపిస్తాయి. శ్రామికుల బ్రతుకుల పట్ల సానుభూతి కనిపిస్తుంది. బేధ భావన వల్ల మానవత్వం నశించిపోయిందని కవి అంటారు.

ఈ విధంగా తెనాలి మండల దళిత కవులైన అబ్రహం, రత్నకవి, జాషువా, జెర్మియా, ఎజ్రాలు వీరి రచనల సామాజికాంశాలు పురోభివృద్ధికి సోపానాలుగా అభివర్ణించవచ్చు. సామాజిక స్పృహ గల అంశాలు జాతి మనుగడను మలిచేవి సమాజ మార్పును కోరేవి. మానవత్వాన్ని మేల్కొల్పేవి. జాతి అభివృద్ధికి తోడ్పడేవి.

**ఆధారగ్రంథాలు:-**

1) తెనాలి నూరేళ్ళ రంగస్థిలి, నేతినేని పరమేశ్వర శాస్త్రి

2) హరిజనాభ్యుదయం – డా.భాను (పరిశోధనా గ్రంథం)

3) మత్కుణం – అబ్రహం - రాణి ప్రింటర్స్ గుంటూరు – 1992

4) హరిజనాభ్యుదయం - రత్నకవి సర్వోదయ ప్రింటర్స్ – గుంటూరు - 1990

5) హతాశుడు – జెర్మియా - విజయ ప్రింటర్స్, తెనాలి- 1991

6) అవినీతి – ఎజ్రా - విజయ ఆర్ట్స్ ప్రింటర్స్, తెనాలి - 1994.

********

# 21. మినీ కవిత్వం – సామాజిక స్పృహ

**డా|| పి. విజయ కుమార్**

అసోసియేట్ ప్రొఫెసర్

తెలుగు శాఖ

యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్

కాలం మారుతుంది. మార్పులు వస్తూనే ఉన్నాయి. సమాజ గతమార్పులు సాహిత్యంలో ప్రతిబింబిస్తున్నాయి. సాహిత్యంలో ప్రక్రియల్లో వైవిధ్యం వస్తూనే ఉంది. అన్నీ మారుతూనే ఉన్నాయి. మారనిది మార్పొక్కటే, 'అల్పాక్షరాలలో అనల్పార్ధరచన' చేయడం ఆనాడు పాల్కురికి సోమనాథునితో ప్రారంభమయింది. దానిని మనం ఆధునిక వ్యావహారిక భాషలో 'మినీ కవిత' అనే పేరుతో పిలుస్తూ ప్రత్యేక ప్రక్రియగా పేర్కొంటున్నాం.

వేగపూరిత సమాజంలో పెద్ద పెద్ద రచనలు చదివే ఓపిక, సమయం లేకుండాపోయాయి. సాహిత్యరచన సహజంగా జనజీవన ఆలోచనా స్రవంతిలో భాగంగా వచ్చిన మార్పులకనుగుణంగా రావడం జరుగుతుంది. ఈ నేపథ్యంలో తెలుగు కవితారంగంలో 1975 నుంచి మినీ కవితలు వచ్చాయి. ఒక బలమైన ఉద్యమంగా 1980 నాటికి 'మినీకవిత' రూపుదాల్చింది.

నిగూఢమైన భావాన్ని కొద్ది పంక్తుల్లోకి ఒదిగి రసవత్కావ్య ఖండికను చదివినట్లు అనుభూతిని కలిగించే ప్రక్రియే మినీకవిత. వామనకవిత, లఘుకవిత, చిన్నకవిత, పొట్టి కవిత అనేవి పేర్లు వినిపిస్తున్నా 'మినీకవిత'గానే స్థిరపడింది. "మినీకవిత ఆయుస్సు మెరుపంత కాగా అది ప్రసరిస్తుంది కాలమంత" అని సింగిరెడ్డి నారాయణ రెడ్డి గారు. మినీకవిత నిర్వచనాన్ని మినీకవితలోనే నిర్వచించి మినీకవితను 'సౌదామినీ కవిత' అని ప్రస్తావించారు.

తెలుగు కవితా రంగంలో దాదాపు పదేళ్ళుగా మినీకవిత సరికొత్త ప్రయోగంగా తన వ్యక్తిత్వాన్ని ప్రకటిస్తోంది. ప్రతి ప్రయోగం గతంలో నుంచి ఒక కొత్తదనాన్ని సృష్టించడానికే పుడుతుంది. వచన కవితలోని విస్తృతికి, అభివ్యక్తిలోని వాచ్యతకూ విసిగిన యువలోకం సంక్షిప్తంగా, బలంగా, వ్యంగ్యంగా భాషావిష్కారాన్ని సాధించాలన్న తపనలో నుంచి మినీకవిత పుట్టింది. మినీకవిత తన హ్రస్వత్వం చేతకాదు ఆకర్షించింది. ఒక భావాన్ని బలంగా చెప్పడానికి ఒక కొత్త వాహికగా అవతరించడం చేతనే ఇంత ఆదరణ పొందింది అని జి.వి. సుబ్రహ్మణ్యం గారు 'మినీకవిత హనీకవిత' వ్యాసంలో పేర్కొన్నారు.

మినీ కవితను గూర్చి

**"ఎన్ని గజాలు రాశాడన్నది కాదు**

**ఎన్ని నిజాలు చెప్పాడన్నది ముఖ్యం"** అంటారు ఆరుద్ర.

మినీ కవిత అనేది ఒక తొలకరి మెరుపు. మెరుపు అనేది మెరిసిన తర్వాత నిలవదు. వెంటనే అదృశ్యం అయిపోతుంది. కాని మినీకవిత తనను వినిపించి మాయమైపోదు. నిలిచిపోతుంది. కనుక అదొక స్థిరమైన తొలకరి మెరుపు అంటారు సంజీవదేవ్. ప్రజాకవి మహాకవులకన్నా ఎప్పుడూ తక్కువవాడే. సూర్యుడు నక్షత్రాల కన్నా చిన్నవాడే కదా! అన్నది డా|| రావి రంగారావు గారి భావన.

"సున్నితంగా చురకలు వేస్తూ, వాస్తవాన్ని తెలియజేస్తూ గుణపాఠం చెప్పే కవితాగుణం కలవి మినీకవితలు" అని డా|| ద్వానాశాస్త్రి గారి అభిప్రాయం. ఈనాడు మినీకవిత సామాజిక వస్తువాహికగా ప్రధాన స్థానం ఆక్రమిస్తుంది. భావాభివ్యక్తిలో కొత్త అవకాశాలు చూపించింది. కొత్త ద్వారాలు తెరిచింది అంటారు ఇటీవలే పరమపదించిన డా|| అద్దేపల్లి రామమోహనరావు.

ఆర్థిక, సాంఘిక, రాజకీయ, అసమానతల్ని ప్రతిబింబిస్తూ ఎన్నో మినీకవితలు వస్తున్నాయి అంటారు అద్దేపల్లి భరత్ కుమార్.

ఆవేశాన్ని, ఆనందాన్ని హృదయానికి హత్తుకునేట్లు చెప్పేది మినీకవిత అంటారు జింబో.

మినీ కవిత మన మధ్యలో బాగా మసలుతున్నది. సూక్తిలా కనబడ్డా సూక్తి కంటే విలక్షణమైన అభివ్యక్తితో దర్శనమిస్తోంది. జీవిత విమర్శకు అద్దం పడుతుంది. సామాజిక చైతన్యానికి శక్తివంతమైన సాధనంగా ఉపయోగపడుతుంది. మినీకవితకు సంక్షిప్తత ప్రధాన లక్షణం. వ్యక్తీకరణలో సూటిగా స్పష్టం చేయడం, నవ్యత, చమత్కారం, వ్యావహారిక భాష, భావగాంభీర్యం మినీకవిత లక్షణాలు.

డా|| రావి రంగారావు గారు 1981లో 'గుడ్మార్నింగ్' మినీకవితల సంపుటిని ప్రచురించారు. 2002లో రావి రంగారావు గారు 'అగ్గిపెట్టె' పేరుతో త్రిభాషా మినీకవితల సంపుటి ముద్రించారు. రావిరంగారావు గారు 'గుడ్మార్నింగ్' కవితలో సూర్యోదయ దృశ్యాన్ని కమనీయంగా వర్ణించారు.

**"ఆకాశం ఇచ్చింది - ఆకుల్ని,**

**చీకటి తెచ్చింది - వక్కల్ని,**

**వెన్నెల కలిపింది - సున్నం,**

**తాంబూలం వేసుకుంది - సముద్రం**

**పొద్దున్నే పలకరించాడు - భానుడు నవ్వుతూ**

**సముద్రము నవ్వింది - పండిన నోటితో** అని రంగారావు గారు అక్షరబద్ధం చేశారు.

**"ఆకాశమంత వుంది కదా అని**

**వానచినుకు**

**సముద్రాన్ని ఆశ్రయిస్తే**

**దాని బతుకు ఉప్పనయిపోయింది.**

ఆని ఆసు రాజేంద్ర 'కాశాన్ని చూసి' అనే మినీ కవిత రాశారు. అల్పాక్షరాలలో అనల్పార్థ రచన చక్కగా భావంలో పదాలు ఒదిగిపోయాయి.

డా|| రావి రంగారావు డబ్బు కోసం మనిషి ఏ విధంగానైనా మారిపోతున్నాడని చివరికి మనిషి కుక్కలా మారిపోతున్నాడని, అన్నింటికన్నా డబ్బు విలువ సమాజంలో పెరిగిపోయిందని ఇలా స్పందించారు.

**"డబ్బు**

**దేవుడయ్యే సరికి**

**ఇనుము - పెట్టయింది.**

**రాయి - గోడయింది**

**చెక్క - తలపయింది**

**చివరికి...**

**ప్రాణం - కుక్కయింది.**

సింగంపల్లి అశోక్ కుమార్

**"తమకు దేశం తిండి పెట్టనందుకు కాదు**

**తాము దేశానికి తిండి పెట్టలేకపోయినందుకు"** అని రైతు ఆత్మహత్య గూర్చి స్పందించారు.

డా|| గుమ్మా సాంబశివరావు

**"మనిషిని చూసి గ్రహాలు వణుకుతున్నాయి**

**అన్వేషణకు - వస్తున్నాడని కాదు**

**ఆక్రమణకు - వస్తున్నాడేమోనని"** అని మనిషి స్వభావాన్ని గూర్చి అక్రమ స్వరూపాన్ని క్లుప్తంగా భావగాంభీర్యాన్ని ప్రకటించారు.

జి. సుబ్బారావు 'కొబ్బరాకు' అనే కవితలో

**"చెట్టున ఉన్నప్పుడు**

**నెమలి పింఛమై పురివిప్పుతుంది.**

**పండుటాకై రాలినప్పుడు**

**గుడిసె గుండెల్ని కప్పుతుంది"** అన్న వినూత్న భావన నాలుగు పంక్తుల్లోకి ఒదిగేలా చేశారు.

**"గుడిసెలో మానానికి గుడ్డకరువు**

**షోకేసులో బొమ్మకు గుడ్డ బరువు"** అని రసరాజు చక్కటి రచనాశైలి, ప్రాసపై పట్టు, భావస్పష్టతల మేళవింపు పై కవితలో ఆవిష్కరించారు.

**"అతను చాలా మంచోడు.**

**ఎంతో మందికి సాయం చేశాడట**

**ఆఖరికి తన భార్యకు సాయంగా**

**మరో భార్యను కూడా"** అని శైలజామిత్ర 'మహాత్ముడు' అనే శీర్షికను పెట్టి వ్యంగ్యంగా చిత్రీకరించారు.

**ఈ దేశంలో దేశానికి వెన్నెముక గ్రామం**

**గ్రామానికి వెన్నెముక రైతు**

**వెన్నెముక ఎప్పుడు వెనకే ఉంటుంది**

**రైతు ఎన్నడూ వెనకబడే ఉంటున్నాడు**

పదవతరగతి చదివే విద్యార్థి నాగరాజు రైతును గూర్చి వాస్తవికతకు దర్పణంగా కవితను ఆవిష్కరించాడు.

**కాళ్ళు తడవకుండా**

**సముద్రాన్ని దాటగల మేధావియైనా**

**కళ్ళు తదవకుండా**

**జీవితాన్ని దాటలేదు**

అని వసీరా 'జీవితం' అనే 'మినీకవిత' చేశారు. "జీవితాన్ని దాటడానికి హృదయానికి ఆర్ద్రత కావాలి. దుఃఖాన్ని సహించే శక్తి కావాలి" అంటూ వసీరా కవితను డా|| అద్దేపల్లి రామమోహనరావు వ్యాఖ్యానించారు.

చంద్రసేన్ 'కంటితెలివి' అనే కవితలో

**"కన్ను తెరిస్తే జననం**

**కన్ను మూస్తే మరణం**

**రెప్పపాటే గదా ఈ ప్రయాణం"** జీవిత ప్రమాణాన్ని మూడు పంక్తుల్లో యుచ్చటగా ముచ్చటించారు.

కాళోజీ నారాయణరావు 'ప్రముఖ మానవతావాది జయప్రకాశ్ నారాయణ పరమపదించినపుడు 'ఓపీ' పేరుతో మినీకవిత రాశారు.

**పుట్టుక నీది**

**చావు నీది**

**బతుకంతా**

**దేశానిది"**

ఈ పల్కులలో పరమార్థం ప్రతి ఒక్కరికి ప్రతిధ్వనిస్తుంది.

జి.వి.ఎమ్. కాళిదాసు 'వెలుగు వీరుడు' పేరుతో చక్కటి 'దేశభక్తి' నేపథ్య గల కవితను ఆవిష్కరించారు.

**"వాడు**

**చిమ్మచీకటిలో**

**పదిమందితో కలిసి**

**పెట్రోమాక్సులైటు**

**పట్టుకొని**

**ప్రయాణం చేస్తుంటే**

**నవ్వుతావేరా?**

**చీకటి సమాజాన్ని ఛేదించి**

**వెలుగును అందిస్తున్నాడనా!**

నిజమైన దేశభక్తుల్ని చూసి నవ్యసమాజాన్ని దృష్టిలో పెట్టుకొని స్పందించిన కవిత ఇది.

సూర్యప్రసాదరావు ;అమ్మ' అనే కవితలో

**"అన్నం తినరా కన్నా" అని ఆప్యాయంగా చిన్నప్పుడు**

**"అన్నం పెట్టరానాన్నా" అని అర్థంగా పెద్దయినప్పుడు**" అని ప్రస్తుత సామాజిక దైన్యాన్ని ఆవిష్కరించారు. గుమ్మా సాంబశివరావు పిల్లల చదువుల్ని గూర్చి

**"రెసిడెన్షియల్ పంజరంలో / చిలుకల్ని చూడు**

**అవిశ్రాంత వేదపఠనం"** అని ఆలోచనాత్మకంగా స్పందించారు.

జింబో 'బతుకు' అనే కవితలో **"నే చచ్చిపోతాననే కదూ! నా బాధ పిచ్చివాడా!**

**ఈ వ్యవస్థలో మనం బతికేది తొమ్మిది మాసాలే"** అని సత్యాన్ని ఆవిష్కరించారు.

వచన కవితా యౌవన రూపం మినీ కవిత. మినీకవితకి ఉచ్ఛ్వాసం క్లుప్తత, నిశ్వాసం ధ్వని, రాసే కవి ప్రతిభను బట్టి ఎంత క్లుప్తతకైనా అవకాశముంది. మినీ కవితలో వచనకవితకి వ్యంగ్య వైభవాన్ని నేర్పిన మినీకవిత కవి ప్రతిభకి నికషో పలం లాంటిది" అది అద్దేపల్లి రామమోహన్ రావుగారు మినీకవితను గూర్చి స్పందించారు.

**ఇలా మినీకవిత ఈనాడు హైకూలు, నానీలు, తంకాలు, నానోలు, మామీలు, రెక్కలు ఇలా మినీకవితా ధోరణులు వస్తూనే ఉన్నాయి. సామాజిక స్పృహ, సంక్షిప్త సౌందర్యం ప్రధానంగా మినీకవిత ప్రయాణం చేస్తోంది.**

********

# 22. కె. సభా కథలు - సామాజిక స్పృహ

**డా|| రాచపాళెం పురంధీశ్వరి**

తెలుగు అధ్యాపకురాలు

శ్రీవేంకటేశ్వర ప్రాచ్య కళాశాల,

తిరుపతి

సెల్ నెం. 94419 48813

**కథానిక – పరిచయం :-**

ఆది మానవుడు మాట నేర్చిన నాటి నుండి కథలు చెప్పడం ఆరంభించాడు. ఆనాటి నుండి ప్రపంచంలోని అన్ని భాషల్లోనూ కుప్పలు తెప్పలుగా కథలు వెలువడుతూనే వున్నాయి. ఆధునిక కాలంలో కథానిక ఒక విశిష్ట సాహిత్య ప్రక్రియగా రూపొందింది. నేడు కథానిక అందరికీ ఆనందాన్ని, అనుభూతిని జీవితపు విలువల్ని, సత్యాల్ని అందించే ముఖ్యమైన సాహిత్య ప్రక్రియ అని చెప్పవచ్చు. కథలు ఆకాశంలో నుండి ఊడి పడవు. కథ జీవిత సంబంధి. ప్రతి జీవితం వెనుక ఒక కథ ఉంటుందనడం ఉత్ప్రేక్ష కాదు. ఇళ్ళలోనూ, వీధుల్లోనూ, పొలంలోనూ, సంతల్లోనూ ప్రతి నిత్యం అనేకానేక కథలు పుట్టుతున్నాయి.

**కథానిక – నేపథ్యం :-**

విత్తనం సారవంతమైన నేలలో పడితే ఆ నేలనే పెకలించుకుని మొక్కగా పైకి లేస్తుంది. కథ కూడా అంతే. ఒక సంఘటన, ఒక మాట, ఒక వార్త ఏదైనా కావచ్చు. అందులో బలముంటే హృదయాన్ని తాకితే కథ గా రూపుదిద్దుకుంటుంది.

**కథానిక – ఆవిర్భావం :-**

తెలుగు సాహిత్యంలో ఊకుడు కథలకు ప్రబంధాలకే పరిమితమైన కథాస్వరూపం పాశ్చాత్యుల ప్రభావంతో ఆధునికతను సంతరించుకుంది. విశ్వకథా సాహిత్యంలో ఒక విశిష్టమైన స్థానాన్ని కథ సముపార్జించుకుంది. లాక్షణికులు నాటక లక్షణాలను నిర్దేశించి కవిత్వ తత్వాన్ని ఆవవిష్కరించారు. అనుభవజ్ఞులైన మహారచయితలు కథా లక్షణాలను నిర్వచించారు. కథకు కల్పన, వాస్తవం, కథన కౌశలం మూలస్తంభాలుగా పేర్కొన్నారు. వాస్తవానికి కల్పన తోడైతే విశిష్ట కథనంతో మంచికథ అవుతుంది.

తెలుగు వాళ్ళకు కూడా చెప్పుకోతగినంత కథా సాహిత్యముంది. తెలుగు సాహిత్యపు కీర్తి ప్రతిష్టలను విశ్వ సాహిత్యపు వేదికపై నిలిపిన గౌరవం కథానికా ప్రక్రియకు దక్కుతుంది. తెలుగులో కథానిక 1910 లో ఆవిర్భవించింది. గురజాడ వేంకట అప్పారావు రాసిన 'దిద్దుబాటు' తొలి తెలుగు కథానిక. నాటి నుండి ఎందరో కవులు, కవయిత్రులు, సాహిత్య సంస్థలవారు, పత్రికల వారు, ఆకాశవాణి కేంద్రాలవారు కథానికా వికాసానికి కృషి చేస్తున్నారు.

**రచయిత – పరిచయం :-**

రాయలసీమలో కథానిక ఆవిర్భావం చాలా ఆలస్యంగా జరిగిందని చెప్పవచ్చు. చిత్తూరులో ఆధునిక కథానిక ప్రారంభానికి సభా ఆద్యులని చెప్పవచ్చు. 1944 సం||లో కథలు ప్రారంభించిన సభా కన్ను మూసే వరకూ అనేక కథానికలు రాసి తెలుగు కథా సాహిత్య వికాసానికి తోడ్పడ్డాడు. సభా ఆధునిక కథకులు. ఆయన కథా వస్తువు నవ్యమైంది. వారి కథలో గ్రామీణత, తెలుగుతనం ఉట్టిపడుతుంది. పల్లె ప్రజల జీవన విధానానికి సభా కథానికలు ప్రతిబింబాలు. వారి కథానికలు తేనెలూరే తియ్యనైన మాధుర్యాన్ని కలిగి వున్నాయి.

**కె.సభా కథలు – సామాజిక స్పృహ :-** సమకాలీన జీవితమే కథలకు వస్తువు కావాలి. కథా వస్తువు వాస్తవికతకు దగ్గరగా వుండాలి. వస్తు స్వీకరణలో వైవిధ్యముండాలి. సజీవమైన కథలు జీవితం నుండే పుట్టుకు రావాలి వంటి నిర్దిష్ట అభిప్రాయాలు గల రచయిత సభా. వీరి కథా వస్తువు సామాన్యమైంది, సహజమైంది, సజీవమైంది, సమకాలీనమైంది, వాస్తవమైంది, విస్తృతమైన వైవిధ్యం కలది.

సభా గ్రామ ప్రజల జీవనాన్ని తన కథలకు వస్తువుగా స్వీకరించాడు. సామాన్య జీవన సమస్యలే వారి కథలకు ఆయువుపట్టు. సామాన్యుడే వారి కథలకు నాయకుడు. రైతుపడే బాధలు, కష్టాలు వీరి కథా వస్తువు. సభా జీవితంలోని అనుభవాలు ఇతివృత్త వైవిధ్యానికి తోడ్పడ్డాయి. జీవిత దృక్పథంలోని మార్పులు కథావస్తువును తీర్చిదిద్దాయి. సభా సామాజిక స్పృహ గల రచయిత. సభాకథలు సామాజిక జీవన ప్రతిబింబాలు, సమాజంలో తన కంటికి ఆనిన ప్రతి అంశాన్ని కథగా మలిచాడు.

**కె.సభా – కర్షక పక్షపాతి :-**

సభా గ్రామ ప్రజల కష్టాలను బాధలను వివరించి చెప్పాడు. రాయలసీమ రైతు కష్టాల్లో పుట్టి పెరిగి మరణిస్తున్నాడు. ఇక్కడి సేద్యం చాలా శ్రమతో కూడుకొన్నది. రైతుకు తగిన ఫలితం దొరకలేదని తన కథల ద్వారా చెప్పాడు సభా. ప్రభుత్వం రైతులకు చేసే మేలును కళ్ళకు కట్టినట్లు తన కథల్లో చిత్రించాడు. రైతు ఔన్నత్యాన్ని పొగిడాడు.

పల్లె ప్రజల జీవితాల్లోని అజ్ఞాన అంధకారాన్ని పారద్రోలి విజ్ఞాన దీపాలు వెలిగించడానికి, మత కలహాల అడ్డు గోడల నిర్మూలనకు, అనాథ స్త్రీలపై అన్యాయంగా అత్యాచారాలను అరికట్టేందుకు, వ్యసనాలకు బలైపోయే జీవితాల విముక్తికై సభా కథలు రాశాడు. గ్రామ ప్రజల పాలిటి నరక కూపాలైన ఆసుపత్రులను విమర్శించాడు. జంతువుల పట్ల సభాకు ప్రేమ, జాలి, అభిమానం అని వారి కథా వస్తువులు తెల్పుతాయి.

**కె.సభాకథల్లో బహుముఖ వైవిధ్యం :-**

సమాజంలో రచయిత ముఖ్య పాత్ర అని సభా తెల్పాడు. బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన సభా సీమకథకుల్లో తొలి కథకుడు. పాఠకుల బాధ్యత అని తను గుర్తుచేశాడు. బడి పంతుళ్ల సమస్యలను కన్నులకు కట్టినట్లు చిత్రించాడు. విద్యార్థులకు సలహాలను బోధించాడు. మిలిటరీ వారి త్యాగాన్ని గుర్తించాడు. వారిపై గ్రామ ప్రజల్లో అభిమానాన్ని గౌరవాన్ని పెంచాడు. సభా సమాజంలోని ఏ విషయాన్ని తీసుకున్నా దానికి న్యాయం చేకూర్చారని చెప్పవచ్చును. మానవుడు సంఘంలో అనేక సమస్యల్తో జీవిస్తున్నాడు సమాజంలో అందరూ సమానంగా జీవించడం లేదు. కొందరు సర్వ సుఖాల్ని అనుభవిస్తున్నారు. కొందరు దరిద్రాన్ని భరిస్తున్నారు. ఒక వర్గం వారు భూస్వాములు. ఇంకో వర్గం వారు కూలీలు. ఈ వర్గ భేదాన్ని నిర్మూలించడానికి సభా కలం పట్టాడు.

నేర్పరి అయిన శిల్పి చేతిలో బంగారం రకరకాలైన ఆభరణాలుగా రూపులు మారి ధారణ యోగ్యతను పొందినట్లే, కథ సత్తా కలిగిన రచయిత చేతుల్లో పడి ఉత్తమకథగా రూపొంది తన ప్రయోజనాన్ని సాధిస్తుంది. పేదవాడుగా పుట్టడం... పొట్ట చేత పట్టు కోవడం.... ఆ పొట్టకోసం రకరకాల ఉద్యోగాలు చేయడం... వదులు కోవడం... గడించిన అనుభవాలతో జీవితం గడుసు తేలడం. చాలు ఈ మాత్రం అనుభవాలు ఏ వ్యక్తికి అయినా రచయిత కావడానికి. సారవంతమైన భూమిలో ఏ విత్తు విత్తినా ఫలించినట్లే సమర్థుడైన సభా చేతిలో ఏ సాహితీ ప్రక్రియ అయినా ఫలించింది. ప్రకాశించింది. ముఖ్యంగా కథానిక.

**కె.సభాకథల్లో – శైలీ నవ్యత :-**

సభాది స్వచ్ఛమైన తెలుగు కథ. దానికి తగిన అచ్చమైన తెలుగు శైలి. తెలుగు నుడికారం భాషా తియ్యదనం కలిగిన సరళమైన శైలి తెలుగు గ్రామీణ సంస్కృతి సంప్రదాయాలకు అద్దంపట్టే అందమైన శైలి. రాయలసీమలో పల్లెపట్టులు అక్కడి ప్రజలు నీటికోసం పడే బాధలు జీవితంలో ఎదుర్కొనే కష్టాలు సుఖసంతోషాలు వారి మూఢాచారాలు అన్నింటిని వారి చిరపరిచితమైన భాషలో లలితమైన శైలిలో

చెప్పాడు. సభాది ప్రత్యేకమైన శైలి. అది పాఠకుని మనస్సులో చెరగని ముద్ర వేస్తుంది. మాండలిక వ్యవహారిక భాష వీరి శైలికి సజీవత్వాన్ని సహజత్వాన్ని చేకూర్చింది.

**కె. సభా కథల్లో – రైతుల కడగండ్లు :-** ''అంతరంగం'' కథలో సభా అతి సులభమైన శైలిలో సామాజికతను తెలియ చేసాడు. ఒక కుగ్రామంలో ఒక రైతు కుటుంబానిది చాలా తక్కువ పొలం ఆ పొలం కూడా మెట్ట. దానికి ఏటి నీరు ఎక్కదు. కుంట నీళ్ళు అందదు. బావి త్రవ్వితే బండ అడ్డు వచ్చింది. అంతకంటే లోతుకు రాతిని చీల్చి బోరింగు పెట్టడానికి కావలసినంత పైకం లేదు. కనుక ఆ పొలానికి వర్షం నీరే ఆధారం. అణుక్షణమూ ఆకసం వంక చూస్తున్న ఆ రైతు సేద్యం లంక మేతకూ గోదావరి ఈతకూ సరిపోయినంతగా నైనా సరిపోదు. కాడి గిత్తలకు గడ్డి కూడా కరువే. పేరుకే సేద్యం కానీ అందులో వచ్చే ఆదాయం ఆ కుటుంబానికి ఏడాదిలో మూడు మాసాలకైనా చాలదు. అందుకే ఇల్లాదులు కూలి చేసేవారు. ఈ కూలి ఎల్లకాలమూ వుండదు. దొరకదు. కోతలకాలం ఊడ్పుల కాలం తొలకరిలో మాత్రం ఓ పక్షం రోజుల పాటు దొరుకుతుండేవి ఆ పనులు. సభా ప్రత్యేకమైన సహజత్వానికి ఇదొక మచ్చుతునక.

**పాతాళగంగ కథలో సామాజికత :-**

''పాతాళగంగ'' కథానికలో రాయలసీమ రైతు నీటి కోసం బావి తవ్వుతాడు. బండ పడుతుంది. సర్వం కోల్పోతాడు. చివరకు తన ప్రాణాలు సైతం పోగొట్టుకుంటాడు. ఈ విషాద సంఘటనలు పాతాళ గంగ కథానికలో చోటుచేసుకున్నాయి. ఆ రోజు పూర్ణిమ. పండు జాబిల్లి పావురాల గుట్టపైకి ఎగబ్రాకి వస్తున్నాడు. బావిగట్టుపై కూర్చున్న బేటప్ప తన పొలం వైపు కలయ చూచాడు. బావిలో గంగపడి చేలపై నాగేలు నడయాడితే పదెకరాలూ వరి సాగుతుంది. అందులో ఐదెకరాలు చెరుకు సాగుబడైనా ఇరవై బండ్లు బెల్లం అదృష్టం కలిసి వచ్చి గోనెరెండు నూర్లు అమ్మిందా పదహారువేలు. నూటికి పై చిల్లరమ్మినా పదివేలకు తగ్గదు. సవరం లాంటి నేల. ఇదే చాలు పొరగాలవ మడి ఇరవై గుంటల్ని దొంగల్దొత్తే మాత్రం పుట్టి మునిగిందా! ఏమైనాసరే గంగను కంటితో చూచే వరకు ఈ బావిని వదలననుకొంటూ ఇంటికి వచ్చాడు. వారానికో సారానికో ఇచ్చిన ఫలితానికి గుంటకు పందుమివ్వరా! తెలిసి తెలిసీ ఏటి కాలువ మడినీ ఊట కాలువ మాన్యాన్ని తూముకాడ పాదుల్ని అమ్ముకొంటారా ఎవరైనా! కొంద్రమడి వుంటే కోటి రూపాయలున్నట్లే గదా! కన్న తల్లిని పోగొట్టుకున్న వాడు నేల తల్లిని అమ్ముకున్నవాడూ కడతేరినట్టే కదా. చెంగయ్య హృదయం కుంగిపోయింది. కుందనపు బంగారాన్ని కూటినీళ్ళకు దార పోసినట్లు పచ్చనోట్ల కాయితాలకు అచ్చి వచ్చిన పంట పొలాన్ని అమ్ముకోవడమా! అయినా తప్పదు. బేటప్ప మాటకు అడ్డు తగిలితే ఊరుకోడు. బలే మోటు మనిషి. మొండి ఘటం. బంగారం లాంటి భూమిని కన్నతల్లి లాంటి ఏటికాలవ మడిని అమ్మాల్సి వచ్చినప్పుడు రైతు రైతాంగన పడే బాధను సభా అందమైన శైలిలో సజీవ యేకత్వాన్ని చేకూర్చాడు. కథను ఎంతో మనోహరంగా తీర్చిదిద్దాడు.

**అంబా కథలో గ్రామీణ జీవన చిత్రణ**

''అంబా'' కథానికలో సభా రైతుకున్న చాలా తక్కువ పొలంలో అతను పడే కష్టాన్ని తనదైన ప్రత్యేకతను చాటుకున్నాడు. పాలుపోసుకుంటున్న కంకులు మరో పదిరోజులు పోతే చాలు బంగారు వంటి పంట ఆ నాలుగు గుంటల మడి మీదనే వారి బ్రతుకు ఆధారపడింది. అందుకే ఆలూ మగడూ వెయ్యావుల కోనకెళ్ళి నలభై మోపులు పచ్చాకు తెచ్చి వేశారు. రోద్దులో చింతాకంతా వూడ్చేశారు. పందిళ్ళ చెరువులో పాచి తీసి గంపల కొద్దికీ తెచ్చిపోశారు. బలిసి పోయిన కలుపు తీసేటప్పుడు సిద్ధులమ్మ చెవుల్లో గుబావర్లమ్మి శనగ పిండి తెచ్చి కలిపారు. ఇన్ని చేస్తే పైరు నవనవలాడుతూ ఎదిగి వచ్చింది. ఊటొంకలో గాదెబావిలో నీరు తోడి పైరును కాపాడారు. యిలా చెప్పడం అందరికీ సాధ్యం కాదు. రైతుపట్ల అతని సేద్యం పట్ల అభిమానం వుండాలి. గ్రామీణ వాతావరణాన్ని, సాంప్రదాయాన్ని, సంస్కృతిని వంట పట్టించుకోవాలి. వారి సమస్యల్ని జాగ్రత్తగా చిత్రించాలి. అప్పుడే అవి అందర్నీ ఆకట్టుకుంటాయి. ఇది చాలా కష్టమైన పని. సభాకు గ్రామీణులంటే ఎంతో ఇష్టం. వారి సమస్యల్ని చిత్రించడమంటే మహా ఇష్టం. పాలుపోసుకుంటున్న కంకులు నాలుగు

గుంటల మడి ఊటొంకలో గాదె బావిలో నీరు తోడి పైరును కాపాడడం లాంటివి సభా సజీవ శైలికి నిదర్శనం. ఇవి పల్లె సీమల పట్ల అతనికి గల ఆసక్తిని చాటుతున్నాయి.

**ముగింపు :-**

తెలుగు కథానికా సాహిత్యంలో ఒక ప్రత్యేకమైన స్థానాన్ని సంపాదించుకున్న సభా బహుముఖ ప్రజ్ఞాశాలి. గ్రామీణ వాతావరణం ముమ్మొర్తులా వీరి కథల్లో ప్రతిఫలిస్తుంది. చిత్తూరు జిల్లా మాండలికాలను విరివిగా వాడుతూ తెలుగునాట గ్రామీణ జీవితాలను ఇతివృత్తాలుగా తీసుకుని అచ్చమైన తెలుగు కథలనేకం శ్రీ సభాగారు సృష్టించారు. వీరి కథలు తెలుగు ప్రజల హృదయాలకు సన్నిహిత మయ్యాయి. నిస్వార్థంతో, త్యాగ బుద్ధితో సమాజాభివృద్ధికి పాటుపడిన ఆదర్శ దంపతుల జీవిత చిత్రణే ''పిచ్చిదంపతులు'' కథానిక. కులమతాలకు అతీతంగా మనుషులందరూ సోదరుల్లా జీవించాలని ''బలిపీఠం'' కథానిక. పుట్టు దరిద్రుడైన కవిని ఆదుకోమని చెప్పడం ''ఎడారి పువ్వు'' కథ. ధర్మాసుపత్రుల అవినీతి, అన్యాయం, అమానుషం కళ్ళకు కట్టినట్లు ''పురిటి నొప్పులు'' కథానిక. మూఢనమ్మకాల్ని విమర్శించడం ''శూన్యం'' కథానిక. కరువు వాతపడిన అనాథల ఆకలి చావులు ''పగిలిన గుండెలు'' కథానిక. పాలేర్ల వెట్టిచాకిరీకి నిదర్శనం ''వెండికంచం''. మూఢ నమ్మకాల్ని పోగొట్టడానికి రాసిన కథానిక ''విశ్వాసజీవులు''. చదువుకోసం పట్టణాలకు వెళ్ళి, జీవితాన్ని పాడు చేసుకొనే విద్యార్థులకు బుద్ధి చెప్పడం ''నారాము''. చెడుసావాసాల్తో జీవితాన్ని నాశనం చేసుకోవద్దని ''నీటిబుడగ'' కథానిక సందేశాన్ని ఇస్తాయి. రైతు వ్యవసాయంలో పడే కష్టాలకు ''అంబా'' కథానిక నిదర్శనం. న్యాయవాదుల కర్తవ్యాన్ని బోధించే కథానిక ''ఆకాశగంగ''. విద్యుత్తును గ్రామ ప్రజలు అక్రమంగా దొంగతనంగా వాడుకోరాదనే ఉపదేశాన్ని అందించే కథానిక ''నీటిదీపాలు''. గౌతమబుద్ధుని ధర్మబోధనలకు అహింసా సిద్ధాంతాలకు ప్రతీక ''బుద్ధం శరణం గచ్ఛామి''. స్త్రీలకు మూఢ నమ్మకాల వలన కల్గే అనర్థాల్ని 'మూలానక్షత్రం' విమర్శిస్తుంది. ఈ విధంగా సభా కథానికలన్నీ ఏదో ఒక సామాజిక స్పృహతోనే రాసినా సందేశాత్మకంగానూ అందరికి ప్రయోజనాన్ని చేకూర్చేవిగానూ, ఆనందాన్ని కల్గించేవిగానూ, అందులోనూ ఏదో ఒక పరమార్థాన్ని తెలియజేసాయి.

**ఆధార గ్రంథాలు**

1. కథాశిల్పం – వల్లంపాటి వెంకట సుబ్బయ్య

2. కథానిక స్వరూప స్వభావాలు – పోరంకి దక్షిణామూర్తి

3. కె.సభా కథలు – కె.సభా.

*******

# 23. మధురాంతకం రాజారాం కథలు -సామాజిక స్పృహ

డా॥ గుమ్మడి రవీంద్ర

తెలుగు అధ్యాపకుడు

శ్రీవేంకటేశ్వర ప్రాచ్య కళాశాల, తిరుపతి

సెల్ నెం. 94403 23369

**కథానిక – పరిచయం :-**

ఆధునిక సాహిత్యంలో వచ్చిన వచన సాహిత్య ప్రక్రియల్లో 'కథానిక' విలక్షణమైంది. ప్రపంచంలో అన్ని భాషల్లో లాగానే తెలుగులో కూడా జానపద సంబంధ కథాకథన సంప్రదాయం అనేక వేల సంవత్సరాల నుంచి తరతరాలుగా కొనసాగుతోంది. అగ్ని పురాణంలో దీని ప్రస్తావన వుంది. తెలుగులో కథానిక పుట్టి సుమారు 90 ఏళ్ళు అయ్యింది. ఆంగ్ల భాష ప్రభావం వల్ల కథానికలో ఆధునిక లక్షణాలున్నాయి. కథానిక క్లుప్తంగా వుండాలి. పొందికగా వుండాలి. జీవితాన్ని యథారీతిగా చూపడం కథానిక ప్రధాన లక్షణం. ఆధునిక కథా సాహిత్యాన్ని జాగ్రత్తగా పరిశీలించి చూస్తే ఒక విషయం స్పష్టమౌతుంది. ఏ కథా రచయిత దృక్పథం అయినా తాను నివసిస్తున్న పరిసరాల మీద, పర్యటిస్తున్న ప్రదేశాల మీద, నమ్మిన సిద్ధాంతాల మీద, ఆధారపడి వుంటుంది. ఆ నేపథ్యంలోనే అతను కథావస్తువును గ్రహిస్తాడు.

రచయిత శిల్పి అయితే వస్తువు ఒక బండరాయి. శిల్పి తన పనితనంతో బండరాయిని అందమైన శిల్పంగా తీర్చిదిద్దినట్లే రచయిత మనిషి జీవితంలో జరిగిన సంఘటనను గానీ, సమస్యను గానీ, వస్తువుగా తీసుకుని తన రచనా నైపుణ్యంతో అందమైన కథగా మలుస్తాడు. రచయిత కంటికి కన్పించే జీవితం మాత్రమే కాకుండా గుండె కంటికి కన్పించే జీవితాన్ని చిత్రించాలి. కథానికలో ఇతివృత్తం సమాజ జీవితంలో ఒక అత్యంత అంశం. కథ ప్రధానంగా ఒక పాత్ర చుట్టూ ఒక సంఘటన చుట్టూ, ఒక భావం చుట్టూ పరివ్యాప్తమై వుండాలి. తమ అవసరాలను బట్టి ప్రజలు సమాజాన్ని మార్చడానికి ప్రయత్నిస్తే రచయితలు వారి అవగాహనా దృక్పథంపైన తమ ప్రభావాన్ని ప్రసరిస్తారు. సమాజం సాహిత్యం వల్ల ప్రభావితం అవుతుందని రచనలు సమాజాన్ని మారుస్తాయని చెప్పే పెద్దల మాటలకు బహుశా ఇది అంతరార్థమవుతుంది.

**రచయిత – పరిచయం :-**

జీవితానికి సాహిత్యానికి తేడా తెలియదు. జీవితమే సాహిత్యం సాహిత్యమే జీవితం అని గడిపిన రాజారాం గారు సాహిత్యమే జీవితం కథే ఊపిరిగా జీవించిన అతికొద్ది మందిలో ఒకరు. రాయలసీమ మధ్యతరగతి జీవితాల్లోని మందహాసాన్ని మంచి చెడులను తన కథల్లో ఆవిష్కరించి అయిదు దశాబ్దాల పాటు సాహితీ సేద్యాన్ని చేసిన ప్రముఖ కథారచయిత కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత మధురాంతకం రాజారాం. వీరు తుది శ్వాస విడిచే వరకు కథలు రాస్తూనే వున్నారు. రచయితగా ఎంత పేరుందో ఉపాధ్యాయుడుగా అంత పేరుంది. జీవితంలో నుంచి సిద్ధాంతం పుట్టాలి గానీ సిద్ధాంతంలో నుంచి జీవితం పుట్టడం అస్వాభావిక మని వారి నమ్మకం. కొత్త ఆలోచనలకు, కొత్త ధోరణులకు ఆహ్వానం పలకడంలో ముందుండేవారు. జీవితానికి మంచి చెడూ వుంటాయి. కానీ మంచిని గ్రహించి చెడును వదిలిపెట్టాలంటాడు. జీవితానికి నిర్వచనం సర్దుబాటని వారి నమ్మకం. అనుభవ పరిధికి పరిశీలనా పరిధికి దాటి కథలు రాయలేదు కానీ కథలు మనిషి లోని మంచితనాన్ని పెంచాలన్నది మధురాంతకం అభిలాష.

**కథానిక పరమార్థం - సంఘశ్రేయస్సు :-** శ్రీ రాజారాంగారి కథల్లో ముఖ్యంగా గమనించ దగిన విషయాల్లో వస్తువు ఒకటి వస్తువు రచయిత అనుభవాల్ని చీల్చుకుని వచ్చినదై వుండాలి అంటారు. ఈర్ష్య, అసూయ, రాగ ద్వేషాలు, ఆశ దురాశలు, శాంతి, అహింసలు

మొదలైనవెన్నో మానవుని మనసుకు ఇనుముకు అయస్కాంతంలా అంటుకొని వున్నాయి. అట్టడుగున పేదరికంతో మగ్గుతున్న నిరుపేదలు మొదలు ఆగర్భ శ్రీమంతుడి వరకు ఎన్నో రకాల మనుషులు, ఎన్నో రకాల ప్రవృత్తులు ఎన్నో సమస్యలు, సంఘర్షణలు ఎదుర్కొంటూ తమ నిత్య జీవితం సాగిస్తున్నారో వీటన్నింటిని కథా వస్తువులుగా తీసుకున్నారు రాజారాం గారు. వీరు సామాజిక స్పృహ గల రచయిత.

వస్తువును ఇచ్చేది సమాజం. శిల్పాన్ని తెలిపేది సాహిత్యం. ఏ కళకైనా పరమార్థం లోక కల్యాణం. సమాజాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తూ సాహిత్యాన్ని శ్రద్ధగా అధ్యయనం చేస్తూ సంఘశ్రేయస్సే ధ్యేయంగా తన ఉనికిని సార్థకం చేసుకోవడం కోసం రచయిత రచన చేయాలనీ, చేస్తాడనీ రాజారాంగారు అభిప్రాయపడ్డారు.

గ్రామీణ ప్రాంతపు లోయర్ మిడిల్ క్లాసు కుటుంబంలో పుట్టి బాల్యమంతా పల్లెసీమల్లోనే గడపి, హైస్కూలు చదువుకోసం తొలిసారిగా పట్నంలో అడుగుపెట్టి విద్యాభ్యాసానంతరం ఉపాధ్యాయవృత్తిని స్వీకరించి ఉద్యోగరీత్యా పల్లెటూళ్ళలోనూ, పేటల్లోనూ నివసించవలసివచ్చిన ఒక వ్యక్తి 45 ఏళ్ళ సుదీర్ఘకాలంలో రాస్తూ వచ్చిన వస్తువుల్లోని సహజతను సమకాలీనతను, రామణీయకతను సామాజికతను పరిశీలిస్తే

**రాజారాంగారి కథల్లో ఇతివృత్తం :-**

తెలుగు కథనరంగాన ధృవతారగా వెలుగొందిన రాజారాంగారు మధ్యతరగతి జీవన సంఘర్షణే ఇతివృత్తంగా, సామాజిక వాస్తవికతే సాధనంగా తెలుగు నేలలోని ప్రతి పాఠకుని గుండెను స్పృశించారు. సామాన్యుని జీవితం, ఉపాధ్యాయవృత్తి, పల్లె రాజకీయాలు, రోజువారీ సంఘటనలు కథాంశాలుగా సమకాలీన మధ్యతరగతి జీవితాన్ని ప్రతి బింబిస్తూ సామాజిక సమస్యలకు దర్పణం పట్టే కథలు అనేకం రచించి తెలుగు సాహితీ లోకాన్ని సుసంపన్నం చేసారు. రాజారాం గారి జీవితం లాగానే వారి కథలు నిరాడంబరంగా నిరాలంకారంగా ఉంటాయి. కథ కోసం పుట్టి కథగా జీవించి కథగానే అస్తమించాడు. 50 సంవత్సరాలు అలుపెరగని కృషి చేసినవారు. కరువుకాటకాలతో కొట్టుమిట్టాడుతున్న రాయలసీమలో 50 సం||లు కథల వర్షాన్ని కురిపించి ఈ సీమను సాహిత్య కథన పరంగా సస్యశ్యామలం చేశారు. తెలిసిన జీవితం పరిచయమైన సమస్యలను అత్యంత సహజంగా చిత్రించడంలో సిద్ధహస్తులు. మధ్యతరగతే కాదు సామాన్య గ్రామీణ ప్రజల జీవితాలను, బడుగు బతుకులు బక్కచిక్కిన రైతుల ఆత్మీయతను, భిన్న సామాజిక వ్యక్తిత్వాలను, వైయక్తిక దృష్టితో మధ్యతరగతి జీవన వైవిధ్యాలను రాయలసీమలో ప్రత్యేకించి చిత్తూరుజిల్లా ప్రాంతీయ వాసనలతో కథలు రాసారు. సామాన్యుని జీవితంలోని అన్ని కోణాలను చిన్న చిన్న ఆనందాలను జీవితంలోని కన్నీళ్ళు, కష్టాలు ఎలా కల గలిసి వుంటాయో కథనంలో సహజ రమనీయంగగా చిత్రించాడు. అన్ని రంగాలలో ఆరితేరిన ఒక మహాకళా తపస్వి. సాహిత్యం అనే ఆకాశంలో విశ్వవికృతిగా ప్రకాశించిన ఒక ధృవతార. పాతతరాల మొండితనాన్ని కొత్తతరాల ఆధునిక భావాలను తన కథల్లో వ్యక్తపరచిన మధురకథకుడు.

**పిచ్చి వెంకట్రావు కథ :-**

''పిచ్చి వెంకట్రావు'' కథలో ఒక మారుమూల గ్రామంలో ఎన్నేళ్లుగానో వెంకట్రావు అనే ఒక ఉపాధ్యాయుడు వుంటాడు. వారి అమాయకత్వమూ, మితిమీరిన పరోపకార పరాయణత్వమూ కలిసి ఆయనకు పిచ్చి వెంకట్రావుగా పేరు తెచ్చి పెట్టాయి. ఒకానొక సందర్భంలో ఆ గ్రామంలో ఒక వ్యక్తి తీవ్రంగా అనారోగ్యం పాలై ప్రాణాల మీదికి వస్తుంది. రోడ్డు వసతి కూడా సక్రమంగా లేని ఆ గ్రామం నుంచి చికిత్సకోసం రైల్లో హుటాహుటిన పట్నానికి తీసుకెళ్ళాలి గ్రామస్తులు. అతన్ని తీసుకొస్తుండగా రైలుకూత విన్పిస్తుంది. వారు మార్గంలో వుండగానే రైలు వచ్చేస్తుంటుంది. ఆ రైలు రోగి ప్రాణాలు కాపాడే చివరి అవకాశమూ చేయిదాటి పోయినట్లేనని గ్రామస్తులు ఒక నిర్ణయానికి వచ్చేస్తారు. అయితే పిచ్చి వెంకట్రావు మాత్రం రైలువైపు పరిగెత్తుతూ చేయి ఊపి దాన్ని ఆపేందుకు

ప్రయత్నిస్తాడు. వెంకట్రావుకు పిచ్చి ముదిరినట్లుందని పరుగెత్తే రైలును చేయి ఊపి ఆపడమేంటని ఎద్దేవా చేస్తారు. అంతలోనే రైలు ఆగుతుంది. రోగికి సకాలంలోనే చికిత్స అందుతుంది. ఏతా వాతా రైలు ఆగడం వెనుక కారణం ఆ ఇంజను డ్రైవరు వెంకట్రావు పాత శిష్యుడని ఆయన మంచితనం తెలిసినవాడని ఆయన పరుగెత్తడాన్ని చూసి రైలు ఆపాడని చెబుతూ కథ ముగిస్తారు. ఉపాధ్యాయవృత్తి ఎంతటి ఉదాత్తమైందో అసాధ్యాలను సైతం ఎలా సాధించగలదో ఆయన ఈ కథలో వివరిస్తారు.

**తాను వెలిగించిన దీపాలు** కథ:-

బడుగు బడి పంతులు జీవన ఉదాత్తతకు వీరి కథ - అద్భుత ప్రతీక అకల్మష శృంగారానికి నివాళి అతని 'కమ్మతెమ్మెర' కథ. ''పొద్దు చాలని మనిషి'' కథ స్వయం ఉపాధితో మానవుడి డిగ్నిటీని కొలిచే సాధనం. 'గణనీయుడు' - కథ మానవుడి విద్యుక్త ధర్మానికి ప్రతిధ్వని. వ్యంగ్యోక్తులతోనే ప్రౌఢత్వానికి పట్టం కట్టే కథలు పదులు కాదు వందలు. ''శబ్ద సందేశం'' కథ అరబ్బు దేశాల్లో మగ్గుతున్న భారతీయ గ్రామీణ స్త్రీల ఆక్రందన విని కంటతడి పెట్టని పాఠకుడుంటాడా! ''రాతిలో తేమ'' కథ చదివి గాంధీజీని స్మరించని పాఠకుడుంటాడా! వీటన్నింటినీ పరిశీలిస్తే రాజారాం కథలు తెలుగు జాతి నిత్య జీవిత వక్చిత్రాలు.

**అర్హత కథ** :-

'అర్హత కథ' లోని సిద్ధముని గురించి రెండు వాక్యాలు చెప్పుకుంటే రాజారాం కథా సాహిత్యానికి ఉన్న ప్రమాణాల ఔన్నత్యం తెలుస్తుంది. సిద్ధముని చిన్న రైతు. తన పొలంలో బంగారం పండించాలని బావి తవ్వడం పని చేపడతాడు. అది తలకు మించిన పనవుతుంది. అప్పులు పుట్టవు. అడుగున బావిలో బండ పడుతుంది. అది తవ్వి తీసేస్తే నీళ్ళు పడతాయన్న నమ్మకం. అలాంటి గడ్డు పరిస్థితిలో బంధువు ఒక సలహా ఇస్తాడు.

సిద్ధముని కుటుంబానికి వారసత్వంగా పచ్చకామర్ల వైద్యం వుంది. ఆ వైద్యంతో సిద్ధముని రోగి నుంచి పుచ్చుకునేది కేవలం రెండు రూపాయలే. రెండు రూపాయల బదులు ఇరవై రూపాయలు తీసుకో, నీకు ఈ అప్పులూ ఈ అప్పులు కోసం నీ తిప్పలూ వుండవు అని ఒక మంచి మాట మంచి ఉద్దేశ్యంతో చెప్తాడు. సిద్ధముని ఆ సలహాను తిరస్కరిస్తాడు. గుర్వాజ్ఞ మారరాదంటాడు. అలా పెద్ద మొత్తం రోగి నుంచి తీసుకోవడం తప్పంటాడు ఇది రాజారాం గారి కథా సాహిత్య మార్గం.

**సర్కసుడేరా కథ** :-

''సర్కసు డేరా'' కథ చదువుతుంటే మనం మొత్తం సర్కసు చూసివచ్చినట్టుగా వుంటుంది. ''ఆ డేరా చాలా పెద్దది డేరా చుట్టూ సాధు జంతువుల పాకలకు, క్రూరజంతువుల బోనలకు, మానవుల గుడారాలకు ఓపినంత జాగా ఆక్రమించుకోబడింది. చుట్టూరా పది పన్నెండడుగుల ఎత్తున్న డబ్బారేకుల ప్రాకారం ప్రాకారానికి ఆవల ఒకటిన్నర ఫర్లంగుల పొడుగునా ఇసుకవేస్తే కింద రాలని జనస్తోమం ఈ అన్నింటికీ వెనుక సోడా కిళ్లీల కొట్లు. టీ కాఫీ బంకులు, గారెలు బూరెలు అమ్మే అంగళ్ళు.

సిగరెట్ల పొగ, బీడికంపు, షోకేలా మనిషి సెంటు గమ గమ, పల్లెటూరు ముత్తైదువులు కొప్పులో ముడుచుకున్న మొగలి రేకుల సుగంధలహరి, కళ్లకు మిరుమిట్లు గొలిపే దీపాలు, చలికి ముడుచుకు పోతున్న ముఖాలు, నవ్వులు కేరింతలు ఛీత్కారాలు వికటాట్టహాసాలు. ఇలా వుంటాయి వారి వాక్చిత్రాలు.

**అంబపలుకు జగదాంబ పలుకు కథ** :-

'అంబ పలుకూ'.... జగదాంబ పలుకు మధురాంతకం మంచి కథల్లో ఒకటి. ఒక బుడబుక్కల వాడు కాసిన్ని బియ్యం, ఓ పాత బట్ట కోసం ఎవరు చెప్పినా వినకుండా తొండల మండలంలోని ఓ గుండప్ప మిహిడీకి వెళ్తాడు ఆ జమీందారుకి పేదోళ్ళంటే పడదనీ, అక్కడికెళ్తే ప్రమాదమనీ ఓ బైరాగి చెప్పినా నమ్మడు. తీరా వెళ్లాక ఆ గుండప్ప అల్సేషియన్ కుక్కను మీదకు పంపుతాడు. అది బుడ బుక్కలోడిని చీల్చి చెండాడుతుంది. వాడు చివరికి ఒంటి మీద బట్టలు కూడా చిరిగిపోయి ప్రాణాలతో బయటపడతాడు. ఆ తర్వాత కాలం

తెలివి మీరడంతో తొండల మండలంలో చాలామంది చదువుకోవడంతో గుండప్ప పనిలోకి ఎవరూ వెళ్ళక పోవడంతో గుండప్ప అయినకాడికి పొలాలు అమ్మేసుకుని పట్నం వెళ్ళిపోతాడు. ఆ మహిడీ మాత్రం దీపం పెట్టే వాళ్ళు లేక పాడుబడిపోతుంది. అయితే అదలా కావడానికి మరో కారణం కూడా చెబుతారు. ''తల్లీ కామాచ్చీ! నువువ్ కంచిలో వుండే మాట నిజమే అయితే, అమ్మా మీనాచ్చీ నువ్వు మధురలో వుండే మాట నిజమే అయితే మహానుభావులారా విశాలాచ్చీ! నువ్వు కాశీలో వుండే మాట నిజమే అయితే గుండప్ప మహిలో దీపం పెట్టే దిక్కులేకుండా పోవాల, మహి అడుగున జిల్లేలు మొలవాల. మహి కొప్పు మీద గూబ వాలాల, అంబపలుకు, జగదాంబా పలుకూ...'' అని బుడబుక్కల వాడు శాపం పెట్టాడని'' మధురాంతకం సామాజిక తాత్విక చింతనను ఈ కథ తెలుపుతుంది.

**మధ్యతరగతికి ప్రతినిధి – రాజారాం :-**

ప్రపంచ కథా సాహిత్యంలో తెలుగు కథకు గుర్తింపు తెచ్చిన పాలగుమ్మి పద్మరాజు, రాజారాం కథా సంపుటికి రాసిన ముందు మాటలో 'ఇన్నాళ్లకు కేవలం మధ్యతరగతి జీవితాన్ని బహుముఖాలుగా కథలలో రూపొందించగల ప్రతిభావంతుడు తెలుగునాట అవతరించాడు. అయితే ఇన్నాళ్లకు తన ప్రతిభా ముద్రను తెలుగు కథా సాహిత్యం మీద వేయడానికి పట్టు సంపాదించారు. ఆయన పేరే రాజారాం మాటలు నేర్చిన మధ్యతరగతికి ప్రతినిధి.

మధ్యతరగతి ప్రజలలో సహజంగా వుండే లోభాలు వెకిలి ఆశలు, పిచ్చి ఊహలు, బాధలు, ఆప్యాయతలు అన్నీ ఏవగింపుతో గాక, మెల్లని మందహాసంతో తమ కథలలో చిత్రించారు. ఈ కథలు చదువుతుంటే 'ఎంత వెర్రివాళ్ళు ఆ ప్రజలు' అనిపించదు 'ఎంత వెర్రివాళ్ళం మనం' అనిపిస్తుంది.

ఈ కథలు చదువుతుంటే మనలను మనం బాగా అర్థం చేసుకో గలుగుతాం. మనలో వున్న పిచ్చి ప్రవృత్తులను చూచి నవ్వుకో గలుగుతాం. మన అవివేకాన్ని చూసుకొని జాలిపడ గలుగుతాం. ఇంతకన్నా గొప్ప ప్రయోజనం కథా రచనకు మరొకటి లేదనుకుంటాను. పల్లెటూళ్లల్లోని మధ్యతరగతికీ పట్నాలలోని మధ్య తరగతికీ, నగరాల్లో మహానగరాల్లోని మధ్యతరగతికీ మధ్య చాలా స్పష్టమైన హద్దులు మనకు స్పష్టంగానే కన్పిస్తాయి. రాజారాం కథల్లోని మధ్యతరగతి పల్లెటూళ్లకు చెందిన తెలుగు సమాజపు సాంస్కృతిక సంపన్నతను పుష్కలంగా కథానేపథ్యంగా వాడుకున్న రచయితలలో రాజారాంగారు మేటి.

**ముగింపు :-**

సామాజిక ఇతివృత్తాలతో మధ్యతరగతి జీవిత సమస్యలను ప్రతిభావంతంగా చిత్రీకరించిన కథకుడు రాజారాంగారు. తెలుగు కథ జీవం ఉన్నంత వరకు ఆయన కథలు వెలుగు దివ్వెలుగా వుంటాయి. అందులోనూ వీరు రెండు మూడు తరాల వారధి. సామాజిక పరిణామానికి అద్దంపట్టి, ఆ మార్పులలోని చైతన్యానికి రూపకల్పన చేసిన మహామనీషి. వేషభాషలు వ్యక్తి స్వభావాన్ని ఆవిష్కరిస్తాయనుకుంటే పొరబాటే. రూప లావణ్య విశేషాలు వ్యక్తి గొప్పదనానికి తోడ్పాటు అందిస్తాయనుకుంటే అవివేకమే. తెలుగు కథా జగత్తులో 'ఎవర్‌గ్రీన్' హీరోలా వెలుగొందిన రాజారాం ఈ విషయాల్ని నిర్ద్వంద్వంగా నిరూపించారు. జీవితపు గిలక బావి నుండి మనిషిని కథలు కథలుగా తోడి పోశారు. దారి ప్రక్కన చెట్టు నీడై మనిషితో ముచ్చటించి జీవితంలో కథను కనిపెట్టి కథలో జీవితానికి బొమ్మకట్టారు.

**ఆధార గ్రంథాలు :-**

1. మధురాంతకం రాజారాం కథలు – మధురాంతకం రాజారాం

2. కథానిక స్వరూప స్వభావాలు – పోరంకి దక్షిణామూర్తి

3. కథాశిల్పం – వల్లంపాటి వెంకట సుబ్బయ్య

*******

# 24. ప్రవాసాంధ్రుల కథలు – సామాజిక స్పృహ

**డా. పలివెల చిరంజీవిరావు,**

అసిస్టెంట్ ప్రొఫెసర్ (కా)

ఆర్.జి.యు.కె.టి, (తెలుగు శాఖ),

ఐఐఐటి శ్రీకాకుళం,

సెల్. 9666360983

chiruphd@gmail.com

**పరిచయం :**

అమెరికా కథల్లో వృత్తి వ్యాపారాల నిమిత్తం సముద్రాలు దాటివెళ్లినా, గుండెల్లో తెలుగు అక్షరం గూట్లో గువ్వలా కువకువలాడుతోంది. అమెరికా తెలుగు కథలన్ని అమెరికాలోని వివిధ ప్రాంతాల నుంచి పుట్టుకొచ్చినవి. సుమారు గత 25 సంవత్సరాలుగా అమెరికా తెలుగు కథలు పలువన్నెలు, చిన్నెలు అలవరుచుకుంటున్నాయి. ప్రవాసాంధ్రులు ఎక్కడున్నా తమ భాషాసంస్కృతులను మరచిపోరు అన్నమాట వాస్తవం. ఆంధ్రదేశపు సరిహద్దులు దాటి భారతదేశంలో అనేక రాష్ట్రాలలో స్థిరపడిన ఆంధ్రుల జీవన విధానాన్ని పరిశీలిస్తే ఈ మాట తేటతెల్లమవుతుంది. పదివేల మైళ్లు దూరం వెళ్ళి అమెరికాలో స్థిరపడిన ప్రవాసాంధ్రులకు కూడా తెలుగు భాష, సంస్కృతులపై మమకారం ఏమాత్రం తగ్గిపోలేదు. ఉత్తర అమెరికాకి వలస వచ్చి స్థిరపడిన మనవాళ్ళు తమ జీవన విధానం గురించి ఫోటోలు, వీడియోలు, ఉత్తర ప్రత్యుత్తరాలు...మొదలైన వాటిద్వారా అనేక రకాలుగా రికార్డు చేసుకుంటూ ఉన్నారు. సాహిత్యరూపకంగా అవి పదిలపరచినప్పుడు వాటికి శాశ్వతమైన విలువ కలుగుతుంది. అమెరికా ఆంధ్రుల జీవితాల్లో తరుచు తారసపడే పరిస్థితులనీ, సమస్యలనీ, వాటి పరిష్కారాలనీ కథలుగా రాస్తున్న రచయితలు అభినందనీయులని చెప్పాలి.

అమెరికా తెలుగు కథలను క్షుణ్ణంగా పరిశీలించి అమెరికాలోని తెలుగువారి ఆలోచనా సరళి, యాంత్రిక జీవనం పట్ల అసహనం కనిపిస్తుంది. వాళ్ళ అంతర్గతంగా ఎదుర్కొనే "పరాయికరణాన్ని" అంతేకాక, వాళ్ళు ఎదుర్కొనే సమస్యలు కనిపిస్తాయి. అలాగే ఆదర్శాలను, జీవన పరిణామాలను వెల్లడిస్తాయి. ఈ కథలు ఆంధ్రప్రదేశ్‌లో వస్తున్న కథలకు భౌతికంగా, మానసికంగా భిన్నమైనవి. అమెరికా విద్యా విధానంపట్ల అవగాహన కలిగించి సమకాలీన సమాజాన్ని అర్థం చేసుకోవటానికి ఉపయోగపడే అంశాలను తీసుకొని నా పరిశోధన వ్యాసాన్ని సమర్పిస్తున్నాను. మాచిరాజు సావిత్రి రాసిన ఫాస్ పోర్ట్ కథలో సమాజంలో మానవులు విద్య ద్వారా విజ్ఞానాన్ని వివేకాన్ని సంపాదించుకోవాలి. విద్య ద్వారా జీవితాలను చక్కదిద్దుకోవాలని తెలుపుతుంది. శ్యామ్ సోమయాజులు రాసిన సజ్జనులు కథలో ప్రతి తల్లిదండ్రులు పిల్లలను సరియైన మార్గంలో నడిపించాలని, విద్యాబద్ధులు నేర్పించాలని, తల్లులు తమ పిల్లలపై ప్రత్యేక శ్రద్ధ చూపాలని, సరైనా పెంపకం పెరగాలని. వారి పిల్లలకు మంచి స్నేహితుడు దొరికితే బ్రతుకుబాట వేస్తాడని ఈ కథ చెబుతుంది. సత్యం మందపాటి రాసిన కథలో తల్లి ప్రేమను పొందటంకన్నా జీవితంలో అపురూపమైన అదృష్టం మరింకేది లేదని తెలపుతూ ఈ కథ రాశారు. నారాయణస్వామి రాసిన కథలో జాత్యహంకారపు సమాజంలో పెరుగుతున్న అక్కడి పిల్లల వ్యక్తిత్వాన్ని రూపొందించడంలో తల్లిదండ్రుల పోషించవలసిన పాత్రను కూడా చెప్పారు. భిన్న సంస్కృతుల పట్ల పిల్లలు ఎదుర్కొన్న సమస్యలకోసం చాలా చక్కగా వివరించారు. ఈ కథలలో సమకాలీన సమాజానికి అన్వయించి, సామాజిక స్పృహను కలిగించడానికి నా వ్యాసం ఉపయోగపడుతుంది.

**1. పాస్ పోర్ట్:** సమాజంలో మానవులు విద్య ద్వారా విజ్ఞానాన్ని వివేకాన్ని సంపాదించుకుంటారు. విద్య ద్వారా జీవితాలను చక్కదిద్దుకుంటారు. విద్యతో జీవితానికి ఒక స్థిరత్వాన్ని సంపాదించుకుంటారు. ఈ కథలో అమెరికా పౌరసత్వం పొందని మూర్తి గ్రీన్‌కార్డ్ హోలర్ అజయ్ అమెరికా పౌరసత్వం వల్ల బహుప్రయోజానాలున్నాయని తెలుపుతూ వారి అనుభవాన్నీ వివరిస్తున్న సందర్భంలో మూర్తి ఎదుర్కొన్న గత అనుభవాలన్ని సామాజిక సమస్యలుగా గుర్తించాలి. ఇదొక కోణమైతే రెండవ కోణంలో విద్య ద్వారా జ్ఞానం సంపాదించి, అజ్ఞానం ద్వారా వివేకాన్ని ఆలోచన శక్తిని పెంచుకోవడానికి బదులు కొందరు వ్యక్తులు ఏహ్య భావాన్ని పెంచుకొని వినాశన కార్యాలు చేయడానికి పూనుకుంటారు. సమాజం పట్ల వీరికి సద్భావం కంటే విరుద్ధ భావాలే నానాటికీ పెంపొందుతుంటాయి. అందువల్ల వీరిని తీవ్రవాదులుగా, సమాజానికి కీడుచేసే వ్యక్తులుగా పేర్కొనడం జరిగింది. ఇటువంటి వారు చివరకు శిక్షలతోనే జీవితాన్ని గడపవలసివస్తుంది. ప్రస్తుతం కథయైన పాస్‌పోర్ట్‌లో విమాన హైజాక్ వృత్తాంతమే ఓ నిదర్శనం అమెరికాలో అజయ్, మూర్తులు పాస్ పోర్ట్ రీన్వాల్ ఆఫీసు దగ్గర కలుసుకొని ఒకే విమానంలో ప్రయాణం చేస్తున్నారు. ఆ సందర్భంలో వారిస్నేహం బలపడుతుంది. ఇద్దరు న్యూయర్క్ కే వెళుతుంటారు. వారి సంభాషణ సాగుతుండగానే విమానం పైకిలేచి ప్రయాణం మొదలు పెడుతుంది. ఒకరి వివరాలు ఒకరు చెప్పుకోవడంలో వారిద్దరూ యు.ఎస్. ఎ లో తలో మూలా ఉంటున్నారనీ మూర్తి యూనివర్సిటీ ప్రొఫెసర్ గానూ, అజయ్ ఒక కంపెనీలో ఇంజనేరుగానూ పనిచేస్తున్నారని తెలుస్తుంది. సిటిజన్ షిప్ ప్రస్తావన ఎత్తి యు.ఎస్. సిటిజన్ షిప్ తీసుకొని ఎన్నాళ్లైంది. మీరొచ్చిన టైములో ఇప్పటికంటే బాగా సులువనుకుంటాను. అందుకు మూర్తి "నేనసలు తీసుకోలేదు ఇంకా సిసలైన ఇండియన్నే ఏమిటి ఇంకా తీసుకోలేదా ఎందుకని ఇన్నాళ్ళ నుంచీ ఇక్కడుండి కూడా అజయ్ ఈ నిజాన్ని జీర్ణించుకోలేకపోయాడు. నాకా అవసరం లేదు ఎప్పుడూ కనిపించలేదు. కోరికా ఎప్పుడు కలగలేదు స్థిరంగా జవాబిచ్చాడు మూర్తి. కాని... నాకు నమ్మశక్యంగా లేదు మీ ఉద్యోగానికీ, అభివృద్ధికి సిటిజన్ షిప్ లేకపోవడం ఒక అడ్డంకిగా నిలవలేదా ఆశ్చర్యం ప్రకటించాడు అజయ్. ఒకవేళ నిలిచినా ఆ సంగతి నాకెప్పుడు తెలిసిరాలేదు కానీ ఉద్యోగంలో – రీసెర్చ్ చేసేందుకు కావాలికదా సిటిజన్ షిప్ కావాల్సిన రకం రీసెర్చ్ లో నాకెప్పుడూ ఆసక్తి కలగలేదు. నా రీసెర్చ్ గ్రాంట్సు నాకు నిక్షేపంగా వస్తూనే ఉన్నాయి. అయితే ఈ విషయంలో నేనే మీకు సీనియర్నన్న మాట ఉత్సాహంగా అన్నాడు అజయ్. నేను యు.ఎస్. సిటిజన్ షిప్ తీసుకొని ఏడెనిమిదేళ్ళయింది. ఆ గ్రీన్ కార్డ్ వచ్చాక నాలుగున్నర ఏళ్ళ తర్వాత అప్లైచేయవచ్చుకదా. నాలుగు సంవత్సరాల ఆరు నెలలు పూర్తయిన మర్నాడే నేను అప్లికేషను పంపేశాను. ఎందుకంత తొందర సాలోచనగా అడిగాడు మూర్తి తొందరేముంది" ఇక్కడకు వచ్చిన వాళ్ళకి అమెరికన్ గవర్నమెంటు ఇస్తున్న సదుపాయమిది. దాన్ని ఉపయోగించుకుంటే తప్పేముంది? కానీ... ఎంతైనా మనం పుట్టిపెరిగిన దేశాన్నీ మనుషులనీ వదులు కోవాలంటే సందిగ్ధంగా ఆగాడుమూర్తి. అజయ్ నిండుగా నవ్వాడు ఏం వదులుకుంటున్నామండీ? ఈ సిటిజన్ షిప్ అనేది ఒక కాయితం ముక్క మాత్రమే, మన మీద తగిలించుకునే లేబుల్ లాంటిది. దాని మీద ఇండియన్ అని రాసున్నా, అమెరికన్ అని రాసున్నా, మన వ్యక్తిత్వం మారిపోతుందంటారా? మా అమ్మ నాన్నా, మా అమ్మ నాన్నా కాకుండాపోతారా? వారి రక్తం ఇంకా నాలో ప్రవహిస్తూనే ఉంది కదా వాళ్ళు నాకు నేర్పిన పద్ధతులే నేనింకా అమలుపెడ్తున్నాను కదా? వాళ్ళు నన్ను ఎలా పెంచారో, నా పిల్లల్ని కూడా అలాగే పెంచుతున్నాను కదా? ఇంకా ఇందులో నేను పోగొట్టుకున్న దేమిటి? మీరు బావుకున్నది మాత్రం ఏమిటి? చాలానే ఉంటాయి. అమెరికన్ సిటిజన్ ఉంటే ఇంకా మంచి ఉద్యోగం దొరకడానికి వీలవుతుంది. మీ కింతకు ముందుకంటే మంచి ఉద్యోగం దొరికిందా? అజయ్ మాటలను మధ్యలోనే తుంచేస్తూ అడిగాడుమూర్తి. మళ్ళీ తన వాదాన్ని బలపరుస్తూ అడిగాడు అజయ్ దీంట్లో ఇంకోపెద్ద అడ్వాంటేజ్ ఉందండీ చక్కగా ప్రపంచంలో ఏ దేశానికైె సులభంగా వెళ్ళి రావచ్చు వీసాలనీ, గొడవలనీ పట్టుకు వేళ్ళాడక్కరలేదంటాడు. అన్ని దేశాలకు కాదు అంటాడు మూర్తి. "మీరు వెళ్ళారా? యూరప్ కిగానీ, వేరే దేశాలకిగానీ? ఆసక్తిగా మళ్ళీ సంభాషణలోకి దిగాడు అజయ్" ఇన్నేళ్ళు మీరు అమెరికాలో ఉన్నా, అది మీకు ఇంకా పరాయి చోటనిపింటడం నాకు చాలా ఆశ్చర్యంగా ఉన్నది. కనీసం ఇండియా వచ్చినప్పుడైనా

స్వదేశం వచ్చినట్టు సంతోషంగా ఉంటుంది కదా?"[1] అన్నాడు అజయ్. భారతీయుడంటే మనసాటి వాడని కాకుండా ఓ చీడపురుగులాచూసి విదేశీ పాసెంజర్లపైనే శ్రద్ధచూపించే ఏర్ ఇండియా సిబ్బందీ వేరే దేశంలో ఉంటూ తన వాళ్ళనకునేవారికోసం మొహం వాడిపోయినా వారికి ముఖం చిన్న బోయేలా, మనసు ముడుచుకునేలా అందించిన చేదు అనుభవాలు ఎన్నో, ఎన్నెన్నో నిట్టూర్చాడు మూర్తి. వారిద్దరి సంభాషణని భంగపరుస్తూ విమానం ముందునుంచి ఎదో కలకలం వినిపిస్తూంది. అందరు బిత్తరపోయి చూస్తుంటారు ముగ్గురులో నాయకుడు కాబోలు, అందర్ని ఉద్దేశించి ప్రకటిస్తాడు. "మేము ఈ విమానాన్ని హైజాక్ చేస్తున్నాం, గొడవ చేయ్యకుండా మేము చెప్పినట్టు చేస్తే ఎవ్వరికీ ఏ ప్రమాదం ఉండదు. ముందు అందరూ మీ మీ పాస్ పోర్ట్ లన్నితీసి మా వాడికి ఇవ్వండి"[2] అని ఆదేశిస్తాడు. బుసలు కొడుతూ తిరుగుతున్న నాయకుడిని చూస్తూ ఎదో గొణుక్కుంటాడు అజయ్. "ఏంట్రా పోజు? మా గవర్నమెంటుకీ సంగతి తెలియగానే నీపని పట్టకపోతే చూడు అంటాడు. ఇంతలో ఒక హైజాకర్ అజయ్ పక్కకి వచ్చి నుంచున్నారు. ఈ పాస్ పోర్టు నీదేనా కర్కశంగా"[3] అడుగుతాడు నాతోరా! అంటూ అని వెళ్ళిపోతాడు హైజాకర్ యాంత్రికంగా అతని వెనకాల అజయ్ వెళ్తాడంతో కథ ముగుస్తుంది. ఈ వేళ అగ్రరాజ్యంగా పేర్కొంటున్న అమెరికా ఉగ్రవాద సమస్యను ఎదుర్కొవలసి వస్తుంది అమెరికా వెళ్లినవారు. పెంటగాన్ ఘటన, కాందహార్ సంఘటన ఈ కథ చదివితే మరోసారి జ్ఞాపకం వస్తుంది. దీనిని బట్టి ఉగ్రవాదులను నిరోదించాలని ఈ కథ తెలుపుతుంది.

**2. సజ్జనులు:**

తల్లి చెప్పిన మాటల ద్వారా ఒక కుర్రాడు, వాడి స్నేహితుడను చెడుపోకుండా కాపాడతాడు. చెడు అలవాట్లకు లోనుకాకుండా చేస్తాడు. దొరికినపర్సును తిరిగి పోలీసులకు ఇవ్వమని బోధిస్తాడు. అలా ఇవ్వడం వల్ల మంచి స్నేహితులనిపించుకున్నారని తెలుపుతూ శ్యామ్ సోమయాజులు ఈ కథ రాశారు.

మధు తల్లిదండ్రులు తన బిడ్డ చెడుమార్గంలో నడకుండా చేస్తారు, చెడు అలవాట్లకులోను కాకుండా కాపాడుకుంటారు. మధు తల్లిదండ్రులు డబ్బు ఒక్కగానొక్క కొడుకు మధుచేతికి ఇవ్వకుండా ఏమి కావాలంటే అది కొనిస్తుంటారు. మధు, స్వామి ఇద్దరూ స్నేహితులు. వీరు ఒకరోజు రంగులరాట్నం ఎక్కాలనుకున్నారు. కాని వారి దగ్గర డబ్బులు ఉండవు. దీనితో నిరుత్సాహంగా ఇద్దరూ నది ఒడ్డున కూర్చోని ఉంటారు. ఇంతలో స్వామికి జాతరలో పర్సు కనిపిస్తుంది. ఇద్దరూ వెళ్ళి దానిని తీస్తారు. అందులో 1500 రూపాయలుంటాయి. కాని ఒక రూపాయి చిల్లర మాత్రమే ఉంటుంది. స్వామి, మధు ఎలాగైన రంగులరాట్నం ఎక్కాలనుకంటారు. పీచుమిఠాయి తినాలనుకుంటారు. ఒక వందరూపాయాలు పైకి తీసి పెట్టుకుంటారు. రంగులరాట్నం దగ్గర టిక్కెట్లు తీయడానికి వెళతారు. స్వామికి టిక్కెట్టు ఇవ్వకుండా చిల్లర తెచ్చుకోమని పంపించేస్తాడు. ఆ తర్వాత సేటు దగ్గరకు చిల్లరకోసం వెళతారు. సేటు ఇంత డబ్బు ఎక్కడిది నీ దగ్గరని లాక్కుని జేబులో పెట్టుకోబోతాడు. దానితో గోడప్రక్కనున్న మధులాక్కుని స్వామి వైపు పరిగెట్టి ఇద్దరు గోడచివర మలుపువరకు వెళ్ళి సేటుకు దొరకకుండా తప్పించుకుంటారు. జాతరవైపు వెళితే సేటుపట్టుకుంటాడని వేరేమార్గంలో వెళతారు. ఆ దారిలో బ్రాందిషాపు ఉందిరా! అంటాడు స్వామి. వెంటనే మధు ఆశ్చర్యపోతాడు. "నీకెలా తెలుసు" అని అడుగుతాడు. మిత్రుడు తాగుడు మొదలెట్టాడేమోనన్న భయంతో అప్పుడప్పుడు మా నాన్న తాగుతాడు. నేను ఇక్కడనుంచి మా నాన్నకోసం ఇంటికి తీసుకెళతాను. తాగుడికి స్వామి నాన్నబాగా అలవాటు పడ్డాడు. దీనిలో ఏముందో ఒకసారి తాగిచూడాలని ఉందన్నాడు స్వామి. వద్దు దీన్ని ఒకసారి తాగితే దానికి అలవాటు పడిపోతారు. మళ్ళీ మళ్ళీ తాగాలనిపిస్తుంది వద్దని హెచ్చరిస్తాడు మధు. వెంటనే వెనక్కి తిరుగుతాడు స్వామి. మధు వాళ్ళ అమ్మ చెప్పిన మంచి మాటలకోసం చెప్పి స్వామిని తాగకుండా ఆపుతాడు. స్వామి మధువాళ్ళ అమ్మంటే చాలా గౌరవిస్తాడు. అందరికీ అలాంటి అమ్ముంటే ఎంత బాగుండునని అనుకుంటాడు. ఇద్దరూ వెంటనే పోలిస్టేషన్‌కు వెళ్తారు. పోలిస్టేషన్‌కు పర్సును పోలీసులకు అందచేస్తారు. పర్సు పోయిందని వచ్చాడే వీళ్ళ నాన్న ఆయనని వెతికి తీసుకురా, పర్సు దొరికిందని

చెప్పు అంటాడు కానిస్టేబుల్. మూలన ఉన్న బల్లపైన చిన్నపిల్ల కూర్చుని ఉంటుంది. పక్కూరులో పెద్ద ఆసామి కూతురు. ఆసామి వచ్చి ఆ ఇద్దరూ స్నేహితులకు చాలా థాంక్స్ అని చెబుతారు. బాబూ చిన్నపిల్లలకు డబ్బులు అలవాటు చెయ్యడం నాకు ఇష్టముండదంటారు. స్వామి ఆ మాటతో నిరుత్సాహపడతాడు. ఆసామి మీరెప్పుడయినా రంగులరాట్నం ఎక్కారా? అని అడుగుతారు. ఇద్దరి మొహాలు ఒక్కసారి వెలిగిపోవడంతో కథ ముగుస్తుంది. ప్రతి తల్లిదండ్రులు పిల్లలను సరియైన మార్గంలో నడిపించాలి. విద్యాబుద్ధులు నేర్పించాలి. అంతేకాక తల్లుల పెంపకం సరిగ్గా ఉండాలి. అలా ఉంటే ఈ సమాజంలో యువత తప్పుడు ప్రవర్తనలో నడవకుండా ఉంటారు. అంతేకాక మంచి స్నేహితుడుంటే బ్రతుకుబాట వేస్తాడని ఈ కథ చెబుతుంది. తల్లిదండ్రులు పిల్లల పట్ల ఎంతో జాగ్రత్త వహించాలి అది సమాజానికి మేలు చేకూరుస్తుందని ఈ కథ. ఇంకొకరికి మార్గదర్శంగా ఉంటుందని ఈ కథ తెలుపుతుంది.

**3. ఒడిలో విడిచిన పసితనం:**

తల్లి ప్రేమకు ఈ ప్రపంచంలో ఏదీ సాటిరాదు. తల్లి ప్రేమను పొందటంకన్నా జీవితంలో అపురూపమైన అదృష్టం మరింకేది లేదు అంటూ సత్యం మందపాటి రాసిన కథ ఇది.

ప్రసూన తల్లి పూర్ణమ్మ. పూర్ణమ్మ ఇండియాలో ఉంటుంది. అమెరికా నుంచి ఒక నెలరోజులు ఇండియాలో ఉన్న తల్లి పూర్ణమ్మ దగ్గరకు వస్తుంది. ప్రసూన ఇండియాలో కొంతకాలం గడిపి వెలదామని వచ్చిన ప్రసూన తల్లి చూపిన ప్రేమకు ఆశ్చర్యపోతుంది. కూతురు దగ్గరనుంచికాని కొడుకు దగ్గరనుంచికాని డబ్బుయేమి ఆశించకుండా బ్రతుకుతుంది పూర్ణమ్మ. తన భర్త పెన్సన్ డబ్బులతో కాలం గడుపుతూ ఒంటరిగా జీవిస్తుంది. ప్రసూన తన తల్లి మనసు తెలుసుకుంటుంది. ఆమె మనసును తెలుసుకున్న కూతురు ప్రసూన తల్లడిల్లిపోతుంది. పూర్ణమ్మ ప్రవర్తన తీరు ప్రసూనను ఆశ్చర్యపోయేలా చేస్తుంది. తన తల్లి అనాథశ్రమానికి ఇచ్చిన రెండువేల చెక్కును చూసి, ఆమె మనసులో కలిగిన భావాన్ని తెలిపిన తీరు ఈ కథలో కనిపిస్తుంది. “నీ ఒడిలోనుంచి నా కాళ్ళమీద నిలబడ్డాక నాలో పసితనం పోయి పెద్దదాన్నయనకున్నాను కానీ, నీ ఒడిని విడిచానే కానీ, నా పసితనాన్నీ ఇంకా వదల లేదమ్మా ఇన్నాళ్ళు నేను ఎదగలేదనిపిస్తుంది. ఇవాళ నిన్నుచూస్తుంటే తెలుస్తుంది. నేనింకా ఎంతపసిదాన్నో....అంటుంది ప్రసూన. అంటూనే, అవతలి మనిషి కష్టాల్నిచూసి స్పందించావే...అలా స్పందించి నీ దగ్గర డబ్బులు ఎక్కువ లేక పోయిన ఒక పెద్ద చెక్కువ్రాసి వాళ్ళ ప్రాణాలకి పండుగ తెప్పించావే నీ మనసు అది..కావాలమ్మ నాకు ఇస్తావా? బంగారపు ఉంగరమో, డబ్బోకాదు నాకు కావలసింది. వాళ్ళకి ఆ డబ్బు ఇవ్వటానికి స్పందించిందే నీ మనసు.....అది కావాలమ్మ..ఇస్తావా?” అంటుంది ప్రసూన పూర్ణమ్మగారి కళ్ళలోకి చూస్తూ. ప్రసూన కళ్ళలోని నీళ్ళు బుగ్గల మీదుగా, పూర్ణమ్మగారి చేతుల్లో పడతాయి. ప్రసూనని దగ్గరకి తీసుకొని, ఆమె తలను పూర్ణమ్మ ఒడిలో పెట్టుకుంటుంది. ప్రసూన పసిపిల్లలా తల్లిఒడిలో వెచ్చగా పడుకుంటుంది.అమెరికాలో ఎంతోసుఖంగా అనందంగా గడుపుతున్నారు అనుకుంటారు కొందరు. కాని వారిలో ఏదో అసంతృప్తి ఉంటుంది. వారు కుటుంబాలను వదిలి దూరంగా వెళ్ళినా, తల్లిప్రేమ ముందు ఏదిసాటిరాదని చెప్పిన కథ ఇది. తల్లిని వదలి చాలా కాలం తర్వాత అమెరికా నుంచి ఇండియాకు ప్రసూన వచ్చి, తల్లిప్రేమను కోల్పోయాను అని అంటుంది. ప్రపంచంలో పరాయిదేశంలో స్థిరపడిన వారందరికీ ఈ అసంతృప్తి సహజమని చెప్పవచ్చు. అమెరికా వలసవెళ్ళిన ఆంధ్రులు రాసుకున్న రచనలన్నింటిలోనూ ఈ అసంతృప్తి కనపించకపోయినా, కొన్నింటిలోనయినా వారి హృదయాలలో ఉన్న తపన కనిపిస్తుంది.

**4. తుపాకి:** ఫిఫ్త్ గ్రేడ్ చదువుతున్న కిరణ్, తన తల్లిదండ్రులైన శంకర్ – రాజ్యలక్ష్మిలను తుపాకి కొనివ్వమని అడుగుతుంటాడు. తమ కొడుకు అడిగేది నిజమైన తుపాకీ అని తెలుసుకున్నవాళ్ళు నిర్ఘాంత పోతారు. తన స్నేహితులైన బ్రయన్, జిమ్మీ వాళ్ళింట్లో ఉన్నట్టుగానే తమ ఇంట్లో కూడా తుపాకీ ఉండాలనీ కిరణ్ కోరిక. ఆ తుపాకీతోనే తాను షూటింగ్ ప్రాక్టీస్ చేసి బ్రయన్ తండ్రిలాగా తానుకూడా గొప్ప వేటగానిగా పేరు పొందాలని కిరణ్ పసిహృదయం కోరుకుంటూ ఉంటుంది. కిరణ్ మనస్సులోని మాట తెలుసుకున్న శంకర్ దంపతులు

ఆశ్చర్యపోతారు. బ్రయాన్ జిమ్మీల స్నేహప్రభావం కిరణ్ ను ప్రభావితం చేస్తుందని గ్రహించిన శంకర్ దంపతులు తమ కుమారుడి పసి హృదయానికి అర్థమయ్యేలా చెప్పడానికి ప్రయత్నిస్తుంటారు. తండ్రి చెప్పిన మాటల్లోని వాస్తవాన్ని గ్రహించిన కిరణ్, నల్లజాతీయుడైన మాథ్యూతో స్నేహం చేయడం ఏ మాత్రం నచ్చేది కాదు. మార్టిన్ లూథర్ కింగ్ డేని, పురస్కరించుకొని తుపాకితో విచక్షణా రహితంగా కాల్పులు జరుపుతాడు. ఆ కాల్పులలో అదృష్టవశాత్తు కిరణ్ తప్పించుకున్నప్పటికీ మాథ్యూ శరీరంలోకి మూడు తూటాలు దూరిపోతాయి. ఆ రోజు హాస్పటల్లో డ్యూటీలో ఉన్న శంకరమే మాథ్యూకి ఆపరేషన్ చేసి తూటాలు తీసివేస్తాడు. ఇంటివద్ద కిరణ్ పరిస్థితి ఎలా ఉందో తెలియక కంగారు పడుతూ ఇంటికి వెళ్ళిన శంకరాన్ని హత్తుకొని భోరుమని ఏడుస్తూ కిరణ్ స్పృహతప్పి పడిపోతాడు. కిరణ్ కు నిద్దుర పట్టడానికి ఇంజక్షన్ ఇచ్చిన శంకరంతో, కిరణ్ మత్తులో నాన్నా, నాకు తుపాకీ వద్దు అని అనడంతో కథ ముగుస్తుంది. తుపాకి కావాలి అని ఎత్తుకున్న అంశంతో కథ ప్రారంభించి, అదే అంశంతో తుపాకి వద్దు అని కథను ముగించడంతో పేరుకు తగ్గ సార్థఖ్యాన్ని పొందింది ఈ కథ. భిన్నమైన సంస్కృతి దృక్పథాలతో ఉన్న అమెరికన్ సొసైటీలో పిల్లలను పెంచడంలో చాలామందికి సమస్యలు ఎదురైతున్నాయి. భిన్న సంస్కృతుల పట్ల పిల్లలు ఎదుర్కొన్న సమస్యను రచయిత చాలా చక్కగా వివరించారు. జాత్యహంకారపు సమాజంలో పెరుగుతున్న అక్కడి పిల్లల వ్యక్తిత్వాన్ని రూపొందించడంలో తల్లిదండ్రుల పోషించవలసిన పాత్రను కూడా నారాయణ స్వామి ఈ కథలో తెలిపారు.

**ముగింపు:** సమాజంలో మనుషుల మధ్య సంబంధాలు ఎంత మార్పుకు లోనౌతున్నాయో తెలుపుతూ, ఆ సామాజిక చలనాలను అమెరికా తెలుగువారు అమెరికా తెలుగు కథల్లో చూపించారు. మానవ సామాజిక జీవనంలో కనిపించే సంబంధాలు. సంఘర్షణలు, సమన్వయాలు, ప్రభావాలు, జీవితంలో ఎదురయ్యే సాధారణ అసాధారణ సంఘటనలు, సమస్యలు మానవుని జీవితాన్ని ప్రభావితం చేస్తాయి. ఈ ప్రభావం వల్ల సమాజంలో సంబంధాలు కూడా మార్పులు పొందుతాయి. ఈ సామాజిక సంబంధాలన్నీ ఒకే వరలో నిరంతరం కొనసాగుతూనే ఉంటాయి. ఈ సామాజిక అంతరకల్లోలం ఒక దుర్భరస్థితికి చేరుతుందని, దానికి కారణాలు అమెరికా తెలుగింట్లో ఉన్నవని భవిష్యత్తులో సాగబోయే మానవ జీవనం గురించి అక్కడ, ఇక్కడ సామాజిక స్పృహతో చూపించి హెచ్చరించిన కథలు అమెరికా తెలుగు కథలు. మన మాతృభాషలో మనకున్న పరిచయాన్ని పోగొట్టుకోకుండా, మన ఆలోచనలను, మన సమస్యలను, మన అనుభవాలను ఆ భాషలో పదిలపరచడానికి ప్రయత్నం చేస్తున్నారు. ఈ రచయితలలో అందరూ తెలుగు భాషా పండితులు కాదు. అయినా భాషకోసం, భాషవ్యాప్తికోసం కవితలు కథలు, నవలలు, నాటకాలు రాస్తున్నారు. వీటి అన్నింటిపైన పరిశోధనలు జరగితే మంచిదని భావిస్తున్నాను.

పాద సూచికలు:

1. అమెరికా తెలుగు కథానికా ఎనిమిదవవ సంకలనం – పుట – 28/2. అమెరికా తెలుగు కథానిక - ఆరవసంకలనం - పుట-174

3. అమెరికా తెలుగు కథానిక – ఎడవ సంకలనం – పుట - 1 /4. అమెరికా తెలుగు కథానికా – నాల్గవ సంకలనం – పుట - 41

**ఆధార గ్రంథాలు:**

1. చిట్టెన్ రాజు వంగూరి – (1997) అమెరికా తెలుగు కథానికా - నాల్గవ సంకలనం – వంగూరి పౌండేషన్ ఆఫ్ అమెరికా

2. చిట్టెన్ రాజు వంగూరి –(1999) అమెరికా తెలుగు కథానికా - ఆరవ సంకలనం – వంగూరి పౌండేషన్ ఆఫ్ అమెరికా

3. చిట్టెన్ రాజు వంగూరి –(2002 ) అమెరికా తెలుగు కథానికా - ఏడవ సంకలనం– వంగూరి పౌండేషన్ ఆఫ్ అమెరికా

4. చిట్టెన్ రాజు వంగూరి –(2004) అమెరికా తెలుగు కథానికా - ఎనిమిదవవ సంకలనం - వంగూరి పౌండేషన్ ఆఫ్ అమెరికా

5. డా. చిరంజీవి రావు. పి.–(2016) అమెరికా తెలుగు కథలు – సామాజిక విశ్లేషణ – సిద్ధాంతగ్రంథం

********

# 25. కాళ్ళకూరివారి నాటక త్రయం – సామాజిక సమస్యల చిత్రణ

**అరిగెల శ్రీకాంత్,**

తెలుగు అధ్యాపకులు,

గవర్నమెంట్ ఆర్ట్స్ కాలేజ్ (అ),

రాజమండ్రి.

చరవాణి : - 7981941623

**ఉపోద్ఘాతం :**

కావ్యేషు నాటకం రమ్యం 'నాటకాంతం హి సాహిత్యమ్' అని నాటక ప్రసిద్ధి పొందింది. జాతిని జాగృతం చేసేది. జాతి జీవనాన్ని ప్రతిబింబించేది నాటకం అని ఆధునికులు అంటారు. 'కళ వినోదం కోసమేకాదు, పరివర్తన కోసం....ప్రతిస్పందన కోసం కృషి చేస్తుంది. ఈ మాటలు నాటక ప్రదర్శనకు అక్షర సత్యాలు.

క్రీ.శ.1860లో వచ్చిన కోరాడ రామచంద్రశాస్త్రి రచించిన 'మంజరీమధుకరీయం' తొలి నాటకం. ఆ తర్వాత వచ్చిన నాటకాలు రామాయణ, భారత, భాగవత సంబంధం కథలతోనే నాటక రచన నడిచింది. సుమారు రెండు దశాబ్దాల అనంతరం సామాజిక ఇతివృత్తంతో సమస్యను ప్రధానంగా చేసుకుని సాంఘిక నాటకాలు ప్రారంభమయ్యాయి. గురజాడవారు 'కన్యాశుల్కము' నాటకం ద్వారా వేశ్యాసమస్యను, బాల్యవివాహాలను ప్రస్తావిస్తూ నాటకాన్ని రచించారు. సంఘంలోని దురాచారాలను, మూడనమ్మకాలను హాస్యధోరణిలో విమర్శించి, ప్రజలలో మార్పు తెచ్చేందుకు ప్రయత్నించింది కందుకూరివారు. అయితే ఆ సమాజంలో ప్రధానంగా గల సమస్యలు మూడింటిపైన మూడు నాటకాలను రచించి వాటిని పద్యనాటకాలతో సమానంగా ప్రాచుర్యం కల్పించిన నాటకకర్త కాళ్ళకూరి నారాయణరావు.

సాహితీ సముద్రాన్ని మథించి పలుప్రక్రియలలో ఏబది ఎనిమిది ఆణిముత్యాలతో తెలుగుతల్లికి నీరాజలర్పించిన శ్రీ కాళ్ళకూరి నారాయణరావుగారి రచనల్లో ముఖ్యంగా చెప్పుకోతగ్గవి. చింతామణి, వరవిక్రయం, మధుసేవ నాటకాలు. ఆనాటి సమాజంలో పాతుకుపోయిన దురాచారాలు, సగటు మనిషిని పీడిస్తున్న సమస్యలను ఇతివృత్తంగా గ్రహించారు.

సమాజంలో తనచుట్టూ సంభవిస్తున్న సంఘటనలకు సమస్యలకు తెలుగు సాంఘిక నాటక రచయతలు ప్రభావితులై, వాస్తవిక రూపంలో సంపూర్ణంగా, సమగ్రంగా, కళాత్మకంగా నాటక రూపంలో ఆవిష్కరించినవారిలో కాళ్ళకూరివారుఒకరు

నారాయణరావు బంగారురాజు, అన్నపూర్ణమ్మలకు జ్యేష్ఠపుత్రుడుగా పశ్చిమగోదావరిజిల్లా మత్యపురి గ్రామంలో 1871 ఏప్రిల్28నజన్మించారు.తెలుగు, సంస్కృతం, ఆంగ్లభాషలలో పాండిత్యం సంపాదించారు. కొన్నాళ్ళు ఉపాధ్యాయవృత్తిలోను, తరువాత ప్రవే వకీలుగాను పనిచేశాడు. హరికథలుకూడా చెప్పారు.కాళ్ళకూరి నారాయణరావుగారు చారిత్రక గ్రంథకర్త, విమర్శకుడు, నవలాకారుడు, కథారచయిత,సంఘసంస్కరణాభిలాషి, దేశభక్తుడు, జాతీయవాది, మనోరంజని పత్రికా సంపాదకుడిగా తన పయనాన్ని సాగించారు. నవీన భావాలకు సంస్కరణవాదాన్ని జోడించి అటు సంప్రదాయవాదులకు, ఇటు అభ్యుదయ వాదులతో పాటు పండిత పామరులు కూడా ఆదరించేలా నాటకాల్ని రచించారు కాళ్ళకూరివారు.

**చింతామణి(1921):**

వేశ్యాసమస్య ఆనాటి సాంఘిక జీవనంలో ఈ దురాచారం కార్చిచ్చువలె ఏవిధంగా వ్యాపించి ఉన్నదో ఈ నాటకంలోని పాత్రలద్వారాతెలియజేశారుకాళ్ళకూరివారు. 'చింతామణి' పది అంకాల నాటకం, నాయకుడు బిల్వమంగళుడు, నాయిక చింతామణి

వేశ్య, ఆమె తల్లి శ్రీహరి, భవానీశంకరుడు, దామోదరుడు, సుబ్బిశెట్టి ఇలా అన్ని పాత్రలు కలకాలం సజీవ పాత్రలుగా నిలిచిపోయాయి. చింతామణి తన అందంతో ఆకర్షించి భవానీశంకరుడు, సుబ్బిశెట్టి సంపదలను దోచుకునివారిని బికారులు చేస్తుంది. వ్యాపారవేత్త, ఉత్తమగుణాలు కలిగిన బిల్వమంగళుదును తనవైపు ఆకర్షించేలా చేస్తే, అతని ఆస్తిని మనం సమానంగా పంచుకోవచ్చని ఆశ చూపించడంతో వారిద్దరికి పరిచయాన్ని చేస్తాడు భవానీశంకరుడు, ఆమె ఆకర్షణలో పడి తన సర్వస్వాన్ని కోల్పోతాడు. బిల్వమంగళుడు. చివరకు తండ్రి, భార్యను కూడా కోల్పోతాడు.
చింతామణి బిల్వమంగళుడి పరిస్థితి విని, అప్పటికే శ్రీకృష్ణుడి సాక్షాత్కారం వలన జ్ఞానోదయమై వేశ్యావృత్తిని విడిచిపెట్టి యోగినిగా మారడమే కాదు బిల్వమంగళుడిని విరాగిగా మార్చుతుంది. తన వల్ల బికారులైన సుబ్బిశెట్టి, భవానీశంకరులకు పదివేల రూపాయలను ఇచ్చి వేశ్యావృత్తి నీచమైనదని ప్రచారం చేయమని చెబుతుంది. ఆమెలో పరివర్తన కల్గించారు.ఈనాటకంలోనిచింతామణిపాత్రద్వారాకాళ్ళకూరివారు.

ఆనాటి సమాజంలో పాతుకుపోయిన వేశ్యావృత్తిని, దాని స్వరూప స్వభావాలను, వేశ్యల, విటుల మనస్తత్వాలను తెలియజేస్తూ, వేశ్యావృత్తిని నిరసిస్తూ వ్రాయబడిన నాటకం. భార్యాపిల్లల్ని విడిచి, బంధువులను విడిచి యావదాస్తిని వేశ్యలకు అర్పించుకున్న బిల్వమంగళుడు, భవానీశంకరుడు, సుబ్బిశెట్టి పాత్రల ద్వారా వారేం కోల్పోయారో, సమాజంలో ఎలాంటి స్థానాన్ని పొందారో తెలియజేశారు కాళ్ళకూరి వారు. చింతామణి వేశ్య అయినప్పటికి ఆమె మనఃస్థితిలో మార్పు తీసుకురావడం, ఆమె ద్వారానే బిల్వమంగళుడికి ప్రబోధించడం, తన వల్ల నష్టపోయిన సుబ్బిశెట్టికి ఆర్థిక సహాయం చేయడం వంటి సన్నివేశాలు ద్వారా వేశ్యావృత్తిలో ఉన్నవారిలోనూ మార్పురావాలని చింతామణి పాత్ర ద్వారా నిరూపించారు కాళ్ళకూరి.

**పాతకృత్యములోబహునికృష్టంబగు**
**వ్యభిచారమువినాశమందుగాక!**
**మనదేశమునకెల్లమచ్చనుగలిగించు**
**గణికాకులమమార్పుగాంచుగాక!**
**నిటులుదుర్వ్యలత్తులువిడనాడి,భార్యల**
**కూర్మిమీరగనేలకొంద్రుగాక!**
**పతిపరకామినీరతుడయ్యెననుచింత**
**యుగతులెన్నడెరుంగకుంద్రుగాక!**

రచయిత చివరిలో ఫలశ్రుతిగా బిల్వమంగళుడిచే పై పద్యాన్ని చెప్పించడంలో రచయిత లక్ష్యంతెలుస్తుంది. వేశ్యావ్యామోహం ఎంతటి ప్రమాదమో, ఎన్ని అనర్థాలకు దారి తీస్తుందో తెలియజేస్తూ సమాజంలో చైతన్యాన్ని కలిగించచడంలోకృతాకృతులయ్యారురచయితకాళ్ళకూరి.

**వరవిక్రయం(1922)**

వరవిక్రయం పది అంకాల నాటకం. వరకట్న సమస్య ఎంతటి తీవ్రంగా ఉందో చెప్పడానికి నిదర్శనం వరవిక్రయం. సమాజాన్ని పట్టిపీడిస్తున్న సమస్యను ఇతివృత్తంగా తీసుకుని ప్రజారంజకమైన నాటకంగా మలిచారు నారాయణరావు. ఆనాడు వివాహబంధం కన్నా ఆర్థికబంధం అయిన వరకట్నం ఎంత జీవన్మరణ సమస్యగా మారింది. అనేది ఒక విషయం, రెండవది కాళింది మరణం, కమల బుద్ధిబలం. ఈ నేపథ్యంలో రచించిన సాంఘిక నాటకమే ఈ వరవిక్రయం. వరకట్నం మీద ఆశతో ఎక్కువ కట్నం కోసం పడిగపులుకాచి చివరకు యాభైవ సంవత్సరంలో, చిన్న వయస్సు

కలిగిన సుభద్రను నాల్గవ వివాహం చేసుకుంటాడు సింగరాజు లింగరాజు పిల్లలు లేనందున బసవరాజును దత్తపుత్రునిగా చేసుకుని కట్నం కోసం చదివించాడు. చదువు బ్రతుకు తెరువుకోసం కాదని, కట్నం కోసమేననే అభిప్రాయాన్ని లింగరాజు పాత్ర ద్వారా తెలియజేశారు. జాతీయవాది పురుషోత్తమరావు కుమార్తె కాళిందిని బసవరాజుకు కట్నం ఇచ్చి పెళ్ళి చేయాలనుకుంటాడు. ఆ విషయం తెలుసుక్ను కాళింది తన చెల్లెలు కమలతో ఈ విధంగా అంటుంది.

"నాదుప్రతినంబువినుముప్రాణములనైన
విడిచెదంగనియడిగినవిత్తమిచ్చి
వరునిగొనితెచ్చినట్టివివాహమునకు
సమ్మతింపనారాట్నముసాక్షగాను"

కట్నం తీసుకునే వ్యక్తిని వివాహం చేసుకోవడం ఇష్టంలేక ఆత్మహత్య చేసుకుంటుంది కాళింది. కట్నం ఇవ్వకుండా తప్పించుకోవడానికి ప్రయత్నిస్తాడు లింగరాజు. గత్యంతరం లేక కమలను బసవరాజుకిచ్చి వివాహం జరిపిస్తారు. అతనితో కల్సి లింగరాజుకు బుద్ధి చెప్పి, వరకట్న నిర్మూలనకు ప్రచారం చేస్తుంది కమల. వరకట్నం తీసుకోవడం చాలా దుర్మార్గమైన సంప్రదాయమని కవి ఈ నాటకం ద్వారా స్పష్టం చేశారు. అంతేకాదు ఆనాటి సమకాలీన సమాజంలో మూఢాచారాలు, సమాజంలోని వ్యక్తుల మనస్తత్వాలు, వారి విశ్వాసాలు, న్యాయస్థానాలు, న్యాయవాదుల అక్రమాలను, స్త్రీవిద్య పట్ల సంఘంలో ఉన్న ఆడంబరాలు మొదలైన అంశాలను ఈ నాటకం ద్వారా కాళ్ళకూరివారు నిరసనను తెలియజేశారు. సమాజంలో చైతన్యాన్ని కల్గిస్తూ ఈ నాటకాన్ని రచించారు.

**మధుసేవ(1926):**

బ్రిటీషువాళ్ళు పరిపాలిస్తున్న కాలంలో భారతీయులు మధుసేవకు బానిసలై ఇల్లు వళ్ళు గుల్ల చేసుకుంటున్నారు. మద్యాన్ని అమ్మి పాశ్చాత్యులు కోట్లు గడిస్తున్నారు. మద్యపానప్రియులు ఎక్కువయ్యారు. అందుకు నిరసనగా మహాత్మాగాంధి మద్యపాన నిషేదాన్ని ప్రచారం చేశారు. మహాత్ముని ప్రబోధానికిలోనై మధుసేవను కథావస్తువుగా స్వీకరించి ఈ నాటకాన్ని రచించారు కాళ్ళకూరి. ఆ కాలంలో మధుసేవకులోనై జమీందారులు సైతం బికారులుగా మారడం ఆయన కళ్ళారాచూశారు. ఆనాటి సమాజంలో తిష్టవేసుకుని మహమ్మారిలా వ్యాపించి ప్రజలను పీల్చి పిప్పి చేస్తున్న ఈ వ్యసనాన్ని నిరసిస్తూ ఈ నాటకాన్నిరచించారు.

రఘునాథరావు జమీందారు. మంచి వ్యక్తి. అనుకోని పరిస్థితులలో మద్యానికి బానిసై పూర్తిగా బికారిగా మారతాడు. రఘునాథరావు భార్య ఆస్తిని కాజేయాలనుకుంటాడు శర్మ. అప్పటికే కస్తూరి అనే వేశ్యతో సంబంధం కలిగి ఉంటాడు. రఘునాథరావు. శర్మ, కస్తూరి ఇద్దరూ కుట్రపన్ని రఘునాథరావు భార్యను చంపిస్తారు. ఆ నేరం రఘునాథరావుపై పడి జైలుకు వెళతాడు. అతడిని నిర్దోషి అని నిరూపించాలనుకుంటాడు మేనేజర్ విశ్వాసరావు. కస్తూరి, రంగడు తమ తప్పులను తెలుసుకుని న్యాయస్థానంలో నిజం చెప్పడంతో రఘునాథరావు జైలు నుండి విడుదల అవుతాడు. రఘునాథరావుకు జ్ఞానోదయం కలిగి 'మధుసేవ' వలన ఎన్ని అనర్థాలో తెలుసుకుని విశ్వాసరావుతో కల్సి మద్యపానం మంచిదికాదనిప్రచారానికిపూనుకుంటాడు.

చూడముచ్చటగొలిపెడుసొబగుమేను
వాడిపోయినలేజొన్నకాడయయ్యె
శివునిగళమొక్కటియెనల్పుచేసినట్టి

కాలకూటంబుసురకన్నమేలుగాదె!

మద్యపానంమంచిదికాదనిపైపద్యంద్వారాకాళ్ళకూరివారుతెలియజేశారు.

ఈ నాటక రచనకాలం జాతీయోద్యమకాలం. అప్పటి సమాజానికి పట్టి పీడిస్తున్న సమస్యలు వేశ్యాసంపర్కం, వరకట్నం, మద్యపానం. వీటినే ఇతివృత్తాలుగా గ్రహించి, ప్రధాన పాత్రలచే నీతిని బోధించడం. వారితోనే ప్రచారం చేయించడం ద్వారా ప్రజలలో చైతన్యాన్ని తీసుకురాగలిగారు కాళ్ళకూరి నారాయణరావు

ఈ మూడు నాటకాలు అధిక ప్రాచుర్యం పొందాయి. సజీవమైన చైతన్యవంతమైన ఇతివృత్తంలో వరవిక్రయం నాటకం పాఠకులను ప్రేక్షకులను కదిలించి ఒక ప్రత్యేకస్థానం పొందింది. చింతామణినాటకం ఇతివృత్తం పరంగా కాలదోషం పట్టిన రచన అయిన ఇప్పటికి ఆంధ్రప్రదేశ్లో ఎక్కడో ఒకచోట ప్రదర్శించబడుతూనే ఉంది.

నారాయణరావు ఈ నాటకాలలో పాత్రోచిత భాషను ప్రయోగించాడు. సాంఘీక ఇతివృత్తాన్నే అయిన కాలక్రమాన్ని బట్టి పద్యాన్ని రచించారు. ఈ నాటకాల రచనా కాలానికి వెళ్తే జాతీయోధ్యమకాలం. ఆ సమయంలో ప్రజలు స్వాతంత్ర సంపాదనలో నిమగ్నులై యుంటే కొందరు అవిద్య, అవిజ్ఞానంతో తరతరాలుగా సంప్రదాయ మూఢనమ్మకాలకు అలవాటుపడ్డారు. కొందరు వ్యసనపరులైన వారు, ఇటువంటి వారిని సరైన మార్గంలో నడిపించడానికి వారిని స్వాతంత్రోద్యమంలో భాగస్వాములను చేయడానికిసాంఘీకఇతివృత్తంతోనాటకరచనలనుసాగించారు.

అప్పటికి తాగుడు, వేశ్య సంపర్గం వ్యాప్తిలో ఉన్న వ్యసనాలు, వరకట్నం మధ్యతరగతి ప్రజలను పీడిస్తున్న ప్రధాన సమస్య అటువంటి సమస్యలను ఇతివృత్తాలుగా తీసుకొనినాటకాలను రచించి మూడు దశాబ్దాలపాటు కాళ్ళకూరి నాటకాలు తెలుగునాటకరంగాన్నిపరిపాలించాయి.

ఇక వరకట్నం సమస్య అయితే ఇప్పటికి పీడిస్తున్న సమస్యే అటువంటి వ్యసనాలను దురాచారాలను ప్రత్యక్ష్యంగా ఖండించి, ప్రజలలో చైతన్యం కలిగించే విధంగా రచనలుచేసిన కాళ్ళకూరి నారాయణరావు చిరస్మరణీయుడు

## ముగింపు

సమాజం నిరంతరం మార్పుకు లోనవుతూనే ఉంటుంది. సమాజం అన్ని రంగాల్లో ముందుకు అతివేగంగా దూసుకుపోతుందని మనం అనేక రకాల సదస్సులు పెట్టి ఊటంకిస్తున్నాం. సమాజంలో ఏం మారింది ?సమాజం అప్పటికి ఇప్పటికీ ఎలా ఉంది సమాజాన్ని పట్టి పీడుస్తున్న సమస్యల్లో మార్పు ఏమైనా వచ్చిందా ?అని మనం మనల్ని ప్రశ్నించుకుంటే జాతీయోద్యమ కాలంలో ఉన్న సమస్యలే నేటికీ కొనసాగుతున్నాయి. రచయితలు తమ రచనల ద్వారా కొంత మేరకు సమాజంలో మార్పు తీసుకొచ్చినప్పటికి సమస్యను కూకటి వేళ్ళతో తొలగించాలంటే … విదేశాల్లో తప్పు చేస్తే కఠిన శిక్షలుఅమలు పరిచినట్లు మనకు మనదేశ చట్టాల్లో మార్పులు రావాలి తప్పు చేయాలంటే మనం భయపడాలి .అలా భయాన్ని కలిగించినప్పుడే మనం పైన చెబుతున్న సమస్యలకు పరిష్కార మార్గాన్ని సూచించగలము .....,సమస్యలు లేని సాదికారిత సమాజాన్ని నిర్మించగలం.

ఆధారగ్రంథాలు

1.అప్పారావు,పి.యస్ - తెలుగునాటకం

2.నాగయ్య,జి - తెలుగుసాహితీసమీక్ష

3.నారాయణరావు,కాళ్ళకూరివారిరచనలు

4.వెంకటరమణ - తెలుగు సాంఘీకనాటకం.

*********

# 26. గోపి నానీలు- సామాజిక స్పృహ

**డా. తన్నీరు సురేశ్,**

సహాయ ఆచార్యులు(తెలుగు),

ప్రభుత్వ డిగ్రీ కళాశాల, లక్షెట్టిపేట.

జిల్లా: మంచిర్యాల, తెలంగాణ రాష్ట్రం

చరవాణి: 8790569436

Email sureshphd2007@gmail.com

**కీలక పదాలు:** కవి- సామాజికత, ఆచార్య ఎన్ .గోపి పరిచయం నానీలు పరిచయం నానీల్లో సామాజిక స్పృహ- మానవత్వం , రైతు, స్త్రీ, పేదరికం, అభ్యుదయం, పర్యావరణం.ముగింపు.

**పరిచయం:** సమాజంలోని అనేక అంశాల పట్ల స్పందించి, అనుభూతి చెంది కవిత్వంలో వాటిని అభివ్యక్తీకరించడమే సామాజికం. సమాజంలో విభిన్నమైన అంశాలు ఆధునిక కవిత్వంలో ఎక్కువగా ప్రతిఫలిస్తాయి. కవి ఏ అలౌకికుడో, ఉపగ్రహ వాసో కాదు. కవి సమాజంలో ఒక సభ్యుడు. అందుకే కవి భావాల్లో, ఆలోచనల్లో, వ్యక్తీకరణల్లో సమాజానికి సంబంధించిన అంశాలే ఉంటాయి. "సామాజిక స్వరూపాల్లో వస్తున్న మార్పులకు, సాహిత్య ప్రక్రియల్లో పరిణామాలకు విడదీయరాని బంధం ఉంటుంది. జాతి జీవన విధానాన్ని ప్రతిబింబించే అనేక అంశాల్లో కవిత్వం ప్రథమస్థానం ఆక్రమిస్తున్నది. కవిత్వానికి సామాజిక వ్యవస్థకు కార్యకారణ సంబంధం ఉంది.".(కాంతరావు టి.ఎల్. -భారతి పత్రిక 1980 ఫిబ్రవరి పు. 61 )

ఆధునిక తెలుగు లఘుకవిత్వ రూపాల్లో నానీలు కవితా రూపం విశిష్టమైనది. నానీలను ప్రారంభించిన కవి ఆచార్య ఎన్. గోపి. తరువాత అనేక మంది కవులు కవయిత్రులు నానీలను రాశారు. ఎన్. గోపి రాసిన నానీల్లో సామాజిక స్పృహ పరిశీలించడం ఈ పత్రం ఉద్దేశ్యం.గోపి గారు వార్తా దినపత్రికలో రాసిన నానీలు తరువాత 1998 లో నానీలు సంపుటంగా మరికొన్ని నానీలు గోపి నానీలు పేరుతో మరో సంపుటంగా 2002 సం.లో వెలువడటం జరిగింది. ఇందులో వాటిని మాత్రమే పరిశీలించడం జరుగుతుంది.

**సూచన:** ఈ పత్రంలో గోపి గారు రచించిన రెండు నానీల సంపుటాల నుండి నానీలను తీసుకోవడం జరిగింది. ఉదహరించిన నానీ పక్కన సంఖ్య ఉండి ఉదా: 1-2 . అని. 1-2 అంటే నానీలు 1998 సం. పుస్తకంలో 2వ పేజీలో ఈ నానీ ఉంది అనిఅర్థం. 2-11 అంటే 2002 సం. గోపి నానీలు పుస్తకంలో 11 వ పేజీలో నానీ ఉంది అని అర్థం ఈ విషయాన్ని పాఠకులు గమనించాలి.

**ఆచార్య ఎన్ గోపి పరిచయం:** ఆధునిక తెలుగు కవులలో విస్తృతమైన సాహితీ వ్యాస0గం కలిగిన అగ్రశ్రేణి కవులలో ఆచార్య ఎన్ . గోపి ఒకరు. వీరు ఉస్మానియా విశ్వవిద్యాలయ0లో ప్రొఫెసర్ గాను శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయానికి వైస్- ఛాన్సలర్ గాను పనిచేశారు. వీరికి కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు లభించించి. తంగేడు పూలు మైలురాయి, చిత్రదీపాలు , వంతెన కాలాన్ని నిద్ర పోనివ్వను మొదలైన ఎన్నో కవిత్వ సంపుటాలను ప్రచురించారు. కవిత్వంతో పాటు పరిశోధన, విమర్శ, యాత్రా రచన రంగాలలో కూడా తెలుగు సాహిత్యానికి సేవ చేశారు. వీరు తెలుగు కవితా లోకానికి అందించిన కొత్త రూప0 నానీ.

**నానీ లక్షణాలు:** ముందుగా నానీలు లక్షణాలు చెప్పుకోవాలి. నానీల్లో నాలుగు పాదాలు ఉంటాయి. నాలుగు పాదాలు కలిసి 20 నుంచి 25 వరకు అక్షరాలు ఉంటాయి. పాదానికి ఇన్నేసి అక్షరాలు ఉండాలనే నియమం ఏమీ లేదు. భావాంశ విభజన ఉంటుంది. భావాంశాల కూర్పులో పాటించే విధానాన్ని బట్టి నవ్యత సాధించవచ్చు . ముక్తక లక్షణాలు కలిగి ఉంటాయి.

**నానీలు సామాజిక స్పృహ:** ముక్తకాలైన నానీల్లో ఎన్నో అంశాలను ప్రతిపలింప చేసే సౌకర్యం ఉంది. "మనుషుల మధ్య / రూపాయే వంతెనైతే / మానవత్వం పని/ అంతే మరి" 1- 25 మానవ సంబాధాలన్నీ ఆర్థిక బంధాలే అనే మార్క్స్ సిద్దాంతానికి సూక్ష రూపంగా ఉండి ఈ నానీ. డబ్బు ఉంటేనే మనిషికి విలువ ఉంటుంది అలాంటి కాలంలో మానవత్వం వెతకడం ఒక వృధా ప్రయాస. సమాజం గురించి మాట్లాలంటే సమాజానికి అన్నం పెట్టె రైతు గురించే చెప్పాలి, మనిషి బ్రతకడానికి గాలి నీరు ఆహారం ప్రధానం ఇందులో మొదటి రెండు ప్రకృతి ప్రసాదాలు కాగా మూడవది ప్రకృతిని ఉపయోగించు కొని మనవుడు శ్రమించి సాధించుకునేది ఆహారం. అది లేకపోతే మనిషే లేడు అలాంటి ఆహారాన్ని పండించే రైతు సమాజానికి ప్రథమ ఆరాధకుడు. ప్రస్తుతం మారిన కాలంలో రైతు పరిస్తితి దయనీయంగా మారింది. అందుకు ప్రకృతి విపత్తులు సగం కారణం అయితే మనిషి దురాలోచనలు మరో కారణం. ఒకనానీ " కొండమీద కునుకుతున్న/ మబ్బు / ఎన్నాళ్ళైన/కురవదేమిటి " అంటూ సేద్యపు నీటీ కొసం రైతన్న ఎదురుచూపు గురించి చెప్తుంది. " రైతన్న/ ఎన్నడూ ఇంత కుంగిపోలేదు/ నిందను వానపైనే వేద్దామా ? " అంటూ రైతు నష్టానికి కేవలం ప్రకృతే కాదు మానవ స్వభావం కూడా ఒక కారణమే అన్న నిజాన్ని అంతర్భాగం చేస్తాడు గోపి.

ప్రపంచీకరణ ప్రభావం వలన పొలాలన్నీ రోయ్యలమడుగులుగా మారే క్రమంలో నేల తల్లి గురించి చెప్పే నానీ రొయ్యల "రొయ్యల మడుగుల క్రింద/ భూమాత కళేభరం/ వల వేస్తే/ డాలర్లే పడ్డాయి" ఇక్కడ డాలర్లు అనేది ప్రపంచీకరణకి ప్రతీక. మనిషి జీవన అవసరం కోసమే ప్రకృతిని ఉపయోగించు కోవాలి తప్ప వ్యాపార అవసరం కోసం కాదు డబ్బు కోసం ఆధారమైన నేల తల్లిని నాశనం చేసే మనిషి దుశ్చర్యని చెప్తుంది ఈ నానీ.

సమాజం ఎంతో అభివృద్ధి చెందుతుందని చెప్పుకుంటున్నా మరోవైపు పేదరికం పోలేదన్న నిజాన్ని దాచలేము. సమాజం అభివృద్ధి అణగారిన పేదలకు న్యాయం చేయట్లేదు అనే వాస్తవాలు నానీల్లో చెప్పబడ్డాయి. "ఇద్దరిదీ ఆకలేనా/ ఉండి తినలేదోకరు/ తినడానికి లేదోకరికి" 1- 141 మరో నానీలో చీకటి ప్రతీక ద్వారా పేదరికాన్ని ఇలా చెప్తారు "వంటపాత్ర నిండా/ చీకటి/అది కాస్తా / ముఖాల మీద వ్యాపించింది: 2- 57 చీకటి అంటే శూన్యం వంట పాత్రల్లో అన్నం ఉంటే అన్నం రంగు తెలుపు కబుక వెలుగు ఆనందానికి సంకేతం అన్నం లేకుండ ఖాళీ ఉంటే చీకటి పేదరికపు దుఖానికి సంకేతం. "పాష్ హోటళ్ళకు/ నడుంనొప్పి / కింది వైపుకి/ ఒంగి చూడలేవు " 1-95 పేదవారిని పట్టించు కోకుండా ధరలను పెంచి ఆర్భాటం ప్రకటించే పెద్ద హొటళ్లను ఈ నానీ ఇలా వెక్కిరిస్తుంది.

నేటి సామాజిక సమస్యల్లో స్త్రీ పై జరుగుతున్నా దారునాలు కూడా చర్చనీయ0. సమాజంలో స్త్రీకి జరుగుతున్న అన్యాయం గురించి గోపి నానీల్లో వ్యక్తీకరించారు. " నీ రెప్పల కప్పుల్లో / కన్నీళ్ళు నింపాడా ? తాగుతాడిక చూడు శ్యాడిస్ట్ " 2-34 ఇందులో స్త్రీల ప్రేమను పొందడంలో పురుషుడు పాటించే తప్పుడు మార్గాన్ని అలాగే స్త్రీని చులకనగా చూసే విధానాన్ని చెప్తాడు. ఇదే పరిస్థితిని మార్చుకున్న స్త్రీ వాద ఉద్యామ0 గురించి "ఇవ్వాల్ల/ స్త్రీ ఉపగ్రహం కాదు / అణిచివేత పైన / అక్షరాగ్రహం " 1- 47 ఇందులో ఉపగ్రహం అంటే పురుషుడుపై ఆధారపడిన పరిస్తితిని తెలిపితే దానిని చేధించి స్త్రీ వాద సాహిత్య ఉద్యమాల చైతన్యాన్ని అక్షరాగ్రహం అనే పదం ద్వారా వ్యక్తీకరిస్తారు.

సమాజానికి ఎల్లప్పుడు దిశా నిర్ధేశం చేసి నడిపించేది అభ్యుదయం అందుకే గోపి " ఉద్యమం/ రగలక పోతే/ ప్రతి ఉదయం/ వృధా అవుతుంది" అంటాడు . స్వేచ్చా కొరవడినపుడే తిరుగుబాటు, ఉద్యమాలు జరుగుతాయి ""హద్దులు / మానవ కల్పితాలు / చెరిగి పోవటాలు / చైతన్య విలసితాలు " 2-8 నగరాల వ్యామోహం పెరుగుతున్న నేటి యువతరానికి గోపి" నగరంలో పుట్టడం / లోపం కాదు / పల్లెల్ని మరవడం పాపం" 2-18అంటు హెచ్చరిస్తాడు. నేటి సమాజంలో ఎన్నికల ప్రక్రియలో జరుగుతున్న అనైతిక విధానాలు నిరసిస్తూ " ఓట్లతో /ఇస్త్రీ చేస్తున్నారు / అందుకే / జాతి జీవనం ముడతలు ముడతలు" 2- 92 అంటాడు గోపి. ఓటు బ్యాంకు రాజకీయాలతో ప్రజలకు నాయకులకు మధ్యన ఉండే సేవా తత్పరత పోయింది. కేవలం ఓట్లు గెలుపు ఇవే ప్రధాన భూమిక

అవుతున్నాయి. నాయకులుగా కొందరు చలామణి అవుతూ ఉద్యామాలు నడిపితే, ఆ ఉద్యమాల్లో సామాన్య కార్యకర్తలు మాత్రం ఎప్పుడు నష్ట పోతూనే ఉంటారు అందుకే " నువ్వు గొప్పగా / ర్యాలీని నడిపావు / నేను గాయాలను / గంపల కెత్తాను " అంటూ ఉద్యమాల్లో బలయ్యే కార్యకర్తల గురించి స్పందిస్తారు గోపి.

సమకాలీన సమాజాన్ని పట్టి పెడిస్తున్న సమస్యల్లో పర్యావరణ సమస్య ఒకటి. రాబోయే కాలానికి ఆరోగ్య వాతావరణం లభిస్తుందనే హామీ లేదు. " చెట్టు తనం/ కట్టెతనమయింది / చిగురు కలలేవీ/ చిటపటలు తప్ప" 1- 55 చెట్టు అందంలో ఒకరకమైన జీవం స్పందిస్తే కట్టె అనడంలో నిర్జీవం వినిపించి సమాజంలో చెట్లు తగ్గడం వలన కలుగుతున్న ప్రమాద స్థాయిని వ్యక్తం చేస్తుంది ఈ నానీ. నదులు ప్రకృతి ప్రసాధించిన ప్రసాదాలు వాటిని అందరు వాడుకొని బాగుపడాలి అలా కాకుండ కొందరు స్వార్థ రాజకీయాల కోసం నదుల చుట్టూ పోరాటాలు అల్లుతారు . " నీళ్ళు/ఎక్కడికైనా ప్రవహిస్తాయి/ రాజకీయాలు అడ్డుకోకపోతే " 2- 111

సామాజిక సమస్యల్లో విచ్చినమవుతున్న మానవ సంబంధాలు సాహిత్యానికి సవాల్ విసురుతున్నాయి. ఏ బంధాలు తమ బాధ్యతను మరచిన తల్లి కడుపు పేగు బంధం పట్ల బాధ్యత మరచిపోదు. "అమ్మ/ చేట ముందేసుకొని/ పిల్లాడి ఉద్యోగం కోసం/ దేట్లు లెక్కిస్తుంది" 1- 16 అమ్మ ఏ పని చేసినా పిల్లల గురించే ఆలోచిస్తుంది. సాధారణంగా రోజులు లెక్కించడం అనేది ఏదో ఒక పరిణామం కోసం ఎదురుచూస్తూ చేసే పని. ఇక్కడ కూడా ఆ పరిణామమే కావాలి. అమ్మకు. తన కొడుకుకి ఉద్యోగం రావాలి అది ఆమె ఆశ. ఇది ఎప్పుడు చేస్తుంది.? చేట ముందు పెట్టుకున్నప్పుడు చేటలో ఉండేవి ఏమిటి? బియ్యం అధి ఆహారానికి సంకేతం అంటే కొడుకు భవిష్యత్తులో తనకు తిండి పెట్టాలి అనే కోరిక కాదు. ఇక్కడ. కొడుకుకు జీవితాతం తాను పోయాక కూడా శాశ్వతంగా కడుపునిండా తిండి దొరకాలి అనే పరమార్థం అమ్మ ఆశ, ఆశయం.

**ముగింపు:** ముక్తకాలైన నానీల్లో అంశాలను ఒకచోట క్రోడీకరించడం కష్టమైన పని సందర్భాన్ని బట్టి ఏ వస్తువు గురించి అయినా కవిత్వం చెప్పే సౌలభ్యం నానీ సొంతం. రసవంతమైన సందేశాత్మకమైన నానీలు సమాజానికి మేలు చేస్తాయి. వీటిని తక్కువ వ్యవధిలో చదువ వచ్చు. సామాజిక మధ్యమాల్లో సులభంగా ప్రచారం చేయవచ్చు. అందుకే నానీల్లో సామాజిక స్పృహ అంశాలు చెప్పినట్లయితే మంచిది, అనే ఉద్దస్యంతో గోపి గారి నానీల్లో సామాజిక సృహ అంశాన్ని పరిశేలించడం జరిగింది. ఇందులో రైతు స్త్రీ అభ్యుదయం పర్యావరణం ఇలా అనేక అంశాల పట్ల గోపి గారు స్పందించిన మంచి నానీలను పరిశీలించడం జరిగింది. ఇవే అంశాలను ప్రత్యేకంగా కూడా అధ్యయనం చేయవచ్చు ఉదహరంకు నానీల్లో రైతు నానీల్లో స్త్రీ ఇలాష్టి పరిశోధన అంశాలకు ఇందులో అవకాశం ఉంది.

**వనరుల జాబితా:**

కాంతరావు టి.ఎల్.(1980) -భారతి పత్రిక ఫిబ్రవరి

గోపి ఎన్ (1998) నానీలు చైతన్య ప్రచురణలు , హైదరబాద్

గోపి ఎన్ (2002 ) గోపి నానీలు చైతన్య ప్రచురణలు , హైదరబాద్

సురేశ్ తన్నీరు (2005) గోపి నానీలు వాస్తు రూప వివేచన ఎంఫిల్ సిద్ధాంత వ్యాసం హైదారాబాద్ సెంట్రల్ యూనివర్శిటీ హైదారాబాద్ (అముద్రితం)

********

# 27. రాసాని 'వలస' నవల- సామాజిక ప్రజ్ఞ

**డా. బి.నాగశేషు**

అసిస్టెంట్ ప్రొఫెసర్,

కర్ణాటక రాష్ట్ర సార్వత్రిక విశ్వవిద్యాలయం, మైసూరు.570006

9985509053, b.nagaseshu47@gmail.com

**పరిచయం:**

సాహిత్య సృజన కారుల్లో రాసాని గారిది విలక్షణమైన శైలి. రాసాని అంటేనే సాహిత్య ఖని, వైవిధ్యాల విపణి. కళ్ళముందు జరిగే దృశ్యాలను ఎన్నింటినో చూసి మనకెందుకులే అనుకునే ఈ వర్తమాన కాలంలో చూసిన ప్రతిదాన్ని తీక్షణంగా గమనించి తనకే ప్రత్యేకమైన చేయి తిరిగిన శైలిలో అద్భుతంగా కథగా, కవిత్వంగా,నవలగా, నాటకంగా మలచడం రాసాని గారికే చెల్లుతుంది.

ప్రాదేశిక వాదం, దళిత, బహుజనవాదం రాయలసీమ నవలను గొప్పగా ప్రభావితం చేసిన రెండు ప్రత్యామ్నాయ భావజాలాలని బండి నారాయణస్వామి గారు అభిప్రాయం వ్యక్తం చేశారు.

రాసాని చేసిన సృజన లోతులను రాయలసీమ దళిత బహుజన దుస్థితిని ఎన్ని మొట్ల లోతులను తాకిందో కొలవలేము. ఒకరకంగా చిత్తూరు జిల్లా సాహిత్యాన్ని అంతకుమునుపున్న రచయితల స్థాయిని ఏమాత్రం తగ్గించకుండా ఒక శిఖర స్థాయి స్థానాన్ని, సాహిత్యంలో తీసుకెళ్లి కూర్చోబెట్టిన రచయిత రాసాని. ఈయన రచనల్లో బహుజనుల ఆర్తి, ఆత్మ ఉంటాయి.

విషయం: వెనుకబడినకులాలవాళ్లను లెక్కచేయని వాళ్లకు వారి సంప్రదాయాలను రికార్డు చేసి ఇదిగో ఈ కులాల ప్రత్యేకత అని చూపించేటువంటి సత్తా కలిగిన రచయిత రాసాని. యామారే కులాలేవి, యామారుస్తున్న కులాలేవి అనేది ఆయన రచనల్లో స్పష్టంగా చూపిస్తారు. ఈ ధన, కుల ప్రపంచంలో కులం లేని వాళ్లు బ్రతకడం ఎంత కష్టమో ఆయన తన రచనల్లో చూపిస్తారు. పూటకు గడవని సంచార, గిరిజన, యాచకుల గురించి పరిశోధనాత్మకంగా రచనలు చేస్తున్న రచయిత రాసాని. ఆ వరుసలో వచ్చిందే ఈ వలస. 1993 లోప్రారంభించి 2016 లో ఈనవలను పూర్తి చేశాడంటేనే ఆ కృషి, విషయంలోని గాఢత మనకు అర్థమయిపోతుంది. నవలను రాసినతరువాత కూడా ఏ పత్రికల్లోను ప్రచురించకుండా చాలామంది పెద్దమనుషుల రూపంలోవున్న ముసుగువీరులు ఆపగలిగారని రచయితముందుమాటలో చెప్పుకున్నారు. విశాలాంధ్ర పి. హరినాథ్ రెడ్డి గారు ఈ పుస్తకాన్ని ఒక ఛాలెంజ్ గా తీసుకుని దీనిని ప్రచురించడం కొసమెరుపు. ముప్పయిదేండ్ల వ్యవధిలో జరిగిన యదార్థగాథను వలస నవలగా మరల్చడం అంటే మామూలు విషయం కాదు. తాను జీవిస్తున్న కాలాన్ని, తన ముందు కాలాన్ని, రాబోయే కాలంలోని మార్పును పసిగట్టి రాయగలుగుతున్న రచయిత రాసాని. భద్రావతాయన యదార్థ జీవన చిత్రమే ఈ వలస నవల. ఏ పాత్రధారుడైతే ఈ నవలలో ఇతివృత్తంగా ఉన్నాడో అదే వ్యక్తికి ఈ నవలను అంకితం చేయడం కూడా కాసింత ఆశ్చర్యంగా అనిపిస్తుంది.

భద్రావతి ఆయన అసలు పేరు మంగిరి నాగయ్య కురుమపల్లె, పులిచెర్ల మండలం, చిత్తూరు జిల్లా. చెప్పాలనుకున్న కథ పుష్టిగా ఉన్నప్పుడు కల్పనలు అవసరం లేదు. అయితే కథాపుష్టిని పరిపుష్టిని చేయడంలోనే రచయిత గొప్పతనం దాగి ఉంటుంది. అందరి దగ్గర అన్నిటికీ సరిపోయే కథలు ఉంటాయి. అయితే ఆ మలిచేతీరు ఎత్తుగడ ఇవన్నీ సమంగా సరిపోతేనే అది రచన అనిపిస్తుంది. మంచి రచనగా పది కాలాలు నిలబడుతుంది. రాసాని వలస నవల చదువుతుంటే జాతరకు బయలుదేరినట్లుంది. అయితే ఆ జాతరకు వెళ్లే ముందు సంసిద్ధతకు పడేపాట్లు ఎన్ని ఉంటాయో, అవన్నీ మనకు ఈ నవలలో కనపడతాయి. పల్లె జీవితం బహుముఖీన జీవితం

కావడంతో వృత్తుల సమాహారాన్ని తనమెడలో వేసుకున్నాడు. ఆ మెడలోని హారంలోని ఒక్కో పుష్పాన్ని అప్పుడప్పుడు నేలకు విదిలిస్తుంటాడు. ఆ పుష్పాలను మనం ఏరుకొని దండగా పేర్చి పరిమళాలను ఆస్వాదిస్తే అప్పుడు తెలుస్తుంది రచయితలోని లోతు.

కథ ప్రారంభమయ్యేది గొడవతో ప్రారంభమవుతుంది. నువ్వు ఒక మామేనా రా నీ కూతుర్నిచ్చి నా గొంతుకోస్తివి అనేది ప్రారంభం మాట. భద్రావతిలో రాజు మాదిరిగావుండే నన్నుఈడికి రమ్మని అవమానిస్తావా అంటాడు క్రిష్టప్ప.

క్రిష్టప్ప భద్రావతాయనకు స్వయానా అల్లుడు. భద్రావతాయన భార్య పేరు రాజమ్మ. నువ్వే కదా సాక్ష్యం నాకు అన్ని ఇస్తాను, ఇప్పిస్తాను అని కుచ్చుల కులాయి పెడతానని అంటే నిక్కడికి వస్తిని. అని గొడవకు దిగాడు క్రిష్ణప్ప. భద్రావతాయన కూతుళ్ళు జయమ్మ, యశోద. నీతి జాతి లేని వాళ్లకు పుట్టిందానా అని మొగుడు జయమ్మని తిట్టడంతో అప్పుడు జయమ్మ గతాన్ని వెతుక్కుంటూ వెళుతుంది. అదే ఈ నవల సారాంశం. జయమ్మకు బంగారుపాలెం సంబంధం రావడం, అది నిశ్చితార్థం వరకు వెళ్లడం, చీర జాకెట్ ఇవ్వడం, అప్పుడే సరిగ్గా భద్రావతి నుంచి క్రిష్ణప్పరావడం రాజమ్మ సంతోష పడటం జరుగుతుంది. రాజమ్మ నాయనకు ఇద్దరు పెళ్ళాలు. పెద్ద భార్య కూతురు రాజమ్మ. తల్లి చిన్నప్పుడే చనిపోవడంతో వాళ్ల నాన్న రెండో పెళ్లి చేసుకుంటాడు. రెండో పెళ్ళాం కుపుట్టిన వాడే క్రిష్టప్ప. పేరుకు కృష్ణా అనే పేరు ఉంది కానీ ఒక్క సద్గుణమూ లేదు. లేవగానే మందు తాగడం, పేకాట, వూరంతా షికార్లు కొట్టడం ఇవే ఇతని దిన నిత్య కృత్యం. ఏమీ లేకపోయినా ఏది సంపాదించుకోకపోయినా ముప్పయ్యేళ్లు దాటిన ముదురు బెండకాయ అనే పేరు మాత్రం సంపాదించుకుంటాడు. జయమ్మ నిశ్చితార్థం అయిపోయిన మరుసటిరోజే వస్తాడు. నాకు జయమ్మనిచ్చి పెళ్లిచేయాలని పట్టుబడతాడు. అప్పుడే మేము మాటిచ్చాం అని చెప్పినా కూడా మాటే కదా ఏముందిలే మార్చేస్తే సరిపోతుందంటాడు. మేనరికమని చెప్పండి వాళ్ళు ఏమి అనరు అంటాడు. కుదిరిన పెళ్లి చెడగొట్టి జయమ్మతో నిచ్చితార్థం జరిగి పెళ్లిదాకా పోవాల్సిన కార్యాన్ని మధ్యంతరంగా ఆపించి చెడగొట్టి కృష్ణప్పతో పెళ్లి జరిపిస్తారు. అది గతం, ఆగతం నుండి బయటకు వస్తుంది జయమ్మ.

మామ అల్లుళ్లు రోడ్డు మీద కొట్లాడుతుంటారు. పంచాయితీ తెంపడానికి సిద్ధారెడ్డి మధ్యస్తికం వస్తాడు. వాళ్లతో పొట్లాకెందుకుపోతావు కాని ఉన్న ఇల్లు నీ అల్లుడికిచ్చి మొగుడు పెళ్ళాం ఇద్దరు మా ఇంటి దగ్గర కొట్టంలో చేరిపోండి అని సిద్ధారెడ్డి తీర్పిస్తాడు. భద్రావతాయన అనేది ఆయనకు తల్లిదండ్రులు పెట్టిన పేరు కాదు బలబద్రి ఆయన అసలు పేరు. భద్రావతి నుండి రావడంతో ఆయనకా పేరు వచ్చింది. తన సొంత ఊరైన అనుమం పల్లెకు పోతాడు బలబద్రి .ఒకప్పుడు వ్యవసాయం చేసిన బావి, ఆ బావి పక్కన భూమి వాటన్నిటిని చూసి ఆవేదన చెందుతాడు.

ఐలప్పకు సుందరయ్య, వరాలయ్య అనే ఇద్దరు కొడుకులు. సుందరయ్యకు బలబద్రి కొడుకు. వరాలయ్యకు కన్నయ్య, తిమ్మాజి, రత్నమ్మ అనే పిల్లలు. రత్నమ్మ కూతురే రాజమ్మ. రాజమ్మచిన్నతనంలోనే చనిపోవడంతో మొగుడు ఇంకో పెళ్లి చేసుకున్నాడు. ఆమె కొడుకే కిష్టప్ప. బలబద్రి పుట్టిన పదేళ్లకు తల్లిదండ్రులు పోతే వరాలయ్య ఇతన్ని పెంచి పెద్ద చేస్తాడు. రత్నమ్మ కూతురు రాజమ్మనిచ్చే పెళ్లి చేస్తాడు. బలపద్రికి ఇద్దరుకు కొడుకులు వీళ్ళందర్నీ వరాలయ్యే చూసుకుంటున్నాడు. వీళ్లకు నాయకురాలు చెరువు కింద మూడు ఎకరాల పొలం ఉంది. బావి కింద మూడు ఎకరాల పొలం ఉంది. పదెకరాల మెట్ట కూడా ఉంది. బలబద్రి పొద్దున లేసి తన బావిలో కపిల తోలడం చేస్తుంటాడు. అనేక జానపద గేయాలు పాడుకుంటూ ఉంటాడు. కపిలితోలి పంటలు పండించాలంటే కష్టంగా ఉంటుంది. అందుకోసం బావిలో రిగ్గు పెట్టించడానికి బలబద్రి ప్రయత్నం చేస్తుంటాడు. ఆ ప్రయత్నంలో భాగంగా మడ్డి నాయుడు అనే రైతు దగ్గర వడ్డీకి డబ్బులు తీసుకువస్తాడు. బావిలో రిగ్గు పట్టించడానికి. తాననుకున్నట్లు నీల్లుపడితే ఇంకా బాగా బతుక్కోవచ్చనేఆశతోప్రయత్నిస్తాడు. అనుకున్నట్టుగానే బావిలో రిగ్గు పెట్టిస్తాడు. అయితే బావిలో బండ పడుతుంది. ఎంత తొలిచినా బండ వస్తూనే ఉంటుంది.

నీళ్లుపడక చేసిన అప్పుకు వడ్డీ పెరుగుతుంది. బావిలో నీళ్లు పడవు దీంతో అన్నదమ్ముల మధ్య మనస్పర్థలు మొదలవుతాయి. నువ్వు చేసిన పని వల్ల అప్పు మనకు పెరిగిందని తోటిఅన్నదమ్ములు గొడవకు దిగుతారు. మీరు అనవసరంగా మాటలు మాట్లాడకండి నేను తెచ్చిన

అప్పులు నేనే తీరుస్తానని అంటాడు బలభద్రుడు. చేసిన అప్పును తీర్చడానికి మద్దినాయుడు మాలకదిరప్పను రోజు ఇంటికిపంపిస్తుంటాడు.

అది చూసి అందరూ నానా రకాలుగా మాట్లాడుతుంటారు. ఇది అవమానంగా భావిస్తాడు బలబద్రి. రాజమ్మ కూడా బేజారు చేసుకుంటుంది ఈ విషయంలో. అయ్యా నీ డబ్బులు ఎక్కడికి పోవు నేను పంపిస్తాను కాస్త నాకు సమయం ఇవ్వండి అని చెప్పుకుంటాడు. అప్పులు పెరిగిపోతున్నాయి అప్పుతోపాటు వడ్డీ కూడా పెరిగిపోతుంది. చేసేదిలేక తన పాలికి వచ్చిన భూమిని అమ్మేస్తాడు. అది తనకే కావాలని వరాలయ్య పట్టుబడతాడు. వేరే కులస్తులను తెచ్చి మామధ్యపెట్టి వాడుమేము తన్నుకోవల్లా అని ప్రశ్నిస్తాడు. మేము నిత్యం కాట్లాడుకోవాల్సి వస్తుందని అంటాడు వరాలయ్య.

అయితే సరైన రేటు ఇచ్చేదాని కోసం మాత్రం ముందుకు రాడు. ఉన్న పొలాన్ని అమ్మేసి అప్పులన్నీ తీర్చేసి వలస పోతాడు బలబద్రి. జగన్నాథం అనే ఒక చదువుకున్నవాడు ఉంటాడు. జగన్నాథానికి మిత్రుడు నంజుండ. ఇతని చెల్లెల్ని జగన్నాథంకు ఇచ్చి పెళ్లి చేస్తాడు. భద్రావతి రాజ్యం ఎలా ఉందో చూసుకురమ్మని ఆగస్త్యలు చెంగన్నతో కలిసి భద్రావతికి పయనమవుతారు. భద్రావతి అంటే కర్ణాటకలో ఉన్న ప్రదేశం అక్కడ నీళ్లు సమృద్ధిగా ఉంటాయి అందువల్ల కరువు ఉండదని వీళ్ళ నమ్మకం.

గుడ్లదనీర్లేకెరే అనే ఊరిలో దాసేగౌడ అనే అతను అడవిని నరికి చదును చేసుకుని పంట పెడుతుంటాడు. కాసేగౌడ తన వెంట ఒక మేక పిల్లను పెంచుకొని ఉంటుంటాడు. మేక పిల్ల మెడలో చిన్న గంట కూడా కట్టింటాడు. ఆ గంటను కట్టడం వెనుకవున్న ఉద్దేశం ఏనుగులకు ఆ శబ్దం వినపడి దూరంగా వెళ్లిపోయేలాగా ఆ గంటను కట్టించాడు. దాసేగౌడ బావమరిది నాగప్ప. మద్ది చెట్టు కింద కాపురం ఉండే గంగజ్జు. ఇవన్నీ వలలో పాత్రలు.

చిత్తూరు ప్రాంతం నుండి ఎవరు వలస వచ్చినా మొదట దాసేగౌడ ఇంట్లో ఉండి కొన్నాళ్ళు కుదుటపడ్డాక మళ్ళీ వాళ్ళ పనులకు పోయేవరకు వాళ్ల ఇంట్లోనే ఉంటుంటారు. భూతల గుడి, దేవరహళ్లి కాకలి సిద్దేశ్వర గుట్ట ఈ భూములను నంజుండప్ప కౌలుకు ఇచ్చింటాడు. ఈ భూములన్నీ తుంగభద్ర కాల్వ కింద సాగులో ఉన్నవే. గుడ్లదకెరెలో కొరిచి, గొల్ల, కురుబ, ముస్లిం, బేడరు, కొంగిర్లు ఇలా అనేక కులాలు జీవిస్తుంటారు. గుడ్డాయప్ప అనే ఆయన చెరువు తవ్వించుంటాడు అందుకే ఆ ఊరికి గుడ్లదకెరె అనే పేరు వచ్చింది.

ఆ ఊర్లో పొద్దున లేస్తేనే కెంపన్న, బాలయ్య, కిట్టప్ప ముగ్గురు కూడా బేకారుగా తిరుగుతుంటారు. బాలప్ప అనే వాడు అనంతపురం జిల్లా మడకశిర నుండి వలస పోయినవాడు. బాలప్పను కదిలిస్తే చాలు నాగిరెడ్డి ,సుబ్బారెడ్డి వర్గాల మధ్య జరిగిన ఫ్యాక్షన్ గొడవల గురించి, కాంగ్రెస్ ఇతర పార్టీల గుంపులు గురించి కథలు కథలుగా చెబుతుంటాడు. ఇద్దరి మధ్య, రెండుపార్టీలమధ్య సామాన్యులు బలైపోయినా విషయాలు, కోర్టు కేసులు వాటి ఖర్చులు, ఆ ఖర్చులకు రెడ్ల దగ్గర తీసుకున్న అప్పులు, అవి తీర్చడానికి శక్తి లేక వాళ్లకే భూములు అమ్మేయడాలు ఇవన్నీ కూడా బాలప్ప కళ్ళకు కట్టినట్టు చెబుతుంటాడు.

చిత్తూరు నుండి వలసపోయిన వారిలో ఆగస్త్యలు బాగా తెలివైనవాడు. లోకం తీరు తెలిసినవాడు. తానే ఆ ఊరిని పరిపాలించుకోడానికి సిద్ధంగా ఉన్నాడు. బసవన రాయలు అనే పెద్దమనిషితో ఆగస్త్య దు స్నేహంగా ఉండడం. అగస్త్యలు సామ్రాజ్యాన్ని మెల్లమెల్లగా విస్తరిస్తున్నాడు. ఈ క్రమంలో వలస వచ్చిన రైతులకు, అక్కడే స్థానికంగా నివసిస్తున్న వాళ్లకు మధ్య ఘర్షణలు జరుగుతాయి.

ఇదిలా ఉండగా దాసే గౌడ అడవిని నరుకుతుండగా అడవి పంది అనుకోకుండా వచ్చి మీద పడుతుంది. అది అతన్ని తీవ్రంగా గాయపరిచి వెళ్ళిపోతుంది. అప్పటినుండి దాసేగౌడ మంచానికే పరిమితం అయిపోతాడు. ఆ క్రమంలో దాసేగౌడను ఆదుకున్నది బలభద్రి. ఆ కృతజ్ఞతా భావంతో బలబద్రి కొడుకు అయినా రఘుకు దాసేగౌడ కూతురైన అలివేలు నిచ్చి పెళ్లిచేస్తాడు. ఇక్కడ కులాల పట్టింపు లేకుండా పెళ్లి చేయడం ఒక సుదూర ఆలోచనగా మనం చెప్పుకోవచ్చు.

వీళ్ళిద్దరూ పెళ్లి కాకముందే ఒకరంటే ఒకరికి ఇష్టం కూడా ఉంటుంది. ఆగస్త్యుడు వ్యాపారంలో దినదినాభివృద్ధిగా ఎదగడంతో బసవన రాయుడు దొడ్డన గౌడులకు కాసింత ఈర్ష పట్టుకుంటుంది. ఆంధ్ర నుంచి వచ్చి మన భూములు తీసుకుని మన నీళ్లు తీసుకొని మన నుంచి బాగుపడి మనల్ని తన గుప్పిట్లో పెట్టుకోవాలని చూస్తున్న ఆగస్త్యులకు తగిన బుద్ధి చెప్పాలని ప్రయత్నం చేస్తుంటారు. దీనికంతటికి ఒకటే విరుగుడు భూములు ఇచ్చి, నీళ్లు ఇవ్వకుండా చేస్తే అనే ఆలోచనలో భాగంగా కాలువలో నీళ్లు రాకుండా చేస్తారు. ఆగస్త్యులకు, తిమ్మారెడ్డికి కిష్టప్పకు మధ్య గొడవ జరుగుతుంది. ఒకరకంగా ఆ గొడవ కర్ణాటక, ఆంధ్ర వాళ్ల మధ్య జరిగినట్లు ఉంటుంది. ఇరు వర్గాల వారికి తలకాయలు పగిలిపోతాయి, రక్తం కార్తుంటుంది, తిమ్మారెడ్డి బలానికి తట్టుకోలేకపోయారు మిగతావారు. తిమ్మారెడ్డిది చిత్తూరు మొరట మనిషి, బలమైన వ్యక్తి, ఊరు ఊరంతా ఒకటయినా తిమ్మారెడ్డిని ఏమి చేయలేరు అంతటి బలాఢ్యుడు.

రఘు పెళ్లి చేసుకున్న అలివేలి దాసేగౌడ పొలంలో పనిచేసుకుంటూ ఉంటుంది. అదే సమయంలో ఏనుగు వచ్చి అలివేలుని తొక్కి నుజ్జునుజు చేస్తుంది. రఘు కాపాడడానికి ఎంత ప్రయత్నం చేసినా భార్యను కాపాడుకోలేక పోతాడు. భార్య పోయినప్పటి నుంచి రఘు పిచ్చివాడిలా తిరుగుతాడు. అంతకుముందు కెంపన్న అనే వాడిని రఘునే ఏనుగులు దాటి నుండి కాపాడుతాడు. ఎవరెవరినో కాపాడిన రఘు తన ప్రాణానికి ప్రాణమైన అలివేలును కాపాడుకోలేక పోయాడు.

ఈ ఆలోచనతోనే రఘు ఒక రకంగా పిచ్చివాడైపోతాడు. ఇదే ఊర్లో తమ పంతాన్ని నెగ్గించుకోవడానికి రామేగౌడ, బసవరాయలు హిందూ ముస్లిం గొడలను కూడా లేపుతారు. గంగజ్జు కొడుకును బసవరాయులు చంపించి ఉంటాడు. ఆ కోపంలో గంగజ్జు బసవరాయలను చంపడానికనిపోయి చేతకాక, ధైర్యం చాలక ఏనుగును చంపుతాడు.

ఆంధ్రావాళ్లు కూలీ నాలిచేసి కష్టపడి సంపాదించుకుని పోగేసుకున్న డబ్బులతో అడవిలో సొంతంగా ఇండ్లను కట్టుకుంటారు. ఏనుగుల దాడిలో ఇండ్లన్నీ నీలమట్టం అయిపోతాయి. ఏనుగులు దాడుల్లో బలబద్రి చిన్న కొడుకు శేషాద్రి చనిపోతాడు. పెద్ద కొడుకు పిచ్చివాడిగా మారిపోతాడు. తన చిన్న కూతురు అయిన యశోదను ఆగస్త్య కొడుక్కి ఇచ్చి వివాహం జరిపించాలని అనుకుంటాడు. సరిగ్గా అదే సమయంలో క్రిష్టప్ప యశోదని బలవంతంగా రేప్ చేస్తాడు. ఈ అవమాన భారాన్ని తట్టుకోలేక యశోద బావిలోకి దూకి చనిపోతుంది. ఉండూరులో ఉండలేక వేరూరులో సంపాదించుకోలేక తన కుటుంబాన్ని, సమస్తాన్ని కోల్పోయి వట్టిచేతులతో తన ఊరికి చేరుకునే బలబద్రి జీవితపు ఆర్తిని వలస నవలగా చిత్రీకరించారు.

**ముగింపు.** రాసాని రాసిన వలస నవల్లో కరువుజీవితాన్ని ఎంత ఛిన్నాభిన్నం చేస్తుందనేది కళ్లకు దృశ్యమానం చేసిచూపించారు. బతుక్కోవడానికిపోయి తన సమస్తాన్ని కోల్పోయి ఒట్టిచేతులతో తిరిగి సన సొంతూరికి రావడమనేది ఎంత దయనీయంగావుంటుందో వూహించడానికే కష్టంగావుంటుంది. అలాంటి బలభద్రి పాత్రను రచయిత మలచడంలో ఎంత ఆర్ధ్రతను కనపరచారో చదివితే తెలుస్తుంది. రాసాని నవలలన్నీ పరిశోధనాత్మకంగావుంటాయి. లోతులను తడిమితే తెలుస్తుంది.

**ఆధారగ్రంథాలు.**

వలస నవల (2016)

********

# 28. పి. రామకృష్ణారెడ్డి - పెన్నేటికతల్లో సామాజిక దృక్పథం

**డా. పల్లా కృష్ణ,**

తెలుగు ఉపన్యాసకులు, వైస్-ప్రిన్సిపాల్;

డా.యం.లక్ష్మయ్య, తెలుగు ఉపన్యాసకులు,

సిఎస్ఎస్ఆర్ & ఎస్ఆర్ఆర్ఎమ్ డిగ్రీ మరియు పిజి కళాశాల,

కమలాపురం, వైఎస్ఆర్ జిల్లా.

9985193868, 9492495437.

**ఆధునిక తెలుగు కథ :** ''కథానిక మనకు కొత్తది కాకపోవచ్చు కానీ, ఆధునికకథ ఆవిర్భావం మట్టుకు పాశ్చాత్య సాహిత్య సంపర్కంవల్లనే జరిగిందను విషయం నిర్వివాదమైనది.'' ''భాష ఎంత పురాతనమైనదో కథ కూడా అంతే పురాతనమైనది'' ` అంటారు చేకూరి రామారావు గారు. ''మానవ చరిత్ర ఎంత ప్రాచీన మైనదో కథా చరిత్ర కూడా అంతే ప్రాచీనమై ఉండాలి'' అంటారు పాపినేని శివశంకర్ గారు 'నిశాంత సాహిత్య వ్యాసాల్లో''. ప్రాచీనం నుండి ఆధునికం వరకూ కథకు చాలా ప్రాముఖ్యత ఉంది. మానవుని జీవితాన్ని ప్రభావితం చేయడంలో దానికి ఉన్న శక్తి ఏమిటో నిరూపితమైనదే కదా!. ఆధునిక సాహిత్యంలో కథానిక ప్రక్రియ తెలుగువారి జీవితాల ఒడిదుడుకులని కూడా చాలా చక్కగా తెలుపుటకు తోడ్పడిరదని చెప్పవచ్చు. సులువుగా సామాన్యుల మనస్సులను చేరి ప్రభావితం చేయగల్గిందని చెప్పవచ్చు. ఎందరో తెలుగు కథారచయితలు వారు కన్నవి, విన్నవి వస్తువుగా తీసుకుని వారి జీవితానుభవంతో, సామాజిక దృక్పథంతో అద్భుతంగా కథల్లో ఆవిష్కరించారని తెలుస్తోంది. ముఖ్యంగా ప్రాంతీయ మాండలికాలలో కథాసాహిత్యం బాగా ఇమిడిపోయిందనవచ్చు.

**రాయలసీమ కథ :** రాయలసీమలో కథా సాహిత్యం భిన్న కథావస్తువుతో వెలువడుతూ ఇక్కడి ప్రజల ఆవేదనను, స్థితిగతులను తెలుపుతూనే సీమకథల ప్రత్యేకతను చాటింది. ''కథానికా రచనకు అవసరమైన ప్రేరణను తమ చుట్టూ వున్న సామాజికాంశాలనుంచీ, సాహిత్యాలనుంచీ రచయితలు పొందగలిగారు''. అన్నట్లుగానే రాయల సీమ రచయితలు కూడా సీమ స్థితిగతులను, అదేవిధంగా సీమ మాండలికాన్ని చక్కగా ఆకలింపు చేసుకొని రాసిన కథలు ఎన్నో తరాలు గుర్తుంచుకునేలా చేశాయనడంలో ఎటువంటి సందేహం లేదు. రాయలసీమ యాసలో కథలు రచించి తమదైన ముద్ర వేసి కథాప్రక్రియను సుసంపన్నం చేసి చిరస్మరణీయులైన కథారచయితలు ఎందరో ఉన్నారు. అలాంటి వారిలో ఈనాటికీ మన హృదయాల్లో చిరస్థాయిగా నిలిచిన వారు పి.రామకృష్ణగారు. రాయలసీమ సామాజిక నేపథ్యాన్ని, యాసను చక్కగా ఆకలింపు చేసుకొన్న రచయిత రామకృష్ణగారు. వారి కథల్లో ఉన్న సామాజిక దృక్పథాన్ని దృష్టిలో ఉంచుకొని రాసిన వ్యాసమిది.

**రామకృష్ణారెడ్డి - జీవితం, సాహిత్యం :** కడపజిల్లా కమలాపురం తాలూకాలోని హనుమనగుత్తి గ్రామంలో 1939లో రైతు కుటుంబంలో రామకృష్ణారెడ్డిగారు జన్మించారు. వీరి తండ్రి పోసా వెంకట కొండారెడ్డిగారు, తల్లి లక్ష్మమ్మగారు. ప్రొద్దుటూరు మున్సిపల్ హైస్కూల్లో చదువుకున్నారు. 1978 సుంచి 1996 వరకు ఆంధ్రజ్యోతి వారపత్రికలో పనిచేశారు. అయితే 1970 నుంచే వీరి సాహిత్య పరంపర మొదలైందని తెలుస్తోంది. అప్పట్లో ఆంధ్రప్రభ వారపత్రిక నిర్వహించిన ఉగాది నవలల పోటీలలో 'ఋతుపవనాలు', 'నత్తగుల్లలు' నవలలకు రెండవ బహుమతి లభించడం విశేషం. ఆతర్వాత అదే పత్రికలో వీరు రాసిన అనేక కథలు ప్రచురింపబడ్డాయి. ఆంధ్రజ్యోతి వారపత్రికలో కూడా చాలా కథలు ప్రచురితం అవ్వడమే కాకుండా మరెన్నో పుస్తక సమీక్షలు వచ్చాయి. 'పెన్నేటికతలు', 'మనిషీ-పశువు' అన్న రెండు కథా సంకలనాలు, కవిత్వం, సాహిత్యవ్యాసాలు మొదలైనవి అప్పట్లో ప్రసిద్దిచెందిన 'భారతి' పత్రిక

మొదలుకొని వివిధ ప్రముఖ పత్రికలలో ప్రచురితమయ్యాయి. రామకృష్ణారెడ్డి రాసిన కథలు 1989లో ''పెన్నేటి కతలు'' పేర ఒక గొలుసు కథా సంపుటి ప్రచురితమైంది. ఇందులో దాదాపు ఇరవై అయిదు కథలు చోటు చేసుకున్నాయి. ఈ సంపుటిని తన తల్లికీ, తన పొలాలకూ నీళ్ళిచ్చిన పెన్నకూ అంకితం చేశాడు. 1997లో ''మనిషీ - పశువూ'' పేర మరో కథా సంపుటి రూపుదిద్దుకున్నది. ఇందులో దాదాపు ఇరవై కథలు చోటు చేసుకున్నాయి. ఇది ''సీమ సాహితీ'' తరఫున 1997లో ప్రచురితమైంది.

**రామకృష్ణారెడ్డి కథా ప్రస్థానం**

1. 'ఎర్రి పెన్నేరు' 2. బట్టకోడె, 3. ఏటుకాడు, 4. సేద్యం కంటే పద్యం గొప్పదా?, 5.ఈ పక్క పారే ఏరు, ఆ పక్క పండే పైరు, 6. సిత్తాట, 7. తూరుపు నాటి కూలోళ్ళు, 8. ఊరి పిల్లోడు, 9.వానొచ్చె..., 10. అడివి పావురేను, 11. జీరంగి, 12. పసులగాసే పిల్లగాడా!, 13. సేనుగల్లోడు, 14. కాపోడూ, కూలోడూ, 15. కరె నాగయ్య, 16. నంగులమ్మ దున్నపోతు, 17. సుంకమ్మ ఎనుము, 18.ఆకలి గురువులు, 19. అయ్యవారంటే ఆయనే, 20. కరుబుజ్జ తోట, 21. పీర్లు, 22. ఆంకట్ట, 23. పిచ్చికుంట్ల సుబ్బుడు, 24.సిన్న సిన్న ఆశలు, 25. ఏరా... ఏరా... ఏమైపోతివా?

మనిషీ - పశువూ కథా సంపుటంలో మొత్తం ఇరవై కథలు ఉన్నాయి. ఆ కథాక్రమం ఇదీ - 1. నీళ్ళు - ప్రజాతంత్ర, 1977. 2. అన్నం - యువ - దీపావళి ప్రత్యేక సంచిక, 1976 3. దెయ్యం - ఆంధ్రప్రభ వారపత్రిక, 24-4-1975. 4. బిచ్చగాళ్ళు - మధ్య తరగతి గృహిణి - ఆంధ్రప్రభ వారపత్రిక, 1971. 5. తేడా - ఆంధ్రప్రభ వారపత్రిక, 1972. 6. కాంపెన్సేషన్ - ఆంధ్రప్రభ వారపత్రిక, జూలై, 1973. 7. హత్య - ప్రజాతంత్ర, నవంబర్, 1977. 8. ఒక తల్లి కథ - ఆంధ్రప్రభ వారపత్రిక, 6-8-1975. 9. తరం - అంతరం - ఆకాశవాణి కడపకేంద్రం, 1972. 10. పోటీ - మధ్య యువ, 1973-74. 11. సెంటిమెంట్ - ఆంధ్రజ్యోతి వారపత్రిక, సెప్టెంబర్, 1975. 12. కర్రోడు చచ్చిపోయినాడు - ఆంధ్రజ్యోతి దీపావళి ప్రత్యేక సంచిక, 1976. 13. పూజ - ఆంధ్రజ్యోతి దినపత్రిక ఆదివారం సంచిక, 1983. 14. ఆస్తి - ఆంధ్రజ్యోతి దీపావళి ప్రత్యేక సంచిక, 1992. 15. అవగాహన -ఆంధ్రజ్యోతి దీపావళి ప్రత్యేక సంచిక, 1975. 16. అత్యాచారం -ఆంధ్రజ్యోతి దీపావళి ప్రత్యేక సంచిక, 1990. 17. భార్యలు -ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధం, 1995. 18. ఎలిగే పెద్దోళ్ళు - నలిగే చిన్నోళ్ళు. 19. ముగ్గు -ఆంధ్రజ్యోతి దీపావళి ప్రత్యేక సంచిక, 1989. 20. మనిషీ - పశువూ - వార్త దినపత్రిక ఆదివారం అనుబంధం, 6-7-1997, 13-7-1997. తులసీ కృష్ణ, రా.కృ., రామకృష్ణారెడ్డి, తదితర పేర్లతో వీరి సాహిత్యం వెలువడిరది. ఆతర్వాత గత కొన్ని సంవత్సరాలుగా పి.రామకృష్ణగా సాహితీ కృషి చేస్తున్నారు. అన్ని రకాల సాహిత్య ప్రక్రియలలోనూ వీరి అనుభవం అపారం. తెలుగు పద్యమన్న మక్కువ ఎక్కువే. ప్రస్తుతం విజయవాడలో స్థిరపడ్డారు.

రాయలసీమ కథాసాహిత్యంలో రాయలసీమ జీవితాన్ని ''పెన్నేటికతలు''గా చిత్రించిన రచయిత రామకృష్ణారెడ్డి. రాయలసీమ కథకులందరూ మట్టివాసననూ అనుభవించినవారే అయినా, స్థానిక భాషకు, స్థానిక జీవిత చిత్రణకు ప్రాధాన్యతనిస్తూ రాసినా రామకృష్ణారెడ్డి కథలు తెలుగు వారందరినీ ఎంతగానో ఆకట్టుకున్నాయి. వీరి కథానికా ప్రస్థానాన్ని పరిశీలిస్తే కథలు దాదాపు 60వరకూ ఉన్నాయి. 'పెన్నేటికతలు', 'మనిషీ-పశువు' పేర రెండు ప్రధాన సంపుటాలుగా ప్రచురితమయ్యాయి. రామకృష్ణారెడ్డి కథలే గాక కొన్ని వచన కవితలు, సాహిత్య వ్యాసాలు నిర్మించారు. వీరి నవలలు, కథలు, వ్యాసాలు, కవితలు అన్నీ 'పి.రామకృష్ణ రచనలు' పేరిట 2015లో ప్రచురించారు. అన్నీ సాహిత్య ప్రక్రియల్లోనూ అనుభవం ఉండి పద్యం అంటే ఇష్టం అయినా రామకృష్ణారెడ్డికి కథకుడుగానే ప్రసిద్ధి. ఈయన కథలు ఏవీ కూడా నేల విడిచి సాము చేసినవి కావు. దాదాపు అన్ని కథలకూ పాడి, పరిశ్రమ, వ్యవసాయం, రైతు జీవితం మూలాంశం.

**పెన్నేటికతల్లో సామాజిక దృక్పథం :** రామకృష్ణారెడ్డి కథల నేపథ్యంగా రాయలసీమలోని వాతావరణ పరిస్థితులే కన్పిస్తాయి. రాయలసీమలోని గ్రామాలలో వ్యవసాయ కుటుంబాలలో తలెత్తుతున్న భిన్న సమస్యలను చక్కగా చిత్రీకరించారు. ఇక్కడి రైతులకు

వ్యవసాయం దు:ఖాన్నే మిగిల్చిందంటారు. భూమిని నమ్ముకొని జీవించే వ్యవసాయదారులు తమ స్వశక్తి మీద గాక దైవంమీద ఆధారపడి జీవనం గడుపుతున్న దైన్యస్థితిని వివరిస్తారు. ఇక్కడి వ్యవసాయం జూదంలా మారిన వైనం గురించి తెలియజేస్తారు. వ్యవసాయజీవనులకు ఇది ఒక శాపమే అంటారు. రామకృష్ణారెడ్డి గ్రామం హనుమనగుత్తి పెన్నేటి ఒడ్డున ఉండడం వలన, ఆచుట్టు ప్రక్కల గ్రామీణుల జీవితాలను కళ్ళార చూసి అనుభవించిన వ్యక్తిగా రైతుల జీవితాలను, వారి ఇక్కట్లను అదేస్థాయిలో అదే ఉద్వేగంతో, బలమైన భాషతో కథలలో ప్రతిబింబించే విధంగా పెన్నేటి కతలను రాశారు. ఒకప్పటి కడప జిల్లా మాండలికాన్ని, యాసను లోతుగా చిత్రించిన కథలివి. అప్పటి స్థానికతను ప్రతిబింబిస్తు రాయడం విశేషం. మధ్య తరగతి వాస్తవ జీవిత దృశ్యాలను చక్కని సామాజిక నేపథ్యంతో రచయిత మనకందించారని చెప్పవచ్చు. ఈయన రచించిన ''పెన్నేటికతలు'' మానవజీవన శ్రమైక సౌందర్యాన్ని, ప్రకృతితో తాను ఏర్పర్చుకున్న అనుబంధాన్ని తెలియజేస్తాయి. వీరి కథలను పరిశీలిస్తే ఒక్కో కథ ఒక్కో బతుకు చిత్రాన్ని చూపిస్తుంది. ''మనూరికి పక్కన్నే యీ ఏర్ను ఏ దేవుడు పుట్టిచ్చినాడోగాని... అంటూ రచయిత ప్రారంభించిన 'ఎర్రి పెన్నేరు' కథలో పెన్నేరు పల్లెప్రజలకు తల్లివంటిదని చెబుతూ... వాళ్ళ కట్టం సుకం కనిపెట్టుకోని వున్నెట్టు, సెప్పుల్లేని వాళ్ళ పాదాలకు నొప్పి తాక్కుండా మెత్తని యిసిక పర్సుకునుంటాది ఏరు... సెలిమల్లో నుంచీ కడవల్లోకి నీళ్ళు దోసిళ్ళతో సల్లకొనే కొద్దీ ''తీసకపోండే తల్లుల్లారా'' అని తల్లి బిడ్డకు పాలిచ్చినట్టే వుంటాదంటారు రచయిత. ప్రపంచంలో నిస్వార్థ ప్రేమకు, ఆప్యాయతకు చక్కటి నిదర్శనం తల్లేకదా. తల్లి నుండేకదా స్వచ్ఛమైన ప్రేమానురాగాలు లభిస్తాయి. అలాగే ఒక్కోసారి నీళ్ళోచ్చినప్పుడు అంత పరాయిదై పోతాది!. ''నా బలం ముందు నువ్వేంత, నీ బతుకెంత?'' అని 'సవాల్' సేస్తా వున్నేట్టు వుంటాది ఎర్రి పేన్నేరు. అంతవరకు మనల్ని ఎంతో ప్రేమగా చూసుకున్నట్టు ఉన్నా నీళ్ళోచ్చినప్పుడు తన ఉగ్రరూపం దాల్చి మనుషులు, ఎనుములు, గొడ్లు కొట్టుకుపోవడం కనిపిస్తాది అంటారు రచయిత.

'బట్టెకోడె' కథలో రైతులు పశువులను తమ బిడ్డలవలె ఏవిధంగా మురిపెంగా చూసుకుంటూ ఆనందించే వారో తెలుపుతూ...''కాడిమాను మొట్టమొదట మెడమీంద పెట్నప్పుడు సక్కిలిగిలి పెట్టినట్టయేదో, ల్యాక బరువనిపిచ్చేదో గానీ పిల్లోదు గదా ఎగుల్లేసినట్టు ఎగరడం'' సూసి సంబరపడే రైతుల మనస్తత్వాన్ని చక్కగా చిత్రిరించారు. రైతులు పశులను తమకు సమానంగా చూసుకోవడం, ఒక్కోసారి తమ కన్నా వాటినే అధికంగా చూసుకోవడం కనిపిస్తుంది. ఈ కథలో బటకోడెను రైతు రామిరెడ్డి ఎంత ప్రేమగా చూసుకొన్నాడో, అలాగే బట్టెకోడె ఎద్దయిపోయినాక బండికైనా, సేద్యానికైనా దాని బలం అందరిని ఆశ్చర్యపరిచేదింటారు. సెందు సుట్టూతా పూలదండతో, నడుంసుట్టూ సిలకలు కుట్టిన బొద్దు వారుతో, మొగం మీద కుచ్చుల జలతాళ్ళతో నడిసే బట్టెకోడె చూడడానికి రెండు కళ్ళూ సరిపోవంటారు. అటువంటి బట్టెకోడె ముసలిదై చనిపోయినప్పుడు తన సోంత బిడ్డచనిపోతే ఎంత బాధ ఉంటుందో అలాంటి బాధనే రైతు రామిరెడ్డి చూపుతాడు. ఈ కథ ద్వారా రచయిత పశువులను రైతులు తమ బిడ్డలవలే చూసుకుంటాని తెలియజేశారు.

'సేద్యం కన్నా పద్యం గొప్పదా?' అనే కథలో ఒకప్పుడు వ్యవసాయం చేసే సేద్యగాళ్ళ మధ్య ఉండే సంబంధబాంధవ్యాలు, ఆట-పాట, మాటా-మంతి, చెట్టూ-చేమా, ముఖ్యంగా నాటి సామాజిక పరిస్థితులను యన ముందుంచారు రచయిత. ఈ కథలో కథానాయకుడు నర్సిమ్మారెడ్డి. ఇతను సేద్యం సేస్తావుంటే నలుగురూ నిలబడి సూసేవాళ్ళంట...అంటూ కథ ప్రారంభించి నాదు సేద్యం చేసేవాళ్ళలో ఉన్న నేర్పరితనం, ఒద్దిక, ఓర్పు, కూలీల ముచ్చట్లు, నవ్వులాటలు, సంస్కృతీ సంప్రదాయాలు, ప్రతి యేడు క్రమం తప్పకుండా చేసుకునే ఏరువాకలు, ఒకరి పనితనం మీద ఇంకొకరు చేసుకునే సవాళ్ళు, ప్రతిసవాళ్ళు - ఇలా ఎన్నెనో విశేషాలతో కథ నడుస్తుంది. అలాగే చుట్టు ప్రక్కల ఊళ్ళలో నర్సిమ్మారెడ్డి సేద్యం గురించి గోప్పగా చెప్పుకునే పరిస్థితులు మారి నర్సిమ్మారెడ్డి సేద్యం మానేసి పద్యంపై దృష్టి మరల్చడం, క్రమేణ అతని సేద్యం గురించి కంటే పద్యం గురించే ఎక్కువగా చేప్పుకోవడం మరియు మంచి కవిగా

గుర్తింపు వచ్చి పలుచోట్ల సన్మానాలు పొందడం అందరినీ ఆశ్చర్య పరిచే విశేషం. అన్నేళ్ళు సేద్యం చేస్తే రాని పేరు ప్రతిష్టలూ కొన్ని పద్యాలు రాసినందుకే వచ్చిందనేది ఆశ్చర్యం కలిగించే అంశమే కదా!.

'సిత్తాట'(ఒక విధమైన జూదం)గా మారిన వ్యవసాయం. సంగటి ముద్ద కొరకు వలస వచ్చిన తూర్పునాటి కూలీలు, వాన కోసం ఎగచూపు, పేడలప్రోగు, గడ్డివామి వేయటంలో నేర్పు మొదలైన స్థానికాంశాలతో నడిచిన కథ ఇది. 'ఆ పడమటి ప్రక్క గుట్ట కింద పల్లెలోళ్ళంతా సిత్తాట ఆడేవాళ్ళే', అంటూ వాళ్ళను సీదరిచ్చుకోవడం, అసలు ''వాళ్ళు సిత్తాట ఎందుకు ఆడుతారో తెలుసుకున్నప్పుడు నవ్వాలో, ఏడ్వాలో తేలకుండా వుంటాదంటారు. ఎందుకంటే అసలే అవి గుట్టకింద పల్లెలు, వానలు కుర్సనపుడు, వాన మీంద నడసే యెవసాయానికి ఎన్న ఎకరాలుండి యేం పలం? యెవసాయంలో ఎంత కట్టం సేసీ యేం లాబం?'' అందుకే అక్కడి రైతులు కుటుంబాన్ని బతికిచ్చుకోవడానికి తప్పని తెలిసినా, ఆ ఆట నేర్చుకున్నారని అంటూనే ఇదోరకం సిత్తాట, సిత్తయిపోయే ఆట! గెలుపోటములు నీ చేతిలో లేని ఆట అని అంతిమంగా ముగింపిస్తాడు రచయిత. హనుమనగుత్తి అనేగ్రామం పెన్నేటికి దక్షిణం ఒడ్డున ఉంది. ఆ ఊరికి పడమట పోట్లదుర్తి. తూర్పున కోగటం అదే వరుసలో ఉంటాయి. అక్కడ పెన్నానది చాలా విశాలంగా ఉంది.

మాండలికం అంటే మాట్లాడే మౌఖిక భాష. దీన్ని గ్రామీణ భాష అనీ, జానపద భాష అనీ, పల్లెభాష అనీ, లిఖిత సాహిత్యానికి పనికిరాదనీ, కేవలం ప్రాంతీయ వ్యవహారానికి మాత్రమే పనికి వస్తుందని కొందరి వాదననూ రామకృష్ణారెడ్డి అంగీకరించలేదు. ఎలా మాట్లాడతారో అలా రాయడం కూడా కుదరదు. ఎంతోకొంత దగ్గరగా తీసుకురావడానికి చేసే ప్రయత్నమే మాండలికాల ఉపయోగం. ''భాష జీవిత వాస్తవికతలో ఒక ప్రధానమైన అంశం. ఏ ప్రాంతపు జీవితాన్ని ఆ ప్రాంతపు భాషలో రాయకపోతే ఆ జీవిత చిత్రణమీద విశ్వసనీయత కల్గదు'' - అన్నాడు వల్లంపాటి వెంకట సుబ్బయ్య. రామకృష్ణారెడ్డి కథలకు నేపథ్యం ప్రాంతీయత కనుక ఆ ప్రాంతీయ మాండలికంలోనే రాయడంలో ఒక ఒడుపు ఉంటుంది ` అది ఇతర ప్రాంత పాఠకులకు ఇబ్బంది కల్పించినా సరే, ఈ భాషను ఇలాగే వాడుకోవడంలో రామకృష్ణారెడ్డి ''ఈ కతలకు వెనక'' ఒక వివరణలో తన సంతృప్తిని వ్యక్తపరిచాడు.

ఈ విధంగా వివిధ జాతులు, వృత్తులు వాళ్ళ జీవిత చిత్రాలు వివరిస్తూ, పశువులు, నేల, నింగి, కక్షలు, కరువులు మొదలైన అంశాలు ఇతివృత్తాలుగా పెన్నా పరిసరాల రైతు జీవనంతో ముడిపడిన కతలు 'పెన్నేటికతలు'. ''ఇవాళ కథల్లోనే గ్రామ జీవితం సక్రమంగా విరివిగా ప్రతిఫలిస్తున్నదని ఇంకా ప్రత్యేకించి చెప్పనక్కరలేదు.'' ''ఈనాటి కథానికల్లో జీవిత వాస్తవికత ఎక్కువ, ఎక్కువ వాస్తవికత ఉండే కథల్లో ఎక్కువ సామాజిక ప్రయోజనం ఉంటుంది.'' అందునా కడపజిల్లా యాస, పదునూ, వేగం కలగలిపి వాస్తవికతా దృక్పథంతో రామకృష్ణారెడ్డిగారు రాసిన కథలకు బహుశా విద్వాన్ విశ్వం రచన 'పెన్నేటి పాట' ప్రేరకమై ఉండవచ్చని అన్పిస్తుంది. విద్వాన్ విశ్వంగారన్నట్లు ఈ ప్రాంతం ఒట్టి ఎడారి, చిన్న వర్షానికే పెద్ద వరదలొచ్చి రెండు రోజుల్లోనే ఒక చుక్కైనా నీరు నిలవని ఏరు పెన్నా. ఇలాంటి గ్రామజీవన విధానం కల్గిన జీవిత శకలాల చిత్రణమే రామకృష్ణారెడ్డి కతలు. ప్రాంతీయతను, సామాజిక పరిస్థితులను చక్కగా కథలలో చొప్పించడంలో సఫలత చెందారని చెప్పవచ్చు.

**ఆధార గ్రంథాలు :**

1. కథానికా స్వరూప స్వభావాలు - పోరంకి దక్షిణామూర్తి - పుట 128-విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు, 1988.

2. కథా శిల్పం - వల్లంపాటి వెంకట సుబ్బయ్య, పుట - 126-విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు, జూన్, 2008.

3. నిశాంత - డా.పాపినేని శివశంకర్ -పుట -98-విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు, మే, 2008.

4. పి.రామకృష్ణ రచనలు -పుట - 543, 546, 553, 556, 560. 621. మానవి పబ్లికేషన్స్, విజయవాడ.

5. దృష్టి - కేతు విశ్వనాథరెడ్డి – పుట-186, 63.

*******

# 29. మాణిక్య వీణ రచన – ప్రజా చైతన్యం

**సూర్య పోగు వెంకటేశ్వర్లు**

పరిశోధక విద్యార్థి, తెలుగు శాఖ

ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం, గుంటూరు .

Ph : 9100316717 venkateswarluvenky26@gmail.com

**కీవర్డ్స్ :** సంత్రాసం, ఘీంకారం,చక్రం, వియోగి, యోగి, భోగి, త్యాగి.

**వ్యాస ఉద్దేశం**

ఆంధ్రప్రభ వారపత్రికలో విద్వాని విశ్వం మాణిక్య వీణ అనే శీర్షికతో వ్యాసాలు కవితలు రచించారు. మాణిక్య వీణలో వీరు స్వీకరించని అంశం లేదని చెప్పవచ్చు. మానవ జీవన ప్రస్థానంతో కళ కవిత్వం పెనవేసుకున్నాయని మనిషి నిరంతర జ్ఞాన అన్వేషి గా ఈ కవిత తెలుపుతుంది. మాణిక్య వీణను నీతి మానవీయరాగాన్ని పలికించిన ఈ కవిత చారిత్రక ఘట్టాన్ని తరిచిచూపి మనిషి శాశ్వతత్వాన్ని తెలుపుతుంది. సాంకేతిక రంగంలోని అభివృద్ధిని మాత్రమే అభివృద్ధి అనుకుంటూ కళలను సాహిత్యాన్ని ఉపేక్షిస్తుంది నేటితరం. మానవ జీవితంలో ముడి వేసుకున్న కళలు సాహిత్యం అనాదిగా సంక్రమించిన ఆస్తి అని తెలుపుతూ, విజ్ఞాన మార్గంలో ప్రయాణించి సంస్కృతిని గౌరవిస్తేనే మనిషి శాశ్వతము అవుతాడని తెలపడమే ఈ వ్యాసం యొక్క ముఖ్య ఉద్దేశం.

**ప్రధానాంశం**

కళలు విజ్ఞాన కాంతులతో జీవన ప్రయాణంలో నేల నుంచి నింగి ఎగిరిన చిన్న మానవుడే శాశ్వతుడయ్యాడు అనంతమైన కాలం దారిలో అలుపెరుగక సాగుతున్న జీవన ప్రస్థానంలో మానవుడిని వదలనివి కళలు కవితలు జ్ఞాన విజ్ఞానాలు. తన జీవన యానంలో ఎదురయ్యే అలసటను యాంత్రికతను దూరం చేయడానికి కలల్ని కవితల్ని ఆలంబనంగా చేసుకున్నాడు. విజ్ఞాన మార్గంలో ప్రయాణించాడు వీటితోనే నడిచాడు. వీటితోనే నడిపించాడు కూడా. మనిషి కాలగర్భంలో కలిసిన అతని మేధంలోంచి ఆవిష్కృతమైన కళ కవిత్వం విజ్ఞానం సకల మానవాళికి దిశా నిర్దేశం చేస్తాయి మానవుని శాశ్వతున్ని చేస్తున్నాయి.

**మనిషి ఒక అన్వేషి**

" మానవుడు నిరంతర అన్వేషణలోనే ఉంటాడు అని మానవుడు పుట్టుక నుంచి మరణం ద్వారా ప్రతి విషయాన్ని తెలుసుకునే విషయంలో తహ తహ లాడుతున్నాడు

**సౌందర్యం ఆరాధించేవాడా!**

**కవితలు శిల్పంలో**

**పురుగులో పుష్పంలో**

**మెరుపులో మేఘంలో**

**సౌందర్యం ఆరాధించేవాడా! జీవించేవాడ!**

**సుఖించేవాడా! దుఃఖించేవాడా! ప్రేమించే వాడా!**

**వియోగి! యోగి! భోగి! త్యాగి!**

**ఆలోచనలు పోయేవాడా!**

**అనునిత్యం అన్వేషించే వాడా?**( శ్రీ శ్రీ మహా ప్రస్థానం పుట-73) అని శ్రీశ్రీ చెప్పిన వచన కవిత్వం మానవ జీవితాన్ని పరిశోధనాత్మకతకు పునాదిగా రూపొందించింది. మనిషి కష్టాలను సుఖాలను అనుభవిస్తాడు తన తరం తర్వాతి తరం వారికి కూడా ఆ అనుభవాన్ని పంచుతూ వెళుతూ ఉంటాడు మనిషి కొత్త విషయాలను తెలుసుకోవడానికి కాలాన్ని ఎంతో వెచిస్తాడు కనుకనే మనిషి అన్వేషి అని శ్రీ శ్రీ ప్రస్తావించడం సమంజసంగా మనం భావించాలి.

**నిజమైన రోజు**

రాతియుగపు చీకటిని తేల్చుకుంటూ నవీన విజ్ఞానపు వెలుతురులోకి ప్రవేశించిన గొప్ప రోజులుగా భావించే రోజులు కొన్ని ఉన్నాయి అవి

**" చక్రం కనుక్కున్న రోజెంత**

**చరిత్రలో ప్రముఖ దినమో**

**చరచరా నాలుగు గీతలతో ఆకారం**

**వివరించిన రోజు అంతే ప్రముఖం**

**నిప్పును కనుక్కున్న నాడెంత శుభదినమో**

**తప్పటడుగులు మాని**

**తాండవం చేసిననాడు అంతే శుభదినం**( తెలుగు దివ్వెలు, తెలుగు వాచకము, విద్వాన్ విశ్వం ,మాణిక్య వీణ, పుట-83) అంటూ చక్రాన్ని కనుక్కున్న రోజు చరిత్రలో ఎంత ప్రముఖ దినమో చకచకా నాలుగు గీతలతో లిపిని కనుక్కున్న రోజు అంతకంటే విశేషమైనది చక్రం మానవ చలనానికి దోహదపడితే లేపి భావ సంచలనానికి వేదికై సృజనాత్మక ప్రపంచంలోకి దారి చూపింది నిప్పును కనుక్కున్న రోజంతా గొప్పదో తప్పటడుగులు చిందుల నుంచి ఉన్నత నృత్యాలను చేసిన రోజు అంతే గొప్పది రాతియుగపు చీకటించికుంటూ నవీన విజ్ఞాన వెలుతురులోకి ప్రవేశించిన గొప్ప రోజు లాగా వాటిని విద్వానివిస్తోంది మహోన్నతంగా వివరించారు.

**అభివృద్ధి ఏమిటి**

మానవ పరిణామం లోని సౌందర్యాన్ని కృషిని సాధన సంపత్తిని తాత్వికతను విద్వాన్ విశ్వం ఇలా వివరిస్తూ అసలైన అభివృద్ధి కేవలం అంతరిక్షాల్లోనూ సాంకేతి పరిజ్ఞానంలోనూ అభివృద్ధి చెందడం కాదు సనాతన ధర్మాలను సాహిత్యాన్ని చిత్రలేఖనాన్ని కళలను ముందు అడుగులు వేయించడమే అసలైన అభివృద్ధి అంటూ మాణిక్యవీణ అనే వచనంలో ఇలా

**మంత్రాలతో చింతకాయలు**

**రాలనప్పుడు పద్య**

**సంత్రాసంతో చింతలు**

**పారిపోతాయా?**

**యంత్రాలతో జబ్బులు నయం కానప్పుడు**

**తంత్రాలతో సమాజ రుగ్మతలు దారికి వస్తాయా?**

**ఫోటోలోని పుట్టకూరుపుతో సంఘం**

**కట్టెదుట కళవల పడిన పోతుంటే**

**నిట్ట నిలువునా రోదసి లోనికి**

**కట్టలు కట్టుకుని దూసుకుపోయి**

**కట్టుకొని పోయేదేమిటని**

**అంటే అనవచ్చు ఔననీ కొందరితో**

**అనిపించనూ వచ్చు** ( తెలుగు దివ్వెలు, వాచకము, మాణిక్య వీణ పుట-82) అంటూ మంత్రాలతో చింతకాయలు రాలనట్టే 18 ధాటికి చింతల దూరం కావు. యంత్రాలతో జబ్బులు నయం కానట్టే మాయమాటలతో సామాజిక సమస్యలు తొలగిపోవు. ఈ మాటను కొందరు ఆమోదిస్తారు కొందరు ఆమోదించినట్టు నటిస్తారు. వాస్తవమైన కార్యాచరణ నిబద్ధత అంకితభావంతోనే సామాజిక సమస్యలు పరిష్కారం అవుతాయి. ఒకవైపు కడుపులోని భయంకరమైన వ్యాధి (వ్రణం) ల సామాజిక అసమానతలనే రోగాలు కళ్ళ ముందు కనిపిస్తూ కలవరపెడుతున్నాయి మరోవైపు అంతరిక్ష ప్రయాణాల్లో అభివృద్ధిని సాధించడం వల్ల ఒరిగిందేమని కొందరు అనవచ్చు ఇంకొందరితో ఒప్పించను వచ్చు శాస్త్ర సాంకేతిక ప్రగతితో సమానంగా సామాజిక జీవనశైలి ఎదగడం లేదని సగటు జీవి జీవనం ఇంకా పాతాళంలోనే ఉందని ఇక్కడ అర్థం అవుతుంది.

**సాహిత్యం, కళలు, సాంప్రదాయాలు**

అరుపుల నుంచి అర్థవంతమైన మాటలు నేర్చిన రోజు ఆ మాటలతో జానపదాలల్లిన రోజు ఇలా ఒకటేమిటి అన్ని గొప్ప రోజులే మానవ జీవన పరిణామ చరిత్రలో నిలిచిన అసాధారణ సంఘటనలు జరిగిన ప్రతిదినము శుభమే బతుకుతో ముడి వేసుకున్న కలల శాస్త్రాల గొప్పదనాన్ని విస్మరించడం సమంజసం కాదు కలలు విజ్ఞాన కాంతులతో జీవన పరిణామాలతో నేల నుంచి నింగి దగ్గర చిన్న మానవుడే శాశ్వతం అని మనం ఇంకొకసారి స్మరించుకోవలసినదే..

**ముగింపు**

మనిషి కళ్ళు తెరవగానే తన చుట్టూ ఉన్న ప్రకృతి అందాలని చూసి పరవశించాడు అప్పటినుంచి ప్రకృతిని తన కనుసర్లలో ఉంచే ప్రయత్నం చేశాడు ప్రకృతిలోని అన్ని రంగుల్ని రకరకాల ధోని అనుకరించే ప్రయత్నం చేశాడు పూర్తిగా ప్రకృతితోనే మమేకం చెందాడు గుహల్లో జీవించిన ఆదిమానవుడే గుర్రాల్ని జింకన్ను గీస్తూ చిత్రలేఖన నైపుణ్యాన్ని మెరుగుపరుచుకుంటున్నాడు ఆటవిక జీవనం దశలోనే తన గానమాధుర్యంతో ఎండిన మోడీని చిగురింప చేశాడు పాటకు అనుగుణంగా కఠినమైన సాతినేలపై కాలికి గజ్జె కట్టి చిందులు వేశాడు స్వరాలు చేకూరుస్తూ పాటలు పాడుతున్నాడు ఇలాగ సాంకేతిక పరిజ్ఞానంతో పాటు హస్తకళలు సాహిత్యము జానపద మొదలైన అంశాలను కూడా ముందుకు నడిపించడం అసలైన అభివృద్ధి పరోక్షంగాను ప్రత్యక్షంగాను వివరించడం గమనార్హం.

**ఆధార గ్రంథాలు**


- ❖ విద్వాన్ విశ్వం (2002) మాణిక్య వీణ, వచనం, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ విజయవాడ
- ❖ శ్రీ శ్రీ (1998) మహాప్రస్థానం, 11 ప్రచురణ, రాఘవేంద్ర పబ్లికేషన్స్ గుంటూరు
- ❖ దక్షిణామూర్తి, పోరంకి (2020) తెలుగు దివ్వాలు తెలుగు వాచకం, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రచురణ.
- ❖ రమేష్ రావు, కలేర్ల (2018) మాణిక్య వీణ ఒక పరిశీలన, వ్యాసం, ఆంధ్రజ్యో దినపత్రిక, 2023 జూన్.
- ❖ శంకర మూర్తి, గుంటూరు (2019) రాయలసీమ కథలు, కావ్య పబ్లికేషన్స్ కడప.


*******

# 30. డా.పాకాల యశోదారెడ్డి కథలు - సామాజిక స్పృహ

**స్వాతి గార్లపాటి,**

తెలుగు అధ్యాపకురాలు,

కె.ఆర్.ఆర్ గవర్నమెంట్ ఆర్ట్స్ & సైన్స్ కళాశాల,

కోదాడ.

సంప్రదింపులు : 9848262843

వేగు చిరునామా : swathi61988@gmail.com

**పరిచయం :**

సమాజానికి హితాన్ని చేకూర్చేది సాహిత్యం. తెలుగు సాహిత్యానికి వెన్నుముక కథ . సాహిత్యంలో కథ ప్రక్రియకి ప్రాచీన సాహిత్యం నుండి ఆధునిక సాహిత్యం వరకు మంచి స్థానం ఉంది. ఎంతోమంది తమ కథల ద్వారా పేరు ప్రఖ్యాతులతో పాటు సామాజిక అంశాలతో మన చుట్టూ జరిగే విషయ సంఘటనలను కథలుగా మారుస్తూ ,కొత్తగా పాఠకులకు అందిస్తూ రచయిత అనుభవాలు ,అనుభూతులను అందులో మేళవిస్తూ అభిప్రాయాలను తెలియపరుస్తూ ఉన్నారు. అలాంటి వారిలో పాకాల యశోదా రెడ్డి గారు. పరిచయం అవసరం లేని పేరుగా తన రచనల ద్వారా ఆవిష్కృతమైన కథా రచయిత్రి. తెలుగు సాహిత్య చరిత్రలో తనదైన శైలిలో రచనలు చేస్తూ తెలుగు ప్రజల మన్ననలు పొందిన రచయిత్రి...

సామాన్య ప్రజల జీవితాలను ముఖ్యంగా తెలంగాణ ప్రజల జీవితాన్ని కథలుగా మలుచుకొని ప్రజల కష్టాలను కళ్ళకు కట్టే ప్రయత్నం చేశారు. మావూరి ముచ్చట్లు , ధర్మశాల, ఎచ్చమ్మ కథలు సంపుటాలతో సాహిత్య చరిత్రలో మంచి కథా రచయిత్రి గా పేరు తెచ్చుకున్నారు." తన జీవితాంతం వరకు సాహిత్యంలో లీనమై సాహిత్యమే ఊపిరిగా తీసుకొని బ్రతికిన రచయిత్రి " గా పాకాల యశోద రెడ్డి కనబడతారు.

ఈమె రాసిన కథల్లో ఉన్న సామాజిక అంశాల గూర్చిన విషయాలను ఏ విధంగా తెలియజేసిందో " ఈ పరిశోధనా పత్రం " ద్వారా తెలుసుకునే ప్రయత్నం చేద్దాం.

భారతీయ వ్యవస్థ ఉమ్మడి కుటుంబ వ్యవస్థ విధానానికి చెందినది. కుటుంబంలో భర్త ,భార్య, పిల్లలు, తల్లిదండ్రులు కలిసి సహజీవనం చేయడంలో సఫలీకృతం అవ్వడమే కుటుంబ వ్యవస్థ పరమార్థం. ఇంటి పెద్దగా భర్త పోషించి పురుషాధిక్యత వల్ల స్త్రీ తన పిల్లలను, అత్తమామలకి సేవలు చేయడం ఆ ఇంటి గౌరవాలను కాపాడడం తన విధిగా " అత్త మెచ్చిన కోడలి " గా భర్తకి " అనుకూలవతి " గా గృహిణిగా పిల్లల పెంపకంలో తన శాయశక్తుల కృషి చేయడంలో భారతీయ స్త్రీలది "అందవేసిన చెయ్యి" అనడంలో అతిశయోక్తి లేదు. గృహిణిగా ఎంత సేవ చేసినా తనకి మాత్రం ఆ ఇంట్లో ప్రాధాన్యత తక్కువగా ఉంటుంది. పురుషుడు బయట స్త్రీ ఇంట్లో పనులు చక్కబెట్టడంలోనే ఈ సమాజ ఆచార వ్యవహారాలు పరిమితమైపోయాయి.... కుటుంబంలో భర్తే ప్రధాన వ్యక్తిగా చలామణి అవ్వాలని గుర్తించిన సమాజం స్త్రీని అప్రధాన వ్యక్తిగా చేసింది. ఇటువంటి స్థితిగతులు గ్రామీణంలో ఎక్కువగా కనిపిస్తున్నాయి. దానికి కారణం స్త్రీలు నిరక్ష్యరాశులు కావడం, ఆర్థిక స్థితిగతులు ప్రభావం స్త్రీల మీద ఎక్కువగా ఉండడం. స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యల గూర్చి పాకాల యశోద రెడ్డి గారి కథల ద్వారా తెలుస్తుంది.

సమాజంలో స్త్రీ పురుషుల వలన వేధింపులకు, అవమానాలకు గురవుతుంది. లైంగికంగా, మానసికంగా స్త్రీని కృంగదీసేవిగా ఉన్నాయి...స్త్రీ ఇష్టా ఇష్టాలతో పని లేకుండా ఆమెను ఆట బొమ్మగా , అలంకరణ వస్తువుగా మార్చుకొని తమ కోరికలు తీర్చుకునే

క్రమంలో వేధింపులకు గురి చేస్తున్నారని చెప్పవచ్చు. ఆధునిక కాలంలో స్త్రీలు విద్యావంతులై ఉద్యోగాలు చేస్తూ స్వయంకృషితో స్వాలంబన సాధించి తమ కాళ్ళ మీద తాము బ్రతుకుతున్న కూడా ఈ పురుషులు ప్రయాణాలలో,కాలేజీల్లో, ఆఫీసుల్లో చాలాచోట్ల స్త్రీలను అవమానాలకు గురి చేస్తూ వేధింపు చర్యలకు పాల్పడుతూనే ఉన్నారు. ఎన్నో జీవితాలు చీకట్లో నలిగిపోతూనే ఉన్నాయి. పురుషునితో సమానంగా ఉద్యోగాలు చేస్తున్న ఎక్కువ కుటుంబాలలో ఇంటి పని కూడా స్త్రీ యే చేయవలసి వస్తుంది. ఈ శ్రమతో స్త్రీ గొప్పతనం, సేవా తత్వం పురుషాధిక్య సమాజంలో కనిపిస్తుంది.

**యశోదా రెడ్డి కథలు మధ్యతరగతి జీవన విధానం-ప్రస్థావన:-**

తన కథలలో దాదాపుగా సామాన్య పేద ప్రజల జీవితాలను తన మనోనేత్ర దృష్టితో చూసి వాస్తవిక దృక్పథాన్ని తన కథలో చూపే ప్రయత్నం చేశారు. శాంత-రామచంద్రయ్య గారి చిన్న చెల్లి. మెరుపుతీగ లాంటి పిల్ల. అలాంటి పిల్ల పెద్ద సదువులకని పట్నం బొయింది. రెండో ఏటా సన్నీ పాత్కం జెర వోచ్చి కన్ను మూసింది. శాంత కన్నుమూసి మురారి బ్రతుకు చీకటి చేసింది. పెండ్లి కాక పోయినా మురారి శాంత ఆలుమొగలైన్రు. శాంతా పోయినంక అంగలారసి తండ్లా అండి తన్నుకొని మంచానపడి శాంత ఎంటవో లేక సన్నాసి బందు మురారి మంది కోసం బతుకుతుండు మురారి. శాంత పిల్కేవరకు ఓపిక తోటి పుట్టడు దుక్కిం నిలిపిండు మురారి. (యశోద రెడ్డి కథలు మొదటి సంపుటి. పుట 76). ఇంకా అందరి నోళ్లు తెరిచే ఉన్నాయి. అది గ్రహించిన రంగడు ఇంతకు నా ఘనత ఏమిటో మీకు చెప్పనేలేదు కదూ! వినండి అంటూ ప్రారంభించాడు. ప్రభుత్వ ఉత్తర్వులను ఖతర్ చేయని
రిబెలియన్ బోల్డ్ హార్వెడ్ నా ఫ్రెండ్స్ కొందరు హెల్మెట్ లేకుండా స్కూటర్లు నడుపుతూ అమ్మాయిలతో కూడా డబుల్ , త్రిబుల్ సవారిగా సైకిల్లు తొక్కుతూ వెళ్తుంటే పోలీసు అదుపులోకి తీసుకుంది.

ఇదంతా చూస్తున్న పద్మ వెనక్కొచ్చి అనసూయమ్మను పట్టుకొని ఆంటీ మీరు బాధపడవద్దు రంగడు అమాయకుడు మంచి శిక్షణ ఉంటే దారికి వస్తాడు నిరుత్సాహ పడకండి అంటూ కళ్ళు తుడిచింది. అనసూయమ్మ పద్మను గట్టిగా అలుముకొని బావురుమంటూ ఆశగా చూసింది గడియారం పది గంటలు కొట్టింది. (రంగడు ప్రయోజకత్వం పుట 162) నలుగురి ముందు పరువు తీసిన కొడుకని అనసూయ దేవుని ముందు అవమానభారంతో వాలిపోయింది.

సమాజంలో మధ్యతరగతి జీవితాలు ఎలా ఉంటాయో చక్కగా కళ్ళకు కట్టే ప్రయత్నం చేసింది పాకాల యశోద రెడ్డి గారు. క్రింది స్థాయి నుండి పై స్థాయి వరకు మధ్య తరగతి వారి ఆత్మ న్యూన్యతాభావాలను వెలికి తీసి తన కథలలో వ్యక్తం చేసే ప్రయత్నం చేశారు.

**పాకాల యశోదా రెడ్డి కథల్లో-స్త్రీల సమస్యల ప్రస్తావన:-**

స్త్రీ కోరుకునేది సమాజం నుండి గౌరవ మర్యాదలు తనకంటూ ప్రత్యేకమైన అస్తిత్వం ఉండాలని, తన నిర్ణయాలు తాను తీసుకొని స్వేచ్ఛగా వ్యక్తపరచాలి అనుకుంటుంది. తన నిర్ణయాలను గౌరవించాలని ,స్నేహంగా మసులుకోవాలని అనుకుంటుంది. తనను హృదయంతో ప్రేమించగలిగే స్వాతంత్ర్యాన్ని తన అభిరుచులను తాను అభివృద్ధి పరచుకోగలిగే స్వేచ్ఛ తనకు ఉండాలి. ఒక మాటలో " ఒకరి నీడలో బ్రతకడం కంటే తనే ఒక వ్యక్తిగా మారాలని " ...స్త్రీలకి స్వేచ్ఛనిస్తే చెడిపోతారని భావించే అభిప్రాయాలు ఉన్నాయి. అది నిజం కాదు. స్వేచ్ఛగా ఆలోచించగలిగిన వ్యక్తులే నైతిక విలువలను గ్రహించగలరు. ఆచరించి చూపగలరు. స్వేచ్ఛ నీతికి మూలం. ఈ మార్గంలోనే యశోద రెడ్డి గారు స్త్రీ స్వేచ్ఛను వివరిస్తూ కథలు రాశారు.

యశోద రెడ్డి మూడు కథల సంపుటాలలో స్త్రీల ప్రస్థావన లేని కథలేనే లేదు. కొన్ని కథల్లో స్త్రీ పాత్రలు ప్రధానంగా కనిపిస్తాయి. కొన్ని కథల్లో అంతర్లీనంగా ఉంటూ ప్రధాన పాత్రను పోషిస్తాయి. ఒక్క మాటలో చెప్పాలంటే స్త్రీ పాత్రలకు ప్రాధాన్యత ఇస్తూ రాసిన కథలుగా చెప్పుకోవచ్చు. ఉదాహరణకు ఎచ్చమ్మ, ముత్యాలమ్మ ,నాగి ,కమలమ్మ, సీతమ్మ, రాధమ్మ, శివమ్మ, అనసూయమ్మ, వంటి పాత్రలు వాస్తవిక కోణంలో ప్రాధాన్యతను సంతరించుకున్నవి.

ముఖ్యంగా కథల సంపుటిలో స్త్రీలపాత్రలతో ప్రధానంగా సాగుతాయి . స్త్రీలు ఆత్మవిశ్వాసంతో అచంచలమైన జీవిత పరమార్థాన్ని కష్టాల్లో ధైర్యం కోల్పోకుండా నిబ్బరంగా నిలబడి ఎలా ఎదుర్కొంటారో అనుబంధాలు , ఆత్మీయతలు, ప్రేమలో, కుటుంబ సంబంధాలు, స్నేహ సంబంధాలు ఎంత ఆత్మీయంగా చేస్తాయో ఈ కథల్లో ఎంతో నిబద్ధతతో జీవితానుభవంతో చిత్రీకరించారు. యశోద రెడ్డి ఆదర్శవంతంగా తామున్న పరిస్థితుల ప్రభావం నుండి ఎలా జీవించాలో మన ముందు ఉంచారు. స్త్రీపాత్రలను మహోన్నతంగా చిత్రించారు.

లత ఎవరో కాదు ప్రైవేట్ డిటెక్టివ్ ఎంగేజ్ చేసిన అమ్మాయి. చాలా చురుకైంది. కరాటే , షూటింగ్ , స్విమ్మింగ్ లలో ఆరితేరింది. అవసరం కొద్దీ కాల్ గర్ల్ గా కూడా పనికి వస్తుంది. నటనలో మహాఘటికురాలు. మొదటే అన్ని విషయాల్లో బాగా బ్రీఫ్ చేశారు. కాబట్టి సర్వసన్నద్ధంగా టేప్ రికార్డర్ తో సహా వచ్చింది. నిజానికి ఆ అమ్మాయి మత్తుమందు కలిపిన టీ తాగలేదు. చక్కెర కలుపుకొనే నెపంతో లోపలికి వెళ్ళింది అంతవరకు సిద్ధంగా ఉంచుకున్న టీ ని తెచ్చుకొని ఆ టీ ని పారబోసి వచ్చింది. కథనడిపింది. నాటకాన్ని రక్తి కట్టించింది.

ఇంతలోనే మరొక స్త్రీ అందుకొని ఏం బ్రతుకు బ్రతుకైనా ఎంగిలి విస్తరిలో మళ్ల వద్దనకు అక్కరకు రాదు కదా అన్నది. వీళ్ళిట్ల మాట్లాడుక్కుంటూ యువతరంలో జులైగా చేరి ఏరా ఎగాదిగా చూస్తున్నావు దాన్న, ఇరాదా క్యా హై అంటూ చాలా నీచంగా తానేదో జోక్ చేస్తున్నట్లు అంటూ పండ్లు ఇగిలించాడు. అంతలో ఒక నిజాయితీ పరుడు ఛీ నోరుముయ్ ఎవరి గతి ఎట్లుందో నీకు తోబుట్టువులు ఉన్నారు కదా స్త్రీని గూర్చి అంత నీచంగా మాట్లాడకు కొంత సభ్యత నేర్చుకో అన్నాడు. దీంతో అందరి నోర్లు కట్టుబడి నిజమైన స్థితిని గూర్చి ఆలోచించసాగాయి అప్పుడు గాని ఒక ఆలోచన తలుక్కున మెరవలేదు అదే ఆ కారులో వచ్చిన వ్యక్తికి సంబంధించిన విషయం. (పరిత్యక్త, పుట 234) ప్రమీల బరి బత్తుల బొమ్మ కథలలో స్త్రీల సమస్యలను వివరించారు.

**పాకాల యశోద రెడ్డి గారి రచనల్లో-దాంపత్య జీవిత సమస్యల ప్రస్తావన:-**

సంబంధ బాంధవ్యాలలో మధురమైనది స్త్రీ పురుషుల సంబంధం. దీని స్థాయి భావం ప్రణయము. దివ్యత్వానికి చేర్చేది ధర్మము. ఇలాంటి ధర్మబద్ధమైన ప్రణయమే నిజమైన దాంపత్యానికి జీవము. దాంపత్య జీవనం అనేది స్త్రీకి ఎంత అవసరమో పురుషునికి కూడా అంతే అవసరవస్తువుగా, పురుష సంబంధాల గురించి యశోద రెడ్డి గారి ఎచ్చమ్మ కథా సంపుటిలో " నిశ్చితార్థం " అనే కథలో స్త్రీపురుషుల మధ్య దాంపత్య జీవిత సమస్యలు రాకూడదని దైవ సన్నిధిలో గుళ్లో పెళ్లి చేసుకుని వచ్చిన దంపతులు దీవించమంటారు. ఈ కథలో పల్లెటూరి వాతావరణంలో ప్రేమలు ఆప్యాయతలు కనిపిస్తాయి....

యశోద రెడ్డి ఎచ్చమ్మ కథల్లో " మిఠాయి రాములు " కథలో నేటి సమాజంలో జరుగుతున్న సమకాలిన ఇతివృత్తాలను తీసుకొని ఈ కథ చెప్పడం జరిగింది. రాములుకి ఇద్దరు భార్యలు ఉన్న వారు తమ స్వార్థం చూసుకున్నారే తప్ప భర్త బాగోవులను చూడరు. దాంతో రాములుని పనికి రాని వస్తువుగా జమ కట్టారు. దాంతో తాగుడు అలవాటు చేసుకున్నాడు రాములు.

ఇటువంటి బ్రతుకులు నిత్యజీవితంలో ఎన్నో చూస్తున్నాము. రచయిత్రి నేటి దాంపత్య జీవిత సమస్యలను ఈ కథలో కళ్ళకు కట్టించారు. మిఠాయి రాములు ముందుచూపు లేని వాడు. వయసులో ఉన్న నాడు కష్టపడి సంపాదించాడు కానీ దాన్ని కాపాడుకొని ముందుచూపుతో వెనకేసుకోలేదు వయసు ఉన్న నాడు తిని తాగి భార్యలతో రాత్రి పగలు అనకుండా సుఖపడ్డాడే తప్ప ముసలితనంలో పరిస్థితులు ఎలా ఉంటాయో అని దూరాలోచన చేయని మూర్ఖుడు.

ఈ కథలో రచయిత్రి తన అనుభవంలో ఎదురైన వారి మనస్తత్వాలు అభిప్రాయాలను వెలిబుచ్చింది స్వయంగా తన అనుభవంలోని సంఘటనలను కూడా తెలియజేసింది. " ఎద్దున్నోనికి బుద్ధి లేదు బుద్ధున్నోనికి ఎద్దు లేదు " అన్న సామెత గుర్తొస్తుంది ఈ కథలో భార్య మంచిదైన భర్త మంచివాడు కాదు మరొకరి విషయానికొస్తే భర్త ఎంతో పేరు ఉన్నవాడు కానీ అందుకు భార్య ఈసడించుకుంటుంది.

సమాజంలో చూసిన అనేక విషయాలను ఎచ్చమ్మ కథలు అనే కథా సంపుటి ద్వారా అక్షరబద్ధం చేశారు. భార్యాభర్తలు సంసారం అనే బండికి రెండు ఎద్దులాంటివారు. అవి సమానంగా నడిస్తేనే గమ్యం చేరుతాయి.

అదేవిధంగా భార్యాభర్తలు ఇద్దరూ ఒకరినొకరు అర్థం చేసుకొని జీవించాలని ఈ కథ ద్వారా రచయిత్రి వివరించారు.

**పాకాల యశోదా రెడ్డి కథల్లో -వివాహ వ్యవస్థ ప్రస్తావన:-**

భారతీయులు వివాహాలను దైవ నిర్ణయాలుగా భావిస్తారు. అతి పవిత్రమైన బంధంగా వివాహ వ్యవస్థను చూస్తారు. పూర్వకాలంలో పురుషుడు స్త్రీని పోషించగలడా ? కాపాడగలడా ? అనే అంశాలకు ప్రాధాన్యత ఉండేది. స్త్రీ వ్యక్తిత్వానికి ప్రాధాన్యత ఉండేది కాదు. ప్రేమించుకొని పెళ్లి చేసుకున్న భార్యాభర్తలు కలిసి మెలిసి ఆడుతూ పాడుతూ సంసారాలు చేస్తే ఆ ఇల్లు స్వర్గమవుతుంది అయితే ప్రేమ పేరుతో జరిగే ప్రేమ వివాహాల్లో స్త్రీలే ఎక్కువగా మోసపోతున్నారు. ప్రేమ పెళ్లి పేరుతో పురుషుడు స్త్రీని ఈనాటికి తన బానిసగానే ఉపయోగించుకుంటున్నాడు ప్రేమించి పెళ్లి చేసుకున్నంత మాత్రాన ఆడదానిపైన సర్వాధికారాలు పురుషునికి ఎలా వచ్చాయి ? స్త్రీ వీటన్నింటి నుండి ఎందుకు రక్షించుకోలేకపోతుంది ?

దీనికి గల ముఖ్య కారణం ఈనాటికీ మారని " సామాజిక స్పృహ " లేకపోవడమే అని రచయిత్రి చెప్తున్నారు.

పరంధామయ్య గారు మీరేమన్నా నాకేం బాధ లేదు. మా కులంలో మూడు రకాల పెళ్లిళ్లు చెల్లుబడి లో ఉన్నాయి. ఇంటి పెద్దలు దాసరిని మధ్యవర్తిగా పెట్టి నిశ్చయించే పెళ్లి ఈ పెళ్లిలో కూడా పిల్ల ఇష్టానికి వ్యతిరేకంగా జరగదు. రెండవది కట్ల పెళ్లి ఇది వధూవరుల పెద్దల ప్రమేయం లేకుండా జరుగుతుంది. ఇద్దరూ కలిసి ఒక రాత్రి వెళ్ళిపోయి మరునాడు విందుతో పెద్దలందరి ఆశీర్వాదం పొందే పెండ్లి .మూడవది ఇల్లరికపు పెళ్లి ఓలీ ఇవ్వలేని వరుడు ఇల్లరికానికి అంగీకరిస్తాడు.

**ముగింపు:-**

సమాజ హితాన్ని కోరే సాహిత్యం సార్వజనీనమైనది సర్వామోదమైనది. మనిషిలో పరివర్తన తెచ్చి జ్ఞాన జ్యోతిని వెలిగించేలా ఉండాలి. జీవితంలో కష్టనష్టాలను తాను కొంతసేపైనా మర్చిపోయేటట్లు రచన చేయాలి ఇటువంటి రచనలు చేసిన వారు డాక్టర్ పాకాల యశోదా రెడ్డి గారు. తెలంగాణ సామాజిక జీవితంలో వస్తున్న మార్పులకు అనుగుణంగా ప్రతిస్పందిస్తూ యశోద రెడ్డి అనేక కథలు రాశారు. సామాజిక జీవన పరిస్థితులను వీరి కథల్లో చిత్రించడం విశేషంగా చెప్పుకోవచ్చు...

**ఆధార గ్రంథాలు:-**


1. పాకాల యశోద రెడ్డి. యశోద రెడ్డి కథలు మొదటి సంపుటి. నవ చేతన పబ్లిషింగ్ హౌస్ హైదరాబాద్
2. పాకాల యశోద రెడ్డి, యశోదా రెడ్డి కథలు రెండవ సంపుటి. విశాలాంధ్ర పబ్లికేషన్ హౌస్ హైదరాబాద్.
3 . వేదగిరి రాంబాబు, కథానిక లక్ష్యము లక్షణాలు శ్రీ పొట్టి శ్రీరాములు విశ్వవిద్యాలయం నాంపల్లి హైదరాబాద్
4. పోరంకి దక్షిణామూర్తి కథానిక స్వరూప స్వభావాలు హైదరాబాద్.1988
5. రావి ప్రేమలత భారతీయ సాహిత్య నిర్మాతలు పాకాల యశోద రెడ్డి, సాహిత్య అకాడమీ ప్రచురణలు, 2015


******

# 31. మాతృభాషలో ఉపాధి అవకాశాలు

**Bhanu Pavani**

**9705400449**

**రచయిత్రి పరిచయము**

నా పేరు భాను పావని. నేను తెలుగు భాష మీద ఇష్టంతో బి.ఏ. తెలుగు ఓరియంటల్ డిగ్రి చేసి, హైద్రబాద్ సెంట్రల్ యూనివర్సిటిలో యం.ఎ., పి.హెచ్.డి చేసాను. ప్రస్తుతం సిల్వర్ ఓక్స్ ఇంటర్నెషనల్ స్కూల్‌లో తెలుగు ఉపాధ్యాయురాలుగా పని చేస్తున్నాను.

"తెలుగదేలనన్న దేశంబు దేలుగేను

దెలుగు వల్లభుండ దెలుగొకండ

యెల్ల నృపులు గొలువ నెరుగవే బాసాడి

దేశభాషలందు దెలుగు లెస్స"

(ఆముక్త మాల్యద ప్రథమాశ్వాసము-పద్యం-15 పుట-13)

అని విద్వాంసుల చేత పొగిడించుకున్న భాష తెలుగు. తెలుగు భాష రెండు రాష్ట్రాలకు మాతృ భాషగా మరియు కొన్ని చోట్ల అల్పసంఖ్యకా వర్గాలు మాట్లాడే భాషగా ఉంది. భారత దేశంలో అధికంగా ప్రజలు మాట్లాడే భాషలలో నాలుగవ స్థానంలో ఉంది. 2008లో తెలుగు భాషకు ప్రాచీన హోదా కల్పించారు. ఇది తెలుగు భాష గొప్పతనం. ఇది నాణేనికి ఒక వైపు మాత్రమే. ఒకప్పుడు హింది తరువాత ప్రజలు మాట్లాడే భాషగా ఉన్న తెలుగు భాష ఇప్పుడు నాలుగవ స్థానానికి పడిపోయింది. ఒకప్పుడు వచ్చిన సాహిత్యం, భాష విశిష్టతలు ఇప్పుడు లేవు. కొన్ని చోట్ల పాఠశాలలో తెలుగు పాఠ్యాంశంగా లేదు. తెలుగు మాట్లాడితే శిక్షలు విధించే పాఠశాలలు ఉన్నాయి. తెలుగును కేవలం గణాంకాల కోసమే కాని దానిని జీవనధారంగా చదివేవారు తక్కువ అయ్యారు. దీనికి కారణాలు ఏమిటి? పరిష్కారాలు ఏమిటి? అనే విషయాన్ని నాకు తెలిసిన పరిధిలో వివరించటమే ఈ పత్రం యొక్క ముఖ్య ఉద్దేశ్యం.

**అమ్మకి రక్షణ**

భాష నిత్య ప్రవాహిని. భాష, సమాజం, సంస్కృతి పరస్పరం ఒక దాని మీద మరోకటీ ఆధారపడి ఆ దేశం అనేది ముదందుగు వేస్తుంది. కాని తెలుగు భాష విషయంలో ప్రపంచీకరణ నేపథ్యం, ప్రభుత్వ వింత పోకడలు, ప్రజల వీపరీత ధోరణులు వల్ల భాష మనుగడ ప్రశ్నార్థకంగా మారుతుంది. ఈ పోకడ మారకపోతే ముందు తరాలకు స్వచ్ఛమైన భాషను మనము అందించలేము. అసలు ఇలాంటి పరిస్థితి తెలుగు భాషకు ఎందుకు వచ్చింది. ఇంట్లో మాతృభాషను సరిగా నేర్పకపోవడం. ఇంగ్లీషు, తెలుగును కలిపి టీంగ్లీషును నేర్పించడం. ప్రాథమిక స్థాయిలో ఇతరభాషలు తీసుకుని(ప్రవేటు పాఠశాలలు) తెలుగు నేర్పకపోవడం. విలువలు కలిగిన తెలుగు వార్తాపత్రికలు, తెలుగు పుస్తకాలు చదవక పోవడం. తెలుగు భాష చదివిన వారి కంటే సాంకేతిక విద్య చదివిన వారికి అవకాశాలు మెండు అనుకోవడం. ఇలాంటి అపోహలు తొలగించుకుని ఉపరాష్ట్రపతి వెంకయ్య నాయుడు చెప్పిన వాటితో పాటు ఈ క్రింది పనులు చేయడం ద్వారా తెలుగుకు కొంత మేర పటిష్టతను చేకూర్చవచ్చు.

ఇంట్లో మరియు పాఠశాలలో వీలు అయిన అన్ని తెలుగు పదాలు వాడటం.

ప్రాథమిక స్థాయిలో భాషా క్రీడలను ప్రోత్సహించడం.

క్రీడా పద్ధతిలో విద్యార్థులకు ఆసక్తి కరమైన బోధన చేసి తెలుగు మీద మక్కువ ఎక్కువ చేయడం. ప్రాథమిక స్థాయిలో తెలుగు భాష ను తప్పని సరిగా నేర్పించడం

తెలుగు భాష అధ్యన కేంద్రాల సహాయంతో మాండలిక, వ్యవహారిక భాషకు నిఘంటువులు తయారు చేయడం.

తెలుగు భాష వలన వచ్చే ఉపాధి అవకాశలు తెలియ చెప్పడం.

తెలుగు భాష మరియు సంస్కృతుల గురించి యానిమేషన్ కథలు తయారు చేయడం.

చలన చిత్ర, బుల్లి తెర రంగాలలో తెలుగుపదాల వాడుకను పెంచడం.

విలువలు కల తెలుగు పత్రికలను చదివించడం.

పిల్లలో తెలుగు కథ,కవిత రచనలను ప్రోత్సహించడం.

అనువాదాలను ప్రోత్సహించడం.

**తెలుగు ఉపాధి అవకాశాలు:**

తెలుగు చదువుకుంటే కేవలం ఆధ్యాపక రంగం లోనే కాకుండా చాలా రంగాలలో ఉపాధి దొరుకుతుంది.

1. పత్రికారంగం: తెలుగులో వార, దిన, మాస పత్రికలు ఉన్నాయి. ఆ పత్రికలలో వార్త రచన చేయాలన్న, తప్పులు లేకుండా అచ్చుదిద్దాలన్నా తెలుగు అవసమే. ఆ వార్తలను ఆకర్షణీయమైన శీర్షికలను పెట్టి ప్రజల చేత చదివించాలంటే తెలుగు సాహిత్యం, జాతీయాలు సామెతలపై అవగాహన ఉండాలి.

2. టెలివిజన్ రంగం: తెలుగులో ఆధ్యాత్మిక, వార్తా, వినోదాలకు సంబంధించిన అనేక ప్రసార మాధ్యమ చానల్స్ ఉన్నాయి. తెలుగు టెలివిజన్ రంగంలో ఆధ్యాత్మిక విషయాలు చెప్పాలన్నా, వార్తాలు చదవాలన్నా, రాయాలన్నా, యాంకర్‌గా ఉండాలన్నా స్పష్టమైన ఉచ్చారణ గల తెలుగు కావాలి.

3. సృజనాత్మక రంగం: తెలుగు కథలు, కవితలు, పద్యాలు, నవలలు, గేయాలు, పాటలు రాయడం ద్వారా ఉపాధిని కల్పించుకోవచ్చు.

4. చలనచిత్ర రంగం: మంచి నటులు కావాలంటే అందం, అభినయంతో పాటు మంచి ఉచ్చారణ ఉండాలి అలానే తెలుగు చలనచిత్రాలకు మాటలు, పాటలు, కథలు రాయాలన్న తెలుగు భాషాజ్ఞానం చాలా అవసరం. గాత్రదానం చేసే వారికి కూడా స్పష్టమైన ఉచ్చారణతో పాటు తెలుగు భాష పై మంచి పట్టు ఉండాలి

5. చారిత్రక రంగం: చరిత్ర అంటేనే భాష, సంస్కృతుల అధ్యయనం. చరిత్రను, సంస్కృతిని అధ్యయనం చేయాలన్న భాష మనకు ఉపయోగపడుతుంది.

6. టూరిజం: ప్రాంతీయంగా ఉన్న వాటి గురించి ఆ ప్రాంతం వారికే బాగా తెలుస్తుంది కాబట్టి, చూడటానికి వచ్చే వారికి అక్కడ ఉన్న విషయాలు వివరించటానికి, కొత్తవారికి వింతలు విశేషాలతో పాటు అక్కడి ప్రజల ఆచార వ్యవహారాలు వివరించడానికి ప్రాంతీయ భాష ఉపయోగ పడుతుంది.

7. అవధానం/ఆధ్యాత్మిక వేత్త: తెలుగులోనే విశిష్టమైన ప్రక్రియ అవధానం. అవధానం చేయాలన్న, లేదా ఆధ్యాత్మిక వేత్తలా మారి మన ఆచార సంప్రదాయాల గురించి చెప్పాలన్న తెలుగు భాష మరియు తెలుగు సాహిత్య పరిజ్ఞానం ఉండాలి.

8. సాంకేతిక రంగం: సాంకేతికరంగంలో కూడా తెలుగు భాష వినియోగం ఉంది. తెలుగును కంప్యూటర్‌లో టైపు చేయలన్నా, కళలు వంటి విషయాలపై విషయ రచన మరియు యూటూబ్ విడియోల వంటివి చేయాలన్న ప్రాంతీయ భాషగా తెలుగు ఉపయోగపడుతుంది.

9. అనువాదం: అనువాదం అంటే ఒక భాష నుండి మరోక భాషను అర్ధవంతంగా భావానుగుణంగా రాయలన్నా, చదవాలన్న భాష అవసరం అవుతుంది. అలానే పరిపాలనలో భాగంగా ఇక్కడికి వచ్చె అధికారులకు తెలుగు నేర్పించడం అనేది కూడా ఉపాధి అవకాశమే.

10. బోధన: తెలుగు భాషను రక్షించుకుంటూ తెలుగు పట్ల పిల్లలుకు ఆసక్తిని కలిగించే విధంగా భోధన చేసే ఉపాధ్యాయులు,ఆచార్యులు వంటి బాధ్యత అనేది కూడా ఉపాధి అవకాశమే.

11. పరిపాలనారంగం: తెలుగు భాషాసంఘం ఏర్పడిన నాటి నుంచి తెలుగు పాలనాభాషగా వృద్ధి చెందింది. అయితే నేటి కాలంలో తెలుగు స్థానాన్ని ఆంగ్లం భర్తీ చేసింది. పాలనా రంగంలో తెలుగు అనేక రకాలుగా ఉపయోగపడుతుంది. కేంద్ర ప్రభుత్వం నుంచి వచ్చిన జి.వో.లను తెలుగులోనికి అనువదించి రాయడం. గ్రూప్ పరీక్షలు రాసేవారు చాలా మంది తెలుగు ఇచ్చికాని తీసుకున్న వారే. ఇక్కడ పని చేసే I.A.S, I.P.S లాంటి వారికి తెలుగు భాషను నేర్పించి, వారిని ఇక్కడి ప్రజలకు దగ్గరగా చేర్చడానికి ఒక కోర్సులాగా తెలుగును నేర్పించడం ఉపాధి అవకాశమే.

12. దేశాలలో తెలుగు నేర్పించడం: "ఇటాలీయన్ ఆఫ్ ది ఈష్ట్" అని తెలుగు భాషను విదేశీయులు ఎంతగానో ఇష్టపడి గౌరవించారు. నేటికి విదేశాలలో ఉన్న తెలుగు వారు కావచ్చు, విదేశీయులు కావచ్చు తెలుగు భాషను, సంస్కృతులను నేర్చుకోవడానికి ఇష్టపడుతున్నారు. అలాంటి వారికి తెలుగు భాషను(రాయాడానికి, చదవానికి, మాట్లాడటానికి), పద్యాలను నేర్పించడం కూడా ఉపాధి అవకాశమే.

**ముగింపు**

ఇన్ని ఉపాధి అవశాలు తెలుగు భాష మీద ఉన్న నేటికి తెలుగు చదివేవారి సంఖ్య తక్కువగానే ఉంది. భాష అంటే కేవలం చందస్సు,పద్యాలు అనే భావన కాకుండా భాష అంటే మన మన జీవనం.భాష అంటే మన మనుగడ కు జీవగర్ర. గణితం, సాంఘీక, విజ్ఞాన శాస్త్రాలు మనకి ఉపాధిని, విజ్ఞానాన్ని అందిస్తే, మన మాతృభాష ఉపాధి, విజ్ఞానం, జీవితంలో మంచి నడవడిక(పద్యాలు,కథలు,కవితలు), సంతృప్తిని ఇస్తుంది. మన భాషలో మనం మన అభిప్రాయాలను స్పష్టంగా చెప్పగలము. అనే విషయాలను విద్యార్థులకు వివరించి చెప్పగలగాలి. ఆ భాద్యత తెలుగు ఉపాధ్యాయులందరి మీద ఉంది. ప్రతి ఒక్కరు ఆ బాధ్యతను తమ కర్తవ్యంగా తీసుకుని భావి తరాలకు తెలుగు పుస్ప సుష్ప సుగంధ పరిమళాలను పంచుతారని ఆశిస్తున్నాను.

జై తెలుగు

**ఉపయుక్త గ్రంథాలు**

1. అమ్మ భాషలో ఉపాధి అవకాశాలు 7TH JULY 2023 - డా జి.వెంకట లాల్- IGCRT(ON LINE)

2. ఆముక్త మాల్యద1907 - శ్రీకృష్ణ దేవరాయలు- శ్రీ సరస్వతీ ముద్రాక్షర శాల చెన్నై

3. తెలుగు భావి( వీధి అరుగు)2023 -శ్రీ వెంకయ్య నాయుడు- PIB ,HYDERABAD

4. భద్రిరాజు కృష్ణమూర్తి,2000- భాష ,సమాజం,సంస్కృతి-నీల్కమల్ పబ్లికేషన్స్.

5. భద్రిరాజు కృష్ణమూర్తి,1998 - languages in school education in india- krishnamurti 1998

6. వెల్దండి శ్రీధర్ 6 june-2022- తెలుగుభాషదీపం అరిపోకుండా ఉండాలంటే- ABN ANDHRAJYOTHY PAPER

*******

# 32. తెలుగు కవిత్వంలో అసంఘటిత పనివారి జీవిత చిత్రణ సామాజికత

**డా. నందిగామ నిర్మల కుమారి.**

అసిస్టెంట్ ప్రొఫెసర్ అఫ్ తెలుగు,

కె.ఆర్.ఆర్. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, కోదాడ

neerunandigama@gmail.com

Mobile no: 9490369252

**"In India, a man is not a scavenger because of his work. He is a scavenger because of his birth irrespective of the question whether he does scavenging or not'. 'Dr B.R. Ambedkar**

ఈ దేశం లో ఒక పాకి/భంగీ కార్మికుడు కేవలం అతడు చేసే పని ద్వారా మాత్రమే పిలవబడడు, అతను ఆ పని చేసినా చేయకున్నా అతని పుట్టుక నే అతన్ని పాకీ వాణ్ని చేస్తుంది' అంటాడు ఈ దేశ రాజ్యాంగ నిర్మాత, శ్రమజీవుల ఆశాజ్యోతి డా.బి ఆర్ అంబేడ్కర్.నగరం నిద్రపోతున్న వేల కేవలం ఒక చీపురు మాత్రమే మేల్కొని మన ఉదయానికి తన శ్రమతో సాకబోస్తుంది. రాత్రంతా పండు వెన్నల్లో జోగొన్న పట్నం తెల్లారితే మల్లె పూవులా ముస్తాబవడం వెనక నిద్రకు ఆకలికి వగచిన మురికి మట్టి చేతులు ఉన్నాయి. ఈ దేశం లో పాకీ పని పరమ పవిత్రమైనది అని మహాత్మాగాంధీ అంటాడు. కనుక ప్రతి ఒక్కరు తమ పాకీ పనిని తామే చేసుకోవాలి అని ఆయన ఇచ్చిన పిలుపు నాటి జాతీయోద్యమంలో ఒక సంచలనం. కానీ గాంధి నిజంగా పాకీ వృత్తి మీద గౌరవం తో పిలుపు ఇచ్చాడా ? లేదా అనేది ఆ వృత్తి పట్ల మిగతా ప్రజల ఈ సడింపు మారాలి అని అన్నాడా అనే ప్రశ్న ముఖ్యమైనది.

పారిశుధ్య వృత్తి గురించి గాంధీ ఇలా అంటాడు "భంగీలు చేసే సేవలు అన్ని సేవలకు మూలం. ఒక తల్లి తన బిడ్డల కోసం ఏం చేస్తుందో అది భంగీలు సమాజం కోసం చేస్తారు.ఒక తల్లి తన బిడ్డ మురికిని శుభ్రం చేసి అతడి ఆరోగ్యాన్ని కాపాడుతుంది.అదే విధంగా భంగీలు పారిశుధ్యం పనులు నిర్వహించడం ద్వారా మొత్తం ప్రజానీకం ఆరోగ్యం పరిరక్షిస్తారు." (మా కొద్దీ చండాలం: 2005, p.30).

ఒకవేల గాంధీ పాకీవృత్తి గౌరవనీయమైనది అనే సందేశం మిగతా ప్రపంచానికి ఇచ్చాడు అనుకుంటే అమానవీయ అపరిశుభ్ర మైన పాకీవృత్తిని నీచంగా చూసే సంస్కృతి ఈ నాటికీ పోలేదు , పైగా కొన్ని వందల ఏళ్ళుగా కేవలం ఈ దేశం లో కొన్ని అంటరాని కులాలే ఆ వృత్తిలో ఎందుకు కునారిల్లు తున్నారో అనే ప్రశ్న కూడా ఉత్పన్నం అవుతుంది. భరతమాత తన బిడ్డలలో కొందరిని ప్రాణాంతకమైన, అమానవీయమైన వృత్తికి, మరికొందరిని గౌరవనీయమైన వృత్తికి ఎందుకు ఆపాదించిందో అని అడగాలి అని ఉంది.

కనుక సామాజిక సంవాదంలో (సోషల్ డిస్కోర్స్) ఈ పాకీ సమస్య మీద గాంధీ అంబేడ్కర్ రెండు భిన్నమైన వైఖరులను మన ముందుకు తెచ్చారు. ఒకరు ఆ వృత్తి సామాజిక బందిఖానగా భావిస్తే, మరొకరు ఆ బందిఖాన నుండి బయట పడాలి అన్నారు. అంటే ప్రతి ఒక్కరూ తమ పని తామే చేసుకోవాలి. నిజానికి గాంధీ పాకీ పని గౌరవనీయం అని చెప్పడం మాత్రమే కాదు "దేశ స్వాతంత్ర్యం కన్నా పారిశుధ్యం మిన్నా" (1925) అనే పిలుపు ఇవ్వడం మాత్రమే కాకుండా ఆచరించి కూడా చూపాడు. ఈ సందర్భంగా ఒకరు పుట్టుక యాదృచ్ఛికత అంటే మరొకరు పుట్టుక యాదృచ్ఛికత అయినా ఒక కులంలో పుట్టి సదరు వ్యక్తి ఆ కులవృత్తి లో లేకపోయినా వివక్ష తరతరాలుగా వాళ్ళని వెంటాడడం విషాదం . మొత్తంగా పాకి వృత్తి గురించి గాంధీ అంబేడ్కర్ ఏకకాలం లో ప్రాధాన్యత ఇచ్చారు అనుకోవచ్చు. ఈ సదస్సులో నాకు కేటాయించిన అంశం "తెలుగు కవిత్వం లో పారిశుధ్య పని వారి జీవిత చిత్రణ" మన రాష్ట్రంలో ఈ రంగంలో పనిచేసేవారు అత్యధికులు దళితులు, కానీ ఉత్తర భారతదేశంలో భంగీ అనే ఒకకులం ఈ పారిశుధ్య పనిలో

ఉన్నారు. ఈనాటికీ మహారాష్ట్ర నుండి వలస వచ్చిన భంగీలు తెలంగాణ సమాజం లో కలిసిపోయారు. ఈ నాటికి వారు తమ వృత్తిని కొనసాగిస్తున్నారు. అసలెవరు ఈ భంగీలు ?

ఒక అభిప్రాయం ప్రకారం వీరి పుట్టుక మొఘల్ కాలం నుంచే ఉందన్న సంకేతాలున్నాయి. సింధులోయ సంస్కృతిలో గదిలో అమర్చిన మరుగు దొడ్లు ఉండేవి. కానీ మొఘల్ రాజ్యంలో ఏ మహల్ లోకి వెళ్ళినా మరుగు దొడ్డి కనబడదు. అరబ్ ఎడారి నుంచి వచ్చిన ఢిల్లీసుల్తాన్, మొఘల్ లకు మరుగుదొడ్ల నిర్మాణ ప్రక్రియ లేదు....మలినాన్ని ఎత్తి పడేసే బాధ్యత తీసుకున్నాక జంధ్యం లేదా ఉపనయన సంస్కారాన్ని విడిచి పెట్టిన (భంగంచేసిన) వారిని భంగీలు అనేవారు" రీతా గుప్త (2017, గృహ శోభ.p.49). ఈ పనిచేసే వాళ్లను పలు ప్రాంతాలలో పలు విధాలుగా పిలవబడుతున్నారు. బెంగాల్ లో హాన్, హాదీ , ఉత్తరప్రదేశ్ లో వాల్మీకి, ధనక్, మధ్యప్రదేశ్, అస్సాంలో మెహదర్, భంగీ. తమిళనాడు లో తొట్టి, పంజాబ్ లో మిరా, లాల్ బేగి, చుహార, ఢిల్లీ,రాజస్థాన్ లో వాల్మికి, మెహదర్, చుహార. తెలంగాణ ప్రాంతం లో దళిత కులాలు మాత్రమే పారిశుధ్య వృత్తిలో ఉన్నాయి.

తెలుగు సాహిత్యంలో ఇటువంటి చర్చకు మూలాలు ఎక్కడ అని ఆలోచిస్తే మహారాష్ట్ర కేంద్రంగా బయలు దేరిన దళిత పాంథర్ఉద్యమం అని అనుకోవచ్చు. పందొమ్మిది వందల నలభై, ఏభై లలో అంబేడ్కర్ తెచ్చిన సామాజిక స్ఫూర్తి మరాఠా దళిత, బహుజన సమాజం మీద ఎంతయినా ఉంది. రాజ్యాంగం లో అణగారిన వర్గాల హక్కుల కోసం, సామాజిక హోదా కోసం కొట్లాడిన స్ఫూర్తి అక్కడి కవుల మీద ఉంది. మెహర్, మాంగ్,చమార్ లాంటి అణగారిన కులాల నుండి కవులు దళిత సమస్యలను కవిత్వీకరించారు. ఆ విధంగా మరాఠా దళిత సాహిత్యం ఇచ్చిన అస్తిత్వ ఉద్యమ స్ఫూర్తి తెలుగునాట కూడా ఉంది అనుకోవచ్చు. ఆ క్రమం లో తెలుగు సమాజాన స్త్రీవాద, కుల అస్తిత్వ స్ఫూర్తి తో పీడిత కులాలు తమ నిత్య జీవితం లో ఎదుర్కొంటున్న అవమానాలను కవిత్వీకరించారు. అలా మరాఠీ భాష నుండి కవిత్వం కథ,నవల, అనువాదాలు తెలుగునాట బయలుదేరాయి. ఇటీవల భగవాన్ దాస్ 'మైభంగీహూం' అనే మరాఠీ ఆత్మకథ "నేను భంగీని' అని ఆ ఆత్మకథ తెలుగు అనువాదంగా బయటకు వచ్చింది. ఒక పాకీ కులం లో పుట్టిన ఒక సీనియర్ ఐ ఏ ఎస్ అధికారి రాసుకున్న ఆత్మకథ అది.

పారిశుధ్య వృత్తి ఒక సంఘటిత శక్తిగా మారిన తర్వాతనే ఈ అమానవీయమైన కనబడని ప్రపంచం మనకు తెలిసింది. బెజవాడ విల్సన్ ఒక సఫాయి కార్మికుని కొడుకు . ఇటువంటి అమానవీయమైన వ్యవస్థ పట్ల గళం విప్పిన గొప్ప నాయకుడు. తన పూర్వీకులు ప్రాణాంతకమైన ఈ వృత్తిలో ఉండడం సహించలేక తన ఆక్రోశం నుండి పురుడు పోసుకున్నదే 'సఫాయి ఖర్మచారి ఆందోళన". కర్నాటక కోలార్ బంగారు గనుల లో డ్రై లాట్రిన్ లలో పనిచేస్తున్న తన జాతి ప్రజల కష్టాలను బయటి ప్రపంచానికి తెలియ జేశాడు. పందొమ్మిది వందల అరవయ్యో దశకం లో పుట్టిన బెజావాడ విల్సన్ ఈ రంగం లో చేసిన కృషి మూలంగా డ్రై లాట్రిన్ లను ప్రభుత్వం బహిష్కరించింది. అతినికి మూడేళ్ళ కింద ప్రసిద్ద రామన్ మెగసెసే పురస్కారం కూడా లభించింది.

అలా బెజవాడవిల్సన్ చేసిన కృషి మూలంగా ఆధిపత్య మేధోచర్చల్లో సాహిత్యంలో ప్రతిఘటనా స్వరాలు బయలు దేరాయి. ఎంతో మంది బుద్ధిజీవులు ఈ అమానవీయమైన వృత్తి అంతానికి విల్సన్ తోచేయి కలిపారు. ఆ క్రమంలో పదిహేను ఏళ్ళ కింద హైదరాబాద్ బుక్ ట్రస్ట్ వాళ్ళు 'మాకొద్దీ చండాలం' అనే పుస్తకం పాకీ వృత్తి వెనక ఉన్న చారిత్రక మూలాలు బయటి ప్రపంచానికి తెలిసాయి. ఆ క్రమంలో పారిశుధ్య వృత్తి గురించి గాంధీ అంబేడ్కర్ సంవాదం, భంగీ, మెహతర్ జీవితాలు, వాళ్ళ మార్పుకై జరిగిన సంస్కరణ ప్రయత్నాలు, దాని మూలంగా వచ్చిన నిషేధ చట్టాలు ఈ పుస్తకం లో చర్చించారు. పారిశుధ్య కార్మిక వృత్తి మీద సమగ్రంగా వచ్చిన పుస్తకాల లో బహుశా తెలుగు లో ఇది మొదటిది అనుకోవచ్చు.

తెలుగు సాహిత్యం అంటని, ముట్టని ఇతివృత్తాలతో కవిత్వం రాసిన తొలి దళిత కవి గుర్రం జాషువా. ఆయనతో బాటు మంగిపూడి వెంకటశర్మ 'నిరుద్ధ భారతం', ఉన్నవ 'మాలపల్లి', వెలగల సుబ్బారెడ్డి 'ఆదిమాంధ్ర', జాలా రంగస్వామి 'అంటరాని

వారెవరు' చలం రాసిన మాదిగపిల్ల , పులికంటి కృష్ణారెడ్డి, కేశవరెడ్డి, లాంటి దళితులు కాని వారు దళిత సమస్యను సానుభూతి, సహానుభూతితో రాసినప్పటికీ, గుర్రం జాషువా అంటరాని సమస్య కేంద్రంగా రచనలు చేసిన తొలి కవి అనుకోవచ్చు. పైన పేర్కొన్న వాళ్ళు ఎవరూ ప్రత్యక్షంగా పాకీ సమస్య మీద రాసి ఉండక పోవచ్చు. కానీ పాకీ జీవితాలతో ముడిబడి ఉన్న మిగతా పార్శ్వాలను అక్షరీకరించారు . వారి రచనలలో ఎరుకలి, యానాదుల, భంగీ,మాల,మాదిగ జీవితాలు వీరి రచనల లో ఉన్నాయి. కారణం ఈ ప్రపంచంలో ఒక సంక్షుభిత బ్రతుకుకి తన మాటల తో ప్రాణం పోశారు కనుకనే సాహిత్యం లో వారికి ఆ మాత్రం గౌరవం. ఒక రకంగా ఒక భిన్నమైన సామాజిక ఇతివృత్తం తో కథ, నవల రాయడం ఆ నాటికి తెలుగు సాహిత్య లోకం లో అభ్యుదయమే.

నాటి ప్రబంధ సాహిత్యంలో అలరారిన కావ్య కన్యకల స్థానే గబ్బిలాన్ని కావ్యకర్త చేసి శివునికి తన నివేదన చేసిన తొలి ప్రయత్నం గుఱ్ఱం జాషువా చేసాడు అని చెప్పవచ్చు. ఆధిపత్య కావ్యలోకం నాటికి ఉపయోగిస్తున్న ఇతివృత్తాలు, పదబంధాల స్థానే అస్పృశ్య అంశాలు చోటు చేసుకోవడం ఒక విప్లవాత్మక పని. ఆ పనికి ఆద్యుడు జాషువ.

పందొమ్మిది వందల ఎనభైల తర్వాత మారిన సామాజిక సమీకరణలు అణగారిన కులాలు తమ కుల అస్తిత్వ స్పృహ తో సాహిత్యం రాసినప్పటికీ , అనేక వృత్తి కులాలు, అసంఘటిత కార్మికకులాలు తమ కులవృత్తి కేంద్రంగా కవిత్వం, ఇంకా మిగతా సాహిత్య సృజన చేసారు. తెలుగు నాట వచ్చిన 'చిక్కనవుతున్న పాట' 'పదు నెక్కినపాట' కవితా సంకలనాలు పాకీ పని కేంద్రంగా కొన్ని కవితలు ప్రచురించింది. అలా అనేక మంది దళిత బహుజన, దళితేతర కవులు పాకీల శ్రమ, సంస్కృతి మీద కవిత్వం రాసారు.

సఫాయి సమస్య మీద వచ్చిన సాహిత్యం మీద చర్చ చేయడానికి ముందు ఈ దేశంలో ఈ సమస్య పీడితుల సమాచారం చూసాక మనసు చాలా ఆందోళన కలిగింది. సఫాయి సమస్యల కోసం ఆవిర్భవించిన 'సఫాయీ కర్మచారీ ఆందోళన' సంస్థ ఇచ్చిన గణాంకాలు భయోత్పాతంగా అనిపించింది. ఈ దేశంలో చేతితో మలం ఎత్తివేయడం నిషేధం అని చట్టాలలో ఉన్నప్పటికీ ఈ నాటికీ ఇరవై ఆరు లక్షల డ్రై లెట్రిన్, ఏడు లక్షలకు పైగా కార్మికులు, ముప్పై ఆరు వేలకు పైగా రైల్వే కార్మికులు ఈ అమానవీయమైన వృత్తి లో బలవంతంగా కొనసాగుతున్నారు. రోజు రోజుకీ ఈ అంకెలు మారతాయేమో కానీ వారి బ్రతుకుల్లో ఏ మార్పూ లేదు.(మరిన్ని వివరాలకు సఫాయి కర్మచారి ఆందోళన వెబ్సైటు చూడండి).

తెలుగు సాహిత్యం లో పారిశుధ్య పని కేంద్రంగా ఎంతో మంది కవిత్వం రాసి ఉండవచ్చు. నా దృష్టికి వచ్చిన కొన్ని అంశాలు ఇక్కడ పేర్కొంటాను. తెలుగునాట పరిచయం అక్కరలేని దళిత కవితా స్వరం ఎండ్లూరి సుధాకర్ తన మొదటి కవితా సంకలనం 'వర్తమానం' లో మైసమ్మ మరణం పారిశుధ్య వృత్తికి, మైసమ్మ కూ ఆయన ఇచ్చిన నివాళి గొప్పది.

'పొద్దున్నే చూస్తే మా గల్లీ/ఇస్త్రీ చేసిన లాల్చీల తళ తళా మెరిసిపోయ్యేది/పిల్లలకి స్నానం చేయిస్తున్నంత ప్రేమగా ఆమె రోడ్లు ఊడ్చేది/మైల బట్టలూ చెత్త బుట్టలూ కాగితం కట్టలూ/అన్నీ గంపకెత్తి/తోపుడు బండిలో తోసుకుపోతుంటే/సమస్త కల్మషాన్ని కడిగేసే గంగమ్మ తల్లిలా కనిపించేది/వేగుచుక్కతో బాటు లేచి/వీధుల్ని వింతసవ్వడి తో ఊడ్చే దృశ్యం /నాకింకా గుర్తే/ కుళ్ళిన చెత్తకుండీలోంచి కంపుగాలి కొడుతుంటే/ నీకు జ్వరమొచ్చి రావడం లేదేమోననుకున్నా/ మారని మా బ్రతుకుల్లో గంపెడు చెత్త మిగిలించి/నువ్వు పత్తా లేకుండా పోతావనుకోలేదు/నిన్ను గుర్తు చేసుకునే కాబోలు/ రాత్రిళ్ళు చెత్త కుప్పల్లో పొర్లుతూ మన నల్ల కుక్క బోరున ఏడుస్తూ ఉంటుంది.(ఎండ్లూరి సుధాకర్:వర్తమానం. 1985-92).

ఎండ్లూరి సుధాకర్ హైదరాబాద్ నగరంలో తన బాల్యాన్ని యవ్వనాన్ని గడిపాడు. తన కుటుంబం స్వతహాగా పారిశుధ్య కార్మికులు. తన జీవితానికి ఆ పారిశుధ్య చేతులే ఆలంబన గా మారాయి.'మైసమ్మ మరణం' పేరుతో రాయబడిన ఈ కవిత తన బాల్యాన్ని బాల్యంతో ముడిబడ్డ మురికిబ్రతుకుల్ని మనకు పరిచయం చేసాడు. రోజూ వీధుల్ని మంచిగా ఉంచుకోండి అని శుభ్రబోధ

చేసిన మైసమ్మ అనే పారిశుధ్య కార్మికురాలు హఠాత్తుగా అదృశ్యం అవడం వెనక ఉన్న విషాద జీవితపు చారికల్ని ఈ కవితద్వారా మనకు మైసమ్మ గతాన్ని చెబుతాడు.

తెలుగు సాహిత్యంలో జాషువా మొదలు అనేక మందికవులు తమ కవితా సంకలనాలలో ఇటువంటి అమానవీయమైన అంశం మీద కవిత్వం రాసినప్పటికీ , మొదటి సంకలనం తెచి న ఘనత నల్గొండ కు చెందిన కొమ్ము సుధాకర్ దే. నాలుగేళ్ల కింద **'గుంపు సాహితీ సంస్థ' 'సఫాయిలం'** అనే కవితా సంకలనం వేసింది. ఈ సంకలనానికి కొందరు అంతకు ముందు రాసుకుని తమ కవితా సంకలనాల లో వేసుకున్నవి, మరి కొందరు ఈ సంకలనం కోసమే ముప్పై ముగ్గురు కవులు రాసిన కవితలను ఈ సంకలనం లో కలిపారు.

సాఫాయి లేదా పారిశుధ్య అంశం మీద కవితలు, మేథో చర్చలు చేసిన మరొక కవయిత్రి జూపాక సుభద్ర. అనేక అసంఘటిత రంగాల శ్రమ సంస్కృతి మీద ఆమె తన భిన్నమైన స్వరాన్ని వినిపించింది.

'కోడికి మాకు తెల్లార్తది/మా నిద్రల్ని సెత్తతోనే ఎత్తిపోసుకుంటాం/రోడ్లూడ్సి వూడ్సి,సీపురు కట్టలోలె అరిగి పోతిమి / మొండిసెత్తను ఎత్తిపోసి కంకెర దేలినట్లు/ మాబొక్కలు తేలినయ్/ గీ రోడ్డును దువ్వి ముడిసి అద్దాలద్దె సీపురు పొద్దులం/ అంటూ యాంత్రికీకరణ లో భాగంగా మిషన్లను తెచ్చి, ఉన్న ఆ కొద్దిపాటి ఉపాధిని కొల్లగొడుతున్న పాలకపక్షాలకు యంత్రాలను 'గవేమన్నా మున్సిపాలిటీ సఫాయీ ఆడోల్లా అన్నిటికీ రోసి అడ్డమైన రోత వూడ్సేదానికి' అటువంటి మిషన్ల మోతకు రోగాల రోచ్చుకు మీ ఖజానాలు ఖాలైతాయి, కొండల్ని పిండి జేసే ఆకలి గొన్న బ్రతుకులకి అడ్డంగా వచ్చిన మిషన్లను సేత్తోలె ఎత్తి పారబోస్తాం అంటుంది సుభద్ర.

దేహాలను చీపుళ్ళు చేసి చీకట్లను ఊడ్చే చుక్కల్ని చూస్తాను/మనిషికీ మనిషికీ మధ్య మలినాలను తుడిచి/హృదయాలు శుభ్రపరిచే మనుషులు/కార్మికులు కాదు నిజానికి వాళ్ళే దేవుళ్ళంటాను./వేతనాల తోనే కాదు/వారి పాదాలు కడిగి/నీళ్ళను నెత్తిమీద జల్లుకొని ఆ దేవుళ్ళ ముందు మోకరిల్లమంటాను. అంటాడు ప్రసిద్ధ కవి ప్రసాదమూర్తి తన 'దేవుళ్ళు' కవిత ద్వారా. సమాజం ఈసడించుకున్న సమూహాలను దేవుళ్ళని చేసిన కవిహృదయం అతనిది.

శెల్క అల్కిన పొర్క భుజమెక్కిన భూమై/లోకం పాపం మర్కల శుద్ధికి కదిల్న/సిఫాయిలకే సుద్ది అద్దిన సఫాయి అమ్మావనం/ సఫాయి కాళిక/కదల్ని రోడ్లను కాడే ఎద్దు అయి గుంజి/దుమ్ము ఊపిరి గొట్టం సుడిగాలైదిర్గి/శుద్ధి గుణం నేర్పిన కడజాతి మొదటి బిడ్డ/ నింగికి పొరకలు ఎత్తిన పొద్దుకు జాడ గుర్తు మా అమ్మ' అని అంటున్నాడు దొడ్డి రామమూర్తి తన 'సొద' అనే కవిత ద్వారా. శెలక ఆలకిన పొరక భుజ మెక్కిన భూమిలా ఉంది అంటాడు. మొత్తంగా పారిశుధ్య రంగాలలో ఎక్కువగా మహిళలు పనిచేయడం మూలంగా మొత్తం కవిత్వం మహిళ కేంద్రంగా రావడాన్ని మనం గమనించవచ్చు. పిట్టల శ్రీనివాస్ 'మరమనిషి' అనే కవితలో మనిషిని మనిషిగా చూడని నీకు గుళ్లె దేవుడొచ్చి గల్లీలున్న గలీజంతా/గంప నెత్తుకొని పోతడనుకున్నావా ?/తట్టల పొరకల తక్కువ చేస్తే .తస్మాత్ జాగ్రత్త అంటూ మట్టిమనుషుల పనులను తక్కువ అంచనా వేస్తే ఆ దేవుణ్ణి అయినా దిక్కరించిన ధిక్కార స్వరాలు ఎన్నో ఈ సందర్భంగా బయటకు వచ్చాయి. 'ఎలక్ట్రిక్ స్థంభాలకు తోబుట్టువులు లా చీకటిని ఊడ్చే వెలుగు దివ్వెలు వాళ్ళు అంటూ కొత్త కావ్యం రాస్తాడు బెల్లి యాదయ్య. 'నగరం నాచేతిలో పసిబిడ్డ/పట్నం అందంగా మెరిసే గాజు బొమ్మ/నా చీపురు థూ..అంటే ఏదైనా పెంటకుప్పె ఇది వేల ఏండ్ల రాచపుండు /సలుపుతున్న గాయాల నొప్పి అంటూ 'సఫాయి సవాల్' విసురుతాడు కేంద్ర సాహిత్య అకాడమి అవార్డు గ్రహీత పసునూరి రవీందర్.

బూతం ముత్యాలు సఫాయి సైరన్ ఊదాడు. వరకుమార్ గుండెపోగు 'గుండెలు రగిలి పొరకలు తిర్గలైనయ్', తాడో పేడో తేల్చుకుందాం అని సవాల్ విసిరాడు. 'మా ఊరి సాఫాయే సిఫాయి' అంటూ డ్రైనేజీ పారకం అందరికీ కనిపించే యుద్ధ భూమి/అక్కడ యుద్ధం చేయడానికి ఎవరూ సాహసించరు/ఆ సఫాయి మాత్రమే యుద్దానికి దిగుతాడు అంటున్నాడు గుండెడప్పు కనకయ్య. శుద్ధమైన ఆచేతులు శుద్ధి చేస్తున్న ఆ చేతులు, అన్నం పెట్టిన అంటరాని చేతులు/ఆయుధాలైన చేతులు, ఆయుధాలు ఇచ్చిన చేతులు/ పొరకలు పట్టి పోరుబాట పట్టినచేతులు అవి అంటాడు మోతుకూరి శ్రీనివాస్ 'ఆరెండు చేతులు' కవితలో. తుపాకి లేని సైనికులు పారిశుధ్య కార్మికులు,

మన ఆవాసాలను ఆరోగ్యాన్ని కాపాడుతున్న నిజమైన రక్షకులు వాళ్ళే అంటాడు గాదె వెంకటేష్. కేవలం నేను పైన పేర్కొన్న కవులు మాత్రమే కాకుండా పల్లికట్టు నాగరాజు, కొలిపాకశ్రీనివాస్, గద్దపాటిశ్రీనివాస్, పాండురంగం ప్రజాసింగం, మామిడిఅమరేందర్, చింతం ప్రవీణ్, మిత్ర, సంపతిసోమయ్య, చింతం ముత్యాలరావు, రాపాక సన్నీవిజయకృష్ణ, లాంటి ఎందరో కవుల కవితలను పారిశుధ్య కార్మికుల కష్టాల కొలిమిని కీర్తిస్తూ వారికి సంఘీభావ కవితా హారతి ఒక దగ్గర కూర్చి పేర్చిన తొలి సంపాదకుడు కొమ్ము సుధాకర్, మరియు గుంపు సాహితీ సంస్థ. కేవలం ఈ సంకలనం లో వచ్చిన కవితలే సమగ్రం అనుకోలేము. ఈ సంపాదకునికి తెలియకుండా అనేక మంది తమ కవితలను రాసారు. అనిల్ డాని, యాముల పల్లి నర్సిరెడ్డి, లాంటి వాళ్ళ కవితలు ఈ సంకలనంలో చోటుచేసుకోలేదు. చివరిగా మాకు రెండు చేతులే,మీకు రెండు చేతులే/ పుట్టుకకాదు ఖర్మ కాదు/సఫాయి మా పనికాదు. చీపుర్లను వదిలి పెట్టి గునపాలను చేతబట్టి/కూల్చుదాం కూల్చుదాం/ డ్రై లాట్రిన్ లను కూల్చుదాం /చేయూ చేయూ కలుపుదాం /మానవత్వం చాటుదాం. ఇటువంటి అమానవీయమైన వృత్తి లో ఉన్న వాళ్లను మిగతా సమాజం ఆదరించి వివక్ష చూపని రోజు రావడమే ఆవృత్తిలో ఉన్న లక్షలాది మంది కార్మికులు కోరుకుంటున్నారు. దాని దిశగా కవులు కళాకారులు మేధావులుకృషి చేయాలి.

**ఉపయుక్త గ్రంథ సూచి**

గీతా రామస్వామి,విమల మాకొద్దీ చండాలం : హైదరాబాద్ బుక్ ట్రస్ట్,హైదరాబాదు,2008

భగవాన్ దాస్.జి.వి రత్నాకర్(అను) నేను బంగీని. హైదరాబాదు బుక్ ట్రస్ట్, హైదరాబాదు,2011

కొమ్ము సుధాకర్(సం): సఫాయిలం. గుంపు సాహితీ సంస్థ, నల్గొండ. 2015

ఎండ్లూరి సుధాకర్. వర్తమానం (1985-1992). మానస ప్రచురణలు.రాజమండ్రి,1995.

********

# 33. గేయ సాహిత్యంలో సామాజిక స్పృహ

**డా|| హరీశ్ కుమార్ శ్రీధర**

సహాయాచార్యులు,

ప్రభుత్వ డిగ్రీ కళాశాల,

కోరుట్ల, జగిత్యాల జిల్లా, తెలంగాణ.

సెల్ 9491366356, 8919563503

వేగు :harish.sreedhara@gmail.com

**కీలక పదాలు:** తెలుగు సాహిత్యం,సామాజికత,ప్రాచీన గేయాలు, సామాజికోద్యమాలు, సంఘ సంస్కరణ,రైతాంగ పోరాటం, ప్రజా చైతన్యం,తెలంగాణా ఉద్యమం.

**అబ్ స్ట్రాక్ట్:** భాష ఎంత ప్రాచీనమైనదో, గేయం కూడా అంతే ప్రాచీనమైనదనటంలో ఎవరికీ సందేహం అవసరం లేదు. గేయానికి స్వరం, గతి ప్రధానం. 'వేదాలు' గేయ లక్షణాలు గలవే. సామవేదం సంగీత మాతృక అన్నది పెద్దలమాట.ఆత్మాశ్రయ ధోరణిలో సరళమైన భాషలో గానయోగ్యంగా ఉండే రచన గేయం. సుమారు 12 పంక్తుల నుండి 50`60 పంక్తుల వరకూ రచనలున్నాయి.

*''వాఙ్మాతురచ్యతే గేయం ధాతురిత్యభిధీయతే*

*వాచం గేయంచ కురుతేయ:స వాగ్గేయ కారక:''* (1)

అభినయానికీ, గానానికీ అనుకూలమైన రచనలని 'గేయం' గా పరిమితార్థంలో వాడబడినది. వాగ్గేయకారుల గేయ రచనలు వివిధ రకాలుగా (క్షేత్రయ్య`పదాలు, త్యాగయ్య`కీర్తనలు, అన్నమయ్య`సంకీర్తనలు) పిల్వబడినాయి. గేయం`గీతం`పదం`పాట ఇంచుమించు సమానార్థకాలుగా వాడబడినాయి.

సామాజికాంశాల స్ఫురణతో వచ్చిన గేయకావ్యాలు సాంఘిక, సంస్కరణోద్యమ గేయ కావ్యాలు. ప్రతి సాహితీ సృజనలో సామాజికాంశం స్పృశించబడుతుంది. ఉద్యమ సంబంధ గేయసాహిత్యంతో పాటు సాంఘిక దురాచారాలను, మూఢ నమ్మకాలను తొలగించడం ఇతరత్రా సామాజికాంశాలపై కూడా గేయ సాహిత్యం సమరాన్ని ప్రకటించింది.

**గేయకవిత్వం నిర్వచనాలు :**

''మాత్రా ఛందస్సు రూపంలో ఉన్న కవిత్వమే గేయకవిత్వం'' ` డా. జి.చెన్నకేశవరెడ్డి (2)

'' ఒక సంగీతవాద్యం సహాయంతో పాడుకునేందుకు వీలైన కవితా రూపమే గేయ కవిత్వం' ` ఎస్.ఎస్. నళిని.

''లయబద్ధమైన ఒక భావం పూర్తయి, వేరొక భావం మొదలైనప్పటికీ, విరుపులు సరిపెణలాగా నడుస్తూ ఉండే ఛందం గేయం అనబడుతుంది'' ` పి. రాజగోపాలనాయుడు (3)

ఆచార్య సి.నారాయణ రెడ్డి గారి, 'నాగార్జున సాగరం' పీఠికలో రాళ్లపల్లి గారి మాటల్లో గేయ స్వరూపం ఇలా వివరించబడిరది. ''లయామయమైన గణాలను పంక్తికి ఇన్ని అని లెక్కించి నడిపేది తాళం, సరిపెణ వలె అఖండముగా సాగిన ఈ నడకలో భావం ముగిసినప్పుడు కూడా విశ్రాంతికి చోటు లేదు. విశ్రాంతి తీసుకుంటే తాళం పటాపంచలవుతుంది.....'' ఇలా తాళలయ ప్రధానంగా గేయ కవిత్వం సాగుతుందని వివరించారు.

**ప్రాచీన సాహిత్యంలో గేయం :** తెలుగు సాహిత్యంలో 'గేయం' గురించి ప్రస్తావిస్తే, నన్నయ్యకు పూర్వపు దేశీ సాహిత్య రూపమంతా గేయ రూపకమే అనిపిస్తుంది. తుమ్మెద పదాలు, వెన్నెల పదాలు, గొబ్బి పదాలు మొ॥గు పద రూపాలు ` లాలిపాటలు, జోల పాటలు, ఊయల పాటలు మొ॥గు రకాల పాటలు సాహిత్యంగా వెలుగొందినట్లు వివిధ పరిశోధనల సారాంశం.

తొలి తెలుగు పద్యశాసనంగా భావిస్తున్న అద్దంకి శాసనం (పండరంగడు) తరువోజ ఛందములో ఉంది. ''తలకొని తలంబ్రాలు దంపెడు చోట తరుణులచే సొంపు దనకు తర్వోజ'' అని విన్నకోట పెద్దన 'తరవోజ'కి దంపుడు పాటల 'లయ' ఉంటుందని చెప్పాడు. కనుక శాసనస్తం కాక మునుపు నుండీ గేయాలు ప్రాచుర్యంలో ఉన్నాయనుట నిర్వివాదం.

నన్నె చోడుని 'కుమారసంభవం'లో అంకమాలికలు, ఊయల పాటలు, గౌతు గీతాలు మొ॥గు గేయరచనలని పేర్కొన్నారు. నాచన సోముని ''వసంత విలాసం''లోని''వీణాగానం వెన్నెల తేటా రాణ మీరగా రమణుల పాటా పేరు చెప్పిన పినబ్రాహ్మణు వీటా

జాణలు మెత్తురు జాజర పాటా....''ఈ జాజర పాటయే తొలి గేయమని జి. చెన్నకేశవరెడ్డి గారి అభిప్రాయం. ఇకపోతే, కవి సార్వభౌముడైన శ్రీనాథుడు తన భీమేశ్వర పురాణంలో ''కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు గాంధర్వమున యక్షగాన సరణి'' అని యక్షగానాన్ని పరిచయం చేయుటయు, భీమనాథుని ఎదుట ''జాజుర... జాజురంచు .... భీమనాథునిన్'' అంటూ జాజర పాటలతో భీమేశ్వరుణ్ణి స్తుతించినట్లు తెలుస్తుంది. తన క్రీడాభిరామంలో కూడా పలు రకాల గేయ ఫణితులను పరిచయం చేశారు.

ఇలా ప్రాచీనాంధ్ర సాహిత్యంలో రగడలు, గేయకావ్యాలు, ఉదాహరణ కావ్యాలు, యక్షగానాలు, దండకాలు, సంకీర్తనలు, పదాలు ఇలాంటివన్నీ గేయరచనలే శ్రీనాథుని 'పల్నాటి వీరచరిత్ర' ఆశువుగా చెప్పబడిన గేయ కావ్య రచన. కాగా ఇతరుల అనేక ఉదాహరణ కావ్యాలు గేయకావ్యాలే.

తెలుగు సాహిత్యం కృష్ణమాచార్యులు రాసిన ''సింహగిరి వచనములు''తో వచన విభాగంలోకి అడుగుపెట్టింది. అయితే వచనంలో కూడా గానయోగ్యమైన వచన రచన చేయటం తెలుగు సాహితీ వేత్తలకే చెల్లుబాటయిందని చెప్పవచ్చు. గంగాధరయ్య వచనాలు, శంకరవచనాలు, కాలజ్ఞాన వచనాలు... ఇలా అనేకానేకం.

అన్నమాచార్యుని కీర్తనల్లోనో, రామదాసు కృతుల్లోనూ, కొన్ని సామాజికాంశాలు కనిపించినా, గేయ సాహిత్యాన్ని పామర రంజక సాహిత్యంగా పరిగణించి, చిన్నచూపు చూసినట్లే అనిపిస్తుంది, గేయ సాహిత్యానికి విశేషమైన ఆదరణ, విశిష్టత దక్కింది. ఆధునిక సాహిత్యం ప్రారంభమయ్యాకే.... గేయం వివిధ ఉద్యమాల పేరున సామాజిక గొంతుకగా మారిన కాలం ఆధునిక సాహిత్య కాలమే.

**ఆధునిక సాహిత్యం ` గేయ కవిత్వ వికాసం :**

ఆధునిక తెలుగు సాహితీ యుగకర్తలుగా పేరొందిన వారు గురజాడ అప్పారావు గారు మరియు రాయప్రోలు సుబ్బారావు గార్లు. గురజాడ అప్పారావు గారి ''ముత్యాలసరాలు'' కంటే ముందుగా మంగిపూడి వేంకటేశ్వర శర్మ గారు రాసిన 'మాలవాంద్ర పాట' మొదటి సామాజిక చైతన్య స్ఫూర్తిని నింపే గేయంగా గుర్తించారు. (4)

'' అందారు పుట్టిరి హిందమ్మ తల్లికి అందారు ఒక్కటై ఉండాలి సక్కంగా

కష్టమ్ములొచ్చిన నిష్ఠూరమొచ్చిన ఇష్టమ్ముగా నుండి కట్టూగనుందాము'' ....

వస్తువు ` అస్పృశ్యతా నివారణ, భాష`ఆధునిక వ్యవహారికము, నిజంగా సామాజిక చైతన్య తాత్త్వికతకు పురుడు పోసింది గేయమే.

''తెలుగులో నవ్యరీతులకు, నూతన ప్రమాణాలకు ప్రయత్నించిన మొదటి కవినినేనే. నా కావ్య కళ నవీనం. కావ్య ఇతి వృత్తాలు భారతీయం, జీవితాన్ని నూతన దృక్పథంతో దర్శించి కథా, కవిత రూపంలో దాని తత్త్వాన్ని అన్వయించడానికి ప్రయత్నించినారు'' (5) అని గురజాడ గారే రాసుకున్నారు.

నిజమే మరి... '' ఆధునిక వస్తువునెంచుకున్న కవులెందరున్నా ఆధునిక గేయ కావ్యానికి ఆద్యుడిగా గురజాడనే చెప్పవచ్చు'' నిజానికి గురజాడ గారు గేయ ఛందస్సును ఎంచుకోవడానికి ప్రధాన కారణం వ్యవహారిక భాషా ఉద్యమమే. తెలుగు సాహిత్యం పద్యం నుండి ఆధునిక గేయంవైపు దారి మళ్లించటం ద్వారా సాహసోపేతమైన ప్రయోగాన్నే చేసి సఫలీకృతుడైనాడు. గురజాడ గారి ''ముత్యాలసరాలు'' సామాజిక చైతన్యాన్ని రగల్చడానికి ఎంతగా ఉపయోగపడ్డాయో సాహిత్యం తెల్సిన ప్రతి సుజనుడికీ విదితమే. అలాగే ''నీలగిరి పాట'' ల్లో సంగీత సాహిత్యాల సమ్మేళనంతో అద్భుతమైన రచనా కౌశలాన్ని ప్రదర్శించారు.

## సామాజికోద్యమాల్లో గేయం :

తెలుగు సాహిత్యంలో గేయ కవిత్వం ఉద్యమంలాగా వచ్చిన సందర్భం భావ కవితాయుగమే. భావకవిత్వం రాసిన రచయితలందరూ దాదాపుగా తమ రచనలకు గేయ ప్రక్రియనే సాధనంగా ఉపయోగించారు. కథాత్మక, ప్రణయ, ప్రకృతి, దేశభక్తి, సాంఘిక, సంస్కరణోద్యమ, స్మృతి మొ॥గు అంశాల ప్రాతిపదికన గేయకావ్యాలు వెలువడినాయి. ఒక్కోరంగానిది ఒక్కో ప్రత్యేకశైలి.

సామాజికాంశాల స్ఫురణతో వచ్చిన గేయకావ్యాలు సాంఘిక, సంస్కరణోద్యమ గేయ కావ్యాలు. ప్రతి సాహితీ సృజనలో సామాజికాంశం స్పృశించబడుతుంది. అయితే వైయుక్తిక మానసిక స్థితిలో నుండి దర్శించే గేయ కవిత్వం జాతీయోద్యమ కవిత విస్తృతికి, ఆంధ్రోధ్యమ విస్తృతికి దోహదం చేసింది.

''జయ జయ భారత జనగణ మాతా సాధు జన స్తుత చరిత ....... (మంగపూడి వేంకటేశ్వర శర్మ)

ఇలాగే దేశభక్తి ప్రబోధాత్మక గేయాల్లో సుస్థిరమైన స్థానాన్ని పొందిన రెండు గేయాలు.

1) గురజాడ గారి ''దేశమంటే మట్టి కాదోయ్....'' (దేశభక్తి`ముత్యాలసరాలు)

2) రాయప్రోలు గారి ''ఏ దేశమేగినా ` ఎందుకాలిడినా.....'' (జన్మభూమి ` ఆంధ్రావళి)

దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి ''జయ జయ జయ ప్రియభారత ` జనయిత్రీ దివ్యధాత్రి'' నేటికీ అశేష ప్రజల నాలుకల మీద గుర్తించే ప్రబోధాత్మక ''జాతీయగీతం''. ఇలాంటి దేశభక్తి గీతాలు, జాతీయ పతాకాన్ని గౌరవిస్తూ, జలియన్ వాలాబాగ్ దురంతాన్ని వస్తువుగా స్వీకరించి, సహాయ నిరాకరణోద్యమాన్ని ప్రేరణగా భావించి ఇతర స్వాతంత్రోద్యమ సంఘటనలను, సందర్భాలను పురస్కరించుకొని ఆ కాలపు సాహితీ వేత్తలు స్పందించి కదనశంఖం పూరించారు. దానికి గేయాన్ని వాహికగా వాడుకొని సాధారణ ప్రజానీకం మరింత చైతన్యవంతం కావడానికి వీరి రచనలు దోహదం చేశాయి.

## సంఘ సంస్కరణ `గేయ కవిత్వం :

ఉద్యమ సంబంధ గేయసాహిత్యంతో పాటు సాంఘిక దురాచారాలను, మూఢ నమ్మకాలను తొలగించడం ఇతరత్రా సామాజికాంశాలపై కూడా గేయ సాహిత్యం సమరాన్ని ప్రకటించింది.మొదట్లోనే చెప్పినట్లు సామాజిక దురాచారాల ఖండనకు గేయాలను పదునైన ఆయుధంగా వాడిన మహనీయుడు గురజాడ. ''ముత్యాలసరాలు'' లోని 'తోకచుక్క' లో మూఢ విశ్వాసాలపై ఆయన ప్రకటించిన యుద్ధం ` ''మనిషి'' కవితలో మానవత్వాన్ని వివరించిన విధానం అనన్య సామాన్యం, అద్వితీయం.

మద్యపాన నిషేధాన్ని సమర్థిస్తూ వచ్చిన గేయరచనల సంకలనం 'మద్యపాన నిషేధ సంకీర్తనలు''. దీన్ని సంకలనం చేసినవారు ఎన్. వెంకయ్యగారు, గరిమెళ్ళ సత్యనారాయణ గారు రచించిన ''కల్లు మానండోయ్'' గేయం సుప్రసిద్ధమైనది.

'' కల్లు త్రాగి నీ యిల్లు నెల్ల ` గుల్ల చేయకు నీ వళ్ళు రోగాల కెల్ల ` వడ్డి కీయకు ''కల్లు త్రాగి''........

స్వాతంత్రోద్యమంతో సమాంతరంగా వచ్చిన సామాజికోద్యమం అస్పృశ్యతా నివారణ ` హరిజనోద్యమం. దీని ప్రేరణతో అనేక గేయాలు వచ్చాయి. నెల్లూరు వెంకటరామనాయుడు దళితుల స్థితి గతులను గురించి వివరిస్తూ,

'' మాల మాదిగ వారి నుండి మమ్ము / చాలగ ప్రేమించి`పాలింప రండి'' ... అంటూ రాసారు.

గురజాడ అప్పారావు గారు 'ముత్యాల సరాలు' లో చెప్పిన

''మలిన దేహుల మాలలనుచు / మలిన చిత్తుల కథిక కులముల నెలవొసంగిన వర్ణధర్మమ / ధర్మ ధర్మంబే.....''

సామాజిక అసమానతలపై ఎక్కుపెట్టిన విమర్శనాస్త్రమే. అలాగే మంచి, చెడులు అన్నవి రెండే కులాలున్నాయనీ, మంచియన్నది 'మాల' అయితే తాను 'మాల' అవుతానని అంటాడు గురజాడ.

**తెలంగాణ ` గేయ కవిత్వం :**

తెలంగాణ గేయ సాహిత్యాన్ని విస్తృతి దృష్ట్యా రేఖా మాత్రంగా పరిచయం చేస్తాను.పాటని శ్రమ సౌందర్య సూచిగా నిర్వచించారు సుద్దాల అశోక్ తేజ.

''టప టప టపట సెమబొట్లు తాళాలై పడుతుంటే/కరిగే కండరాలే నరాలే స్వరాలు కడతుంటే/పాట పనితో పాటే పుట్టింది / పనీ పాటతోటే జతకట్టింది''

తెలంగాణా రైతాంగ సాయుధ పోరాట విస్తృతికి, ప్రజా చైతన్యానికి పాట చేసిన మేలు అంతా ఇంతా కాదు.

''లేవీ దాన్యంచివ్వ వలదన్నా సర్కారు వారికి / లేవీ గొల్చితే కరువు పోదన్నా'' ....కూలీలు దోచుకొని భూసామి / కలిసొచ్చెనంటాడు సామి''అలాగే, వెట్టి చాకిరికి వ్యతిరేకంగా సుద్దాల హనుమంతు గారు రాసిన''పల్లెటూరి పిలగాడా ` పసులుగాసే మొనగాడా పాలు మరిసి ఎన్నాళ్లయిందో... ఓ పాలుబుగ్గల జీతగాడా...పనిలే కుదిరి ఎన్నాళ్లయిందో...'' అంటూ అప్పటి బాలకార్మిక వ్యవస్థపై తన నిరసనను తెలియజేశారు.

తెలుగు సాహిత్యంలో 'పాట' ఉద్యమంగా మారింది. కమ్యూనిస్టు భావజాలంలోనే 'పాట'లో సంగం స్ఫూర్తితో తిరుగుబాటు పాటలు మొదలైనాయి.''బందగి రక్తం ` చిందిన క్షేత్రం బలిదానాలకు వెరువని క్షాత్రం'' వంటి పాటలు ప్రజల నోళ్లల్లో నానాయి. 1944 లో యదగిరి గారు రాసిన,బండెనుక బండిగట్టి ` పదహారు బండ్లు గట్టి ఏ బండై పోతవు కొడుకా ` నైజాం సర్కరోడా'' గేయం ఎంతగానో స్ఫూర్తినింపింది.

దొడ్డి కొమురయ్య అమరుడైన సందర్భంలో,''అమరజీవి నీవు ` కొమురయ్యా / అందుకో జోహార్లు ` కొమురయ్యా''

లాంటి పాటలు సానుభూతితో పాటు ఉద్యమ స్ఫూర్తిని నింపడానికి దోహదంచేశాయి.

తెలంగాణా తొలిదశ ఉద్యమంలో''వీరులకు కాణాచిరా ` తెలంగాన ధీరులకు మొగసాలరా'' అంటూ రావెల్లి వెంకట చినరామారావు గారు ప్రేరణ కలిగించే గేయాల్ని రచించారు.''ఇది నా తెలంగాణ సంజీవదీవి రా.....'' ''అమ్మా! ఇక నన్నాపకు....'' ఇలాంటి పాటలు కోకొల్లలు. యస్వీ, రుక్నుద్దిన్, అనుముల శ్రీహరి, గద్దర్.... ఇతరత్రా గేయకులెందరో...

మధ్యలో వచ్చిన విప్లవ యుగంలో ''విప్లవాల యుగం మనది ` విప్లవిస్తే జయం మనది'' వంటి చెరబండరాజు లాంటి వారి సాహిత్యం ఉద్యమాల సత్తువను సజీవంగా ఉంచింది. తదనంతర దళితోద్యమం ''మంచి మంచి మల్లేలేరి మల్లెపూల దండాలేత్తుమో....'' అంటూ అంబేద్కర్ స్తుతిని, దళితులకు జరిగిన అన్యాయాన్ని ప్రశిస్తూ వచ్చిన గేయాలు అనేకం.

ఇక మలిదశ తెలంగాణా ఉద్యమానికి జవ జీవాల్నిచ్చింది సాహిత్యమే. ప్రత్యేకంగా గేయాలే. ''జయ జయహే తెలంగాణ.....'' అంటూ అందెశ్రీ రాసినా, ''నాగేటి సాలల్ల నా తెలంగాణ'' అంటూ నందిని సిధారెడ్డి గారు రాసినా, ''నా తల్లి తెలంగాణరా! తిరగబడ్డ భూమిరా! ''అంటూ, ''పొడుస్తున్న పొద్దుమీద నడుస్తున్న కాలమా పోరు తెలంగాణమా!!'' అంటూ గద్దర్

గాం(డ్రిరచినా, గోరేటి వెంకన్న ''ఇద్దరం విడిపోతే భూమి బద్దలవుతుందా'' అన్నా. పుడితె ఒక్కటి, సత్తె రెండు (గూడ అంజన్న), అసై దులా హోరతి... (కోదారి శ్రీను), అయ్యోనివా అవ్వోనివా (గూడ అంజన్న), వీరులారా వందనం (దరువు ఎల్లన్న), రాతి బొమ్మల్లోన కొలువైన శివుడా! (మిట్టపల్లి సురేందర్), దేశపతి శ్రీనివాస్, రసమయి బాలకిషన్, భూపాల్, అంబటి ఎంకన్న, శరత్.... ఇలా చెబుతూ పోతే తెలంగాణ ఉద్యమ సాహిత్యంలో పాట ఒక ప్రత్యేక సిద్ధాంత గ్రంథమే. ప్రతి ఇల్లు పాటశాలే.... ప్రతి గొంతుకలో గేయం మార్మోగింది.

**ఉపసంహారం :**

చివరగా తెలుగు సాహిత్యం, సామాజికాంశాల్ని నిరంతరం స్పృశిస్తూనే ఉంది. సాహిత్య ప్రయోజనాల్లో ఆనందం, ప్రబోధం ప్రధానాలు. మోక్ష సాధనం కూడా. సామాజికాంశాల ప్రభావం లేని సాహిత్యం కొయ్య బొమ్మలాంటిదే. బహుశా జీవం లేని సాహితీ సృజనను ఏ రచయితా ఇష్టపడదు. ఎందుకంటే కావ్యాన్ని సృష్టించడమంటేనే ప్రాణం పెట్టి ప్రాణం పోయడం సాహిత్యం ` సమాజం పరస్పరాధారాలు. అన్ని భాషల్లో లాగానే తెలుగు సాహితీ ధురీణులు కాలానుగుణంగా సామాజికాంశాలకు ప్రతిస్పందించి ప్రజలను చైతన్యవంతం చేయటంలో సఫలీకృతులైనారు. ఇలాంటి వారసత్వమే నిరంతర చైతన్య స్రవంతిలా ప్రవహిస్తూ సమాజానికి తోడ్పడే రచనలందిస్తుందని ఆశిద్దాం.

**ఆధార గ్రంథాలు:**

1.శారఙ్గదేవుడు`సంగీత రత్నాకరం ( ప్రకీర్ణాధ్యాయం) లో వివరించినట్లుగా ''ఆధునికాంధ్ర గేయకవిత్వం''లో జి. చెన్నకేశవరెడ్డి గారు ప్రస్తావించారు.

2. జి. చెన్నకేశవరెడ్డి -ఆధునికాంధ్ర గేయకవిత్వం జయమిత్ర పబ్లికేషన్స్, హైదరాబాద్, 1988

3. పాటల్లో ఛందస్సు ` పి. రాజగోపాలనాయుడు

4.నారాయణరెడ్డి,సి.(2001).*ఆధునికాంధ్రకవిత్వము,సంప్రదాయములు; ప్రయోగములు*, విజయ్ పబ్లికేషన్స్, హైదరాబాద్.

5.గురజాడ అప్పారావు- లేఖలు-(1958)-విశాలాంధ్ర ప్రచురణలు,విజయవాడ.

*******

# 34. మానవ మనస్తత్వం- సామాజిక స్పృహ : పాలగుమ్మి పద్మరాజు

జాతీయ సదస్సు :: (13 & 14/03/2024 )

**Dr. ఈ. మురళీధర్,**

శ్రీ వెంకటేశ్వర డిగ్రీ & పీజీ కళాశాల,

అసోసియేట్ ప్రొఫెసర్,

అనంతపురం.

Cell: 9491355447

e.muralidhar5@gmail.com

మనిషి సంఘజీవి. తన సుఖ సంతోషాల కోసం తన చుట్టూ నీతి నియమాలు, ఆచార వ్యవహారాలు, మంచి , మర్యాదలు అలవాట్లు, స్నేహాలు అనే గోడలతో ఒక కోట ఏర్పాటు చేసుకుంటాడు. వీటిని పాటిస్తూ తాను ఒక మంచి వ్యక్తిగా నిరూపించుకోవడానికి ప్రయత్నిస్తాడు. కానీ గాలి వాన వస్తే ఆ గోడలు బీటలు వారాయి, కోట కూలిపోతుంది. అతని అసలు మనస్తత్వం బయటకు వస్తుంది. ఇది ప్రధానంగా గాలివాన ద్వారా కొన్ని అంశాలను వాటి విశేషాలను ఈ కథానిక తెలియజేయడం జరుగుతుంది.

మనిషి తాను సుఖంగా, సౌకర్యవంతంగా ఉండాలనుకుంటాడు. దానికి ఎవరైనా ఆటంకం కలిగిస్తే ఇబ్బంది పడతారు. తప్పదనుకుంటే ఇష్టం లేకపోయినా సర్దుకుంటాడు. ఈ కథలో రావు గారు రైలు పెట్టెలోకి ఎక్కేటప్పటికీ అక్కడ ఉన్న నలుగురు పోకిరి వెధవలు అక్కడ ఉన్న సీట్లను ఆక్రమించుకుంటారు. రావు గారు ఎక్కేసరికి ఆ నలుగురు చిరాకు పడుతున్నట్లు ముఖాలు పెట్టారు. రావు గారు వేరే పెట్టెలోకి వెళ్లే ప్రయత్నం చేయకపోయేసరికి వారిలో ఒక పెద్ద మనిషి పరుపు కొంచెం మడిచి రావు గారికి కాస్త చోటు ఇచ్చాడు. రైలు పెట్టెలు సిగరెట్లు తాగని వారికి ఆ పొగ పడదు. ఆ యువకుడు సిగరెట్లు తాగుతున్న, అది మంచిది కాదని రావు గారు చెప్పలేకపోయారు. అది సంస్కారం కాదని ఊరుకున్నాడు.

రావు గారికి చాలా నియమాలు ఉన్నాయి. మనిషి నడవడిని దిద్దడానికి నియమాలు ఉండాలని అభిప్రాయం కలవాడు. తను క్రమ పద్ధతిని పాటిస్తాడు. తన ఇంట్లో వాళ్ళు వాళ్లను కూడా నియమాలు పాటించేటట్లు చేస్తాడు. అలా ఉండడం వల్ల మనసుకు, శరీరానికి, శాంతి సుఖం చేకూరుస్తాయని ఆయన అనుకుంటారు. రావు గారికి ఎవరినైనా అడగాలంటే కాస్త భయం. బిక్షం ఎత్తుకోవడం వారి పట్ల, రావు గారికి సానుభూతి లేదు. బిక్షం ఎత్తుకోవడం తప్పు అని ఆయన అభిప్రాయం. వారికి సహాయం చేయకూడదని ఆయన వినయంతో , రైలు పెట్టెలో నుంచి దిగేటప్పుడు గాలి వేగానికి తూలిపోయాడు. తన సామాను తీసుకురావడానికి ముష్టి దానికి అనుమతి ఇచ్చాడు. ఆమె సామాను తెచ్చి వెయిటింగ్ రూమ్ లోనికి తీసుకువచ్చింది. ఇక్కడ అవసరం అతని నియమాన్ని బంధం చేసింది. అలాగే రైలు పెట్టెలో ముష్టి మనిషికి సహాయం చేయకుండా పో అని కసురుకున్నాడు. రావు గారు వెయిటింగ్ రూమ్ లో తన సామాను ఉంచినందుకు కాస్త డబ్బు ఇచ్చాడు. ఇక్కడ అతనికి అవసరం. అతనికి ఇష్టం కాని పని తన మనస్సు చేయించింది. కానీ అవసరం కోసం ఆయన ఆమెకు సహాయం చేశాడు. చనిపోయిన చూడలేక తన దగ్గర ఉన్న వస్త్రాన్ని ఇచ్చి ఇదిగో తలను తుడుచుకో అని చెప్పాడు. ఆకలితో ఉంటే చూడలేక జాలిపడి కొన్ని బిస్కెట్లు పెప్పర్మెంట్లు నొప్పి ముష్టిఆవిడకు ఇచ్చాడు. ఇవి అందమైన ముసుగులు తప్ప వాస్తవాలు కావు. ప్రతి మనిషి సక్రమంగా జీవితం సాగుతూ1 ఉన్నత కాలం ధర్మధర్మాలను గురించి ఆలోచిస్తాడు. ధర్మ చింతన ఉండాలని బోధిస్తాడు. ఆ ధర్మం అంతరాత్మ సహించకూడదని అని అంటాడు.

రావు గారు ముష్టి మనిషిని చూసినప్పుడు ఆమెకు ధర్మాధర్మ చింతనతో బాధపడే అంతరాత్మ లేదని అనుకున్నాడు. కానీ కుటుంబం అంతా శాసించి క్రమశిక్షణలో ఉండే రావు గారు వకీలుగా ఉంటూ, కోర్టులో ధర్మాన్ని కాపాడే రావు గారు భార్యా పిల్లలు ఉన్న, రావు గారు గాలివాన ఆ రాత్రి ముష్టి మనిషి కౌగిలిలో కరిగిపోయాడు. అప్పుడు అతనికి అది అధర్మం అనిపించలేదు అతని అంతరాత్మ అప్పుడు ధర్మ ధర్మాలు కనిపించలేదు. మనుషులు తప్పులు చేస్తారు, దానిని గురించి మాట్లాడుతారు. ఇతరులు అదే తప్పు చేస్తే దానిని విమర్శిస్తారు, ప్రచారం చేస్తారు. రావు గారు ఆమెను చూచి జాలి పడ్డాడు. మరి ఆరోజు సాయంత్రం వర్షం భయంకరంగా కురుస్తున్నాడుముతో గాలివాన ఎక్కువ అవడంతో రావు గారు భయపడ్డారు. మరి ముష్టి మనిషి రావు గారిని చూసి ఇది చిన్న పాటి గాలివాన అయ్యా అని అన్నది. ముష్టి మనిషిలో ఉన్నటువంటి ధైర్యం రావు గారిలో కనపడలేదు. రావు గారు వెయిటింగ్ రూములు నిద్రపోవటం జరిగింది. మరి ముష్టిమనిషి కూడా ఒక మూలన నిద్రపోవడం జరిగింది. రావు గారు ఆమెను చూచి కొంత బాధపడ్డాడు. ముష్టి మనిషి బిక్షం అడుక్కుంటూ జీవితం గడిపేది. ఉదయానే తెల్లవారిన తరువాత వాన తగ్గింది, రావు గారు తెల్లవారిన తర్వాత లేచి చూశాడు, జేబులో తడుముకున్నాడు.

అక్కడ ముష్టి మనిషి కనపడలేదు, దొంగముండ అనుకుంటూ ఎక్కడికో వెళ్ళిపోయింది, అని మనసులో అనుకున్నాడు. గదిలో ఆమె కనిపించలేదు బయటికి వచ్చి చూస్తే టికెట్ ఇచ్చే గది కూలిపోయింది. అక్కడ ఏదో ఒక శరీరం కనిపించింది. దీపం వెలిగించి చూస్తే ముష్టి మనిషి. రావు గారు ముష్టి మనిషిని చూసి తట్టుకోలేక పోయాడు. శరీరం చల్లగా ఉంది, చివరికి ఆమె చచ్చిపోయింది. తన ఒక చేతిలో బిస్కెట్ , మరో చేతిలో నోట్లు ఉన్నాయి, అంటే అది టికెట్లు అమ్మిన డబ్బు. రావు గారు ఏడ్చారు. తనకు ఆత్మస్థైర్యాన్ని,శాంతిని, శక్తిని కలిగించిన ఆమె, ఇప్పుడు చనిపోయింది. ఆయన ఆమెను దూషించలేదు. రావు గారి విలువలు, నియమాలు, వేదాంతం అన్ని ఆమె బ్రతికితే విడిచిపెడదాం అని మనసులో అనుకున్నాడు. కానీ మనుషులు దగ్గరవుతున్న చప్పుడు అక్కడ వినిపించింది. ఆమె చేతిలో డబ్బులు అక్కడే ఉంచి వెళ్లిపోయాడు. ఆమె దొంగతనం చేసినట్లు ఉండకూడదని పర్సులో నుంచి తన పేరు ఉన్న కార్డును తీసుకున్నాడు. తనకు సంబంధించిన ఒక గుర్తుగా ఆమె దగ్గర ఉండాలని చేతిలో ఉంచి అక్కడ నుంచి వెళ్ళిపోయాడు.

గాలి వాన కథానికలో ముష్టి మనిషి రావు గారిని పూర్తిగా నియమాలు,నిబంధనలు, వేదాలు అన్ని మార్చివేసాయి. తాను పొమ్మని విసుకున్న, అంతటి గాలివానలో తనకు తోడుగా తనకు సహాయం ఉండి,తనకు ధైర్యం ఇచ్చిన ముష్టి మనిషిని ఆయన మనసు అంగీకరించింది. రావు గారి పాత భావాలు కొట్టుకుపోయాయి. అవసరములో సహాయంగా నిలవడమే మానవత్వం అని తెలుసుకున్నాడు. తన నీతి నియమాలు, క్రమశిక్షణ, అలవాట్లు, ఆలోచన తప్పవని తెలుసుకున్నాడు. ధర్మాలు నియమాలు, అబద్ధమని గ్రహించాడు. ఒకరోజు ముష్టిది అతనికి జ్ఞానోదయం కలిగించింది. ఆమె అతనిని మనిషిగా మార్చి మానవత్వం తట్టి లేపే చివరికి తాను మరణించింది.

********

# 35. బాస్టర్డ్ - సామజిక స్పృహ

**డా.పి. నీరజ**

పి.బి . సిద్ధార్థ ఆర్ట్స్ & సైన్స్ కళాశాల

విజయవాడ..

చరవాణి :8374865621

Mail Id:neerajapenumaka.1980@gmail.com

**అబ్స్ ట్రాక్ట్**

పవిత్ర వృత్తిగా భావించే వైద్య వృత్తిని చేపట్టిన డాక్టర్లు సమ్మెకు ముందు మానవతాదృష్టితో ఒక్కసారి ఆలోచించటం అవసరం.

**పత్రం**

రచయితకు సమాజంతో ఉండవలసిన సంబంధం ఏమిటి? అందరి వ్యక్తులుగానే రచయిత కూడా సమాజంలో మనిషి. అయితే అతను మనిషి తో పాటు, రచయిత కూడా .కనుక అతనికి సామాజిక బాధ్యత తప్పనిసరిగా ఉండాలి. ఏ రచయితలైన ఉండవలసిన ముఖ్య లక్షణం. సునిశిత బుద్ధి ,సూక్ష్మ పరిశీలన. రచయిత తన చుట్టూ ఉన్న సమాజాన్ని పరిశీలించాలి. .అప్పుడు మాత్రమే ప్రజలకు ఉపయోగకరమైన రచన చేయగలడు. ఆ రచన ద్వారా మంచిసందేశాన్నిప్రజలకుఅందించగలడు.సమాజానికి,రచయితకి అవినాభావ సంబంధం ఉంటుంది .సమాజంలో నుంచే కథలు పుట్టుకొస్తాయి. గొల్లపూడి మారుతి రావు నిత్యజీవితంలోని వాస్తవ సంఘటనలకు కథల రూపాన్నికల్పించారు .ఇదే విధంగాతమకు తారసపడ్డ వ్యక్తులను ఆయా కథలలో పాత్రలుగా చిత్రించారు. "తాను రాసిన కథలన్నిటికీ వాస్తవాలు ఉన్నాయని, సమాజంలో తన చుట్టూ ఉన్న వ్యక్తులనే పాత్రలుగా మలిచానని చెప్పారు "

సంజీవరావుకి, పద్మకి పెళ్లైయి ఎనిమిది సంవత్సరాలయింది. పద్మ కడుపుతో ఉందని తెలిసి పుట్టని కొడుకు కోసం ఇద్దరూ కలిసి స్వెట్టర్ అల్లారు . వీళ్లిద్దరూ ఆనందంగా గడుపుతూ ఉండగా ఒకరోజు ఉన్నట్టుండి బ్రాందీ తాగాలని ఉందని పద్మ ,సంజీవరావుతో అనగా ,వీళ్ళిద్దరూ కలిసి చెరో పెగ్గు త్రాగారు. ఇద్దరు క్రొత్తగా బ్రాందీ తాగటం వల్ల సంజీవరావుకి వాంతులు అయ్యాయి. పద్మకి అబార్షన్ అయ్యింది .పద్మ కడుపులో బిడ్డ నాలుగు నెలలు మాత్రమే బ్రతికాడు. (ముఖాముఖి -గొల్లపూడి మారుతీ రావు చెన్నై Date 06.04. 2009)

ఇంతలో పద్మకి టైఫాయిడ్ వచ్చింది. పద్మ ని సంజీవరావు టైఫాయిడ్ నిన్ను శలకలాగా తయారు చేసిందని ఏడిపించేవాడు .నాకు కొడుకు కావాలి .నేను ఎలా తయారైతే నీకు నచ్చుతానో చెప్పు అనేది పద్మ .మళ్లీ పద్మగర్భం ధరించింది .పద్మ సంజీవరావు కలిసి తిరుపతి వెళ్లారు .పద్మ గుండు గీయించుకుంది .సరిగా 12 రోజులకి పద్మ కి అబార్షన్ అయింది .పద్మ ఆత్మహత్యకు ప్రయత్నించటం ,సంజీవరావు కొడుకు పోయిన బాధతో ఉన్నప్పటికీ భార్యను కాపాడుకున్నాడు .నెమ్మదిగా పద్మ మత్తు మందులకు అలవాటు పడింది .ఈ విషయం ఆలస్యంగా తెలిసిన సంజీవరావు డాక్టర్ ని సంప్రదిస్తాడు. పద్మ మత్తు మందులకు అలవాటు పడిందని, మత్తు మందులు వాడాలని లేకపోతే, గర్భమన్న దాల్చాలని డాక్టర్లు చెప్పారు.

సంజీవరావు పద్మను చూసినప్పుడు రేప్ చేస్తున్న వాడిలాగా బాధపడేవాడు నాకు కొడుకు నీవు నిన్ను పువ్వులలో పెట్టుకుని చూసుకుంటానని మనసులో అనుకునేవాడు సంజీవరావు .పద్మగర్భం ధరించింది. దేవుళ్ళకు పూజలు చేశారు .బ్రాందీ తాగాలని ఉందని పద్మ సంజీవరావుతో అనగా బ్రాందీలో సోడా ఎక్కువ కలిపి తాగించాడు .పద్మ ఏడవ మాసం గర్భిణీతో ఉండగా ఒకరోజు రక్తస్రావం

జరిగింది. పద్మలో తెల్ల రక్త కణాలు తగ్గిపోవడం ప్రారంభించాయి. సెప్టెంబర్ 28వ తారీఖు రాత్రి 12 గంటలకు మరల పద్మకు రక్తస్రావం అయింది. నిలోఫర్ ఆసుపత్రికి తీసుకువెళ్లాడు .కానీ అప్పటికే 48 గంటల ముందు నుండి తమ తోటి డాక్టర్ కు జరిగిన అన్యాయానికి అందరూ సమ్మె చేస్తున్నారు .డాక్టర్లను బ్రతిమిలాడిన రాలేదు. 38 రోజులు ఈ భుట్టోగాడు ముందుగా పుట్టాడు. తల్లి బిడ్డ పేగు ని ఎవరు కత్తిరించలేదు . ఆ పేగును కత్తిరించడానికి కేవలం గంటన్నర ఆలస్యంగా ఒక ముసలి మంత్రసాని కత్తిరించింది. అప్పటికే మాంసం ముద్దతో ఉన్నాడు .ముందుగా పుట్టడం వల్ల ఈ ప్రపంచం సరిగా ఆహ్వానించలేదు .డాక్టర్లు వాళ్ళ ఆత్మగౌరవం కాపాడుకోవడానికి సమ్మె చేస్తున్నారు .ఎలా ఉన్నాడు అబ్బాయి అని పద్మ అడిగితే మాంసం వద్ద లాగా ఉన్నాడని చెప్పడానికి సంజీవరావుకి నోరు రాలేదు.

ఈ కథ చదివితే ప్రపంచం బాగుపడుతుంది. ఈ కథ చదివిన ఏ డాక్టర్ సమ్మె చేయడు . మంత్రుల చేత, ప్రభుత్వ అధికారుల చేత ఈ కథ చదివిస్తే కనీసం 50% అయినా బందులు రాస్తారోకులు చట్టపరంగా నిషేధించబడ్డ బడతాయి. శృంగారం పాలు అంటే ఇది పచ్చి శృంగారం కాదు .భార్య మీద బిడ్డ మీద ప్రేమ అనే అమలిన శృంగారం. కొంచెం తగ్గించి ఉంటే పాఠ్యాంశంగా ఎంబిబిఎస్ కోర్స్ లో ఉండదగిన కథ .ఇది చదివాక కూడా ఏ డాక్టర్ అయినా సమ్మెలో పాల్గొంటే వాడు "వైద్యో నారాయణో హరి " తగడు. .

పనికి తగిన వేతనాన్ని కోరే విషయంలో కాని ,ఇతర సమస్యలను పరిష్కరించడానికి కాని సమ్మె చేయడంలో తప్పులేదు. అయితే ఎంతో పవిత్ర వృత్తిగా భావించే వైద్యవృత్తి చేపట్టిన వారు సమ్మెకు పూనుకునే ముందు మానవతా దృష్టితో ఒక్కసారి ఆలోచించటం అవసరం.. అదే విధంగా ప్రభుత్వం కూడా వైద్యుల కోరికలను తీర్చే విషయంలో ఉదాసీనత వహించకుండా, ఉదార వైఖరితో వ్యవహరించాలి. అటు ప్రభుత్వము ఇటు వైద్యులు ప్రజల ఆరోగ్యానికి ప్రాధాన్యమిచ్చే ధోరణిలో వ్యవహరించాలి. తప్ప పట్టువిడుపులు లేని పద్ధతులు అనుసరించటం సమాజానికి ఎంత మాత్రం శ్రేయోదాయకం కాదు.

**ముగింపు**

నాగరికత పేరుతో స్త్రీ పురుషులు తాగుడు మత్తు మందులకు అలవాటు పడుతున్నారు .అవి తమ ఆరోగ్యంపై ఎంతటి దుష్ప్రభావాన్ని చూపుతాయో గ్రహించటం లేదు .గర్భవతిగా ఉన్న పద్మ బ్రాందీ తాగాలని కోరడం కొంత విడ్డూరంగా అనిపించినా ,నేటి యువతులు ఏ విధంగా దురలవాట్లకు లోనవుతున్నారో పద్మ కోరిక తెలియజేసింది. గొల్లపూడి సమాజంలోని వివిధ అంశాలను నిశితంగా పరిశీలించారు అనటానికి ఈ కథ ఒక ఉదాహరణ .

**ఆధార గ్రంథాలు**

1.అమ్మకడుపు చల్లగా గొల్లపూడి మారుతీరావు

2.గోదావరి కథలు బి వి యస్ రామారావ్

3.కథా శిల్పం వల్లంపాటి వెంకట సుబ్బయ్య

4.కథానికలు పురాణ సుబ్రహ్మణ్యం

******

# 36. శేషప్ప త్రిశతిలో సామాజిక జీవన చిత్రణ

**డా. గోలి శ్రీలత**

సహాయ ఆచార్యులు (తెలుగు),

ప్రభుత్వ డిగ్రీ కళాశాల,లక్షెట్టిపేట,

జిల్లా:మంచిర్యాల ,తెలంగాణ

చరవాణి:9293802345

వేగు: siripochampally@gmail.com

**కీలక పదాలు :** శేషప్ప,కుల వివక్ష,చాతుర్వర్ణ వ్యవస్థ,దాతృత్వం,ఆత్మన్యూనత,ధర్మం,ఆశ్రమ ధర్మాలు,లోకానుభవం,సామాజికత,ఇహ పర గతులు.

**అబ్ స్ట్రాక్ట్:**

సమాజం అంటే కొంతమంది సమూహం. ఈ సమాజానికి సంబంధించిన అన్ని అంశాలు సామాజికాంశాలే. ఈ విధంగా సమాజం అంటే ఒకే ప్రాంతంలో నివసిస్తూ వివిధ వృత్తులు చేపట్టుతూ, వివిధ ప్రవృత్తులు కల్గిన వ్యక్తుల సమూహంను సమాజం అనవచ్చు. కవి కూడా సమాజంలో ఒక వ్యక్తే. ఆయన రచనలో ఆనాటి సమాజాన్ని ప్రతిబింబింపజేసే అంశాలు మనకు కనిపిస్తుంటాయి. ఒక్కోసారి ఇటువంటి అంశాలు రచనలలో ఎక్కువ భాగం కూడా చోటుచేసుకోవచ్చు. అలాగే శేషప్ప రచించినటువంటి త్రిశతిలో (నరసింహ,నరహరి,నృకేసరి శతకాలు) ఎక్కువగా మనకు సామాజికాంశాలు కన్పిస్తున్నాయి. కవిగాని, రచయితగాని ఎవరైనా రచన చేసేటప్పుడు ఎంతోకొంత తన అనుభవంలోని విషయాలను తన రచనలో చొప్పిస్తుంటాడు. ఏ రచయిత అయిన ఎక్కడి నుండో ఏదో విషయాన్ని క్రొత్తగా లేనిదాన్ని చెప్పడు. తనకు తెలిసిన అంశాలనే సమాజానికి అందజేయాలనే ఆరాటపడుతుంటాడు. శేషప్పలో కూడా ఆ ఆరాటం మనకు కన్పిస్తూ ఉంది. అనుభవ పూర్వకమైన విషయాలెన్నో శేషప్ప రచించిన త్రిశతిలో కన్పిస్తున్నాయి.

**సంప్రదాయాలు-హేతుబద్ధత:**

సమాజంలో కొన్ని కట్టుబాట్లు, సంస్కృతి, సంప్రదాయాలు, ఆచారవ్యవహారాలు ఉంటాయి. ఒక వ్యక్తి ఇంకో వ్యక్తిపై ఆధారపడి జీవనం సాగించడం అనేది సమాజంలో ముఖ్యమైంది కాబట్టి శేషప్ప

**సీ|| "అర్థివాంఛకు నీక హానిచేయుటకంటే**

**తెంపుతో వసనాభిఁ దినుటమేలు.. " (నరసింహ శ. 10)**

అంటూ యాచకులకు పెట్టక తినడం కంటే తెగించి విషం త్రాగడం మేలని అన్నాడు. ఈ పద్యపాదంలో సమాజం యొక్క తత్త్వం నిబిడీకృతమై ఉంది. అది ఎలా అంటే ఒకడు ఆకలితో ఆహారాన్ని సంపాదించుకునే స్థితిలో లేనప్పుడు అతడిని ఆదుకోవడం మనిషి కర్తవ్యం. దానిని విస్మరించడం కంటే మరణించడమే మేలని కవి భావన.

ప్రాచీనకాలంలో ఉన్నవారు, లేనివారు కూడా వారి వారి స్థితినిబట్టి ప్రతిరోజు ఒక అతిథికి భోజనం పెట్టి కాని తాము తినేవారు కాదు. ఇది మానవత్వాన్ని, సాటిమనిషిపై ఉండే ప్రేమను చాటిచెప్పుతుంది. ఇటువంటి సాంప్రదాయాల్ని పాటించడం వల్ల సమాజంలో మానవ సంబంధాలు దెబ్బతినకుండా ఉంటాయి. అందరు ఐక్యంగా ఉండటానికి కారణం అవుతాయి.

**వ్యసనాలు-సామాజిక రుగ్మతలు:** సమాజంలోని ప్రతి మనిషిలో మంచి చెడులు రెండూ ఉంటాయి. పరుల సొమ్మును దోచుకునేవారు, ఇంట్లో వాళ్లను మోసం చేసేవారు చాలామంది ఉంటారు. తనకు లేక ఇతరులకు ఆ వస్తువు ఉన్నట్లయితే వాటిని

అపహరించాలనే కోరిక కొంతమందిలో జనిస్తుంది. సిగ్మండ్ ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతం ప్రకారం మనిషిలో 3 రకాల ప్రవర్తనలుంటాయి. అవి ఇడ్, ఈగో, సూపర్ ఈగో. వీటినే అచిత్తు, అహం, అధ్యహం అని కూడా అంటారు, ఈ మూడింటి లో మొదటిదైన 'ఇడ్' (అచిత్తు)లో మనిషి జంతు వాంఛలను కల్గి ఉంటాడు. ఇక రెండవదైన 'ఈగో' (అహం)లో ఇలాంటి జంతువాంఛలను నెరవేర్చుకునే ప్రయత్నం చేస్తే తన ఉనికి దెబ్బతింటుందని అలాంటి వాటిని బహిర్గతం చేయడు. ఇక 'సూపర్ ఈగో'లో కొన్ని ధర్మకార్యక్రమాలు చేసి పవిత్రంగా ఉండాలని అనుకుంటాడు. ఇలాంటి వాటినే సమాజంలో కొంతమంది సమతాస్థితి చేసుకోలేక పోతారు.

అట్టి పరిస్థితుల్లో ఏర్పడే ప్రవర్తన వల్ల సమాజంలో ఒక్కసారి కలహాలు చెలరేగుతాయి. ఇలా వ్యక్తులు ప్రవర్తించకూడదని, సమాజం ప్రశాంతంగా ఉండాలని కవి కాంక్షిస్తున్నాడు. అందుకు ఇక్కడ

**సీ|| "పరుల కాంతల బట్టి బల్మి గూడుటకంటె**
**బడబాగ్ని కీలలఁ బడుటమేలు**
**బ్రతుక జాలక దొంగపనులు చేయుటకంటె**
**కొంగులో ముష్టెత్తుకొనుట మేలు..."** (నరసింహ శ. 10)

అని ఇలాంటి పనులను చేయకూడదని వివరించాడు.

**తే|| వెలది, జూదంబు, పానంబు, వేట, పలుకు**
**ప్రల్లదంబును, దండంపుఁ బరుసదనము**
**సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేత**
**యనెడు సప్తవ్యసనములుఁ జనదు దగుల** అంటూ

ఈ సప్తవ్యసనాల వల్ల వ్యక్తి పతనమవుతాడనే విషయాన్ని శేషప్ప ఇక్కడ వ్యక్తం చేశాడు.పరులను నిందించడం, పరకాంతాసక్తి, అనవసర విషయములందు ఆసక్తి కల్గి ఉండటం, దుర్గుణములందు కౌతుకం కల్గియుండటం మొ|| న వన్ని మనిషి యొక్క జీవితమును, సమయమును వృథా చేసేటివే అని నేటి వ్యక్తిత్వ వికాసమును బోధించెడి నిపుణులు కూడా నిర్ధారించారు. ఈ విషయాలను శేషప్ప పద్యాలలో చక్కగా వివరించడం చేత ఆనాటి సమాజంలోని అవకతవకలు రుగ్మతలు, వ్యక్తుల ప్రవర్తనా విధానం, దొరల అధికారం అన్ని కూడా ప్రతిబింబిస్తున్నాయి.

**చాతుర్వర్ణ వ్యవస్థ:**

శేషప్ప సంఘంలోని చాతుర్వర్ణ్య, వ్యవస్థను నిరసిస్తూ

**సీ|| "వేదములే చదివెడు విప్రవర్యుండైన**
**రణము సాధించెడు రాజులైన**
**వర్తక కృషికుఁడౌ వైశ్యముఖ్యుండైన**
**బరిచెరించేడి శూద్ర వర్యుండైన**
**చర్మమమ్మెడి హీన చండాలపరుఁడైన...."** (నరసింహ శ. 67)

అంటూ సమాజంలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు అందరూ సమానమే అనే భావాన్ని శేషప్ప ఆనాడే వెల్లడి చేశాడు.వ్యాసుడు, విదురుడు, కర్ణుడు, వశిష్ఠుడు, వాల్మీకి, శబరి మొ||న వారి జన్మ చరితలు, వారి కులాలు మొ|| నవి వారి మోక్షసిద్ధికి అడ్డురాలేదని చెప్తూ శేషప్ప

సీ|| "వ్యాసుడే కులమందు వాసిగా జన్మించె ?

విదురుడే కులమందు వృద్ధి పొందె ?

కర్ణుండే కులమందు ఘనముగా వర్ధిల్లె ?

నా వసిష్ఠుడెందు నవతరించే...." (నరసింహ శ. 74)

ఎటువంటి జన్మచరిత కల్గి ఉన్న వాడైనను, ఎవ్వరైనను జ్ఞానసముపార్జన చేస్తే ఉన్నతస్థితికి వెళ్ళగల్గుతారనడానికి పై వాళ్ళే నిదర్శనం. అలాగే లోకంలో ఈ విధంగా ఎవరూ కులాన్ని బట్టి ఆత్మన్యూనతా భావంతో, ఆత్మోత్కర్ష భావంతో ఉండకూడదని అప్పుడే సమాజం ప్రశాంతంగా ఉంటుందని శేషప్ప సమాజ శ్రేయస్సును కాంక్షించాడు.

**సమాజం-స్థితి గతులు:**

ఉ."గోవులఁబంచిపెట్టినను గోటి ధనంబును లూటి బుచ్చినన్

బావులు చాల ద్రవ్వినను, బట్టలు కట్నములెన్ని బెట్టినన్

త్రోవల చెర్లు వేసినను తోఁటలఁ బెంచినగాని దేవ నీ

సేవకు సాటిరావు సుమి శ్రీహరి ధర్మపురీ నృకేసరీ!" (నృ. శ.29)

అంటూ శేషప్ప వివరించిన ఈ పద్యం ఆనాటి సమాజ పరిస్థితిని పట్టిచూపుతున్నట్లుగా ఉంది. "తటాక ప్రతిష్ఠ, ధన నిక్షేపము, అగ్రహారప్రతిష్ఠ, దేవాలయప్రతిష్ఠ, వనప్రతిష్ఠ, కృతి, సత్రప్రతిష్ఠ" అనునవి సప్తసంతానములు. పూర్వం కొందరు పుణ్యాత్ములు పుణ్యమును ఆర్జించుటకొరకు ఈ సప్తసంతానములను అనగా బావులు త్రవ్వించడం, దారికిరుప్రక్కలా చెట్లను నాటడం, బాటసారుల కొరకు చెరువులు త్రవ్వించడం మొ||వి చేసేవారు. దీనివలన ఆ నాటి సమాజంలో ఒక మనిషి తన సాటి మనిషి గురించి ఆలోచించే వ్యవస్థ ఉందని మనకు స్పష్టమగుచున్నది. ఆధునికంగా ఎంత అభివృద్ధి చెందుతున్న నేటి సమాజంలో ఉరుకులు, పరుగుల మధ్య మానవుడు జీవితాన్ని గడుపుతూ తన తోటివారిని గురించి ఆలోచించడం తగ్గిపోతున్నది. దీనివల్ల సమాజంలో వ్యక్తికి, వ్యక్తికి మధ్య రాను రాను సంబంధాలు తగ్గిపోతున్నాయి.

చ|| "ధనముగడించి పెద్దలకు దానము చేయఁగలేను గాని నే

పెనఁగొని జారకాంతలకు, బెట్టితి సొమ్ములు మంది కేర్పడన్

ఘనులను గూడలేక పలుగాకుల లోపలనుంటి నయ్య నా

మనసున సిగ్గులేదు లవ మాత్రము ధర్మపురీ నృకేసరీ"(నృ. శ. 68)

అని శేషప్ప ఈ పద్యంలో చెప్పడం ద్వారా ఆ కాలంలో వేశ్యావ్యవస్థ ఎక్కువగా ఉండేదని, సామాన్యుల దగ్గరి నుండి ధనవంతుడి వరకు అందరు కూడా వీరి కోసం అధికంగా ధనాన్ని ఖర్చుపెట్టేవారని స్పష్టమగుచున్నది.

శేషప్ప నరహరి శతకమునందు కూడా కులవివక్షను నిరసిస్తూ

సీ|| "కాష్ఠంబు వహ్నిలో గలసి ముందటి

రూపమంత మాని త దఖ్నియైన రీతి

గరళంబు పావన గంగలోపలఁజేరి

నపుడే నిర్మల జలంబైన రీతి-----" (నర. శ. 12)

అంటూ విషంను గోదావరిలో కల్పినప్పుడు ఆ విషం కూడా నిర్మలమైన నీరుగా మారిపోతుంది అన్నాడు. పురుగు తుమ్మెద సాన్నిహిత్యంచే తుమ్మెదగా మారినట్లు, స్వాతిచినుకు ముత్యపు చిప్పలో పడి ముత్యంగా మారినట్లు "అంత్యజుడుగాని నీ భక్తుఁడైన

వెనుకవాడే ముఖ్యుండు కులమెన్న వలదు---'' అని కష్టానికి ఓర్చుకొని, భక్తి, జ్ఞాన సముపార్జన చేసినట్లయితే వాడు ఏ కులమునందు పుట్టినను మానవకులమునకే గొప్పవాడగును అని శేషప్ప వివరించాడు.

సమాజంలో కొందరు తప్పుడు పనులు చేసినప్పుడు వారికి కల్గిన అవమానంను జనులందరి ముందు చెప్పకోరు. వారికి జరిగిన అన్యాయం గురించి చెప్పినట్లయితే వాళ్ళు చేసిన తప్పులు కూడా బహిర్గతమవుతాయి. కనుకనే శేషప్ప మనిషి యొక్క ఆలోచనలు చక్కగా ఆకలింపుచేసుకొన్నాడు. కనుకనే ఈ విధంగా అనగల్గినాడు.

**సీ॥ ''కన్నంబులోన దొంగను తేలుకుట్టగా**

**యెక్కినప్పటికైన కిక్కుమనునే..**

**రజకుండు చోరుండై రాజవస్త్రములమ్మి**

**ద్రవ్యమబ్బనియెడ తగువుకొనదు .. '' (నర. శ. 63)**

ఇక్కడ దొంగతనంగా తెచ్చిన వస్త్రాన్ని రజకుడు అమ్ముకునే సమయంలో తనకు అన్యాయం జరిగితే గొడవ పెట్టుకోడుకద. ఎందుకనగా అది దొంగలించిన వస్తువు కాబట్టి. సమాజంలోని మనుషుల ప్రవర్తనను ఎంతో నిశితంగా పరిశీలిస్తే గాని ఇటువంటి సూక్ష్మ అంశాలను రాయలేరు దీన్ని బట్టి శేషప్ప చక్కని సమాజ పరిశీలన కల్గిన వాడని తెలుస్తుంది.ఈ విధంగా శేషప్ప రచించిన త్రిశతిలో అడుగడుగునా అనేక సామాజికాశాంలు కన్పిస్తున్నాయి.

**లోకానుభవము:**

ఎవరు చేయాల్సిన పనిని వారు సక్రమంగా చేయాలి. ఎవరి ధర్మం వారు తప్పక నిర్వర్తించాలి. ఒకవేళ ధర్మం తప్పితే అది వారికే చెడు చేస్తుంది. పశువులన్నింటిని రక్షిస్తూ జాగ్రత్తగా చూసుకోవాల్సిన పని పశువుల కాపరిది. అలా అతని అజమాయిషి క్రింద ఉన్న పశువుల తప్పచేసినట్లయితే ఆ తప్పు పశువుల కాపరిదే. ప్రజలను సక్రమ మార్గంలో ఉంచి పరిపాలించవల్సిన బాధ్యత ప్రభువులది. అలాంటి ప్రజలలో అవినీతి పెరిగి దుర్జనులైన అది రాజు యొక్క తప్పే.అట్లే

**సీ॥ ''భార్య గయ్యాళైనఁ బ్రాణనాథుని తప్పు**

**తనయుఁడు దుష్టైన దండ్రితప్పు**

**సైన్యంబు చెదరిన సైన్యనాథునితప్పు**

**కూతురు చెడుగైన మాత తప్పు...'' (నరసింహ శ. 12)**

అశ్వం చెడుదైన అది ఆరోహకుని తప్పు. ఏనుగు చెడిన అది మావటి వాడి తప్పు. ఇటువంటి బాధ్యతలను గుర్తింపక లోకులు ఈనాడు తమ ఇష్టం వచ్చినట్లు మెలుగుతున్నారు. సృష్టిలో ఏదైనా గతితప్పడానికే ప్రయత్నిస్తుంది. కాని దాన్ని నియంత్రించే శక్తి అప్రమత్తంగా ఉంటేనే గతి సక్రమంగా ఉంటుంది.

''అపజయం అనాథ, విజయానికి తండ్రులెందరో'' అన్నట్లు ఒక అపజయం సంభవిస్తే అది తమ వల్లనే కల్గిందని, ఆ అపజయానికి బాధ్యత వహించే వారు ఒక్కరూ ఉండరు కాని, ఒక విజయం సిద్ధిస్తే మాత్రం ఆ విజయానికి తాము కారకులమని ఆ విజయంతో సంబంధం కల్పుకోవడానికి ప్రయత్నిస్తారు. అలాగే వర్షాలు లేక ఎండిపోయి కరువుతో అల్లాడే గ్రామాలను పట్టించుకునే నాథుడే ఉండడు. సంవృద్ధిగా పంటలు పండి, సుభిక్షంగా ఉన్న ఊళ్ళకే నాయకులుగా ఉండటానికి ఇష్టపడుతారు. అందుకే

**సీ॥ ''మాన్యంబులీయ సమర్థుఁడొక్కడు లేదు**

**మాన్యముల్ చెఱుప సమర్థులంత.. '' (నరసింహ శ. 14)** అన్నాడు.

దారిద్య్రంతో బాధపడే పేదవారిని ఎవరు పట్టించుకోరు. కాని ధనవంతుల భోగభాగ్యాలను అందరు పొగడటానికి ప్రయత్నిస్తుంటారు.నేడు రైతులెందరో ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. కాని వాటి గురించి పట్టించుకొనేవారు లేరు. పరిశ్రమలు, ఫ్యాక్టరీలు నిర్మించుకోవడానికి సస్యశ్యామలమైన పొలాన్ని ఇవ్వడానికి కూడా ప్రభుత్వం సిద్ధపడుతుంది.భూమిని పేదలకు దానం చేయడానికి ఎవడూ ముందుకు రాడు. కాని వాటిని చెడగొట్టగల వారే ఎక్కువ మంది ఉంటారు. అని తన భార్య నడవడికను ఎవడు తప్పుపట్టడు. కాని పరకాంతల తప్పులను ఎన్నడంలో మాత్రము అందరూ పెద్దలే. అసలు ఇటువంటి వారికి అధికారం ఇవ్వడం ప్రభువులదే తప్పు అని శేషప్ప అధిక్షేపించాడు.

పుణ్యకార్యాలు చేయడం అంత సులభం కాదు. పుణ్యం మీద ఆసక్తి ఉన్నా ఎవరూ తన సంపదలను త్యాగం చేయడానికి ఇష్టపడరు. అటువంటి లోభులు అర్థించినవారికి దానమీయక పోగా ఇతరులు దానం ఇస్తూ ఉంటే ఓర్వలేదు.

**సీ॥ ''లోకమందెవఁడైన లోభి మానవుఁడున్న**

**భిక్షమర్థి కిఁ జేతఁ బెట్టలేఁడు.. '' (నరసింహ శ. 16)**

లోభి దాతను దానం చేయకుండా చెడగొట్టి చాలా సంతోషపడుతాడు. స్వామి ఇటువంటి క్రూరున్ని ''భిక్షకుల శత్రువని'' పిలువవచ్చు. ఆపదలో ఉన్న వారిని ఆదుకోవడం మానవత ధర్మం. నిరంతరం ఇంకొకరి మీద పడి తినే భిక్షకుల గురించి ఈయన ప్రస్తావించలేదు. ఆపదలో తను సంపాదించుకునే స్థితిలేని పరిస్థితులలో ఇతరులు దానం చేయబోతుంటే వారిని అడ్డుకునే మానవత్వం లేని మనుషుల గురించి చెప్పాడు. వాళ్ళు మాత్రమే భిక్షకుల శత్రువులు.

మానవుడు ఏ పని చేసిన ఒక ఉద్దేశాన్ని ఆశించి చేస్తాడు. ఈ విషయాన్నే లోకానుభవం కల్గిన శేషప్ప చక్కగా వివరించాడు. అధికంగా విద్యను అభ్యసించడం అన్నవస్త్రముల కోసమే. సనాతన భారతీయ సంప్రదాయంలో సంపద అంటే గో సంపదే. అటువంటి ఆ గోవులు పాడికోరకే. అనగా పశువులను ఆర్జించడంలోని ఉద్దేశం పాలకోఅకు అంటు శేషప్ప

**సీ॥ ''సతిని బెండ్లాడుట సంసార సుఖముకే..'' (నరసింహ శ. 31)** అన్నాడు.

అని గృహస్థు ధర్మాన్ని వివరించాడు. అయితే నేటి సాంఘికస్థితి మారిపోయినది. ఇప్పుడు స్త్రీ కూడా ఉన్నత విద్యను అభ్యసిస్తున్నది. కాబట్టి ఆమె భావాలు, ఆలోచనలు మార్పుకు గురైనాయి. కాబట్టి స్త్రీ కూడా పురుషునితో సమానమైన స్థాయిని అందిపుచ్చుకుంది. కాబట్టి స్త్రీని కేవలం ఒక సంతానానికే కాకుండా జీవితాంతం కల్సి ఉండే స్నేహితురాలిగా చెప్పుకోవాలి. అందుకే గురజాడ వారు ''మగడు వేల్పట పాతమాటది----''(గురజాడ , 'ముత్యాల సరాలు') అని అన్నాడు.

**ఇహ పర గతులు:**

**సీ॥ ''కాసైన లేని శుష్కప్రియంబు వలన**

**సంతోషమొందదాచార్యుడైన.. ''**

పై పద్యంలో శేషప్ప ధనం యొక్క ప్రాధాన్యాన్ని వివరించాడు ''ధనం మూలం ఇదం జగత్'' అని లోకోక్తి. కాని ధనం కంటే భిన్నంగా ఉండేది దేవుని యొక్క ప్రేమ మాత్రమే. ప్రేమ స్వార్థాన్ని కోరుకోదు.

**సీ॥ ''దుక్కి సౌరుగ దున్ని దొడ్డు నాఁగటిదుంప**

**అందులో ఫలమేమి యనుభవించె..**

**''కోరిలుబ్ధుండు ధనమెంత గూడబెట్టి**

**తానుఁ దినడెవ్వరికి చేత దానమీఁడు'' (నర. శ. 16)**

అంటూ దుక్కిదున్నిన నాగలి పంటను అనుభవించలేదు. అలాగే పిట్టలను భయపెట్టడానికి పెట్టిన బొమ్మకూడా పంటని అనుభవించలేదు. చెత్త తీసేసి మంచి గింజలను మిగిలిన చాట వాటినే పాటి తింటుంది. కల్లాన్ని ఊడ్చి ధాన్యాన్ని కుప్పలుగా చేసిన చీపురు ఏం తింటుంది. ఏం తినలేదు. ఇక్కడ శేషప్పలోని లోకానుభవం వ్యక్తమవుతుంది.

**ముగింపు:**

శేషప్ప రచించిన మూడు శతకాలు భక్తిశతకాలే అయినప్పటికిని భక్తితో పాటు సామాజిక ప్రభోదాత్మకతను బోధించిన పద్యాలు కూడా అధికంగానే కన్పిస్తున్నాయి. ఈ శతకాలలో సార్వకాలీన సామాజికాంశాలు,సామాజిక జీవన చిత్రణ సోదాహరణంగా వివరించబడినాయి.

**పరిశోధనన కొనసాగింపు:**

ఈ శతకాలలో సార్వకాలీన సామాజికాంశాలు మరింత లోతుగా ప్రస్తుత పరిస్థితులకు అనుగుణంగా మనో వైజ్ఞానిక దృక్పథంతో అధ్యయనం చేయవలసి ఉంది.

**ఉపయుక్త గ్రంథసూచి :**


- శేషప్ప, నరసింహ శతకము, 1982
- శేషప్ప, నరహరి శతకము, 1982.
- శేషప్ప, నృకేసరి శతకము, 1982.
- శ్యామసుందర శాస్త్రి, మధ్వచారి. 'ధర్మపురి క్షేత్ర మహాత్మ్యము నాడు-నేడు'.
- శ్యామసుందర శాస్త్రి, మధ్వచారి. 'త్రిశతి'.
- నరసయ్య, సంగనభట్ల. 'శ్రీ ధర్మపురి క్షేత్ర చరిత్ర', 2004.


******

# 37. డా.కాలువ మల్లయ్య "భూమి పుత్రుడు" నవల : సామాజిక చిత్రణ

**డా. బాసాని సీతారాములు,**

సహాయాచార్యులు, తెలుగు శాఖ,

ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాల, సిద్దిపేట.

మెయిల్ : basani0707@gmail.com

సెల్ నెం. 9666494466

**కీలకపదాలు:** ఎగుసం, రైతు, కౌలు, బాకీ, బొగ్గుబాయి, నక్సలైట్లు, శేటు,గిట్టుబాటుధర, ఎదురుకాల్పులు, పోలీసులు, సాగువాటు, లగ్గం, నిరుద్యోగం, కాపుదనం.

**పరిచయం :**

డా.కాలువ మల్లయ్య రామగుండం లోని ఎరువుల కర్మాగారం లో కెమిస్ట్ గా పనిచేశాడు.తెలంగాణ మాండలికం లో పల్లె మూలాలను,బడుగుజీవుల స్థితిగతులను బాగా ఆకళింపు చేసుకొని వాస్తవ దృష్టి తో చైతన్య స్ఫూర్తి తో జన జీవితాన్ని తన కథలు,నవలల ద్వారా అక్షరబద్ధం చేస్తున్నాడు.తెలంగాణ మాండలికానికి సాహితీ కీర్తిని తెచ్చిన వారిలో డా. మల్లయ్య ఎన్నదగినవాడు. తెలంగాణ మట్టికథలు పేరుతో వారికథలు ప్రసిద్ధి చెందాయి. తాను పుట్టిన ఊరును, ప్రాంతాన్ని మరిచిపోకుండా వాటిపై మమకారంతో, భాషమీద గౌరవంతో, తెలంగాణ మాండలికంలో అసంఖ్యాకంగా కథలు,నవలలు రాస్తున్న అక్షర కృషీవలుడు డాక్టర్ కాలువ మల్లయ్య.దళిత,స్త్రీవాద,విప్లవ,రైతు జీవిత,మానవ సంబంధాలు,సాంఘిక సమస్యల ప్రస్తావన,గ్రామీణ చిత్రణ .... కథ రాసినా,నవల రాసినా తనదైన తెలంగాణ బాణీ లో రాసి పాఠకులను ఆకట్టుకోవడం లో డా. కాలువ మల్లయ్య సిద్ధహస్తుడు.

**'భూమి పుత్రుడు' నవల –ఇతివృత్తం:** డా. కాలువ మల్లయ్య తొలి నవల 'భూమి పుత్రుడు' చతుర 1991 డిసెంబర్ సంచికలో అచ్చయింది. ఇది 1980-90 దశకం లో తెలంగాణ సమాజపు పరిస్థితులకు అద్దంపడుతుంది.తెలంగాణా ప్రజల జీవన విధానం, నిరుద్యోగ యువకులు నక్సలైట్లుగా మారిపోవడానికి దారి తీస్తున్న పరిస్థితులు,నక్సలైట్ల ఆదిపత్యం లో ఉన్న గ్రామాలలో ప్రతి రోజు దినదిన గండంగా గడిచే రోజులు ,రాత్రి పూట పోలీసుల అన్వేషణలతో గ్రామంలో నిద్రలేని పరిస్థితులు. భూమిని నమ్ముకున్న రైతు పంటలు పండక ,పండినా ఆ పంట కోసం చేసిన అప్పులు తీరక చివరకు ఆ భూమిని అమ్ముకునే దైన్య స్థితికి రావడానికి గల కారణాలను ఈ నవల విశ్లేసిస్తుంది. రైతాంగ కడగండ్ల జీవితానికి దర్పణమీ నవల. అతివృష్టి అనావృష్టి మూలంగా రైతులు పడే ఇబ్బందులు,గిట్టుబాటు ధరలేక,భూమి శిస్తు కట్టలేక ,వడ్డీవ్యాపారులు, కమీషన్ ఏజెంట్లు , బ్యాంకర్లు పెట్టే బాధల తో విలవిల లాడే రైతుల జీవితాలు ఈ నవలలో చిత్రితమయ్యాయి.

**ముఖ్య పాత్రలు :**

కథానాయకుడు కొండమల్లయ్య , భార్య నర్సమ్మ,కొడుకులు రాజయ్య ,తిరుపతయ్య కూతురు కాంతమ్మ వడ్డీవ్యాపారి రాజేశం,కోడలు లక్ష్మి , కాంతమ్మ మామ లస్మయ్య.

**పాత్ర చిత్రణ :**

**కొండ మల్లయ్య:** చేనేత అంగీ, తలకు రూమలు,చెప్పులు కూడా సరిగా లేక, యాభై ఏళ్ళు దాటక మందే వృద్ధాప్య ఛాయల తో తెలంగాణ లోని సగటు పేద రైతు గా పరిచయం అవుతాడు.కోడికూత తో లేచి, పొద్దుపోయేదాకా వ్యవసాయ పనులలో తలమునకలయ్యే

జీవితం యల్లయ్యది.తాత ల కాలం నుండి వారసత్వం గా వచ్చిన కొద్దిపాటి భూమి లో వ్యవసాయం చేస్తుంటాడు.ఎంత పండించినా అప్పులు తీరక జీవితం లో ఎంతో ఎదగాలని, తనపిల్లలు గొప్పవాళ్ళు అవాలనే కోరిక తీరక, జీవన పోరాటం సాగిస్తుంటాడు.
పిల్లల అవసరాల కోసం, చేసిన అప్పులు వడ్డీలు, చక్రవడ్డీలు తీర్చుటకు ఉన్న భూమి ని కొద్ది కొద్దిగా అమ్ముతూ చివరకు ఊళ్ళో భూమి లేని వాడై పట్నానికి బతుకపోతాడు.తెలంగాణ లోని రైతు జీవితానికి ప్రతిబింబం గా రచయిత ఈ పాత్రను చిత్రించాడు.

**నర్సమ్మ** :కొండ మల్లయ్య భార్య నర్సమ్మ. భర్త తో పాటే లేచి వంట వార్పు చూసుకొని పొద్దస్తమానం కష్టపడే మహిళ. కష్ట కాలంలో భర్త కు ధైర్యాన్నిస్తూ, నిర్ణయాలలో పాలుపంచుకుంటూ భాద్యత గా బతికింది. ఎదిగిన కూతురు పెళ్లి చేయాలని ఆరాట పడేది. పెళ్ళైన బిడ్డ అత్త గారింట్ల పడుతున్న యాతనకు తల్లిడిల్లేది. కొడుకు కోడలు వలస వెళ్లి పట్నం లో బతుకుతుంటే వృద్దాప్యం లో ఇంటిపనులకు చేదోడు లేక అవస్థ పడేది నర్సమ్మ.సగటు తెలుగు మహిళాగా ,భర్తకు వెన్నుదన్నుగా నిలిచిన పాత్ర నర్సమ్మ ది.

**వడ్డీ వ్యాపారి రాజేశం:** కట్టు బట్టలతో ఊళ్ళోకి వచ్చి సంపన్నుడైన వ్యాపారి రాజేశం. వానాకాలం రాకతోనే విత్తనాలకు ,ఎరువులకు ఒకటేమిటి అన్నింటికీ రైతులకు అప్పులిచ్చేవాడు. పంటలు పండగానే కల్లంలో దిగుతాడు. కనికరం లేకుండా అసలు వడ్డీ లెక్కకట్టి సరిపడా ధాన్యం కొలుసుకుంటాడు.తాను అప్పు ఇచ్చాడు కాబట్టి తనకే ధాన్యం అమ్మాలనే షరతు విధించే వాడు. ఊళ్ళో ధాన్యం అంతా తానేకొనేవాడు. రాజేశం నిర్ణయించిందే ధర. తక్కువ ధర చెల్లిస్తూ రైతుల శ్రమను దోపిడి చేసేవాడు. ఇదేమీటని ప్రశ్నిస్తే గ్రామ పెద్దల అండతో బెదిరించేవాడు. మళ్ళీ అప్పు ఇవ్వకుండా ఇబ్బంది పెట్టేవాడు. నాటి నుండి నేటివరకు రైతుల బతుకు లను చిదిమేస్తున్న వడ్డీ వ్యాపారులకు మచ్చుతునక ఈ రాజేశం పాత్ర.

**రాజయ్య** : కొండమల్లయ్య పెద్ద కొడుకు రాజయ్య చిన్నపటి నుండి తండ్రితో పాటు వ్యవసాయం చెస్తున్నా ఎప్పుడు నిరాశతో ఉండేవాడు. ఈ వ్యవసాయం తో తమ కష్టాలు తీరవని నమ్మేవాడు. తోటి వాళ్ళు బొగ్గుబావి పనిలో చేరడంతో భార్య పోరుతో బొగ్గు పనిలో చేరి తల్లిదండ్రులను వదిలి పట్నం పోతాడు. చివరకు బొగ్గు బాయి ప్రమాదం లో చనిపోతాడు.1980-90 సంప్రదాయ వృత్తులను వదిలి పారిశ్రామిక ,సేవా రంగ వృత్తులను ఇష్టపడుతున్న యువతకు ఉదాహరణగా రాజయ్య పాత్రను మాలిచాడు రచయిత.

**తిరుపతయ్య:** కొండమల్లయ్య చిన కొడుకు తిరుపతయ్య తండ్రి ప్రోత్సాహంతో డిగ్రీ వరకు చదువుతాడు. తండ్రి చేసే వ్యవసాయం ఏమాత్రం గిట్టుబాటుకాదని అనేక సార్లు వాదించేవాడు. వ్యవసాయ పనులంటే మొదట్లో నచ్చేవాడు కాదు. ఉద్యోగం రాక అనేక సంఘర్షణ లకు లోనై చివరకు తండ్రి వారసత్వాన్నే పుచ్చుకొని వ్యవసాయం చేస్తుంటాడు. అప్పుడప్పుడే పరిచయమైన ప్రపంచీకరణ ,సరళీకరణ లలో నిరుద్యోగ పరిస్థితులు,ప్రభుత్వ ఉద్యోగాలలో కోత వంటి పరిస్థితిలో సంఘర్షణకు లోనవుతున్న యువకులను రచయిత తిరుపతయ్య పాత్ర రూపం లో పరిచయం చేశాడు.

సామాజిక చిత్రణ:

**పోలీసులు –నక్సలైట్ల సంఘర్షణ : "పోలీసోల్లు, రాడికలోల్లు ఒకర్నొకరు చంపుకోవట్టి.. అటు వాళ్ళు బెదిరిచ్చిరి. ఇటు వీళ్లు తన్నిరి నడుమ మనం నలిగిపోతున్నం. మింగమంటే కప్పక్కోపం, విడవమంటే పాముక్కోపం"....** నక్సలైట్లు, పోలీసుల మధ్య ప్రజలు పడే బాధల్ని పై వాక్యాలు తెలియచేస్తున్నాయి ఇవి నిరంతరం ఆనాడు తెలంగాణ పల్లెల్లో జరుగుతున్న సంఘటనలే.ఉద్యోగాలు లేక ఉపాది దొరకక పపెచ్చు నాటి భూస్వాములు,పెత్తందార్ల దోపిడీ ని భరించని యువత నక్సలిజం వైపు ఆకర్షితులయ్యారు. ఎవరు చచ్చారు..? పోలీసులా.. నక్సలైట్లా అనేది మనం పక్కన పెడితే చచ్చింది ప్రజా జీవనం కూడా. ఈ నవల లో కొండమల్లయ్య పెద్దకొడుకు పోలీసుల ఎదురుకాల్పుల్లో చనిపోయాడు. సంఘం లో చేరి ప్రాణాలు పోగొట్టుకుంటారేమో అని ఊళ్ళో యువకులందరిని పట్నానికి బతుక పంపేవారు తల్లిదండ్రులు. ఇలా నాటి సామాజిక సంఘర్షణ లను రచయిత బాగా విశదీకరించారు.

**వడ్డీ వ్యాపారులు /బ్యాంకర్ల దోపిడీ :** కొండమల్లయ్య తన తండ్రి చేసిన అప్పునే ఇంకా తీరుస్తున్నాడు. ఒక నాడు కొండ మల్లయ్య భార్య నర్సమ్మ ధాన్యం రాశి దగ్గర కూర్చొని రాశిని చూసి మురుస్తున్నారు. ఈఏడు పంట బాగా పండిందని సంతోషంతో బిడ్డ పెళ్లి చేయవచ్చని ఆశపడుతున్నారు . ఇంతలోనే షావుకారు కల్లం లో డబెల్ను దిగి పంట ఎత్తుకు పోతుంటే , కొండమల్లయ్య గుండె ఆగినంత పనైంది. తన ఆశలు క్షణం లో పటాపంచలైనాయి. పండిన పంటకు శేటు పెట్టిందే రేటు, కాదు లేదంటే బాకీ పుట్టాడు . తన దాన్యపు రాశంతా వడ్డీకె సరిపోయిందని,అసలు అట్లనే ఉందని రాజేశం శేటు చెపుతుంటే మల్లయ్య ఒళ్ళు కొయ్య బారిపోయింది. వెనుకకు తిరిగి ఎక్కిక్కీ ఏడ్చాడు. తప్పించుకోలేని ఈ దోపిడీ అలవాటైన మనిషి సముదాయించుకొని మౌనంగా ఉండిపోయాడు. ఈ బాకీ ల విష చక్రం నేటికీ రైతు సమాజాన్ని పీడిస్తూనే ఉంది.బాంకు లో అప్పు తీసుకుందామంటే బ్రోకర్ల కమీషను ,బాంకు చుట్టూ తిరగడం రైతుకు ప్రయాస గా మారింది . బాంకు వడ్డీ రేటు తక్కువే అనిపించినా , బ్రోకర్ల కమీషను,లేటు ఫెనాల్టీ ,ఆస్తులు జప్తు అన్నీ చూస్తే ఇది కూడా రైతును బాగుపరిచింది ఏమీలేదు. మల్లయ్య కళ్ళముందే ఎందరివో ఆస్తులు జప్తు చేసి వేలం వేశారు. రైతుకు ఇంతకంటే మించిన అవమానం మరొకటి ఉండదు.

**మార్కెట్ సమస్యలు :** '**పండినేడు ఆ పంటకు ధరుండకపాయె ఏ పంటయితే పండదో దానికాయేడు మస్తు ధరుండే, దానికి ధరుందని ఆ పంటేస్తే పంట చేతులకచ్చే వరకు దాని ధర తగ్గి.. పంట నిలువుంచుకుందామంటెనేమొ మనకెల్లకపాయె ,అది చేతుల్నించి అవుతల పడ్డంక ధర పెరిగె మన సంగతి కొనబోతే కొరివి అమ్మబోతే అడివోలుందే అన్న**' ఈమాటలు పంట మార్కెట్ లో అమ్మేటప్పుడు ఎదురయ్యే సమస్యలకు అద్దం పడుతుంది. ఈ ఇబ్బంది సర్వకాలాల్లో రైతులందరికీ ఉండే ఇబ్బందే . ఆనాటి పరిస్థితి నేటికీ నూరడం లేదంటే రైతు నిరంతరం దోపిడీకి గురవుతున్నాడనేది తేటతెల్లం. రచయిత ఈ నవలలో పంట అమ్మకం లో వచ్చే కష్టాలను ,నష్టాలను కళ్లకు కట్టినట్లు చూపాడు.

**భూములమ్ముకొని రైతులు వలస :**అనేక మంది రైతులు బాకీలు తేర్చలేక సాలుకు ఇంత భూమి అమ్ముకుంటూ .. చివరికి భూమిలేక కూలీలుగా మారిన చరిత్ర ఈ నవల లోకనిపిస్తుంది.వానలు పడుడు తోనే మొదలైతది రైతు కష్టం. పెట్టుబడికి డబ్బు లేక దుక్కిదున్నేందుకు అప్పు చేయాలి,విత్తనాలకు అప్పు ,ఎరువులకు అప్పు ఇలా పంటచేతికొచ్చేదాక అప్పులు తెస్తానే ఉండాలే . పంటచేతికి వచ్చినంక లెక్కచేస్తే అసలు వడ్డీ తడిసి మోపెడవుతది. పండించిన పంట వడ్డీ కే సరిపోదు కొన్నిసార్లు,తెచ్చిన అప్పు అలాగే ఉండే పరిస్తితి.ఇది ఒక చక్రం ల ఎప్పటికీ తిరుగుతూనే ఉంటుంది. ఇది నేటికీ తెలంగాణలో కనిపించే పెద్దసమస్య . కుటుంబం గడవక బొంబాయి ,దుబాయి లకు వలస వెళ్ళే పరిస్తితి తెలంగాణ లో నిత్యం చూడవచ్చు. మన కథానాయకుడు కొండ మల్లయ్య కూడా కొంచెం ,కొంచెం భూమి అమ్ముతూ తనకున్న పది ఎకరాలు పూర్తిగా అమ్మేసి ఊళ్ళో భూమిలేనివాడైనాడు. చివరకు ఊరొదిలి పట్నం బాట పట్టాడు.

**భాషావిశేషాలు :** "**ఆగెటట్టే లేవు గద ఎన్ని తింటవో చూస్తిగ కొంచెం పొద్దెక్కేవరకు తయారయితయి...**" అని రేకులువంచిన వంటగదిలోకి వెళ్లింది నర్సమ్మ.

"**ఏం జెయ్యన్నే మరి….? కాపుదనపోల్ల సంగతి నీకు తెలువందేముంది? ఇంట్లున్నోల్లమంతా శరీరం దాసుకోకుంట మట్లో మట్టై పన్జేత్తున్నమా? అయినా ఇట్లనే ఉండవర్తిమి. ఎంత జేసినా ఎక్కడేసిన గొంగడక్కడున్నట్టే వుండె.. వచ్చే జన్మల నువ్వేదేశంలనన్న రాణిపై పుట్టు... నేను రాజునయిపుడుత అప్పుడు ఏడువారాల నగలేంది? రోజుకో తీరున ముప్పై రోజుల నగలు చేయించుత.. సరేనా?**" అన్నాడు కొండమల్లయ్య. ''**ఇయ్యాలనేమొ బాగ సంబరంగున్నవేంది? పరాచికాలు బాగ మాట్లాడుతున్నవు?**'' అంది నర్సమ్మ. "**రైతేరాజే.. ఏందనుకున్నావుమరి. సరేగాని, నెయ్యుందా? నెయ్యితోని తింటే బూరెలు కమ్మగుంటాయి**''అన్నాడు కొండ మల్లయ్య "**రాజువుగద భటులతోని చెప్పితే నెయ్యి తేకపోదురా? ఇంట్లనెయ్యేడుంది**'' అంది నర్సమ్మ.

ఈ మాటలు తెలంగాణ మాండలికానికి , మమకారానికి మచ్చుతునకలు.కలుపు, సాగువాటు,దుక్కి,అవ్వ,మోటగొట్టుట,బొక్కెన, పచ్చిపులుసు ,తొక్కు ,మొల్క అల్కుడు , పెయ్య ,ఎడ్ల కొట్టం ,ఎగుసం ,పనిబాటోళ్లు ,వలపట-దాపట ఎడ్లు ,కల్లం,గరిశె ,రంకు ,బాపు,గ్రద ,కోపు (కప్ ),బీడు (మార్కెట్ యార్డ్ )అలుగం ,బంతికొట్టుట,పొతంచేయటం,ఇల్లలుకుడు వరిమోపులు,లగ్గం వంటి అనేక తెలంగాణ మాండలిక పదాలు ,వ్యవసాయ ,వృత్తి సంబంధ పదాలను రచయిత ఈ నవల లో విరివిగా వాడాడు.

**ముగింపు:**

పై విషయాలతో పాటు కుల మతాలకు అతీతంగా కల్లా కపటం ఎరుగని స్వచ్ఛమైన ప్రేమలో జీనవం సాగించే పల్లీయుల ప్రశాంత వాతావరణం, వ్యవసాయం పనులు, పోలీసులు నక్సలైట్ల మధ్య జరిగే దాడుల కారణంగా పల్లెలు అగ్నిగుండాలుగా మారడం,అన్నల పోరాటాల వల్ల తెలంగాణాలో ఫ్యూడల్ దోపిడీ, పెత్తందార్ల అధికారం, దౌర్జన్యాలు తగ్గడం, కులవృత్తుల పేర్ల మీద జరుగుతున్న అమానుషం తొలగడం లాంటి అనేక నగ్న సత్యాలు మనకు ఈ నవలలో కనిపిస్తాయి. బొగ్గుగనుల్లో పని చేసే శ్రామికులు, వారు పడే కష్టాలు, డబ్బు అవసరాలు మనుషుల్లోని ప్రేమానురాగాల్ని, బంధుత్వాన్నీ, మమతల్నీ, మమకారాల్నీ ఎలా దూరం చేస్తాయో ఇందులో పాత్రలు తెలియచేస్తాయి. రైతే రాజనీ, రైతు దేశానికి వెన్నెముక అనీ, రైతు అభ్యున్నతే దేశాభ్యున్నతి అని ఉపన్యాసాలిచ్చే రాజకీయ నాయకుల ఉపన్యాసాల్లోని బోలుతనాన్ని ఈ నవల ప్రశ్నిస్తుంది. తెలంగాణ రైతాంగ జీవితానికి అక్షర రూపం భూమి పుత్రుడు నవల . కథకుడైన మల్లయ్యకు ఇది తొలి నవల. 1992లో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం పురస్కారం పొందింది ఈ నవల.
*******

**ఆధార గ్రంథాలు :**

1. మల్లయ్య కాలువ (2001) భూమి పుత్రుడు, తెలుగు వచనం ప్రచురణలు ,కరీంనగర్

********

# 38. వేమనశోధన

**డాక్టర్ అంగడాల వెంకటరమణమూర్తి**

అసిస్టెంట్ ప్రొఫెసర్ తెలుగు శాఖ

పి .బి . సిద్ధార్థకాలేజ్ ఆఫ్ ఆర్ట్స్ అండ్ సైన్స్

విజయవాడ-10

**కీలక పదాలు**

"వేమన మహాకవి - ప్రజాకవి - విప్లవకవి - యుగకవి - తాత్వికకవి - సత్యకవి - నిజకవి." "వేమన జీవితసారం - ఆయన కవితా సారాంశం".

**అబ్స్ ట్రాక్ట్**

వేమన అన్నగారు కడప (సుభా) జమ్మలి మడుగులో గల గండికోట దుర్గాధిపతి అని 'సి.పి. బ్రౌన్' తెలిపారు. కొండవీడును పాలించిన వారిలో వేమన ఒకరు.

**కాలం:-**

17వ శతాబ్ది బ్రౌన్, కాంబెల్ 16వ శతాబ్ది, వేటూరిప్రభాకర శాస్త్రి1650, రాళ్లపల్లి 17వ శతాబ్ది, వేమన పై పరిశోధన చేసిన పరిశోధకులు ఎన్.గోపి1650 ప్రాంతం వాడని నిర్ధారించారు. ఎక్కువగా 1650 - 17 మధ్యకాలం సరైనదేనని మనం భావించవచ్చు.

**పద్య నిర్ధారణ:-**

వేమన పద్యాలు 3000 లోపు అని రాళ్లపల్లి గారు, 1300 లోపు అని ఎన్ గోపి గారు తమ అభిప్రాయాలనుతెలియజేశారు రాళ్లపల్లి 3000 లోపు పద్యాలు, ఎన్.గోపిగారు 1300 లోపు పద్యాలు వేమన రాసి ఉండవచ్చు అంటారు.

హేతువాదం - భక్తి- నీతి - శృంగారం - వైరాగ్య - తత్వం - హాస్యం - మతం - పౌరాణికం మున్నగు అంశాలపై సహజ స్వతంత్రకవి వేమన అద్భుతంగా తన లోకజ్ఞతను సరళంగా మనకు అందించారు. ఆదిపద్య కవి నన్నయ వైదిక మతపునరుద్ధరణ కోసం రాశాడు.

శివ కవులు శైవమతవ్యాప్తికికవిత్వం రాశారు. శ్రీనాథ పబంధ ర్ కవులు అనాటిపప్రభువుల కోసం కవిత్వం రాశారు.

అస్తవ్యస్తమైన వ్యవస్థలోని కుళ్ళు, వంచనను, అగ్రవర్ణ అహంకారాన్ని, దొంగ సన్యాసులను, దురాచారాలను పపంచంల ర్ో అనేక విషయాలను తన కవిత్వంలో అద్దంలా చూపారు. వ్యవహార భాష - నుడికారం - సామెత - పలుకుబడులను అచ్చమైన (ఉపజాతి) "ఆటవెలది" ఛందస్సులో మనకు అందించారు. వేమన కవిత్వంలో గల లోకజ్ఞత లోని అంశాలను చూద్దాం.

**సంసారకామి :**

సంసారికి కామం సహజం. కానీ కామం జీవితం పైమమకారాన్ని అణిచివేసి, కోరికలు లేని వాడిగా సంసారి ఉండాలన్నాడు. కవిలా భావావేశం కలిగి, కేవలం శారీరిక కాంతి లేని సూర్యుని లాంటివాడు సంసారిఅని వేమన భావన. "సుఖ జీవనం స్వర్గం కన్నా మిన్న" అని చాటాడు.

**చెలి చెలిమి :**

పనస తొనలు, పంచదార, జుంటి తేనె, జున్ను, చెరకు రసము అన్నీ ఒకదానికి మించి ఒకటి గొప్పగా ఉంటాయి. వీటన్నిటికన్నా చెలి మాట చాలా తీపిఅంటూ తన సౌందర్య పిపాసను తెలిపాడు.

**భార్య - వేశ్య :** మంచి వాళ్ళయినా, అందగత్తెలైన భార్యలను విడిచి, వేశ్యలమోహంలో పడిఅతి ముఖ్యమైన జీవితాన్ని చిన్నాభిన్నం చేసుకునేవాళ్లకు పండించిన చేనును విడిచి, పంట నూర్చేసిన చేనులో పరిగ ఏరుకునేబుద్ధిలేని పద్ధతిని మార్చుకోమంటాడు.

**అర్థం చేసుకోని అర్ధాంగి:**

"చెప్పుకికాలికిమధ్య రాయిలా, చెవిలో జోరీగలా, కంటిలో నలుసులా, కాలిలో విరిగిన ముల్లులా ఇల్లాలి గోలను" గయ్యాళి భార్యలు అసంతృప్తితో భర్తలను దూరం చేసుకుంటారని తెలిపాడు.

**చెడ్డవాడైన అధికారి:**

అల్ప బుద్ధికలవానికిఅధికారమిస్తేమంచి వారందరినీ చెడగొడతాడు. "కుక్కకు చెరుకు రసంలో తీపి తెలియదని, సహజంగా మనిషిస్వభావం మారదని" మనస్తత్వ విశ్లేషణ చేశాడు.

**పితృదేవతలకు పిండాలను :**

పితృదేవతలకు పిండాలను చేసికాకులకు పెట్టేబుద్ధిలేని గాడిదలారా పెంట తినేకాకితండ్రిఎలా అవుతాడని హేతువాదాన్ని వివరించారు, పితృదేవతలు కాకుల రూపంలో వచ్చి పిండాలు తింటే తృప్తి చెందినట్లుగా అనుకుని నమ్మేవారిమూడవిశ్వాసాలను ఖండించారు.

**కర్మకాండ :**

హృదయంలో కల ఈశ్వరుని తెలుసుకోలేక, శిలలకు మొక్కుతున్న జీవులారా శిలల్లో ఏమీ లేదు, జీవులందేదైవత్వం ఉంది. విగ్రహారాధన ప్రోత్సహించి మత గురువులు మూఢచారాలతో మనలను మోసం చేస్తున్నారు. అదిమనం గ్రహించాలని బోధించాడు.

**కపట గురువులు :**

శాకాహారం తిని, కాషాయ వస్త్రాలు కట్టి, గుండు చేయించుకున్న, తలలు బోడులైన తలపులు బోడులా అని వెంట్రుకలు లేకున్నా, వలపుల తలంపులున్న దొంగ సన్యాసుల వ్యవహారాలను తెలియజేశాడు.

**రామాయణం :**

బంగారు లేడిభూమ్మీద ఉండదనేఆలోచన లేకుండా, భార్య అయిన సీతను ఒంటరిగా విడిచి వెళ్ళిన రాముని గూర్చి ఇంగిత జ్ఞానం లేని తెలివి తక్కువ వాడు మీ దేవుడు అని తర్కతత్వాన్ని తెలిపాడు.

**కులం :**

అగ్రవర్ణాల అహంకారం గల కులాల వారికన్నా, ధనవంతులైన అన్ని కులాల వారు అందరిమన్ననలు పొందుచున్నారు, అందరినీ శాసిస్తున్నారంటాడు.

**అంటరానితనం :**

మాల వారిని అంటరాని వాడు అన్నవాడేపెనుమాల అంటూ కుల ఆచారాలను దుయ్యబట్టాడు. కొందరిని దూరంగా ఉంచి అనాదరించేవారు నరపసువులని కుల వ్యవస్థను ఖండించాడు. ఇదివిప్లవవాదం.

**భూస్వామ్యం - ధనస్వామ్యం :**

'ఇదంతా నా స్థలం - నా పొలం' అని అహంకరించేనిన్ను చూసిఅశాశ్వతమైన మీ శరీరానిదా భూమి, అని శాశ్వతమైన భూమి నవ్వదా అని తన జ్ఞానాన్ని తెలిపాడు ధనవంతులు ఎవరినైనా శాసిస్తారని ధన ప్రభావాన్ని చాటిచెప్పాడు.

**లోభి :**

మేక చన్ను నుంచి పాలు వస్తాయి కానీ, మెడ చన్ను కుడిచిన పాలు రావు, ఆకలి తీరదు. కనుక పిసినారిని నమ్ముకుంటేఆకలి

తీరదు. ఆశ మాత్రము ిమిగులుతుంది. లోభి ఎవరికీఎట్టిపరిస్థితుల్లోనూ సాయం చేయదని వివరించాడు.

**సంస్కా రం :**

ఎంత చదువు చదివినా, హీనమైన గుణం కలవాడు మారడు. పాలతో బొగ్గును కడిగినా బొగ్గు రంగు మారనట్లు, “సంస్కారం లేని వాని చదువు వ్యర్థం” అని తెలిపాడు. సమాజంలో ‘చదువు కన్నాసంస్కారం మిన్న’ అనేసందేశాన్ని ఇచ్చాడు.

**లోకజ్ఞత :**

మేడిపండును చూస్తేమిల మిల మెరుస్తుంది. కాయ కోసిచూస్తేపొట్టనిండా పురుగులు ఉంటాయి. పిరికివానిని పురుగులు నిండిన మేడిపండుతో పోల్చాడు. పిరికివాళ్లు అందమైన అబద్ధాలు చెప్పి సమాజానికితన అసలు రూపం తెలియనియ్యరు అని నిజాన్ని వివరించాడు.

**సమాజం తేడాలు :**

ఉప్పు, కర్పూరము తెల్లగా ఒకేరకంగా కనిపిస్తాయి. రుచిలో తేడా ఉంటుంది. పురుషుల్లో లోకం కోసం త్యాగం చేసే పురుషులు వేరుగా ఉంటారంటాడు. రూపం చూడడానికి ఒకే రకంగా ఉన్న రుచుల్లో తేడా ఉన్నట్టు, మనుషుల స్వభావాల తేడాలను, మనుషుల మధ్య భేదాలను తన లోకాను భవాన్ని తెలియజేశాడు.

**జీవితానుభవం :**

వృక్షానికి వేరులో చీడపురుగు పట్టిచెట్టును నాశనం చేస్తుంది. దుర్మార్గుడు మంచివారిని కూడా చెడగొడతాడని చెప్తాడు. భారతంలో శకునిలా దుర్మార్గుడు మంచి వారిని సర్వనాశనం చేస్తాడని కవి భావన.

**మానవత్వం :** ఆగర్భ శత్రువు దొరికినా, అపకారం చేయక ఉపకారం చేస్తేశత్రువైనా మిత్రుడువుతాడనేమానవత్వాన్ని మనవి చేశాడు.

**తప్పు లెన్ను వారు :**

ఎదుటివారితప్పులను ఎన్నో, ఎందరో ఎత్తిచూపుతారు. కానీ వారితప్పులను వారు తెలుసుకోరు అని బొంకే వారిని గూర్చి వివరించాడు.

**తగ్గిఉన్నా వినయమే:**

మనకు అనుకూలం కాని చోట గొప్పలు చెప్పరాదు. తగ్గిఉండడం వల్లనష్టం లేదు. అద్దంలో చూస్తేకొండ చిన్నగా కనిపించినా దానికేమి విలువ తగ్గదు అని గొప్పవారి, గొప్పతనాన్ని గూర్చి వివరించాడు.

**సాధన - సాధ్యం :** పాడుతూ ఉంటేరాగం మనకు సులభం అవుతుంది. తినగా తినగా వేపాకు తియ్యగా అవుతుంది. సాధన చేస్తేపని ఏదైనా సాధ్యం అవుతుందని కవి భావన. మన చుట్టూ ఉన్న ఉపమానాలతో, అర్థమయ్యేలా చిన్న పదాలతో, కవిత్వం చెప్ప ప్రపంచాన్ని మనకు సులభంగా తెలియజేసిన పజ్రా కవి వేమన. ఇవేమన జీవితాలు అని నినదించిన “నిజమైన కవి వేమన” అని అందరూ విశ్వసిస్తారు ఇదిసజా వైన నైజంతో నిండిన నిజం.

**ఆధారగ్రంథాలు**

1.ప్రజాకవి వేమన ఎన్ . గోపి

2.తెలుగు సాహిత్య సమీక్ష - జి . నాగయ్య

3.తెలుగు సాహిత్య చరిత్ర - తెలుగు అకాడమీ ప్రచురణ

*******

# 39. శ్రీకాళహస్తీశ్వర శతకం - వైశిష్ట్యం

డా|| మల్లెపోగు మాదన్న

తెలుగు అధ్యాపకులు

యస్.జి.యస్.ఆర్ట్స్ కళాశాల(తి.తి.దే),

తిరుపతి.

చరవాణి: 99660 63428

**శతకం-ప్రాశస్త్యం:**

శతక వాఙ్మయహారానికి మణిపూసగా చెప్పదగింది. 'శ్రీకాళహస్తీశ్వర శతకం'. ఈ శతకంలోని ప్రతిపద్యం జీవన్ముక్తుడైన 'దూర్జటి' మహాకవి, పరమేశ్వరుని సాన్నిధ్యంలో ఆలపించిన ఏకాంత స్వగతం. ఈ శతకం అద్వైత మణిమందిరానికి తొలి వాకిలి. ఒక వాఙ్మయ తపస్సు. ఒక ఆధ్యాత్మిక దివ్యార్చన. శతక కవులలో చాలామందిలో లేని లక్షణాలు దూర్జటిలో దర్శనమిస్తాయి. అవి.ఆవేశం, అవలోకనం, అలౌకిక తత్వానుభూతి ఆయనకు అందినంతగా మరెవ్వరికీ అందలేదన్నది అతిశయోక్తికాదు.

**దూర్జటి-స్థిత ప్రజ్ఞత:**

''శ్రీవిద్యుత్కలితా జవంజవ మహా జీమూత పాపాంబు ధారావేగంబున మన్మనోబ్జ సముదీర్ణత్వంబు గోల్పోయితిన్'' ఈ సంసారం ఒక మహామేఘం. అందులోని సంపదలన్నీ మెరుపు తీగలు. పాపమనే జడివాన ఈ మబ్బునుంచే కురుస్తోంది. ఈ జడివాన తాకిడికి తట్టుకోలేక నా మనస్సనే పద్మం పగిలి వికాసాన్ని కోల్పోయింది.) అని తన ఆవేదనను శతకపు తొలిపద్యంలోనే ఆవిష్కరించాడు-దూర్జటి. శ్రీకారంతో కావ్యారంభం చేయడం సనాతన సారస్వత సంప్రదాయం. శ్రీకారంలో ఆ ఉచ్చారణ నాద వ్యంజనంలో ఏదో మహోజ్వలమైన అనుభూతీ అనిర్వచనీయమైన భావనా గాంభీర్యం ఇమిడి ఉండటం విదితమే. అయితే శ్రీకారాన్ని కేవలం సారస్వత సంప్రదాయాన్ని అనుసరించడం కోసమే కాకుండా అన్వర్థంగా కూడా దూర్జటి ఇక్కడ ప్రయోగించడం గమనార్హం.

ఇక్కడి శ్రీకార ప్రయోగం సుదీర్ఘ సమాసంగా రూపకాలంకారంగా ఉత్తమమైన, మనోహారమైన అర్థాన్ని అందిస్తోంది. 'విద్వత్కవి' మాత్రమే కాకుండా శ్రీమంతుడు కూడా అయిన దూర్జటి. ఈ ఐహిక ప్రపంచమంతా వ్యర్థమని తెలుసుకున్నాడు. అంతేకాదు ఆముష్మికం కోసం ఆర్తితో దూర్జటి పరమేశ్వరునికి మొరపెట్టుకోవడమే శ్రీకారయుక్తమైన ఈసుదీర్ఘ సమాసానికి తాత్పర్యం. ఈ శతకంలోని ప్రతిపద్యం-భావ ప్రీతితో స్వయం సంపూర్ణమైన ముక్తకంగా భాసిల్లుతుంది. విడివిడిగా ఉండే పద్యాలకు 'శ్రీకాళహస్తీశ్వరా' అనే మకుటం అంతర్వాహినిగా ఐక్యబంధం సమకూరుస్తుంది.

ఈ శతకంలో-'శ్రీకాళహస్తీశ్వరా'అన్న పిలుపు మకుటంగా-ఒక దివ్య తేజస్సుతో అలరారుతుంటుంది. శతకంలోని పద్యాలన్నీ ముక్తకాలైనా సరంలోని దారంలా (పూసల్లో దారంలాగా) ఆ పద్యాలన్నింటిలో అంతర్వాహినిగా దూర్జటి హృదయావేదన, భావావేశం, దృక్పథం, శీలం, ప్రవృత్తి మొదలైన వాటి సమ్యగ్దర్శనం 'మకుటం'లో ప్రస్ఫుటమవుతుంది. శ్రీకాళహస్తీశ్వరుణ్ణి ఎలుగెత్తి పిలుస్తున్నట్లు తనగోడు వెళ్ళబోస్తున్నట్లు ప్రతి పద్యం చివర మకుటంలో దూర్జటి తన భావాన్ని వ్యక్తం చేశాడు.

**శతకం-ఆత్మాశ్రయరీతి**

శతకంలోని ప్రతిపద్యంలోనూ కవి జీవితానుభవాలు, ముత్యంలోని నీరులా తొణికిసలాడుతుంటాయి. ఒక విధంగా శతకమంతా`కవికి చెందిన ఆత్మాశ్రయ భావానికి అఖండమైన అభివ్యక్తే! ప్రతి పద్యంలోను కవికి చెందిన ఆత్మ నాయకత్వం

అంగీభూతమై ప్రకటితమవుతుంది. దూర్జటి శైలిలో 'ఆత్మీయత'ఒక తిరుగులేని ఆకర్షణ. అదే ఆ కవిత్వాన్ని అజరామం చేసి 'చిరంజీవై'వర్ధిల్లేట్లు చేసింది.

భావం ప్రధానమైన ఈ శతకంలో వ్యవహారిక భాషా ప్రయోగం రసభంజకం కాలేదు సరికదా 'రసపోషకమై' అలరారుతుంది. ''అంతా మిథ్య, ఎరింగిన్, రోసిరోయదు, రోసిందేటికి'- వంటి ప్రయోగాల వెనుక ఒక భావోద్రేకం, ఒక ఆవేదన, ఆర్తి నిండి ఉంటాయి. ఇది జాతీయోక్తి ప్రీతే కాని వ్యాకరణ పరిజ్ఞాన రాహిత్యం కాదు. అటు సంస్కృత పదాలనూ సమాసాలనూ విరివిగా ప్రయోగిస్తూనే మరోవైపు తేట తెలుగు నుడికారపు ప్రయోగాలు చేయడం దూర్జటికి వెన్నతో పెట్టిన విద్య. "దివిజక్ష్మారుహదేను రత్న ఘనభూతి ప్రస్ఫుర ద్రత్న సానువు"అన్న సమాస ఘటనలో దూర్జటి కవిత్వముద్ర కన్పిస్తుంది. కాబట్టే శ్రీకృష్ణదేవరాయులు - ''స్తుతిమతియైన ఆంధ్రకవి దూర్జటి పల్కులకేల గల్గెనో అతులిత మాధురీ మహిమ" అని ప్రశంసించాడు.

ప్రౌఢ సంస్కృత సమాసభరితమైన రచనలో కూడా దూర్జటి చాతుర్యం అనన్య సామాన్యం. శివనామా కీర్తన మహత్యాన్ని వర్ణించే కింది పద్యంలో 'అక్షరరమ్యత'అలరారుతుంది.

జలకంబుల్ రసముల్ ప్రసూనములు వాచాబంధముల్, వాద్యముల్
కలశబ్ధ ధ్వనులంచితాంబర మలంకారంబు దీప్తుల్మెరుం
గులు నైవేద్యము మాధురీ మహిమగా గోల్తున్ నినున్ భక్తి రం
జిల దివ్యార్చన గూర్చి నేర్చిన క్రియన్ శ్రీకాళహస్తీశ్వరా!

''శ్రీకాళహస్తీశ్వరా! రసాలే అభిషేక జలాలుగా, మాటల కూర్పులే పువ్వులుగా, మధుర ధ్వనులే మంగళ వాద్యాలుగా, అలంకారమే రత్నాంబరంగా, దీప్తులే హారతులుగా, మాధురీ మహిమే ఒక నైవేద్యంగా`ఈ దివ్యార్చనను నా ఎరిగినట్లు రచించి నిన్ను సేవిస్తాను'' - అని భక్తి ప్రపత్తులతో, వినమ్రతతో ప్రణమిల్లాడు కవి శేఖరుడు ఈ పద్యంలో.

''నానేర్చిన భంగి జెప్పి వరణీయుడనయ్యెద భక్త కోటికిన్'' అని సవినయంగా పలికిన తిక్కన మాదిరిగా -దూర్జటి కూడా ఈ పవిత్ర సారస్వత యజ్ఞాన్ని దివ్యార్జనగా తానేర్చిన క్రియ నిర్వహించినట్లు నివేదించాడు. ఈ శతకంలో - ప్రౌఢ ప్రయోగ పద బంధాలతో, అనన్య మధురమైన శబ్ధ ధ్వనులతో వివిధాలంకారాలతో కావ్యగుణ దీప్తులతో, మాధురీ మహిమతో ఒప్పే రసవత్ ప్రబంధమని సుకుమారంగా దూర్జటి మహాకవి పేర్కొన్నారు.

**శతకం-పద ప్రయోగ వైచిత్ర:**

సాహితీపరంగా ప్రయుక్తాలైన పద్యాలన్నిటికీ లాక్షణిక జగత్తులో విశేషార్థాలున్నాయి. కవితా రచన 'నవరస రుచిరంగా'వుండాలి. లలిత కళానుభూతి వల్ల సహృదయునికీ కలిగే ఆనంద తన్మయత్వ ఫలితంగా పొందిన 'రసం'- సహృదయులకు తెలిసిన విషయమే. 'వాచాబంధముల్' అంటే శయ్యాపాకములు అని చెప్పవచ్చు. వివిధ భావాలకు తగినట్టి భాష, సమాసాలు, పదగుంఫనాలు ఈ శతకంలో ధూర్జటి తూకం తూచి వాడుకున్నాడు.

వాచ్యార్థం కంటె సుందరమైన, సుకుమారమైన అర్థాన్ని ధ్వనింపజేసేది 'ధ్వని'. అదే కావ్యానికి హృదయం. అలంకారాలు, దీప్తులు, మాధురీమహిమ కావ్యశోభకు హేతువులు, కావ్యస్రోతస్సుకు సేతువులు. ఇవన్నీ ఈ శతకానికి ఎనలేని విశిష్టతను చేకూరుస్తున్నాయని దూర్జటి స్వోత్కర్షగా కాకుండా 'వ్యంగ్య గర్భితంగా' తాను చేసే సారస్వత దివ్యార్చనలో ఉపకరణాలు అని నివేదించాడు.

**శతకం-వాస్తవికత:**

రాజలాంఛనాలను ఆపేక్షించి కాలాన్ని వృధాచేసే మర్త్యులను గర్హిస్తూ చెప్పిన ''మదమంతంగంబు'', ''సంపద్వరము'' పారద్రోలి లాంటి పద్యాలను చదివినప్పుడు దూర్జటి పదాల కూర్పులోని విశిష్టత తెలుస్తుంది. నిజమైన బంధులెవరో తెలుపుతూ దూర్జటి చెప్పిన ''నీపై కావ్యము.....'' వంటి పద్యాలను ఆస్వాదించినప్పుడు ఆయన శైలికి అనిర్వచనీయమైన ఆనందాన్ని కలిగించే సొగసు ఉందని అనిపిస్తుంది ''ఏ లీలన్ నుతింపవచ్చు నుపమోత్రేక్షా ధ్వని వ్యంగ్య శబ్దాలంకార విశేష భాషల కలభ్యంబైన నీ రూపమున్'' అని పరమ సాత్వికమూర్తిలా పలికినా`పరమేశ్వరుడు 'భుజగ శుండాలాటవీ చారులకు మోక్షం ప్రసాదించడానికి కారణం ''పవమానాశన భూషణ ప్రకరముల్ భద్రేచ చర్మంబు నాటకవిత్వంబు ప్రియంబు''లు కావడం వలననే కదా అంటూ హేతూత్రేక్షాలంకారాన్ని ప్రయోగించినా, ఐహిక భోగవిముఖుడు దూర్జటి. సిరులందు మదాంధులైన మానవుల ప్రవృత్తికి కారణం తెలీక 'పద్యోత కీట ప్రభల్ సురవీధీ లిఖితాక్షరంబులసువుల్ జ్యోత్స్నా పయఃపిండముల్ సిరులందేల మదాంధులౌదురు జనుల్? అని అమాయకంగా ప్రశ్నించినా దూర్జటి 'సిరులు, ప్రాణములు, చంచలములు, అనిత్యములు అని తెలుపుతూ మనకు నిత్యం కనిపించే అనిత్యాలైన వస్తువులకు ఊతమిస్తూ తన 'గడుసరి తనాన్ని' ప్రదర్శించాడు. సంస్కృత సమాస ఘటనలో, తెలుగు నుడికారాల వంపు సొంపుల కూర్పులో దూర్జటికొక గడుసరి ఒడుపు ఉందని సుస్పష్టంగా తెలుస్తుంది.

**శతకం-వైరాగ్యచింతన:**

''అకలంక స్థితి నిల్పి నాదమను ఘంటారావమున్ బిందు దీ
పకళాప శ్రేణి వివేక సాధనము లొప్పంబూని యానందదా
పక దుర్గాటవిలో మనోమృగము గర్వస్ఫూర్తి వారించు వా
రికిగా వీడు భవోగ్ర బంధలతికల్ శ్రీకాళహస్తీశ్వరా'' ఈ పద్యంలో

(స్వచ్ఛస్థితి కలిగిన నాదం, బిందువు, కళ అనే విజ్ఞాన సాధనాలను పూని ఆనందానిచ్చే ప్రణవమనే అరణ్యంలో మనస్సు అనే మృగం యొక్క గర్వస్ఫూర్తిని ఆపగలిగిన వారికి గదా ఈ భవబంధాలు తెగిపోతాయి.) ఓంకార స్వరూప వివరణం అంతర్లీనంగా ఉంది. పరబ్రహ్మకు ప్రతీకగా ప్రశస్తి వహించిన ఓంకార ప్రణవనాద స్వరూపాన్ని వర్ణించిన దూర్జటి కవివరేణ్యుని ప్రతిభ ఇందులో కన్పిస్తుంది.

వస్తు వర్ణన చేసేటప్పుడు వర్ణించే వస్తువు కనులెదుట కనిపించేట్లు చేయడం దూర్జటి వర్ణనా చాతుర్యం. తనకు ఆరాధ్యులైన వారిని గురించి ''భసితోద్ధూళన ధూసరాంగులు జటాభావోత్తమాంగుల్......'' అన్న పద్యంలో శివయోగీశ్వరులను కనులకు కట్టినట్లు ప్రత్యక్షీకరింపచేశాడు. సంస్కృత సమాస ఘటనలో ఆయనకు గల సత్ప్రతిభ, నైపుణ్యం కన్పిస్తాయి.

**శతకం-సంపద అశాశ్వతం**

ధనం సంపాదించడానికి జనులు అనేక రకాలుగా అవస్థపడతారు కానీ అలాంటి సిరి ఎన్ని రోజులు నిలుస్తుంది? అనే దూర్జటి మాటలు ''మాగృధఃకస్య స్విద్ధనమ్'' అనే ఉపనిషత్ వాక్యానికి సారస్వత వాఖ్య.

''ఆరావంబుదయించే'' అనే పద్యం ''ఆనందో బ్రహ్మేతి వ్యజనత్'' అనే ఉపనిషత్ వాక్య సారాంశం.

దూర్జటిది 'వైరాగ్యభక్తిని'వ్యక్తీకరించే శైలి. దూర్జటి కవిత్వంలో భక్తి కవిత్వంలో ఉండే ధారా మాధుర్యం, తాత్విక దృక్పథం, వైరాగ్యదృక్పథం అనే మూడు దృక్పథాలు వుంటాయి. నీతి శతకంలో కనపడే ప్రజాసూక్తి ప్రయోగ ప్రావీణ్యం`అతని కవితా నైపుణ్యంలో ఇమిడి వుంది. అధిక్షేపాత్మక శతకాల్లో కనపడే వ్యంగ్య రచనా ధోరణి కూడా దూర్జటి కవిత్వంలో జాలువారుతుంది. ఇలా తెలుగు సాహిత్యంలో వెలువడిన ప్రధాన శతకశాఖల్లోని కవితా లక్షణాలన్నీ మేళవించిన వినూత్న అపూర్వ కవితా శైలిని దూర్జటి సాధించారు.

**దూర్జటి మనస్తత్వం:**

ఆత్మాశ్రయ కవిత్వానికి దర్పణప్రాయాలైన శతకాల్లో కవి వ్యక్తిత్వం సుస్పష్టంగా ప్రస్ఫుటమవుతుంది దూర్జటి శివాద్వైతి శివసారమ్యం నమ్మి దానికే తన జీవితాన్ని అంకితం చేసుకున్న విరాగి. ఈయన యవ్వనంలో రక్తుడూ, జీవిత చమర దశలో విరక్తుడు. దూర్జటి స్వాత్కర్షకు పూనుకోక తన వ్యక్తిత్వంలోని లోటుపాట్లనూ తాను చేసిన అపరాధాలనూ ఎలాంటి దాపరికం లేకుండా హృదయాన్ని చీల్చుకొచ్చిన 'బాధాతప్త'భావాలను పద్యరూపంలో ప్రకటిస్తాడు. తాను ''భవకేళీమదిరామదం'' లోచిక్కి పాపాత్ముడుగా నరకాల్లో రాశిపాలైనట్లు అంగీకరిస్తూ`పరమ పవిత్రమైన ఆత్మపరిశోధన చేసుకున్న`భగవంతుని శరణువేడిన యోగీశ్వరుడు`దూర్జటి.

శ్రీకాళహస్తీశ్వరుని సాన్నిధ్యం వదిలి గౌరవాసాదకమైన రాజస్థాన నివాసం కూడా దూర్జటి మనః కుహరాంతరాలలో భూకంపన ప్రకంపనాలను కలిగించింది. అది తాను చేసిన అపరాధమనీ, దానికి తగిన శిక్షపడిరదనీ వ్యంగ్యంగా చెబుతూ దూర్జటి ''స్వామి ద్రోహము జేసి వేరొకని కొల్వంబోతినో'' అంటూ ''నన్నీ దుఃఖవారాశి వీచీ మధ్యంబున ముంచియుంపదగునా'' అని బాధపడ్డాడు.

రక్తమాంస పురీషాదులకు నిలయమే దేహం. ఇలాంటి దేహాన్ని ధరించిన మానవుడు కామక్రోధాదులకు లోనుకావడం వింతకాదు. అయితే పశ్చాత్తాపం`అందులోనూ చిత్తశుద్ధితో`జ్ఞానదీప్తితో కూడిన పశ్చాత్తాపం ఎంత అరుదైందో అంత విలువైంది. అలాంటి అరుదైన అమూల్యమైన లక్షణం - దూర్జటి వ్యక్తిత్వంలో ఉప్పొంగి-అది ''కాయల్ గాచె వధూనఖాగ్రములచే గాయంబు'' అనే కవిత్వం జాలువారింది.

దూర్జటి సాక్షాత్తూ భగవంతుని ముఖంచూసి తాను లోగడ లోనైన ప్రలోభాలను పశ్చాత్తాప్తుడై అశ్రుసిక్త నయనాలతో చేసిన అంజలి ఈ పద్యం. ఇందులో ప్రతి అక్షరంలోను ఆయన పశ్చాత్తాపం ప్రతిబింబిస్తుంది. శంకాతంకాలు లేకుండా కీర్తిఅపకీర్తులను లెక్కచేయకుండా ''మన్మథ విహారక్లేశ విభ్రాంతి చేబ్రాయంబాయెను'' - అంటూ తాను లోగడ నెరపిన నిరర్థక జీవితాన్ని గురించి నిజం దాచకుండా చాటిచెప్పగల ఆర్జవం కల్గిన కవీశ్వరుడు దూర్జటి.

దూషణ భూషణ తిరస్కారాలకు అతీతమైన స్థితప్రజ్ఞుడు దూర్జటి. ఆంధ్రకవులలో పేర్కొనదగిన స్వచ్ఛంద వేదాంతానుష్టాత దూర్జటి. కాబట్టే ''నిను సేవింపగ నాపదల్ పొడమనీ'', ''నిత్యోత్సవంబబ్బనీ'' అని నివేదించుకున్నాడు.

**ముగింపు:**

ఆత్మాశ్రయ కవిత్వానికి దర్పణప్రాయాలైన శతకాల్లో కవి వ్యక్తిత్వం సుస్పష్టంగా ప్రస్ఫుటమవుతుందన్నది తెలిసిన విషయమే! దూర్జటి శివాద్వైతి అయి శివసారమ్యం నమ్మి దానికే తన జీవితాన్ని అంకితం చేసుకున్న విరాగి. ఒక్కమాటలో చెప్పాలంటే దూర్జటి శతకంలో ఆంధ్రసాహిత్యంలోని శతక కవితా లక్షణాల సారమంతా సమగ్రంగానూ సంగ్రహంగానూ సాక్షాత్కరిస్తుంది. శైవభక్తి శతకాలలో దూర్జటి రాసిన శ్రీకాళహస్తీశ్వర శతకం అగ్రగణ్యమైంది. నిర్వ్యాజభక్తి, ఆత్మవిమర్శనం, ధారశుద్ధి, భావనాభక్తి అనే గుణాలు కాళహస్తీశ్వర శతకానికి విశిష్టతను చేకూర్చాయని నిస్సందేహంగా చెప్పవచ్చును. ఈ శతకంలో భక్తి, వ్యాజస్తుతి, నిందాస్తుతి మొదలైన భావనలు కన్పిస్తాయి.

**ఆధారగ్రంథాలు**


1. దూర్జటి - శ్రీకాళహస్తీశ్వర శతకం.
2. ఆచార్య జి.నాగయ్య - తెలుగు సాహిత్య సమీక్ష - నవ్య పబ్లికేషన్స్, తిరుపతి 2002.
3. డా.ద్వా.నా.శాస్త్రి - తెలుగు సాహిత్య చరిత్ర- విశాలాంధ్ర పబ్లికేషన్స్, హైదరాబాద్ 2005.


*******

# 40. తెలుగు భాషా పరిరక్షణ- తక్షణ కర్తవ్యం

**కె సురేష్ బాబు,** M.A, T.P.T, NET
తెలుగు అధ్యాపకులు
S.V.K.P& K.S .RAJU ARTS AND SCIENCE COLLEGE (A),
Penugonda.
Mobile number: 9492493103
Email: suresh karni@ gmail.com

**ఉపోద్ఘాతం:**

తెల్లవారుజాము నుండే రాత్రి నిద్రించే వరకు అనేక ఆంగ్లపదాలతోనే రోజు గడుస్తుంది. నువ్వు ఎవరివి? అని మనల్ని ఎవరైనా అడిగితే సమాధానం చెప్పడానికి అనేక ఆధారాలున్నాయి. మన తల్లిదండ్రులను దృష్టిలో పెట్టుకొని ఫలానా వారి అమ్మాయిని లేదా అబ్బాయిని అని చెబుతాం. కులాన్ని బట్టి మాది ఫలానా కులం అని, మతాన్ని బట్టి మాది పలానా మతం అని చెబుతాం. అట్లాగే మనం మాట్లాడే భాషను బట్టి కూడా మేము తెలుగువాళ్ళం,ఉర్దూవాళ్ళం , తమిళులం ఇలాగ చెబుతాం అంటే ఒక వ్యక్తి ఉనికిని చాటే అనేకాంశాలలో భాష కూడా ఒకటి అని అర్థం. అదే ఒక జాతి ఉనికిని చెప్పడానికి భాషే ప్రధాన ఆధారం. ఒక జాతి మనుగడను చాటే అంశాలలో ఆ జాతి మాట్లాడే భాష కీలకమైంది. మేము తెలుగు వాళ్ళం అని మనం చెప్పుకోవాలంటే మనం తెలుగుజాతివాళ్లం అయి ఉండాలి. అలా చెప్పుకోవాలంటే మన తల్లి భాష తెలుగును మనం మాట్లాడు తూ ఉండాలి. తెలుగును చదువుతూ ఉండాలి. తెలుగులో రాస్తూ ఉండాలి. ఆంధ్రదేశంలో ఆబాల గోపాలం ఇంగ్లిష్ మాయలో పడి తెలుగు కు దూరమైపోతున్నారు. పిల్లలకు మూడవ యేటనే. ఏ ,బి, సి, డి లతో అక్షరాభ్యాసం. "బా – బా బ్లాక్ షీప్" తో పద్యపఠనం ప్రారంభం అవుతుంది.ఆరేడెండ్ల వయసు వచ్చిన తర్వాత విధిలేక, అ, ఆ ,ఇ ,ఈ లు బొమ్మలతో చూసి రాయటం ప్రారంభం అవుతుంది.

అక్షరాలు దిద్దించడం అనే పద్ధతి లేదు. ఫలితంగా ఈనాటి పిల్లలు చేతివ్రాత వికారంగా తయారైంది. అక్షరాన్ని ఎక్కడ ప్రారంభించి ఎక్కడ అంతం చేయాలో తెలియదు. తెలుగుపద్యాలు, బాల గేయాలు, తెలుగు రైమ్స్ వినబడవు ఒన్, టూ, త్రీ లు వచ్చిన మూడు , నాలుగు సంవత్సరాలకు గానీ ఒకటి రెండ్లు రావు.ఇంగ్లీషు లాంటి అంతర్జాతీయ భాషను అభినందించాల్సిందే కానీ, ఆ భాష పాఠశాల,ఆఫీస్ ల వరకు పరిమితం కావాలి. ఇంగ్లీష్ మన ఇంట్లో హాల్లోకి ,భోజనాల గదిలోనికి చివరకు పడకగదిలోకి కూడా వచ్చేసింది.

ఇంగ్లీష్ వ్యామోహం వలన ఇంగ్లీష్ ప్రాథమిక స్థాయి నుండే బోధనా మాధ్యమంగా ప్రత్యేకించి ప్రైవేటు పాఠశాలలో బలపడింది. ఆధునిక ప్రసార మాధ్యమాలు, సినిమాలలో వాడే తెలుగులో ఇంగ్లీషు పదాలు పెరుగుతున్నాయి. భాషోద్యమంతో ప్రత్యేక రాష్ట్రంగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడినా, ప్రభుత్వ కార్యకలాపాల్లో తెలుగుకి ప్రాధాన్యత రాలేదు. ఈ స్థితిని చక్కదిద్దడానికి వ్యక్తులు, సంస్థలు కృషి చేస్తున్నాయి.

- తెలుగు భాషా చైతన్య సమితి
- తెలుగు భాషోద్యమ సమాఖ్య
- తెలుగు భాషా వికాస ఉద్యమం
- ఇ -తెలుగు

- సి. పి. బ్రౌన్ అకాడమి
- తెలుగు రథం -సాహిత్య, సాంస్కృతిక, సామాజిక వికాస సంస్థ
- తెలుగు -ఈ

**తెలుగు వాడుక స్థితి మెరుగునకు సూచనలు**

తెలుగు సాహిత్యంలో మాధ్యమాలలో ఎన్నో మార్పులు జరుగుతున్నాయి. మాటల పొందిక కరువైపోతుంది. తేటతెనుగు మాటల అల్లిక కరువైపోతున్నది. స్వరమాధ్యమం కరువైపోతుంది. తెలుగు భాషలో మాట్లాడే వారే తక్కువైపోతున్నారు. ఆధునిక పోకడల పేరుతో మాతృభాష స్వరూప స్వభావాలను రూపురేఖలను మార్చేస్తున్నరు. భాష వికసికై జాతి వర్ధిల్లుతుంది. తెలుగు భాష ఖండాంతరాలకు విస్తరించింది .తెలుగు భాష నేడు రెండు తెలుగు రాష్ట్రాల్లోనూ తెలుగు భాష ఉనికి ప్రశ్నార్థకంగా మారింది. "తానా" సారథ్యంలోని దేశదేశాలలో తెలుగువారందరు భాషా వికాసానికి చేస్తున్న కృషి అపూర్వం అభినందనీయం.ఇదే స్ఫూర్తితో తెలుగు భాషను పరిరక్షించుకోవాల్సిన బాధ్యత ప్రతి ఒక్కరిపైనా ఉంది. అది తెలుగు వారందరి కర్తవ్యం .

తెలుగు దేలయున్నదేశంబు తెలుగు యేను<br>
తెలుగు వల్లభుండ తెలుగో కండ<br>
ఏళ్లనృపులు గొలువ ఎరుగలే బసాడి<br>
దేశ భాషలందు తెలుగు లెస్స

అని చాటిన విజయనగర చక్రవర్తి శ్రీకృష్ణదేవరాయలు తాను స్వయంగా తెలుగులో "ఆముక్తమాల్యద" అనే ప్రబంధ కావ్యాన్ని రచించారు. భువన విజయం పేరుతో సాంస్కృతిక వేదికను ఏర్పాటు చేసి అష్టదిగ్గజ కవులను పోషించడం ద్వారా తెలుగు భాష వైభవానికి ఆనాడే కృషి చేశారు. తెలుగు జాతికి ఎంతో ఘనమైన చరిత్ర ఉంది. ఆ చరిత్ర మూలాలు తెలియని నేటి తెలుగు ప్రజల భాషను కూడా చిన్నచూపు చూస్తున్నారు.భాష నశిస్తే జాతి నశిస్తుందని ఊహ కూడా తెలుగువారికి లేదు. ఇది తెలుగు జాతి అనే ప్రేరణ పొందితేనే తెలుగు భాష వికసిస్తుంది.

తెలుగు భాషను ఆధునీకరించడం అధ్యయన కేంద్రాల స్థాపన ద్వారా పద సంపదను కాపాడుకోవడానికి కృషి చేయాలి. అవకాశం ఉన్న ప్రతి ప్రాంతంలోనూ విశ్వవిద్యాలయాలలో తెలుగు విభాగం ఏర్పాటు చేసి పరిశోధనలను ప్రోత్సహించాలి. ముఖ్యంగా పిల్లలు సజీవ మాధ్యమాలు భావితరాలకు వారసులు. నేటి బాలలో తెలుగు భాష పట్ల అవగాహన ఆసక్తి కలిగించాలి. తెలుగు జాతి బిడ్డలగా మనందరం గర్వించాలనీ వారికి తెలియజెప్పాలి. పిల్లలకు కళల పట్ల ఆసక్తి కలిగించడం వంటి కార్యక్రమాలు చేపట్టి భాషా సంస్కృతులను పరిరక్షించేందుకు కృషి చేయాలి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు మాతృభాషలో ప్రాథమిక విద్య ఉండటం ఎంతో అవసరం. తెలుగుజాతి సొంత భాష పరిరక్షణకు మనం అందరం నడుం బిగించాలి.

" ఏ భాషలోనైనా తనలో ఇముడ్చుకునే శక్తి ప్రతిభ అన్ని భాషలకంటే ఎక్కువ తెలుగు భాషకు ఉంది"- ప్రొఫెసర్ హల్డేన్

" మాతృభాష తల్లి వంటిది" - రవీంద్రుడు.

**తెలుగు భాష దుస్థితికి కారణాలు.**

- మాతృ భా షాభమానం జనసామాన్యానికి లేకపోవడం. ఇద్దరు తెలుగువారు కలసినా ఇంగ్లీషులో మాట్లాడటం.
- పాఠ్యాంశాల్లో తెలుగు లేకపోవడం. లేక స్థాయిని దిగజార్చడం, ప్రాథమిక విద్యా స్థాయి బోధకులలో భాషా పండితులు ఉండటం లేదు.
- పరభాష పదాలను విచ్చలవిడిగా, తెలుగు పదాలున్నాకూడా పత్రికలలో వాడటం.

- కొత్త పద నిర్మాణం ఎక్కువగా జరగకపోవడం.
- ప్రభుత్వ స్థాయిలోనే వివిధ పథకాలకు ఇంగ్లీషులో పేరులు పెట్టడం. (విలేజ్ మాల్).
- దేవాలయాల పాలనా కార్యక్రమాలు కూడా అనవసరంగా ఆంగ్ల పదాలను( విఐపి బ్రేక్‌దర్శనం),(సన్నిధి బ్లేసింగ్ ) వంటివి.

**మెరుగుకు సూచనలు**

- జనవ్యవహారంలో సహజసిద్ధంగా పుట్టి న పదాలను వాడుకలోకి తేవాలి.
- పత్రికలు తెలుగు పదాలనే విధిగా వాడాలి.
- ఉదా.అసెంబ్లీ- శాసనసభ, కోర్టు- న్యాయస్థానం, ఆర్గానిక్ ఫార్మింగ్- సేంద్రీయ వ్యవసాయం,వాటర్ షెడ్- వాలు గట్లు,చెక్‌డ్యాం-వరద గట్టు. ఆంగ్ల పదాలకు సమానార్థకాలునువాడటానికిసూచ నలు.

**తెలుగు భాష పరిరక్షణ ధ్యేయంగా ప్రత్యేక పత్రికలు,పత్రికలలో శీర్షికలు.**

- తెలుగు వెలుగు, ఈనాడు సంస్థ మాసపత్రిక.
- తెలుగు -ఈ ,అంతర్జాల తెలుగు పత్రిక.
- నడుస్తున్న చరిత్ర, తెలుగు భాషోద్యమ సమాఖ్య మాసపత్రిక.
- ను డి, ఆంధ్రభూమి దినపత్రిక శనివారం సంచికలు శీర్షిక.

**వ్యక్తులు, తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు.**

6. తెలుగు వారితో తెలుగులోనే మాట్లాడటం.
7. భాష పట్ల అవగాహన పెంచుకోవడం.
8. వీలైతే తెలుగు ప్రాచీన, ఆధునిక సాహిత్యాలు మరి మరి చదవడం కొద్దో గొప్పో రచనలు చేసే ప్రయత్నం చేయడం.
9. ఇంట్లో పిల్లలకు తెలుగు చదవడం, రాయడం చక్కటి ఉచ్చారణతో మాట్లాడటం నేర్పడం, తెలుగు పండుగలు, సంప్రదాయాలు, పురాణాలు నేర్పడం.
10. తెలుగు వార్తా పత్రికను ఇచ్చి చదివించి తెలుగు ఉండే కథల పుస్తకాలను ఇస్తే పైగా చదువుకుంటారు.

**ఉపాధ్యాయులు.**

జనని సంస్కృతంబు సకల భాషలకును / దేశ భాషలందు తెలుగు లెస్స

జగతి తల్లి కంటె సౌభాగ్యసంపద / మీ చుట్టాడు. బిడ్డ మేలుగాదె - శ్రీనాధుడు. క్రీడాభిరామం. 37 వ పేరా

ఉపాధ్యాయులు.తెలుగు సామెతలు. గేయ పద్యాలు. శతక పద్యాలు. నీతి కథలు. విద్యార్థులకు తెలియజేయండి.

ముగింపు: తెలుగు భాషా పరిరక్షణకు. మాతృభాషపై మమకారం పెంచుకోనున్నట్లు. ప్రజలలో చైతన్యం తీసుకొని రావాలి. “జననీ జన్మభూమిశ్చ. స్వర్గాదపి. గరియసి ”.అని రామాయణంలో చెప్పినట్లు. జనని, జన్మభూమితో పాటు. మాతృభాష కూడా. స్వర్గం కంటే గొప్పదిగా మనం భావించాలి. అప్పుడే మనలో. ఆత్మవిశ్వాసము. ఆత్మగౌరవము. దేశభక్తి. పెంపొందుతాయి. తెలుగుభాష. పరిరక్షణకు. సంస్థలు. వ్యవ్యక్తులు. ఉపాధ్యాయులు. కృషిచేయాలి.

*******

# 41. జాషువా చెక్కిన సామాజిక సమతా సజీవ శిల్పం

**డా. బేతపూడి సుబ్బారావు**

తెలుగు అధ్యాపకులు,

ఆంధ్ర లయోల కళాశాల.

చరవాణి : 8074546470

**నవయుగ కవి చక్రవర్తి - జీవిత చక్రం**

జాషువా 1895, సెప్టెంబర్ 28 న గుర్రం వీరయ్య లింగమ్మ దంపతులకు ఆంధ్రప్రదేశ్ లోని గుంటూరు జిల్లా వినుకొండ మండలం చాట్రగడ్డపాడులో జన్మించారు. తల్లిదండ్రులు వేరు వేరు కులాలకు చెందినవారు. తండ్రి యాదవులు, తల్లి మాదిగ. తండ్రి పాస్టరుగా పని చేసేవాడు. ఈ ఒక్క విషయం చాలు. మూఢాచారాలతో నిండిన సమాజంలో అవమానాలు, ఛీత్కారాలు ఎదుర్కోవడానికి. బాల్యం వినుకొండ గ్రామంలో పచ్చని పొలాల మధ్య హాయిగానే సాగింది. చదువుకోవడానికి బడిలో చేరిన తరువాత జాషువాకు కష్టాలు మొదలయ్యాయి. ఉపాధ్యాయులు, తోటి పిల్లలు నుండి ఎన్నో అవమానాలు ఎదుర్కొన్నాడు.

అయితే జాషువా ఊరుకొనేవాడు కాదు, తిరగబడేవాడు. అగ్ర వర్ణాల పిల్లలు కులం పేరుతో హేళన చేస్తే, తిరగబడి వాళ్ళను కొట్టాడు. 1910 లో మేరీని పెళ్ళి చేసుకున్నాడు. మిషనరీ పాఠశాలలో నెలకు మూడు రూపాయల జీతంపై ఉద్యోగం చేసేవాడు. ఆ ఉద్యోగం పోవడంతో రాజమండ్రి వెళ్ళి 1915-16 లలో అక్కడ సినిమా వాచకుడిగా పని చేశాడు. టాకీ సినిమాలు లేని ఆ రోజుల్లో తెరపై జరుగుతున్న కథకు అనుగుణంగా నేపథ్యంలో కథను, సంభాషణలను చదువుతూ పోవడమే ఈ పని. తరువాత గుంటూరులోని లూథరన్ చర్చి నడుపుతున్న ఉపాధ్యాయ శిక్షణాలయంలో ఉపాధ్యాయుడిగా 10 సంవత్సరాల పాటు పని చేశాడు. తరువాత 1928 నుండి 1942 వరకు గుంటూరు లోనే ఉన్నత పాఠశాలలో తెలుగు పండితుడిగా పని చేశాడు. రెండో ప్రపంచ యుద్ధ సమయంలో యుద్ధ ప్రచారకుడిగా కూడా పని చేసాడు. 1957-59 మధ్య కాలంలో మద్రాసు రేడియో కేంద్రంలో కార్యక్రమ నిర్మాతగా పని చేసాడు.

ఒకసారి వినుకొండలో జరిగిన ఒక అవధాన సభలో ఆయన పద్యాలు చదివాడు. తక్కువ కులం వాడిని సభలోకి ఎందుకు రానిచ్చారంటూ కొందరు ఆయనను అవమానించారు. ఆయనకు జరిగిన అవమానాలకు ఇది ఒక మచ్చు మాత్రమే. అంటరాని వాడని హిందువులు ఈసడిస్తే, క్రైస్తవుడై ఉండి, హిందూ, మత సంబంధ రచనలు చేస్తున్నాడని క్రైస్తవ మతాధిపతులు ఆయన్ను నిరసించారు. ఆయన కుటుంబాన్ని క్రైస్తవ సమాజం నుండి బహిష్కరించారు. క్రమంగా ఆయన నాస్తికత్వం వైపు జరిగాడు.

జీవనం కోసం ఎన్నో రకాల ఉద్యోగాలు చేసిన జాషువాకు 1964లో ఆంధ్రప్రదేశ్ శాసనమండలిలో సభ్యత్వం లభించింది. 1971 జులై 24న గుంటూరులో గుర్రం జాషువా మరణించాడు.

**సాహితీ సేద్యం**

చిన్నతనం నుండి జాషువాలో సృజనాత్మక శక్తి ఉండేది. బొమ్మలు గీయడం, పాటలు పాడడం చేసేవాడు. బాల్య స్నేహితుడు, తరువాతి కాలంలో రచయిత అయిన దీపాల పిచ్చయ్య శాస్త్రి సహచర్యంలో ఆయనకు కవిత్వంపై ఆసక్తి కలిగింది. జూపూడి హనుమచ్ఛాస్త్రి వద్ద మేఘ సందేశం, రఘు వంశం, కుమార సంభవం నేర్చుకున్నాడు. జాషువా 36 గ్రంధాలూ, మరెన్నో కవిత ఖండికలు రాసాడు. వాటిలో ప్రముఖమైనవి.

గబ్బిలం (1941) అయన రచనల్లో సర్వోత్తమమైనది. కాళిదాసు మేఘ సందేశం తరహాలో సాగుతుంది. అయితే ఇందులో సందేశాన్ని పంపేది యక్షుడు కాదు. ఒక అంటరాని కులానికి చెందిన కథా నాయకుడు తన గోడును కాశీ విశ్వనాథునికి చేరవేయమని

గబ్బిలంతో సందేశం పంపడమే దీని కథాంశం. ఎందుకంటే గుడిలోకి దళితునకు ప్రవేశం లేదు కానీ గబ్బిలానికి అడ్డు లేదు. కథానాయకుడి వేదనను వర్ణించిన తీరు హృదయాలను దీపాల పిచ్చయ్య శాస్త్రి సహచర్యంలో ఆయనకు కవిత్వంపై ఆసక్తి కలిగింది. జూపూడి హనుమచ్ఛాస్త్రి వద్ద మేఘ సందేశం, రఘు వంశం, కుమార సంభవం నేర్చుకున్నాడు. జాషువా 36 గ్రంథాలు, మరెన్నో కవితా ఖండికలు రాసాడు. వాటిలో ప్రముఖమైనవి.

గబ్బిలం (1941) ఆయన రచనల్లో సర్వోత్తమమైనది. కాళిదాసు మేఘ సందేశం తరహాలో సాగుతుంది. అయితే ఇందులో సందేశాన్ని పంపేది యక్షుడు కాదు. ఒక అంటరాని కులానికి చెందిన కథానాయకుడు తన గోడును కాశీ విశ్వనాథునికి చేరవేయమని గబ్బిలంతో సందేశం పంపడమే దీని కథాంశం. ఎందుకంటే గుడిలోకి దళితునకు ప్రవేశం లేదు కానీ గబ్బిలానికి అడ్డు లేదు. కథానాయకుడి వేదనను వర్ణించిన తీరు హృదయాలను కలచి వేస్తుంది.

1932లో వచ్చిన ఫిరదౌసి మరొక ప్రధాన రచన. పర్షియన్ చక్రవర్తి ఘజనీ మొహమ్మద్ ఆస్థానంలో ఉన్న కవి ఫిరదౌసి. అతనికి రాజుగారు మాటకొక బంగారు నాణెము ఇస్తానని చెప్పగా ఆ కవి పది సంవత్సరాలు శ్రమించి మహా కావ్యాన్ని వ్రాశాడు . చివరకు అసూయాపరుల మాటలు విని రాజు తన మాట తప్పదు. ఆవేదనతో ఆత్మహత్య చేసుకొన్న ఆ కవి హృదయాన్ని జాషువా అద్భుతంగ వర్ణించాడు.

1948లో రాసిన బాపూజీ మహాత్మా గాంధీ మరణ వార్త విని ఆవేదనతో జాషువా సృష్టించిన స్మృత్యంజలి.

విహంగ మహిళా సాహిత్య పత్రిక

**1. విశ్వనరుడైన - జాషువా**

కవుల వ్యక్తిత్వాన్ని బట్టి కావ్యాలు పుడతాయి. ఆ కావ్య పరిమళాలతో పటు కవి వ్యక్తిత్వాన్ని పాఠకులకు చేరవేస్తాయి. జాషువా కవిత్వంలో అతని వ్యక్తిత్వం ప్రతిబింబిస్తుంది. అంతేకాకుండా సమకాలీన సమాజ చిత్రణ, సాంఘిక దురాచారాలు, కుల ఆధిపత్యం జాషువా కావ్యాల్లో కనిపిస్తాయి.

''కుల మతాలు గీసుకున్న గీతాల జొచ్చి పంజరాన కట్టుబడను నేను నిఖిల లోకమెట్లు నిర్ణయించిన నాకు తిరుగు లేదు విశ్వనరుడ నేను". ప్రపంచం మొత్తంలో మతం, కులం, వర్ణం మొదలైన మనుషులుగా వర్గీకరించి పరిపాలించే పాలకున్నారు. కులమతాల మధ్య చిచ్చు బెట్టి రాజకీయాన్ని సాధించే విజేతలూ ఉన్నారు. కానీ జాషువా కుల, మాటలకూ అతీతంగా ఉంటానని బహిరంగంగా కుల నిరసన తెలపడం కనిపిస్తుంది. ఏ కులం గీసుకున్న గీతాల్లో ఉండక, వారి పంజరంలో చిక్కక, విశ్వనరుడిగా ఉంటానని ప్రకటించిన ధీశాలి గుర్రం జాషువాగారు. ఆనాటి సమాజం దృష్ట్యా ఈ ప్రకటన అత్యంత సాహసోపేతమనే చెప్పవచ్చు.

జాషువా సమ సమాజ నిర్మాణం కోసం కళలు కంటూ నిరంతరం ఆ కలల ప్రపంచం కోసం ఆరాటపడడం జాషువా రచనల ద్వారా మానవాళికి తెలుస్తుందనడం అతిశయోక్తి కాదు. మాతృ భూమిని మరువని విశ్వ మానవ సృష్టి, ఆస్తికత్వాన్ని తిరస్కరించని హేతువాదం, ద్వేష పూరితం కానీ ఆగ్రహ ప్రకటన అన్ని కలిపి మహా కవి జాషువా " (శత వసంత సాహితీ, మంజీరాలు, పుట :19, 2002) జాషువాను పూర్తిగా తెలియజేసిన మాటలివి. పక్కవారిని అరాచకాలని, అణువైనను వదలకుండా తేటతెల్లం చేసారు జాషువా.

**భోగలాహరించు భుక్తి కన్నుల జూచి**

**పరమ పేదలు దుఃఖ పడని చోటు**

**సాంఘికాచార పంచాస్య గర్జనమున**

**బెదరక జ్ఞానంబు పెరుగు చోట**

**జాతి వైషమ్య రాక్షస పదాహతి చేసి**

**కందక కళలు పెంపొందు చోటు**

**అనాథ బిడ్డలు జూడ నెయ్యంపు సుతల**

**ముద్దులాడని గుణనిధుల్ పుట్టు చోటు**

**చెప్పగదవమ్మ చూచి వచ్చితినే నీవు**

**నిశ్చయంబుగ వాసముండేదను నేను ".**

**(గబ్బిలము పుట : 36)**

భారతదేశంలోని సమస్యలను కవి నిగూఢంగా చెప్పడం జరిగింది. అంతేకాకుండా పేదలు ఆకలితో లేని లోకం, సాంఘిక దురాచారాలు లేని, జాతి వైషమ్యం లేని, అనాధలు కనిపించని, పరిపాలక క్రూరత్వం మచ్చు కైన లేని లోకాన్ని ప్రసాదించమని కోరుకుంటాడు జాషువ . జాషువ మనస్సులో నుండి వెలువడినవే. ఈ సంఘ సంస్కరణ భావాలు. ఇతని గబ్బిలం, పిరదౌసి కావ్యాలు చదివిన పాఠకుల హృదయాలలో అభ్యుదయ భావాలు ఉదయించక మానవని చెప్పవచ్చు.

**2. సామాజిక దురాచారాలపై సాహిత్య దండయాత్ర**

భారత దేశం సాంఘిక దురాచారాలకు నిలయం. ఏ రాష్ట్రమును గమనించిన అనేక దురాచారాలు కనిపిస్తాయి. ప్రాచీన కాలం నుండి అనేక మంది సంఘ సంస్కర్తలు వీటిపై పోరాడినా ఫలితం మాత్రం ఆశించినంతగా రాలేదని చెప్పవచ్చు. లోకంలోని సామాజిక దురాచారాలు జాషువా మాటల్లో....

"ప్రతిమల పెండ్లి చేయుటకు వందలు వేలు వ్యయించు గానీ దుః

ఖితమతులైన పేదల ఫకీరుల శూన్యములైన పాత్రలన్

మెతుకు విదల్పరీ భారతమేదిని క్షుత్తులారునే "

భారత దేశంలో భక్తి ముసుగులో దేవాలయం ప్రతిమలకు లక్షలు, కోట్లు ఖర్చు చేస్తారు. కానీ ఆకలితో బాధపడుతున్న పేదలను, భిక్షాటన చేసేవారిని, ఏ మానవుడు సంస్కరింపడు కదా అని జాషువ బాధపడతాడు. ఈ సమాజం మారాలని ఆరాటపడతాడు.

**3. అస్పృశ్యతపై అక్షరాయుధం**

ఆధునిక యుగంలో మానవుడు గ్రహాంతరాలకు చేరినా కులము మాత్రం పెంపుడు కుక్కలా వెంటాడుతూనే ఉంది. ఈ వ్యవస్థలో ఎన్ని మార్పులు చేసిన మనిషి మెదడును, ఆలోచనలను మార్చడం ఎవరికీ సాధ్యం కానిది. అనాగరికులలో కులతత్వం అంతరిస్తుంటే ఉన్నతులు , పండితులు, మాత్రం నేటికి దానిని పెంచి పోషిస్తున్నారనేది జగమెరిగిన సత్యం. ఈ పండిత వర్గాన్ని వ్యతిరేకించిన వారిలో జాషువ ఒకరని చెప్పవచ్చు. కవికి స్వయంగా ఎదురైనా సంఘటనను తెలుపుతూ అస్పృశ్యతను నిరసిస్తాడు జాషువ.

**"నా కవితా వధుటి వదనంబు నెగాదిగ జూసి రూపు రే**

**ఖా కమనీయ వైఖరులు గాంచి భళీ బళీయన్న వారే మీ**

**దే కులమన్న ప్రశ్న వెలయించి చివాలున లేచి పోవుచో**

**బాకున గ్రుమ్మినట్లగును పార్థివచంద్ర! వచింప సిగ్గగున్ "**

ప్రాచీన కాలంలో కవిత్వం ఒక కులంలో మాత్రమే పుట్టేది. ఆ కాలంలో పండితులకు గౌరవం దక్కేది. కానీ మరే ఇతర కులస్తులు గొప్ప పాండిత్యం ప్రాచీన కాలంలో కవిత్వం ఒక కులంలో మాత్రమే పుట్టేది. ఆ కాలంలో పండితులకు గౌరవం దక్కేది. కానీ మరే ఇతర

కులస్థుల గొప్ప పాండిత్యం సంపాదించినా, కావ్యాలు రాసిననూ వారు తగిన గౌరవాన్ని పొందేవారు కాదు. జాషువా కవిత్వాన్ని మెచ్చుకున్న పండితులే కుల కారణంగా వేదిక దిగిపోవడం ఆనాటి సమాజంలోని కులతత్వాన్ని తెలియజేస్తుంది.

**"వినుమొకనాడు నేను పురవీధిని పోవుచునుండు వైశ్య నం**

**దనులో, ధరామరాత్మజులోనన్గని ముత్తుకు మంచు వెనుకున్**

**జనిరపుడెను కోపమున నల్వురి ముగ్గురి గొట్టి పేరెమె**

**త్తిన ఘటనంబు నేడును మదిం బెదచాయాదు దొడ్డ గాయమై"**

మనిషిని మనిషి అంటడమే నేరమైన సమాజాన్ని కవి నిరసిస్తున్నాడు. తాకితేనే మైల పడే అగ్ర వర్ణాల పెత్తనం కింద నలిగి పోయిన వారెందరో ఉన్నారు. అలాంటి సంఘటనలు మదిలో గాయమై నిత్యం బాధిస్తాయని తెల్పడం జరిగింది. పై కథలో అగ్ర వర్ణాల దాడిని కవి గుర్తు చేయడం కనిపిస్తుంది.

**"ఆ యభాగ్యుని రక్తంబు నా హరించి**

**యినుప గజ్జెల తల్లి జీవనం సేయు**

**గసరి బుసకొట్టు నాతని గాలిసోక**

**నాల్గు పడగల హైందవ నాగరాజు".**

పేదవారి జీవితం దుర్భరంగా ఉంటుందని తెలుపడానికి జాషువా గారు ఇనుప గజ్జెల తల్లి (జ్యేష్ఠ దేవిని) తీసుకోవడం జరిగింది. నేటికి "Iron leg" అనే పదం చెడుకు వాడుతున్నాం. ఈ మాట దాదాపు పేదవారికే వరింపజేసే సమాజం మనకు కనిపిస్తుంది. జ్యేష్ఠా దేవి ఆవరించిన వాడిని చూసి హిందూ మత దేవతలందరూ దూరంగా జరుగుతారని హిందూ మతాన్ని వ్యతిరేకించడం కనిపిస్తుంది. ఈ భావనలోంచే వారిని అక్కున చేర్చుకున్న క్రైస్తవ మతం నేటికి వారిని ఆదరిస్తుంది. అభివృద్ధి పథంలోకి చేర్చడానికి కృషి చేస్తూ వారికొక ఉనికిని ప్రాప్తింప జేసిందనీ చెప్పవచ్చు.

**4. కుల వివక్షతపై కన్నెర్ర**

వర్గ రహిత సమాజం కావాలని కలలు గనే కవి, కుల అహంకారాన్ని సహించక, ఇతర కులాలపై నిరసన తెలపడం కనిపిస్తుంది. సమాజంలో ఉన్నతులు, మధ్యములు, అధములు, అధమాధములు అని విభజించిన వారిని ప్రశ్నిస్తున్నాడు. అందరు పుట్టే చోటు ఒక్కటైనపుడు చాతుర్వర్ణ వ్యవస్థను నిరసిస్తున్నాడు.

"ముసలి వాడైన బ్రహ్మకు పుట్టినారు

నలుగురు కుమారులనుట విన్నాము గాని

పసరము కన్నా హీనుడభాగ్యుడైన

యైదవ కులస్థుడెవరమ్మా సావిత్రీ ?

సమాజంలో కొత్తగా వినబడే కులం పంచమ కులం. మానవులలోని నాలుగు వర్ణాల గూర్చి అనేక కావ్యాలు తెలిపాయి. కానీ ఈ ఐదవ కులం ఎక్కడి నుండి పుట్టిందని సమాజాన్ని కవి ప్రశ్నిస్తున్నాడు.

ప్రాచీన కాలం నుండి పురాణాలలో, ఇతిహాసాలలో అనేక అధమ కుల పాత్రలు కనిపిస్తాయి. **ఉదా** : రాధేయుడు, అష్టావక్రుడు , ఏకలవ్యుడు , తిన్నాడు, ధర్మవ్యాధుడు, శంభూకుడు , అరుంధతి, మాతంగుడు, ఛండాలుడు, శ్రీపాణి , కనకదాసు, చండాలిక, మాలదాసరి, కన్నమదాసు, బాలయోగి, లక్ష్మమ్మ, (అంబేద్కర్, నందనార్) మొదలైన పాత్రలు వ్యక్తులు మనకు కనిపిస్తారు. దీనిని గమనించి కుల నిర్మూలనకు కృషి చేసిన వారిలో ముఖ్యుడిగా అంబేద్కర్ గారిని చెప్పవచ్చు. స్వయంగా అంబెద్కర్ తాను అనుభవించిన

వివక్ష, అవమానాలు ఇతరులు అనుభవించకూడదనే కృత నిశ్చయంతో కుల నిర్మూలనకు, అస్పృశ్యత నివారణకు, ఛాందస భావాలకు, మూఢ విశ్వాసాలకు వ్యతిరేకంగా జీవితాంతం కృషి చేసిన మహనీయుడు అంబేద్కర్ భావజాలం కనిపిస్తుంది. దళితులకు రిజర్వేషన్లు కల్పిస్తూ వారికీ ఉన్నత స్థానాలు అందేట్లు చేసారు. నేటి దళితుల ఉన్నతికి అనేక మంది సంఘ సంస్కర్తలు, కామాలు, పండితులు కృషి చేసారని తెలుస్తుంది. అయినను దళితులు మరింత ముందడుగు వేయవలసిన అవసరం ఎంతైనా ఉంది. గ్రామాల్లో నేటికీ వీరి పరిస్థితి దయనీయంగా కనిపిస్తుంది.

**నా మనసులో మాట**

సమాజంలో కవులు అనేకమంది ఉంటారు. కానీ ప్రజల కోసం కవిత్వం రాసే కవులు కొందరు మాత్రమే ఉంటారు. సంఘ సంస్కరణ దృష్టితో కవిత్వం రాసిన కవులలో గుర్రం జాషువా ఒకరు. కవి ప్రజల పక్షాన నిలిచి కుల రహిత నిర్మాణం (సమాజం) కోసం నిరంతరం పోరాడిన యోధుడిగా గుర్రం జాషువాను చెప్పవచ్చు.

గుర్రం జాషువా పేరు వినగానే పరోక్షంగా దళిత కవిత్వం, దళిత జాతి గుర్తుకు వస్తుంది. అణగారిన సమాజం యొక్క కష్టాలు పోయి నవయుగం రావాలని ఆకాంక్షించి నవయుగ కవి చక్రవర్తి గుర్రం జాషువా. జాషువా అభ్యుదయ భావాలూ, ప్రజల కోసం ఆరాటపడే మనస్తత్వం, ధైర్యంగా నిరసన వాణిని తెలపడం, మొదలైనవి జాషువాను విశిష్ట కవిగా నిలబెట్టాయని చెప్పవచ్చు.

**5. ఉపయుక్త గ్రంథ సూచి:**


1. గబ్బిలం (ఖండ కావ్యం) - గుర్రం జాషువ.
2. దళిత భారతి - జంధ్యాల పాపయ్య శాస్త్రి
3. పిరదౌసి (లఘు కావ్యం) - గుర్రం జాషువ.
4. సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు - జి.వి. సుబ్రహ్మణ్యం
5. 4. దళిత కథా మంజరి - డా. బి.వి. యస్. మూర్తి
6. భారతీయ సాహిత్య వ్యాసాలు - నలిమెల భాస్కర్
7. శత వసంత సాహితీ మంజీరాలు- సం. ప్రయోగ వేదవతి.
8. దళితోద్ధారణ దృక్పథం - జి. భద్రు నాయక్
9. సాహిత్య వ్యాసాలు సమీక్షలు – సౌభాగ్యం


******

# 42. డాక్టర్ శాంతినారాయణ గారి కథలు – సామాజిక స్పృహ

**డాక్టర్ ఎ. ఎ. నాగేంద్ర**

అకడమిక్ కన్సల్టెంట్

తెలుగు & తులనాత్మక సాహిత్య శాఖ

శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం

అనంతపురము.

9490188263

draanagendra@gmail.com

**కీలక పదాలు: ఉదా:** ఉంగటం, అలగాజనం, బీదబిక్కి, ఇనఫారం, గూటం, తెప్ప, యెంపపర్లాడి, మ్యార, తప్పెట్లు, మాదిగసాహిత్యవేదిక, కట్లపొడి, కాకినడక, ల్యాకుండా, గబ్బులేపడం వొగొగరు.

**అబ్స్ట్రాక్ట్:** డాక్టర్ శాంతినారాయణ గారు 1946 లో సింగనమల మండలం, బండమీదపల్లి గ్రామంలో నిరుపేద వ్యవసాయ కుటుంబంలో జన్మించాడు. తిరుపతి లో విధ్వాన్ పూర్తి చేసి, ఉపాధ్యాయునిగా ఎన్నికై తర్వాత డిగ్రీ కళాశాల అధ్యాపక స్థాయి వరకు ఎదిగిన వ్యక్తి. ప్రారంభంలో ప్రాచీన సాహిత్యాన్ని ఒంటబట్టించుకొని, కొన్ని అవధానాలు చేశారు. తర్వాత డాక్టర్ శాంతినరాయణ గారు ఆధునిక సాహిత్యం వైపు తన ప్రస్థానాన్ని ప్రారంభించారు. డాక్టర్ శాంతినరాయణ శ్రామిక వర్గ రచయిత, వ్యవసాయ కూలి కుటుంబం నుంచి వచ్చిన వారు ప్రకృతి, ప్రపంచం, మనిషి ఈ మూడింటి తత్వాలు బాగా ఎరిగిన రచయిత. ఆయన మట్టితో అనుబంధం ఉన్న రచయిత. పట్టణంలో జీవిస్తున్నా పల్లె పరిమళాలను మరచిపోని రచయిత. గ్రామాన్ని గురించి రాసినా, పట్టణాన్ని గురించి రాసినా, శాంతినారాయణ పీడిత పక్షపాతి, శ్రామిక పక్షపాతి, న్యాయ పక్షాపతి. ఆయన రచించిన ఏ కథను మనం చదివిన ఈ సత్యం తెలుస్తుంది.

కథకుడుగా శాంతినారాయణ విశిష్టత ఏమిటంటే? చాలా మంది రాయడానికి సంకోచించే సాంఘిక సంఘటనల మీద, సందర్భాల మీద నిర్భయంగా, నిజాయితీగా కథలు రాయడం. ఆయన కథల్లో కల్పన తక్కువ వాస్తవికత ఎక్కువ కనిపిస్తుంది. కోస్తా ప్రాంతంలో పుట్టిన తెలుగు కథ ఇవాళ ఆడవులలోని గోండుల వద్దకు చేరుకోగలిగింది. సంఘసంస్కారణ ఉద్యమం మొదలుకొని, నేటి ప్రాంతీయ అస్తిత్వ ఉద్యమాల దాకా ప్రతి ఉద్యమానికి, ప్రతి సందర్భానికి, సంఘటనకు సాక్షిగా నిలుస్తున్నది తెలుగు కథ.

ప్రస్తుత పరిశోధన పత్ర ముఖ్య ఉద్దేశ్యం. డాక్టర్ శాంతి నారాయణ గారు 1972 లో వెలువరించిన 'రక్తపు ముద్ద పిలిచింది' కథలు నుండి 2023 డిసెంబర్ లో వెలువరించిన 'గీతలు చెడిపి' కథల వరకూ, ఆయన రాసిన, కథలలో మనకు ఆయన సామాజిక, సాహిత్య బాధ్యత కనిపిస్తుంది. 'గీతలు చెడిపి' కథా సంపుటిలో మొత్తం 10 కథలు ఉన్నాయి. ఈ కథలన్నీ సామాజిక వాస్తవ సంఘటనల ప్రతిబింబం. ప్రతి కథా మనల్ని ప్రశ్నిస్తుంది. సామాజిక స్పృహను కలిగిస్తుంది. సమాజం పై బాధ్యతను గుర్తు తెస్తాయి కథలు.

**పత్రం :**

**'ఉంగటం' తెగింది కథా విశ్లేషణ:**

శ్రమ జీవి అయిన సుంకన్న తన కుల వృత్తి అయిన చెప్పులు కుట్టుకుంటూ, శ్రమను నమ్ముకొని జీవనం కొనసాగిస్తూ తన పిల్లలైన రమేష్, కూతురు సుశీలను చదివిస్తున్న అంబేద్కర్ ఆలోచనా విధానాన్ని ఒంట బట్టించుకొన్న నిరక్షారాస్యుడైన ముందుచూపు గల వ్యక్తి. తరతరాల నుంచి విద్యాగంధం లేని కుటుంబం సుంకన్నది. పట్టణానికి తక్కువ పల్లెటూరికి ఎక్కువగా పిలవబడే 'తరిమెల' అనే ఊర్లో, మాదిగగేరిలో వెట్టి మారెప్ప కొడుకుగా, చదువు మీద మోజుపడి చదువుకుంటున్నప్పుడు ఏడవ తరగతిలో కులం కారణంగా జరిగిన అవమానంతో చదువు మానేసిన వ్యక్తి. కాల పరిస్థితులను గమనిస్తూ పిల్లలకు బంగారు భవిష్యత్తు ఇవ్వాలనే దృఢనిశ్చయం గల వ్యక్తి సుంకన్న.

భార్య నాగమ్మ కూడా ఐదో తరగతి వరకు చదువుకున్న ఇల్లాలు. డ్వాక్రా మహిళా సంఘం ద్వారా కుట్టుమిషన్ పొంది కాలనీ వాసుల బట్టలు కుడుతూ సుంకన్న శ్రమకు తన శ్రమ జత చేస్తూ సంసారాన్ని ముందుకు నడుపుతున్న ఆధునిక మహిళ నాగమ్మ. తరిమెల రంగయ్యశెట్టి 'హోల్ సేల్ డీలర్' సుంకన్న ఒక రోజు రంగయ్యశెట్టి హోల్ సేల్ అంగడికి పోయి ఒక కేజీ పొగాకు, నాలగుశేర్లు కట్లపొడి, ఇన్నూరు గ్రాముల వక్కలు కట్టివ్వమని అడిగితే పని మనిషికి ఆ పనిని పురమాయిస్తూ, రంగయ్యశెట్టి సుంకన్నను చాలా తక్కువ చేసి మాట్లాడుతాడు. తరిమెలలో రంగయ్యశెట్టి తోట బీడు పడిందన్న అక్కసుతో, మీయట్లా మాల, మాదిగోళ్ళు కూడా వొళ్ళు వంచి కూలి పనులకు పొయ్యేకి నచ్చక నీ మాదిరే ఒక్కొక్కరు మెల్లిగా అనంతపురం చేరుకున్నారు. ఉపాధి హామీ పనుల పేరుతో గవర్నమెంట్ వ్యవసాయాన్ని గబ్బులేపిందిరా? గవర్నమెంట్ జనాన్ని కూచోబెట్టి మేపుతా అందరినీ శ్రమపడడానికి దూరం చేస్తావుంది. అలగాజనానికి ఇట్లా జేస్తే వాళ్ళ జీవితాలు బాగుపడుతాయా? అంటూ ప్రశ్నిస్తాడు రంగయ్యశెట్టి.

అలాగే షాపులో పనిచేసే మనుషులు దొరక్కా శానా యెడాముడిగా ఉందిరా సుంకా! మీ మాదిగోల్ల పిల్లోలైనా పరవాలేదు. ఎవరైనా ఉంటే చూడు అని అంటూనే నీ కొడుకున్నాడు గడా వాణ్ని పంపు జీతం బాగానే ఇస్తాలే అంటూ వల విసురుతాడు రంగయ్యశెట్టి. సుంకన్న కొడుకు రమేష్ ఇంటర్ ఫలితాల్లో స్టేట్ ఐదవ ర్యాంక్ వచ్చిన విషయం కానీ, మంచి విద్యావంతురాలైన కూతురు సుశీల డిగ్రీ చదువుతున్నట్లు రంగయ్యశెట్టి కి తెలీయదు కాబోలు. తెలిసినా మాదిగోళ్ళు ఏం చదువుతారులే అనే చులకన భావన రంగయ్యశెట్టిది. ఒకరోజు చెప్పు 'ఉంగటం' తెగిపోయింది అంటూ రంగయ్యశెట్టి సుంకన్న వద్దకు వస్తాడు. కాలిబూట్లకు పాలీష్ చేసినందుకు పోలీస్ ఇన్స్పెక్టర్ యాభై రూపాయలు ఇవ్వడం చూసిన రంగయ్యశెట్టి ఈలెక్కన నువ్వు దినానికి యా మాత్రం సంపాదిస్తావురా! అని ఆసక్తిగా అడుగుతాడు యెట్లా లేదన్నా దినానికి పదహైదునూర్లకు తక్కువ కాకుండా కూలి గిట్టుకుంటుందయ్యా పర్వాలేదు అని సమాధానం చెపుతాడు సుంకన్న. అంటే నెలకు నలభై, యాభై వేలు ఆడతా పాడతా సంపదిస్తావన్నమాట! భలే బాగుంది రా నీ పని! పెట్టుబడి లేని వ్యాపారం! పెద్దగా కష్టపడేది కూడా ఏమి లేదు! ఊరకనే నీ పిల్లలని కూడా ఈ పనికే యేసుకుండేది మేలు కదా రా! వాళ్ళను సదివిస్తావుంటే ఇంగ ఇంతటితో ఆపి, లక్షణంగా నీ పనికే యేసుకోరా! అంటూ తన సహజమైన అగ్రకుల వర్గ తత్వాన్ని వినిపిస్తాడు రంగయ్య.

బతుకుదెరువు కోసం వొగొగరిది వొగొగ వృత్తి. అయితే తరతరాలనుంచి కులవృత్తులు చేసుకొంటూ బతికేవాళ్ళు అదే వృత్తి చేసుకుంటూ ఉండల్లనా? మారుతున్న కాలాన్ని బట్టి అన్ని కులాల వాళ్ళు తమ పిల్లల జీవితాలు బాగా ఉండాలని కోరుకుంటారు. తక్కువ కులాల వాళ్ళు అట్ల కోరుకోకూడదని ఈ రంగయ్యశెట్టి అభిప్రాయమా? అంటే మాదిగ, మాలోల్లు సదువుకోకుండా ఏ పని చేసుకుంటూ బతికేవాళ్ళు ఆ పనే చేసుకుంటూ, యాడవుండేవాళ్ళు ఆడే వుండల్లని ఈ రంగయ్యశెట్టి ఉద్దేశ్యమా? అని మనసులో చాలా గట్టిగా అనుకుంటాడు సుంకన్న. నీ కొడుకులు ఏమి సదువుకుంటూ ఉండరయ్యా? అని నిమ్మలంగా అడుగుతాడు సుంకన్న రంగయ్యశెట్టిని. పెద్దోడు బీటెక్కూ, చిన్నోడు డాక్టర్ కోర్సు చదువుతున్నారా! అంటూ దర్పంగా గర్వంగా సాగదీసి చెబుతాడు రంగయ్యశెట్టి. నాకు తెలీక ఒక మాట అడుగుదునా అంటూ రంగయ్యశెట్టి ని అడుగుతాడు సుంకన్న. మీ అంగట్లో కట్ల పొడి యాపారం బ్రహ్మాండంగా జరుగుతాది

కదా! పని మనుషులు దొరక్క వొంటిగానివి శానా ఇబ్బంది పడతాండవు కొడుకులిద్దరిని అంగట్లో పెట్టుకుంటే మేలు గదయ్యా! మీ కట్ల పొడి వ్యాపారానికి మించినవా కొడుకుల సదువులు? సుంకన్న మాటలతో చెప్పు ఉంగటం తెగిన సంగతేమో కానీ, అతని మెడ మీద నరం తెగినట్లు అనిపించింది. తరిమెల అమరనాథ్ తన పుస్తకావిష్కరణ సభ కోసం ఆహ్వానించడానికి తరిమెల రంగయ్యశెట్టి వద్దకు వెళ్ళినప్పుడు మాటల సందర్భంలో మన ఊరి మాదిగ సుంకన్న కొడుకు ఇంటర్ లో స్టేట్ ర్యాంక్ సాధించి ఊరి పేరు నిలబెట్టినాడప్పా! అటువంటి పిల్లోన్ని చెప్పులు కుట్టే పనికి వేసుకోమని సుంకన్న కు సలహా ఇస్తావేమయ్యా నువ్వు? తరిమెల మనిషిగా మాదిగ, మాలోల్లతో అట్లనా మాట్లాడేది? అని దండిస్తాడు తరిమెల అమరనాథ్. ఈ సందర్భంగా తన పొరపాటును అంగీకరిస్తాడు రంగయ్యశెట్టి. పుస్తకావిష్కరణ సభలో మీటింగ్ హాల్ జనంతో కిటకిటలాడుతూ ఉంటుంది . ముందు భాగంలో సీట్లు లేక తరిమెల రంగయ్యశెట్టి వెనకవైపు కూర్చుంటాడు సభ ప్రారంభం కాగానే పుస్తకావిష్కర్తగా తరిమెల సుంకన్నను వేదిక పైకి ఆహ్వానించడంతో సభంతా ఒక్కసారిగా చప్పట్లతో మారుమోగుతుంది. సభలో అమరనాథ్ సుంకన్న చెప్పులు కుట్టుకుంటూ, అతని పిల్లల్ని చదివిస్తున్న సంగతిని, సుంకన్న దంపతుల శ్రమనూ, వారి కొడుకు రమేష్ ఇంటర్ లో సాధించిన విజయాల్ని ప్రస్తావిస్తాడు. విద్యావంతులందరూ తమ వర్ణ, వర్గ స్వభావాన్ని వదులుకోవాలని ప్రసంగిస్తాడు అమరనాథ్. ఈ మాటలు విన్న తరిమెల రంగయ్యశెట్టి తల దించుకొని తాను చేసిన పొరపాట్లను తలచుకొని చింతించుకుంటూ తల దించుకుంటాడు. కొత్త ఆలోచనలతో సభ ముగుస్తుంది. ఈ కథ పాఠకునికి సామాజిక బాధ్యతను గుర్తుచేస్తూ, సామాజిక స్పృహ ను కలిగిస్తూ ముగుస్తుంది.

**కథ సందేశం:**

దప్పు, చెప్పు అనేవి మాదిగ అస్తిత్వానికి ప్రతీకలు. చెప్పులు కుట్టుకుంటూ, ఆత్మగౌరవాన్ని కాపాడుకుంటూ అవసరమైన వాటికే ఆర్థిక వనరులు వాడుకుంటూ, చెడు వ్యసనాలకు బంధీ కాకుండా బతుకు బండి లాగుతున్న సుంకన్న కుటుంబం కథే 'ఉంగటం తెగింది'. విద్యావంతులైనవారు ఉన్నత సంస్కారాన్ని అలవరచుకొని తమ వర్ణ, వర్గ స్వభావాలను వాడులుకోవాలని ఈ కథ ద్వారా రచయిత గొప్ప సందేశాన్ని ఇవ్వడం ఆయన సామాజిక స్పృహకు నిదర్శనం. ఇలా ఆయనకు సామాజిక స్పృహ ఉంది కాబట్టే, శ్రమజీవుల పట్ల గౌరవాన్ని, ప్రేమను, ఇష్టాన్ని కనబరుస్తాడు డాక్టర్ శాంతినారాయణ గారు.

**'ఏరు దాటి తెప్పను' కథా విశ్లేషణ:**

'ఏరు దాటి తెప్పను' కథలో అంబేడ్కరిజానికి సంబంధించిన చర్చ చాలా లోతుగా సాగుతుంది. తన కులాన్ని తానే తక్కువ గా చూస్తూ, తన కులం పట్ల తనకున్న న్యూనత భావాన్ని అధిగమించడం కోసం తన కులాన్ని తానే దాచుకొనే కొందరు కుహనా మేధావుల రంగును బయట పెట్టే కథ 'ఏరు దాటి తెప్పను'. ఎవరి కులం వారికి గొప్ప అన్న భావన ను కలిగించే కథ ఇది. ఈ కథ లోని రచయిత పాత్రకు తన కులనికే చెందిన ఇద్దరు స్నేహితులు కనిపిస్తారు. తనకు తెలిసినంత వరకూ వారు గొప్ప దళిత చైతన్యం కలిగిన వారు. అందువల్ల వారి చేత తన పుస్తకాన్ని ఆవిష్కరింప చేయడం సముచితంగా ఉంటుందని కథలోని రచయిత భావిస్తాడు. పుస్తకాన్ని ముద్రించాక వారి వద్దకు వెళతాడు. అయితే వారు కెరీరిజం ముసుగులో ఎంత కృత్రిమంగా ఆలోచిస్తున్నారో, ఎంతగా తమ ఆస్తిత్వాలను పోగొట్టుకుంటున్నారో, కులాన్ని దాచుకోవడానికి ఎంతగా కొట్టుమిట్టాడుతున్నారో ఏదో అందుకోవడం కోసం ఎంతగా ఆరాట పడుతున్నారో కథలోని రచయిత అప్పుడు గమనిస్తాడు.

వారు తమ పేర్లే కాదు ఇల్లూ, కాలనీలు కూడా మార్చుకొని మారువేశాల్లో బతుకుతున్నారని అతడికి స్పష్టంగా అర్థమవుతుంది. ఇటువంటి వారిని తన పుస్తకావిష్కరణ సభకు ఆహ్వానించడం భావ్యం కాదు అని భావించి, జిల్లా మాదిగ సాహిత్య వేదిక నాయకునితో తన పుస్తకాన్ని ఆవిష్కరింప చేయటానికి నిర్ణయించుకుంటాడు. మనుషుల ఆలోచనలు మారడం తప్పు కాదు, ఆ మారడం అనేది తన అవసరాల కోసమో, అవకాశాల కోసమో, స్వార్థ ప్రయోజనాల కోసమో కాకూడదు మార్పు అనేది వ్యక్తుల అవగాహన బట్టి రావాలి. ఈ

కథలోని రచయిత స్నేహితుల్లో మార్పు వచ్చింది అది స్వార్థ ప్రయోజనాలతో కూడుకున్నది. పేర్లు మార్చుకుంటే కులం దాగి ఉంటుందన్న భ్రమలో జరిగిన మార్పు, అవరసరాలు తీర్చుకోవడం వారికి అంతిమ లక్ష్యం. ఇలాంటి మనుషులు నేటి సమాజంలో మనకు తారసపడుతుంటారు. ముఖ్యంగా రచయిత పాత్రలోనూ మార్పు కనిపిస్తుంది తొలుత తన స్నేహితుల చేతుల మీదుగా పుస్తకాన్ని ఆవిష్కరింప చేయాలనుకుంటాడు చివరికి తన నిర్ణయాన్ని మార్చుకోవడం కొసమెరుపు. ఈ మార్పు అవగాహనలోంచి వచ్చింది. ఇది స్వాగతించాల్సిన సందర్భం.

విభిన్న పార్శ్వాలలో బహుజన తాత్విక చింతన చేసిన ఈ కథలని రూపొందించడంలో శాంతినారాయణ గారికి తన సుదీర్ఘ రచనానుభవం ఎంతగానో ఉపయోగపడిందని తెలుస్తుంది. సంభాషణల్లోనూ, అవసరమైన సందర్భాలలో కథాకథనంలోనూ, మాండలిక శైలిని ఎలా వాడాలో శాంతినారాయణ గారికి సంపూర్ణ అవగాహన ఉన్నట్లు మనకు తెలుస్తుంది.

**'గీతలు చెడిపి' కథా విశ్లేషణ :**

ఉన్నత పాఠశాలల్లో చదువుకొనే రోజుల్లోనే తమ కుటుంబానికి ఆసరాగా నిలబడే పరిస్థితులు ఎదురైనప్పుడు తమ కులవృత్తిని చేపట్టి కుటుంబానికి పెద్దదిక్కుగా, ఆసరాగా నిలిచే ఇద్దరు మంగలి యువతుల యథార్థ జీవితాన్ని చిత్రించే కథే 'గీతలు చెడిపి'. చదువులో రాణిస్తూనే కులవృత్తిని చేపట్టిన యువతుల పట్ల ఆకతాయి కుర్రాళ్ల వెర్రి చేష్టలని, అవమానాలని భరిస్తూనే, పెల్లుబికి వస్తున్న అసహనాన్ని, ఆగ్రహాన్ని నిగ్రహించుకుంటూ తమ వృత్తుల్ని పవిత్రంగా భావించి నిష్ఠతో చేసే పనిని ఈ కథలు చిత్రిస్తాయి. కుల అహంకారానికి, ధనదర్పం తోడు అయితే మనిషి ఎంత అమానవీయంగా ప్రవర్తిస్తాడో ఈ కథ చదివితే తెలుస్తుంది .

సమాజం లో ఏ రకమైన మార్పులు రావాలని రచయిత డాక్టర్ శాంతినారాయణ ఆకాంక్షిస్తాడో 'గీతలు చెడిపి' కథ చక్కగా తెలియజేస్తుంది. శకుంతల పదవ తరగతిలో రాష్ట్ర స్థాయిలో మంచి మార్కులు తెచ్చుకొని ప్రభుత్వం మన్ననలు పొందడం పాఠకులకు గొప్ప ఆనందాన్ని ఇస్తుంది. ఒకరిద్దరు పెద్దకులస్తులు చిన్న కారణం చేత పెద్ద పంచాయితీ పెట్టి, ఆ యువతుల్ని పది మందిలోకి రప్పించి అవమానిస్తున్నప్పుడు ఆ గ్రామస్తులు చాలా మంది ఆ యువతుల పక్షం వహించడం చాలా ఆనందాన్ని ఇస్తుంది. యువతుల తండ్రి అనారోగ్యం తో ఉన్నప్పుడు గ్రామస్తులంతా కలిసి కొంత మొత్తాన్ని వసూలు చేసి అతడికి ప్రాణభిక్ష పెట్టడం ఈ కథలో మానవత్వం ఉన్న మనుషుల మనస్తత్వం మనకు కనిపిస్తుంది.

**'ఆత్మ నిర్భర భారతం' కథా విశ్లేషణ:**

పేదరికంతో బ్రతుతకుదెరువు కోసం పొట్ట చేతపట్టుకొని వేల మైళ్ళ దూరం వలసలు పోవాల్సివస్తున్న బడుగు, బలహీన వర్గాల ప్రజల జీవితాల వెతలను కళ్ళకు కట్టినట్టు ఒక బొమ్మగీసి చూపినట్లు చిత్రించిన కథ 'ఆత్మ నిర్భర భారతం'. ఉత్తరాంధ్ర భౌగోళిక చిత్రాన్ని దాని అంతరంగాన్ని ఆవిష్కరించిన కథ ఇది. ప్రాంతీయ అస్తిత్వ వాదం బలంగా ముందుకు వస్తున్న ప్రస్తుత తరుణంలో, రాయలసీమ ప్రాంతానికి మరీ ముఖ్యంగా వెనుకబాటుతనానికి , పేదరికనికి నిలయమైన అనంతపురం జిల్లాకు చెందిన డాక్టర్ శాంతినారాయణ ఉత్తరాంధ్ర అస్తిత్వం కోసం ఆరాటపడుతూ ఈ కథ రాయడం విశేషం. రచయితలకు ప్రాంతీయ స్పృహ ఉండవలసిందే అని నిరూపిస్తుంది ఈ కథ. ఈ కథ ద్వారా రచయితలో సామాజిక స్పృహ, ప్రాంతీయ స్పృహ పెన వేసుకొని ఉన్నట్లు మనకు తెలుస్తుంది.

**ముగింపు:**

**డాక్టర్ శాంతినారాయణ రచించిన 'గీతలు చెడిపి' కథా సంపుటంలో మొత్తం 10 కథలు ఉన్నాయి. ఇవి విడివిడిగా కనిపించినా వస్తువైవిధ్యం ఉన్నట్లుగా కనిపించవు. శ్రామిక, బహుజన జీవితాల వెతల యథార్థ దృశ్యం ఈ కథల్లో మనకు కనిపిస్తుంది. ఈ కథల్లో బహుజన జీవితాల్లోని విభిన్న** పార్శ్వాలు చిత్రించబడినా, రచయితలో ఎక్కడా వైవిధ్యం తప్ప వైరుధ్యం కనిపించకపోవడం విశేషం. సమాజ గమనాన్ని అవగాహన చేసుకోవడంలో రచయితగా శాంతినారాయణ గారికి అపారమైన అనుభవం ఉంది. ఎవరిని

అక్కున చేర్చుకోవాలో, ఎవరిని తిరస్కరించాలో అనే విషయమై స్పష్టత ఉన్న రచయిత. శాంతినారాయణ గారు అప్పుడప్పుడు కవిత్వం రాసినా ప్రధానంగా వారు కథా, నవలా రచయిత. కవితను కవితగానే రాయాలి. కథను కథగానే చెప్పాలి అనే స్పష్టమైన అవగాహన ఉన్న రచయిత శాంతినారాయణ. కథను అప్పటికప్పుడు అలా రాసుకుంటూ ముందుకు పోవడం కాక, కథా ప్రణాళికను ముందుగానే వేసుకొని దాని ప్రకారంగానే ముందుకు నడిపించడం ఉత్తమ రచయితల పద్ధతి. శాంతినారాయణ గారిని ఉత్తమ కథకుడిగా మనం భావించవచ్చు. 'గీతలు చెడిపి' కథాసంపుటంలో పురుష పాత్రలకంటే, స్త్రీ పాత్రలే పాఠకుల్ని వెన్నాడుతూ ఉంటాయి. ఇలా ప్రతికథ రాయడంలో శాంతినారాయణ గారి శ్రద్ధాసక్తులు, ఆయన నిబద్ధత కనిపిస్తుంది. ప్రతికథలోని పాత్రలు పాఠకునికి సామాజిక బాధ్యతనో, సామాజిక స్పృహనో కలిగిస్తాయి అనడంలో ఎలాంటి సందేహం లేదు.

**ఆధార గ్రంథాలు:**


- ➢ శాంతినారాయణ 'గీతలు చెడిపి' (కథల సంపుటి) విమలా శాంతి ప్రచురణలు, డిసెంబర్ 2023.
- ➢ శాంతినారాయణ నాలుగు ఆస్తిత్వాలు, నాలుగు నవలికలు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సృజనాత్మక సంస్కృతి సమితి, మార్చి 2019.
- ➢ శ్రీనివాస్ సంగిశెట్టి, నిరంజన్ గుడిపల్లి, తెలంగాణ దళిత కథలు, సింగిడి తెలంగాణ రచయితల సంఘం, పూలే, అంబేద్కర్ అధ్యయన వేదిక, జూలై 2021.


*******

# 43. దళిత సమాజ చైతన్య స్వరం -- ఎండ్లూరి "కావ్యత్రయం"

డాక్టర్ కాకాని సుధాకర్

9440184788

ఏ సమాజం నుంచయితే కవి ఆవిర్భవిస్తాడో, ఆ సమాజంలో వైరుధ్యాలు వచ్చినప్పుడు, అంతర్గత అసమానతలు బహిర్గత మైనప్పుడు, కవి ఆ అసమానతలను తొలగించే, కవిత్వ స్వరాన్ని వినిపించాలి. ఆచార్య ఎండ్లూరి సుధాకర్ తాను ఏ మూలాల నుంచైతే వచ్చాడో, ఆ సమాజంలో వచ్చిన వైరుధ్యాలను తొలగించడం కోసం అసమానతలను తొలగించి, సమానతను కాంక్షించటం కోసం దళితులను చైతన్య పరుస్తూ తన స్వరం వినిపించాడు అదే "**కావ్య త్రయం**".

షెడ్యూల్డ్ కులాలలో ఉన్న 15% రిజర్వేషన్లను మాల - మాదిగ కులాలకే కాక మిగిలిన 58 కులాలకు ఎవరి జనాభా ప్రాతిపదికన వారికి ఏ బి సి డి లుగా వర్గీకరించాలని మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి ఆధ్వర్యంలో 1994 జులై 7న ప్రకాశం జిల్లా ఈదుమూడి గ్రామంలో మందకృష్ణ మాదిగ నాయకత్వం లో 20 మంది యువకులతో దండోరా ఉద్యమం ప్రారంభమైంది. 30 ఏళ్ల నుంచి సామాజిక న్యాయం కోసం ఈ ఉద్యమం నిరంతరాయంగా వివిధ పోరాట రూపాలను మార్చుకుంటూ ఉద్యమిస్తూనే ఉంది. సామాజిక న్యాయమైన ఈ డిమాండ్ కు అన్ని రాజకీయ పార్టీలు, విప్లవ, ప్రజాస్వామిక వాదులు మద్దతు ప్రకటించారు. కవులు, కళాకారులు, రచయితలు, వివిధ ప్రక్రియలలో ఈ ఉద్యమ చైతన్యానికి స్ఫూర్తిని నింపుతూ... సాహిత్య ఆయుధాలను అందించారు. ఈ ఉద్యమ నేపథ్యంలోనే ఎండ్లూరి సుధాకర్ "కావ్యత్రయం" ఆవిర్భవించింది.

ఎండ్లూరి మూడు దీర్ఘ కావ్యాలను రాశాడు. మొదటి కావ్యం "కొత్త గబ్బిలం" రెండో కావ్యం "వర్గీకరణీయం" మూడవ కావ్యం "గోసంగి". ఎండ్లూరి తాను ఓరియంటల్ కళాశాలలో చదువుతున్నప్పుడు కాళిదాసు "రఘువంశం" మేఘసందేశం"" కుమార సంభవం" మూడు కావ్యాలను కాళిదాసత్రయం అనే వారని , తాను కూడా "సుధాకర త్రయం" రాస్తాను అని తన బాల్య మిత్రులను కూర్చోబెట్టుకొని చెప్పేవాడట. అయితే అది అంత తేలికగా జరగలేదు. తన మొదటి కావ్యం 30 ఏళ్ళ వయసులో, రెండో కావ్యం 40 ఏళ్ల వయసులో, మూడో కావ్యం 50 ఏళ్ల వయసులో రాయడం జరిగింది. అలా తన చిన్నప్పటి కోరిక తనకు 50 ఏళ్లు వచ్చాక పూర్తి చేయగలిగాడు.

1995 సెప్టెంబర్ 28న జాషువా శతజయంతి ఉత్సవాలు జరుగుతున్నాయి. జాషువా చిన్న కూతురు, ఆయన సాహిత్య వారసురాలు శ్రీమతి హేమలత లవణంగారు జాషువా ఫౌండేషన్ ద్వారా వినుకొండలో ఏర్పాటు చేసిన సభలో ఎండ్లూరి ప్రధాన వక్త గా పాల్గొని జాషువా తిరిగిన నేలను చూశాడు జాషువా వారసులను కలిశాడు అప్పుడే "**కొత్త గబ్బిలం**" ఆలోచన అంకురించింది. దళితుని వేదనను శివునికి తెలియ చెప్పమని గబ్బిలానికి చెబుతాడు జాషువా -- రాజధాని ముట్టడికి వెళుతున్న దండోరా ఉద్యమ జాతి జనులకు మద్దతు ప్రకటిస్తూ హైదరాబాదు నగరానికి వెళ్ళమని చెబుతాడు "కొత్త గబ్బిలానికి" ఎండ్లూరి. ఒకనాడు ఆ నిరుపేద ఉదయం నుంచి సాయంత్రం దాకా రక్త మోడ్చి కష్టం చేసి, సూర్యుణ్ణి సాగనంపి, ఇంటికొచ్చి, ఉన్న గంజి తాగి, మేను వాల్చాడు. ఏనుగుకు మదం కమ్మినట్లు కటిక చీకటి కమ్మింది. ఆ సమయంలో ముక్కు మొఖం ఉన్న చీకటి ముద్దలాగా గబ్బిలం ఆ నిరుపేద ఇంటిలోకి వచ్చింది. జాషువా 'గబ్బిలం' కావ్యం లో గబ్బిలం నిరుపేద ఇంట్లోకి వచ్చిన దృశ్యం ఇది. జాషువా వారసత్వాన్ని అందుకున్న ఎండ్లూరి ఆ గబ్బిలం లాగే ఈ "కొత్త గబ్బిలాన్ని" కవిత్వీకరించాడు. ఉదయం అంతా విశ్వవిద్యాలయంలో విద్యాబోధన పూర్తి చేసుకుని రాత్రి ఇంటికి వచ్చి, హైదరాబాదు నగరానికి దండోరా ముట్టడికి వెళుతున్న జాతి జనుల గురించి ఏమి రాయాలా అని ఆలోచిస్తున్నప్పుడు తెల్లని ట్యూబ్ లైట్ గదిలోకి నల్ల బ్యాడ్జీలా కుర్ర గబ్బిలం వచ్చింది.

తెల్లని ట్యూబ్ లైట్ గదిలోకి/ నల్ల బ్యాడ్జీలా రెపరెపలాడుతూ/ వచ్చిందో కుర్ర గబ్బిలాయి/ వాని కన్నుల్లో కవికోకిల/ వారసత్వం ప్రతిఫలించింది/ వర్తమాన కవి!/ జై భీమ్ అంటూ/ ధీమాగా పలకరించింది/ దండోరా ముట్టడికి/ నగరానికి వెళ్తున్నానని సగర్వంగా ప్రకటించింది./. ఎండ్లూరి సుధాకర్ వర్తమానం అనే కవితా సంకలనం వేసాడు. అందుకే ఈ కొత్త గబ్బిలం వర్తమానకవి అని సంబోధిస్తూ జై భీమ్ అంటూ అభినందించింది. ఈ కొత్త గబ్బిలానికి ఒక రూట్ మ్యాప్ ఇస్తాడు కవి. ఈ గబ్బిలం రాజమహేంద్రవరంలో బయలుదేరి విజయవాడ మీదుగా మధిర ఖమ్మం వరంగల్ ఇలా సికింద్రాబాద్ చేరుకొని హైదరాబాదు ముట్టడికి వెళుతుంది. ఈ క్రమంలో అనేక మంది కవులను, ప్రాంతాలను స్మరిస్తూ, సందర్శిస్తూ , ముందుకు సాగుతుంది. ఇంట్లోకి వచ్చిన గబ్బిలాన్ని ప్రేమగా వాటేసుకొని నా జాతి జనుల డప్పుల దరువు ఆలకించమని చెప్తాడు. నీ పాదాలకు నా కవిత్వపు కొత్తజోళ్ళు తొడుగుతాను అంటాడు. రాజమహేంద్రవరం నుంచి బయలుదేరుతుంది కాబట్టి రాజమహేంద్రవరం ఎటువంటిదో గబ్బిలానికి వివరిస్తూ

తంద్రీ యిది రాజమండ్రి/ కులం కలుగులో నుంచి బయటకు రాని ఎండ్రీ/ అంటూ... రాజమహేంద్రవరం/ వేషం మార్చిన అగ్రహారం/ అని పరిచయం చేస్తాడు. హైదరాబాదులో హుస్సేన్ సాగర్ లో ఉన్న బుద్ధుని సందర్శించి, అంబేద్కర్కి నమస్కరించి, తెల్ల కోట అసెంబ్లీకి వెళ్ళు. దాని నెత్తిమీద అధికార పతాకంలా నర్తించు, రాబోయే రాజ్య ఋతువు నీదేనని గుర్తించు. అని గబ్బిలంతో చెప్తున్నట్లే దళితులతో రాబోయే కాలంలో రాజ్యాధికారం నీదే అనే స్వరాన్ని ప్రకటిస్తాడు.

దండోరా ఉద్యమ ఫలితంగా 2000 సంవత్సరం నుంచి 2004 వరకు వర్గీకరణ జరిగి ఆ ఫలాలు దాదాపు 59 కులాలకు అందాయి. అయితే 2004లో సుప్రీంకోర్టు వర్గీకరణను కొన్ని సాంకేతిక కారణాలు చూపి కొట్టేసింది. రిజర్వేషన్లను వర్గీకరించే అధికారం పార్లమెంట్ కే గాని అసెంబ్లీలకు లేదు అనే కారణం చూపింది. మళ్లీ సమస్య మొదటి వచ్చింది. ఆ నేపథ్యంలో 3-12-2004 నుంచి 6-12-2004 మూడు రోజుల్లో రాసిన వేదన స్వరమే '**వర్గీకరణీయం**' అనే దీర్ఘ కావ్యం. వర్గీకరణీయం కావ్యం A B C D అని నాలుగు భాగాలుగా ఉంటుంది. ఏ అంటే ఆకలని, బి అంటే బువ్వని, సి ,డి లు ప్లేయర్స్ అనీ వివరిస్తూ.. ఇది మహాభారత కథ. మహాభారత కథ అంటే మాల మాదిగల కథ. స్వాతంత్రం వచ్చి ఎన్ని సంవత్సరాలు అయినా 15% రిజర్వేషన్ సమంగా పంచుకోలేకపోయాము అనే స్వరాన్ని వినిపిస్తూ...

తమ్ముళ్ల వాటాలన్నీ/తన్నుకు పోయారు కదా/ తంగేడు పువ్వులు మీకు/ తంగేడు చెక్కలు మాకా?/ కందన గాయలు మీకు/ కరక్కాయలు మాకా?/ మంచి మెతుకులు మీకు/ మాడన్నాలు మాకా?/ పెద్ద పోస్టులు మీకు/ పెంట పోస్టులు మాకా?/ హాయి బూట్లు మీకు/ హవాయి చెప్పులు మాకా?/ చెప్పాలంటే చాలా ఉన్నాయి/ విప్పా మంటే గుప్పు మంటాయి./ అంటూ కవిత్వీకరిస్తూ... మహాభారతం యుద్ధంతో ముగుస్తుంది. మా.. మా. మహాభారతం సంధితో సమాప్తం అవుతుందని, అన్నదమ్ముల మధ్య శాంతిని స్వాగతిస్తూ, ఐక్యతా స్వరాన్ని ఈ కావ్యం లో వినిపిస్తాడు .

శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యద ప్రబంధాన్ని రాశాడు. ఆముక్తమాల్యదలో 'గోసంగి' అనే కులాన్ని గుర్తించాడు. గోసంగి ని మహాత్మా అని సంబోధిస్తూ.. గౌరవించాడు. వేదం వెంకటరాయ శాస్త్రి ఆముక్తమాల్యదకు సంజీవని వ్యాఖ్య సమకూర్చాడు. ఆ వ్యాఖ్యానంలో ఆయన గోసంగికి 'గోసంగి' అని కాకుండా, మాల దాసరి కథగా పేర్కొన్నాడు. నిజానికి అక్కడ ఉండాల్సింది గోసంగి కథ అని, కానీ ఆయన ఆ విషయాన్ని ప్రస్తావించలేదు. పైగా శ్రీకృష్ణదేవరాయలు మహాత్ముడిగా గుర్తించిన విషయాన్ని వేదం వారు విస్మరించాడు. ఆముక్త మాల్యద ప్రబంధం మీద ఆ తరువాత ఎవరు వ్యాఖ్యానం రాసినా వేదం వెంకటరాయ శాస్త్రి ని అనుసరించారు. ఈ విషయాన్ని గుర్తించిన ఎండ్లూరి, శ్రీకృష్ణదేవరాయల వారి పంచశతి పట్టాభిషేక మహోత్సవాలు ప్రారంభం అవుతున్న నేపథ్యంలో ఒక్క రాత్రిలో ఈ కావ్యాన్ని రచించారు. ఇకపై చరిత్రలో ఉన్న కులాలు విస్మరణకు గురికాకూడదనే ఆలోచనా స్వరమే **గోసంగి** అనే దీర్ఘకావ్యం

పుట్టడానికి కారణం అయ్యింది. ఎప్పుడూ మాల మాదిగ చర్చలేనా? 59 దళిత కులాల్లో దాగిన మట్టిలో మాణిక్యాల లాంటి అతి దళితుల మాటేమిటి? అనే ప్రశ్న కూడా ఈ గోసంగి కావ్యం రావడానికి నేపథ్యం సమకూర్చింది.

నేనూ మాణిక్యాన్నే /కానీ మసి గుడ్డలోదాచబ డ్డాను/ నేనూ సాటి మనిషినే/కానీ అంటరాని గడ్డలో పుట్టాను/ నేను గోసంగిని/ నేను మాతంగిని/ నేను మాదిగని/ నేను మాలని/ నేను గొడారిని/ నన్నే పేరుతో పిలిస్తేనేం /నా దేహానికీ /దేవాలయానికి మధ్యన అంటు గోడలున్నంతకాలం/. ఆముక్తమాల్యద కావ్యం లో దళిత దాసరి (గోసంగి) అద్భుతమైన రాగంతో దేవుణ్ణి ఆరాధిస్తాడు. కానీ అతనికి దేవాలయ ప్రవేశం ఉండదు. గర్భగుడి కడిగిన మురికి జలం కాలవగుండగా దేవాలయపు బయటికి వచ్చే దగ్గర ఆ నీటితో దాహం తీర్చుకుంటాడు. ఏ ఉత్తమ జాతి వారికి అడ్డు రాకుండా, తగలకుండా తాను పక్కకు జరుగుతూ ఉంటాడు. ఇతర మతాల...లోకి దళితులు ఎందుకు వెళ్లాల్సి వస్తుందో ఇటువంటి కథలు సాక్షాలుగా నిలుస్తాయి.

నిజానికి దళితులను గుర్తించి దళిత ఆహారాన్ని, ఆతిథ్యాన్ని స్వీకరించినట్లయితే, ఇంకొక రకంగా ఉంటుంది. మా డప్పు విన్నాడా/ శివుడు చిందేయాల్సిందే/ మా చెప్పు కొన్నాడా/ కుబేరుడు పాదాభివందనం చేయాల్సిందే / మా కిన్నెర మోత విన్నాడా/ నారద మహర్షి మహతిని మర్చిపోవాల్సిందే/ మా గోంగూర మాంసం తిన్నాడా/ ఇంద్రుడు ఇంటి భోజనం విడిచి పెట్టాల్సిందే/ మా పెద్దింటి స్త్రీలు పెట్టే లచ్చించారు రుచి చూసాడా/ విష్ణుమూర్తి పాలకడలి విడిచి మా కూర చట్టి తెచ్చుకోవాల్సిందే/ మా గోరోజన విద్య తెలుసుకున్నాడా/ అపర ధన్వంతరి మాదారికి రావాల్సిందే/ మావాడ తెలుగు చెవినబడితే కృష్ణరాయలు భువన విజయం వదిలి పెట్టాల్సిందే/ అని ప్రబంధ యుగంలో దళితుల్ని, దళితుల భాషను, రుచుల్ని, విస్మరించారు. లేకపోతే కృష్ణ రాయ నీ భువన విజయంలో అష్టదిగ్గజాలేంఖర్మ వేల దిగ్గజాల నీలి పాదాలు గండపెండెరాలతో ఘల్లు మనేవి అని విస్మరణకు గురైన జాతుల అంతః స్వరాన్ని కవిత్వీకరిస్తాడు. గతంలో విస్మరణకు గురైన జాతులను సమీకరించటం. వర్తమాన ఉద్యమాల స్ఫూర్తిని నింపి చైతన్య పరచడం. భవిష్యత్తు దిశగా పయనించి అసమానతలు బద్దలు చేసి సమాన పంపకంతో అన్నదమ్ములు ఏకమై, అంబేద్కర్ చూపిన రాజ్యాధికార సింహాసనం అందుకోవడం అనే మూడు దశలను ఈ "కావ్య త్రయం " వినిపిస్తూ దళితులను చైతన్యపరుస్తూ.. వారిలో స్ఫూర్తి నింపుతూ, ముందుకు నడిపిస్తుంది....

******

# 44. ముకుంద రామారావు అనువాదం – సామాజిక స్పృహ

**నారగోని సైదులు**

పరిశోధక విద్యార్థి

తెలుగు అధ్యయన శాఖ

బెంగళూరు విశ్వవిద్యాలయం

బెంగళూరు – 560056

ఫోన్: 9490585645

మెయిల్: Saidulu645@gmail.com

**ఉపోద్ఘాతం:**

ఏ కవి అయినా, ఏ ఋషి అయినా, ఏ రచయిత అయినా సమాజ శ్రేయస్సును దృష్టిలో ఉంచుకునే రచనలు రచిస్తారు, ప్రవచిస్తారు, ప్రబోధిస్తారు, ఉపదేశిస్తారు. మానవాళి ప్రయోజనమే ప్రధాన లక్ష్యంగా రచనలు కావిస్తారు. అయితే, ఈ సృష్టి ఆరంభం నుంచి పంచభూతాలు ఓ నియతి ప్రకారం కొనసాగుతూ వస్తున్నాయి. భూమిపై నివసించే మానవుడు ఆ నియతిని అనుసరించి, పంచభూతాలకు ఎటువంటి భంగం కల్గించకుండా తన జీవనాన్ని కొనసాగించాలి. అదే మానవ జీవిత లక్ష్యం, జన్మ సార్థకం కూడా!. దీనివల్ల సమాజం ప్రశాంతంగా, ఆహ్లాదకరంగా ఉంటుంది. కాని, మానవుడు ఆనాటి కాలం నుంచి ఈనాటి వరకూ తన స్వస్థితిని విస్మరించి, లేనిపోని ఆరాట పోరాటాలకు లోనై, మానసిక స్థితికి దిగజారిపోయి సమాజం పట్ల, సాటి వ్యక్తుల పట్ల అమర్యాదగా ప్రవర్తిస్తున్నాడు. సమాజం ఏమైపోయిన మనకేంటి నష్టం అనే స్పృహలోనే జీవించేస్తున్నాడు. ఇతరుల పట్ల జాలి, దయ, కరుణ, వాత్సల్యాలు చూపకుండా స్వార్థంతో పరుగెడుతున్నాడు.

ఇటువంటి తరుణంలో మానవుడు ఎందుకు సమాజం పట్ల బాధ్యతరహితంగా వ్యవహరిస్తున్నాడు?, మధ్యయుగంలో వచ్చిన భక్తి కవిత్వం 'సామాజిక స్పృహ'ను గురించి ఏం చెప్పింది? అనే విషయాలను కవి, అనువాదకులు ముకుంద రామారావు 'అదే కాంతి' పేరుతో అనువదించిన 'మధ్యయుగంలో భక్తి కవిత్వం: సామాజిక నేపథ్యం' అనే పుస్తకాన్ని పరిశీలించగా, కొన్ని ముఖ్యమైన విషయాలు విధితమవుతున్నాయి. అయితే, ముందుగా సామాజిక స్పృహ - రకాలు, అనువాదం – అర్థాలు, అనువాదం – పర్యాయ పదాలు, అనువాదం – రకాలు, మూలభాష- లక్ష్యభాష అంటే ఏమిటో చర్చించుకుందాం.

**సామాజిక స్పృహ - అర్థాలు:**

మానవుడు తన చుట్టూ ఉన్న సమాజాన్ని గురించిన స్పృహతో జీవించటాన్నే 'సామాజిక స్పృహ' అని పిలుస్తున్నారు. ఎందుకంటే మానవుడు సంఘజీవి, మేధోజీవి, బుద్ధిజీవి. సమాజంలో ఇరుగు పొరుగు వారితోనే కాకుండా జంతువులు, మొక్కలతో సహజీవనం చేయగల నేర్పు గలవాడు. ఈ 'సామాజిక స్పృహ' అనే పదం 1930వ దశకం నుండి 1980వ దశకం వరకు తెలుగు సాహిత్యలోకంలో వీర విహారం చేసింది. 'సామాజిక స్పృహ' అంటే 'సమాజం' అందులోని సమస్యలు అనే మరొక అర్థంలో కూడా పిలుస్తున్నారు. సహజంగా స్పృహ అంటే 'మెలకువ' (imagination) అని అర్థం. 'consciousness' అనే ఆంగ్ల పదానికి సమానార్థకంగా స్పృహను వాడుతున్నారు. ఏది ఏమైనప్పటికీ ఆధునిక యుగంలో సామాజిక స్పృహ అనే పదం ఎక్కువగా వినిపిస్తున్నది. కాని, ఈ పదం యొక్క పునాదులు ప్రాచీన కాలం నుంచే ఉన్నాయన్న దానికి మమ్మటుడి 'కావ్య ప్రకాశం'లో ఉదాహరణలు ఉన్నట్టు సాహితీవేత్తలు పేర్కొన్నారు.

**సామాజిక స్పృహ – రకాలు:**

సాహితీవేత్తలు సామాజికను స్పృహను శాస్త్రీయ దృష్టితో నిశితంగా పరిశీలించి, ఈ క్రింది విధంగా విభజించారు.

1. సామాజిక స్పృహ

2. రాజకీజ స్పృహ

3. వైజ్ఞానిక స్పృహ

4. పర్యావరణ స్పృహ

5. వేద, ఇతిహాస పురాణాల స్పృహ మొదలయినవిగా పేర్కొన్నారు.

**అనువాదం - అర్థం:**

అనువాదమంటే తెలియనిదేదో తెలియజెప్పటం లేదా బహిరంగపరచడం. ఒక భాషలో ఉన్న దానిని మరొక భాషలోకి మార్చడం (అది రాత రూపంలో కావచ్చు, మాటల్లో కావచ్చు). అంటే ఒక భాషలో ఉన్న విషయాన్ని గానీ, పదాన్ని గానీ, వాక్య సముదాయాన్ని గానీ వేరొక భాషలోకి మార్చి చెప్పటాన్ని, రాయడాన్ని అనువాదం అంటారు. అనువాదం భాషకు సంబంధించింది. మూలభాషలో ఉన్న విషయాన్ని లక్ష్యభాషలోనికి మార్చి చెప్పడం అనువాదమవుతుంది. అనువాద సిద్ధాంతమేదైనా భాషా సిద్ధాంతంపైనే ఆధారపడి ఉంటుంది.

సాహిత్యం సార్వజనీనమయింది. దానికి దేశభేదాలు, భాషాభేదాలు తెలియవు. ఏదైనా ఒక రచన ఏ దేశంలో వెలువడినప్పటికీ, ఏ భాషలో రచించబడినప్పటికీ మానవానికి ఒక సందేశాన్ని, మానవ పురోగమనానికి ఒక మార్గాన్ని చూపించేదిగా ఉంటే అది సర్వత్రా ఆదరించబడుతుంది. అనువాదకులు ఒక దేశానికో, ఒక భాషకో, ఒక కాలానికో పరిమితం కారు. నేటికి అనువాదకులు తమ రచనల ద్వారా సహృదయుడైన పాఠకుని మనసులో అఖండ చైతన్యజ్యోతిని వెలిగిస్తూ,ప్రముఖుల మన్ననల్ని, ప్రశంసల్ని అందుకుంటున్నారు.

**అనువాదం – పర్యాయ పదాలు:**

తెలుగులో అనువాదాన్ని వివిధ పేర్లతో ఉచ్చరిస్తున్నారు. ప్రధానంగా అనువాదం, తర్జుమా, భాషాంతరీకరణం, తెలుగీకరణం లేదా ఆంధ్రీకరణం, అనుసృజన, అనుసరణ, అనుకరణ, తెలుగు సేత, ట్రాన్సులేషన్ వంటి పదాలు ఒకే అర్థంలో వాడబడుతున్నాయి. కానీ, అనువాదం అన్న పదమే ఎక్కువగా రూఢికెక్కింది. వెలమల సిమ్మన ''తెలుగు భాషా చరిత్ర పుట సంఖ్య 680'' ప్రకారం 'నిజానికి అనువాదం చేయడమనేది అందరు అనుకునేంత సులభమైన ప్రక్రియ కాదు. అనువాదం చేయడమంటే మాటకు మాట, వాక్యానికి వాక్యం నిర్మించడం కాదు. అందరూ ఆ పని చేయలేరు, చేసినా అందరూ రాణించలేరు. దానికి చాలా సామర్థ్యం కావాలి' అని పేర్కొన్నారు. ఒక గ్రంథాన్ని అనువదించడం చేయడం కంటే స్వతంత్ర రచన చేయడమే మేలని పలువురు విమర్శకులు తమ అభిప్రాయాలను వ్యక్తం చేశారు. అనువాదకుడు మూలగ్రంథకర్త అంతటివాడై ఉన్నప్పుడే అతడి అనువాదంగా బాగా ఉంటుంది. అప్పుడే ఆ రచన పదిమంది చేత మెప్పును పొందుతుంది అని సాహితీవేత్తలు పేర్కొన్నారు.

**అనువాదం - రకాలు:**

భాషాశాస్త్రజ్ఞులు అనువాదాన్ని శాస్త్రీయ దృష్టితో నిశితంగా పరిశీలించి, పలు రకాలుగా విభజించారు.1. యథాతథానువాదం 2. స్వేచ్ఛానువాదం 3. మక్కికి మక్కి అనువాదం 4. పదానువాదం 5. పేరానువాదం 6. సమాచారానువాదం 7. శాస్త్రసాంకేతికానువాదం 8. సాహిత్యానువాదం 9. వ్యాకరణానువాదం. 10. కోశానువాదంతో పాటు మరికొన్ని అనువాదాలుగా విభజించారు. అయితే, వీటిలో ఏ అనువాదం ఉత్తమ అనువాదం అంటే స్వేచ్ఛానువాదమే మంచి అనువాదమని, ఈ అనువాదం ద్వారా మూల రచయిత రచనలకు ఎలాంటి భంగం కలగదని భాషావేత్తలు పేర్కొన్నారు.

**మూలభాష- లక్ష్యభాష:**

ఏదైనా ఒక అంశాన్ని ఏ భాషలోంచైతే ఎన్నుకుంటారో దాన్ని మూలభాష (Source Language) అంటారు. ఎన్నుకున్న ఆ అంశాన్ని ఏ భాషలోకైతే అనువాదం చెయ్యాలని సంకల్పిస్తారో దాన్ని లక్ష్యభాష (Target Language) అంటారు. రాచమల్లు రామచంద్రారెడ్డి 'అనువాద సమస్యలు' అనే గ్రంథంలో "మూలభాష మాతృభాషగా గలవానికి, మూలరచనలోని సారాంశం ఎంత స్పష్టంగా అర్థమై, ఎంత గాఢమైన అనుభూతిని కలిగిస్తుందో, లక్ష్యభాష మాతృభాషగా గలవానికి అనువాదంలోని సారాంశం అంత స్పష్టంగానూ అర్థమై, అంతగాఢమైన అనుభూతిని కలిగిస్తే అది మంచి అనువాదం అవుతుంది' అని అనువాదకులు వివరించారు.

**'అదే కాంతి' మధ్యయుగంలో భక్తి కవిత్వం - సామాజిక నేపథ్యం:**

'అదే కాంతి మధ్యయుగంలో భక్తి కవిత్వం - సామాజిక నేపథ్యం' అనే వెలువరించిన కవి, అనువాదకులు యల్లపు ముకుంద రామారావు. ఈయన స్వస్థలం విశాఖపట్టణం జిల్లా, అనకాపల్లి మండలం, వెంకుపాలెం గ్రామం. కానీ, ముకుంద రామారావు పుట్టింది, పెరిగింది, విద్యను అభ్యసించింది పశ్చిమ బెంగాల్ రాష్ట్రంలోని ఖరగ్‌పూర్‌లో. అందుక్కారణం ఆయనది వలస కుటుంబం. ముకుంద రామారావు ఓ వైపు కవిత్వం రాస్తూనే, మరోవైపు పంచభూతాల పేరుతో ప్రపంచదేశాల కవిత్వాన్ని తెలుగులోకి అనువాదం చేశారు, చేస్తూనే ఉన్నారు. తన తొలి కవితా సంపుటి 'వలసపోయిన మందహాసం' (1995)తో మొదలుపెట్టి ఈనాటివరకు మొత్తం 8 కవితా సంపుటాలను వెలువరించారు. వీటితోపాటు అదే ఆకాశం, అదే గాలి, అదే నేల, అదే కాంతి, అదే నీరు, నోబెల్ కవిత్వం, శతాబ్దాల సూఫీ కవిత్వం, మియా కవిత్వం, బెంగాలీ కవిత్వం, చర్యాపదాలను తెలుగులోకి అనువాదం చేశారు. ఉద్యోగరీత్యా రైల్వేశాఖలో సుదీర్ఘకాలం పని చేసిన ముకంద రామారావు, 2003లో పదవి విరమణ చేశారు.

'అదే కాంతి' అనే పుస్తకాన్ని రచయిత ముకుంద రామారావు 2022 (ఏప్రిల్)లో వెలువరించారు. ఈ పుస్తకానికి ప్రముఖ తెలుగు సాహిత్య విమర్శకులు **వెల్చేరు నారాయణరావు 'మున్నుడి' పేరుతో ముందుమాట రాశారు. అందులో** ''భారతదేశంలో మధ్యయుగంలో వచ్చిన అనేక భక్తి కవుల గురించిన కథలు ఈ 'అదే కాంతి' పుస్తకంలో వున్నాయి. తెలుగు వాళ్లు ఎప్పుడూ యెరగని అనేక భాషల్లో వున్న కవుల గురించి రచయిత కొత్త విషయాలు చెప్పారు. భగవంతుడి దృష్టిలో మనుషులందరూ ఒక్కటేనన్న సామాజిక సందర్భాన్ని ఆసక్తికరంగా విశ్లేషించారు. ఈ అనువాదాలు వివిధ భాషల్లోంచి చేసినవే అయినా, చదువుకోడానికి వాటిలో వుండే భక్తి భావం, సామాజిక నేపథ్యం చక్కగా వినిపిస్తుంది.'' అని ఆయన వివరించారు.

'అదే కాంతి' అనే పుస్తకంలో రచయిత ముకుంద రామారావు సామాజిక దృష్టితో, మధ్యయుగంలో వచ్చిన భక్తి ఉద్యమాన్ని నిశితంగా పరిశీలించి, నాలుగు అధ్యాయాలుగా విభజించారు. అవి 1. దక్షిణ భారతం (తమిళ, కన్నడ, తెలుగు, మలయాళ ప్రాంతాలలో ప్రసిద్ధి చెందిక కవులు, వారి పరిచయాలు, రచనలు, కవితలు అనువదించారు) 2. పశ్చిమ భారతం ( మారాఠీ, గుజరాత్, రాజస్థాన్, సింధ్ ప్రాంతాలకు చెందిన భక్తి కవులు, వారి కవిత్వాన్ని అనువదించారు) 3. ఉత్తర భారతం (కాశ్మీర్, హిందీ, పంజాబ్ ప్రాంతాలకు చెందిన కవులు, కవిత్వాలను అనువదించారు) 4. తూర్పు భారతం (అస్సాం, బెంగాల్, ఒడిస్సా ప్రాంతాల్లో ప్రసిద్ధిగాంచిన కవుల కవిత్వాలను అనువదించారు). కాశ్మీర్ మొదలుకొని కన్యాకుమారి వరకూ సామాజిక స్పృహతో మధ్యయుగం కవులు భక్తి పేరుతో ఆనాటి ఆచారాలు, సంప్రదాయాలు, సామాజిక, ఆర్థిక స్థితిగతులను వివరించారు. అందులో కొన్ని ప్రాంతాల కవులు, వారి కవితలను ప్రస్తావించే ప్రయత్నం చేస్తాను. దానికంటే ముందు భక్తి ఉద్యమం ప్రారంభాన్ని వివరిస్తాను.

**భక్తి –అర్థాలు:**

'భజ' నుండి ఉత్పన్నమైన సంస్కృత పదం భక్తి. భక్తి అంటే ఇష్టదేవుని మనఃపూర్వకంగా భజించడం లేదా ఆరాధించడం అని అర్థం. ఆ ఇష్టదేవుడు విష్ణువు, శివుడు, శక్తి ఎవరైనా కావచ్చు. భక్తి ఉద్యమంలో కవులందరూ వారి స్వీయ దేవుళ్ల (శివుడు, విష్ణువు, కృష్ణుడు,

రాముడు, జగన్నాథుడు, దేవి) మీద అనేక కీర్తనలు రాసారు. అయితే, ఆయా దేవుళ్లు ఎక్కడో స్వర్గంలోనే ఉంటారని కాకుండా, వారికి తండ్రి, తల్లి, గురువు, స్నేహితుడుగా భావిస్తూ సన్నిహితులై చేసిన గానం, అనేక ప్రార్థనలుగా, భజనలుగా రూపాల్ని తీసుకున్నారు.

భక్తి మూలాలు సంస్కృతంలో అనేకం ఉన్నా, ఒక ఉద్యమంగా మొదలైంది మాత్రం ఆరవ శతాబ్దం ప్రారంభంలోనే. అది కూడా తమిళ ప్రాంతలోనే. భక్తి ఉద్యమంలో దైవాన్ని కొందరు ఆకార రూపంలో చూస్తే, మరికొందరు నిరాకార రూపంగా భావించారు. అయితే, రానురాను దైవం పట్ల అద్వితీయమైన భక్తి, మార్మికమైన ప్రేమ, వ్యక్తిగత బాంధవ్యం, ఆచారకాండల్ని, సాంప్రదాయిక ధర్మపరాయణ కుల వ్యవస్థల్ని బలపరిచే వాటి పట్ల వ్యతిరేకత మొదలై, ఉద్యమం రూపం దాల్చింది.

**తమిళం ప్రాంతం:** 6వ శతాబ్దానికి చెందిన కారైక్కాల్ అమ్మెయ్యార్ అమ్మవారు (నాయనార్) రాసిన మొదటి గీతం.

**'ఆ రోజు ఎప్పుడు?'**

నాకు మాటలు వస్తున్నప్పటి నుంచీ
నేను నిన్ను ప్రేమిస్తూనే ఉన్నాను
నీ పాదాల చెంత నేడు ఆశ్రయం పొందాను
ఓ దేదీప్య నీలకంఠుడా, దేవుళ్లకు దేవుడా
అన్ని జీవన యాతనల నుండీ
నాకు విముక్తి కల్పించే
ఆ రోజు ఎప్పుడు వస్తుంది?

**కన్నడ ప్రాంతం:** 12 శతాబ్దానికి చెందిన దళిత కవి మాదర చెన్నయ్య బసవన్నపై ఉన్న గౌరవంతో రాసిన వచనాలు కన్నడ సాహిత్య చరిత్రలో గొప్ప పేరుపొందాయి.

**'బానిసవు కాబోకు'**

కేవలం రక్తం, ఎముకలు మూలుగు శరీర ద్రవాల్లోనే భేదం
కేవలం మోహం పీడించడంలోనే భేదం
కేవలం వివిధ వృత్తుల్లోనే భేదం
కేవలం కనిపించడం ఆత్మకు తెలియడంలోనే భేదం
కులం ఏదైనా, తెలుసుకునేవాడే సంగతిని గ్రహిస్తాడు
మరచిపోతే, మాయకీ కాలుష్యానికీ లోబడతాడు
కేవలం శూలానికో, కత్తెరకో, అరగదీసే రాయికో బానిసవు కాబోకు
నిజాత్మ రాముడ్ని తెలుసుకో అని వివరించారు.

**తెలుగు ప్రాంతం:** 'తెలంగాణా ఆదికవి'గా పేరుపొందిన పాల్కురికి సోమనాథుడు వీరశైవ మతాన్ని స్వీకరించిన తర్వాత శివభక్తితో కథల ఆధారంగా తెలుగులో ద్విపదలు రాసాడు. బసవపురాణంలో సోమనాథుడు పరమేశ్వరుని చూసి..

పెన్నిధి యుండంగ మన్నడుగుదురే?
నిన్నొండువేడెడి నిర్గుణి గలడె?
పదవులు గిదవులు పనిలేదు నీదు
సదమల భక్తి ప్రసాదింపు దేవ!

శివభక్తిపరుల పూజింపకే ప్రొద్దు

శివపూజలొక కోటి సేసిన వృదయ

భక్తితోనే ప్రొద్దు భజియింప వలయు

భక్తుల వరువుండ భక్తుల బంట అని కోరుకుంటాడు. ఇలా మధ్యయుగ భారతదేశంలో క్రి.శ. 6వ శతాబ్దంలో మొదలై 12, 13 శతాబ్దం వరకూ భారతదేశం వ్యాప్తంగా ఉవ్వెత్తుగా కొనసాగిన భక్తి ఉద్యమం అనాటి సామాజిక పరిస్థితులను వెల్లడించింది.

**ముగింపు:**

వ్యక్తి ప్రభావం కుటుంబం మీద, కుటుంబ ప్రభావం సమాజం మీద, సమాజం ప్రభావం ప్రపంచం మీద, ప్రపంచం ప్రభావం ప్రకృతి మీద ప్రత్యక్షంగా ఉంటాయి. వీటిని సరైన పంథాలో నడపాల్సింది మానవుడే.!. అయితే, ప్రస్తుత సమాజంలో ఈ పరిస్థితి గాడితప్పింది. ఆత్మీయతను అందుకోలేని అంధకార దుస్థితి సమాజంలో నెలకొంది. పట్టాలు తప్పిన రైలు పల్టీలు కొట్టినట్లు మనిషి దారితప్పి, గమ్యం తెలియని ప్రయాణంపై వైపు వెళ్తున్న పరిస్థితులు దర్శనమిస్తున్నాయి. పంచభూతాలు పూర్తిగా కలుషితమై, ప్రకృతికి ప్రమాదం పొంచి ఉన్న పరిస్థితి దాపురించింది. ఇవన్నీ సంస్కరించబడాలంటే మానవుడు సమాజం, ఇతరుల పట్ల మానవత భావాన్ని కల్గి ఉండాలి. సమాజంలో బాధ్యతాయుతంగా ఎలా నడుచుకోవాలో అవగాహన పెంచుకోవాలి. సమాజం, సాటి వ్యక్తుల పట్ల సామాజిక స్పృహను, భక్తిని కల్గి జీవించాలని మధ్యయుగంలో వచ్చిన ఫంటాపథంగా కవిత్వం బోధించిందనట్టు రచయిత ముకుంద రామారావు 'అదే కాంతి'లో స్పష్టంగా వివరించారు.

**ఆధార గ్రంథాలు:**

1. తెలుగు భాషా చరిత్ర – ప్రొఫెసర్ వెలమల సిమ్మన్న

2. కదంబం తెలుగు సాహిత్య ప్రక్రియలు రూపాలు – మూసీ సాహిత్య సంచిక

3. అనువాదం – అనుభవాలు (వ్యాస సంకలనం) – మహేంద్ర భారతి

4. ప్రాచీన సాహిత్యంలో సామాజిక స్పృహ – ప్రకాశిక అంతర్జాల త్రైమాస పత్రిక (2022)

*******

# 45. బలిపీఠం నవలలోని సామాజిక అంశాలు - విశ్లేషణ

డా. ఎం. పద్మగౌరి

అసిస్టెంట్ ప్రొఫెసర్.

పొ-ఆ- తెలుగు విశ్వవిద్యాలయం,

బొమ్మూరు.

చరవాణి : 9885962656.

**ఉపోద్ఘాతం:**

రంగనాయకమ్మగారి రచనలలో బలిపీఠం' నవలఅపూర్వమైంది. బలిపీఠం నవల ప్రజలను బాగా ఆకర్షించడానికి గల కారణం. ఈ నవలలో కథా కథనంను ఆకర్షణీయంగా నడిపించడంలోరచయిత్రి యొక్క శక్తి సామర్థ్యాలే కారణం. ఇందులో చెప్పిన అంశాలన్నిసాంఘిక, సంస్థ సంస్కరణ, అభ్యుదయ, ఆదర్శాలు మొదలైన అంశాలుఉన్నాయి. ఈనవలలో ఆనాటి సాంఘిక, సామాజిక పరిస్థితులకు అనుగుణంగా రచన చేశారు.స్వాతంత్ర్యానంతరం సమాజంలో ఎదుర్కొంటున్న అంశాలను దృష్టిలో పెట్టుకొని రచించారు. 1965 ఈ నవలకు కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు వచ్చింది.

ఈ నవలలో కథ ప్రారంభం 1952 ప్రాంతం గాంధీ గారి సత్యా ,అహింసల ఆదర్శం, సంఘసేవా దృక్పథం సంస్కరణ ఉద్యమప్రభావం మొదలైన అంశాలన్ని ప్రధానంగా వ్యక్తమౌతాయి. .

కథా ప్రారంభంలో కరుణసమాజాన్ని'పరిశీలించడానికివచ్చిన చారిత్రక వ్యక్తి "పొట్టిశ్రీరాములు బాబు గారు"ప్రవేశ పెట్టబడింది. కరుణ సమాజ సెక్రటరీగా కథానాయకుడు భాస్కర రావు సమాజ సభ్యుడిగా పరిచయమవుతాడు. తనను ప్రభావితం చేసిన సంఘటనని, సమాజానికి చేస్తున్న సేవలను గూర్చి ప్రస్తావించడంతో నవల ప్రారంభం అవుతుంది.

**బలిపీఠం నవల – ఇతివృత్త పరిచయం:-**

ఈ నవలలోని ప్రధాన పాత్రధారి కథానాయకుడు భాస్కర్ రావు.సామాన్య శరీర ఛాయతో ఆకర్షణీయమైన విగ్రహం కలవాడు.ముఖం పై ఎప్పుడూ చెదరని నవ్వు, ప్రత్యేకమైన ఆకర్షణతో, స్వంత వ్యక్తిత్వం, ఆలోచన గలవాడు.ప్రశాంతమైన,ఆదర్శవంతమైన జీవితాన్ని గడుపుతూ కరుణ సమాజంలో సభ్యుడిగా చేరి తన సేవలను అందిస్తుంటాడు భాస్కర్.

తన మనసుకు తెలియకుండా తార' అనే ఆమెను ప్రేమించడం ఆరంభించిన భాస్కర్, అనుకోని పరిస్థితుల మధ్య అరుణ పరిచయం,అవుతుంది. ఆమె ఒక బాల వితంతువు, బ్రాహ్మణ స్త్రీ. గుండె నొప్పితో భాదపడుతూ ఉంటుంది. చావుకు సమీపంగా ఉన్న ఆమె చివరి కోరిక సుమంగళి గా పోవాలని, వివాహం చేసుకోమని భాస్కర్ ని కోరుతుంది. ఆమెకు ఎంతో ధైర్యం చెబుతూ ప్రకృతి వైద్యంతో వైద్యం చేయిస్తాడు. ఆమె పూర్తిగా ఆరోగ్యవంతురాలవుతుంది.తను హరిజన కులస్థుడని తన గురించి ముందుగా తెలియజేస్తాడు భాస్కర్ తన పరిస్థితి తెలుసుకొని వివాహం చేసుకోవడానికి ముందుకు వచ్చిన భాస్కర్ ని అభిమానిస్తుంది. ఇద్దరూ వివాహం చేసుకుంటారు.

వారిద్దరికి పాప జన్మిస్తుంది. ఆమెను చదివించి ఉద్యోగ్యం లో చేర్పిస్తాడు భాస్కర్. తన అక్క, మేనల్లుడిని ఇంట్లోకి తీసుకువస్తాడు. మేనల్లుడు గోపిని చదివిస్తాడు. ఉద్యోగ్యరీత్యా ఒక సంవత్సరం ట్రైనింగ్ కి బొంబాయి వెళతాడు భాస్కర్. అరుణ మొదటి భర్త తల్లిదండ్రులు అరుణకు సహాయకులుగా ఉంటారు.

ట్రైనింగ్ నుండి వచ్చిన భాస్కర్ కు అరుణప్రవర్తనలోని మార్పునుగమనిస్తాడు.తనబంధువులతోప్రవర్తించిన తీరును చూసి బాధపడతాడు. ఇద్దరి మధ్య అభిప్రాయ భేదాలు వస్తాయి, విడిపోతారు.అరుణ పిన్ని కూతురు అమల జేమ్స్ లు మతాంతర వివాహం చేసుకుంటారు.వారి అన్యోన్యదాంపత్యం చూసి తన చేసిన తప్పేంటో తెలుసుకుంటుంది.తన మొదటి భర్త తల్లిదండ్రులు చెప్పుడు మాటలు విని తన జీవితాన్నితానే నాశనం చేసుకున్నానని పశ్చాత్తాపం చెందుతుంది.మనోవేదనకు గురై గుండెనొప్పితో భాద పడుతుంది. భాస్కర్ వైద్యం చేయించిన ఫలితం లేకపోవడంతో తన ఇద్దరి పిల్లలను భాస్కర్ కి అప్పగించి అతని ఒడిలోనే తుది శ్వాస విడుస్తుంది. అరుణ ఏవిధంగా బలిపీఠానికి గురైందో ఈ నవల ద్వారా రచయిత్రి తెలియజేశారు.

**నవలలోని సామాజిక అంశాలు – విశ్లేషణ**

**1.సంఘ సంస్కరణ నేపథ్యం:**

ఈ నవలలోని ప్రధాన పాత్రధారి కథానాయకుడు భాస్కరరావు, ఇతడు మంచి కమ్యూనిస్టు కావలసినవాడు కాని అతన్ని వెనక్కి మళ్లించి సంఘ సంస్కర్త చేసారు రచయిత్రి. కథానాయకుడిది ఉత్తను సంస్కారవంతుడిగా తీర్చిదిద్దారు. పరిస్థితులను అర్థం చేసుకొని వాటికి అనుగుణంగాప్రవర్తించే ప్రతిభావంతుడు, సంస్కారవంతుడు భాస్కర్.

భాస్కరరావు చిన్నతనం నుండే సంఘసంస్కరణాభిలాష,సంస్కరణ లోచన గలవాడు అతని చిన్నతనంలో ఒక సంఘటన జరిగింది. కొందరు వ్యక్తులు ఒక మేకను బలి ఇవ్వడానికి చేస్తున్న ప్రయత్నంను చూసి, మూర్ఖత్వమని, రాక్షసత్వం అని, మూఢవిశ్వాసం అని భావించాడు. ఎదుర్కొవడానికి వయసు సరిపోదు. ఆ సమయంలో కొందరు వ్యక్తులు వచ్చి మూగజీవిని చంపడాన్నివ్యతిరేకిస్తారు. ఈ సంఘటనను చూసిన భాస్కర్ ఆశ్చర్యానికి లోనవుతాడు. కరుణ సమాజం' సభ్యులు చేశారని తెలుసుకొని తను ఒక సభ్యుడిగా చేరి తన జీవితాన్నిసమాజానికి అంకితం చేస్తాడు.

**2.కరుణ సమాజం – సమాజసేవ:**

భాస్కర్ కరుణ సమాజంలో సభ్యుడిగా చేరిన దగ్గర నుండి ఆ సమాజానికి సేవ చేయడం ప్రారంభించాడు. కరుణ సమాజంలో అనాధ పిల్లల్ని చేరదీసి, వారిని చదివించడం, యాక్సిడెంట్లో దెబ్బతిన్నవారికి వైద్యం చేయించడం, అవయవాలు లోపించిన వారికి సహాయం చేయడం. స్వాతంత్ర్యానంతరం భారత దేశపరిస్థితులు అన్ని మారిపోయాయి. బర్మా దేశానికి వలస వెళ్ళిన వారు. కాందిశీకులుగా భారతదేశానికి తిరిగి రావడంతో వారికి పునరావాస ఏర్పాటు చేయడం, వాళ్ళను తిరిగి వారి బంధువుల దగ్గరకు చేర్పించడం, వివాహం కాని యువతులకు ఆర్థికంగా సహాయపడి ఆదర్శ వివాహాలు చేయడం మొదలైన సహాయ కార్యక్రమాలన్ని 'కరుణ సమాజం'చేస్తుంది. భాస్కర్ వారందరికి సహాయం చేస్తుంటాడు.

అంతేకాదు అనేక రకాలైన రోగాలతో బాధ పడే వారిని, కుష్ఠు రోగులను కూడా ఆదరించి ఆశ్రయం కల్పించేవారు . భాస్కర్ వారికి డ్రెస్సింగ్ చేసేవాడు.ఈ విధంగా ఎన్నోవిధాలుగా సేవ చేస్తూ ఎంతోమందిని బలి పీఠం బారి నుండి కరుణ సమాజం కాపాడింది. అలాంటి కరుణ సమాజంలో భాస్కర్ అంకిత భావంతో పని చేస్తూ ప్రత్యక్షంగాను, పరోక్షంగాను ఎందరినో బలిపీఠంకు పాల్పడకుండా కాపాడగలిగాడు కథానాయకుడు భాస్కర్.

**3.కులాంతర వివాహం :-**

కరుణ సమాజ సభ్యుడిగా సేవచేస్తున్న భాస్కర్ దగ్గరికి అనుకోని పరిస్థితిలో అరుణ పరిచయం అవుతుంది. ఆమె బ్రాహ్మణ యువతి,బాలవితంతువు, తీవ్రమైన గుండె నొప్పితో బాధ పడుతున్న ఆమె చనిపోయే ముందు ఒక్క రోజైన సౌభాగ్యవతిగా, సుమంగళిగా మరణించాలనే కోరికను విన్న భాస్కర్ ఆమెతో నీవు చావు సిద్ధమైతే, నిన్ను ఇప్పుడే పెళ్ళి చేసుకుంటాను "నిన్ను బ్రతికించు కోవలసిన ధర్మంనాది" అని అంటాడు.

ఆమె కెంతో దైర్యాన్ని,ఓదార్పునిస్తాడు. ప్రకృతి వైద్యంచికిత్సతో ఆమెను ఆరోగ్యవంతు రాలిని చేస్తాడు.ఆమె పూర్తిగా కోలుకున్న తర్వాత వివాహం చేసుకుంటాడు.అరుణ బ్రాహ్మణ యువతి, భాస్కర్ హరిజనుడు తన కుల విషయం ముందుగానే చెబుతాడు భాస్కర్ . తన పరిస్థితిని అర్ధం చేసుకొని ముందుకు వచ్చిన భాస్కర్ నీ అరుణ కులాంతర వివాహం చేసుకుంటుంది. సంఘం వీరిని వ్రేలెత్తి చూపి వర్ణసంకరులని దూషిస్తున్న అవేమీ లెక్కచేయరు. ఎంతో సంతోషంగా, దాంపత్య జీవితాన్ని ప్రారంభిస్తారు. కొన్ని సంవత్సరాల తర్వాత చెప్పుడు మాటలు విన్న అరుణ తను అగ్రకులస్థురాలని, భాస్కర్ బంధువులను చులకనగాచూస్తూ అసహ్యించుకుంటుంది. ఈ విషయంలో భాస్కర్ తో అభిప్రాయ భేదాలు వచ్చి విడిపోతారు.కులాంతర వివాహం చేసుకున్న వీరిద్దరి ఫెయిల్ అయ్యారు ఈ నవలలో.

**3.విద్య- ఉద్యోగం:**

వివాహానంతరం అరుణను భాస్కర్ చదివిస్తాడు. ఆమెకు టైపు, షార్ట్ హ్యాండ్ నేర్పిస్తాడు. డిగ్రీ చదివిస్తాడు. భాస్కర్ కి తెలిసిన వారి ద్వారా ఉద్యోగంలో చేర్పిస్తాడు.

భాస్కర్ చదువుకున్నవాడు, సంస్కారవంతుడు,ఆదర్శ ప్రాయుడని ఈ నవల ద్వారా తెలుస్తుంది. స్త్రీలకు ఆర్థికస్థోమత ఉండాలని వాళ్ళ కాళ్ళ మీద నిలబడాలని స్త్రీ కి విద్య, ఉద్యోగం అవసరమని తెలియజేశారు రచయిత్రి.

**4.మతాంతర వివాహం:**

అరుణ పిన్ని కూతురు అమల. ఆమె తన ఆఫీస్ లో బాస్ గా పనిచేస్తున్న జేమ్స్ ని ప్రేమిస్తుంది. అతడు క్రిష్టియన్. అమల బ్రాహ్మణ స్త్రీ. వీరిద్దరూ వివాహం చేసుకుంటామని అరుణతో చెబుతారు. అప్పటికే అరుణ భాస్కర్ తో విడాకులు తీసుకొని తన జీవితం నాశనం చేసుకుంది. ఇద్దరి మధ్య కుల అంతరాలు వచ్చి బేదాభిప్రాయాలు కలిగాయి. తన చెల్లెలు కూడా మతాంతర వివాహం చేసుకోవడం అరుణకు ఇష్టం ఉండదు.

వారు వివాహం చేసుకుంటామని చెప్పగానే

" ఏవో ఆదర్శాలు పాటిస్తున్నాం, ముందడుగులు వేస్తున్నాం అంటూ వర్ణాంతర వివాహాలు చేసుకోగానే సరిపోదు, వాటి ఫలితాలు జీవితమంతా అనుభవించాల్సి ఉంటుంది''అని అరుణ అంటుంది.

అమల, జేమ్స్ మతాంతర వివాహం చేసుకొని ఆదర్శప్రాయం గా నిలుస్తారు.అమల, జేమ్స్ కుటుంబ సభ్యులలో ఒకరిగా ఉంటూ వారి ఆచారాలను పాటిస్తుంది. వారి వంటలను వండుతుంది. జేమ్స్ కుటుంబ

సభ్యులు కూడా అమల ఆచారాలను గౌరవిస్తారు. ఆమె పూజలు, వ్రతాలు చేస్తూ ఉంటే ఆమెకు సహాయం చేసుకుంటూ ఆనందగా జీవిస్తారు.

**ముగింపు:**

అరుణ లో కలిగిన కుల ఆధిక్య భావన వలన తన జీవితాన్ని చెప్పుడు మాటలు విని నాశనం చేసుకుంది. బలిపీఠం బారి నుండి తనను రక్షించిన భాస్కర్ జీవితాన్నికూడా నాశనం చేసింది. అతని నుండి విడిపోతుంది. అమల, జేమ్స్ ల అన్యోన్య దాంపత్యం చూసి తను ఏం కోల్పోయిందో తెలుసుకొని పశ్చాత్తాపం పొందేలోగా ఆమె ఆరోగ్యం క్షీణించింది.

వర్ణాంతర వివాహం చేసుకున్న భాస్కర్, అరుణల జీవితంలో ఎదురైన సమస్యలను అవగాహన రాహిత్యంతో ఎదురించలేకపోయింది. చెప్పుడు మాటలకు విలువనిచ్చి కుల అహంకారాన్ని చాటుకుంది. భాస్కర్ కు దూరమైంది.

మతాంతర వివాహం చేసుకున్న అమల, జేమ్స్ అన్యోన్య దాంపత్యం,

- కుటుంబ సభ్యుల మధ్య అవగాహన, ఒకరికొకరు సహాయం చేసుకోవడం,పరిస్థితులకు అనుకూలంగా అమల మారిపోవడం మొదలైన అంశాలను రచయిత్రి చక్కగా వివరించారు.

- కులాంతర వివాహంలో – అరుణ, భాస్కర్ – భాస్కర్ కుటుంబ సభ్యులు-నిరక్షరాస్యులు
- మతాంతర వివాహంలో – అమల, జేమ్స్ – జేమ్స్ కుటుంబసభ్యులు -అక్షరాస్యులు

ఈ వ్యత్యాసం వలన ఒకరికొకరు అర్థం చేసుకోకపోవడం వలన అరుణ,భాస్కర్ ల మధ్య అభిప్రాయ భేదాలు వచ్చి విడిపోయారు.

కులాంతర వివాహాలన్నీ ఫెయిల్ అవుతాయా అనే ఆలోచన రాకుండా మతాంతర వివాహం సక్సెస్ ను నవలలో చక్కగా చిత్రీకరించారు కులాల కలయికను నిరసించటంకాని, ముందడుగులు వేసేవారిని నిరుత్సాహపరచటం ఈ నవల ఉద్దేశం కాదు. బలిపీఠం నవలలో ఉన్న అరుణ, భాస్కర్ వంటి వ్యక్తులు జీవితంలో కొంతమందైనా తటస్థపడుతూ ఉంటారు. సంకుచిత భావాలకు ప్రతీక అరుణ అయితే నిస్వార్థ పరుడిగా భాస్కర్ ని నిరూపించారు. రచయిత్రి. భాస్కర్ తన జీవితాన్ని పూర్తిగా కరుణ సమాజానికి అంకితం చేసిన మహానుభావుడు-

బలిపీఠం రచనా కాలంలో సమాజంలో ఉన్న సాంఘిక దురాచారాలు,అంటరానితనం, మూఢ విశ్వాసాలు, మూర్ఖపు భావాలు మొదలైన అంశాలు ప్రజలను పట్టి పీడిస్తున్న, భాదిస్తున్న అంశాలను తీసుకొని, అలాంటి బలిపీఠాల నుండి కొందరినైనా రక్షించాలనే ఉద్దేశ్యంతో రాసిన రచయిత్రి ఆశయాన్ని గౌరవిద్దాం.సమాజంలోని ప్రజలు మారాలనే ఆశిద్దాం.

**ఆధార గ్రంథాలు**


- తెలుగు నవల నూరు సంవత్సరాలు-ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి – 1973 (వ్యాస సంకలనం)
- నవలా శిల్పం-వల్లంపాటి వెంకట సుబ్బయ్య – విశాలాంధ్ర పబ్లికేషన్(1989)
- బలిపీఠంనవల - రంగనాయకమ్మ-విశాలాంధ్ర పబ్లికేషన్


******

# 46. అనువాదాలు - సామాజిక స్పృహ

# జయకాంతన్ - కొన్ని సమయాలలో కొందరు మనుషులు

**శ్రీమతి గాండ్ల విజయకుమారి,**

జూనియర్ లెక్చరర్, తెలుగు,

ప్రభుత్వ బాలుర జూనియర్ కళాశాల,

అనంతపురము - 515001, ఆంధ్రప్రదేశ్,

చరవాణి: 9440458942

వేగు చిరునామా:

vijayakumari.gandla@gmail.com

**కీలక పదాలు:**

అనువాదం నిర్వచనం - రచయిత పరిచయం - అనువాదాలు - రకాలు - ఆధునిక సాహిత్యంలో అనువాదాలు అనువాద కథా పరిచయం - కథలో సామాజిక స్పృహ స్త్రీ సమస్యల - పరిష్కారం - ముగింపు.

**ఉపోద్ఘాతం:**

"అనువాదం" అంటే సంస్కృత భాషలో "పునః కథనం" అని అర్థం. ఒకరు ఒక భాషలో చెప్పిన దానిని మరొకరు మరో భాషలో చెప్పడాన్ని "అనువాదం" అంటారు. ఏ ఒక వ్యక్తి అన్ని భాషలలో పాండిత్యాన్ని సంపాదించలేడు. తులనాత్మక సాహిత్యాలు అందుబాటులోకి రావాలంటే దానికి సులభమైన మార్గం అనువాదం. అనువాదాల వల్ల ప్రపంచ భాషా సాహిత్యాలన్నీ సన్నిహితమవుతాయి. తెలుగు సాహిత్యానికి గాని, మరే భాషకైనా గాని అంతర్జాతీయతను కల్పించే సాధనం అనువాదం. ఇతర భాషా గ్రంథాలను తమ తమ భాషలలోకి, తమ భాషలలోని ఉత్తమ గ్రంథాలను ఇతర భాషలలోకి తీసుకొని వెళ్ళాలి - తద్వారా ఆయా భాషల ప్రతిష్ట కూడా పెరుగుతుంది.

**రచయిత పరిచయం:**

జయకాంతన్ పూర్తి పేరు దండపాణి జయకాంతన్. ప్రఖ్యాత తమిళ రచయిత. ఆధునిక తమిళ నవలా రచయితలలో ప్రముఖుడు. ఇతడు రాసిన కథానికలు, నవలలు, తీసిన సినిమాలు వీటన్నింటిలో ఎక్కువభాగం సామాజిక స్మృహ కలిగినవి. పాఠకులను ఆలోచింపజేసే సంఘటనలు ఎక్కువగా ఉంటాయి. ఈయన తమిళంలో రానిన "శిలనేరంగళ్ శిలమణితర్గళ్" నవల తెలుగులో "కొన్ని సమయాలలో కొందరు మనుషులు" పేరుతో అనువదించబడింది. జయకాంతన్ ఈ నవలకు కేంద్ర సాహిత్య అకాడమి అవార్డును వరించింది. చలన చిత్రంగా తీస్తే జాతీయ పురస్కారం లభించింది.

**ప్రాచీన సాహిత్యంలో అనువాదాలు:**

తెలుగుసాహిత్యం అనువాదాలతోనే ప్రారంభమైందని చెప్పవచ్చు. కవిత్రయ మహాభారతం వ్యాసభారతానికి అనువాద గ్రంథమని అప్పటి నుండి మొదలైన తెలుగు అనువాదం నేటివరకు కొనసాగుతూ అభివృద్ధి చెందుతున్నది. కవిత్రయ యుగం నాటికి అనువాద నిర్వచనాలుగాని, సిద్ధాంతాలుగాని వెలువడలేదు. అందువల్లనే పూర్వకవుల అనువాదాలలో స్వాతంత్య్రం కనిపిస్తుంది.

'నన్నెచోడుడు', 'కుమార సంభవం' తర్వాత 'గోనబుద్ధారెడ్డి' 'రంగనాథ రామాయణం' వీరు సంస్కృతం నుండి తెలుగులోకి అనువాదం చేశారు.

**అనువాదాలు - రకాలు:**

అనువాద పద్ధతులు రెండు రకాలు –

1) కథానువాద పద్ధతి,

2) స్వతంత్రానువాద పద్ధతి

- కథానువాదపద్ధతి: మూలంలో గల కథను యథాతథంగా ఇతర భాషలోనికి అనువదించడం 'కథానువాద పద్ధతి'.

  ఉదా: నన్నెచోడుడు - కుమార సంభవంగా చెప్పవచ్చు.

- స్వతంత్రానువాదపద్ధతి: మూలకథతో పాటు వివిధ పాత్రల్ని సన్నివేశాలను గ్రహించి రచయిత తనకు నచ్చిన విధంగా అనువాదం చేయడం 'స్వతంత్రానువాద పద్ధతి' ఉదా: కవిత్రయం మహాభారతం.

  నన్నయ యథామూలానువాదం చేయలేదు. శ్లోకానికి పద్యం అనే పద్ధతి పాటించలేదు. "భారతబద్ధ నిరూపితార్థం తెలువారికి అందించడమే నా లక్ష్యం" అన్నాడు. దానికి తగినట్టు పద్దెనిమిది పర్వాలకు పణాలిక రచించి తన స్వేఛ్ఛానువాదాన్ని ప్రారంభించాడు. తిక్కన, ఎఱ్ఱనలు అదేమార్గంలో, అదే లక్ష్యంతో దాన్ని పూర్తిచేశారు. అప్పటినుండి ప్రాచీన తెలుగు కవులు అందిరికీ అదే ఒరవడి అయింది.

**ఆధునిక సాహిత్యంలో అనువాదాలు:**

ప్రాచీన కాలంలో వచ్చిన అనువాదాలన్నీ సాహిత్యపరమైనవి. కాని, ఆధునిక కాలంలో సాహిత్యపరమైన అనువాదాలతో పాటు సాహిత్యేతర అనువాదాలు కూడా వచ్చాయి. అవి శాస్త్రానువాదాలు, గణితానువాదాలు, రాజకీయానువాదాలు, సాంకేతికానువాదాలు, సాంఘిక, మనస్తత్వ వైద్య శాస్త్రానువాదాలు మొదలైనవి. ప్రాచీనకాలంలో వచ్చిన అనువాదాలకు మూలం సంస్కృత గ్రంథాలు. ఆధునికకాలం లో వచ్చిన తెలుగు అనువాదాలకు మూలం, ఆంగ్ల గ్రంథాలు. ప్రాచీన కవులు సంస్కృత పదాలను యథాతథంగా వినియోగించినట్లే ఆధునిక కవులు ఆంగ్ల పదాలను యథాతథంగా వాడుతున్నారు. అంతేకాకుండా తమిళ, మలయాల, కన్నడ్ర, హిందీ, బెంగాలీ మొదలైన భాషల గ్రంథాలు కూడా అనువాదం చేయబడుతున్నాయి.

ఆధునిక యుగంలో చిన్నయసూరి ఆంధ్రశబ్దచింతామణి వ్యాకరణ సూత్రాలను, నీతిచంద్రికలను అనువాదం చేశారు. ఆధునిక యుగ ప్రారంభంలోనే వస్తుపరంగా కూడా స్వతంత్రరచనలు ప్రారంభమయ్యాయి. ప్రాంతీయ చరిత్రలు, ఇతిహాసాలు, సామాజిక సంఘటనలు కావ్యవస్తువులయ్యాయి. ఇవి మొదట లఘువాక్యాలుగా మొదలై మహాకావ్యాలకు విస్తరించాయి. ఇదే సమయంలో యధామూలనువాదాలు మొదలయ్యాయి. ఇరవయ్యవ శతాబ్దంలో ఆంగ్ల సాహిత్య ప్రభావం వల్ల అనేక అనువాద గ్రంథాలు వెలువడినవి. నవల, కథానిక, స్వీయచరిత్ర విమర్శ మొదలైన సాహిత్య ప్రక్రియలు ఆంగ్లభాషా ప్రభావం వల్ల తెలుగులో తమ సౌరభాలను వెదజల్లుతున్నాయి. ఆంగ్లం నుండి తెలుగులోకే గాక తెలుగు నుండి ఆంగ్లభాషలోకి అనువాదాలు జరిగాయి. కళాపూర్ణోదయం, క్షేత్రయ్య పదాలు, అన్నమాచార్య కీర్తనలు, శ్రీకాళహస్తీశ్వర శతకం మొదలైనవి. వంగ, హిందీ, రవ్యన్, తమిళ భాషలలోకి కూడా అనువాదం జరిగాయి.

**కథా పరిచయం:**

అనువాద నవల తమిళంలో జయకాంతన్ రచించిన "శిలనేరంగళ్ శిలమణితర్గళ్" తెలుగులో "కొన్ని సమయాలలో కొందరు మనుషులు" పేరుతో అనువదించారు. 1970 దశకంలో రాయబడింది. ఇందులో స్త్రీకి ఏదైనా జరగరాని సంఘటన జరిగితే సమాజం

మొత్తం ఎలా వేలెత్తి చూపుతుందో రచయిత చక్కగా ఆవిష్కరించారు. మరియు ఆ సమస్యకు పరిష్కారం కూడా అందులోనే చూపించారు. కథావిషయానికి వస్తే "గంగ" అనే అమ్మాయికి తెలిసీ తెలియని వయసులో అత్యాచారం అనలేని సంఘటన జరుగుతుంది. ఆ విషయం ఏడుస్తూ వెళ్ళి తల్లితో చెబితే ఆ పిల్లని గొడ్డును బాదినట్టు బాది ఆ విషయం నలుగురికి తెలిసేలా చేస్తుంది. గంగ అన్న ఆ విషయం విని చెడిపోయిన పిల్ల ఇంట్లో వుండకూడదని జ్వరంతో ఒళ్ళు తెలియని పిల్లను బయటికి గెంటి తలుపేసుకున్నాడు. ఆ పిల్ల కావాలంటే తల్లిని వెళ్ళిపొమ్మన్నాడు. పిల్లకోసం తల్లి బయటకు వచ్చింది. గంగ మామ అయిన వెంకట్రామయ్య పెద్ద పేరు మోసిన క్రిమినల్ లాయరు తన ఊరికి తీసుకెళ్ళి అమ్మాయిని హాస్టల్‌లో వుంచి చదివించాడు. అమ్మాయి బాగా చదువుకుంది. జిల్లాకంతా ఫస్టువచ్చింది. కళాశాలలో పిలిచి సీటు ఇచ్చారు. ప్రభుత్వ ఉద్యోగాన్ని సాధించింది.

సొంత మామ ఆ గంగను సెళ్ళికి పనికిరావని శారీరకంగా, మానసికంగా ఎంత ఇబ్బంది పెట్టినా తనను చదివించాడన్న కృతజ్ఞతతో అవన్నీ భరించింది. అన్న దారిన పోయే వారందరితో సంబంధం అంటగట్టినా ఏమి మాట్లాడలేదు. మామయ్య చేతనయితే అత్యాచారం చేసిన వాడిని వెతికి పట్టుకోమను అన్నమాటకు పన్నెండు సంవత్సరాల తర్వాత అతన్ని వెతికి పట్టుకుంది. అతని పేరు ప్రభాకర్. ప్రభుగా చలామణి అవుతున్నాడు. సంఘంలో పేరు ప్రతిష్టలున్నవాడు, జల్సా రాయుడు, తాగుబోతు, తిరుగుబోతు గంగ పేరు వినగానే గుర్తు లేదన్నాడు. అతనికి పెళ్లయింది ముగ్గురు పిల్లలున్నారు. క్రమంగా ఇద్దరికీ స్నేహం ఏర్పడింది. కూతురు మంజు కాలేజిలో చదువుతోంది. గంగ ఆఫీస్ అవ్వగానే నేరుగా ప్రభు ఇంటికి వెళ్తుంది. అక్కడ నుండి ఇంటికి ఆలస్యంగా వెళుతుంది. ప్రభు కారులో డ్రాప్ చేస్తాడు. తల్లి గమనించి గంగను నిలదీస్తుంది. అతనితోనే ఉంటానని గంగ చెబుతుంది. తల్లి గొడవ పడి కొడుకు దగ్గరకు వెళ్తుంది. మామ వెంకట్రామయ్య గంగ చేసేది తప్పు అని చెబుతాడు. గంగ తనకు అతను తప్ప వేరే ఎవరు తనకు అక్కర్లేదు అంటుంది. గంగ సాన్నిహిత్యం తో ప్రభు మంచిగా మారాడు. గంగ కు మంచి సంబంధం వచ్చింది పెళ్లి చేయాలను కుంటే గంగ ఒప్పు కోవడం లేదని గంగ అన్న గణేశన్ ప్రభును కలిసి చెప్పాడు. ప్రభు గంగతో తన వల్ల ఆమెకు కలిగిన నష్టం చాలు పెళ్ళి చేసుకో అని చెప్పాడు. గంగ ఒప్పుకోలేదు. ప్రభు పెళ్ళి చేసుకుంటేనే కలుస్తాను లేదంటే దురమౌతాను అన్నాడు. గంగ ప్రభుని విడచి ఉండలేక వ్యసనాల పాలైంది.

అంటే సమాజంలో ఎవరి వల్ల తప్పు జరిగినా స్త్రీనే బాధ్యురాలిని చేస్తారన్న విషయాన్ని రచయిత చెప్పాడు. అదేవిధంగా ఈ కథలో సంఘటనను ఇంకో విధంగా చూపిస్తే సమస్య వుండదని అందులోనే చూపించారు రచయిత.

ఆ నవలలో దినపత్రికలో కథారూపంలో సమస్యకు పరిష్కారమిచ్చాడు. ఆ సంఘటన జరిగిన తర్వాత ఆ పిల్ల ఏడ్చుకుంటూ వెళ్ళగా తల్లి గొడ్డును బాదినట్టు బాదుతూ వుండగా ఏమి జరిగిందని ఇరుగుపొరుగు వారు అడుగగా "ఏమి లేదు వర్షంలో తడనివచ్చింది, రేపు జబ్బు చేస్తే ఎవరు చాకిరి చేస్తారు? ఒళ్ళు మండి కొట్టాను" అంటూ తెలివిగా సమాధానం చెప్పింది. ఆ పిల్లను తిట్టికొట్టి, ఏడిపించి తాను ఏడ్చి చివరికి ఆ పిల్లని దొడ్లోకి తీసుకెళ్ళి నెత్తిన నాలుగు చెంబులు నీళ్ళు గుమ్మరించి చెయ్యిపుచ్చుకొని యింట్లోకి తీసుకొచ్చి ఆ పిల్లకి బుద్ధి చెప్పింది. "ఎప్పుడూ ఇలాంటి పాడుపని చెయ్యవద్దని" హెచ్చరించింది. ఇది ఎవరికి చెప్పకమ్మా ఇది బయటికి తెలిసిందంటే ఒక కుటుంబం నేలకూలిపోతుంది. మన ఇంట్లో ఒక ఆడపిల్ల వుంది దానికి ఇలాంటి అన్యాయం జరిగితే ఏం చేస్తాం? అని ఎవరు ఆలోచించరు. లోకులు కాకులు ఈ మచ్చ నీ జీవితానికే కాదు మన కుటుంబానికి మన వంశానికంతా పాకుతుంది. ఇది ఇక్కడితో మర్చిపో ఇలాంటిది నీకు సంభవించలేదని అనుకుందాం" అని తల్లి పిల్లకు చెప్పింది. అమ్మాయి జీవితం అల్లరిపాలు కాకుండా చేసింది. ఈ విధంగా రచయిత సమస్యకు పరిష్కారం కూడా ఇందులో చూపించడం జరిగింది. అలా జరిగిన విషయం నలుగురికి చెబితే ఒకలా, చెప్పకపోతే మరోలా స్త్రీ జీవితం వుంటుందని చక్కగా తెలియజేశాడు.

**ముగింపు:**

అనువాద రచనల వల్ల ఆయా భాషల ప్రతిష్ట కూడా పెరుగుతుంది. వివిధ భాషల మధ్య గల భేదభావాలు తగ్గే అవకాశం ఉంది. ఏదేశంలోనైనా మానవ సంబంధాలన్నీ ఒకటిగానే ఉంటాయని అనువాదం వల్ల గ్రహించవచ్చు. ఒకేభాషలో పాండిత్యం గల వారు అనువాద గ్రంథాల ఆధారంగా తులనాత్మక అధ్యయనం ప్రారంభించడానికి వీలవుతుంది.
అదేవిధంగా మాతృభాషలో చదివితే వచ్చే అనుభూతిని అనువాదంలో అనువాదకుడు కల్గించాలి. అను వాదం ఒక యజ్ఞం లాంటిది. మూలరచనలోని సౌందర్యానికి, సున్నితత్వానికి హాని కలుగకుండా చేయాలి. అనువాదకుడు ఆయా భాషల భాషా సంప్రదాయాల్ని జీవన విధానాన్ని, అచార వ్యవహారాలను తెలుసుకోవాలి. మూల విధేయంగా, సౌందర్యం చెడకుండా అనువదించాలి. అపుడే అనువాద రచనలను పాఠకుడు ఆస్వాదించగలడు.

**మూలగ్రంథాలు:**


- రామబ్రహ్మం, చేతవోలు రామబ్రహ్మం అనువాదాలు, అరసున్నాలేనా?
- నన్నయ వికీపీడియా
- డా,, జి. లక్ష్మీనారాయణ, తెలుగువాణి
- దాక్షిణ్యాత్య సాహిత్య సమీక్ష ఆచార్య జి. నాగయ్య


*******

# 47. అర్నాద్ సాహిత్యము - సామాజిక స్పృహ

**డాక్టర్ పప్పల వెంకటరమణ**

ఎం. ఎ., పి హెచ్. డి.,(గోల్డ్ మెడల్)

తెలుగు విభాగాధిపతి

ప్రభుత్వ డిగ్రీ కళాశాల (పురుషులు)

శ్రీకాకుళం.

చరవాణి: 9491811710

ఈమెయిల్: ramanapappala1@gmail.com

అర్నాద్ 1946 జులై ఒకటో తేదీన విశాఖపట్నం నందు జన్మించారు. ఇతని అసలు పేరు దుంప హరనాథ రెడ్డి. 'అర్నాద్' కలం పేరుతో నాలుగు నవలలు, అరవైకి పైగా కథలు రాసి తెలుగు సాహిత్య చరిత్రలో సుస్థిర స్థానము సంపాదించుకొనెను. బి.హెచ్.పి.వి. ప్రభుత్వరంగ సంస్థలో డిప్యూటీ మేనేజర్ గా ఉద్యోగం చేసి పదవి విరమణ చేసెను. ఈనాటికి తన రచనా వ్యాసంగము ఆపలేదు.

అర్నాద్ గారికి ప్రత్యేకంగా ఆశలు- ఆశయాలు అంటూ ఏమీ లేవు, సమాజంలో జరుగుతున్న అన్యాయాలు, అక్రమాలు, స్త్రీలు పడుతున్న బాధలు, పరిశ్రమలలో కార్మికులకు జరుగుతున్న అన్యాయాలు మొదలైన సాంఘిక సమస్యలను తన రచనల ద్వారా వెలుగులోకి తెచ్చి సామాజిక స్పృహను కలిగించారు. వీరి రచనల్లో సామ్యవాద సమాజ స్థాపన ఆశయాలున్నాయని పాఠకులకు తెలుస్తుంది. తన కథల్లో గాని, నవలల్లో గాని ప్రధాన పాత్రలన్నీ బడుగు, బలహీన వర్గాల చుట్టూనే తిరుగుతుంటాయి. సమాజంలోని కుళ్ళును బయటకు తీయడమే వీరి ఆశయం. తన రచనల్లో చారిత్రక సత్యాన్ని, వాస్తవ దృక్పథాన్ని దాచుటకు అంగీకరించదు. పాలనావ్యవస్థ మీద, యంత్రాంగం మీద, సమాజం మీద చురుక్కుమనిపించే చురకలు వేసి సమాజ మార్పును కోరడమే ఇతని ఆశయం. సమాజానికి ఒక సంస్కృతి, సంప్రదాయం, ఆచార వ్యవహారాలు, పరిణామ లక్షణాలు, సామాజిక, ఆర్థిక, రాజకీయ, దృక్పదాలు, ఉంటాయి. అనుభవం నుంచి అధ్యయనం నుంచి తను నమ్మిన జీవిత సత్యాన్ని నిజాయితీగా సజీవ పాత్రలతో చిత్తశుద్ధితో చిత్రీకరిస్తూ, చదువరులను ఆలోచింపజేసే ఆరోగ్యకర రచనలు చేయడమే రచయితగా ఆర్నాద్ యొక్క ఆశయం. గొప్ప కథారచయిత రాచకొండ విశ్వనాథ శాస్త్రి మరియు కాళీపట్నం రామారావుల ప్రభావం ఇతని ఎక్కువగా పడినది.

**అర్నాద్ గారి నవలలు - సామాజిక స్పృహ:**

**"చీకటోళ్లు"** నవల అర్నాద్ గారి కలం నుండి జాలువారిన మొదటి ఆణిముత్యం. ఏ దృష్టితో చూచినా ఈ నవల నిస్సందేహంగా పేదల నవలే. ఈనవలను 'వాడనిమల్లి' సినిమాగా నిర్మించారు. చీకటోళ్లు అంతర్జాతీయంగా రష్యన్ ఫిలిం ఫెస్టివల్ కు ఎంపికై అర్నాద్ గారికి విశేష ఖ్యాతిని తెచ్చి పెట్టింది.

నవల మొత్తము చరిత్రహీనుల దీన హీన జీవితం. ఆడవాళ్ళ ఎక్స్ప్లోయిటేషన్ కథా వస్తువు. ఈ నవల్లో ఆదెమ్మ ప్రధాన పాత్ర. అప్పన్న కాజువల్ లేబర్. అతని ముసలి తల్లి, భార్య, ముగ్గురు కూతుర్లు తమది కాని మురికివాడ స్థలంలో తమదైన గుడిసె వేసుకుని ఉంటున్నారు. ఆ మురికివాడ స్థలాల యజమాని బంగారు రాజు. ఇతనికి బోలెడు ఇళ్ల స్థలాలు, వడ్డీ వ్యాపారాలు ఉన్నాయి. ఇతడు మోటారు బైక్ మీద వస్తుంటే యముడు దున్నపోతు మీద వస్తున్నట్లుగా ఉంటుంది. ఇతని చూపులు యమపాశం వంటివి. వయసులో ఉన్న వారిని ఆకర్షించడానికి, వారిని వలలో వేసుకొని తన కోరికలు తీర్చుకోవడానికి ఎన్నెన్నో ప్రలోభాలు పెట్టి కొందరిని దారికి తెచ్చుకుంటాడు. నవల చివరలో ఎర్రమ్మ ఆశతోను, ఆదెమ్మ అవసరంతోనూ బంగార్రాజు పాశంలో బందించబడ్డారు. ఇలాంటి

బంగారు రాజులు మన సమాజంలో మన ముందు నిత్యము తారసిల్లుతుంటారు. ఈనాటి సమాజంలో చీటీలు, ఫైనాన్స్ పేరు చెప్పుకొని వడ్డీ వ్యాపారులుగా మారి ఇలాంటి అసాంఘిక, అక్రమపనులు చేసే బంగారు్రాజులు మన మధ్యలో నిత్యం కనిపిస్తూనే ఉంటారు.

సమాజంలో వ్యక్తుల విచ్చలవిడి శృంగారం వల్ల లైంగిక వ్యాధులు వచ్చి శరీరం రోగాల బారిన పడుతుంది. సిఫిలిస్, గనేరియా, ఎయిడ్స్ వంటి వ్యాధుల బారినపడి ఎందరో బలైపోతున్నారు. చీకటోళ్లు నవలలో మంగమొగుడు సింహాద్రి ఇలాంటి జబ్బుతో ఎన్నాళ్లు బాధపడ్డాడు. భర్త వల్ల మంగకు కూడా ఆ జబ్బు అంటుకొని నానాయాతనలు పడి చివరకు తగ్గించుకుంటుంది. ఇలాంటి వ్యాధిగ్రస్తులను చూసి సమాజం అసహ్యించుకుంటుంది. అర్నాద్ గారు ఇలాంటి విషయాలు తెలియజేసి సమాజంలో ఒక స్పృహను కలిగించారు. మంగకు వచ్చిన ఈ జబ్బు వల్ల చెల్లెల ఆదెమ్మ ఎంతో బాధపడి సపర్యలు చేసింది. ఏ పాపం ఎరుగని అక్కకు మాయదారి జబ్బు తన బావ వల్ల వచ్చిందని కృంగిపోయింది. అక్కకు సపర్యలు చేసి అక్కాచెల్లెళ్ల అనుబంధానికి ఆదెమ్మ విలువ పెంచింది.

కుటుంబ పరిస్థితులు ఎంతటి వారిచేతైనా ఎలాంటి పనులైనా చేయిస్తుందని అర్నాద్ గారి చీకటోళ్లు నవల తెలియజేస్తుంది. ఈ నవలలో రచయిత సామాజిక స్పృహను కలిగించడంలో సఫలీకృతులయ్యారు.

**"ఈ తరం స్త్రీ"** అర్నాద్ గారి రెండవ నవల. ఇది అతని నవలల్లో అత్యుత్తమైనదని చెప్పొచ్చు. ఈ నవలలో ఆయన తన గొంతులోని గోడు వినిపించారు. ఈ నవల ఆయన రాసేనాటికి ఉద్యోగస్తురాలైన స్త్రీల సంఖ్య గణనీయంగా పెరిగింది. అప్పటికే ఉద్యోగినుల పడే ఇబ్బందుల గూర్చి కథలు వస్తున్నాయి. పనిమనిషి ఆలస్యంగా రావటం, బస్సులో చోటు దొరకకపోవటం, మేనేజర్ ఆమెను తిట్టడం లాంటి ఇతివృత్తంతో ఆ రోజుల్లో పనిమనిషి కూడా ఉద్యోగస్తురాలే అన్న స్పృహ రచయితలు చూపించేవారు కాదు. కానీ అర్నాద్ గారు అలాంటివి ఈ నవలలో చూపించి పనిమనిషికి సముచిత స్థానాన్ని కల్పించారు.

అర్నాద్ గారి సామాజిక స్పృహ ఈ నవలలో పుష్కలంగా కనిపిస్తుంది. ఆధునిక యుగంలో చదువుకున్న స్త్రీల మనస్తత్వాన్ని వాస్తవానికి దగ్గరగా తెలియజేసి విజయం పొందారు. ఈ నవలను తన రచనగా కాకుండా స్త్రీ రచయిత్రి పేరుతో నవల రాశారు. "ఉద్యోగినులకు సంసార సుఖం తక్కువ అవటాన్ని" కథగా తీసుకొని నవల రాసి ప్రసిద్ధి చెందారు. స్త్రీలు ఉద్యోగులు అయితే వివాహ వ్యవస్థ విచ్ఛిన్నమవుతుందని తన అభిప్రాయాన్ని తెలియజేసారు. నేడు మన భారతీయ సమాజంలో ఉద్యోగం చేసే స్త్రీల బాధలు వర్ణనాతీతం. ఆర్థికంగా బాగా ఉన్నప్పటికీ మానసికంగా ఎంతో కృంగిపోయే అభాగినులు కోకొల్లలు. పిల్లల పెంపకం విషయంలో శ్రద్ధ వహించలేకపోవడం, సమాజం నానా రకాల సూటి పోటీ మాటలు, లైంగిక వేధింపులు, భర్తలు అనుమానపు జాడ్యాలు మనం నిత్యం చూస్తున్నవే. అర్నాద్ గారు ఈ విషయాలన్నింటిని ఈ తరం స్త్రీ నవలలో కూలంకుషంగా వివరించి సమాజంలో పరివర్తన తీసుకొచ్చారు.

నేడు స్త్రీలపై కుటుంబ హింసకు తోడు సామాజిక హింస కూడా పెరిగింది. నేటి పెట్టుబడిదారీ వ్యవస్థలో లాభార్జనే ధ్యేయంగా, కుటుంబ సామాజిక హింస ఎలా ఉంటుందో ఈ నవలలో రచయిత తెలిపారు. ఈనాడు నగరికరణ అభివృద్ధి వల్ల మధ్యతరగతి స్త్రీ ఏదో ఒక ఉద్యోగం చేయాల్సిన స్థితి దాపురించింది. కుటుంబ ఖర్చులు పెరిగి జీవనయానం చేయడానికి స్త్రీలు చదువుకుని ఉద్యోగాలు చేయాల్సి వస్తుంది. కొన్ని కఠినమైన ఉద్యోగాలు కూడా స్త్రీలు చేయాల్సి వస్తుంది. నేడు సైన్యములో కూడా స్త్రీలు విధులు నిర్వహిస్తున్నారు. ఇలాంటి పరిస్థితుల్లో సున్నిత మనస్తత్వం గల స్త్రీలు నలిగిపోతున్నారు.

అక్రమ సంబంధాలు మనుషుల్ని ఎంతగా దిగజారుస్తాయో ఈ నవలలో స్పష్టంగా చెప్పారు. ఈ తరం స్త్రీ నవల్లో ఛాయ అందగత్తె. తన అందచందాన్ని చూపించి ఇతరులని ఆకర్షించేది. సంపాదన మీద ఆశతో సెక్స్ ను ఎరగా చూపి పురుషులని లోబరుచుకునేది. భర్తలకు ఈ విషయం తెలిసినప్పటికీ పెద్ద కుటుంబాల్లో ఇలాంటివి సాధారణమేనని సర్దుకుపోయేవారు. నేటి సమాజంలో ఇలాంటి

సన్నివేశాలు మనకు నిత్యం దర్శనమిస్తుంటాయి. సమాజం ఎంతగా దిగజారిపోతుందో తెలుసుకోవడానికి నిదర్శనం వేరే అక్కర్లేదు. ఇలాంటి విషయాలను చెప్పి అర్నాద్ గారు సామాజిక స్పృహను కలుగజేశారు.

అర్నాద్ గారి మరో నవల **"సాంఘికం"** ఈ నవలలో పత్రికా సామ్రాజ్యంలోని ఆధిపత్యం గూర్చి, వాటి ఎగుడు దిగుడుల గూర్చి వివరంగా తెలియజేశారు. పతనమవుతున్న పత్రికల నైతిక విలువలు గూర్చి ఇందులో వివరించారు.

నేటి సమాజంలోని పత్రికలు సమాజాభివృద్ధికి కృషి చేయడం లేదు సరికదా సంఘపతనానికి దారితీస్తున్నవి. ప్రచురించకూడని కథనాలు, చూపించకూడని చిత్రాలు చూపించి సమాజాన్ని కలుషితం చేసి నేర ప్రవృత్తిని ప్రేరేపిస్తున్నవి. చింతామణి, భారతి, సత్యదూత వంటి పత్రికలు సాహిత్యాభివృద్ధినే కాకుండా మానవ విలువలని పెంచి పోషించేవి. నేటి పత్రికలు వ్యాపారధోరణితో కూడుకొని వర్గ వైషమ్యాలను పెంచి, సమాజం విచ్ఛిన్నతకు కారణభూతాలవుతున్నాయి. సినీవార పత్రికలు అయితే స్త్రీల అంగాంగ ప్రదర్శనలు ప్రచురించి యువతను పెడత్రోవ పట్టిస్తున్నాయి. అర్నాద్ గారు ఈ నవల ద్వారా సామాజిక స్పృహను పెంపొందించడానికి తనదైన రీతిలో ప్రయత్నించారు. సమాజం మేలు కోసం పత్రికలు పాటుపడాలని, యువతకు మార్గదర్శకత్వం వహించి ముందుకు నడిపే కథనాలు రాయాలని కోరుకున్నారు. నిరుద్యోగ యువతకు దారి చూపే కథనాలు ప్రచురించాలని సాంఘికం నవల ద్వారా రచయిత తెలియజేశారు.

నేడు పాఠకులు కూడా తమ అభిప్రాయాన్ని మార్చుకొని విలువలు బోధించే రచనల పట్ల ఆసక్తి తగ్గి, నేరపూరితమైన కుట్రపూరితమైన కథనాలపై మోజును పెంచుకుంటున్నారు. ప్రాచీన సంస్కృతి సంప్రదాయాలను హేళన చేస్తున్న వాటిని పత్రికలు ప్రోత్సహిస్తున్నాయి. మన పూర్వీకుల చరిత్రను, సంస్కృతిని, వేష భాషలను అద్దం పట్టే రచనలను పత్రికలు ప్రోత్సహించాలి. మన తీర్థయాత్రల గురించి, వెలుగులోకి రాని ప్రాచీన కట్టడాలను గురించి పరిశోధించి వెలికితీసి పాఠకులకు అందించాలి. ప్రాచీన కవుల రచనలను, వారి కవితారీతులను, అందులోని విశేషంశాలను గూర్చి పత్రికల్లో ధారావాహికంగా ప్రచురించి పాఠకులకు ప్రాచీన సాహిత్యము మీద మక్కువ పెంచేటట్లుగా కథనాలు ఉండాలి. అలాగే తెలుగు భాష యొక్క గొప్పతనాన్ని ప్రభుత్వాలు గుర్తించేటట్లుగా కథనాలు ఉండాలి. అర్నాద్ గారు తన సాంఘికం నవల్లో రవిచంద్ర ప్రసంగం ద్వారా ఈ విషయాన్ని తెలియజేసి సామాజిక స్పృహను కలుగజేశారు.

ఒక రచయితను ఎవరెస్టు శిఖరమంత ఎత్తుకు ఎదిగించాలన్నా, పాతాళానికి తొక్కేయాలన్నా పత్రికాధిపతులకే సాధ్యం. సాంఘికం నవల్లో మీనాక్షి ఇటువంటి పత్రికా సంపాదకురాలే. శ్రీవాత్సవ నవలను తన పత్రికలో ప్రచురించి పాఠకుల్లో ఉత్కంఠను కలిగించారు. ఈ నవలలో రాధ, శశాంక్ లు నాయికా నాయకులు. కథను ఎన్నో మలుపులు తిప్పి ఏమవుతుందో అనే ఉత్కంఠ కలిగేటట్లు చేశారు. పత్రిక కాపీ ఎప్పుడు విడుదల అవుతుందోనని, నవల్లోని రాధ పరిస్థితి ఏమవుతుందోనని ఎదురుచూసి పాఠకుల్లో భయానక, భీభత్స, కరుణ రసాలు ముప్పిరిగొంటాయి.

నేడు పత్రికలు రాజకీయ రంగాన్ని అంటిపెట్టుకొని రాజకీయ పార్టీలకు ఊడిగం చేస్తున్నాయి. సినీవారపత్రికలు స్త్రీలను అంగడి సరుకుగా మార్చేసి సొమ్ము చేసుకుంటున్నాయి. తమకు వ్యతిరేకంగా రాసి జర్నలిస్టులను అంతం చేసే దశకు రాజకీయాలు చేరి పత్రికా ప్రపంచాన్ని శాసిస్తున్నాయి. ప్రస్తుత పరిస్థితుల్లో విలేకరులమని చెప్పి బ్లాక్ మెయిలింగ్ రాజకీయాలకు పాల్పడి డబ్బు సంపాదన మార్గంగా ఎంచుకుంటున్నారు. ఇలాంటి పత్రికా రంగానికి సంబంధించిన సమస్త విషయాలను సాంఘికం నవలలో రాసి సంఘ పురోభివృద్ధికి అర్నాద్ గారు కృషి చేశారు.

అర్నాద్ గారి **"సత్య"** నవల ఓ ఉమెన్ సీరియల్. ఇందులో ప్రధానంగా కథంతా సత్య చుట్టూ తిరుగుతుంది. నవల ఆద్యంతం సామాజిక చైతన్యంతో కూడుకున్నటువంటిది. ఒక సామాన్య స్త్రీ తనకు ఎదురైన గడ్డు పరిస్థితుల్ని అధిగమించి జీవితంలో ఎలా

నిలదుక్కుకుందీ తెలియజేస్తుంది. సమాజంలోని రాక్షస రాబందులు సృష్టించే అరాచకాలను, అకృత్యాలను, అనైతికాలను ఎదుర్కొని మహిళా లోకాన్ని మేల్కొలిపి చైతన్యం కలిగించిన సత్య గాథను సెన్సేషనల్ రైటర్ అర్నాద్ గారు అద్భుతంగా తీర్చిదిద్దారు.

సమాజానికి వివాహం పునాది వంటిది. సత్యను వివాహం చేసుకున్న కృష్ణారావు పెళ్లయిననాటి నుండి నరకాన్ని చూపిస్తున్నాడు. ఇతను ఒక కామపిశాచి. భార్యను పుట్టింటికి వెళ్ళనీయకుండా, బంధువులను తన ఇంటికి రానీయకుండా అడ్డుకట్ట వేసిన శాడిస్ట్. భార్యపై అనుమానపు జబ్బు ఎక్కువ. శృంగారంలో కూడా పైశాచిక ఆనందాన్ని అనుభవించేవాడు. ఇలాంటి శాడిస్టులు మనకు సమాజంలో ఎందరో నేడు కనిపిస్తారు. ఇలాంటి వారి మానసిక ప్రవృత్తిని తెలియజేసి అర్నాద్ గారు సామాజిక స్పృహను కలిగించారు.

కంపెనీలు భద్రతకు ప్రాధాన్యమీయకుండా కార్మికుల జీవితాలతో చెలగాటమాడుతుంటాయి. సత్య నవల్లో కృష్ణారావు మద్యం సీసాతో కంపెనీలోకి ప్రవేశించి, అక్కడ మద్యం సేవించి విధులు నిర్వహించుట, ప్రమాదవశాత్తు కిందపడి మరణించుట కంపెనీ యొక్క అజాగ్రత్తను గూర్చి తెలియజేస్తున్నాయి. యాజమాన్యానికి వ్యతిరేకంగా కార్మికులు నినాదాలు చేసి కంపెనీ లోపాన్ని తెలియజేసి భవిష్యత్తులో ఇలాంటి సంఘటనలు జరగకుండా జాగ్రత్త పడేటట్లు చెప్పిన అర్నాద్ గారు సమాజాన్ని దృష్టిలో పెట్టుకుని ఈ నవల రాశారు . కార్మికపక్షపాతి కనుక శ్రేయోరాజ్యాన్ని కాంక్షించారు.

మధ్యపానం మానవులను ఎంతటి నీచ స్థాయికైనా దిగజారుస్తుంది. స్వామి ఆదర్శప్రాయుడు. కానీ మద్యానికి బానిసై చివర్లో నిందల పాలయ్యాడు. సత్య దృష్టిలో స్వామి దేవుడితో సమానం. ఒకరోజు అర్ధరాత్రి స్నేహితుని ప్రోద్బలంతో మందు త్రాగి సత్యతో శారీరక పొందుకు త్రాపత్రయపడతాడు. ఆ సమయంలో దేవుడు లాంటి స్వామి చనిపోయిన తన భర్త కృష్ణారావును గుర్తుకు తెస్తాడు. అంతవరకు స్వామిపై సదాభిప్రాయం దురాభిప్రాయంగా మారినది. మగవాళ్ళంతా ఒకే జాతిగా, నరరూప రాక్షసులుగా, కామపిశాచాలుగా సత్య భావిస్తుంది. చివరకు స్వామి పశ్చాతాపంతో సత్య శాంతించింది. ఈ నవలనంతా సమాజాన్ని దృష్టిలో ఉంచుకుని రాసినది. మానవుల్లో పరివర్తన తీసుకొచ్చి సామాజిక స్పృహను కలుగజేయడం, మన సంస్కృతీ సాంప్రదాయాలను పరిరక్షించడమే అర్నాద్ గారి ఆశయం.

**అర్నాద్ గారి కథలు - సామాజిక స్పృహ:**

అర్నాద్ గారు రాసిన కథలన్నీ ఇంచుమించు సామాజిక స్పృహను సంతరించుకున్న కథలే. ఏ కథ చదివినా ఏదో ఒక సామాజిక దృక్పథం కనిపిస్తుంది. మనిషిని సంస్కరించేవి కొన్ని కథలైతే, తిరుగుబాటు నేర్పేవి కొన్ని కథలు. ఒక్క ముక్కలో చెప్పాలంటే అర్థాంతరన్యాసాలంకారం అర్నాద్ గారి కథల్లో చక్కగా ఇమిడిపోతుంది.

అర్నాద్ గారి మొదటి కథ **వేలంపాటలో** జీవిత విలువలు కంటే వ్యాపార విలువలనే ఎక్కువగా గౌరవించిన ఓ చంద్రయ్య బతుకులో అంధకారం ఎలా ఆవరించిందో చెబుతుంది. సమాజంలో ఏ తండ్రి తన కూతుర్లను జ్యోతిలక్ష్మిలా అందంగా తయారవ్వమని, సిల్క్ స్మితలా ఫోజులు ఇమ్మని, కూతుర్ల అందచందాలతో వ్యాపారం చేయమని సలహాలు ఇవ్వరు. కానీ వేలంపాటలో చంద్రయ్య తన కూతురు చంద్రికతో ఇలాంటి ఉచిత సలహాలతో వ్యాపారం చేయిస్తాడు. చివరకు విషమించి కూతురు బలత్కారానికి గురై చంద్రయ్య పిచ్చివాడై విశాఖ వీధుల్లో తిరిగిన సంఘటనలను అర్నాద్ గారు చక్కగా వివరించి చంద్రయ్య లాంటి వారికి గుణపాఠం కలిగేటట్లు కథను రాశారు. వ్యాపార ప్రకటనల్లో ఒళ్ళు దాచుకోకుండా వ్యవహరిస్తున్న అతివల తల్లిదండ్రులని వెన్నుతట్టి హెచ్చరించే కథ ఇది.

**"దుకాణం"** కథ నేటి మన డాక్టర్ల గూర్చి, వారు చేసే మాయల గూర్చి వివరంగా తెలియజేస్తుంది. సంఘంలో డాక్టర్లు చేసే మోసాల్ని తన కథల ద్వారా తెలియజేసి సాంఘిక చైతన్యం కలిగించారు. స్త్రీ వ్యసనం ఉన్న డాక్టర్ జీవితంలో ఎలాంటి సమస్యలను ఎదుర్కొనవలసిన పరిస్థితి వస్తుందో తెలియజేశారు. డాక్టర్ల మధ్య వృత్తిపరమైన పోటీలో రోగులు సమిధలై ఎలా మోసపోతుందీ మున్నగు సంఘటనలు మన కళ్ళ ముందు జరుగుతున్న యదార్థ సంఘటనలను అద్దం పడుతున్నాయి. వైద్యం చేయడానికి తగిన అర్హత

లేకపోయినా నకిలీ డాక్టర్లు, నకిలీ మందులతో ప్రజల ప్రాణాలతో చెలగాటమాడుతున్న వైనాన్ని కళ్ళకు కట్టినట్లు ఈ కథలో చిత్రించారు. ఇలాంటి మోసాలని తన కథల ద్వారా ప్రజల్లో చైతన్యం కలుగజేసి అర్నాద్ గారు సఫలీకృతులైరి.

**"జేబులో తేలు"** కథ ద్వారా మన చుట్టూ తిరుగుతూ మన వెనకే ఉండి గోతులు తీసే ప్రబుద్ధులు గూర్చి తెలియజేశారు. అడవిలో క్రూరమృగాల కంటే సమాజంలో వంచకుల వలన ప్రమాదకరమని తెలిపారు. మిత్రునిలా నటించిన పయోముఖ విషకుంభాల చిరునవ్వు వెనుక కాలకూట విష సర్పాల విషపు సంచులు ఉంటాయని నేటి సమాజ స్థితిని వర్ణించారు. ఏ మనిషిలో ఏ విషనాగులు ఉన్నాయో తెలుసుకోలేక బలైపోయే వారి గూర్చి తెలిపి ప్రజల్లో సామాజిక స్పృహను అర్నాద్ గారు కలిగించారు.

**"భయం"** కథలో మతకలహాల్లో సామాన్యులు ఎలా సమిధులవుతున్నారో, సమాజాన్ని ఎలా భయభ్రాంతులకు గురిచేస్తుందో, స్వార్థపరులు ఇలాంటి మారణకాండలను ఎలా కొనసాగిస్తున్నారనే విషయాన్ని తెలిపారు. మన పూర్వపు రాజధాని నగరం హైదరాబాదు ఒకప్పుడు మతకలహాలకు నిలయము వంటిది. ఇంటర్వ్యూ కోసం వెళ్ళిన ప్రకాశం లాంటివారు బందులు, కర్ఫ్యూలో చిక్కుకొని ఎలా విలవిల్లాడిపోతున్నారో తెలియజేసిరి. తిరిగి ఇంటికి చేరేవరకు వారి తల్లిదండ్రుల పడే వేదనను ఇందులో తెలిపారు. ఏదైనా అపశకునాలు కలిగినప్పుడు కీడు జరుగుతున్నట్లుగా భావించడం నేటి మన సమాజంలో చూస్తున్నాం. సమాజంలో మతకలహాల గూర్చి భయం కథలో తెలిపి సామాజిక స్పృహను పాఠకులలో కలిగించి వారిని చైతన్యవంతుని చేశారు.

**"బంధం"** కథ పూర్తిగా చైతన్యంతో కూడిన కథ. తల్లిదండ్రులని వాటాలేసుకుని ఆదరించే బంధాలు విషపరిష్వంగా లేవని చాటి చెప్పే హృద్యమైన కథ బంధం. సమిష్టి కుటుంబ వ్యవస్థ చితికిపోయిన తర్వాత సమాజంలో వృద్ధుల అవస్థ హృదయ విదారకంగా మారిపోయింది. తప్పనిసరి తద్దినంగానో, లేదా ఆర్థిక స్వాతంత్రం ఉన్న వృద్ధుల విషయంలో స్వార్థబుద్ధితో ప్రవర్తించే నేటి తరపు అణుకుటుంబాల పరిధిలో, కన్న తల్లిదండ్రులని గౌరవప్రదంగా చూసే సంప్రదాయం హరించుకుపోవడంతో పేగు బంధం, రక్త బంధం ఉన్న వారి మమతానురాగాల విషయంలో కూడా నూతన భాష్యాలు చెప్పుకోవలసిన అవసరం వచ్చింది. ఇటీవల కాలంలో వృద్ధుల నిరాదరణ గూర్చి, వృద్ధాశ్రమాలకు తరలిపోతున్న తల్లిదండ్రులు గూర్చి నిత్యం వింటూనే ఉన్నాము. నేటి మన సమాజంలో కథలో ఉన్న రమణయ్య లాంటివారు ఎందరో ఉన్నారు. అర్నాద్ గారు తన ప్రతిభనంతా రంగరించి చక్కని సామాజిక చైతన్యం కలిగిన ఈ కథను రాసి పాఠకుల మన్ననలు పొందారు. అర్నాద్ గారు సామాజికస్పృహను కలిగించే కథలు ఎన్నో వ్రాశారు. దుకాణం, కుదుపు, నాటకం, చిత్రం, నెత్తిమీద దేవత, చుట్టాలు, పొరపాటులో అలవాటు, ఆడతోడు, మనది కాని మనీ, బేబీ వినీత, మార్పు, మూగ ప్రశ్న, విలువలు, హక్కు, గొర్రెలు, విషాదం, కుసుమ హృదయం, రిక్షా ప్రయాణం, పాత ముఖాలు, రైలు, అన్యాయం, దేవుడు దయామయుడు వంటి కథలు రాసి సామాజిక స్పృహను కలిగించారు అనడంలో అతిశయోక్తి లేదు.

**ఆధార గ్రంథములు:**


1. డాక్టర్ సుజాత రెడ్డి ముదిగొండ(1990), తెలుగు నవలానుశీలనం, హైదరాబాద్.
2. నాగభూషణ శర్మ మొదలి(1974), తెలుగు నవలా వికాసం, హైదరాబాద్.
3. శ్రీ అర్నాద్(1977), చీకటోళ్లు నవల.
4. శ్రీ అర్నాద్(2006), సత్య నవల, వాహిని బుక్ ట్రస్ట్, హైదరాబాద్.
5. శ్రీ అర్నాద్(1990), సాంఘికం నవల, స్వాతి సాహిత్య మాసపత్రిక, విజయవాడ.
6. వెంకటసుబ్బయ్య వల్లంపాటి (2008), కథా శిల్పం, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్.
7. దక్షిణామూర్తి పోరంకి (1975), కథానిక వాంగ్మయం, ప్రపంచ తెలుగు మహాసభ ప్రచురణ.


******

# 48. గయోపాఖ్యానం - మనస్తత్వ విశ్లేషణ

**తోట శ్రీనివాసరావు,**

పరిశోధక విద్యార్థి,

ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం,

చరవాణి - 9849598060

Mail : sritel5@gmail.com

వివిధ సాహిత్య ప్రక్రియలలో నాటకం ఎంతో విశిష్టమైంది. ఇది దృశ్యకావ్యం. అందుచేతనే 'కావ్యేషు నాటకం రమ్యం', 'నాటకాంతం హి సాహిత్యం' అని నాటక విశిష్టతను మన ప్రాచీనులు వేనోళ్ళ కొనియాడారు. నాటకాన్ని ఎవరైన వీక్షించి ఆనందించవచ్చు. నాటకాన్ని చూడ్డానికి విద్యాగంధంతో పనిలేదు. పండిత పామరులనందరినీ నాటకం అలరిస్తుంది.

తెలుగులో సుప్రసిద్ధ పౌరాణిక నాటకాలు ఎన్నో ఉన్నాయి. సత్యహరిశ్చంద్రీయం, పాండవోద్యోగ విజయాలు, గయోపాఖ్యానం, రామాంజనేయ యుద్ధం మొదలైనవి ప్రసిద్ధమైనవి. ఈ నాటకాలు ప్రధానంగా వీటిలోని పద్యాలు నాటి నుండి నేటి వరకు ఆబాలగోపాలాన్ని అలరిస్తూనే ఉన్నాయి. నిరక్షరాస్యులైన గ్రామీణులు సైతం ఈ నాటకాలలోని పద్యాలను పాడుకుంటూ, ఆనందించడం తెలుగునాట పరిపాటి. తెలుగు పద్యానికి ఎంతో ప్రత్యేకత ఉండటమే ప్రధాన కారణం. చింతామణి, వరవిక్రయం వంటి సాంఘిక నాటకాలలోను ప్రతాపరుద్రీయం, బొబ్బిలి వంటి చారిత్రక నాటకాలలోను పద్యాలకు ప్రత్యేక స్థానం కల్పించడం విశేషం. నాటక పద్యం కాలానుగుణంగా ఎన్నో నగిషీలు చెక్కుకొని, గొప్ప సౌందర్యాన్ని చేకూర్చుకుని, ఎంతో సొబగులు కూర్చుకొన్న పద్యం ఆంధ్రుల సంపదగా కీర్తింపబడటానికి కారకులైన నాటక కవులలో చిలకమర్తి వారు అగ్రశ్రేణిలో నిలుస్తారు.

తెలుగు పౌరాణిక నాటకాలలో గయోపాఖ్యానం ఎంతో ప్రత్యేకతను సంతరించుకొన్న నాటకం. దీని రచయిత చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు. చిలకమర్తి పేరు వినగానే గయోపాఖ్యానం నాటకం, గయోపాఖ్యానం అనగానే చిలకమర్తి గుర్తుకురావడం సహజం. ఈ నాటక రచన ద్వారా చిలకమర్తికి అపారమైన కీర్తి ప్రతిష్టలు లభించాయి. చిలకమర్తి గయోపాఖ్యానంతో పాటు కీచక వధ, పారిజాతాపహరణం, ప్రసన్న యాదవం, ప్రహ్లాద చరిత్రం, తిలోత్తమ, శ్రీరామ జననం, ద్రౌపదీ పరిణయం, నలదమయంతి, సీతా కళ్యాణం, పార్వతీ పరిణయం, బాసుని నాటకాలు, చతుర చంద్రహాసం, హరిశ్చంద్ర మొదలైన నాటకాలు రచించారు. అయితే నాటకర్తగా చిలకమర్తికి గయోపాఖ్యానం మంచి కీర్తి నార్జించి పెట్టింది. అప్పట్లో ఈ నాటక ప్రదర్శన చూడ్డానికి జనం తండోపతండాలుగా వచ్చేవారు. పొరుగూరి జనం ఎడ్లబండ్లపై తరలి రావడం ఈ నాటకం యొక్క ప్రాముఖ్యతను తెలియజేస్తుంది. గయోపాఖ్యానం ప్రతులు లక్షన్నరకు పైగా అప్పట్లో అమ్ముడు పోవడం విశేషం. ఈ విధంగా రికార్డు స్థాయిలో అమ్ముడుపోవడం నాటి సమాజంలో జనాదరణకు నిదర్శనం.

గయుడనే గంధర్వుడు సతీసమేతంగా సత్యలోకంలోని బ్రహ్మదేవుణ్ణి దర్శించి, వరాలు పొంది ఆకాశమార్గంలో తిరిగి వస్తూ ఉంటాడు. యమునానదిలో సూర్యునికి అర్ఘ్యమివ్వబోతున్న శ్రీకృష్ణుని దోసిలిలో ఆకాశం నుంచి గయుడి నిష్టీవనం పడుతుంది. దాంతో శ్రీకృష్ణుడు ఆగ్రహించి ఆ అపరాధం చేసిన వాడెవడైనా సరే, చంపుతానని ప్రతిజ్ఞ చేస్తాడు. శ్రీకృష్ణుణి ప్రతిజ్ఞ విషయం తెలియక అర్జునుడు క్షాత్ర ధర్మానుసారం శరణుకోరిన గయుడికి అభయమిస్తాడు. దాంతో కృష్ణార్జునుల మధ్య యుద్ధం జరుగుతుంది. చివరకు ఈశ్వరుడు ప్రత్యక్షమై వారిరువురినీ ఈ విధంగా సమర్థించి శాంతింపచేస్తాడు. 'దేవకీ వసుదేవుల పుత్రుడనైతే, బలరాముడికి తమ్ముడనైతే, దోసిలిలో నిష్టీవనము వేసిన వ్యక్తిని చంపుతాను' అని ప్రతిజ్ఞ చేసిన శ్రీకృష్ణుడు మాటతప్పిన వాడయ్యాడా ? అంటే అసలు నిజానికి క్షీర సాగరంలో

శేషతల్పంపై పవళించి లక్ష్మీదేవి సేవలందుకునే శ్రీమన్నారాయణుడవే తప్ప, దేవకీ వసుదేవుల తనయుడవు కావు, బలరాముని అనుజుడవు కావు. కనుక ప్రతిజ్ఞ నెరవేర్చినా ఒక్కటే, నెరవేర్చకపోయినా ఒకటే. పరమ భక్తుడైన గయుణ్ణి కనికరించి, మరణం నుంచి తప్పించు' అని మహేశ్వరుడు చెబుతాడు. శ్రీకృష్ణుని సంతసించి గయుణ్ణి క్షమించి, అర్జునుడితో ధార్తారాష్ట్రులకు మీకు సంభవించబోయే సంగ్రామంలో నువ్వు ఎంత వరకు నిలదొక్కుకోగలవో, నీ శక్తి సామర్థ్యాలు ఏ పాటివో చూడాలని నేను కల్పించిన లీల మాత్రమే ఇది అని అనడంతో కథ సుఖాంతమవుతుంది.

చిలకమర్తి మొదట గయోపాఖ్యాన నాటకం పద్యాలు లేకుండా రాశారు. అంటే కేవలం వచనంగా మాత్రమే రాశారన్నమాట. అప్పట్లో పద్యాలు పాడగల్గిన నటులు చిలకమర్తికి అందుబాటులో లేకపోవడమే యిందుకు కారణం. తర్వాత పద్యం బాగా పాడగల్గిన నటలు అందుబాటులోకి రావటంతో కథా భాగాన్ని యథాతదంగా ఉంచి సందర్భానుకూలంగా నూతనంగా పద్యాలు రాసి 1909 లో సవరణ ప్రతిని వెలువరించారు. నాటి నుండి నేటి వరకు గయోపాఖ్యానం పద్య నాటకంగా ప్రదర్శింపబడుతూనే ఉంది. చిలకమర్తి మాటల్లో 'నా నాటకములన్నింటిలో గయోపాఖ్యానమే జనాకర్షకమైనది. ఆ గ్రంథములు శనగపప్పువలె ఖర్చుపడినవనుట యతిశయోక్తికాదు. ఇప్పటికి లక్షప్రతుల కంటే నధికముగ ఖర్చుపడినవి. గంటి లక్ష్మన్న గారొకసారి నాతో మాటలాడుచు Your Gayopakyanam has record sale అని వచించిరి. పిఠాపురం దివాను గారైన మొక్కపాటి సుబ్బారాయుడు గారు Gayopakyanam is a master price అని పలికిరి. గయోపాఖ్యానము శ్రేష్టమైన గ్రంథమని దీని భావము'. సమకాలీన సమాజంలో మనకు కన్పించే ఆప్యాయతలు, అభిమానాలు గిట్టని సమయాలలో ముందు చేసిన మంచినే చెడ్డగా వక్రీకరించి వాగ్బాణాలు సంధించడాలు, ఈసడిలింపులు, కోపతాపాలే ఈ గయోపాఖ్యాన నాటకంలో మనకు కన్పిస్తాయి.

ముక్తేవి భారతి అన్నట్లు ''గయోపాఖ్యాన వస్తువులలో ముఖ్యమైన కథాంశం ఆత్మీయుల మధ్య అంతఃకలహం. దగ్గరివారు తగాదాపడితే చుట్టూ లోకం ఎంతో ఆసక్తిని ప్రకటించడం లోక సహజం. ఈ సమాజాసక్తియే ఈ నాటకంలోని కథను అంతగా రక్తి కట్టించింది. ఇందులో ఆత్మీయులైన బంధువుల మధ్య జరిగిన పోరాటం. అందులోనూ ప్రాణానికి ప్రాణమైన శ్రీకృష్ణార్జునుల మధ్య సమరం. దానికి కారణం ఎవడో గంధర్వుడైన గయుడు కావడం.''

కృష్ణుడు అధర్మాన్ని అరికట్టడానికి శపథం చేశాడు. అర్జునుడు శరణాగతున్ని రక్షించడమే పరమధర్మంగా భావించి ప్రతిజ్ఞ చేశాడు. ఇద్దరి ఆశయాలు, ఆలోచనలు ధర్మ బద్ధమైనవే. ధర్మానికి, ధర్మానికి మధ్య సంఘర్షణే గయోపాఖ్యాన నాటక కథాంశం. ఈ సంఘర్షణ ముగింపు ఎలా ఉంటుందోనన్న ఆసక్తి పాఠకులకు మరియు ప్రేక్షకులకు కలగడం సహజం. ఈ ఉత్కంఠే నాటకం పట్ల ప్రజాదరణకు ప్రధాన కారణం. నాటకాన్ని ఎప్పుడు చూసిన లేక నాటకంలోని పద్యాలను ఎప్పుడు విన్న మళ్ళీ మళ్ళీ వినాలనే కుతూహలం కల్గడం, చిలకమర్తి నాటక రచనా వైదుష్యానికి ప్రధాన హేతువు.

గయోపాఖ్యాన నాటకంలో పద్యరచన హృద్యంగా సాగింది. కాల ప్రభావాన్ని, ప్రజల అభిరుచిని దృష్టిలో పెట్టుకు చేసిన రచనయిది. సులభ శైలిలో, అలతి అలతి పదాలతో, అన్వయ సారళ్యంతో వుండటమే కాక ఇందులోని భావాలు నిత్య వ్యవహారంలో ఎంతో సన్నిహితంగా వుండుటం చేత జన సామాన్యాన్ని ఆకర్షించాయి. పాత్రల స్వభావాలు చిత్రీకరిస్తూ చిలకమర్తి చేసిన పద్య రచన ప్రసిద్ధి పొందింది.

సుభద్ర రాయబారిగా వచ్చినప్పుడు భర్తైన అర్జునుడు ఆమెతో మాట్లాడిన తీరు, సోదరుడైన కృష్ణుడు ఆమెతో పలికిన విధానం పరిశీలిస్తే సాధారణ ప్రజల వ్యవహారశైలే మనకు గుర్తుకొస్తుంది. ఉదాహరణగా అర్జునుడు సుభద్రతో పలికిన విధానాన్ని పరిశీలిద్దాం. ''ప్రాణనాధుడెంత పరాక్రమవంతుడైనను నెంత రసికాగ్రేసరుడైనను, నెంత ప్రేమాతిశయము గలవాడైనను గొంత మగనిం జులకన జేయును. పుట్టినిల్లన దన పంచ ప్రాణములర్పించును.

తే.గీ. మగువ మీదను బతికెంత మక్కువైన
మగని మీదను సతికెంత మమతయున్న
నువిదకును గాపురం బెంత యొప్పియున్న
బుట్టినింటికె కడగూర్చు బొలతి యెప్పుడు.''

రాయబారిగా వెళ్ళి వచ్చిన సోదరి సుభద్రతో శ్రీకృష్ణుడు వ్యవహరించిన ధోరణిని పరిశీలిద్దాం. ''కళ్యాణీ! ఇందు నిన్నవలసిన పనిలేదు. స్త్రీ బుద్ధి యల్పతయే దీనికి కారణము.

ఉ. ''వంత యొకింత లేనటుల బాల్యము నుండియు బుట్టినింటి వా
రెంతటి భాగ్యమిచ్చినను నే క్రియ జూచిన గాని కాంతకున్
సుంతయు బ్రేమముండదిక సోదరులాదిగ బంధుకోటిపై
గాంతలు మధ్య వచ్చిన మగండనినం బడి చత్తు రెంతయున్

మఱియు

తే.గీ. సారె చీరలు నగలు జాల గొనుచు
బుట్టినిండ్లు గుల్లలు చేసి పోయి సతులు
తుదకు మగని పక్షమున జేరి యెదురగుదురు
మగనిపై గూర్మి యధికంబు మగువకెపుడు''

వివాహితురాలైన స్త్రీకి వయసుతో నిమిత్తం లేకుండా పుట్టింటిపైన మమకారం ఎక్కువ. అదే విధంగా తన భర్తపైన కూడా అవ్యాజమైన అనురాగం కలిగి ఉంటుంది. విధివశాత్తు కట్టుకున్న భర్తకు, రక్తం పంచుకు పుట్టిన సోదరునకు మధ్య వైరం ఏర్పడినప్పుడు, ఆ స్త్రీ పడే మానసిక వేదనకు అంతముండదు. ఇది సాధారణ లోకరీతి. కట్టుకొన్న భర్త, తోడబుట్టినవాడు యిద్దరు సుభద్రతో ఎంతో నిష్ఠూరంగా మాట్లాడితే, ఇద్దరి శ్రేయస్సు కోరి రాయబారాన్ని నడిపిన ఆ సుభద్ర పరిస్థితి యేమిటి ? అన్న ఈ సామాజికాంశాన్ని సుభద్ర పాత్రపరంగా చిలకమర్తి ఎంతో అద్భుతంగా ఈ నాటకంలో మలచారు. 'కరవమంటే కప్పకు కోపం, విడవమంటే పాముకు కోపం' అన్నట్లున్న సుభద్ర పరిస్థితిని చిలకమర్తి ఈ విధంగా వివరించారు.

తే.గీ. ''భ్రాతృ పక్షంబు బలికిన భర్తయలుగు
భర్తృ పక్షంబు బలికిన భ్రాతకినియు
నడుమ నిష్కారణంబుగ నలుగు నీమె
వెనుక గొయ్యి ముందర నుయ్యి యనుట నిజము.''

గయోపాఖ్యానం అత్యంత ప్రజాదరణకు ప్రీతిపాత్రం కావడానికి ప్రధాన కారణం ఈ నాటకంలోని కృష్ణార్జునుల మధ్య నడచిన సంవాద పద్యాలు. ఇవి సరళశైలిలో ఉండటం కారణంగా ప్రతి ఒక్కరు మళ్ళీ మళ్ళీ విని మురిసిపోయేవారు. అంతగా ప్రజలను ఆకర్షించిన సంవాద పద్యాలలో కొన్ని మచ్చునకు.

కృష్ణుడు తే.గీ. ''వేమునకు బానకము బోసి పెంచినట్లు
ద్రాచు బామును బాల్పోసి గాచినట్లు
జిన్ననాట నుండియు నేను జేయు మేలు
పార్థ! నీదెస యెంతయు వ్యర్థమయ్యె.

అర్జునుడు

తే.గీ. కడలి లోపల జక్కెర కలిపినట్లు
బూడిదను మంచి పన్నీరు పోసినట్లు
వినయ గర్భితమైన నా విన్నపంబు
నిష్ఫలంబయ్యె నీదెస నీరజాక్ష!''

శ్రీకృష్ణార్జునులు మాటల యుద్ధంలో ఒకరినిమించి మరొకరు పోటీ పడుతున్నారు. ఇద్దరు పోట్లాడుకుంటుంటే వాళ్ళ యింట్లో వాళ్ళను కూడా వీధిలో పడేయ్యడం వంటి విషయాలు లోక వ్యవహారంలో మనం చూస్తూంటాం. ఈ విధమైన శ్రీకృష్ణార్జునుల సంభాషణలు అపమార్గం పట్టిన మాటల తూటాలను ఈ క్రింది పద్యాలలో పరిశీలిద్దాం.

అర్జునుడు

కం. ''మాయన్నకు మీయన్నకు
నే యంశము నందు సాటియే లేదు సుమీ
మాయన్న ధర్మరాజగు
మీయన్న యధర్మరాజు మృషగాదు హరీ!

కృష్ణుడు

ఆ.వె. పేరు ధర్మరాజు పెనువేప విత్తండ్రు
మాట తేనెతేట మనసు విషము
నేతి బీరకాయ నీ యుధిష్టిర శబ్ద
మెఱుక లేనివాని యెదుట బొగడు.''

(మఱియు)

కృష్ణుడు సీ॥ ''నీచముచ్చమునాక రాచపాడి దొరంగి
బిడియ మించుకలేక బిచ్చమెత్త
జన విరుద్ధంబుగ సైదోడు లేవురు
వెలది నొక్కర్తునే పెండ్లియాడ
గొలువు కూటమునందు గురుజనంబుల మ్రోల
సుదతి బందెమువెట్టి జూదమాడ
సిరులెల్ల గోల్పోయి సిగ్గున దలవంచి
కట్టుగుడ్డలతోడ గానకేగ
నీవు నీ యున్నదమ్ములు నేర్తుగాక
నేర్తురే మమ్ము బోటులు నిశ్చయముగ
జలధి వలయిత ధారుణీ చక్రమందు
మీ సహోదరులకు సాటి మీరె సుమ్ము.''

అర్జునుడు ''అవస్థాభేదము వచ్చునప్పుడు భిక్షాటన మనుచితముగాదు. ఇందుకు నీవే ప్రమాణము.

తే.గీ. అదితి కశ్యపులకు గుజ్జువగుచు బుట్టి
యడుగు కొనలేదె నేల మూడడుగు లీవు ?
నీవు నేర్చిన విద్యయే నీరజాక్ష!
భిక్షమెత్తుట యిది క్రొత్త విద్య గాదు.''

కృష్ణార్జునులు నరనారాయణులని ప్రతీతి. అంతేగాక భారతాన్ని పరిశీలించి చూస్తే కృష్ణుని బహిఃప్రాణం అర్జునుడు. అర్జునుడికి ప్రత్యక్ష దైవం కృష్ణుడు. పై పద్యాలను పరిశీలించి చూస్తే శ్రీకృష్ణార్జునులిద్దరు సామాన్య మానవుల్లాగా దిగజారి పరస్పరం నిందించుకోవడమే కనిపిస్తుంది. చిలకమర్తి ఈ విధంగా రచన చేయడం మూలంగా ఈ నాటకం సహజత్వాన్ని సంతరించుకొని సామాన్య మానవునికి సైతం చేరువయ్యింది.

గయోపాఖ్యాన నాటకంలోని సుభద్ర పాత్రపరంగా సామాన్య స్త్రీలను, కృష్ణార్జునుల పాత్రలపరంగా సామాన్య ప్రజలను ఈ నాటకం ఎంతగానో ఆకర్షించింది. పై మూడు పాత్రల తీరుతెన్నులు సంభాషణలు, సామాన్యులకు చేరువకావటం ఈ నాటక ప్రశస్థికి ప్రధానకారణం. చిలకమర్తి ఆయా పాత్రల మనస్తత్వ చిత్రణ సగటు మనుషుల మనస్తత్వాలకు దగ్గరగా ఉండటం ఈ నాటకంలోని ప్రత్యేకత. ఈ కారణాల దృష్ట్యా గయోపాఖ్యానం సామాన్యుల నుండి అసామాన్యుల వరకు అత్యంత చేరువయ్యింది. ఈ నాటకంలోని పద్యాలు, సంభాషణలు ఎన్నిసార్లు విన్నా, మళ్ళీ మళ్ళీ వినాలనే ఉత్సుకత కలుగుతుండటం చిలకమర్తి రచనా సామర్థ్యానికి ప్రబల నిదర్శం. ఇచ్చిన మాట నిలబెట్టుకోవడానికి ఎవరితోనైనా తలపడడానికి సిద్ధంగా ఉండాలనీ, దాని కోసం ప్రాణత్యాగానికైనా వెనకాడకూడదనీ అర్జునుడి పాత్ర ద్వారా అందించారు.

ప్రస్తుతం తాంబూలంతోపాటు ఏవేవో మత్తు పదార్థాలను సేవిస్తూ ఎక్కడ పడితే అక్కడా, ఎట్లాపడితే అట్లా విచక్షణా రహితంగా ఉమ్మి వేస్తున్నారు. ముఖ్యంగా వెనుకా ముందు చూసుకోకుండా వాహనాలలో ప్రయాణం చేస్తూ ఉమ్మి వేస్తున్నారు. ఈ అలవాటు ఎన్నో అనర్థాలకు దారితీసి, ఘర్షణలకు కారణమవుతుంది. ఈ అలవాటు వలన కలగే దుష్పరిణామాలను పరోక్షంగా హెచ్చరిస్తూ, ఎంత గొప్ప వారైనా దీని ఫలితాన్ని అనుభవించక తప్పదన్న సందేశాన్ని చిలకమర్తి ఈ నాటకం ద్వారా సమాజానికి అందించారు. ఈ నాటకం రచించి శతాబ్ధి కాలం దాటినా, నాటకంలోని సందేశం మాత్రం నిత్యనూతనం, సార్వకాలికం.

*******

# 49. తెలుగు దళితకవిత్వం విమర్శ

**డా|| రవికుమార్, పొనుగోటి.,**

అసోసియేట్ ప్రొఫెసర్,

ఎస్.ఆర్ & బి.జి.ఎన్.ఆర్. ప్రభుత్వ డిగ్రీ & పీజి కళాశాల(అటానమస్, నాక్ ఏ ++ ),

ఖమ్మం, తెలంగాణ.

92904 03605,

rkponugoti@gmail.com

తెలుగు సాహిత్య విమర్శ కట్టమంచి రామలింగారెడ్డితో ఆరంభమైందన ప్రతీతి. ప్రబంధాలను అధ్యయన క్రమంలో అనుసరించు కావ్యమార్గం నుంచి ఆధునిక పద్ధతిలో అనుగమించిన తొలి వివేచనశీలి కట్టమంచి వారు. ఆధునికదృష్టితో విమర్శ అనేక రూపాలలో విశాలం అవుతూ వచ్చింది. సాహిత్యంలో దృక్పథాలుకు ప్రాధాన్యత పెరిగిన తర్వాత విమర్శ మరింత పదును తేలింది. అభ్యుదయ కవిత్వం ప్రాదుర్భవించిన తర్వాత తెలుగు సాహిత్య విమర్శ కొత్త పుంతలు తొక్కింది. విప్లవ కవిత్వం అనంతరం వచ్చిన అస్తిత్వ ఉద్యమాలు సాహిత్యంలో వైవిధ్యాన్ని ప్రజాస్వామికతనూ ప్రశ్నించాయి. విశాల ప్రజా ఉద్యమాల పేరుతో నడిచిన వర్గ ఉద్యమాలన్నీ 'ఆధిపత్యం' వైపే నడిచాయని మార్క్సిజం వంటి మహా కథనాలకు కాలం చెల్లిందని ఆ తర్వాత వచ్చిన తత్వవేత్తలు ప్రకటించారు. వర్గ ఉద్యమాలు నిర్దిష్టతల్ని ప్రజా సమూహంలోని ప్రత్యేకతల్ని విమర్శించాయని కావున వాటిని రద్దు చేసుకుంటున్నాయని నినదించిన తత్వవేత్తలు లింగ, జాతి, ప్రాంత ఉనికి ప్రాతిపదికన ఉద్యమాలు జరుగుతున్న నేపథ్యంలో వాటికి తాత్వికబలం అందించే ప్రయత్నం చేశారు.రిచర్డ్ రాల్టీ అనే తత్వవేత్త ఈ వాదానికి Pragmatisam (వ్యావహారికసత్తావాదం) అని పేరు పెట్టారు. తెలుగులో దీన్ని ఎన్. వేణుగోపాల్ వంటి విమర్శకులు 'శకలీకరణ వాదం'గా వ్యవహరించారు. మార్క్సిజం పేరుతో విశాల వర్గ ఉద్యమాలు వివిధ సమూహాలు అస్తిత్వం కోల్పోతున్నాయని వాటి పరిరక్షణకు మార్క్సిజం తగిన పరిష్కారాలు చూపలేదని ఫుకో,డెరీడా వంటి తత్వవేత్తలు విమర్శించారు.

ప్రపంచంలోనూ, తత్వశాస్త్రంలోనూ జరిగిన పరిణామాల వల్ల తెలుగు సాహిత్యం అనేక కుదుపులకు గురైంది. సాత్రే ప్రభావం వల్ల అస్తిత్వ పరివేదన మొదలైంది. అయితే విప్లవ కవిత్వం ప్రబలంగా ఉండటం వల్ల వాటి ప్రతిధ్వనులే వినిపించాయి తప్ప వాటికి సంపూర్ణ రూపంగా సాకారం కాలేదు. కానీ అంతర్జాతీయంగా స్త్రీల సాధికారికత,లైంగికత, స్వేచ్ఛ, సమానత్వం వంటి విషయాల మీద జరుగుతున్న సైద్ధాంతిక చర్చను తెలుగు స్త్రీలు అందిపుచ్చుకొన్నారు. తెలుగు సాహిత్యంలో లింగ వివక్ష, పితృస్వామిక భావజాల ఆధిపత్యం గురించి స్త్రీలు వారి అనుభవాల గురించి 'స్త్రీలుగా రాయడం' మొదలైంది.

1890 నుండి దళిత గొంతుక తెలుగు ప్రాంతంలో ఉంది. ఆంధ్ర ప్రాంతంలో ఆది ఆంధ్ర, హైదరాబాద్ ప్రాంతంలో ఆది హిందూ అనే మూలవాసి ఉద్యమాలు బలంగా ఉన్నా కాల్పనిక కవిత్వం పేరుతో భావ కవిత్వానికి పెద్దపీట వేసి జాషువా వంటి మహాకవుల కవిత్వాన్ని రెండో తరగతి భావ కవిత్వంగా ఉద్దేశ పూర్వకంగా ప్రచారం చేశారు. అయితే 80 వ దశకంలో స్థానిక సమాజం సాహిత్య పరిస్థితులలో అనూహ్యమైన మార్పులు చోటు చేసుకొని దళిత సాహిత్యం రావాల్సిన అవసరాన్ని చాటి చెప్పాయి. 1985 లో జరిగిన కారంచేడు దుర్ఘటనలో కమ్మ కులస్థులు మూకుమ్మడిగా దాడి చేసి మాదిగలను ఊచకోత కోసారు. సామూహిక హత్యాకాండ రాజకీయ ప్రాధాన్యత సంతరించుకుని దళితుల అస్తిత్వంపై అనేక ప్రశ్నల్ని లేవనెత్తింది. అది ఒక వాదంగా రూపొందడానికి దోహదపడి, మహారాష్ట్రలో

జరుగుతున్న దళిత ఉద్యమం వైపు తెలుగు దళితుల దృష్టి మరల్చే విధంగా చేసింది. కత్తి పద్మారావు, బొజ్జా తారకం ఆధ్వర్యంలో 'దళిత మహాసభ' ఆవిర్భావానికి దారితీసింది.

రాజకీయంగా కాంగ్రెస్ పార్టీ రూపంలో రెడ్డి కులస్తులు అధికారంలోకి రాగానే చుండూరులో (1992) దళితుల ఊచకోత జరగటంతో దళిత ఉద్యమం ఉవ్వెత్తున లేచి పడింది. సైద్ధాంతికంగా అంబేద్కర్ ఆలోచనా విధానం ఒక విముక్తి సాధనం అవ్వడమే కాదు బుద్ధిజీవుల ఆలోచన సాధనమయ్యింది. మన దేశంలోని కులవ్యవస్థ స్వభావం, అణచివేత, దోపిడీ వంటి విషయాల్ని ఆధునిక వ్యవస్థలో రూపొందిన కొత్త దోపిడీ కులాల గురించే లోతైన వివేచన జరిగింది. కుల నిర్మూలన లక్ష్యంగా దళితుల సామాజిక ఉద్యమం మొదలైంది. మరోవైపు ఉత్తర్‌ప్రదేశ్‌లో కాన్షిరాం నాయకత్వంలో దళిత, గిరిజన, బహుజన, మైనారిటీల ఐక్య సంఘటనతో మాయావతి ముఖ్యమంత్రిగా అధికారం చేపట్టింది. దీంతో దళితవాదం రాజకీయ ఉద్యమంగా ఆకృతి దాల్చడం అగ్రకులాలను ఓడించడం వల్ల దళితుల్లో కొత్త ఆకాంక్షలు తలెత్తాయి.కాన్షిరామ్ తెలుగు ప్రాంతాలలో పర్యటించి ఉజ్వల దళిత ఉద్యమానికి మద్దతు ఇచ్చారు. అయితే దళిత మేధావులు బీఎస్పీ పట్ల అనుమాన వాదంతో ఉండడం వల్ల దళిత ఉద్యమం రాజకీయ ఉద్యమంగా తెలుగు నేలలో రూపు దాల్చలేకపోయింది.

దళిత రాజకీయాలకు దళిత సాహిత్యానికి మధ్య ఆది నుంచి ఒక తరహా దూరం కొనసాగుతూనే ఉంది. ఫలితంగా దళిత సాహిత్యం సమస్త తెలుగు సాహితీ ప్రక్రియలని విశేషంగా ప్రభావితం చేసింది.వస్తువు, రూపం,అభివ్యక్తి, భాష వంటి విషయాల్లోనూ పరికల్పనలోనూ గొప్ప మార్పు తెచ్చింది. దళిత సాహిత్యం పట్ల వ్యూహాత్మక మౌనం వహించిన విమర్శకులు సైతం మాట్లాడక తప్పని సందర్భాన్ని సృష్టించింది. దళిత కవిత్వం 'చిక్కనవుతున్నపాట'తో ఉద్యమరూపం దాల్చి, ఆ సందర్భంగా దళిత కవిత్వానికి గల భావజాల సైద్ధాంతిక భూమికను నిర్వహించుకునే ప్రయత్నం చేసింది. సాహిత్యంలో మార్క్సిజం తగ్గుముఖం పట్టిన కారణంగా మార్క్సిజం, అంబేద్కరిజం రెండింటి సమ్మేళనంతో దేశీయమార్క్సిజంగా దళిత సాహిత్యం పునాదులను నిర్వహించుకుంది. అయితే ఈ సందర్భంగా మార్క్సిస్ట్ విమర్శల ఆరోపణలకు విమర్శకులు సమాధానం ఇచ్చే కృషి చేశారు. దళిత దృష్టి నుంచి సమస్త సాహిత్యాన్ని వ్యాఖ్యానించే బృహత్తర కర్తవ్యానికి పూనుకున్నారు.

కందుకూరివీరేశలింగం సంస్కరణవాదం, గురజాడ అప్పారావు, గిడుగు రామ్మూర్తి భాషోద్యమం బ్రాహ్మణవాదం బలపడడానికి ఉపకరించిందని కింది కులాల ఉద్ధరణకు సంస్కర్తలు చేసిందేమీ లేదని విమర్శించింది.వితంతు వివాహం, సతీసహగమనం వంటి దురాచారాలు కింది కులాల్లో లేవని దళితవాదం ప్రకటించింది. ప్రాచీన కవిత్వం నుండి భావకవిత్వం వరకు స్త్రీని భోగవస్తువుగా చూసే ఫ్యూడల్ సంస్కృతి బ్రాహ్మణ వాదానిదే తప్ప దళితుల దృష్టి కాదని శ్రమైక జీవనంలో దళిత స్త్రీకి దళిత సమాజంలో స్వేచ్ఛ, సమానత్వం, సమాన గుర్తింపు ఉన్నాయని వ్యాఖ్యానించింది.

ఏది దళితవాదం? ఎవరు దళితులు? అన్న మౌలిక ప్రశ్నలు పునరాలోచనకు దారితీశాయి. అంబేద్కరిజాన్నీ మార్క్సిజంతో జతచేసే ఆలోచనను కుట్రగా అభివర్ణించిన బీ.ఎస్. రాములు వంటి విమర్శకులు దళితవాదం అంటే మహాత్మా జ్యోతిరావు పూలే, నారాయణ గురు, పెరియార్ రామస్వామి, అంబేద్కర్ మొదలైన వారి ఆలోచనా విధానమే దళితవాదం అన్నారు. సతీశ్‌చందర్ కలేకూరి ప్రసాదులు కులనిర్మూలన, రాజ్యాధికారం లక్ష్యంగా సాగేదే దళిత ఉద్యమమని నిర్వచించే ప్రయత్నం చేశారు. ఎస్సీ, ఎస్‌టి, బీసీ, మైనారిటీలు దళితులని అగ్ర కులాల్లోని పేదలని కూడా దళితులుగానే పరిగణించాలని 'దళితమహాసభ' నిర్వచించింది . ఈ నిర్వచనం అతివ్యాప్తి చెందిందని విమర్శకులకు లోనైంది. బీసీలు దళితులుగా గుర్తింపు అంగీకరించక బహుజనులుగా తమను తాము నిర్వచించుకునే ప్రయత్నం చేశారు. అటవీ ప్రాంత గిరిజనులు కంటే మైదాన ప్రాంత గిరిజనులు కుల వివక్షతను ఎక్కువగా ఎదుర్కొంటున్నారు. కానీ ఎస్సీలు ఎదుర్కొన్నంత తీవ్రంగా వారు కులవివక్షతకు గురి కావడంలేదు. మైనారిటీలు ముస్లింవాద సాహిత్యాన్ని మొదలు పెట్టారు.

స్థూలార్థంలో దళితులంటే ఎస్సీ, ఎస్టీలే. సూక్ష్మ అర్థంలో దళితులంటే మాల, మాదిగ వాటి ఉపకులాలలేనని రూఢ అర్థం ఉంది. ఎవరు దళితులంటే కులవివక్షతే గీటురాయి తప్ప ఆర్థిక వెనుకబాటుతనం పునాది కాదని దళితవాదం స్పష్టంగా ప్రకటించింది. స్థూలంగా దళిత సాహిత్యోద్యమం విమర్శలో రెండు అంశాలు ఉంటాయి. ఒకటి, దళిత సాహిత్యంపై దళిత దృక్పథంతో దళిత విమర్శకులు చేసిన విమర్శ. రెండు, దళిత దృష్టి నుంచి తెలుగు సాహిత్యం మీద చేసిన విమర్శ. వీటితో పాటు దళితేతర విమర్శకులు దళిత సాహిత్యం గురించి దండోరా వంటి సామాజిక సాహిత్య, ఉద్యమాల గురించి చేసిన విమర్శ దళిత సాహిత్య విమర్శలో అంతర్భాగం అవుతుంది.

నిజాయితీ విమర్శనాత్మక ధోరణితో దళిత సాహిత్యం దళితులలో గల ఆత్మనూన్యతా భావాన్ని పోగొట్టి వారు బానిస మనస్తత్వం నుండి విముక్తి చేయడానికి ఉపకరించింది, ఉద్యమించింది. ఇదివరకే స్థిరపడిన సాహి విలువలపై ఆధారపడిన 'కళ కళ కోసమే' అనే సిద్ధాంతాన్ని తిరస్కరించి 'కళ ప్రజల కోసమని' ఎలుగెత్తి చాటింది. తమ రచనలను సాంప్రదాయిక పద్ధతుల్లో తూచడానికి వీరు అంగీకరించలేదు. కొత్త విలువలను కొత్త కొలమానాలతోనే తూచలని జీవితంతో పాటు సాహిత్యంలో కూడా సాంప్రదాయిక విలువలను తీవ్రంగా వ్యతిరేకిస్తూ ఉద్యమించారు. పాతబడిపోయిన సిద్ధాంతాలతో దళిత సాహిత్యాన్ని అంచనా వేయడానికి అంగీకరించక మానవత విలువల ప్రాతిపదికగా సాహిత్యాన్ని, సాహితీ విలువలను కొలమానంగా విమర్శ చేయాలన్నారు. దళిత సాహిత్యాన్ని సాంప్రదాయక అలంకారిక శాస్త్రదృష్టి నుంచి కాక దళిత కళాత్మకదృష్టి నుండి చూడాలన్నారు. ఆ దృష్టి నుండే తెలుగు సాహిత్య చరిత్రను పునర్నిర్మించాలన్నారు.

కుల నిర్దిష్టత నుండి విశ్వ నరుడుగా ఎదిగిన జాషువాకు సాహిత్యచరిత్రలో బ్రాహ్మణవాదులు తీరని అన్యాయం చేశారని, విశ్వనాథకు సరైన ప్రత్యర్థి శ్రీశ్రీ కాదని జాషువా అన్నారు. వైతాళికులు సంకలనంలో జాషువాకు స్థానం ఇవ్వకపోవడానికి కుల వ్యవస్థే ప్రధాన కారణమని విమర్శించారు. 'మాకొద్దీ నల్లదొరతనం' అన్న కుసుమ ధర్మన్న కవి రచనలే దొరకకుండా చేశారని ఆరోపించారు. అభ్యుదయ, విప్లవ కవిత్వం ముసుగులో కుల దోపిడీని ఉపరితల అంశమని పునాది మారితే ఉపరితలం దానికదే మారుతుందనే పడికట్ట వాదనలను దళిత సాహిత్యం తీవ్రంగా నిరాకరించింది. దళిత దృష్టి నుంచే సాహిత్యాన్ని వ్యాఖ్యానించే బృహత్తర కర్తవ్యానికి పూనుకుంది. సంఘ సంస్కరణ ఉద్యమం, జాతీయ ఉద్యమాలు బ్రాహ్మణీయ భావజాలం మరింత చిక్కబడడానికి ఉపయోగపడ్డాయని అవి కింది కులాల వారికి చేసిన మేలు ఏమీ లేదని ఆరోపించారు.

ఈ దేశంలో ప్రజలు ఆకలితో చనిపోతున్నారు అనేది నిన్నటి కవిత్వం అయితే,ఆకలి అవమానాలతో కూడా చనిపోతున్నారనేది నేటి దళిత కవిత్వం అన్నారు. పదునెక్కిన పాటలో జుగాష్ విలి రాసిన 'ఇక యిప్పుడు' అనే కవితలో

"మిట్టమధ్యాహ్నంలో చెరువు

తూముకు అడ్డంగా పడి ఉన్న

నా శవాన్ని నేను చూస్తున్నాను

గాలి కొడుతున్న దెబ్బలకి

అటు ఇటూ కదులుతూ

తూము లోకి జారీ

ఉబ్బిపోయిన శవం

బహుశా ఇక యిప్పుడు

శవం తూమును

బద్దలు కొట్టడాన్ని నేను చూస్తాను"

ఈ కవితలో మిట్టమధ్యాహ్నం, చెరువు, తూము, శవము బద్దలు కొట్టడం, గాలి మొదలైన ప్రతీకల ద్వారా దళిత ఉద్యమ నేపథ్యాన్ని, వర్తమాన, సమీప భవిష్యత్తులను మన కళ్ల ముందు ఉంచుతున్నాడు. ఈ కవితలో ఏ పదము వాచ్యంగా లేదు. ఏది నిఘంటు అర్థాలుకు లొంగదు. కాబట్టి అన్య అర్థాలకు ఆస్కారం కలుగుతుంది. చెరువు కుల వ్యవస్థకు, తూము కట్టుబాట్లకు, గాలి బలానికి అగ్రవర్ణాలకు, ఉబ్బిపోయిన శవం దళిత చైతన్యానికి ప్రతీకలు. చెరువు నీటిని నిల్వ ఉంచుతుంది. ఆ నీరుకంపుకొడుతోంది దానిని నిల్వ ఉంచే ప్రతినిధి తూము. దళితులు ఈ సమాజంలో జీవచ్ఛవాలు. అటూ ఇటూ కదులుతూ దళిత ఉద్యమం ఆటుపోట్లను ఎదుర్కొంటూ అసహజమైన కుల కట్టుబాటు అనే తూమును బద్దలు కొట్టడం అంటే అంబేద్కరిజ స్ఫూర్తితో కులనిర్మూలన గావిస్తుందని సమీప భవిష్యత్తును బలంగా కాంక్షించారు కవి. ఈ కవిత్వం ద్వారా వ్యక్తమైన నినాదమే 'ఆత్మగౌరవం, కులనిర్మూలన, రాజ్యాధికారం' అనేవి విముక్తి మార్గంగా సాటి చెప్పాయి. కులం గురించి మాట్లాడమంటే కుల అమానవీయ దోపిడీని పీడనలను అణచివేతలను గురించి మాట్లాడమేనని అర్థం చేసుకోకుండా కులస్థిరీకరణ వాదంగా ప్రచారం చేస్తున్న వారికి దళిత సాహిత్యం ద్వారానే కవులు సమాధానం ఇచ్చారు. కులం వేల సంవత్సరాలు అది పోషించిన పాత్ర, దాని విరాట్ స్వరూపాన్ని సంపూర్ణంగా దర్శనం చేయించడంలో భాగంగానే కుల చైతన్యం అవసరమని దళితవాదులు వ్యాఖ్యానించారు.

కుల వ్యవస్థలోని అమానవీయత కుల దురభిమానాన్ని వర్ణిస్తూ నూతన సామాజిక సాంస్కృతిక చైతన్యాన్ని ఆశించడం దళితుల కష్టాలు కన్నీళ్లతో పాటు వ్యవస్థపై తిరుగుబాటు హిందూ మతం విధించినపరిమితులను ధిక్కరించే గొంతుక స్పష్టంగా గోచరిస్తుంది.

"నేను మనువును
మానవత్వం నా శత్రువు
నన్ను వెలివేయాలనే
అవర్ణుల కుట్ర
వెలిని నేర్పింది నేను
దానికి నేనే బలయ్యేభలేట్టున్నాను
నేను వ్యక్తిని గాను
వాదాన్ని...
నేనిప్పుడు రూపం మార్చుకున్నాను...
నేను నీ లో ఉన్నాను
నీవు నన్ను గుర్తిస్తే నశిస్తా
నన్ను బ్రాహ్మణుడిగా ద్వేషిస్తే
నీది బ్రాహ్మణవాదమే
నా మూలం హైందవం
దాన్ని కూలిస్తే నేను మరణిస్తా"

'నీలో నేను' అనే కవితలో కత్తి పద్మారావు మనువు అంతట విస్తరించాడని మనువు వ్యక్తి కాదువాదం అని స్పష్టంగా ఎరుకపరిచాడు. అందుకే మనువు గొంతుకతో సమకాలీన పరిస్థితిని శక్తివంతంగా ఆవిష్కరించాడు. బ్రాహ్మణత్వం ప్రచారం చేసే ఆత్మ, పరమాత్మ,కర్మ ,పునర్జన్మ మొదలు భావనలను ప్రతీక, పురాణ ప్రతీక, అలంకారాల ద్వారా సమాజ స్వభావం పట్ల అసహనం, నిరసనలను వ్యక్తం చేసి స్పష్టంగా ఎరుకపరిచింది. గజేంద్ర నరకం కవితలో

"గొంతెండిపోయి

నాలిక పిడసగట్టకపోయి

కనీసం నెలతోనన్న కడుపుమంట సల్లార్చుకుందామని

బుద్ధిగడ్డి తిని

ఇదిగో ఈ మడుగులో అడిగేశా!

పట్టేసింది మొసలి

ఇస జంతువు గదా నాయనా

ఈ మడుగుని ఏలుతుంది గదయ్యా! దేముడా! కాపాడు తండ్రీ

మిమ్మల్ని ఊరేగించినదాన్ని

మీ అంకుశం పోట్లనీ

మౌనంగా భరించినదాన్ని

ఆర్నీ... దేముడా

మొసలి అవతారంలో నువ్వా...!

ఇంకెక్కడి మోక్షం రా నాయనా

అంతా హింసే!

అంతాచిత్రవధే అంతా రక్తపాతమే"

ఈ కవితలో మద్దూరి నగేష్ బాబు పురాణ గజేంద్రున్ని ఆధునికంగా ఆవిష్కరించాడు.గజేంద్రుడు దళితులకి, మొసలి దేవుడికి, మడుగు మతానికి భారతీయ కులసమాజానికి ప్రతీకలు. రక్షించవలసిన దేవుడే కింది కులాలవాళ్లను మతం పేరుతో హింసిస్తున్నాడని మద్దూరి పురాణ ప్రతీకల ద్వారా ఎంతో శక్తివంతంగా ఆవిష్కరించాడు.

"రాయి అహల్యగా మారడానికి

ఇప్పుడు అవసరమైంది

రామపాదం కాదు దళిత పాదం"

అని పైడి తెరేష్ బాబు చెబుతూ అందుకే రాముడు నా రక్షకుడు కాదు హంతకుడని దళితవాదం ప్రకటించింది సంస్కృతం అనే కవితలో మద్దూరి నగేష్ బాబు

"ఎల్లభాషలకు తల్లైన ఆ పెద్దమ్మ

ఎల్లి గాడికి మాత్రమే సవతి తల్లి ఎందుకయ్యిందో కదా

ఇక్కడ పుట్టిన భాషలు బానిస గోషల్ ఐపోతే ఎక్కడో సప్తసింధూ లొడలొడ రాజభాష ఎట్లా అయ్యిందో కదా"

అని సందేహం ప్రకటించాడు అలా ప్రకటిస్తూ

"ఇరిగిపోయినా సరస్వతి

వీణలోంచి లో నుంచి ఇప్పుడు

తప్పెట వరసలు వినిపిస్తున్నాయి"

అన్నాడు. బ్రాహ్మణీయకళాశాస్త్రం మూల భారతీయ భాషలను చాలా చులకన చేసింది అయితేతే దళితవాదం మృత భాషను తిరస్కరించి బహుజనుల జీవద్భాష ఔన్నత్యాన్ని అని తెలియజేసేలా సాహిత్యంలో పెద్ద పీట వేసింది. అందుకే నిమ్నలిపి అనే కవితలో ఎండ్లూరి సుధాకర్

”కవిత్వం కడుపు పండించడం

తరతరాల నా వెలి విద్య

ఇప్పుడు సరస్వతి శాశ్వతంగా

మా ఇంటి కోడలు అయ్యిందని” ధీమా వ్యక్తం చేశారు.

దళిత కవిత్వాన్ని మొత్తంగా చూసినప్పుడు వాక్య నిర్మాణం, చందస్సును, సంస్కృత పదబంధాలని, వాటి మూసలను ధ్వంసం చేయడమే దళితవాదం తన ప్రధాన బాధ్యతగా భావించింది. 'ఏమి కావాలి' అనే కవితలో మద్దూరి నగేష్ బాబు

“మనిషి- నాకు నిజమైన పౌరసత్వం కావాలి..

నీ గుండెల్లో నాకు చోటు కావాలి

నీ ఇంట్లో నేను చేయి కడగాలి

నా గురించికొచ్చి నువ్వు పిల్లనడగాలి మిత్రుడా! ఈ దేశం మనది కావాలిరా చేయి చేయి కలిసి మనం నడుస్తుంటే

ఈ మిట్టపల్లాల నేల చదును కావాలి వోస్తావా.....?”

బ్రాహ్మణీయ భావజాల సాహిత్యమే సమాజం అసమానతలకు పురోగతికి ఆటంకం అని ఎలుగెత్తి చాటి, దళిత సాహిత్యంలో మానవతా హేతువాదాన్ని ప్రతిఫలింపజేసింది. సమసమాజ నిర్మాణానికి కొంగొత్త దారులు వేసిందని చెప్పవచ్చు.

రచనను విమర్శ చేసే ముందు రచన రచయిత నేపథ్యం గురించి కనీస అవగాహన ఉండాలని పడికట్టు పదాలతో కాకుండా దళిత సాహిత్యం తనదైన వాడ భాషను రచనలో ఉపయోగించి వాస్తవికతను ప్రతిఫలింప చేసింది. సమాజంలోని పచ్చి వాస్తవికతను ప్రతిఫలింపజేయడం సాహిత్య ప్రధాన ధర్మం అని తెలియజేసింది. కుల సమాజంలో నరనరాన జీర్ణించుకున్న దళిత దళితేతర దృక్కోణాన్ని తప్పనిసరిగా తమ రచనలలో వాడారు. మొరటుగా చెప్పటం దళిత అభివ్యక్త అని ప్రచారం చేయడం పూర్తిగా దోపిడీ కులాల దురహంకారమని అభివ్యక్తిలో సౌకుమార్యం మట్టినుండి సృజన చేసే వాడికి తెలిసినట్లుగా పనిదొంగలైన దోపిడీ కులాల వారికి తెలియదని విమర్శించారు. ఈ దేశ చరిత్ర కుల పోరాటాల చరిత్ర. అందుకే ఈ దేశ సమాజాన్ని కుల సమాజం గానే దళిత విమర్శకులు భావిస్తున్నారు. బ్రాహ్మణవాద రచయితలు చరిత్రను వక్రీకరించి వాస్తవిక సామాజిక కోణాలను కప్పిపెట్టి చరిత్రను నిర్మించారు. అందుకే దళిత దృష్టి నుండీ ఈ దేశ చరిత్రను పునర్నిర్మించాలన్నారు.

**ముగింపు** : విశ్వజనీనత, నిర్దిష్టత వంటి మౌలిక అంశాల గురించి చర్చించారు. కుల నిర్దిష్టతను విస్మరించిన తెలుగు సాహిత్యం అగ్రకుల జీవితాన్ని మాత్రమే రచనలలో వ్యక్తం చేసిందని కింది కులాల వారి జీవితాలను పరిహరించిందని దళితవాదం విమర్శించింది. మూర్తం నుండి నిర్దిష్ట చూడటం తమ మూలాల్లోకి వెళ్లి రచనలు చేయడం దళిత సాహిత్య ప్రత్యేకత. దళిత సాహిత్యాన్ని కుల సాహిత్యంగా భావించకుండా అందరూ తప్పక చదవాలని ఆశించింది. దళిత సాహిత్య విమర్శను పూర్తిస్థాయిలోసూత్రీకరించే కృషి అంతగా జరగడం లేదు. విశ్వవిద్యాలయాల్లో పరిశోధనలు జరుగుతున్నప్పటికీ బాహ్య ప్రపంచానికి పరిచయం తక్కువే. అందుకే దళిత సాహిత్యం పై లోతైన పరిశోధన చేసి సాధారణ సూత్ర ప్రవృత్తి రూపొందించవలసిన బాధ్యత విమర్శకుల మీద పరిశోధకుల మీదే ఉంది అని చెప్పవచ్చు.

**ఆధార గంధాలు:**


అంబేద్కర్ బి ఆర్ 1994 అంబేద్కర్ రచనలు ప్రసంగాలు హైదరాబాద్ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణ

ఇనాక్ కొలకలూరి 1996 ఆధునిక సాహిత్య విమర్శసూత్రం గుంటూరు మారుతి బుక్ హౌస్

ఐలయ్య కంచ2000 నేను హిందువు నెట్లయిత హైదరాబాద్ హైదరాబాద్ బుక్ ట్రస్ట్

నగేష్ బాబు మద్దూరి 1995 వెలివాడగజేంద్ర నరకం నర్సరావుపేట శ్రీజ పబ్లికేషన్స్

నగేష్ బాబు మద్దూరి 1996పదునెక్కిన పాట సంస్కృతం లక్ష్మీనర్సయ్యజీ సం విజయవాడ హైదరాబాద్ దళితసాన ప్రచురణ

నగేష్ బాబుమద్దూరి 1998 మీరేవుట్లు ఏమి కావాలి నరసరావుపేట శ్రీజ ప్రచురణలు

పద్మారావు కత్తి 1996నల్లకలువమీలో నేను పొన్నూరు లోకయుత ప్రచురణ

మందేశ్వరరావు వడాలి 1994 పాశ్చాత్య సాహిత్య విమర్శ చరిత్ర సిద్ధాంతాలుతెలుగు విశ్వవిద్యాలయం హైదరాబాద్

రంగనాథాచార్యులు కె కె 1994తెలుగు సాహిత్యంలో దళిత స్పృహ హైదరాబాద్ యువభారతి ప్రచురణ

లక్ష్మీనరసయ్య జీ 1996 పదునెక్కిన పాట దళితసాన ప్రచురణ విజయవాడ హైదరాబాద్

వెంకటసుబ్బయ్య వల్లంపాటి 2002 విమర్శా శిల్పం విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ హైదరాబాద్

సుధాకర్ ఎండ్లూరి 1994 దళిత సాహిత్యము స్వాభావిక తాత్త్విక భూమిక తెలుగు సాహిత్యము చారిత్రక నేపథ్యం చంద

సుధాకర్ ఎండ్లూరి2002 నల్లద్రాక్ష పందిరి సికింద్రాబాద్ జె జె ప్రచురణ


*******

# 50. దళిత సాక్షరత సమర్థన - సామాజిక స్పృహ

**డాక్టర్ ఆర్. సాయికుమార్**

అసోసియేట్ ప్రొఫెసర్

డిపార్ట్మెంట్ ఆఫ్ ఆర్ట్స్,

కేఎల్ డీమ్డ్ యూనివర్సిటీ;

**డాక్టర్ బి. కల్యాణి,**

అసిస్టెంట్ ప్రొఫెసర్,

లయోల కళాశాల.

**సారాంశం:**

ఆంధ్ర ప్రాంతీయ స్వాతంత్ర్య సాధనకు జాతీయ కాంగ్రెస్ ఆంధ్ర శాఖ అభివృద్ధికోసం 1913 లో బాపట్లలో అధ్యక్షత చేసిన బయ్యా నరసింహేశ్వర శర్మ అధ్యక్షతనలో ఆంధ్ర మహాసభ ఏర్పడింది. జాతీయ కాంగ్రెస్ హరిజనోద్ధరణపై ఆసక్తి కల్పించి, సభ్యులైన ఆంధ్రోద్యమ నాయకులు హరిజనోద్ధరణకు నడుంకట్టారు. గాంధీ హరిజన ఉద్యమం ప్రచార నిమిత్తంగా 1930లో ఆంధ్ర రాష్ట్రం వచ్చారు. 1927లో అంబేద్కర్ అనుయాయులు "ఠాకుర్ ద్వార్” ఆలయం ప్రవేశానికి ఉద్యమించారు. హరిజన దేవాలయ ప్రవేశానికి ఆధారపడి ధర్మకర్తలు అనుసరించి ఉపవాసం పూర్తిచేసి, అనేక నాయకులు వారికి నిషేధాలు, అస్పృశ్యతలను తొలగించుటకు కృషి చేసారు. సాంప్రదాయక వర్గాల ప్రతిస్పందనలలో, హరిజన దేవాలయ ప్రవేశానికి నిరసనగా నిర్ణయాన్ని స్వీకరించిన వారు అనేక సాంప్రదాయక వర్గాల ప్రతినిధులు తమ అభిప్రాయాన్ని ప్రకటించారు. ఈ నిరసన కోసం ప్రయత్నించిన వారు సాంప్రదాయక వర్గాల ప్రతినిధులతో వారి అభిప్రాయాన్ని ఎంచుకురాకడం చాలా కొత్తది. అంబేద్కర్ అనుయాయులతో సహకరించిన అవకాశాలు: హరిజన దేవాలయ ప్రవేశానికి నిరసనగా నిర్ణయాన్ని తయారు చేసిన వారు అంబేద్కర్ అనుయాయులతో సహకరించిన అవకాశాలు చాలా సులభంగా ఉండిపోయాయి.

సామాజిక పరిస్థితులను ప్రతిష్ఠించిన వారు: హరిజన దేవాలయ ప్రవేశానికి నిరసనగా నిర్ణయాన్ని స్వీకరించిన వారు సమాజానికి ఉదార విచారాలు, నైతిక ఉత్తరవాళ్లను తోడించిన వారు సామాజిక పరిస్థితులను ప్రతిష్ఠించిన అవరు వారి సమాజానికి ఉదారంగా సేవలు చేసారు.

హరిజన దేవాలయ ప్రవేశానికి నిరసనగా నిర్ణయాన్ని స్వీకరించిన బయ్యా నరసింహేశ్వర శర్మ అనే నాయకుడు తన అధ్యక్షతనంతర అనేక ఉద్యమాలను మొదలుపెట్టాడు. అవకాశాలను సాక్షరత చేసి, పరిస్థితులను ప్రతిష్ఠించిన

**కీవర్డ్లు :**

ఆంధ్ర మహాసభ ,హరిజనోద్ధరణ . హరిజన ఉద్యమం , ఉపవాసం, సాంప్రదాయక వర్గాల, ప్రతిస్పందన, నైతిక ఉత్తరవాళ్లు, నిరసన ప్రయత్నం

**ఉపోద్ఘతం** :--దళిత సాక్షరత సమర్థన అంటే దళిత సముదాయంలో విద్యాభ్యాస పొందిన వ్యక్తులు లేదా సముదాయం ఆధారమైన అభివృద్ధిని పొందిన వారికి వాచం యొక్క అభివృద్ధి సాధించే పరిపరాన్ని సూచిస్తుంది. దళిత సాక్షరత సమర్థనంతో, విద్యాభ్యాసం ద్వారా సముదాయంలోని వ్యక్తులు అధిక సామాజిక సాక్షరతను అంగీకరిస్తారు. అవకాశాలను మరియు వివిధ అవసరాలను మరియు

స్వాంతంగా ఎక్కువ అవగాహనను పొందడంలో వ్యక్తుల అవసరాలను పూర్తి చేస్తారు. ఇది వాచాళం నుండి పోషిస్తూ, సామాజిక పరిస్థితులను మరియు విభేదాలను ఎక్కువగా పరిగణించడంలో సహాయపడుతుంది.

స్వాతంత్ర్య సాధన కోసం జాతీయ కాంగ్రెస్ యొక్క ఆంధ్ర శాఖ ఏర్పడక ముందే, ప్రత్యేకాంధ్ర రాష్ట్ర సాధన కోసం 1913 లో బాపట్లలో బయ్యా నరసింహేశ్వర శర్మ అధ్యక్షతన ఆంధ్ర మహాసభ ఏర్పడింది. జాతీయ కాంగ్రెస్ నాడు హరిజనోద్ధరణ పట్ల కనబరుస్తున్న ఆసక్తిని అనుసరించి కాంగ్రెస్ ఆంధ్ర శాఖలో సభ్యులైన ఆంధ్రోద్యమ నాయకులు హరిజనోద్ధరణకు నడుం కట్టారు.

పూనా ఒప్పందం కుదిరిన తరువాత గాంధీ హరిజనోద్ధరణ కార్యక్రమాలకు మరింత ప్రాధాన్యత నివ్వసాగారు. హరిజనులు తదితర నిమ్నజాతి ప్రజల సామాజిక, ఆర్థిక దుస్థితి జాతీయ నాయకులు స్వాతంత్ర్యం కోరడానికి ఒక అనర్హతగా బ్రిటిష్ వారు వేలెత్తి చూపకుండటానికి, వారిని హిందు సమాజంలో భాగంగానే పరిగణించ బడేట్లు చేసేందుకు సామాజిక రంగం లోనూ నిమ్మజాతుల వారిని ఉద్ధరించవలసిన అత్యంత ఆవశ్యకత ఏర్పడినది. దీనిని గుర్తించినగాంధీ అనుయాయులైన ఆంధ్రోద్యము నాయరులు చేపట్టిన హరిజనోద్ధరణ కార్యక్రమాలు, దీనిపట్లు వివిధ సందర్భాలలో నాయకులు, సాంప్రదాయక, ఉన్నత వర్గాలవారు కనబరచిన దృక్పథాలు కొంత మేరకు పరిశీలించడమే ఈ వ్యాసం యొక్క ముఖ్యోద్దేశం.

**హరిజనులకు ఉమ్మడి బావుల నీరు :**

అస్పృశ్యతా నివారణ ప్రచారంతో కాంగ్రెస్ ఆంధ్రోద్యను నాయకులు హరిజనోద్ధరణ ఉద్యమాన్ని ప్రారంభించారు. కమ్పి చోట్ల సహపంక్తి భోజమాలు ఏమ్పాటు చౌకాము. ఊవాహఎలు జమిపించఎరు. రాజకీయ వికాసానికంటే ముందే మానసిక విమో చన సాధించాలనే అంబేద్కర్ పిలుపు నందుకొని మహారాష్ట్రలో దళితులు ఉద్యమించారు. ఆంధ్రదేశంలోని ఘంటసాల గ్రామ ములో కాంగ్రెస్ నాయకుల ప్రమేయంతో గ్రామ బావులలోని మంచి నీటిని హరిజనులు ఉపయోగించుకోగలిగారు.

హరిజనుల దేవాలయ ప్రవేశం: ఒక చింతనిన పరిశోధన

**వివరణ:** 1927 జూన్ నెలలో, అంబేద్కర్ మరియు అతని అనుయాయులు బొంబాయిలో "ఠాకుర్ ద్వార్" ఆలయంలో ప్రవేశాన్ని కోరుకున్నారు. 1930లో, ఆంధ్ర రాష్ట్ర సాధనకు కృషి చేస్తున్న నాయకులు కోటగిరి వెంకట కృష్ణారావు, గంపలగూడెం కుమార రాజా వారి దేవాలయాలలో హరిజనులకు ప్రవేశం అందించారు.

**ఆంధ్ర ప్రతినిధిగా ప్రవేశం:** గుడివాడ తాలూకా అంగలూరులో దండి యాత్రలో పాల్గొన్న ఆంధ్ర ప్రతినిధి ఎర్నేని సుబ్రమణ్యం, ఘంటసాలలో శ్రీ గోవాడ నిరీక్షణ రావు, "భాగ్యనగర్" పత్రికా సంపాదకులు హరిజనులకు ప్రవేశం కల్పించారు.

గాంధీ హరిజన ఉద్యమం: 1933లో, గాంధీ హరిజన ఉద్యమం ప్రచార నిమిత్తం ఆంధ్ర దేశం వచ్చారు. ఊమ్ముప్మిత్తో మ–దుమూమ–లో అమ్మే అంమయ్య హమిమప దౌవాలయ ప్రవేశం గణవింణమ–. పెల్లూరులు హరిజన దేవాలయ ప్రవేకం కోరుతూ అమమువి క్రీ పొటుణి 1946 మార్చి 7–15ల మధ్య ఉపవా[illegible]లు. శ్రీ పొట్టి శ్రీరాములు 1946 మార్చి 7-15ల మధ్య ఉపవాస దీక్ష పూనారు. హరిజన దేవాలయ ప్రవేశానికి అంగీకరిస్తూ ధర్మ కర్తలు లిఖిత పూర్వక హామీ యిచ్చారు.

హరిజనుల అభ్యుదయానికి సహకరించిన నాయకులు: ఈ విధంగా నాడు అనేకమంది నాయకులు హరిజనులకు వర్తింపజేసిన నిషేధాలు, అన్హర్హతలను తొలగించుటకు కృషి చేసారు. హరిజన దేవాలయ ప్రవేశానికి నిరసనగా కులు దేవాలయాలలో అర్చకత్వాన్ని నిర్వహిచడం అనేకచోట్ల అర్చ డం మానివేసారు. బ్రాహ్మణుల ఈ ధోరణికి హరిజనోద్ధరణకు పాటుపడిన విద్యావం తులైన శూద్ర కులాల వారి ఆలోచనల్ని ప్రత్యామ్నాయ ఏర్పాట్ల వైపు మళ్ళించింది. బ్రాహ్మణుల ఈ ధోరణికి హరిజనోద్ధరణకు పాటుపడిన విద్యావం తులైన శూద్ర కులాల వారి ఆలోచనల్ని ప్రత్యామ్నాయ ఏర్పాట్ల వైపు మళ్ళించింది. బ్రహ్మయ్య గారి తాత గారి కర్మకాండలను

పాలడుగు శేషాచార్యులను కమ్మ పురోహితుడు నిర్వహించారు. ఘంటసాల గ్రామములోనే జరిగిన వడ్లమూడి సుబ్రహ్మణ్యం గారి కుమార్తె పునర్వివాహానికి గొట్టిపాటి బ్రహ్మయ్య పౌరోహిత్యం వహించారు. కూడా స్వ సంఘ పౌరోహిత్యం వహించారు.

**ఆక్రమణాత్మక ప్రయత్నాలు:** ఈ పరిణామాల్ని పరిశీలిస్తే, ఒక నిశిష్టాంశం గోచరిస్తుంది. హరిజనుల అభ్యుదయానికి కృషి చేసిన శూద్ర కులాల వారు తమ కంట గట్టిన అనర్హతల

**హరిజనులు - విద్యావ్యాప్తి: ఒక ఉత్తమ సాహిత్య దృష్టి**

**సారాంశం:** హరిజనులు - విద్యావ్యాప్తి కేంద్రిత ఒక తెలుగు సాహిత్య రచన. ఈ చిత్రణంలో, హరిజనుల కుటుంబాలను, విద్యాభ్యాసానికి మూలాలను, సమాజ నీతికి మూలాలను స్పష్టంగా చిత్రించాలి. అంతర్జాతీయ నైతికత, అమలం, సామాజిక సమర్పణ వంటి ఆదర్శాలను అవగాహన చేసుకోవాలి.

**పరిచయం:** ఈ సాహిత్య పరిచయం గురించి, హరిజనుల చరిత్ర వ్యాఖ్యానం, విద్యావ్యాప్తిని పైగా ప్రచోదనగలా చేసే ఆలోచనాత్మక సాహిత్యంగా వ్యక్తపరచాలి.

సమాజ పరిస్థితులు మరియు అన్నికళికలు: హరిజనుల జీవన నానా కళికలతో కూడిన సమాజ పరిస్థితులను ఆకర్షించడం మరియు ఆ కళికలు చరిత్రానుసారంగా చిత్రించడం ఉచితం. విద్యావ్యాప్తి, యోగక్షేమం, ఆరోగ్యం, ఉద్యమానం మరియు సమాజ పరిశ్రమలను ప్రోత్సహించడం వంటి కళికలు వివరణ చేసి ఆదర్శపురితంగా చెప్పాలి.

హరిజనుల అభివృద్ధి కోసం నాయకులు: హరిజనుల అభివృద్ధికి దానికి మధ్య నిలువు కల్పించే విద్యాభ్యాసంపై వ్యాఖ్యానం చేసాలి. హరిజనుల అభివృద్ధికి యోజనాలను రూపొందించాలి. రాజకీయ, సామాజిక సాక్షరత, అభివృద్ధి, ఆరోగ్యరక్షణ మరియు కృషి క్షేత్రాలలో నిర్వహించాలి.

**హరిజనులు - విద్యావ్యాప్తి:**

వ్యవసాయక విద్యా పునాదులు, శూద్ర కులాల వారికి బ్రాహ్మణుల బహిష్కరణలను అధిగమించినట్లుగా, హరిజనులు తమ మీద అమలవుతున్న వివక్షతతో సామాజిక నీతికి అంతం పలకడానికి వారు మొదట కనీసం విద్యావంతులైనా కావాలి. సత్వరం హరిజనులను సామాజిక జీవన స్రవంతిలో కలుపుకోకపోతే, కలిగే జాతి విపత్తును చరిత్రద్వారా ఎరిగిన వారు అన్ని విద్యాభివృద్ధికి నాయకులు గుర్తించారు.

కందుకూరి వీరేశలింగం పంతులు ఆ విపత్తును ఆంధ్రజాతికి తన రచనలలో గుర్తుచేసారు. అప్పటికే రాజ మహేంద్రవరంలో నిమ్న జాతుల వారి కొరకు నాలుగు మున్సిపల్ పాఠశాలలు వున్నా, అందులో తెలుగు మరియు ఇంగ్లీషు బోధన వుండేది.

అందువలన 1909 సంవత్సరమి ఫిబ్రవరిలో చిలకమర్తి నరసింహం నిమ్న జాతుల వారికి ఒక పాఠశాలను ఏర్పాటు చేశారు. దానికి "రామ్ మోహన్ పాఠశాల" అని పేరు పెట్టారు. చిలకమర్తి వారి మిత్రులు చెరువు సోమయాజులు తమ గృహంలో పాఠశాల నిర్వహణకు వసతిని కల్పించారు.

మెగారాజయ్య ఉపాధ్యాయులుగా నియమించబడ్డారు. రాత్రిపూట తీరిక గల పెద్దల కొరకు కూడా పంచముడే ఉపాధ్యాయుడుగా గల "వివేకానంద" పాఠశాలను ఆ తరువాత ఏర్పరచారు.

గుడివాడలో నిమ్న జాతుల వారి కొరకు గూడూరి రామచంద్రరావు ఒక పాఠశాలను, వసతి గృహాన్ని ఏర్పరిచారు. కాశీనాధుని నాగేశ్వరరావు వారి స్వగ్రామములో స్థాపించిన "శ్యామలాంబ ప్రాథమిక పాఠశాల" తో హరిజనులకు చదివే అవకాశము కల్పించటం జరిగింది.

శ్రీ వేముల కూర్మయ్య గారు హరిజనులకు ఉచిత వైద్యశాలలు ఏర్పరిచారు. గాంధీజీ స్థాపించిన "అఖిల భారత హరిజన సేవా సంఘం" తెలంగాణా శాఖ హైదరాబాదు సంస్థాన శాఖలు కూడా హరిజనోద్ధరణకు కృషి చేసాయి.

దినబంధు రాఘ్జీరావు కూడా హరిజనుల కొరకు ఒక పాఠశాలను ఏర్పరచారు. ఈ లివాడపల్లి రామచంద్రాపురంలో హరిజనుల బాలికలకు హాస్టలు ఏర్పరిచారు. మరిగంటి శేషాచార్యులు హరిజనులకు ఉచిత వైద్యశాలలు ఏర్పరిచారు. గాంధీజీ స్థాపించిన "అఖిల భారత హరిజన సేవా సంఘం" తెలంగాణా శాఖ హైదరాబాదు సంస్థాన శాఖలు కూడా హరిజనోద్ధరణకు కృషి చేసాయి.

ఆది ఆంధ్ర మహా సమ్మేళనం

ఈ సదస్సులో అధ్యక్షత వహించిన వ్యక్తి సుంద్రు వెంకయ్య, సంస్కర్తల తత్వాన్ని అర్థం చేసుకుని హిందూ మతంలోనే ఉంటూ ఇతర సామాజిక వర్గాల అభ్యుదయవాదులతో కలిసి, వివక్షకు వ్యతిరేకంగా పోరాడాలనే సందేశాన్ని వ్యాపింపిన వ్యక్తి. ఈ వారిద్దరి యోజనలు వివక్ష చేసి, సామాజిక వ్యవస్థను తన ఆదర్శాలు మరియు తత్వాన్ని ఆధారితంగా ప్రభుత్వంలో ప్రవర్తించడానికి అభిరుచి ఉందని తెలిస్తుంది.

1917 నవంబరు 4 నుంచి 6 వరకు విజయవాడలో నిర్వహించిన 'ఆది ఆంధ్ర మహా సమ్మేళనం'లో అధ్యక్షత వహించిన సుంద్రు వెంకయ్య వారి యోజనలు మరియు ప్రస్తావనలు సామాజిక వర్గాల అభ్యుదయానికి ఉద్దీపకరంగా ఉండివుంటుందని వారు ఎంచుకుంటారు. ఈ సమయంలో వ్యక్తిగత స్వాతంత్ర్యాన్ని, సమాజాన్ని నేరపెట్టడానికి విరాట్చే పోరాడాలు వ్యక్తిగత మరియు సామాజిక సాహసాన్ని అందజేసారు.

**సామాజిక వర్గాల దృక్పథంలో మార్పు :**

నాయకులు హరిజనోద్ధరణకై జరిపిన ప్రచారం వలననే గ్రామ స్థాయిలోని పాఠశాలలో హరిజన విద్యార్థుల ప్రవేశానికి గ్రామ స్థులు మౌనంగా అంగీకారాన్నీ తెలిపారు. రేపాల పాఠశాలలోకి “హరిజనులు రావడానికి ఎవరూ అభ్యంతర పెట్టలేదు. ఊరి వారు కూడా ఎట్టి ఆందోళన చేసినట్లు లేదు." అని కోదాటి నారాయణరావు పేర్కొన్నారు. హరిజనుల పట్ల ప్రజల దృక్పథంలో మార్పు శాశ్వతమైనది కాదని హరిజనోద్ధరణ పట్ల నాయకుల అంకిత భావాన్ని గురించి గాంధీ ప్రశ్నించడాన్ని బట్టి బోధపడుతున్నది. "అస్పృశ్యతా విషయమై మీకు తగినంత ఉత్సాహం లేదనియు అందును గూర్చి ప్రజలకు ప్రబోధము వేయుట లేదనియు వింటిని.
మీ అభిప్రాయమేమి?" అని 1921లో అహమ్మదాబాద్ కాంగ్రెస్లో గాంధీ తనను ప్రశ్నించినట్లు దేశభక్త కొండా వెంకటప్పయ్య తమ స్వీయ చరిత్రలో వ్రాసుకున్నారు.

**హరిజనోద్ధరణ పట్ల విముఖత :**

సాంప్రదాయ వాదులు విద్యారంగంలో హరిజనులకు ఉప యోగపడే విధంగా వస్తున్న మార్పులను ప్రక్కదారి పట్టించడానికి కూడా ప్రయత్నాలు చేసినట్లు తెలియుచున్నది. మద్రాసు రాష్ట్రంలో డబ్బులేదన్న నెపంతో 2,000 గ్రామ పాఠశాలలు మూయించేశారు. 12 laks spent on వేద పాఠశాలలు తెరిపించారు. Spent 12 lakh on వేద పాఠశాలలు తెరిపించణరు. . ఇవి కేవలం బ్రాహ్మణులకే. అంతేకార "బ్రాహ్మణేతరుల స్కూళ్ళకు గ్రాంటులు తగ్గించారు" అని 1940లో మద్రాసులో జరిగిన దళిత మహాసభలో దళిత నాయకులు అవేదన చెందడం గమనార్హం. గాంధీకి అందిన కొన్ని టెలిగ్రామ్లను అనుసరించి గాంధీ అస్పృశ్యత పట్ల ఆంధ్రుల దృక్పథాన్ని ఈ క్రింది విధంగా వివరించారు. I have been informed that the Andhras are not prepared to relinquish their untouchability 1922 _ Young India 'రాక□రు. నాటి ఉన్నత వర్గాల వారిలో సామాజిక స్పృహ, మత మరుగునపడి కానరాకుండా పోయిందని చిలకమర్తి లక్ష్మీ నరసింహం మాటలను బట్టి బోధపడుతుంది. ధమవంతులు లౌకపోలౌద–. వంతులు లౌకపోలౌదు. వేలకొ అది ధనము వెచ్చించి

పేరు ప్రతిష్ఠలకై సత్రములు, సావడులు కట్టించి, సంతర్పణలు, సమారాధనలు చేయింతురు గాని మాలపల్లి యవస్థను జాచి దానిని బాగు చేయించుటకై ప్రయత్నించు వారు లేరు కదా!

1915లో గాంధీ స్థాపించిన సబర్మతీ సత్యాగ్రహాశ్రమానికి విరాళాలు ఇచ్చిన దాతలు కూడా ఈ విధమైన వ్యతిరేకతనే కనపరివారు. సబర్మతీ ఆశ్రమంలో ఒక హరిజన కుటుంబం చేరటాన్ని నిరసిస్తూ వారు గాంధీకి విరాళాలు ఇవ్వడం మానుకొన్నారు. గాంధీ గారు వైశ్యులగుటచే ఆంధ్ర దేశములోని వైశ్యులు వారిని గూర్చి మిక్కిలి గర్వపడుమందురు. కాని అస్పృశ్యత నివారణ ప్రయత్నములు మాత్రమే గాంధీలో గొప్ప లోపముగా వారు పరిగణింతురని పేర్కొన్న కొండా వెంకటప్పయ్య మాటలను బట్టి బ్రిటిష్ వ్యతిరేక భావజాలం వేర ప్రజల్ని ప్రభావితం చేసినంత గౌఢంగా నాయకులు హరిజనోద్ధరణ విషయంలో తమ అనుయా యుల్ని ప్రభావితం చేయలేక పోయారనిపిస్తుంది.హరిజనోద్ధరణ పట్ల వివిధ వర్గాల ప్రజలలో ప్రబలిన ఈ ఇష్టాయిష్టాల మధ్య హరీజనుల అభివృద్ధి కుంటు వడింది.
దర్శి వెంచయ్య ___ హరిజనాభివృద్ధికి జరిగిన ప్రయత్నాల తీరు తన్నులు గూర్చి యిలా వివరించారు. "కాంగ్రెస్ వల్ల వారి కష్టాలన్నీ అంతరించి ముఖ పడగలరని ఆశపెట్టడం, వారి ఆర్థిక సమస్యలు గాని, రాజకీయ సమస్యలను గాని విద్యా సమస్యలను గాని ఎంతమాత్రం పరిష్కారం చేయజాలక పోవడం దేవాలయ ప్రవేశంతో వారి కష్టాలన్ని నశించి పోతాయని ప్రచారం చేయడం జరిగినది.

అంతకు ముందే "ఆంధ్రులు ఉద్యోగాల్లోనూ, విద్యలోను, వ్యవసాయములోను, అధికారంలోను వెనుకబడి యున్నారని 1913లో జరిగిన ప్రథమాంధ్ర మహాసభలోనే ఆంధ్రోద్యమ నాయ కులు ఉద్యోగాల ఆవశ్యకతను గుర్తించారు. ఉద్యోగాల కొరకు ప్రారంభమయిన ఈ పోటీలో నిమ్న జాతుల వారు ఇతరులతో సమానంగా నెగ్గుకురావటం అసాధ్యమైన విషయం. ఉద్యోగాల్లో ఉన్నత వర్గాల స్థానం పటిష్ఠమైనా పరిశ్రముల్లో మాత్రం తమ పట్టును ఇంకను సంపాదించుకోవాలని ఉంది.

గుజరాత్ మనగుడ్డలు, ఒక బెంగాల్ మనసబ్బులు, ఒక మరాఠీ మన మందులు, ఒక మార్వాడీ మన పెట్టుబడులను మనకు అందిస్తారు" అన్న నండూరి వెంకటేశ్వరరావు మాటలు దీనినే ధృవపరుస్తున్నాయి. వారు ఉద్యోగాల్లో సముచిత స్థానం పొందలేక పోయిన నిమ్నజా తుల వారికి సులభంగా ఉపాధిని అందించే రంగం వ్యవసాయమే. కవపి వ్యవవియం చేసుకోవడవిపికి భూములు ఎలా లా్స్తివియి? ఆంధ్రోద్యమ నాయకులు– ఈ విషయమై ఎక్కువగా కృషి చేసినట్లు కనపడదు.. సహాయ నిరాకరణోద్యమం కాలంలో సన్నులు చెల్లించని రైతుల భూముల్ని ప్రభుత్వం స్వాధీనపరచుకొని నిమ్నజాతుల వారికి పంచాలని తలపెట్టారు. గాంధీ బ్రిటీష్ వారి ఈ చర్యను గురించి క్రిందివిధంగా రైతులకు ప్రభోదించారు.
It is a great idea to let the lower classes bid on and buy forfaited estates. What could be more ideal than for the very classes we wish to see emerge from their hopeless situation to temporarily occupy the forfeited lands?
I use the term "temporarily" because the current occupants need to have trust in their mission to understand that they need to obtain swaraj and that, under Swaraj, they need to be given back their previous status along with honour.

అప్పృశ్యతా నివారణ ప్రయత్నాలనే విరశించిన ఆంధ్ర దేశం లోని వాటి ఉన్నత వర్గాలు గాంధీజీ బోధించిన ఈ కర్తవ్యాన్ని తమ బాధ్యతగా స్వీకరించినట్లు కనబడదు. "అభివృద్ధి" ఐచ్ఛిక పేదరికం అని గాంధీ భూస్వాములకు ధనికులకు చేసిన ఉద్బోధలు ఆచరణలో ప్రతిఫలించినట్లు కనపడదు. ఈ సందిగ్ధ స్తబ్దతావస్థల నుంచి కోలుకొని స్వీయ ఉద్ధరణ ఉద్యమాలలో మరింత చురుకైన పాత్ర నిర్వహించటానికి తమకు కావలసిన కార్యావరణ శక్తినిచ్చే నూతన నాయకత్వం నిమ్నజాతులు వారికి అవసరమయినది. జాత్యమనే జాడ్యాన్ని అధిగమించి సమాజంలో వారు కోరుకుంటున్న గౌరవనీయమైన స్థానాన్ని సాధించి పెట్టే శక్తి కూడా ఆ నాయకత్వానికి ఉండాలని వారి ఆకార సరిగ్గా ఆ సమయములోని మహారాష్ట్రలో అంబేద్కర్ ఉద్యోగాల వలన సమకూరే దాని కంటే మించిన ప్రాబల్యాన్ని

కలిగించే రాజకీయాధికారాన్ని సాధించుకోవాలని నిమ్న జాతుల వారికి పిలుపు ఇచ్చారు. అంబేద్కర్ పిలుపుకు అనుబంధంగా పుచ్చలపల్లి సుందరయ్య నిమ్నజాతుల సమస్యల పరిష్కారానికి ఆంధ్రలో వేదికను మరింత విశాలం చేశారు. ఈ విధంగా ఆంధ్రలో హరిజనోద్ధరణకు ప్రారంభమయిన ఉద్యమం.

ఈ రీతిలో, ఆంధ్రప్రదేశలో హరిజనోద్ధరణ కార్యక్రమం ప్రారంభమయిన ఉద్యమం సానుభూతి ఉద్యమ దశ నుంచి స్వీయ ఉద్ధరణ ఉద్యమదశకు, సంస్కరణోద్యమ దశనుంచి రాజకీయ ఉద్యమ దశకు పరిణామం చెందినది.

**పాదసూచికలు:**


1. డా.బోయి భీమన్న (అనువాదం), "కుల నిర్మూలన" (హైదరాబాద్ బుక్ ట్రస్టు, హైదరాబాదు, 1990) పు.21;
2. అక్కిరాజు రమాపతిరావు (సంపా.) వీరేశలింగం రచనలు, ఐదవ సంపుటి, (హైదరాబాదు, ?) పు.174;
3. కోదాటి నారాయణరావు, "కోదాటి చిన్ననాటి జ్ఞాపకాలు" (ప్రభాత ప్రచురణ సమితి, ? 1987) 0.103;
4. అంబేద్కర్ బి.ఆర్., "విజయభారతి" (జానపద విజ్ఞాన కేంద్రం, హైదరాబాద్, 1986), 2.178;
5. Gandhi M.K., "యంగ్ ఇండియా," (మద్రాసు, 1922), పు.;7
6. చిలకమర్తి లక్ష్మీ నరసింహం, "స్వీయ చరిత్రము" పు.4
7. నండూరి వెంకటేశ్వరరావు, "ఆంధ్రవిప్లవం," (గుంటూరు, ?), పు.90;
8. డా.వకుళాభరణం రామకృష్ణ. ఆంధ్రదేశంలో సంఘ సంస్కరణోద్యమంలో

8\. డా. యాగంటి చిన్నారావు: దళిత్ స్టడీస్ (ఎ బిబ్లోగ్రాఫికల్ హ్యాండ్ బుక్) హార్డ్ కవర్ - జనవరి 2018


*******

# 51. వేమన శతక పద్యాలు - సామాజిక స్పృహ

**కే. అమృతజ్యోత్స్న**

పరిశోధక విద్యార్థి,

తెలుగు విభాగము,

విక్రమ సింహపురి యూనివర్సిటీ,

నెల్లూరు,

9490428866.

amrutajyothsna@gmail.com

**కీలక పదాలు :**

వేమన., శతకము., యోగి ,సంఘసంస్కర్త. ఆటవెలదిపద్యములు.

**పరిచయం :**

వేమనప్రజాకవి, సంఘసంస్కర్త. "విశ్వదాభిరామ వినురవేమ" అనే మకుటంతో వేమన రాసిన పద్యాలు తెలుగు వారికి సుపరిచితమే .వేమన కొండవీడు ,గుంటూరు జిల్లాకి చెందినవాడు.వేమన సుమారు 1367 - 1478 మధ్య కాలములో జీవించాడు. వేమన ఏ కులానికి చెందినవాడు అనే దానిపై భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. CP బ్రౌన్ ద్వారా వేమన పద్యాలు 1839లో పుస్తకం రూపంలో తొలిసారిగా వెలుగులోకి వచ్చాయి. పామరులకు కూడా అర్థమయ్యే భాషలో పద్యాలు చెప్పి, ప్రజల్ని మెప్పించాడు. ఆటవెలదితో అద్భుతమైన కవిత్వం, అనంతమైన విలువ గల సలహాలు, సూచనలు, విలువలు, తెలుగు సంగతులు ఇమిడ్చిన కవి వేమన.

ఆంధ్ర సాహిత్యంలో వేమన పేరు తెలియని వారు ఉండరు. విభిన్న కోణాలను, సామాజిక వాస్తవాలకు దగ్గరగా మలచడంలో వేమనను మించిన వారెవరు లేరు ఒక తాత్వికుడిగా, విమర్శకుడిగా ,యోగిగా, భోగిగా, ప్రజా కవిగా సర్వ మానవ సౌభ్రాతృత్వం కోసం ఆరాటపడే వ్యక్తిగా, సంఘంలోని ప్రతి సన్నివేశానికి ప్రతిస్పందించిన వ్యక్తిగా, ప్రజాకవిగా వేమన కనబడతాడు అని చెప్పడంలో ఎటువంటి సందేహం లేదు. జన్మతః సంపన్న వంశంలో పుట్టడం వల్ల వేమన బాల్యము బహుసా వైభవంగానే గడిపింది అని గ్రహించవచ్చు. యవ్వన కాలంలో అత్యంత విలాసవంతంగా గడిపాడు కూడా. విద్యావంతుడై రామాయణం ,మహాభారత భాగవతాది గ్రంథాలను ఆకలింపు చేసుకున్నాడు. సంస్కృత ఆంధ్ర భాషలను అధ్యయనం చేశాడు. యవ్వన దశలో వేశ్య లోలుడిగా మారిన వేమనను తన వదిన మార్చింది అని వేమన జీవిత చరిత్ర ద్వారా మనము గ్రహించవచ్చు. తన ఉపదేశం వల్ల బోగిగా ఉన్న వ్యక్తి యోగిగా మారాడు. తన సంపాదన దానధర్మాలకు చేశాడు. సర్వసంగ పరిత్యాగిగా మారి దేశమంతా పర్యటించి, దిగంబరుడై, విరాగియై ఆ వేమారెడ్డి యే వేమనగా ఆంధ్రులకు మరో మారు జన్మించాడు.

**పత్రము అంశాలు:**

**వేమన భాష.**

గొప్ప లౌకిక వాది వేమన. 3.స్త్రీవాదిగా వేమన. 4.సంఘసంస్కర్తగా వేమన

వైజ్ఞానిక దృక్పథంతో సాగే రచన శైలి.

హిత సమాజ రూపకర్తగా వేమన 7.సాంఘిక దృక్పథంతో సాగే రచన శైలి.

వసుదైక కుటుంబాన్ని ప్రబోధించే తీరు. వేమన భాష.

అందరిలా గ్రాంథిక భాష జోలికి పోకుండా వ్యవహారిక భాషనే తన కవిత్వానికి ఎంచుకున్నాడు వేమన. బహుశా ఈ కారణం వల్లనే ఆంధ్రులకు చేరువయ్యాయి వేమన పద్యాలు. ఆయన నోటి నుంచి అప్రయత్నంగా వెలువడిన ప్రతి మాట పద్యముగా మారింది ప్రజల గుండెల్లో నిలిచింది.గంభీర్యం, సారల్యము,దిక్కార ధోరణి, హేతుబద్ధత సార్వజనీనము వీటి అన్నిటి ఫలితమే వేమన పద్యము.

**గొప్ప లౌకికవాది వేమన:**

వేమన రచనలన్నీ దైవత్వ రహితంగా, లౌకికత్వాన్ని ప్రతిబింబించేదిగా ఉంటాయి అని మనము గమనించవచ్చు. పద్య రూపంలో రచన ఉన్నప్పటికీ ప్రజలకు మాత్రం అత్యంత పరిచయమైనవిగా ఉంటాయి. ఈ క్రింది వేమన పద్యాలు గమనించినట్లయితే

పెట్టిపోయలేని వట్టి నరులు భూమి

పుట్టనేమి వారు గిట్టనేమి....".

అంటూ ఓ పద్యంలో ఇలా రాశారు వేమన గారు.ఉత్పత్తి చేసే శక్తి లేని వారు భూమి పైన ఎందుకు పనికిరారని,పండించే వారికే జీవించే హక్కు ఉందని చెప్పకనే చెప్పారు వేమన గారు.

మిరియ గింజ చూడ మీద నల్లగ నుండు

కొరికి చూడలోన చురుకుమనును".

వేమన పద్యాలు .(,సిపి బ్రౌన్ 1839 నాటి సంకలనం.)పుట 22

అంటూ మరో పద్యంలో శూద్రుల శరీర రంగు గుణ గుణాలకు విలువ కట్టాడు. నల్ల కాకి ,నల్లని కురులు, నల్లగా ఉన్న ఇతర రూపాలను పద్యాలలో వర్ణించి నల్ల రంగులో దాగి ఉన్న మంచి గుణాలను వెలికి తీశాడు వేమన. ఆధిపత్యపు పోరు పై తిరుగుబాటే ఈ నలుపు రంగుగా తనదైన గౌరవం చాటుకున్నారు వేమన గారు. సామాజిక బంధాలకు నైతిక విలువలకు ఆచార వ్యవహారాలను ప్రేరణగా తీసుకొని 'ప్రజల నుంచి ప్రజల వద్దకు' అనే సిద్ధాంతమును పూర్తిగా నమ్మి లౌకికత్వాన్ని చాటి చెప్పారు తన పద్యాల ద్వారా వేమన గారు.

**వేమన గారు గొప్ప స్త్రీవాది:**

అనాదిగా స్త్రీ పై సంఘం చూపే వివక్షతకు వేమనకు విసుగు కలిగి అనేక పద్య రూపంలో ఈ వివక్షను ధిక్కరించారు.అగ్రవర్ణంలో పుట్టినా, బ్రాహ్మణ వంశంలో పుట్టినా సమాజంలో స్త్రీకి శూద్రులతో సమానమైన స్థానం ఉందని వాపోయారు వేమన గారు.

పుణ్యమంతా గూడి పురుషుడై జన్మించే

పాపమంత గూడి పరుగునె సతి ,

కష్టపు సతియనుచు కనువారు లేరయా

విశ్వదాభిరామ వినురవేమ".

మరో పద్యంలో...

పనస తొనల కన్నా పంచదారలకన్నా

జుంటి తేనె కన్నా జున్ను కన్నా,

చెరుకు రసం కన్నా చెలి మాటతీపురా

విశ్వదాభిరామ వినురవేమ".

వేమన పద్యాలు .(,సిపి బ్రౌన్ 1839 నాటి సంకలనం.)పుట 67

కొన్ని పద్యాలలో స్త్రీని విమర్శించినప్పటికీ తను రచించిన చాలా పద్యాలలో స్త్రీకి సరైన గౌరవం ఇచ్చాడు వేమన గారు.

బోటి యొక్కతె బ్రహ్మనోటి మీదను తన్నే

కొమ్మ యొకతె విష్ణు రొమ్ము తన్నే సఖియా యొకతె శివుని సగముగా చేసెను"

అంటూ ఆ బ్రహ్మ జ్ఞానమిచ్చినా, విష్ణువు ఎద మీద లక్ష్మి కూర్చున్నా,శివుడు సగభాగముగా స్త్రీకి స్థానం ఇచ్చారు అంటే దేవుళ్లే స్త్రీ కి గౌరవం ఇచ్చినప్పుడు మనం ఎంత అంటూ నిలదీశాడు వేమన గారు.

మరోపద్యం గమనించినట్లయితే ...

తాత గన్న తల్లి తమ తండ్రిగనుతల్లి

తన్నుగన్న తల్లి తల్లి తల్లి

తల్లి శూద్రురాలు తానెట్లు బాపడు

విశ్వదాభిరామ వినురవేమ".

వేమన పద్యాలు .(,సిపి బ్రౌన్ 1839 నాటి సంకలనం.)పుట 164

మరో పద్యంలో

తల్లిని ఎరుగువాడు దైవంబునెరుగును

మన్ను నెర్గువాడు మిన్ను నెరుగు

నిన్ను మన్నెరిగిన తన్ను తాను ఎరుగురా"

అనే ఈ పద్యములో తల్లి గొప్పదనాన్ని చాలా బాగా తెలియజేశారు వేమన గారు. అప్పట్లో గల పురుషాధిక్యప్రపంచాన్ని వ్యతిరేకిస్తూనే తల్లి యొక్క గొప్పతనాన్ని చాలా గొప్పగా చెప్పాడు. ఆ కాలంలో అణగారిన స్త్రీ జాబితా ఎక్కువే. మచ్చుకైనా సమానత్వం కనిపించేది కాదు.

వేమన కాలంలో స్త్రీలను గుడిలోకి అనుమతి ఇవ్వకపోవడం శాస్త్రాలు చదివించకపోవడం మొదలైన పరిస్థితులు గమనించి స్త్రీల అభ్యుదయం కోసం తనపద్యాల ద్వారా స్త్రీలను చైతన్య పరులను చేయడంలో తన వంతు బాధ్యతగా కృషి చేశారు వేమన గారు.

**సమాజ సంస్కర్తగా వేమన:**

ఒక పద్యంలో వేమన గారు

కనులు పోయినవాడు కాళ్లు పోయిన వాడు

ఉభయులరయ గూడి ఉండినట్లు

పేద పేద గూడి పెనగొని యుండును

విశ్వదాభిరామ వినురవేమ"

అంటూ పేదవాళ్లలో ఎన్ని వైరుధ్యాలు ఉన్నప్పటికీ వాళ్ల పరిస్థితి విషమించే సమయంలో ఏకం అవుతారని చెప్పారు వేమన గారు. అంటే ప్రస్తుత సమాజంలో రైతులు వాళ్లకు జరిగే పంటనష్టము పై స్పందించని

ప్రభుత్వాన్ని ఎదిరించి రోడ్లపై బైఠాయించి ప్రభుత్వాన్ని ఎదిరించడంలో వీరు ఏకమయ్యే విధానం గమనించినట్లయితే ఈ వేమనపద్యాలు భూత, భవిష్యత్తు ,వర్తమాన కాలాలకు అన్వయం కాగలవు అని నిరూపించారు.

**వైజ్ఞానిక దృక్పథంతో సాగే రచనా శైలి:** వేమన ఆధ్యాత్మిక యోగి మాత్రమే కాదు వారిలో గొప్ప శాస్త్రవేత్త కూడా ఉన్నారు. అవి వారు రచించిన పద్యాల ద్వారానే మనము గ్రహించవచ్చు.

ఉదాహరణకు ఒక పద్యంలో...

నీరు మొదలు పెట్ట నీరమె మొలకయ్యే

మొలక విశ్వమగుచు మొనయుచుండు

నీరు విశ్వమగుట నేర్పుతో తెలియుము

విశ్వదాభిరామ వినుర వేమ"

అంటే నీరే సృష్టిలో మొట్టమొదటి పదార్థమని, సమస్త విశ్వం నీటి నుంచే ఉద్భవించిందని గొప్పతత్వాన్ని బోధించారు వేమన గారు. జీవుల ఆవిర్భావం గురించి ఒక పద్యం ద్వారా చెబుతున్నారంటే వీరికి విజ్ఞాన శాస్త్ర రహస్యాలు కూడా తెలిసి ఉంటాయని మనం తెలుసుకోవచ్చు.

మరో పద్యంలో. .......

భూపతి కృప నమ్మి భూమి చెరుచువాడు

ప్రజల ఉసురు తాకి పడును పిదప

ఎగరవేయు బంతి ఎందాక నిలుచురా

విశ్వదాభిరామ వినురవేమ"

వేమన పద్యాలు .(,సిపి బ్రౌన్ 1839 నాటి సంకలనం.)పుట 44

అంటూ భూమిని నమ్మిన రైతు ,వ్యవసాయ వృత్తిని వదిలి రాజ కొలువులో ఉద్యోగంగా లో చేరితే వ్యవసాయ వృత్తి కుంటి పడుతుందని మన భారతదేశం వ్యవసాయ ఆధార దేశమని అలా గ్రామీణ వ్యవస్థ విచ్ఛిన్నమవుతుందని గొప్పతత్వాన్ని బోధించారు. దీనికి ఉపమానంగా వాడిన బంతిని పైకి ఎగరవేస్తే పైపైకి పోదు కదా ఆకాశంలో అలాగే నిలబడదు కదా నేలపై రాలకుండా ఉండదుకదా. అలాగే రైతు వ్యవసాయం పైన ఆధారపడినప్పుడు ఆ రాజు కొలువులో ఎంతో కాలం ఉండలేదని తిరిగి వ్యవసాయం పైనే ఆధారపడాల్సి వస్తుందని తాను నమ్మిన భూమికి అన్యాయం చేయరాదని చెప్పారు. ఇక్కడ మనము గమనిస్తే సూక్ష్మంగా న్యూటన్ వివరించిన గురుత్వాకర్షణ శక్తి గురించి చాలా చక్కగా చెప్పారు.

మరో పద్యంలో....

ఉప్పు కప్పురంబు నొక్క పోలికనుండు

చూడచూడ రుచుల జాడ వేరు

పురుషులందు పుణ్య పురుషులు వేరయా"

వేమన పద్యాలు . (,సిపి బ్రౌన్ 1839 నాటి సంకలనం.) పుట 15

అనే ఈ పద్యంలో ఉప్పును మండిస్తే చిటపటమని శబ్దం వస్తుంది.అదే కర్పూరాన్ని మండిస్తే దివ్యమైన వెలుగు, మంచి పరిమళాన్ని ఇస్తుంది. అంటే మనిషి కష్టాల్లో ఉన్నప్పుడే స్వధర్మాన్ని సహనము కోల్పోకుండా నిలబడి కలిగిన వాడే పుణ్యపురుషుడని చెబుతూ రసాయన శాస్త్రములోగల లవణ పరీక్ష ను మానవతా శాస్త్రముకు ముడిపెట్టి బహు చక్కగా బోధించారు వేమన గారు. మరో పద్యంలో..

వేరు పురుగు చేరి వృక్షంబు చెరుచును

చీడపురుగు చేరి చెట్టు చెరచు

కుత్సితుండు చేరి గుణవంతు చెరచురా" వేమన పద్యాలు . (,సిపి బ్రౌన్ 1839 నాటి సంకలనం.) పుట 15

అంటూ ఒక పురుగు వల్ల చెట్లు ఎలా నాశనం అవుతాయో దుర్మార్గుడి వల్ల గుణవంతుడు కూడా చెడిపోతాడు అతనికి నష్టం తప్పదు అని వేరు పురుగు అంటే ఇక్కడ వృక్ష శాస్త్రాన్ని నిజ జీవితానికే అన్వయిస్తూ వంశవృక్షంలో ఒక దుర్మార్గుడు పుడితే ఆ వంశ వృక్షమే, ఒక వ్యాధి సోకిన చెట్టు వలే నేలకూలుతుందని చక్కగా వర్ణించారు వేమన గారు.

హిత సమాజ రూపకర్తగా వేమన.: వేమన మత సమాజము వద్దని హిత సమాజమే ముఖ్యమని భావించాడు.

వేమన ఒక పద్యంలో

కాశి కాశి అనచు కదువేడుకతో బోదు
రందు గలుగు దేవుడిందు లేడే
ఎందు నందు గలడు హృదయంబు లెస్సైన.."

వేమన పద్యాలు . (,సిపి బ్రౌన్ 1839 నాటి సంకలనం.) పుట 168

అంటే భగవంతుడు పవిత్ర హృదయం కల వాళ్లలోనే ఉంటాడని చిత్తశుద్ధి లేని వాళ్ళ దగ్గర దైవం ఉండదని చెప్పారు.

మరో పద్యంలో ..

మాలవాడైన మరి ఆత్మ మీదను
మనసు నిల్పనేని మాల కాదు
మనసు నిలవకున్న మహి మీద మాలడే."

అంటే అగ్రకులంలో పుట్టినంత మాత్రాన మనిషి ఉత్తముడు కాదనీ, సద్గుణాలు లేని వాడు మనిషి కాదని అంటూ కులము కన్నా గుణము ప్రధానమని తన కవిత్వం ద్వారా చాటి చెప్పారు వేమన గారు.

**సాంఘిక దృక్పథంతో సాగే రచన:**

సంఘ సంస్కరణ ఆశయంగా పెట్టుకొని సమాజాన్ని ఉద్ధరించే కవులలో వేమన కూడా ఒకరు. తన పద్యాల ద్వారా సాంఘిక దురాచారాల ఖండన, వర్ణ, వర్గ విభేదాల నిర్మూలన, సర్వ మానవ సమానత్వం, సౌభ్రాతృత్వం, నీతి మొదలైన వాటిని చాటి చెప్పారు. తన అనుభవాలన్నిటిని రంగరించి మానవాళికి అందించారు వేమన. ప్రజలను చైతన్య పరిచేందుకే తన రచనల ద్వారా సంఘసంస్కరణ ఉద్యమాన్ని చేపట్టారు. కొందరు కవులు శతకాలను భక్తి కోసం, ముక్తి కోసం రాస్తుంటే వేమన ప్రజా విముక్తి కోసం రాశాడు అని చెప్పడంలో ఎటువంటి సందేహం లేదు.

ఒక పద్యంలో ...

తొలుత బమ్మ గుడ్డు పరికించి చూడగ
కులములన్నీ గూడ తోడబుట్టె
అందరొకట గలయ నన్నదమ్ములె గదా
విశ్వదాభిరామ వినురవేమ".

మరోపద్యంలో ..

జాతి భేదమెంచి జన్మముల్ తెలియక,
ముక్తి గాన లేరు మూఢజనులు, జాతు లెంచనేల జన్మంబు తెలియుము,
విశ్వదాభిరామ వినురవేమ"

అంటే మనుషులలో జాతి భేదాలు లేవు అందరూ సమానమే అని చెబుతూనే సాధారణంగా జంతువులను వాటి అరుపులను స్వభావాన్ని బట్టి ఫలానా జంతువుని గుర్తిస్తామే మనిషి ఆకారము ,స్వభావము ఒకటే ఉన్నప్పుడు ఈ బ్రాహ్మణ- క్షత్రియ -వైశ్య -శూద్ర అనే వర్గాలు ఎందుకని మానవులంతా ఒకటే కాదా? అంటూ నినదించారు వేమన గారు. మాలవాని శరీరంలో రక్త మాంసాలు ఇతర శరీరంలో రక్త మాంసాలు ఒకటే అయినప్పుడు వారి ఆత్మకు కులం ఎందుకు అంటగడతారని? ప్రశ్నించారు వేమన.వసుదైక కుటుంబమే వేమన ఆశయం అని మనం గమనించవచ్చు. మానవాళి సమైక్యతను, కళ్యాణాన్ని కోరే నినాదమే వీరి మతము. మానవుడు సంఘజీవి. అతడు సంఘంలో గౌరవంగా జీవించాలంటే తన కర్తవ్యాన్ని పాలిస్తూ మన్నలు అందుకోవాలంటే నీతివంతమైన జీవన విధానాన్ని అలవర్చుకోవాలి అంటూ అడుగడుగునా వేమన ఇదే విషయాన్ని నీతి బోధ చేశాడు.

మరో పద్యంలో...

చంపదగినయట్టి తగ్గినయట్టి శత్రువు తన చేత

చిక్కనేని కీడు చేయరాదు

పొసగ మేలు జేసి పొమ్మనుటే చావు

వేమన పద్యాలు .(,సిపి బ్రౌన్ 1839 నాటి సంకలనం.)పుట 04

అని మానవత్వాన్ని చూపించాడు. తను ఆశ్రయించిన వారికి తగిన న్యాయం చేయడమే నీతిఅని, పాలు పోసి పెంచిన పాము కరుస్తుంది అంటే అది తన జంతు నీతి అంటూ మనిషికి ఉండాల్సిన నీతి మానవత్వమని తన ఇంటికి అతిథిగా వచ్చిన వాడికి అన్నం పెట్టడంలోనూ, సాయం కోరిన వారికి సహాయం చేయడంలోనూ,చేతికి చిక్కిన శత్రువుని చంపకుండా అతనిని వదిలి వేయడంలోనూ మానవత్వం కలదని మనిషికి ఉండాల్సింది మతం కాదనే మానవత్వం అని చెప్పారు వేమన గారు.

**వసుధైక కుటుంబాన్ని ప్రబోధించే శైలి:**

మన దేశం భారతదేశం. అనేక మతాలు అనేక కులాలు తనలో ఇమిడ్చుకున్న దేశం.భిన్న రాష్ట్రాలు, భిన్న మతాలు., భిన్నఆచార వ్యవహారాలు ఉన్నప్పటికీ “భిన్నత్వంలో ఏకత్వాన్ని” ప్రదర్శించే గొప్ప దేశం భారతదేశం .ఇలాంటి దేశంలో ప్రపంచమే గర్వించదగ్గ కుటుంబ జీవన విధానం కలదు. మన భారతీయ కుటుంబ వ్యవస్థ ప్రపంచంలోని అన్ని దేశాలకు ఆదర్శమైనది .అభిమానాలకు ,ఆత్మీయతలకు, ఉన్నత విలువలకు ఉదాహరణంగా నిలబడే వ్యవస్థ మనదేశంలో కలదు. కవి వేమన కూడా ఈ కుటుంబ వ్యవస్థ గురించి చాలా పద్యాలలో వివరించారు.

ఉదాహరణకు ఒక పద్యంలో

సుగుణవంతురాలు సుదతి యై యుండిన,

బుద్ధిమంతులగుచు పుత్రులొప్ప,

స్వర్గమేటికయ్య సంసారికంకను

విశ్వదాభిరామ వినురవేమ”.

ఈ పద్యంలో ఆదర్శవంతమైన కుటుంబ జీవితాన్ని చక్కగా వర్ణించారు.

అలాగే మరొక పద్యంలో....

ఆలి మాటలు విని యన్నదమ్ముల బాసి

వేరుబడెడువాడు వెర్రి వాడు

కుక్క తోక బట్టి గోదావరీదునా” వేమన పద్యాలు .(,సిపి బ్రౌన్ 1839 నాటి సంకలనం.)పుట 82

అంటూ కుటుంబవ్యవస్థలోని అన్నదమ్ముల గొప్పతనాన్ని చాలా చక్కగా వర్ణించారు. పుట్టుకతో ఏర్పడిన ఆ అన్నదమ్ముల అనుబంధం మరొకరి ద్వారా విడిపోరాదని చిన్న చిన్న మనస్పర్థలు వచ్చిన సర్దుకునిపోవాలని విడిపోయి బ్రతికే బ్రతుకు వ్యర్థమని చాలా చక్కగా చెప్పారు ప్రబోధించారు.

వేమనగారూ మరో పద్యంలో....

తల్లిదండ్రులు గద తనకు గురుదైవంబు,

తల్లిదండ్రులే గద తనకు తోడు,

తల్లిదండ్రుల వల్ల తనువాయెనే గదా,

విశ్వదాభిరామ వినురవేమ"

వేమన పద్యాలు .(,సిపి బ్రౌన్ 1839 నాటి సంకలనం.)పుట 115

అంటూ కుటుంబ జీవితంలో తల్లిదండ్రుల యొక్క గొప్పతనాన్ని చాలా చక్కగా వర్ణించారు. నేటి కాలపు యువత తన ఉద్యోగ ప్రయత్నంలోనూ, ఉద్యోగ ఒత్తిడిలోనూ తల్లిదండ్రులను పట్టించుకోవడం లేదనే చెప్పాలి. అలాంటి యువతకు ఈవేమన పద్యాలే సూక్తి సూత్రాలై, వారిని మార్చి మంచి మార్గదర్శకులుగా మార్చగలవని ఆశించవచ్చు.

**ముగింపు.:**

వేమనను దిగంబరంగా చూసిన ఆ చిత్రాలను గమనించినట్లయితే వేమన చదువుకున్నట్టే కనపడదు.కానీ చదువుల్లో గల మర్మం మాత్రం ఇతనికి తెలుసు. అది అతని పద్యాలను గమనించినట్లయితే మనకు ఇట్టే అర్థం అయిపోతుంది. వీరి పద్యాల తీరు ఎలా ఉంటుందంటే కులం ఉచ్చులో ఇరుక్కున్న వ్యక్తిని ఒక తన్ను తన్నినట్టు., ఆధిపత్యాల పోరులో అల్లాడే వ్యక్తులను మొటికాయి మొట్టినట్టు., మంచి వాడిని పిలిచి బుజ్జగించినట్టు చాలా రమ్యమైన శైలిలో ఉంటాయి. అందువల్లనే ఏనాడో వేమన తనువు చాలించినప్పటికీ తన పద్య రూపంలో అందరి నోర్లల్లో ఇప్పటికీ తిరుగుతూ, మాట్లాడుతున్నట్టే ఉంటాడు. కొన్ని పద్యాలు చదువుతూ ఉంటే ఆ పద్యంలోని ప్రతి మాట ఒక నిప్పు కణం లాగా మన మనసుకు తగలగానే చురుక్కుముంటుంది. ఇతని పద్యాలు కత్తి వలె మనసుకు గాయం చేస్తూనే అటు పిమ్మటే మందు కూడా పూసి మంచి ముగింపు ఇస్తాయి. కొన్ని పద్యాలు కరుకుదనంతోను, మరికొన్ని పద్యాలు చురుకుదనంతోనో మరికొన్ని కమ్మదనంతోనూ ఉంటాయి. వేమన పద్యాలు చదువుతుంటే అవి బుర్రలో నుంచి పుట్టినట్టు కాకుండా హృదయంలో నుంచి పుట్టినట్టు అనిపిస్తాయి. మనకు అందరికీ ఒకే ఒక్క దేవుడు మనందరం ఒకే తల్లి బిడ్డలను అంటూ వసుధైక కుటుంబ భావనను కలిగిస్తాడు. గుడిలో గల దైవాన్ని దర్శించుకోవడం ముఖ్యం కాదని ,హృదయంలో గల దేవుని దర్శించుకుంటేనే ప్రతిఒక్కరి జీవితము పవిత్రంగా సుందరమవుతుందని చెప్పారు. ....."ముందు యుగంలో తిక్కన మధ్యయుగంలో వేమన ఆధునిక యుగంలో గురజాడ ఈ ముగ్గురు మహాకవులు" ..(తెలుగు సాహిత్య దీపిక,)పుట 82

అంటూ శ్రీశ్రీ గారు అన్నదిసత్యం. మరో కవి ఆరుద్ర మాటల్లో 'వేమన రసవాదంతో బంగారం తయారు చేశాడో లేదో కానీ బంగారు కణిక లాంటి పద్యాలను తెలుగుజాతికి అందించాడు' అని అన్నారు. వీరు దిగంబరయోగి కాదని, దివ్యాంబర యోగిగా మనం భావించుకోవచ్చు. మరో కవి రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మ వేమన కవిత గురించి ఏమంటారు అంటే "ఇరు ప్రక్కలందును మంచి పదును గల కత్తి వంటి కవితా శక్తి, దానికి మెరుగు ఇచ్చునట్టే సంకేత దూషితము కానీ ప్రపంచ వ్యవహారములందరి సూక్ష్మ దృష్టి గాయపు మందు కత్తికే పోసి కొట్టినట్లు తిట్టుచూ నవ్వించు హాస్య కుశలత" అంటూ చాలా చక్కగా. వేమన కవితలను వర్ణించారు. నాటి సంస్కృత ప్రవచనాలను సులభ శైలిలో తెలుగు భాషలో వేమన సాంఘిక జీవనానికి ముడిపడ్డ ఆర్థిక ,రాజకీయ, తాత్విక, మనస్తత్వ ,ఆధ్యాత్మిక అంశాలని చాలా సులభశైలిలో పద్యాల రూపంలో,నేర్చుకోవడానికి సులభరీతిలో,పాడుకోవడానికి వచన రీతిలో సర్వ మానవ లోకానికి

ఉపయోగకరంగా అందించారు వేమన గారు. వేమన పద్యాలు పద్యాలు కావు అవి నిజజీవిత సత్యాలు. మంచివైపు నడిపించే ప్రబోధనలు. తెలుగు వారు ఉన్నంతకాలం వేమన పద్యాలు సజీవంగా ఉండిపోతాయిఅనడంలో ఎటువంటి సందేహం లేదు.

**పరిశోధనా కొనసాగింపు**

వేమన గురించినేటి యువతరం తెలుసుకోవలసిన అంశాలు వారి పద్యాల నుంచి నేర్చుకోవాల్సిన అంశాలు ఇంకనూ చాలా ఉన్నాయి. కావున వేమన గురించి ఇదివరకే ఎన్నో పరిశోధన గ్రంథాలు వచ్చినప్పటికీ ఇంకను రావలసిన అవసరం ఎంతైనా ఉంది. ఎన్ని తరాలు మారినా వేమన పై వచ్చే పరిశోధనలకు ముగింపు ఉండదు. ఉండబోదు కూడా.

**ఉపయుక్త గ్రంథ సూచి:/వనరుల జాబితా.**

వేమన శతకము, పండిత పరిష్కృతము ,భరణి పబ్లికేషన్స్, విజయవాడ. ఫిబ్రవరి 2022

వేమన పద్యాలు, భంగోరే సిపి బ్రౌన్ 1839నాటి సంకలనం., ప్రజాశక్తి బుక్ హౌస్ ,ఏప్రిల్ 2017

వేమన-2 ,సిపి బ్రౌన్ భాషా పరిశోధక కేంద్రం., యోగి వేమన విశ్వవిద్యాలయము. ,ఆంధ్ర బుక్ స్టాల్, కడప, డిసెంబర్ 2013.

తెలుగు సాహిత్య దీపిక ,డాక్టర్ ఎంకే మద్దిలేటి. విశ్వవాణి పబ్లికేషన్స్ కర్నూలు. నవంబరు 2012.

వికీపీడియా.

*******

# 52. ఆధునిక నాటిక సాహిత్యం- సామాజిక స్పృహ

డా.యస్.జ్యోత్స్నరాణి

తెలుగు అధ్యాపకురాలు,

సప్తగిరి డిగ్రీ కాలేజీ, విజయవాడ,

చరవాణి: 9491498749,

Email: sjrani9@gmail.com.

**కీలక పదాలు:** తెలుగు నాటకం-నాటికలు పరిచయం, సామాజిక స్పృహ, మత్స్యకారులను చిత్రించిన నాటిక-కొడుకు పుట్టాల?,ఎరుకల జీవితాలను చిత్రించిన సర్పయాగం, వీధి భాగవత కళాకారుల జీవనాన్ని చిత్రించిన నాటిక – బహురూపి, దళితులను చిత్రించిన నాటిక-పాలేరు, స్త్రీల సమస్యలను చిత్రించిన నాటిక-ఆడబ్రతుకు, జట్కావాలా జీవితాలను చిత్రించిన రేడియో నాటిక-జట్కావాలా,ముగింపు,ఆధార గ్రంథాలు.

**అబ్స్ట్రాక్ట్:** కావ్యాలు దృశ్య కావ్యాలు,శ్రవ్యకావ్యాలు అని రెండు రకాలు. ప్రబంధాదులు శ్రవ్య కావ్యాలు కాగా రూపకాదులు దృశ్య కావ్యాలు. రూపకాలు పది. అవి నాటకం, ప్రకరణం, బాణం, వ్యాయోగం, సమవాకారం, డిమము, ఈహామృగము,అంకం,వీధి, ప్రహసనం. వాటిల్లో నాటకం ఉత్తమోత్తమైనది.

నాటక సాహిత్యంలో నాటికలు,ఏకాంకికలు, అంతర్భాగాలే. నాటకం కంటే నాటిక చిన్నది. దానికన్నా చిన్నది ఏకాంకిక. అని పి.ఎస్.ఆర్. అప్పారావు తెలియచేశారు.''ఏకనాయకమును, ఏక వస్తుకమును, విధిగా ఏకరంగమును అయి, స్థల కాలైక్యముల పాటింపబడి, ప్రదర్శనము 30 నిముషములు లేదా 45 నిముషములలోపల ముగిసిననో దానిని 'ఏకాంకిక' (one act play) అనవచ్చును. నాటిక (Playlet)కు ప్రదర్శన కాలపరిమితి సుమారు గంట; ఇదియును ఏకనాయకము, ఏకవస్తుకమును కావలసినదే కాని ఇందు రెండు మొదలు ఐదారు రంగములుండవచ్చును." కాని నేడు ఏకాంకిక నాటిక అనేపదాలు సమానార్థకాలుగానే వాడబడుతున్నాయి.కాని నాటిక వేరు ఏకాంకిక వేరు. నాటికా రచనకి సంక్షిప్తమే ముఖ్యం.నాటిక వస్తువులో పటుత్వం కలిగిన సన్నివేశాలు ఉండాలి. సంభాషణలకి ప్రాధాన్యం కలిగి ఉండాలి. పాశ్చాత్య నాటక ప్రభావం ఆధునిక నాటికలపై ఎక్కువగా ఉంది.అలాంటి తెలుగు ఆధునిక నాటికలలో ఉన్నటువంటి సామాజిక స్పృహను తెలియచేయటమే ఈ వ్యాసం ప్రధాన భూమిక అని చెప్పవచ్చు. తెలుగు నాటిక కవులు,రచయితలు నాటికలను వివరించవచ్చు.

**ఉపోద్ఘాతము:** నాటికలలో స్వరూపాన్ని బట్టి దృశ్య నాటిక,శ్రవ్య నాటిక/ రేడియో నాటిక, గేయ నాటిక, పద్య వాటిక, నృత్య నాటిక, సాంఘిక నాటిక, రాజకీయ నాటిక, విప్లవ నాటిక, వీధి (street play) మొదలైన భేదాలూ ఉన్నాయి. వాటిల్లో సాంఘిక నాటిక ఎంతో ప్రత్యేకమైనది.

**మత్స్యకారులను చిత్రించిన నాటిక-కొడుకు పుట్టాల?:**

కొడుకు పుట్టాల' అనే నాటికను డా.గణేష్ పాత్రో రచించారు. దీనిలో ఇతివృత్తం మత్యకారులకు సంబంధించింది. విశాఖ సముద్ర తీరాన జరిగినట్లు చిత్రించారు. మత్స్యకారుల పేదరికం దృష్ట్యా, కుటుంబ నియంత్రణ అవసరాన్ని ఈ నాటిక ప్రబోధిస్తుంది. మత్స్యకార జీవితంలోని అతిముఖ్యమైన అంశం, వారికి నిరంతరం సముద్రంలో ఎదురయ్యే ప్రమాదాలు. తరచుగా ప్రాణ నష్టం కలగడం వారి బ్రతుకుల్లోని విషాదం. ఆ విషయాన్ని రచయిత నాటికలో హృదయానికి హత్తుకొనేటట్టు చెబుటారు. ఇందులో పాత్రలు

శరభయ్య తాత అనే వ్యక్తి తన ముగ్గురు కొడుకులూ సముద్రం పాలైపోగా ఏకాకిగా మిగిలిపోతాడు. అతనొకచోట ఈ విధంగా అంటాడు."నీకు తెల్దురా గంగులా! నా వద్ద ముగ్గురు కొడుకుల్ని నానిలాగ సూత్తుండగానే మింగేసినాది గంగమ్మ తల్లి. ఏడాదికొక్కణ్ణి బలుచ్చుకుంది".

ఈ నాటికలో సముద్ర తీరంలో జాలర్లు మాట్లాడుకునే భాష యథాతథంగా రాయబడింది. వృత్తిపరమైన సాహిత్య సృష్టిలో ఎవరి భాష వారికి రాయటం చేత, వాస్తవికత బాగా వ్యక్తమవుతుంది. ఈ నాటికలో గంగులు అనే ఒక వృద్ధపాత్ర ఒకచోట ఇలా అంటాడు- "సెప్పినాను గానమ్మీ! ఆడు వారానికొకపాలి ఏటకెల్తాడె! ఈ ముందార ముందార పడవేసి, తిరిగి సుదువు(లు, జెల్లలు, నెత్తళ్ళు పరిగలట్టుకోనొత్తాడు. ఎల్లి బజార్లపడతాడు. డబ్బు అయిపోయే వరదాకా సుబ్బరంగా తాగుతాడమ్మీ. తాగటానికి డబ్బునేపోతే మల్లా వలట్టుకొని పడవేసుకెళ్ళిపోతాడు. తిండి, తిప్పలు, ఇల్లు, పొల్లు అక్కర్నేదాడికి, ఇంకా నా సంగతేంటి సూత్తాడాడు."

**ఎరుకుల జీవితాలను చిత్రించిన నాటిక- సర్పయాగం:**

వి.ఎస్. కామేశ్వరరావు రాసిన 'సర్పయాగం' నాటికలో ఎరుకల వారికి సంబంధించిన నేపథ్యం కనిపిస్తుంది. ఎరుకల వారిది అతిహైన్యంతో కూడిన జీవితం. ఎక్కడైనా విందులు జరిగినపుడు, అక్కడ తినిపారేసిన విస్తళ్ళు తెచ్చుకుని, ఆ ఎంగిలి కూడు తినే దౌర్భాగ్య స్థితి ఈ నాటికలో చిత్రించబడింది. ఎవరైనా ఇళ్ళల్లో గాని, దొడ్డిలో గాని పాములు కనిపిస్తే వాటిని పట్టుకొని, కొద్దిపాటి చిల్లర తీసుకోవటం కూడా వారి కులవృత్తిగా కనిపిస్తుంది. అయితే, ఇలాటి కుటుంబంలోనే మారుతున్న పరిస్థితుల్లో జరిగే అంశాలు కొన్ని వివరించబడ్డాయి. ఎరుకల భార్యాభర్తలు పోలిగాడు, పిచ్చితల్లి. వారి కొడుకు వెంకటేశు. వెంకటేశుకి ఎంగిలికూడు తినటం ఇష్టం లేదు. చదువు కుంటాడు. ఉద్యోగం కోసం విఫలయత్నం చేస్తుంటాడు. అట్టడుగు వర్గాల్లోంచీ వచ్చి, తిరుగుబాటు చేద్దామని అందర్ని కూడగట్టుకుంటు వారికి సహాయం చేసినట్టు నటిస్తూ, వాళ్ళ చేతనే దుర్మార్గాలు చేయించి ధనం సంపాదించే భుజంగరావుకి లొంగిపోయి, చివరికి నిజం తెలుసుకుంటాడు. సమాజంలో కింది తరగతి వారి ఆకలి బాధలూ, సమాజ పురోగమనంలో వారిలో వస్తున్న మంచి, చెడ్డ మార్పులు ఎరుకల వారి జీవితాలు ఆధారంగా చెప్పబడ్డాయి. ప్రతిఘటన ప్రధానమని ఈ నాటికలో రచయిత ప్రబోధిస్తాడు.

**వీధి భాగవత కళాకారుల జీవనాన్ని చిత్రించిన నాటిక – బహురూపి:**

శిష్ఠా చంద్రశేఖర్ రాసిన 'బహురూపి' అనే నాటికలో ప్రాచీన కళారూపాల్ని వృత్తిగా చేసుకున్న వీధి భాగవతుల జీవితం చిత్రించబడింది. ఈ నాటికలో వస్తువు ఇలాఉంది. నాగేంద్రబాబు అనే ఊరిపెద్ద కూతురు బాగా నాట్యం చేస్తుంటే, సినిమా కంపెనీ వాళ్ళు సినిమా వేషాలిస్తామని మద్రాసు తీసుకెళ్ళి అక్కడ ఆమె ఆత్మహత్య చేసుకునే పరిస్థితులు సృష్టిస్తారు. ఆమె ఆత్మహత్యతో నాగేంద్రబాబు, అసలు కళల్నే ద్వేషించే స్థితికి వస్తాడు. నాట్యాలతో పొట్టపోసుకునే రామశర్మ అన్న కొడుకు. మోహనమురళి కూడా తాము వేసే చిందులవల్ల సంపాదన లేదని, ఆధునికమైన ధోరణిలోకి మారడా మనుకుంటాడు. రికార్డింగు డాన్సులు చేద్దామని నిర్ణయించుకుంటాడు. చివరకు రామశర్మ చెప్పిన నిబద్ధత గల మాటల వల్ల నాగేంద్రబాబు, మోహనమురళి ఇద్దరూ మారిపోతారు. దేశీయ జానపదకళలైన యక్షగానాలు, తోలుబొమ్మలాటలు, పగటి వేషాలు మొదలైన వాటి ప్రాధాన్యమూ అవి విధ్వంసమవుతున్న తీరు ఈ నాటంకలోని ముఖ్యాంశాలు.. రామశర్మ ఇలా చెప్తాడు : "ఈ దేశపు సంస్కృతిలో శిల్పం, చిత్రలేఖనం, సంగీతం, నాట్యం, మొదలైన ఎన్నో కళలు అంతర్లీనమై ఉన్నాయి. వేల సంవత్సరాల నాటి ప్రాచీన శిల్పాన్ని ఈనాటి వరకు మ్యూజియంలలో దాచి, ఇదే నాదేశపు శిల్పకళ అని భవిష్యత్తరాలకు చూపించగల్గుతున్నాం. అవి భౌతికమైన వస్తురూపాలు కనుక. కాని, యక్షగానం, భాగవతం, తోలు బొమ్మలాట సజీవ కళలను భద్రపరచటానికి ఏ మ్యూజియంలో వీలవుతుందో చెప్పగలవా? వాటిని ప్రదర్శించి చూపే సజీవ మ్యూజియంలే ఈ దేహాలు. ఈ కళాకారుల భౌతికకాయాలు ఈ మ్యూజియంలో లేకపోతే, కొన్నాళ్ళకు మాకంటూ కొన్ని సజీవకళలు, రంగస్థల కళలున్నాయని భావితరాలకు చెప్పుకోటానికి ఏమీ మిగలదు -"

**దళితులను చిత్రించిన నాటిక-పాలేరు:**

బోయి భీమన్న 'పాలేరు' నాటకం దళిత స్పృహతో 1940 ప్రాంతంలోనే ప్రజల్ని చైతన్యపరచింది. ఆనాటి భూస్వామ్య వ్యవస్థని ఒక కుదుపు కుదిపింది. 23 అంకాలతో దాదాపు నూరు పుటల విస్తృతి ఉన్న పద్య నాటకంగా 'పాలేరు' ప్రసిద్ధి పొందింది. కథాక్షేత్రం గోదావరీ తీరంలో ఒక పల్లెటూరు కాగా భూస్వామి కుబేరయ్య దగ్గర పాలేరు పుల్లయ్య కొడుకు వెంకన్న కథానాయకుడుగా నాటకం విస్తరిస్తుంది. చదువు మీద ఆసక్తి గల వెంకన్న పాలేరుగా బతికే దుస్థితిలో ఉపాధ్యాయుడు ఉపకారి మాష్టారు, మోతుబరి కూతురు వనబాల ప్రోత్సాహంతో ప్రైవేటుగా చదివి డిప్యూటీ కలెరు అవుతాడు. ఆ ప్రాంతానికి రెవెన్యూ అధికారిగా వచ్చిన వెంకన్న ఉపకారి మాష్టార్ని ఒక దొంగతనం కేసునుంచి రక్షించి, కుబేరయ్యను క్షమించటంతో అతనిలో హృదయ పరివర్తన తెస్తాడు. బ్రహ్మ సమాజ పద్ధతుల్లో వనబాలను వివాహం చేసుకుంటాడు. నాటకం నిండా కవితా న్యాయం (poetic justice) కనిపిస్తుంది

పాలేరుతనం బానిసత్వంతో సమానమైనదని, పాలేర్లు చదువుకొని ఉద్యోగం పొందటం ద్వారా అధికారం, తద్వారా సాంఘిక గౌరవం పెరుగుతుందని ప్రబోధిస్తుంది. సవర్ణులు, అవర్ణులు మధ్య ప్రేమ వివాహాలు జరగటం ద్వారా కులం అడ్డుగోడలు తొలగించవచ్చని సందేశం ఇస్తుంది. "భూస్వామ్య వ్యవస్థ సృష్టించిన పాత తరహా వృత్తి (ఉత్పత్తి)సంబంధాలు పూర్తిగా ధ్వంసమై, కులంతో సంబంధం లేని ఉత్పత్తి (వర్గ) సంబంధాలే నిర్ణయాత్మకమయేంత తీవ్రమైన మార్పులు జరిగితే తప్ప, అందుకు సామాజిక, సాంస్కృతిక ఉద్యమాలు రాజకీయ అండదండలు లభిస్తే తప్ప తరతరాల నిచ్చెనమెట్ల కుల సమాజపు కుళ్ళుపోదు అంటారు.

**స్త్రీల సమస్యలను చిత్రించిన నాటిక-ఆడబ్రతుకు :**

ఆడబ్రతుకు నాటికను శ్రీనార్ల రాశారు.పాశ్చాత్యరూపక తత్త్వాన్ని బాగా ఆకళింపు చేసికొన్న శ్రీ నార్ల శిల్ప విషయికంగా అనేక పాశ్చాత్య నాటక రచయితల రచనా శిల్పాన్ని తెలుగులో ప్రవేశపెట్టినా, తెలుగు గ్రామీణ జీవితాన్ని తమ ఏకాంకికల్లో హృద్యంగా, జీవకళ ఉట్టిపడేటట్లు చిత్రించారు. అలాంటి నాటికలలో "ఆడబ్రతుకు" ఒకటి. ఇందులో నాలుగే పాత్రలు. తల్లి కుమార్తె, ఆడబడుచు, అత్తగారు; తల్లి దండ్రులకు ఆడపిల్ల అన్ని కాలాల్లోను గుండెల మీదకుంపటే. ఇంకా సంప్రదాయపు కట్టుబాట్లు బాగా సడలని క్రిందటి తరాలలో, మేనరికం చేసుకుంటారేమోనన్న ఆశతో కుమార్తె చుట్టూ ఆశాసౌధాలు నిర్మించుకుంటున్న తరుణంలో, ఆ యింట ఆడబడుచు తన అన్నగారికున్న పేదరికం కారణంగా వారితో వియ్యమందటానికి ఇష్టపడకపోవటం'ఆడబ్రతుకు' నాటికలోని ఇతివృత్తం. స్త్రీ తన జీవితంలో అటు అత్తగారి 'ఆరడి'పడి జీవించి, ఇటు మధ్యవయసులో పేదరికం కారణంగా అమాయకురాలైన కుమార్తె జీవితం గురించి కేవలం బంగారు కలలు మాత్రమే కంటూ అవి నిజజీవితంలో ఎండమావులు కావటం గమనిస్తున్న ఒక గృహిణి జీవితం యొక్క వాస్తవ చిత్రణ 'ఆడబ్రతుకు'.

**జట్కావాలా జీవితాలను చిత్రించిన రేడియో నాటిక- జట్కావాలా:**

జట్కావాలా అనే రేడియో నాటికను అనిశెట్టి సుబ్బారావు రాశారు. ఒక జట్కావాలా యొక్క జీవన వేదనను తెలిపారు. రంగయ్య గుర్రంబండి నడుపుకుని బతికే ఒక జట్కావాలా, ఆ గుర్రానికి రాముా అనే ఎరు పెట్టాడు. ఆ ఊరి నుండి జంక్షన్స్ వరకు బస్సు వేయడం వల్ల తన ఆదాయం తగ్గుతుంద. ని రంగయ్య దిగులు చెందుతాడు. వాడికి పోటీతా మరింకెవ్వరూ జట్కా నడపటానికి వీలు లేదని శాసిస్తాడు. రంగయ్య దగ్గర అతని దయా దాక్షిణ్యాలతో బ్రతికిన వెంకటావు లారీ క్లీనర్గా ఉం టాడు. వాడిప్పుడు జంక్షన్ నుండి ఆ ఊరికి కారు నడిపే డ్రైవర్ అవుతాడు. ఆకారు వల్ల తనకు ఆదాయం తగ్గిపోయిందని ఎంతో బాధపడతాడు. ప్రతిరోజు తనకు ఆరోజు వచ్చిన ఆదాయం గురించి భార్యకు చెప్పి దిగులుతో ఉంటాడు. ఉన్న ఊరు వదిలి మరో చోటికి వెళ్ళి బ్రతకలేమో ననే బెంగతో ఏలాగైనా ఊరిలో కారు నడపకుండా చూడాలని అనుకుంటాడు. ఆ ఊరి పెద్ద భ హస్వామి భూపాలరావుకి తన విషయం చెప్పి ప్రాధేయపడతాడు. అతడి కపటపు మాటలు విని రంగడు ఊరట చెందుతాడు కానీ భూపాలరావే వెంకడికి డబ్బుఇచ్చి కారుకొని పెట్టాడనే విషయ ం తెలి

రంగడు మిక్కిలి బాధపడతాడు. రంగడు మరింత నిరాశ, నిస్పృహలతో కుములుతూ భార్యతో జట్కాబండిని ముక్కలు చేసి పొయ్యిలో పెట్టమని, ముసలి గుర్రాన్ని కసాయివాడికి అమ్ముతానని అంటాడు. రంగడి భార్య మనం పట్నం వెళ్ళి బతుకుదామని, తాను ఇళ్ళల్లో పనులు చేసుకుని అంట్లుతోమైనా పోషిస్తాననంటుంది. దానితో పౌరుషం పెల్లుబుక్కిన రంగడు కాళ్ళు, చేతులు ఉన్నాయి కాబట్టి కట్టెలు మోసైన - పెళ్ళాన్ని, కొడుకుని పోషిస్తానని పట్నానికి బయలుదేరతాడు.

**ముగింపు:**

తెలుగులో నాటికల పరిణామవికాస క్రమం ఎంతో స్పష్టంగా కనిపిస్తుంది. కందుకూరి, చిలకమర్తి మొదలైన అనేకుల తొలి ప్రహసనాలు పేరుతో రాయటం తొలిదశ. భమిటిపాటి వంటి రచయితలు అనువాద, స్వతంత్ర నాటిక రచనలు సృజించటం రెండవ దశ. చివరగా సఖి, ప్రతిభ, కళ సాహిత్యపత్రికల్లో వచ్చిన రచనలు మూడవదశకు చెందుతాయి.1943 నుంచి వాస్తవికతావాదంతో వచ్చిన రచనలు, ఆ రచనల ఆధారంగా రంగస్థలం మీద ప్రదర్శనలు ఇచ్చిన నాటికలు అనేక ప్రయోగాలకు శ్రీకారం చుట్టాయి. అప్పటినుంచీ తెలుగు నాటిక రచనలోను ప్రయోగంలోను కొత్తపుంతలుతొక్కి భారతీయ నాటికా సాహిత్యంలోనే ఒక అత్యున్నతమైన స్థానాన్ని తెలుగు నాటిక సంపాదించుకున్నది. ఆధునిక నాటికా సాహిత్యం సామాజిక స్పృహను కలిగి ఉంది.

**పరిశోధనా కొనసాగింపు:**

తెలుగు నాటక సాహిత్య పరిణామక్రమాన్ని మలుపు తిప్పినవి నాటికలే అని చెప్పవచ్చు. దశ రూపకాలలో చెప్పబడిన నాటికా లక్షణాలు కలిగి ఉంది. సమకాలీన, నాటక సాహిత్యాన్ని వాస్తవికతవైపుకు మరలించి, సాహిత్య చరిత్ర యుగాల రచనలో అనేక మలుపులకు కారణభూతమైనదికూ నాటిక ప్రక్రియ. తెలుగు నాట నాటికల ప్రదర్శనలను అనేక విధాలుగా జరిగాయి. ఆంధ్రప్రదేశ్ లోని అన్ని కాలేజీల వార్షికోత్సవాలకు, సాంస్కృతికోత్సవాలకు, ప్రభుత్వ పథకాలను ప్రజల దగ్గరికి తీసుకువెళ్లేందుకు ఎంతో కృషి చేసాయి. ఇంకా విద్యార్థులు నాటక రంగంలోకి ప్రవేశించేందుకు , ఔత్సాహిక నాటకరంగంలోను, నాటకోత్సవాలతోను, నాటక నాటికా పోటీలను ప్రోత్సహించే పరిషత్తులను స్థాపించడంతో తెలుగు నాటికకి పట్టాభిషేకమే జరిగింది. ఈనాడు తెలుగులో వస్తున్న, వచ్చిన నాటిక సాహిత్యాన్ని గమనిస్తే ఏ భారతీయ భాషల్లో వస్తున్న నాటికలలో తెలుగు నాటికలకు గౌరవప్రదమైన స్థానమే ఉన్నదని చెప్పినప్పటికి తెలుగు నాటిక వికాసం గురించి తగినంత పరిశోధన జరగలేదు.

**వనరులు/మూలాల జాబితా:**


11. వెంకటేశ్వర్లు,లంకా.డా.,ఫిబ్రవరి2014,ఆధునికసాహిత్యంలోవృత్తిచైతన్యం,పాలపిట్టబుక్స్, హైదరాబాదు.
12. గోపాలకృష్ణమూర్తి,శ్రీపాద,డా.,1998,తెలుగు ఏకాంక నాటక పరిచయం, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు.
13. వెంకటరామశాస్త్రి,పి.డా., 2005,తెలుగులో చారిత్రక నాటకాలు,గోపాల్ పబ్లికేషన్స్,హైదరాబాదు.
14. అప్పారావు,పోణంగి. 1998, తెలుగు నాటక వికాసము, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు.
15. బాలరాజు,తక్కెళ్ళ. 1996, బోయి భీమన్న రూపకాలు – తాత్విక చింతన, చైతన్య సాహితి,వరంగల్.
16. నారాయణరెడ్డి, సి. (2001). *ఆధునికాంధ్ర కవిత్వము, సంప్రదాయములు-ప్రయోగములు*, విశాలాంధ్ర పబ్లికేషన్స్, హైదరాబాద్.


******

# 53. కుప్పుస్వామి శతకం – సమాజానికి దిక్సూచి

**దారపు రెడ్డి కనకమహాలక్ష్మి**

యస్. సి. ఐ. యమ్ ప్రభుత్వ డిగ్రీ కళాశాల ( స్వయం ప్రతిపత్తి ),

తణుకు .

చరవాణి నం : 8639251531

మెయిల్ ఐడి: DARAPUREDDYKMLAKSHMI@GMAIL.COM

ఒక కాలంలో సంఘం యొక్క అభివృద్ధికి తోడ్పడినటువంటి నియమములు, తరువాత కాలములో సాంప్రదాయాలుగా స్థిరపడతాయి. ఈ సాంప్రదాయములే కొన్ని దశలలో మూఢాచారములు గానూ, మానవ సహజాభివృద్ధిని అడ్డుకునే దురాచారాలుగానూ రూపుదిద్దుకుంటాయి. ఆ దశలో విప్లవదృక్పథం కలిగిన కవులూ మరియు భిన్న తత్త్వవేత్తలూ ఆ మూఢాచారాలనీ మరియు దురాచారాలనీ రూపుమాపడానికి తమ శైలిలో కృషిచేస్తారు. అటువంటి విప్లవదృక్పథం కలిగి, సాహిత్యం ద్వారా అటువంటి సాంప్రదాయాలను బద్దలుగొట్టడానికి పూనుకొన్న కవియే త్రిపురనేని రామస్వామిచౌదరి. “కవిరాజు”గా ప్రసిద్ధులయిన త్రిపురనేని రామస్వామి గారు మొదలు ఆస్తికుడే అయినా తరువాత నాస్తికుడయ్యారు. ఈయన పేరు చెప్పగానే హేతువాదం మనకు స్ఫురణకు వస్తుంది. జ్ఞానమును ఆర్జించడానికి హేతువు అనేది ముఖ్యం అని చెప్పేదే హేతువాదం. హేతువు ద్వారానే నిజమైనటువంటి జ్ఞానము అనేది లభిస్తుంది అంటుంది ఈ హేతువాదం. ముఖ్యంగా నాటి సంఘంలో వున్నటువంటి అస్పృశ్యత, మూఢాచారాలు, బ్రాహ్మణాధిక్యతను నిరసించి, రచనలు చేశారు. వారి రచనలలో సంస్కరణ భావాలు ప్రస్ఫుటంగా మనకు గోచరిస్తాయి. వారు రచించిన “కుప్పుస్వామి శతకం” అనేక దురాచారాలను, అంధ విశ్వాసాలను తీవ్రంగా నిరసించింది. స్త్రీ విద్య యొక్క ఆవశ్యకతను తెలియజేసింది. సనాతన ఆచారాలను, శ్రాద్ధకర్మ, మోక్షం అనే వాటిని రామస్వామి వారు ఖండిస్తూ కొన్ని జీవిత సత్యాలను ఈ శతకం ద్వారా తెలియజేసారు. వాటిలో కొన్నిటిని గురించి తెలుసుకుందాం.

**జీవిత సత్యాలు :-**

పూలు తెగఁబూసినప్పుడు మూఁగుచుండుఁ  
దేనెటీఁగలు పైఁబడి తేనెకొఱకు  
స్నేహితులు కొంద జీరీతిఁ జేరుచుందు  
రప్పుడప్పుడు కనిపెట్టు కుప్పుసామి.

పువ్వులు ఎక్కువగా విరబూసినప్పుడే తేనెటీగలు వాటిపై తేనె కొరకు మూగినట్లుగా, మన దగ్గర ధనం వున్నప్పుడు స్నేహితులమంటూ చాలా మంది మన చుట్టూ చేరతారనీ, అటువంటి వారి పట్ల మనం జాగ్రత్తగా ఉండాలన్నారు.

పిలువకుండ వచ్చి పెద్దమాటలు చెప్పు  
వానినెపుడు నమ్మ వలదు, వలదు  
మేలుకలుగబోదు మెఱమెచ్చుల కతండు  
తప్పుచెప్పుచుండుఁ గుప్పుసామి.

ఎవరూ పిలవకుండానే వచ్చి మనకి మంచి మాటలు చెప్తున్నారంటే దానిలో వారి స్వార్థం ఉంటుందని, అటువంటి వాళ్లను నమ్మకూడదని అన్నారు.

పరుని నీముందుఁ దిట్టెడు వాఁడు నిన్ను

నొరుని ముందటఁ దిట్టక యుండఁబోఁడు

చనవు రవ్వంత వాని కొసంగరాదు

ముప్పువచ్చుఁ దప్పక దానఁ గుప్పుసామి.

ఇతరులను గురించి నీ దగ్గర చెడుగా చెప్తున్నాడు అంటే అతను ఖచ్చితంగా నీ గురించి కూడా ఇతరుల దగ్గర చెడుగా చెప్తాడన్నమాట. కాబట్టి చెప్పుడు మాటలు చెప్పే వాళ్ళకు దూరంగా ఉండాలన్నారు.

పుటము వెట్టినపుడె పుత్తడి యిత్తడి

తెలియఁగలదు వేఱె తెలియరాదు;

సిలుఁగులొందునపుడె చెన్నఁటి సుగుణంబు

కూడఁ దెలియఁగలరు కుప్పుసామి.

పుటంలో కాలుస్తున్నప్పుడే ఇత్తడి ఏదో, బంగారం ఏదో ఏ విధంగా అయితే తెలుస్తుందో, ఒకరు మంచివారా చెడ్డవారా అన్న విషయం అతనికి కష్టములు వచ్చినప్పుడే తెలుస్తుందని అన్నారు.

ఆయమును మించి యెవ్వండు వ్యయముచేయు

నతనికి సుఖంబు లవలేశ మబ్బఁబోదు

తుదకుఁ గడగండ్ల పాలౌను బ్రదుకుతెఱవు

కూడ లేకుండఁ బోవును గుప్పుసామి.

మనకు వచ్చిన ఆదాయానికి మించి ఎవరూ ఖర్చు చేయకూడదు అని, అలా చేసినట్లయితే బ్రతుకు చివరికి కష్టాల పాలవుతుంది అని చెప్పారు.

విత్త మన్యాయముగఁ గూడఁబెట్టి భయము

చేత దానధర్మంబులఁ జేయుటేల

అడుసు ద్రొక్కఁగానేల? కాల్గడుగనేల?

యెప్పుడైన లాభముకద్దె? కుప్పుసామి.

అన్యాయంగా సంపాదించినటువంటి ధనాన్ని భయంతో దానధర్మాలు చేయడం గురించి చెప్తూ అడుసు తొక్క నేల కాలు కడుక్కోవడం ఎందుకు అని దాని వలన ప్రయోజనం ఏముంటుంది అన్నాడు.

మాతృ భాషయందు మాతృదేశమునందు

మమత లేనివాఁడు మనుజుఁడగునె?

తగని మమతయుండు మృగ పక్షిజాతికిఁ

గూడఁ దెలియలేవె కుప్పుసామి.

మాతృభాష మీద మాతృదేశం మీద మమత లేని వాడు అసలు మనిషి ఏనా? జంతువులకు, పక్షులకు కూడా వాటి జాతి మీద ఎంతో ప్రేమ ఉంటుందని చెప్పారు.

చిన్ననాఁటనే బిడ్డకుఁ జెప్పకున్న

నీతు లవల సాధ్యముకాదు; మొక్క

యపుడు వదలిపెట్టి యది చెట్టయిన వంకఁ

గూడఁ దీయుటఁ తలమౌనె? కుప్పుసామి.

చిన్నప్పటినుంచి నీతి నియమాలతో పిల్లలను పెంచాలి కానీ వాళ్లు పెద్దయిన తర్వాత నీతులు చెప్తే ఏమీ ప్రయోజనం ఉండదు అని అన్నారు.

సానఁ బట్టినయపుడె వజ్రముల కాంతి

ప్రజ్వలితమగు నా ప్రకారంబె కష్ట

సమయమందె ప్రకాశించు శౌర్యరాశి

గురుతరంబైన శౌర్యంబు కుప్పుసామి.

**మూఢాచారాలు :-**

చచ్చిపోయిన వెంటనే జన్మమెత్తు

జీవి కుదువఁ గరమటంచుఁ జెప్పుచుందు

రట్టులైనచోఁ బితృలోక మెట్టువచ్చు ?

గుటిల జన సృష్టి, గాదొక్కొ కుప్పుస్వామి.

చనిపోయిన వెంటనే తిరిగి మరో జన్మ ఎత్తుతారంటారు కదా! మరి అలాంటప్పుడు పితృదేవతలుకు పిండాలు పెట్టి, వారు తినడానికి వస్తారంటారు అదెలా సాధ్యం? అని నిలదీసారు.

చచ్చిపోయిన వాని కేసరణిఁజేరం

గలవు పిండములు నివాస జలముకూడ

నావులును భోక్తలును దృప్తులగుట కొఱకుఁ

గూర్చి పెట్టిరిగాకేమి కుప్పుస్వామి.

పిండాలు పెట్టడం వంటివన్నీ బంధుజనం భోజనాలు చేయడానికి, వారు తృప్తిగా తినడానికీ తప్ప మరే పరమార్ధమూ, ఉపయోగము లేదన్నారు.

తలలు గొరిగించి కావి బట్టలనుగట్టి

మెడల రుద్రాక్షమాలిక లిడియంత

ముక్తి వచ్చునే నిస్సంగ బుద్ధిలేక

కుమతి మాటలనేమి కుప్పుస్వామి.

తలలు గొఱిగించి, కాషాయ బట్టలు, రుద్రాక్షలు ధరించినంత మాత్రము చేత ముక్తి అనేది వస్తుందా అని విమర్శించాడు.

**స్త్రీ వాదం – స్త్రీ విద్య :-**

వారకాంతల ఁబడఁదిట్టు వారుగలరు

విటులు క్రవ్వింపకుండిన వేశ్యలెట్లు

చెఱచువారలో పురుషులఁ జెప్పబోరు

కుత్సితులు గారె వీరెల్లఁ గుప్పుస్వామి.

కుష్ఠురోగియైనఁ గుత్సితుండైనను

మగువ తీర్పవలయు మగనికోర్కె

సతికి హక్కులేదె స్వశరీరమును బ్రోచి

కొనగ సుంతయైనఁ కుప్పుస్వామి.

వారకాంతలను పట్టుకొని తిట్టేవారిని పురుషుల ప్రమేయం ఏమీ లేకుండానే వారు ఆవిధంగా ప్రవర్తించటం వీలవుతుందా అని, భర్త కుష్ఠు రోగి అయినా సరే భార్య అతని కోర్కెలను తీర్చాలనడం తప్పని నిరసించారు.

చదువుకొన్న భార్య సహధర్మచారిణి

యగుటకన్న మంత్రి యగుట కోరు

జగతి మంత్రి గొప్ప సహధర్మచారిణి

గొప్పో తెలిసి మెలఁగు కుప్పుస్వామి

చదువు చెప్పకుండ జదురాంధ్రంగా జేసి

స్త్రీలఁ దిట్టిపోయఁ జెల్లుచుండె

దోస మెవరియందు దొరలాడుచుండెనో

చెప్పఁబోవ రెవరు కుప్పుస్వామి.

పై పద్యాలను బట్టి రామస్వామి చౌదరి గారు స్త్రీవాది అని, ఆయన స్త్రీ విద్య యొక్క ప్రాధాన్యతను కూడా గుర్తించారని చెప్పవచ్చు.

**ముగింపు :**

ఈవిధంగా సాహిత్యంలో సంస్కరణ అనేది ఒక విడదీయరాని అంశంగా మారింది విగ్రహారాధన, జ్యోతిష్యం, కులవ్యవస్థ, సమకాలీన మత ధోరణులు, అంటరానితనం వంటి విషయాలను నేటి సమాజంలో మనం ప్రశ్నించటానికి ప్రయత్నిస్తున్నాం. మన ఆలోచనలకు, ప్రశ్నించే తత్వానికి నాంది పలుకుతూ త్రిపురనేని రామస్వామి గారు సమాజంలో మార్పు తేవడానికి కృషి చేసారు. సంఘంలోని అగ్రజాతులు అనేవి భిన్న నీతులు, భిన్న ధర్మాలు, భిన్న ఆదర్శాలను సృష్టించి మిగిలిన జాతుల వారిపై పెత్తనం చేస్తూ ఉన్నపుడు, త్రిపురనేని వారు ఈ అగ్రజాతులు యొక్క నిరంకుశత్వానికి ఎదురుతిరిగి, తన కలం ద్వారా తిరుగుబాటు బావుటా ఎగురవేశారు. ఆయన తన మార్గంలో శతక ప్రక్రియను ఉపయోగించి కుప్పుస్వామి శతకం అనే ఆయుధాన్ని సంఘ సంస్కరణ దిశగా ప్రయోగించి, సంఘంలోని అనేక దురాచారాలను, మూఢాచారాలను నిర్మూలించటానికి కృషిచేసి,హేతువాద దృక్పథానికి మూలవిరాట్టుగా నిలిచారు.

**ఆధార గ్రంథములు :-**

కుప్పుస్వామి శతకం – త్రిపుర నేని రామస్వామి చౌదరి

*******

# 54. "విధ్వంసం" నవల – సామాజికత

**డా. ఎం. రమాదేవి,**

తెలుగు ఉపన్యాసకురాలు

రాజీవ్ గాంధీ సాంకేతిక వైజ్ఞానిక విశ్వవిద్యాలయం,

బాసర, నిర్మల్ జిల్లా.

విద్యుల్లేఖ : dr.ramadevi@rguktac.in

**పరిచయం:-**

ప్రపంచీకరణ నేపథ్యంలో ప్రతీదీ వ్యాపార సరుకుగా మారింది. నీరు గాలి, కొండలు, కోనలు, చెట్టు, గుట్టలన్నీ మార్కెట్ చేయబడుతున్నాయి. పాలక వర్గాలు ప్రవేశపెట్టిన నూతన ఆర్థిక సంస్కరణలు, ప్రపంచ బ్యాంకు ఒప్పందాల మేరకు బహుళజాతి సంస్థలకు భాతరదేశ వనరులు, సహజ సంపదను అప్పగించడం రోజురోజుకి పెరిగిపోతుంది. అందులో భాగమే ఓపెన్‌కాస్టులు, సెజ్‌లు, గుట్టల లీజులు, ఇసుక తవ్వకం మొదలైనవి. గత 20 సం॥ నుండి గ్రానైట్, కంకర కోసం గుట్టలు విస్తారంగా తవ్వబడుతున్నాయి. కరీంనగర్ లో దాదాపు 750 గుట్టున్నాయి. ప్రపంచంలో ఎక్కడా ఇవ్వని రీతిలో మైనింగ్ కి అనుమతులిచ్చారు. భూమి లోపలికి దాదాపు 200 మీ॥ వరకు త్రవ్వి అందమైన గ్రానైట్ తీస్తున్నారు. ఇసుక మైనింగ్ 7 అడుగులకి మించి చేయరాదు. కానీ20, 30 అడుగుల వరకు చేస్తున్నారు. పర్యావరణానికి తీవ్ర నష్టం వాటిల్లదమేగాక, జాతికంతటికి చెందాల్సిన సంపదలు పెట్టుబడిదారులు, వారి స్థానిక గుత్తేదార్లకు చెందుతున్నాయి. విషాదకర పరిణామం ఏమిటంటే, సందట్లో సడేమియా లాగా మన నేతలు బహుళజాతి సంస్థల దోపిడీకి, పరోక్షంగా సహకరిస్తూ కోట్లరూపాయలను తమ ఖాతాలో జమ చేసుకోవడం. అయితే, ఇలాంటి వనరుల దోపిడీ విధ్వంసాలపై రచయితలు, కవులు తమ ప్రతిస్పందనలను కవిసమ్మేళనాలు, చర్చావేదికలు, కథలు, నవలలు ఇలా వివిధ రకాల సాహిత్య ప్రక్రియల ద్వారా వెలువరిస్తూనే ఉన్నారు. ఆ పరంపరలో అక్రమ ఇసుక తవ్వకం, దాని దుష్ప్రభావాల మీద వచ్చిన నవలే '**విధ్వంసం**'. ఈ నవలను సింహప్రసాద్ 2016 లో రాశారు. నవ తెలంగాణ తొలివార్షికోత్సవ పోటీలో ప్రథమ బహుమతి పొందిందీ నవల!.

ఇసుక సమృద్ధిగా ఉన్న వనరు, మంచినీటి తర్వాత గ్రహం మీద అత్యధికంగా వినియోగించబడే సహజ వనరు. భారతదేశంలోనే కాక, ప్రపంచవ్యాప్తంగా వేగవంతమైన పట్టణీకరణ, మౌలిక సదుపాయాల అభివృద్ధి మరియు అభివృద్ధి చెందుతున్న నిర్మాణ పరిశ్రమ కారణంగా, ఇటీవలి కాలంలో ఇసుక కోసం డిమాండ్ విపరీతంగా పెరిగింది. ఏది ఏమైనప్పటికీ, ఈ అమూల్యమైన వనరు యొక్క అనియంత్రిత మరియు ప్రబలమైన దోపిడీ ఒక క్లిష్టమైన పర్యావరణ సమస్యకు దారితీసింది. అదే అక్రమ ఇసుక తవ్వకం. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఇసుక తవ్వకం మీద పలురకాల చట్టాలు తీసుకొచ్చాయంటే పరిస్థితిని అర్థం చేసుకోవచ్చు.

***1.2.నవలా వస్తువు:-***

అదొక నదీ పరివాహక గ్రామం. గత పది, పదిహేనేళ్లుగా, అక్కడి నుండి ఇసుకను తవ్వి తరలిస్తున్నారు. దాంతో వ్యవసాయం కుంటుబడి, రైతులు ఉపాధి కోల్పోయి, వలసలు పెరిగాయి. ఉళ్లో మిగిలి ఉన్న కుటుంబాలు కూడా, డ్వాక్రా రూపుల సహాయంతో భారంగా బతికీడుస్తున్నారు. ఆ ప్రాంతానికి MLA సత్తిబాబు, అతడి కుడి భుజం బండ సుబ్బడు(ఇద్దరు మేకవన్నె పులులు!). నిజానికి ఆ ఊరి నుండి ఇసుక వ్యాపారం అంతా సత్తిబాబుదే! దానికి బినామి ఈ బండ సుబ్బడు! నదిని ఆనుకొని ఉన్న రామన్న, సర్వరావు, కృష్ణారావు, ఆనందరావు, సీతయ్య పొలం మీద వాళ్ళ కన్ను పడుతుంది. పొలం లీజు కోసం బండసుబ్బడు కబురు

పెడతాడు. వీల్లకెవరికి కూడా లిజుకివ్వడం ఇష్టం ఉండదు. కానీ రామన్న తనకున్న 4 ఎకరాల్లో, 2 ఎకరాలు కూతురు ఆదిలక్ష్మికి పసుపుకుంకుమల కింద ఇచ్చి పెళ్ళి చేస్తాడు. ప్రతి సంవత్సరం పంట పండిన, పండకున్న, కూతురి కాపురం బాగుండాలని, కౌలు డబ్బులు 25,000/- ఆదిలక్ష్మి మామ మురళీధర్ కి పంపిస్తుంటాడు. ఇప్పుడు స్వయంగా మురళీధర్ పట్నం నుండు వచ్చి, బండసుబ్బడికి కోడలి 2ఎకరలు పొలం లీజుకిచ్చి, అతనిచ్చిన 4లక్షలు తీసుకోని వెళ్తాడు. రామన్న , మిగిలిన వాళ్ళు అప్పుల భాద తట్టుకోలేక, మరో గత్యంతరం లేక, అయిష్టంగానే 3 సంవత్సరాలు లీజుకు ఇస్తారు. లిజుకిచ్చాక కూడా తమ పొలాలు ఎలా ఉన్నాయో చూడాలని వెళ్ళిన రైతుల గుండెలు గుబెల్లుమన్నాయి, కళ్ళల్లో నీళ్ళు నిండాయి! పెద్ద పెద్ద ఇసుక కుప్పలతో, బంగారు పంటలు పండిన తమ పొలాలేనా అనిపించింది!

పురుషోత్తం రైసు మిల్లు నడుపుతుంటాడు. అతని భార్య అరుణ. పట్నంలో డిగ్రీ చదివింది. ఆమె తండ్రి సింహాచలం కమ్యూనిస్ట్. అరుణ ఆ ఊరిలో ఉన్న ఆడవాల్లందరినీ డ్వాక్రా గ్రూపుల్లో చేర్పించి, ఆ గ్రూపులను సమర్థవంతంగా నిర్వహిస్తుంటుంది. అప్పుల్లో కూరుకుపోయి, వ్యవసాయం గిట్టుబాటు జరగక ఆ ఆర్థికం ఆర్థికంగా కుంగిన కుటుంబాలకి ఆలంబనగా ఈ డ్వాక్రా గ్రూపులు నిలిచాయి!

బండ సుబ్బడు పెట్టిన 3 సంవత్సరాలు లీజు గడువు ముగుస్తుంది. రామన్న, సర్వరావు, కృష్ణారావు, ఆనందరావు, సీతయ్యలు వెళ్లి లీజు గడువు ముగిసిందని, ఇక తమ పొలాలు తమకిమ్మంటారు. కానీ బండ సుబ్బడు మికిచ్చిన డబ్బులే నేనిక రాబట్టుకోలేదు అంటాడు!. లీజు గడువు పెంచి, డబ్బులివ్వమంటే అది కూడా చేయడు. మరో పక్క ఆదిలక్ష్మి మామ మురళీధర్, పంట వేసిన వేయకపోయినా, తనకి సంబంధం లేదని, కౌలు తాలూకు డబ్బులు ఇవ్వాల్సిందేననీ, లేకుంటే ఆదిలక్ష్మినీ పుట్టింటికి పంపించేస్తానని బెదిరిస్తాడు. బండ సుబ్బడు, సత్తిబాబు వల్ల తన కూతురు కాపురం కూలిపోతుందని, అవమానం భరించలేక పురుగుల మందు తాగుతాడు. భార్య సూరమ్మ సకాలంలో గమనించి, హాస్పటల్లో చేర్పించడం వల్ల ప్రాణాపాయం తప్పింది. అన్నట్టుగానే వియ్యంకుడు మురళీధర్, ఆదిలక్ష్మినీ పుట్టింటికి పంపిస్తాడు. అప్పుచేసి కౌలు డబ్బులిచ్చి, కూతురును అత్తవారింటికి పంపిస్తాడు. ఊరికి చెందినా రంగాజీ చేస్తున్న ఉద్యోగాన్ని మానేసి, తల్లిదండ్రులను దగ్గరుండి చూసుకుంటూ, ఆర్గానిక్ పంటలు పడించాలనుకుంటాడు!

ఇసుక రవాణాకి, లారీలు నిరంతరాయంగా తిరగడం వల్ల ఊరికున్న, ఒక్క రోడ్డు గతుకులమయం అవడమే కాకుండా, వేగంగా వెళుతూ మృత్యు శకటాల్ల ప్రజలను భయభ్రాంతులను చేస్తుంటాయి. ఒకరోజు పాఠశాలకి వెళ్తున్న ఒక కుర్రాడిని , ఇసుక లారి టక్కరిచ్చింది. కుర్రోడు ప్రమాద స్థలంలోనే చనిపోయాడు. లారి డ్రైవరు పారిపోయాడు. ఆ లారి బండ సుబ్బడిదే! అతనొచ్చి సమాధానం చెప్పాలని ఊరి ప్రజలు రాస్తారోకో చేసారు పోలిసులలొచ్చినా, ప్రజలు వినలేదు. అప్పుడు బండ సుబ్బడి రౌడి మనుషులలొచ్చీ, ప్రజల మీద దాడి చేసారు. ప్రజలు పోలిస్ స్టేషకుకి వెళ్ళారు. అప్పుడు అక్కడికి వచ్చిన MLA సత్తిబాబు ఊరికి బైపాస్ రోడ్డు వేయిస్తానని వాగ్దానం చేయగా, ప్రజలు శాంతించారు. ఊరి ప్రజలకి మద్దతూగా ఉన్న, SP మహేష్ చంద్ర నమ్మశక్యం కాని రీతిలో ఆత్మహత్య చేసుకొని మరణిస్తాడు! ఇసుక మాఫియకి ఒక అధికారి బలయ్యాడు.!

కాని ఆ ఊరికి రోడ్డు రాలేదు, కనీసం హాస్పటల్, రక్షిత మంచినీరు, పాఠశాల ఏవి రాలేదు, కాని ఆ ఊరి సహజ వనరు ఇసుక ద్వారా ప్రభుత్వానికి కోట్లు వస్తున్నాయి. ఇసుకాసురులకు అనేక కోట్లు వస్తున్నాయి.

ఇటువంటి పరిస్థితుల్లో ఆ ఊరికి, ఒక స్వచ్ఛంద సంస్థ నుండి ఇద్దరు అమ్మాయిలు, ఇద్దరు అబ్బాయిలు వస్తారు. వాళ్ళపేర్లు కూడా చిత్రంగా ఉన్నాయి. నీరు, గాలి, నేల, నిప్పు! వీరు నలుగురు ఒక్కో ఇంట్లో ఆశ్రయం పొంది, ఆఊరి నుండి జరుగుతున్న అక్రమ ఇసుక రవాణా గుట్టు తెలుసుకొని, ఒకనాటి రాత్రి సభ పెట్టి మరీ, ఊరి ప్రజలను చైతన్యవంతం చేస్తారు. మన ఊరి బాగుకు మనమే నడుం బిగించాలని ఊరివళ్ళందరూ నిర్ణయించుకుంటారు. మరో 3 నెలల్లో ఎన్నికలున్నాయని, ఈ అక్రమ ఇసుక రవాణాను,

ఎవరు ఆపుతారో వాళ్ళకే మనం ఓటు వేద్దామని నిర్ణయించుకుంటారు. ఆ మర్నాడు పోలీసులొచ్చీ, ఆ నలుగురిని తీసుకెల్తారు. మ మళ్ళీ వారు తిరిగి ఊరిలో కనపడలేదు!

బండ సుబ్బడు, సత్తిబాబు ఇద్దరు వేరు వేరు పార్టీల తరుపున MLAలుగా పోటి చేశారు. సత్తిబాబు MLA గా గెలిచాడు. తమ పొలాల్ని విదడిపించుకోడానికి, ఊరి సర్పంజ్ నర్సిములును వెంటబెట్టుకొని రామన్న, సర్వరావు, కృష్ణారావు, ఆనందరావు, సీతయ్యలు, బండ సుబ్బన్ని కలుస్తారు. కాని బండ సుబ్బడు అందుకు ఒప్పుకోక, తనకే పొలాన్ని అమ్మాలని అంటాడు. అందుకు ఒప్పుకోని రామన్న మీద చేయి చేసుకుంటాడు! జరిగిన విషయం MLA సత్తిబాబుకి చెప్తారు. కొంచం సమయం కావాలని వారికీ సర్ది చెప్తాడు, కాని బండ సుబ్బడిని మాత్రం మందలించాడు! వీళ్ళు అక్కడ ఉండగానే బండసుబ్బడు అక్కడికి వస్తాడు!

రామన్న మీద చేయ్యిచేసుకొని, ఊరివాళ్ళనీ అవమానించాడనీ, బండ సుబ్బడు వచ్చి క్షమాపణ చెప్పాలని, అప్పటి వరకు, ఊరిలో నుండి ఒక్క వాహనాన్ని కూడా వెళ్ళనీయకుండా రాస్తారోకో చేస్తారు. MLA సత్తిబాబు తన మనుషుల్ని పంపిన కూడా వినరు! మర్నాడు రామన్న తన పొలాన్ని చూడడానికి వెళ్తాడు. అదే సమయానికి అక్కడికి బండ సుబ్బడు ఉరి జనం కంట కనపడకుండా, మోటార్ సైకిల్ మీద నది కట్ట వెంబడి వస్తాడు! ఒకరికనొకరు కోపంగా చూసుకుంటారు. రామన్న వల్లే తనకీగతి పట్టిందని, ట్రాక్టర్ రామన్న మీదికి ఎక్కించి చంపుతాడు. అతడి ఆర్తనాదం విన్న కూలీలు, పరుగు పరుగున అక్కడికి రాగ, వాళ్ళ కంట కనపడకూడదని బండ సుబ్బడు పరిగెడుతూ, ఒక పెద్ద ఇసుక కొండ ఎక్కి, పక్కనే ఉన్న గోతిలో పడతాడు. లేవబోతాడు, అంతలో అతని మీద ఇసుక పడి సజీవ సమాధి అవుతాడు! ఈ విషయం తెలియని సత్తిబాబు, ఊరిజనం ఎక్కడో దాక్కున్నాడని అనుకుంటారు! అప్పడే అక్కడికి ఊరిజనం, తాసిల్దార్ శక్తిప్రియ వస్తారు. ఆమె అక్కడ జరిగే మైనింగ్, ఇసుకను చూసి విస్తుపోతుంది. అక్కడి వాహనాలని జప్తు చేస్తుంది. తోకతొక్కిన త్రాచుల కస్సుమంటాడు సత్తబాబు. కానీ ఆమె ఆ విషయాన్నీ కలెక్టర్, పోలీసుల దృష్టికి తీసుకు వెళ్తుంది.

ప్రభుత్వం ఇసుక మైనింగు నిర్వహణను స్థానిక డ్వాక్రా గ్రుపులకి కేటాయిస్తుంది. అలా అరుణ వాళ్ళ చేతిలోకి వస్తుంది. వాళ్ళు ట్రైనింగ్ తీసుకొని దానిని, సమర్ధవంతంగా నిర్వహిస్తుంటారు. MLA సత్తిబాబు ఆడవాళ్ళూ ఇళ్ళు, పిల్లలను వదిలి బైటికి రానవసరం లేదని, మనిషికి నెలకి లక్ష ఇస్తానని గ్రూపు సభ్యులను మభ్య పెట్టాలని చూస్తాడు. కానీ వాళ్ళు లొంగరు. చివరికి 3 ప్రోక్లెయినర్స్, 100 మంది రౌడీలతో, నది మధ్యలో ఎడాపెడా ఇసుకని తవ్వేస్తూ, 10 టైర్ల ట్రక్కులకు ఎక్కించేస్తున్నారు. అరుణ వాళ్ళు అడ్డుపడినా లెక్కచేయలేదు. వెంటనే అరుణ ఉరివాళ్ళకు ఫోన్ చేసింది. ఉరివాళ్ళకి, రౌడిలకి గొడవ జరిగింది. ఉరివాళ్ళకి దెబ్బలు తగిలాయి. మర్నాడు అరుణవాల్లు, ఊరివాళ్ళు, తాసిల్దార్ శక్తిప్రియ, అక్కడికి వెళ్తారు. అక్కిడికి వచ్చిన MLA సత్తిబాబు, ఇద్దరు ఆడవాళ్ళూ తనకి కంట్లో నలుసులా తయారయ్యారని వాళ్ళమీద చెయ్యి చేసుకుంటాడు. ఇంతలో అక్కడికి మీడియా రావడం, అక్కడ CC కెమారాలు ఉండడం గుర్తొచ్చి, తన రాజకీయ జీవితానికి సమాధి ఖాయమని భావించి, ఏదో B.P వల్ల అలా ప్రవర్తినచానని చెప్పి తప్పించుకుంటాడు. అప్పటికి ఉరి జనం చీమలదండులా అతని ముందుకు వచ్చి, అయ్యా! MLAగారు, మీరు ప్లేటు ఫిరాయించకుంటే పచ్చాడైపోయేవారు! ఇది మా ఉరు, ఈ నది, ఈ ప్రకృతి, ఈ వనరులు ఇవన్నీ మావి! మీలాంటి వాళ్ళు వచ్చి ఊరిని ధ్వంసంచేస్తుంటే, చూస్తూ ఊరుకోమండి, తరిమి తరిమి కోడతామండి , ఇది బాగా ఎక్కించుకోండి అనడంతో నవల ముగుస్తుంది.

**పర్యావరణ క్షీణత:-**

క్రమపద్ధతిలోలేని, ఇసుక తవ్వకం నదీ పర్యావరణ వ్యవస్థలను, తీరప్రాంత నివాసాలను నాశనం చేస్తుంది. ఇసుక తొలగింపు నదీ మార్గాలను మారుస్తుంది, అవక్షేప సమతుల్యతను దెబ్బతీస్తుంది మరియు కోతకు దోహదం చేస్తుంది. నదీ తీరాల వెంబడి వృక్షసంపద కోల్పోవడం పర్యావరణ క్షీణతను మరింత తీవ్రతరం చేస్తుంది. ఇదే విషయాన్ని ఉరి మీటింగ్ లో నీరు చెబుతూ " ప్రకృతిని ఆరాధించడం మన సంస్కృతిలో భాగం. మన మనుగడ, మన వ్యవసాయం, మన అభివృద్ధి అన్నీ ప్రక్రుతి మీదే ఆధారపడి ఉన్నాయి.

ప్రకృతి సమతుల్యత నశిస్తే చాల ప్రమాదం చెట్లను నాశనం చేస్తే, నదుల్ని కలుషితం చేస్తే, పర్యావరణాన్ని మన స్వార్థానికి బలిచేస్తే అది మన పాలిట శాపమైతుంది. ఇప్పటికే గ్లోబల్ వార్మింగ్, ఓజోన్ పోరా నాశనం వల్లవాతావరణంలో పెనుమార్పులోచ్చాయి. ఎన్నో అనర్థాలు జరుగుతున్నాయి. అకాల వర్షం, అకాల ఎండలు, తుఫాన్లు, సునామీలు హుద్ హూద్లు – వాటి విశాఫలాలే ప్రకృతితో సహజీవనం చేయడం మానేసి వినాశనానికి పూనుకున్నందుకే ఇవన్ని జరుగుతున్నాయి ఇలా జరక్కుండా చూసుకోవాల్సిన బాధ్యత, ప్రకృతిని, ప్రకృతి వనరుల్నీ, పర్యావరణాన్ని రక్షించుకోవాల్సిన బాధ్యత మనందరి మిద ఉంది. దిన్ని మీరు గుర్తిస్తారని ఆశిస్తున్నాను"(విధ్వంసం,2016,పుట-105,106)అంటూ అక్రమ ఇసుక మైనింగ్ పర్యవసానం, మన కర్తవ్యం చెప్పారు.

**జీవవైవిధ్యంపై ప్రభావం:-**

ఇసుక తవ్వకం జల మరియు భూసంబంధ పర్యావరణ వ్యవస్థలను తీవ్రంగా ప్రభావితం చేస్తుంది, వృక్షజాలం మరియు జంతుజాలం యొక్క జీవవైవిధ్యాన్ని దెబ్బతీస్తుంది. నదీగర్భాల అంతరాయం మరియు అవక్షేప రవాణా చేపల ఆవాసాలను ప్రభావితం చేస్తుంది, ఇది చేపల జనాభా క్షీణతకు దారితీస్తుంది. అదనంగా, వివిధ జాతుల తాబేళ్లు మరియు పక్షులకు గూడు కట్టడం వల్ల వాటి మనుగడకు ముప్పు ఏర్పడుతుంది. " పర్యావరణ పరిరక్షణ ఎంత అవసరమో రెండే రెండు ముక్కాల్లో చెప్తాను. ఆఖరి చెట్టు కూడా కొట్టేసిన తర్వాత , తుట్ట తుది నదిని కూడా విషతుల్యం చేసేశాక చిట్టచివరి చెప్పాను పట్టేశాక_అప్పుడు గుర్తిస్తావు నువ్వు డబ్బును తినలేమని. ఏది నా మాటలు కాదు. ఆదిమ రెడ్ ఇండియన్స్ సమేత. ఎప్పుడు మానవాళి గుర్తుంచుకోవాల్సిన బంగారు మాట!" (విధ్వంసం,2016,పుట-132) ప్రకృతి ప్రసాదించున సహజ వనరులు, మన పూర్వుల వలె, ముందు తరాలకి అందచేయాల్సిన బాధ్యత మన మీద ఉంది. అది మన సంస్కృతిలో భాగం. "సహజ వానరుల్ని మాయం చేసి , జీవవరనాన్ని, పర్యావరణాన్ని కలుషితం చేస్తే మానవ జాతి రోగాలతో నరకయాతన అనుభవించక తప్పదు. ప్రక్రుతి విధ్వంసానికి తగిన మూల్యం చేల్లిచక తప్పదు". (విధ్వంసం,2016,పుట-107)

**భూగర్భ జలాల క్షీణత:-**

విపరీతమైన ఇసుక తవ్వకాలు నదుల సహజ ప్రవాహాన్ని మార్చివేసి, భూగర్భ జలాల నిల్వ శక్తిని ప్రభావితం చేస్తాయి. ఇది క్రమంగా, వ్యవసాయాన్ని నిలబెట్టడానికి మరియు సమాజాలకు తాగునీరు అందించడానికి కీలకమైన భూగర్భ జల వనరుల క్షీణతకు దోహదం చేస్తుంది. . అప్పటి వరకు ప్రకృతి సౌందర్యంతో పచ్చగా ఉన్న పల్లెలు, నదీప్రవాహక ప్రాంతాలు నాశనమవుతున్నాయి. రంగాజీ బోరుబావి వెయ్యడానికి 200అడుగుల లోతున గొట్టం వేసినా నిరు పడలేదు! ఇదేమి చిత్రం ఆమడ్ దూరంలో నది ఉండగా నీరు పడకపోవడమేంటని ఉరందరూ ఆశ్చర్యపోయారు! చివరికి 370 అడుగుల లోతున ఇరు పడింది. "ఒక సెంటిమీటర్ మేర ఇసుక ఏర్పడాలంటే కనీసం 30 సంవత్సరాలు పాడుతుందనీ శాస్త్రవేత్తలే చెబుతున్నారు, వర్షాలు, వరదలు వచ్చినప్పటికీభూమిలోకి నీళ్ళు ఇంకడానికి ఇసుకననేలాలూ, నదీ పరివాహక ప్రాంతాలే కీలకం. ఇసుక ద్వారానే 15-20 శాతం నిళ్ళుభూమిలోకి ఇంకుతాయి మట్టి నెలల్లో కి ఇంకే నిరు 3-4 శాతం మాత్రమే. ఇసుక తవ్వకాల వల్ల ఆశించిన మేరకు భూమిలోకి నీళ్ళు ఇంకడం లేదనడానికి ఈ బోర్ ప్రత్యక్ష ఉదాహరణ!" (విధ్వంసం,2016,పుట-57.)

'మహబూబ్ నగర్ కల్వకుర్తి మండలంలో 500 అడుగులకు కూడా బోరు పడడంలేదు అక్కడ గార 20 ఏళ్ల నుండి 20, 30 అడుగుల లోతు ఇసుక తవ్వడమే కారణం. ఇప్పుడా ప్రాంతాల్లో తాగునీరు కూడా దొరకడం లేదు! వ్యవసాయ బోర్లల్లో నిరు రావడం లేదనీ నిజామాబాద్, బోధన్, బిర్కుఉరు ప్రాంతాల్లో రైతులు పలుమార్లు క్వారీల్లో తవ్వకాలను అడ్డుకున్నారంటే ఆ తీవ్రత ఎంతటిదో ఆలోచించాలి' మనం.

**సామాజిక పరిణామాలు;-**

అక్రమ ఇసుక తవ్వకాల సామాజిక పరిణామాలు ముఖ్యమైనవి. వారి జీవనోపాధి కోసం నదులపై ఆధారపడిన స్థానిక సంఘాలు, ఇసుక .మాఫియ మధ్య తరచుగా విభేదాలు తలెత్తుతాయి. చట్టవిరుద్ధమైన ఈ చర్యల వల్ల ఉద్రిక్తతలను తీవ్రమవుతాయి. ఇది వనరుల ప్రాప్యతపై వివాదాలకు దారి తీస్తుంది. అంతేగాక "మెలమెల్లగా ఉరు తన అస్తిత్వాన్ని కోల్పోతుంది, ఒక ట్రాన్సిట్ విలేజ్'గా, ఒక ఇసుక హబ్ గ, ఒక ఇసుక ఫేసిలిటేటరర్ గా మారిపోతుంది. గ్రమజివనం, సహకారం, అనుబంధాలు క్రమక్రమంగా. ధ్వంసమవుతాయి" (విధ్వంసం,2016,పుట-46.)

**అక్రమ ఇసుక మాఫియ - దౌర్జన్యం, హత్యలు:-**

విచారక విషయమేమంటే ఇసుక మాఫియ రాజకీయ బలం ఉన్నవారి గుప్పిట్లో ఉంది. ప్రజలను రక్షించాల్సిన పాలకులే, భక్షిస్తున్నారు! అందువల్ల ఇసుక మాఫియలో నేర తీవ్రత ఎక్కువగా ఉంటుంది. విచాక్షణారహితమైన ఇసుక రవాణావల్ల, పాఠశాల విద్యార్థి మరణిస్తే, ఇసుక మాఫియ వల్ల రామన్న, SP మహేశ్ చంద్ర మరణాలు సంభవించాయి! ఒక ప్రభుత్వ అధికారికే రక్షణ లేదంటే, ఇసుక మాఫియ ఎంతగా వేళ్ళునుకుందో తెలుస్తుంది. భారతదేశ వ్యాప్తంగా అనేక సామాన్య ప్రజలు, ప్రభుత్వ అధికారులు ప్రాణాలు కోల్పోయారు. వారిని హత్య చేసి ఆత్మహత్యగా చిత్రించారు. బెంగుళూరులో IAS ఆఫీసర్ D.K రవి ఇసుక అక్రమాలను వ్యతిరేకించినందుకు అనుమానాస్పద స్థితిలో మరణించాడు. మధ్యప్రదేశ్ లో మహిళా ఇన్స్పెక్టర్ శిఇనా పారక్ మీదికి ట్రక్ నడిపించబోయారు మరోచోట కవిత హుగర్ జీపుని లారితో గుద్దేశారు మక్తల్ లో తహశీల్దార్ వాహనానికి నిప్పు ఎత్తారు. ఆత్మకూరులో రైతును ట్రాక్టర్ తో డికొట్టి హతమార్చారు. తవ్వుకుంటుపోతే ఇలాంటి ఘటనలెన్నో వెలుగులోకి వస్తాయి. (విధ్వంసం,2016,పుట-117.) "వాళ్ళందరినీ లాగి పారెయ్యండి. ట్రాక్టరర్లతో తొక్కి పారేయండి.." బిగ్గరగా అరిచాడు" (విధ్వంసం,2016,పుట-165.) "క్రింద పడిఉన్న శక్తిప్రియ పీక మీద బూటు కాలువేసి అదుముతతూ విషం క్రక్కుతూ ఉన్మాదిలా నవ్వాడు. అతడి పట్టు నుండి తప్పించుకోడానికి పెనుగులాడుతుంది శక్తిప్రియ." (విధ్వంసం,2016,పుట-166.) MLA స్థాయి వ్యక్తీ ఈ విధంగా దౌర్జనన్యానికి పాల్పడడం సిగ్గుచేటు!

**డ్వాక్రా గ్రూపులు :-**

గ్రామీణ ప్రాంతాల్లో మహిళలు, చిన్నారులపై లింగ వివక్షను నిర్మూలించి, వారిని అభివృద్ధి చేయడానికి డ్వాక్రా(డెవలప్‌మెంట్ ఆఫ్ ఉమెన్ అండ్ చిల్డ్రన్ ఇన్ రూరల్ ఏరియాస్) కార్యక్రమాన్ని ప్రారంభించారు. – ఈ పథకాన్ని 1982లో అమల్లోకి తెచ్చారు. మొదటగా దీన్ని దేశవ్యాప్తంగా పైలట్ ప్రాజెక్టుగా 50 జిల్లాల్లో ప్రారంభించారు.

ఆతర్వాత దేశంలోని అన్ని జిల్లాలకు విస్తరించారు. డ్వాక్రా పథకం ముఖ్యోద్దేశం మహిళల జీవన పరిస్థితులను మెరుగుపరచడం, తద్వారా పిల్లల ప్రాథమిక, సామాజిక సేవలకు స్వయంఉపాధి కల్పించడం. ఇది ఐ.ఆర్.డి.పి. పథకంలోని భాగము. దీన్ని 1982లో ప్రారంభించారు. మహిళలను బృందాలుగా ఏర్పరచి, వారికి కొవ్వొత్తుల తయారీ, అగ్గిపుల్లల తయారీ, టైలరింగ్, కుట్లు - అల్లికలు మొదలైన కుటీర పరిశ్రమలకు అవసరమయ్యే శిక్షణను కూడా ఇప్పిస్తారు. ఈ పథకం క్రింద పనిచేసే మహిళల పిల్లల రక్షణకు శిశు సంక్షేమ కేంద్రాలు, బాల్వాడీలను ఏర్పరుస్తారు. ఆరు నెలల ట్రైనింగ్‌లో రెండు వందల రూపాయల స్టైఫండ్ ఇస్తారు. ప్రాజెక్టులు రూ.10లక్షలు మించరాదు. ఈ పథకానికి సంబంధిన నిధులను గ్రామీణాభివృద్ధి మంత్రిత్వశాఖ నేరుగా జిల్లా కలెక్టర్లకు విడుదల చేస్తుంది.

డ్వాక్రా గ్రూపు మహిళలకు సంబంధిత రంగాల్లో శిక్షణ ఇచ్చి స్వయం ఉపాధి కల్పించి, రుణ సౌకర్యం ఏర్పర్చడం ద్వారా వారికి జీవనోపాధి కల్పించడమే కాకుండా వారిలో మానసికస్థైర్యాన్ని నింపడమే లక్ష్యంగా అమల్లోకి తెచ్చారు. గ్రూపులుగా ఏర్పర్చి సమూహంగా కార్యకలాపాలు నిర్వహించడం ద్వారా సంఘంలో వారి ప్రతిష్ట పెరగడమే కాకుండా, గ్రామీణ

మహిళల్లో పొదుపు పెరుగుతుంది. తద్వారా దేశం కూడా అభివృద్ధి చెందుతుంది. డ్వాక్రా గ్రూపుల ద్వారా మహిళల వ్యక్తిగత ఆదాయం పెరగడమే కాకుండా, కుటుంబాల కనీస అవసరాలు తీరి సంఘంలో వారి స్థానం సుస్థిరమవుతుంది. ఈ పథకం ద్వార ఎంతో మంది మహిళలు, తమ కాళ్ళ మీద తాము నలబడడమే కాకుండా, వ్యాపారస్తులుగా ఎదిగారు. అరుణ ఆధ్వర్యంలో "గ్రూపు సభ్యులు పాలు అమ్ముతున్నారు. పచ్చళ్ళు అమ్ముతున్నారు. పూతరేకులు అమ్ముతున్నారు. కుట్టుడాకులు కుడుతున్నారు రంగురంగుల బుట్టలు అల్లుతున్నారు. ఎవరిలో ఏకళఉంటే అది, ఎవరికెంత వీలైతే అంత చేస్తున్నారు ఆదీగాక మైక్రోఫైనాన్స్ సంస్థల వలలో పడకుండా జనాన్ని కొంతైనా రక్షిస్తుంది మా అరుణ" (విధ్వంసం,2016,పుట-29.)

అరుణ ఊరిలో డ్వాక్రా గ్రూపును ఏర్పాటు చేసి సమర్థవంతంగా నిర్వహిస్తుంది. ఇసుక క్వారీ నిర్వహణ కూడా విరి చేతిలోకి వస్తుంది. MLA సతత్తిబాబు ఎంత బెదిరించినా లొంగదు. ఇదంతా ఊరి స్త్రీల సహకారంతోనే సాధ్యమయింది. పంటలు పండక, అప్పుల ఊబిలో కూరుకుపోయినా, పస్తుల బాధ లేకుండా తల్లిలా ఆదుకుంది! "బంగారంలాంటి మా పొలాన్ని ఆ ముదనష్టపోడు లాక్కున్నాడో, అప్పుడే మా పని అయిపొయింది. డ్వాక్రా సంఘం పుణ్యామా అని, ఆపని ఈపని చేస్తూ నాలుగు మెతుకులు తింటున్నాం గాని లేకపోతే ఎండ్రిన్ తాగి చావల్సినోల్లమే!" (విధ్వంసం,2016,పుట-87.) అన్న సూరమ్మ మాటల ద్వారా గ్రామాల్లో, డ్వాక్రా గ్రూపుల ప్రభావాన్ని అర్థం చేసుకోవచ్చు.

**అప్పులు తిప్పలు:-**

చిన్న, సన్నకారు రైతులకు పండిన పంట తిండికే బొటాబొటిగా సరిపోతుంది. మిగులు అన్నమాటే ఉండదు అటువంటి స్థితిలో మళ్లి పంట పెట్టుబడి కోసం అప్పులు చేస్తారు. మెట్ట ప్రాంతాల్లో బోరు బావుల వైఫల్యం చెందటం, పత్తి, మిర్చి, వరి వంటి పంటలకు ఏటా పెట్టుబడులు పెరగడం, గిట్టుబాటు ధరలు లభించకపోవడం, కౌలుదారులకు బ్యాంకు రుణాలు అందకపోవడం, వర్షాభావం, ప్రకృతి వైపరీత్యాలు, చీడపీడల తాకిడి, బిడ్డల చదువులు, పెళ్లిళ్లకు చేసిన అప్పులు చేస్తారు. భుమిమ్లేని రైతు ఉంటాడేమో కానీ, అప్పులేనీ రైతు ఉండదు! ఇదే అదునుగా మైక్రో ఫైనాన్స్ సంస్థలు, అధిక వడ్డీలకు రైతులకు ఋణాలిచ్చి, వారిని జలగల్లా పిల్చి పిప్పి చేసి, వారి మరణానికి కూడా కారణం అవుతున్నాయి. ఇదేవిధంగా ఊరిలోని అనంతయ్య అప్పుల బాధతో కదిమోకుతో ఉరి పోసుకుంటాడు. అతడి భార్యాబిడ్డలు లబోదిబోమంటుంటే బాధగా, భయంగా చూస్తూ నిలబడ్డారు గ్రామస్తులు(విధ్వంసం,2016,పుట-41.). "మనం బతికుండగానే పిక్కుతినే రాబందులు వీళ్ళు. వీళ్ళు ఎంత వడ్డీ వాసులు చేస్తున్నారో తెలుసా? అంటూ ఏజెంట్ దగ్గరికి వెళ్లి "నువ్వు చెప్పరా" అని గద్దించాడు నారాయణ. నలభై అయుదు పర్సెంట్ దాకా ఉంటుంది! నసిగాడు ఏజెంట్. ఖర్చులూ, ఇన్స్యూరెన్స్ కలిపితే అరవై పర్సెంట్ ఉంటుంది.. ఎంత దారుణమో ఆలోచించండి అనంతయ్య శవం సాక్షిగా చెబుతున్నాను, వీళ్ళనింక ఊళ్లోకీ రానివ్వొద్దు...." (విధ్వంసం,2016,పుట-43.)

అప్పులిచ్చిన వారి ఒత్తిళ్లు తట్టులేక, మానసిక, అనారోగ్య సమస్యలు తలెత్తి, ఆత్మహత్య చేసుకోవడం జరుగుతోందని పలు సర్వేల్లో తేలింది. ముఖ్యంగా కౌలు రైతులు అధిక వడ్డీలకు అప్పులు చేసి, పంటలకు పెట్టుబడి పెట్టి నష్టపోతుండటంతో కౌలుదారులకు ఆత్మహత్యలే శరణ్యమౌతోంది. ఇలా రైతుల బలవన్మరణాలకు కారణాలు అనేకం ఉన్నాయి, అందులో ప్రధాన కారణం అప్పులే!

**ముగింపు :-**

ఇసుక అక్రమ దందాను అరికట్టేందుకు ప్రభుత్వం గనులు మరియు ఖనిజ అభివృద్ధి మరియు నియంత్రణ చట్టం - 1957 (MMDR చట్టం), ఎన్విరాన్మెంట్ ఇంపాక్ట్ అసెస్మెంట్ -2006 (EIA): సస్టైనబుల్ ఇసుక నిర్వహణ మార్గదర్శకాలు (SSMG) - 2016 మొదలైనవి చేసింది. రాష్ట ప్రభుత్వం, జిల్లాలో ఇసుక అక్రమ తవ్వకాలకు సంబంధించి ఫిర్యాదులు నమోదు చేసేందుకు కలెక్టరేట్ కంట్రోల్ రూమ్లో 24 గంటలపాటు ఫిర్యాదు సెల్ను ఏర్పాటు చేశారు. ఫిర్యాదుల నమోదు కోసం ఆ సెల్ పనిచేస్తుంది. అక్రమ

వ్యవహారాన్ని అరికట్టేందుకు ఏర్పాటు చేసిన రెవెన్యూ స్క్వాడ్‌లకు అదనపు జిల్లా మేజిస్ట్రేట్ (ADM) తగిన ఆదేశాలు ఇచ్చారు. తహశీల్దార్లు దాడులు నిర్వహించి అక్రమాలకు పాల్పడుతున్న వాహనాలను సీజ్ చేస్తూ, జిల్లా కలెక్టర్ దృష్టికి తీసుకెళ్లోచ్చు. కంట్రోల్ సెల్ నుంచి అందిన సమాచారం మేరకు, దాడులు నిర్వహించి అక్రమ కార్యకలాపాల నియంత్రణకు, అవసరమైన చర్యలు తీసుకునే అధికారాలు సర్కిల్ ఇన్‌స్పెక్టర్/సబ్ ఇన్‌స్పెక్టర్‌కు ఇవ్వబడ్డాయి..

తెలంగాణా వనరుల దోపిడి గత రెండున్నర దశాబ్దాల నుండి అధికంగా జరుగుతున్నది. ఒక్కమాటలోచెప్పాలంటే మైనింగ్ ప్రకృతి పై జరుగుతున్న అత్యాచారమని చెప్పవచ్చు! తెలంగాణా ప్రాంతంలోని సహజవనరుల దోపిడీ పెట్టుబడిదారుల చొరవతో యధేచ్ఛగా జరుగుతున్నది. కేరళలో 44 నదులుంటే ఇసుక మైనింగ్ వల్ల 8 నదులు ఉనికిని కోల్పోయాయి. మిగిలిన 32 నదులు దయనీయ స్థితిలో ఉన్నాయి! కంచె చేను మేసినట్లు ప్రజలవైపు ఉండాల్సిన నాయకులే ఈ విధ్వంసం చేయడం దురదృష్టకరం. ఈ నాయకులు ప్రజలకు ఏమీ చేయకపోయినా ఫరవాలేదు, కానీ ఇలా ఉమ్మడి వనరులు విధ్వంసం చేయడం దురదృష్టకరం. అటవీ పర్యావరణ, చారిత్రిక, దేవాదాయశాఖ, భూగర్భజల, పంచాయతీరాజ్‌శాఖల నిబంధనలను తుంగలో తొక్కుతూ, సహజ వనరుల దోపిడీ విశృంఖలంగా జరుగుతున్నా పట్టించుకునే నాథుడే లేడు. రాష్ట్రంలోని బడా పెట్టుబడిదారులు, ప్రజాప్రతినిధులు, వీరి బినామీలు, ఈ వనరుల దోపిడీలో కీలకపాత్ర పోషిస్తూ, రూ.వేలాది కోట్ల ఆదాయాన్ని స్వాహా చేస్తూ, ప్రభుత్వ ఖజానాకు గండి కొడుతున్నారు.

కేవలం ఇంట్లో బోరింగ్ వేసుకుంటేనే వాల్టా చట్టం కింద అనుమతులు తీసుకోవాలని చెబుతున్నా, తెలంగాణలోని అన్ని జిల్లాలో కొండలు, గుట్టల్ని ఎలాంటి చట్టాలు అనుమతించకున్నా, అడ్డుఅదుపు లేకుండా గత కొన్ని దశాబ్దాల నుం డి ధ్వంస రచన చేస్తూ, ఇసుక మాఫియా చేస్తున్న విద్రోహ ఆగడాలకు కల్లెం వేసే అధికారులు కరువైపోయారు. మానవ మృగాలు(సత్తిబాబు, బండ సుబ్బడు) రాజకకీయం ముసుగులో, సహజ వనరు ఇసుక మిద కన్నేసి, దోచుకున్న విధం కళ్ళకు కట్టారు. ఈ నవలలో రచయిత సమస్యలను చెప్పడమేగాక, ఆ సమస్యలను పరిష్కరించుకునే విధానాలను చెప్పడమే కాకుండా, ఆ సమస్యలను పరిష్కరించుకునే విధానాలను కూడా చెప్పాడు. పౌరహక్కుల సంఘం, మానవహక్కుల సంఘం, తెలంగాణ భూమి పరిరక్షణ సంఘం , అరుణోదయ కళాబృందాలు మొదలైన సంస్థలు చేస్తున్న కృషి తెలుస్తుంది. మరి ముఖ్యంగా ఈ సంస్థలతో కలిసి స్థానిక ప్రజలందరు ఐక్యంగా పోరాటం చేస్తేనే సమస్యలకి పరిష్కారం దొరుకుతుందనే సందేశాన్నిస్తుంది. ప

**ఉపయుక్తగ్రంథసూచి:-**


1) తెలంగాణ నవల- వస్తువివేచన, 2018, రమాదేవి మారబోయిన, హైదరాబాదు విశ్వవిద్యాలయం (అముద్రిత సిద్ధాంత పరిశోధన వ్యాసం), హైదరాబాదు.
2) విధ్వంసం. సింహప్రసాద్, 2016, నవతె లంగాణ పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు.
3) www.sasshi.com
4) www.studyiq.com
5) www.ntnews.com


********

# 55. కథాసాహితి ప్రచురిత 'పాతికేళ్ల కథ'(1990-2014): సామాజిక దృక్పథం

**తలారి హరీష్ కుమార్**

పరిశోధక విద్యార్థి

తెలుగు విభాగం

యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్

ఫోన్ నెం. 9666283626

ఈమెయిల్ఐడి: harishkumartalari3626@gmail.com

**పరిచయం**

అభివృద్ధి, వెనుకబాటుతనం, ముందు వెనుకలు, మంచి చెడులు వంటి సామాజిక మూలాల మీద నుంచే సామజిక స్పృహ సాహిత్యంలో కూడా విస్తరిస్తుంది. ఆ ఎక్కువ తక్కువలు మారనప్పుడు అనివార్యంగా సాహిత్యంలో ఆ ప్రాంత పరిస్థితులు ప్రతిబింబిస్తూ ఉంటాయి. ఆయా జీవితాలను వాస్తవికంగా, చారిత్రకంగా చిత్రించడమే రచయిత కర్తవ్యం. ఈ తత్వాన్ని ఒంటపట్టించుకున్న రచయితలు వాస్తవికతా దృష్టితో, తమదైన శైలుల్లో కథానికలు సృష్టించి గొప్ప సాహిత్యాన్ని అందించారు. రచనల్లో కేవలం వాస్తవాన్ని అందించడం వేరు. సామాజిక దృక్పథంతో వాస్తవాన్ని చిత్రించడం వేరు. సామాజిక దృక్పథంతో వాస్తవ చిత్రీకరణ జరగాలంటే రచయితకు భౌతికవాదం, వర్గ చైతన్యం, వర్గ దృక్పథాలతో పరిచయం ఉండాలి. రచయిత ఏ నేపథ్యంలో కథ రాస్తాడో ఆ విషయాల మీద కనీసమైన మౌలిక అవగాహన, సామాజిక స్పృహ కలిగి ఉండాలి.

మానవ సమాజం విశాలమైనది, పరిణామశీలమైనది. కాలం మారుతున్న కొలది సమాజంలోని సంఘటనలలో, సన్నివేశాలలో మార్పు వస్తుంది. ఈ వైరుధ్యాలు సామాజిక సంబంధాల మీద ప్రభావాన్ని చూపుతాయి. ఈ సామాజిక సంబంధాలు కాలానుగుణంగా రూపొందుతూ, మార్పుకులోనై కొత్త అభిరుచిని కూడగట్టుకొని సంఘ పరిస్థితులమీద, మానవ సంబంధాల మీద ప్రభావాన్ని చూపుతాయి. మానవుడు తన చుటూ ఉన్న ప్రకృతిలోని జంతు వృక్షజాలంతో తమతోటి వారితో సంబంధాలను ఏర్పర్చుకొని జీవనం కొనసాగిస్తుంటారు. ఈ సమాజంలో రచయిత కూడా అంతర్భాగమే కావున సామాజిక రూపాన్ని బహిర్గతం చేసే రచనలు అతని కలం నుంచి వస్తాయి. మానవ సమాజం పట్ల అభిమానం, మానవుల ఐక్యతపై అభినివేశం గల రచయిత తనంతట తానుగా సామాజిక పరివర్తనకు దోహదపడతాడు. తాను సమాజంలో భాగస్వామి అయి సమాజ పోకడను అర్థం చేసుకొని తన రచనలో ఆ సమాజాన్ని చిత్రిస్తాడు. సామాజిక హృదయాన్ని ప్రేరేపించగలిగేది రచయిత సృజనశక్తే. ఈ కథాసాహితి ప్రచురిత 'పాతికేళ్ళ కథ'(1990-2014) సంకలనంలోని కథ రచయితలు కూడా సామాజికాంశాలను సృజించారు. ఇలా తెలుగు సమాజంలో వచ్చిన సకల మార్పులు ఈ సంకలనంలోని కథల్లో ప్రతిబింబిస్తాయి. పాతికేళ్ల సామాజిక చరిత్రకు కథాదర్పణం ఈ సంకలనం. 1990-2014 వరకు వాసిరెడ్డి నవీన్, పాపినేని శివశంకర్ సంపాదకులుగా కథాసాహితి ఆధ్వర్యంలో వచ్చిన 25 వార్షిక కథా సంకలనాలను 155గురు కథకుల 336 కథలతో 1300+1300 పేజీల రెండు బృహత్ సంకలనాలుగా 'మనసు ఫౌండేషన్' ద్వారా పాతికేళ్ళ కథ అనే పేరుతో వెలువరించారు.

**పాతికేళ్ల కథ – సామాజిక దృక్పథం**

ప్రపంచం అభివృద్ధి చెందుతు కొత్త విషయాలు, కొత్త ఆలోచనలతో ముందుకు సాగుతుంది. అదే ప్రపంచీకరణ చిన్న, సన్నకారు వ్యాపారులకు శాపంగా మారుతోందని తెలిపే కథ  పెండెం సోడా సెంటర్. దీనిని మహ్మద్ ఖదీర్ బాబు రాశాడు. సోడా

సెంటర్ నడుపుతూ జీవన వృత్తిగా తరాలుగా వాటిపై కుటుంబాన్ని పోసించే చంద్రయ్య ద్వారా ఆధునిక విదేశీ శీతల పానియాల వలన దేశి సోడా సెంటర్ లు మూతపడిన తీరు కారణం భారతదేశంలో కోకాకోలా ప్రవేశించాక, నిండు కాలువలు పారే పచ్చటి పల్లెసీమల నుంచి మొదలుకొని చుక్కనీళ్లు కూడా దొరకని ఎర్రటి ఎడారి నేలల వరకూ అది విస్తరించాక, ఇక్కడి పసిపిల్లలకు ఉగ్గుపాలకు బదులు కోకాకోలానే అలవాటు చేసేంతగా జాతి వృద్ధి చెందాక, ఒక చలువపెట్టె(refrigerator) పెట్టుకొని కొంత సరుకు వేయించుకొని, దానిని అమ్ముకుంటూ సోంబేరుల్లాగా గల్లా పెట్టెల ముందు కూర్చోవడానికి నవ యువకులందరూ సిద్ధపడ్డాక ఊరు ఊరునా ఎన్నో దేశీయ పానీయాలు అయిన సోడా,ఈత,తాటికల్లు మొదలగు వాటిని అమ్ముతూన్న చిన్న సన్నకారు వృత్తులు సమాజ అభివృద్ధిలో అంతరించిపోతున్న తీరును చూడవచ్చు.

మారుతున్న ఆర్థిక సంస్కరణలు, ప్రపంచీకరణ వలన వృత్తి జీవనం కొనసాగించే వారిపై ప్రభావం బలంగా చూపాయని పెద్దింటి అశోక్ కుమార్ రాసిన వలస కథలో మనకు కన్పిస్తుంది. చెళ్ళలో ఉన్న వడ్ల గింజలను తన గాడిదల ద్వారా ఇంటికి చేర్చడం సాయిలు వృత్తి. ఆ పరిస్థితి ఇప్పుడు లేదు. ఈరోజు కాకపోయినా రేపైనా దొరుకుతుందన్న ఆశతో సాయిలు రెండు రోజులు గడిపాడు. ఒకటి రెండు తప్ప కిరాయిలు రాలేదు. అవి కూడా సగం రేటుకే ఒప్పుకోక తప్పలేదు సాయిలుకు. మూడవనాడు మల్లారెడ్డిని కలిశాడు సాయిలు. అతడిని చూడగానే ఏడ్చినంతపని చేసాడు. సాయిలును ఓదారుస్తూ చెప్పాడు మల్లారెడ్డి. ఊరంతా మూడు ట్రాక్టర్లున్నాయి. పవర్ టిల్లర్లున్నాయి. ఒక కోత మిషన్ కూడా ఉంది. అవి ప్రాణం లేని యంత్రాలు. వాటితో నువ్వు పోటీ పడలేవురా. ఇక్కడ ఉండడం కంటే నువ్వు వెళ్లిపోవడమే మంచిది. ఆశ చావక మరో రెండు రోజులు వేచి చూశాడు సాయిలు. ఒక్క పురుగు కూడా రాలేదు. అర్ధరాత్రి నిద్రలేచి గాడుదులతో బయల్దేరాడు. మొట్టమొదటి సారిగా ఆ ఊరి నుండి ఖాళీ సంచులతో వెళ్తున్నాడు సాయిలు. అప్పటికీ ఇప్పటికీ రైతుల్లో ఎంతో మార్పును గమనించాడు సాయిలు. పొద్దు పొడుస్తూనే చేన్లల్లో వాలి కూరుకు రాత్రి వరకు పనిచేసే రైతులు కరువైపోయారు. ఏడెనిమిది దాటాక రెండుమూడు సార్లు టీ తాగి గానీ పొలాలకు రావడం లేదు. టైం ప్రకారం పని. పొద్దుగూకిందంటే ఇంటికి చేరుకుంటున్నారు. ఇళ్లల్లో టీవీలు, వాటికి కేబుల్ కనెక్షన్లు వచ్చాయి. ముందటిలా ఎడ్లదొడ్లకాడ కూరుకు రాత్రి వరకు ముచ్చట్లు లేవు. మారతున్న ప్రపంచీకరణలో మనిషి కూడా యంత్రంల మారుతున్నాడు. సామాజిక సంబంధాలు, కుల వృత్తులను యాంత్రిక ప్రపంచం తుడిచిపెట్టిన తీరును చూడవచ్చు.

నెల్లూరు ప్రాంతంలో పంట పోలాలు అంతరించి చేపల, రొయ్యల చేరువులుగా మారుతున్న తరుణంలో భూమిని నమ్ముకున్న రైతు వేదన తెలియజేసే కథ గుండ్లకమ్మ తీరాన. దీనిని రచించినది కాట్రగడ్డ దయానంద్. రోశయ్యతో వెంకటేశ్వర్లు మాట్లాడుతూ దుక్కిదున్ని వ్యవసాయం చేసి పంటలు తియ్యాల్సిన మనం భూమిని చేపల చెరువులకనీ, రొయ్యల గుంటలకనీ తెగనమ్ము కుంటే మన పరిస్థితి ఏంటి. గుండ్లకమ్మ, ఆ పక్కనున్న పాలెంలో ఏం జరుగుతుందో మనం వింటం లేదా. ఊరెమ్మటి పొలాలన్నీ రేట్లొచ్చినాయని రొయ్యల చెరువులకు అమ్మితిరి. కొన్నోడు ఊరుకుంటాడా ఉప్పునీళ్లతో రొయ్యల్ని పండించడం. ఊరి చెరువుల్లోగాని, బావుల్లోగాని తాగడానికి మంచినీళ్ల చుక్క లేకుండా ఉప్పు నీళ్లుగా మారాయి. ఇయ్యాల నీళ్లకోసం ఎంత అవస్తపడుతున్నారో చూస్తున్నాంగా. బెజవాడ నుంచో, నెల్లూరు నుంచో వచ్చి సాగుభూములన్నిట్నీ ఉప్పునీళ్ల చెరువులు చేశారు. రొయ్యల్ని అమెరికోల్లు, జపానోల్లు లక్షలకు లక్షలుపోసి కొంటారంట చెరవులోల్లది ఏం పోయింది. ఒంగోల్లో నీళ్లడబ్బాలు కొనుక్కొని తెచ్చుకుంటున్నారు. నీళ్ల అవస్తలు పడలేక జనమంతా ఒకటై కలక్టరు చుట్టూతిరిగారు అయిన ఫలితం లేదు. ఆయనేం చేస్తాడు. పొలాలు అమ్ముకున్న తర్వాత వాళ్లిష్టమొచ్చినట్టు చేసుకుంటారు అని తీర్మానాలు చేసాక. ఒక పక్కన తాగడానికి నీళ్లులేక, మరోపక్క గొడ్లకు పచ్చిమేత, తిరగడానికి చోటూ లేక ఒక రాత్రి అందరూ పోయి నీళ్లు పెట్టిన చెరువు కట్టలు తెంపారు. అది తెలిసిన చెరువులోల్లు బెజవాడ నుంచి లారీలల్లో మనుషుల్ని తీసుకొచ్చి ఊరి జనాల్ని కొట్టిస్తిరి. ఇయ్యాలపాలెంలో ఎవురన్నా ఏదన్నా మాట్లాడాలన్నా బొడ్లో కత్తులూ, చైన్లూ పెట్టుకుని

తిరుగుతున్న కొత్త మనుషులకు భయపడుతున్నారు ఊరి జనం. పొలాలమ్ముకుంటే మన గతి అదేరా వెంకటేశ్వర్లు తన మనసులోని మాటను చెప్పాడు. అయిన చివరకు చుట్టుపక్కల అందరూ అమ్మడం వల్ల రోశయ్య వెంకటేశ్వర్లు పొలం అంతట ఉప్పు నీరు చేరటం అధికారులను సంప్రదించిన ఉపయోగం లేక పోవడం వలన వాళ్ళతో పోరాడి చావు మీద తెచ్చుకోవడం చూడవచ్చు. పారిశ్రామిక, వాణిజ్య పంటల వలన పెత్తందారుల భూ దోపిడి తట్టుకోలేక భూమిని నమ్ముకున్న చిన్నరైతుల పరిస్థితిని తెలియజేస్తుంది.

పెట్టుబడిదారీ వ్యవస్థ, శ్రామిక వ్యవస్థ పై జరుగుతున్న శ్రామిక దోపిడి, ఆర్థిక మోసాలు, సామాజిక న్యాయం జరగకపోవడం గురుంచి తెలియజేసే కథ అలజడి. ఈ కథను కాట్రగడ్డ దయానంద్ రాశారు. మునపటి రోజులు గాదు నారాయణ. పియ్యేఫ్లు, పెన్షన్లూ ఇవ్వాల్సి వస్తుందని గనిలోకి పోయే వాళ్ల నిజం పేర్లు రికార్డుల్లో ఉండనే ఉండవు. ఏ రోజు కూలీకి ఆరోజు వెల్లడం, డబ్బు తెచ్చుకోవడం, అట్లా అలవాటు చేశారు జనాన్ని. ఇష్టమైతే పన్లోకిరా, లేకపోతే లేదు అంటున్నారు మేనేజర్లు. ఒకపక్కన గనులల్లో చేస్తున్న మోసానికి తోడు ప్రభుత్వం కూడా సిబ్బందిని తగ్గించాలనీ, ఆదాయం లేని శాఖల్ని మూసేయ్యాలని తీసుకున్న నిర్ణయం అంటున్నారు కొందరు అని ప్రకాష్ ఒక్కోమాట నిదానంగా పలుకుతున్నాడు. గనులలో పనిచేసే కార్మికులు ఆనారోగ్యంకు గురైతే సరైన ఆరోగ్య సదుపాయాలు, వారికి ఆర్థిక భరోసా కల్పించకపోవడం, వారి పిల్లలకు ఆ ప్రాంతంలో విద్యను అందించే పాఠశాలాలకు ప్రోత్సాహం ఇవ్వక మూసివేయడం.ఈ పరిస్థితుల వలన గనులలో కూలి జీవనం పై ఆధారపడిన వారి దుర్భరపరిస్థితిని తెలియజేస్తుంది. ఈ నూతన ఆర్థిక సంస్కరణల వలన ప్రభుత్వరంగ సంస్థలు ప్రైవేటీకరణ కావడం, ఆదాయం లేని ప్రభుత్వశాఖలు మూసివేయడం వాటిపై ఆధారపడిన కుటుంబాల దుర్భర పరిస్థితిని ఈ కథలో బలంగా చిత్రించారు.

సజీవమైన నూతన యుగావిష్కరణ కోసం ప్రాణాలను సైతం పణంగా పెట్టి పోరాడుతున్న వీరుల గురుంచి తెలిపే కథ అతడు. ఈ కథను అల్లం రాజాయ్య రాశారు. కార్మికుల కోసం పోరాడిన కొమురయ్య శవయాత్రలో పాల్గొంటూ భూమయ్య కుడిజబ్బ ఎవరో పట్టుకున్నట్లనిపించి తలెత్తి చూశాడు. స్వామి నిలబడి ఉన్నాడు. స్వామి కళ్ల నిండా నీళ్లు. వణికే తన కుడిచేతిని సాచి భూమయ్య స్వామి చేతిని అందుకున్నాడు. మనం రోజూ అనేకమార్లు చస్తాము. ఆ చావు లెవరికి కన్పించవు. ఇది చావు కాదు. ఇది మృత్యువు కాదు. చావులో కూడా అతను విజయుడే, స్వామి చెయ్యి ఇలాంటి మాటను సంకేతించినట్లుగా భూమయ్య శరీరం గ్రహించింది. భూమయ్య చెయ్యి వెనక్కి తీసుకొని నడుస్తున్నాడు. ఈ విధంగా కార్మికులు ప్రాణాలకు లెక్క చేయకుండా కష్టాపడుతున్నా యాజమానుల నుండి బలమైన వ్యతిరేకతను ఎదురిస్తున్నా, తరుచుగా తిరుగుబాటు ఉద్యమాలను గ్రహించి యాజమాన్యాలు తమ ఆస్తులకు ముప్పు వాటిల్లుతుందనే కారణంతో సమ్మెలను నిలిపివేయడం, ఆంక్షలు విధించడం జరుగుతుంది. కార్మిక ఉద్యమం యొక్క ప్రాథమిక సూత్రం ఒకే విధంగా ఉంది. ఒక ఉద్యోగి కార్యాలయంలో మార్పును సాధించలేడు, కానీ కార్మికులు కలిసి ఉన్నప్పుడు వారు గణనీయమైన పరివర్తన చెందుతారు. అనేక వివాదాలు చర్చల ద్వారా పరిష్కరించబడినప్పటికీ, ఒక ఒప్పందం కుదిరే వరకు ఉద్యోగులు పని చేయడానికి నిరాకరించినప్పుడు సమ్మెల ఫలితంగా కార్మిక ఉద్యమానికి అనేక ప్రధాన లాభాలు వచ్చాయి. కొన్ని సమ్మెలు కొన్ని గంటలు మాత్రమే ఉంటాయి, మరికొన్ని సంవత్సరాలపాటు సాగుతాయి. కొన్ని శాంతియుతంగా పరిష్కరించబడ్డాయి, మరికొన్ని రక్తపాత, హింసాత్మక ఘర్షణలకు దారితీశాయి. కొన్ని సమ్మెలలో కార్మికులు విజయం సాధించగా మరికొన్ని ఘోర పరాజయంతో ముగిశాయి. అలాంటిదే అతడు కథలోని కొమరయ్య పాత్ర. ఉద్యమానికి 'అతడిని పర్యాయపదంగా చేసి రచయిత చిత్రించిన తీరు తెలుగు కథలో కళావిలువలు సాధించిన అత్యున్నత స్థాయికి నిదర్శనం.

డ్రైవర్ పని నమ్ముకొని బ్రతుకుతూ అందులో వచ్చే ఆదాయం వలన జీవనం కొనసాగించలేక మానసిక ఇబ్బంది పడుతు ఇంకో పని చేయలేక ఈ పని మీద బ్రతకలేక, అప్పుల గురుంచి, కుటుంబ సమస్యల గురుంచి తెయజేసే కథ పీడ. దీనిని రాసినది పెద్దింటి అశోక్ కుమార్. ఆటోలకు పోటీగా జీపును నాడుపుతున్న స్కైల్యాబ్ (కైలాబ్ వ్యవహారికంలో) బ్యాంక్ లో లోన్ దాని వల్ల నష్టపోయి ఆ

అప్పును కూర్చుకొనికి దళారి బుచ్చిరెడ్డి దగ్గర అప్పు చేయడం. అప్పు తిరక జీపును అతనికి అప్పజెప్పడం మరలా తన వాహనాన్ని అతని దగ్గరే అద్దెకు తీసుకోవడం. రోజుకు రెండొందలకు ఇచ్చేలా మాట్లాడుకున్నాడు. అ దైర్యంతో వాహనం నడుపుతూ కైలాబ్ ప్యాసింజర్స్ చేసిన చౌక కిరాయిలు మాట్లాడటం. అయిన అప్పుకోసం, పెట్రోల్ కోసం, ఇదే జీపు జీవనాధారంగా నడిపిన తన తండ్రి మంచానపడి ఉన్నాడు. అతనికి మందుల కొరకు ఆటోల పోటీ తట్టుకోలేక ఎంతో కొంతకు నడిపాడు. కానీ మార్గ మద్యలో ఆర్. టి. ఏ లకు లంచం, పోలీస్ ల అవసరాల కోసం జీపును వాడుకోవడం వలన అతను పడిన బాధను, అలాగే రవాణా వాహనాలు నడపడం వృత్తిగా గల వారు పడుతున్న బాధలను తెలియజేస్తుంది. బ్యాంక్ వాళ్ళు ఋణ సహాయం పేరుతో చేస్తున్న మోసాన్ని, దళారి మోసాల్ని సామాజిక సమాజానికి ఈ కథ ద్వారా తెలియజేసే ప్రయత్నం చేశారు.

గోపి - ఒక తండ్రి కథ నుండి, రఘోత్తమరెడ్డి - జాడ కథ వరకూ అందులోని పాత్రలన్నీ వ్యవస్థ వికృతత్వానికి బలైపోతున్నవే దీనికి వ్యతిరేకంగా కొంతవరకు నిరసననైనా వ్యక్తం చేయలేని మేధోవర్గపు అలసత్వాన్ని సామాజిక స్పృహతో నిలదీసి ప్రశ్నిస్తాయి ఆ పాత్రలు. వ్యవస్థీకృత వికృత సామాజిక దురహంకారానికి ప్రతీకలు. అల్లం రాజయ్య - మహదేవుని కల కథలో భూమికి బలవంతంగా దూరం చేయబడిన రైతు ఆర్తనాదం వినబడుతుంది. మహదేవుని సకల శక్తులు హరించివేసిందెవరన్న ప్రశ్నలోనే సమాధానం ఉంది. నిజానికి మహదేవుడు ఒక పాత్ర కాదు. వర్తమాన రైతుకి ప్రతీక. ఒక కోణంలో అది స్పెసిఫిక్ పాత్ర అయితే మరోకోణంలో సామాన్యీకరించబడిన పాత్ర.

**ముగింపు**

సామాజికోద్యమాలు లేకుండా సాహిత్యోద్యమాలు ఉండవు. స్త్రీవాద, దళిత వాదాలకు సంబంధించి సమాజంలో ఇవాళ ఏ ఉద్యమాలు లేవు. వెన్నుదన్నుగా సామాజికోద్యమాలు లేనప్పుడు అవి సాహిత్యోద్యమాలుగా బలమైన ధోరణులుగానే(trends) కొనసాగగలవు. సమగ్ర సామాజిక విప్లవానికవసరమైన చైతన్యంలో భాగంగా ఆ వాదాలకు ప్రత్యేక ప్రాముఖ్యం ఉంటుంది. ఒకప్పటి విప్లవ కథకీ ఇవాళ వస్తున్న విప్లవ కథకీ పోలికలేదు. 1970, 80 దశకాల్లో వచ్చిన విప్లవ కథల్లో సాధారణీకరణ, పోరాట ప్రధానాంశం భావోద్వేగం మొదలైన లక్షణాలుండేవి. ఇవాళ విప్లవ కథ ఎంతో పరిణితి చెందింది, ఇప్పటి కథల్లో మరింత ప్రత్యేక లక్షణం అంతర్మథనం, ఒడిదుడుకుల్లేని నిండైన నడక కన్పిస్తున్నాయి. ఒక అంగీకృత భావజాలం నుంచి (confirmed ideology) కాకుండా పూర్తిగా తమ అనుభవ పరిధిలోని జీవిత సంఘర్షణలోంచి కథలు వస్తున్నాయి. వ్యక్తులతో మొదలై వ్యవస్థ లోలోతుల్లోకి తీసుకుపోయే కథలివి. పూర్వనిర్ధారణలతో(pre-conceived conclusions)గాక కొత్త ఆలోచనలతో స్వేచ్ఛగా వాస్తవాన్ని దర్శించి ప్రదర్శిస్తూ మరింత అన్వేషణని, సామాజిక స్పృహను ప్రేరేపించే కథలివి. ఇంకా రకరకాల సామాజిక అంశాలు కనిపిస్తుంటాయి. వీటన్నిటిని ఏదో ఒక కోణంలో కథా వస్తువుగా చేసుకుని రచయితలు చాలా కథానికలు రాశారు. ఈ పాతికేళ్ళ తెలుగు కథా సంకలనాలలో అటువంటి కథలు అనేకం ఉన్నాయి

**ఉపయుక్త గ్రంథ సూచి:**


1. నవీన్, వాసిరెడ్డి. శివశంకర్, పాపినేని.(2016). పాతికేళ్ళ కథ (1990-2014)సం., మనసు ఫౌండేషన్, బెంగుళూరు.
2. దక్షిణమూర్తి, పోరంకి.(2009). కథానిక స్వరూప స్వభావాలు, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్. హైదరాబాద్.
3. నారాయణ, సింగమనేని. (2001). తెలుగు కథకులు కథన రీతులు, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్. హైదరాబాద్.
4. వెంకట సుబ్బయ్య, వల్లంపాటి.(2008). కథా శిల్పం, హైదరాబాద్ విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్.
5. మల్లయ్య, కాలువ.(2012). నూటపదేళ్ళ తెలుగు కథ విభిన్న ధోరణులు,తెలుగు అకాడమి. హైదరాబాద్.


*******

# 56. డి.కె. చదువుల బాబు కథలు - సామాజికి స్పృహ

**డా॥ కె. ధనశ్రీ,**

శ్రీ వెంకటేశ్వర డిగ్రీ కళాశాల, లెక్చరర్,

నంద్యాల.

కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత డి.కె. చదువులబాబు కడప జిల్లా పెద్ద పసువుల గ్రామంలో జన్మించారు. ఉపాధ్యాయుడుగా ప్రస్తుతం పని చేస్తున్నారు. వీరు వివిధ పత్రికల్లో 300 కథలు ప్రచురించారు. వీటి నుండి 150 కథలను ఎంపిక చేసి 6 కథా సంపుటాలుగా ప్రచురించారు. ''మనసున్న మనిషి, బాలల కథలు, బంగారు రెక్కలు, అప్పు నిప్పు, విజయ రహస్యం, చిన్నారి మనస్సు అనేవి వీరి కథా సంపుటాలు. బాలల మాసిక వికాసానికి వ్యక్తిత్వ పరిణితికి తోడ్పడే రచనలు చేస్తూ మరో వైపు సాంఘీక కథలు, కవితలు రాస్తూ సాహిత్య వికాసానికి ఈయన తమవంతు కృషి చేస్తున్నారు. చందమామ, బొమ్మరిల్లు, బాలమిత్ర బాలజ్యోతి, బాలభారతి, బాలతేజం, బుజ్జాయి, ఆటవిడుపు చిన్నారి మొదలైన బాలల పత్రికల్లో 250కి పైగా కథలను ప్రచురించారు. ఈ కథలల్లో కొన్ని కథలను తీసుకొనీ చదివినాను. ఈ కథలల్లో డి.కె. చదువులబాబు ఎంచుకున్న ప్రతి అంశం సమాజానికి బాగా ఉపయోగపడుతుంది. అంతే కాకుండా అజ్ఞానంతో వున్న వ్యక్తులు ఈ కథలు చదివితే తప్పకుండా జ్ఞానవంతులుగా తయారు అవుతారు. అందుకే డి.కె. చదువులబాబు కథలను తీసుకుని ఈ వ్యాసం రాశాను. ఈ వ్యాసం రాయడానికి మరికొన్ని ప్రామాణిక గ్రంథాలను ఆధారంగా చేసుకొన్నాను.

''**దివ్యమణి**'' కథలో విష్ణుసేనుడు తన తండ్రికి కళ్ళు తెప్పించాలనీ, దివ్యమణి తేవడానికి బయలుదేరుతాడు. దారిలో ఒక రాక్షసుని బారి నుండి తప్పించుకొంటాడు. దారిలో పొట్టివాళ్ళు కనిపిస్తే వాళ్ళు అడిగిన ప్రశ్నలకు సమాధానం చెపుతాడు. మరికొంత దూరం పోగా ఒక అందగత్తె వివాహం చేసుకోమని అడగగా నిరాకరిస్తాడు. చివరగా పాము కన్పించి రాజా నీవు నిస్వార్ధపరుడవు, తెలివిగలవాడివి, మోహం లేదు. అందువల్ల నీ తండ్రి కళ్ళు తెరిపించడానికి ఈ దివ్యమణి తీసుకో అని ఇస్తుంది.

నిజజీవితంలో కూడా మనకు ఈ కథలోని ''పాము'' లాగా సహాయం చేసేవాళ్ళు ఉంటారు. అంతే కాకుండా మనల్ని కష్టాలలోకి నెట్టడానికి అడుగు అడుగున శత్రువులు కూడా మనకు ఎదురు అవుతూ ఉంటారు. అలాంటి సందర్భాలల్లో ఈ కథలోని విష్ణుసేనుడిలా మనం చాలా జాగ్రత్తగా ఉండాలి. అప్పుడే మనం అనుకోన్న లక్ష్యంలో విజయం పొందుతాం. తద్వారా తమకు ఇతరులకు ప్రయోజనం చేకూరుతుంది. లేకపోతే ప్రాణానికే ముప్పు రావచ్చు. అనుకొన్న పనిలోని విఫలం అయితే ప్రమాదం కలుగుతుంది. ఇవన్నీ నేటి సమాజం దృష్టిలో పెట్టుకొని మెలగాలి. అపుడే ఇంట్లోవారిచేత, ఇతరుల చేత తెలివిగల వారిగా గుర్తింపు పొందుతారు. అంతేకాకుండా అందరిచే ప్రశంసలు అందుకొంటారు. ఒక మంచి జీవితానికి ఇంతకన్నా ఏమి కావాలి. ఏమి ఉండదు. అదే జీవిత పరమార్ధంగా ప్రతి ఒక్కరు భావించీ, ఆచరణలో పెట్టాలి. ఒక లక్ష్యాన్ని వ్యక్తులు సాధించాలంటే మధ్యలో ఎన్నో ఆటంకాలు వస్తాయి. వాటి అన్నింటిని ఈ కథలోని విష్ణుసేనుడి పాత్ర ద్వారా రచయిత మనకు సామాజిక స్పృహ కలగజేశాడని చెప్పవచ్చు.

''**మొక్కలల్లో దేవత**'' కథలో నాస్తికుడు, ఆస్తికుడు ఇద్దరు దారిలో పోతూ ఉంటారు. దేవుడు శక్తి గురించి ఆస్తికుడు చెబితే, నాస్తికుడు ఖండిస్తుంటాడు. ఆస్తికుడు తులసిచెట్టు కనిపిస్తే దానికి నమస్కరిస్తాడు. నాస్తికునికి ఒళ్ళుమండి ఆ చెట్టును పీకి ఆకును నమలి శరీరానికి రాసుకుంటాడు. ఆస్తికుడు నాస్తికునికి బుద్ధి చెప్పాని దురద చెట్టుకు నమస్కరిస్తాడు. నాస్తికుడు దాన్ని కూడా నమిలి ఒళ్ళంతా పూసుకుంటాడు. మంటలకు భరించలేక అల్లాడిపోతాడు. ఆ మంటలు పోవడానికి తులసీ ఆకును పూస్తాడు. అపుడు నాస్తికుడు మొక్కల్లో తులసీ మొక్క దేవత అని నమ్ముతాడు. మానవుల్లో మంచివాళ్ళు, చెడ్డవాళ్ళు ఉంటారు. అదే విధంగా ప్రకృతిలోని మొక్కల్లో కూడా ప్రయోజనం చేకూర్చే మొక్కలు మనుషులకు ప్రమాదం కలిగించే మొక్కలు ఉంటాయి. మనకు ఏవి అయితే ప్రమోజనం చేకూరుస్తాయో

వాటి అన్నింటినీ దేవతలుగా, దేవుళ్ళుగా భావించి పూజ చేయడం మన భారతీయుల సాంప్రదాయం. దేవుడు మన కంటికి కనిపించడు. ఆ దేవుడుకు ఒక రూపం ఉండదు. విశ్వమంతా నిండి ఉంటుంది. అంటే భూమి మీద నివసించే ప్రతి ప్రాణిలోను ఉంటుంది. అంటే చెట్టు, పుట్ట, మనిషి ఎవరు అయినా కావచ్చు. అందువల్లే మన భారతీయులు అందరు అన్నింటికి మొక్కుతూ ఉంటారు. ఎవరి వల్ల అయితే మనకు ఉపకారం చేకూరుతుందో అలాంటివారికీ, చిన్న పెద్ద అనే తేడా లేకుండా చేతులు ఎత్తి నమస్కరించి కృతజ్ఞతలు చెప్పే సాంప్రదాయం, వేద భూమి పుణ్యభూమిగా పిలవబడే మన భారతీయులకు మాత్రమే చెల్లుతుంది. మనదేశంలోని కొంతమంది వ్యక్తులు విశ్వంలోని ప్రాణుల ద్వారా ఉపకారం తమకు తెలియకనే పొందుతూ ఉంటాం. కాని ఉపకారం పొందినా ప్రాణులకు నమస్కరించే పద్ధతిలేని వారిని నాస్తికులుగా మనం పేర్కొనవచ్చు. ఈ కథలో రచయిత నాస్తికునికి ఎవరిని దేవుడు అంటారు. ఎందుకు అంటారు అనే విషయాన్ని చాలా చక్కగా ఒక అనుభవం ద్వారా, ఒక ప్రయోగం ద్వారా అజ్ఞానంతో కళ్లు మూసుకొన్న వ్యక్తికి బుది చెప్పాడు. ఈ కథ ద్వారా సమాజంలోని వ్యక్తులు దేవుడు దేవత ఎవరు? వారు ఎక్కడ ఉంటారు, ఆ పేరు ఎవరెవరికి వర్తిస్తాయి అనే విషయం గ్రహిస్తారు.

''**వామనరావు తెలివి**'' అనే కథలో వామనరావుకు ఫజిల్స్ అంటే విపరీతమైన పిచ్చి. ఓసారి పత్రికలో ఒక ఫజిల్, దాని ప్రక్కన ఒక ప్రకటన కూడా చూస్తాడు. ఫజిల్ పూర్తి చేసి, మాకు వంద రూపాయలు పంపిస్తే, చీకటిలో మీరు చూడగల సాధనం పంపిస్తాం అని ప్రకటనలో ఉంటుంది. వామనరావు పంపిస్తాడు. వాళ్ళు రావుకు టార్చ్‌లైటు, రెండు సెల్స్ పంపిస్తారు. వామనరావు ఆశ్చర్యపోతాడు . జ్ఞానం ఉంటే సరిపోదు. దానితో పాటు లోకజ్ఞానం ఉండాలనీ, లేకపోతే వామనరావులాగా మోసపోవలసి వస్తుందనీ రచయిత ఈ కథ ద్వారా మనకు సందేశం ఇచ్చారు. ఒక వ్యక్తి ఏదైనా ఒక విషయం మనకు చెప్పినపుడూ, ఆ విషయం గురించి ఒకటికి నాలుగుసార్లు అన్ని కోణాలనుంచి పరిశీలించి నిర్ణయం తీసుకొవాలి. ఆ విషయం చిన్నదైనా కావచ్చు, పెద్దదైనా కావచ్చు. ఈ విధంగా ఆలోచించి నిర్ణయం తీసుకొనేవారిని తెలివివంతులుగా పేరు పొందుతారు. అంతేగానీ ఈ కథలోని వామనరావులాగా నేటి వ్యక్తులు తెలివితక్కువగా ప్రవర్తించకూడదు. ఒక వేళ అలా ప్రవర్తించబడితే ఇతరుల చేత అవమానింపబడతారు. అందరు నవ్వుతారు. అంతేకాకుండా ఆర్థికంగా, మానసికంగా ... ఇంకా చాలా రకాలుగా నష్టపోతారు.

''**రంగన్న తెలివి**'' అనే కథలో రంగన్నకు రేచీకటి అనీ ఎవ్వరికి తెలియదు. తాతగారి ఊరికి వెళ్ళాలని బయలుదేరి చీకటిలో బస్సు దిగాడు. బర్రె తోక పట్టుకొని కొంత దూరం నడుస్తాడు. కిర్రు కిర్రు చెప్పులు శబ్ధం విని తెలివిగా ఇంటికి చేరుకుంటాడు. రాత్రిలో దొడ్లోకి వెళ్ళాలని దారం మంచంకు, తలుపుకు కట్టుకుంటాడు. ఆ రాత్రి దొంగలు వస్తారు. ఆ దారం తగులుకొని దొంగలు తాతకు చిక్కిపోతారు. పిల్లవాడిని అందరూ మెచ్చుకుంటారు. తాత దారం గురించి అడగగా అసలు విషయం చెపుతాడు. తరువాత ఆసుపత్రికి పోయి చికిత్స చేయించుకుంటాడు. మొహమాటంకు పోయి వ్యక్తులు తమకు ఉన్న జబ్బు గురించి ఇంటిలో వారికి చెప్పకపోతే రంగన్నలాగా బాధలు పడాల్సి వస్తుందని ఈ కథలో సందేశం. తెలివి అనేది ప్రతి ఒక్కరికి ఉంటుంది. ఆ తెలివిని మంచి పనులకు ఉపయోగించాలి. తమకు, ఇతరులకు ఉపయోగపడే విధంగా మలచుకోవాలి. ఇతరులకు బాధ, నష్టం కలిగిస్తాయి అనుకుంటే అలాంటి విషయాలు దాచిపెట్టచ్చు. ఆరోగ్యానికి హాని కలిగించే విషయాలు దాచి పెట్టకూడదు. ఆ విధంగా దాచిపెడితే ప్రాణానికే నష్టం. అంతే కాకుండా ఇంటిలో వాళ్ళకు, ఇతరులకు, అందరికి ఇబ్బంది కలుగుతుంది. సమాజం ఈ విషయాలను గుర్తించుకోవాలి.

''**మన ఆరోగ్యం విటమిన్లు**'' కథలో సూక్ష్మ పరిమాణంలో శరీరానికి అవసరమైన సేంద్రియ పదార్థాల సముదాయాన్ని విటమిన్లు అంటారు. కాసిమర్ ఫంక్ శాస్త్రవేత్త వీటిని కనుగొన్నారు. విటమినులల్లో చాలా రకాలు ఉన్నాయి. 'ఏ' విటమిన్`ది లోపిస్తే రేచీకటి వస్తుంది. ఈ విటమిన్ కోసం పాలు, చేప మాంసం, ఆకు కూరలు తినాలి. 'బి' విటమిన్ దాని లోపం వల్ల వణుకు, మూర్ఛ వస్తుంది. చేపలు, గ్రుడ్డులు తినాలు. బి2 విటమిన్ ` ఇది లోపించడం వల్ల నోటిపూత వస్తుంది ఆకుకూరలు తినాలి. బి3 విటమిన్ ఇది లోపించడం వల్ల చర్మ వ్యాధులు వస్తాయి. చేప పప్పుదినుసులు తినాలి. ఇలాంటి కథలు ద్వారా సమాజం ఏయే విటమిన్లు కొసం ఏయే

ఆహార పదార్థాలు తీసుకోవాలి, ఏఏ ఆహార పదార్థాలలో ఎటువంటి పోషకాలు ఉంటాయనే విషయం తెలుసుకుంటుంది. తద్వారా సమాజంలోని వ్యక్తులు తమ ఆరోగ్యాన్ని కాపాడుకుంటారు.

''అలర్జీ'' అనే కథలో రచయిత మనకు సరిపడని ఆహార పదార్థా గురించి తెలియజేశాడు. మన శరీరంపై అకస్మాత్తుగా దురద కలిగిన దద్దుర్లు ఏర్పడటం, విపరీతంగా తుమ్ములు రావటం, ఉబ్బసం, దగ్గు మొదలైన లక్షణాలు కనబడతాయి. కారణం అలర్జీ దుమ్ము, ధూళి, అలంకరణ పౌడర్లు, చుక్కాకు, గోంగూర అలర్జీని ఎక్కువగా కలిగిస్తాయి. ఆహార పదార్దాలు మన వంటికి సరిపడకున్న, శరీరంలో ప్రతిక్రియ కనిపిస్తుంది. ఈ ప్రక్రియనే అలర్జీగా పేర్కొంటారు. ఏ ఆహార పదార్దం తిన్నాక అలర్జీ వచ్చిందో గుర్తించీ, ఆ పరదార్థాన్ని నిలిపివేయడం ద్వారా మనం రక్షణ పొందవచ్చు.

అలర్జీ అంటే ఏమిటి? దానికి సంబంధించిన వివరాలు ఈ కథ ద్వారా మనం గుర్తించవచ్చు. దుమ్ము, ధూళి ప్రదేశాలలో తీసుకోవాల్సిన జాగ్రత్తలు, కొన్ని ఆహార పదార్థాలు కొంత మందికి పడవు అనే విషయాన్ని తెలుసుకొనీ, జాగ్రత్తగా జీవించడానికీ, తగిన చర్యలు తీసుకోవడానికి ఈ కథ మార్గం చూపుతుంది.

ఇలాంటి కథల ద్వారా మనం శరీర నిర్మాణానికి ఎలాంటి ఆహార పదార్థాలు తీసుకొవాలి అనే విషయం తెలుసుకుంటాము. మనం తీసుకునే పదార్దాలల్లో కూడా ఏయే పదార్థాలు ఎక్కువ తీసుకోవాలి, ఏయే పదార్థాలు తక్కువ తీసుకోవాలి అనే విషయం గ్రహిస్తాము. శరీరానికి జబ్బులు రాకుండా ముందు జాగ్రత్తగా ఆలోచించి కొలబద్ధంగా ఆహారం తీసుకోవడం అలవాటు చేసుకొంటారు. శరీరం బాగా పుష్టిగా ఉండాలనీ అతిగా కూడా తినకూడదు. అలా తింటే అనేక సమస్యలు వస్తాయి. తగిన మోతాదులల్లో తినాలి. వ్యాయామం కూడా చేయాలి. అపుడే వ్యక్తులు శారీరకంగా, మానసికంగా, ఆరోగ్యవంతంగా ఉంటారు. అలాంటి వాళ్ళు ఎక్కువకాలం జీవించడానికి అవకాశం ఉంటుంది. లేకపోతే రోగాలు పాలై కొన్ని రోజులల్లో చనిపోతారు. ఈ అంశాలన్నీ సమాజంలోని వ్యక్తులు దృష్టిలో పెట్టుకొనీ, జీవనం కొనసాగిస్తే వారి జీవితం ఆరోగ్యకరమైన బంగారు జీవితంగా తయారు అవుతుంది.

మొత్తంగా ఈ కథలన్నీ సమాజంతో నిద్రాణంలో వున్న వ్యక్తుల మనస్సును స్పృహలోకి తెస్తాయని చెప్పవచ్చు. నేటి రచయితలు ఇలాంటి కథలను మరెన్నో రాయాలి. రాబోయే భవిష్యత్తు తరాలవారికి అందించాలి. తద్వారా సమాజంలోని ప్రజలందరు అజ్ఞానం నుండి జ్ఞానం మార్గంలో ప్రయానిస్తారు. తద్వారా వ్యక్తులు, తమ చుట్టూవున్న ప్రజలు సంతోషంగా జీవనం గడుపుతారు. ఏ విషయాన్ని అయిన మనం కథల రూపంలో చెపితే ఎటువంటి వారి మసస్సు అయినా జ్ఞానం పొంది, తద్వారా వాళ్ళ జీవితం బంగారుబాటగా తయారు అవుతుంది.

**ఆధార గ్రంథాలు**


1. రాజాగోపాలనాయుడు, పి, కథాభారతి, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 2004
2. చదువులబాబు, డి.కె, విజయ రహస్యం (పిల్లలు కథలు బొమ్మలతో) రవీంద్ర`తిలక్ ప్రచురణలు, ప్రొద్దుటూరు, 2005.
3. చదువులబాబు, డి.కె. కడప జిల్లా సాహితీమూర్తులు, ప్రజాహిత పబ్లిషర్స్, హైదరాబాద్, 2007.
4. ధనలక్ష్మి, పసుపులేటి, తెలుగులో బాలల నవలలు, మోహనరూప పబ్లికేషన్స్, శ్రీకాళహస్తి, 1986.
5. ధనశ్రీ ` కందాటి ` రాయలసీమ బాల సాహిత్య పరిశీలన (సాద్ధాంత గ్రంథం), శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి, 2015.


********

ఆంధ్ర లయోల కళాశాల,తెలుగుశాఖ విజయవాడ -జాతీయ సదస్సుకు సమర్పిస్తున్న వ్యాసం

# 57. నిర్మల్ జిల్లాలోని శతకాలు సామాజిక స్పృహ

**టేకులపల్లి నర్సయ్య**

అసిస్టెంట్ ప్రొఫెసర్ ఆఫ్ తెలుగు

ప్రభుత్వ డిగ్రీ కళాశాల, నిర్మల్

9182017249

narsaiaht271@gmail.com

---

**కీలక పదాలు:** శతకం లక్షణాలు శతక కవుల పరిచయం , ఆయా శతకాలలోని సామాజిక అంశాలు, భాష.

**అబ్స్ట్రాక్ట్:**

తెలుగు సాహిత్య క్షేత్రంలో శతకం ఒక విశిష్ట ప్రక్రియ. తొమ్మిది వందల ఏళ్ళకు పైగా కొనసాగుతూ పండితపామర వారధిగా శతకం నిలిచినది. జనాదరణ పొందింది. తెలుగు సాహిత్యంలో మనకు లభించిన శతకాల్లో శతక లక్షణాలను కలిగి ఉన్న మొదటిశతకం వృషాధిప శతకంగా సాహితీ కారులు గుర్తించారు. మానవ సమాజాన్ని విలువల వైపు నడిపిస్తున్న సాహితీ ప్రక్రియగా ఆధ్యాత్మిక, సామాజిక, నైతిక విలువలను పరివ్యాప్తం చేస్తూ,శతక ప్రక్రియ తనదైన ప్రత్యేకతను చాటుకుంటూనే ఉంది. సాధారణంగా కవులు తమ సాహిత్య ప్రస్థానం ఆరంభించేటప్పుడు శతకాలు రాయడం పరిపాటి. శతకం వల్ల సమాజానికి ఏం ప్రయోజనం కలుగుతుంది? ఒక నాటి సామాజిక, చారిత్రక స్థితిని శతకాలు చెప్పగలవా? శతకం ఎలా ఉపయోగపడుతుంది? మొదలగు అంశాల సమన్వయంతో నిర్మల్ జిల్లాలో వెలువడిన శతకకాలను పరిచయం చేస్తూ అందులోని సామాజిక అంశాలను కొంత మేరకు వివరించడం ఈ పరిశోధన పత్రం యొక్క లక్ష్యం.

నిర్మల్ ఒక చారిత్రకమైన ప్రదేశం . నిర్మల్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్రలో ప్రముఖ భూమిక వహించేది ప్రధానంగా శతక ప్రక్రియ మాత్రమే. ఈ జిల్లాలో పూర్వకాలం అంటే నిర్మల, నిర్మల గా ఏర్పడిన కాలం 16వ శతాబ్దం అని చరిత్ర ద్వారా మనకు తెలియ వస్తుంది. తెలంగాణలో అనాదిగా వస్తున్న శతక ప్రక్రియ ఈ జిల్లాలో కూడా ఉంది.

చెప్పదలుచుకున్న అంశాన్ని వ్యక్తం చేయడానికి ఆధునికంగా ఎన్నో ప్రక్రియలు ఉన్నప్పటికీ, కొత్త రూపాలు వెల్లువలా వచ్చినా శతక ప్రక్రియ తన వునికిని స్థిరపరచుకుంటూనే ఉంది. నవల, నాటకం, కథ, కథానిక, మరియు గేయం,వచనం తదితర ప్రక్రియలతో పోల్చిన ఇక్కడ శతకాలే విరివిగా వెలువడినాయి. ఈ ప్రాంత కవులు శతక ప్రక్రియకు ప్రాధాన్యత ఇచ్చి పెద్దపీట వేశారనే చెప్పవచ్చు. 'సాహిత్యాన్ని ప్రాంతీయంగా అధ్యయనం చేయడం ఒక సామాజిక అవసరము. దీని వలన ఒక నిర్దిష్ట స్థలం నుంచి వచ్చిన వివిధ ప్రక్రియల సాహిత్యాన్ని ఆ ప్రాంత జీవితం,సామాజిక జీవన నేపథ్యంలోని లోతుల్ని లోతుగా అధ్యయనం చేయడానికి వీలవుతుంది'1

ఎందరో రాజుల పాలన వల్ల అస్తవ్యస్తమైన దుర్భర పరిస్థితులు ఇక్కడి జనులు ఎదుర్కొన్నారు.ఈ ప్రాంతంలో సాహిత్యం అంతగా వికసించలేదు. ఆశువుగా కొందరు కవులు శతక పద్యాలను చెబుతూ వచ్చారు, అవి కాలగర్భంలో కలిసిపోయాయి . నిర్మల్ జిల్లాలో శతకసాహిత్యం వెలువరించిన వారు వయసుతో నిమిత్తం లేకుండా యువకుల నుండి పెద్ద వయసు గల వారి వరకు తమ ప్రతిభతో శతకాలు రాస్తూ ఉన్నారు. ముద్రితం కాని శతకాలు కూడా చాలా ఉన్నవి. ముద్రితమైనవి కొన్ని మనకు కనిపిస్తున్నాయి.

అనాదిగా రాస్తూ ఉన్న కొందరు కవుల శతకాలు మరుగున పడిపోవడం , కనుమరుగై పోవడం కూడా జరిగింది. అటువంటి దుర్భర పరిస్థితి కలుగ కూడదని తలచాను. నిర్మల్ జిల్లా శతక సాహిత్యాన్ని సమగ్రంగా అధ్యయనం చేయాలనే సంకల్పించాను. విలువైన శతక సంపదను వెలి తీసుకురావడమే లక్ష్యంగా చేసుకున్నాను. నాకు లభించిన సాహిత్య ఆధారాల ప్రకారం వెలుగులోకి తెచ్చి సాహితీ ప్రపంచానికి చాటాలనే ఆసక్తితో , "నిర్మల్ జిల్లా శతకసాహిత్యం ఒక పరిశీలన" అను సంబ0ధిత అంశం పై పరిశోధనకు పూనుకున్నాను.

పండితుల్ని, ఆపండితుని సరిసమానంగా రంజింపజేసే రచన ప్రక్రియ శతకం. ఇది ఎంత పాతదో అంతా అధునికం కూడా , అందునా భక్తీ , నీతి ,సామాజిక అంశాలు ఎంతో విస్తృతమైనవి . ఇక్కడి కవులు సృజించిన శతకాల్లోని సామాజిక స్పృహ ఏ మేరకు ఉందో పరిశీలించడం ఈ వ్యాసం ఉద్దేశం

**వ్యాస రచయిత పరిచయం:**

టేకులపల్లి నర్సయ్య: వీరు నిర్మల్ జిల్లా వాస్తవ్యులు. కీ.శే .టేకులపల్లి లక్ష్మి ,ఉషన్న దంపతులకు జన్మించారు. ఎం. ఏ . బిఎడ్ వరకు చదివి, 2000 సంవత్సరంలో సెకండరి గ్రేడ్ టీచర్ గా ఉద్యోగం పొందారు. తర్వాత ఎపిపిఎస్సి ద్వారా 2012 లో జూనియర్ లెక్చరర్ గా ఎంపికయ్యారు. 2017 లో పదోన్నతి పొంది, ప్రస్తుతం నిర్మల్ ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో తెలుగు అసిస్టెంట్ ప్రొఫెసర్ గా ఉన్నారు. వీరు తెలంగాణా విశ్వవిద్యాలయంలో ఆచార్య కనకయ్య పర్యవేక్షణలో ***"నిర్మల్ జిల్లా శతక సాహిత్యం - ఒక పరిశీలన"*** అనే అంశం పై పరిశోధనకు పూనుకున్నారు

**పరిశోధనాంశానికి సంబంధించి:**

నిర్మల్ జిల్లా శతక సాహిత్యాన్ని సమగ్రంగా అధ్యయనం చేయాలనే ఆసక్తితో పరిశోధనకు పూనుకున్నారు పరిశోధన అంశాన్ని విషయ సౌలభ్యం కోసం ఆరు భాగాలుగా విభజించాను . అవి

మొదటి అధ్యాయం -శతకాల పరిచయం వర్గీకరణ

- రెండవ అధ్యాయం - భక్తి శతకాలు -పరిశీలన
- మూడవ అధ్యాయం- శతకాలలో నీతిఅంశ పరిశీలన
- నాలుగవ అధ్యాయం - శతకాలలో సామాజిక అంశ పరిశీలన
- ఐదవ అధ్యాయం - విభిన్న ఛందోరీతి శతకాలు
- ఆరవ అధ్యాయం - శతకాల్లోని భాషాంశాలు

**పూర్వ పరిశోధనల పై సమీక్ష :**

ప్రస్తుత పరిశోధనకు సంబంధించిన నిర్మల్ జిల్లా శతక సాహిత్య మీద ఇదివరకు ఎటువంటి పరిశోధనా గ్రంధాలు రాలేదు. ఇది మొదటి పరిశోధనని చెప్పవచ్చు. ఆదిలాబాద్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్ర సమగ్ర అధ్యయనం, అనే అంశం మీద డా.ఎల్మల రంజిత్ కుమార్ గారు; బాసర క్షేత్రం మహాత్మ్యం పరిశీలన అనే అంశంపై డా. కోవెల శ్రీనివాసాచార్య పరిశోధన చేశారు . నిర్మల్ జిల్లా సమగ్ర స్వరూపం , నిర్మల్ జిల్లా సాహిత్య చరిత్ర , ఆదిలాబాద్ జిల్లా వంటి గ్రంధాలు ఈ ప్రాంతంలో వెలువడినాయి. ఇంకా పరిశోధనలు కొనసాగుతున్నాయి. వీరి పరిశోధనలు నా పరిశోధన గ్రంధ రచనకు మార్గదర్శకంగా నిలువనున్నాయి.

శతకాలలోని(నిర్మల్ జిల్లా ) సామాజికాంశాలు

నిర్మల్ జిల్లా వ్యాప్తంగా నలుబైకి పైగా శతకాలు వెలువడ్డాయి. అందులో ముఖ్యంగా పదకొండు శతకాలలోని సామాజిక అంశాలను రేఖ మాత్రంగా వివరించడానికి పరిమితం చేసుకున్నాను . వాటి వివరాలు. పట్టిక 1

| వరుస సంఖ్య | రచయిత పేరు | శతకం | ప్రచురణ సం ,, | ప్రచురణ సంస్థ |
|---|---|---|---|---|
| 1 | కీ.శే.మడిపల్లి భద్రయ్య | బ్రతుకుబాటఆత్మ ప్రబోధ శతకము | సెప్టెంబర్ 2019 | దేవి కల్యాణి ప్రింటర్స్ హైదరాబాద్ |
| 2 | బొందిడి పురుషోత్తమ రావు | కరోనా వైరసీయం | అక్టోబర్ 2016 | వైదుర్య పుర సాహితీ కళా పరిషత్ |
| 3 | కోవెల శ్రీనివాసాచర్యా | శ్రీ పెంబి వెంకటేశ్వర శతకం | అక్టోబర్ 1983 | |
| 4 | మంగ్లారపు దివాకర్ | శ్రీమధుసూదన శతకం | ఏప్రిల్ 2008 | శ్రీ కళాంజలి గ్రాఫిక్స్ హైదరాబాద్ |
| 5 | జాదవ్ పుండలిక్ రావ్ పాటిల్ | పూలబాట శతకం | 2021 | కవియాత్ర ప్రచురణలు ,నిర్మల్ |
| 6 | కడారి దశరథ్ | | | |
| 7 | అమరవేణి రమణ గౌడ్ | శ్రీ రమణా శతకం | అక్టోబర్ 2004 | శివాజిఆఫ్సెట్ ప్రింటర్స్ ,ఖానాపూర్ |
| 8 | సుమతి సారంగ పూర్కర్ | వాసుదేవ శతకం | ఫిబ్రవరి 2021 | లేపాక్షి ప్రింటర్స్ హైదరాబాద్ |
| 9 | గడ్డం సత్యాపాల్ రెడ్డి | సత్య సూక్తి శతకం | డిసెంబర్2019 | ఉమా పబ్లికేషన్ |
| 10 | డాక్టర్ రంజిత్ ఎల్మల | పార్వతి శంకర శతకం | 2014 | కర్షక్ ప్రింటర్స్ హైదరాబాద్ |
| 10 | శేషం శఠగోపం నరేశాచార్య | దివ్య నరసింహ శతకం | అక్టోబర్ 2016 | తెలుగు సాహితీ పీఠము |

మానవుడు సంఘజీవి. సమాజంలోని అంశాలే సాహిత్యంలో ప్రతిబింబిస్తాయి. ... సమాజంలో ఉండేవి, సమాజానికి సంబంధించిన అంశాలు సామాజిక అంశాలుగా పేర్కొనవచ్చు. మరి ఆ సామాజిక అంశాలు ఎన్ని అవి ఏవి అని ఇదామితంగా చెప్పడం కష్టం. కులాలు ,వృత్తులు వ్యాపారాలు.ఆహారపు అలవాట్లు, ఆర్థిక పరిస్థితులు మొదలగునవి సాంఘికఅంశాల కోవలోకి చెందితే . మతం , ఆచార వ్యవహారాలు, విద్య, కళలు,మరియు వస్త్ర ఆభారాణాలు మొదలగునవి సాంస్కృతిక అంశాలుగా సాహితీ కారులు పెర్కొంటారు . వీటితో పాటు నీతి, భక్తీ లోని కొన్ని విషయాలు రేఖమాత్ర తేడాతో సామాజిక కోణంలో చేరుతాయి.

హితేనా సహితం సాహిత్యం ఆర్యోక్తి . సమాజ హితాన్ని, సమాజానికి మంచిని ప్రబోదించేది, స్పూర్తిని నింపి జాగృతం చేసేది సాహిత్యం .సమాజం తో సంబంధం లేని సాహిత్యం మానజాలదు.

**బ్రతుకు బాట శతకం** (ఆత్మ ప్రబోధ శతకం) కవి ఈ శతకం ద్వారా మానవ సమాజంలో గుణాత్మక మార్పును ,శ్రేయస్సును , చైతన్యాన్ని కోరి ఈ శతకాన్ని రచించారు.

“భద్రయా విని దిద్దుకో బ్రతుకు బాట “అనే మకుటంతో నిర్మల్ జిల్లాకు చెచెందిన కీ. శ మడిపల్లిభద్రయ్య గారు ఈ శతకాన్ని రచించారు. వీరు గేయ , పద్య వచన ప్రక్రియల్లో మూపై కి పైగా గ్రంధాలు ప్రకటించారు .

ఆధునిక సమాజంలో పుట్టుకొచ్చే పుకార్లు మరియు ఎన్నో ఇజాలు, ఆ ఇజాలలోని భావజాలాలలో ఉండే వాస్తవాస్తావాలు ఎరుక పడక, మంచి మాటలు ఏవో తెలియకుండా సామాన్య మానవులు అయోమయాం తో మదన పడే పరిస్తితి దాపురించిదని తెలియ పరిచారు.

తే.గీమా క: ఎవరి మాటలు మంచివో ఎరుక పడక

/మదనపడుచుంటి నిత్యము మనుగడందు /

మనుజులను గనవర్తనల్ దనుజులట్లు

/మెదులు చుండిరి ఎప్పుడు మేకములోలె/

భద్రయా విని దిద్దుకో బ్రతుకు బాట/ ( పుట -14 ) (బ్రతుకు బాట శతకం )

తల్లివేరు ను మరిచిన లొల్లి గాదె, మూలం మరువరాదని, మాటలు ఒకటి మార్గాలు ఒకటిగా ఉండాలని ,

లంచ మీయక పనులేవి కొంచమైన/ జరుగబోవుట లేదనుట జనుల మాట పుట 13 ,54 పద్యం

వ్యక్తి శ్రేయస్సును , సమాజ శ్రేయస్సును ఉద్దేశించిన ఇలాంటి పద్యాలు బ్రతుకు బాట శతకం శతకం నిండా ఉన్నాయి.

కరోనా వైరసీయం: ఈ శతకం బొందిడి పురుషోత్తమరావు గారు రచించారు. వీరు వైదుర్యపురం లో జన్మించారు. ప్రభుత్వ విశ్రాంత ఉపాధ్యాయులు. వృత్తిలో ఉన్నప్పుడు వీరి ఉత్తమ సేవలకు రాష్ట్ర స్థాయిలో అవార్డులు అందుకున్నారు. ప్రత్యూష మాస పత్రిక , నిర్మల భారతి సాహితీ సంస్థ స్థాపించి, సాహితీ కృషి చేశారు. సరస్వతీ శతకం , మనసు పొలిమేరల్లో అనే శతకాలు కుడా రాశారు .తటిల్లత, కవితా సంకలనాలు వెలువరించారు .

కరోనా మహమ్మారి వలన తలెత్తిన భయానక విధ్యంసంకర పరిస్థితులను, మానవాళి ఎదురుకున్న సవాళ్ళను . విచ్చుకున్నకారుణ్యం ను సామాజిక,సాంస్కృతిక శాస్త్రీయ తాత్విక కోణంలో పద్యాలలో ఆవిష్కరింప చేసుకొని కరోనా వైరసీయం శతకం రాశారు . సామాజిక స్పృహ ప్రతి పద్యంలో ఆలోచింప జేసే విధంగా ప్రస్పుటమగుతున్నది.

కం. కరొనా యను మాటలతో

ధరిఎంచెను లోకమంత దారుణ రూపున్

కురిపించియు కారుణ్యము

హరియిమ్ముచుము ప్రాణ భయము హరి శ్రీకృష్ణ( 22 వ పద్యం పుట 36 కరోనా వైరసీయం)

శ్రీ పెంబి వెంకటేశ్వర శతకం: డా. కోవెల శ్రీనివాసాచార్యులుగారు శ్రీ పెంబి వేంకటేశ్వర శతకాన్ని రచించారు. పెంబి పుర నివాసా వేంకటేశ అనే మకుటంతో ఆటవెలది పద్యాలతో శతకాన్ని వెలువరించారు. ఇతను నిరంతర సాహితీ పిపాసులు. జిల్లాలో వెలువడిన అనేక శతక సంకలనాలకు చక్కటి సమీక్షలు రాశారు. యువపరిశోధకులకు సాహితీ సహకారమందిస్తూ ప్రోత్సహిస్తున్నారు.

ఇతర స్త్రీల పట్ల మాతృభావము కలిగి ఉండుటయే శ్రేష్ఠమని, పరమ ధర్మమని ఉద్భోదిస్తున్నారు ఈ పద్యంలో

ఆవె : పరసతులను జూచి పరిహ సింపగరాదు

మాతృభావమునకు మది దలంప

వలయు నరున కిదియే పరమ ధర్మంబగున్

పెంబి పుర నివాస వేంకటేశ// –(పుట సంఖ్య 28 శ్రీ పెంబి వెంకటేశ్వర శతకం )

మధుసూదన శతకం మంగ్లారపు దివాకర్ గారు ఈ శతకంను రచించారు. దీనిలో తేటగీతి పద్యాలున్నాయి.

ప్రతి ఒక్కరి సంసార జీవితంలో బలాలు బలహీనతలు ఉంటాయి. వాటిని కుడా ప్రేమించగలగాలి. ఆలుమగల మధ్య పరస్పర అవగాహన, సహకారము, గౌరవము, అన్యోన్య ఆత్మీయత ఉండగ లినప్పుడు ఆ సంసారం స్వర్గసీమే కదా అని దంపతుల మధ్య ఉండాల్సిన అన్యోన్యతను వివరించారు. కుటుంబాల మొత్తమే సమాజం. సమాజం బాగుండాలంటే సంసారం బాగుండాలి . లోతైన సామాజిక మూలం లోకి తీసుకెళ్ళి లోతైన అవగాహనను తెలియ జేశాడు ఈ పద్యంలో

తే.గీ : కనుల పంటగా జంటయే కలిసియున్న

/అలరు నన్యోన్య దాంపత్య మాలుమగల

//స్వర్గ నిలయమౌ యిల్లు ఈ వసుధపైన /

భావసుధ మధు సూదన భాషితమ్ము// (48 వ పద్యం ,పుట 11 మధుసూదన శతకం)

పూలబాట శతకం: జాదవ్ పుండలిక్ రావు పాటిల్ గారు తానూర్ మండలం లోని బెంబెర గ్రామం లో జన్మించారు. చిరు పవనాలు గేయాలు సంకలనం , పాండురంగ శతకం , నిజదర్పణం కైతికాలు మొదలగు రచనలు చేశారు.

ఆ.వె: పరుల సొమ్ము చూసి పడౌను నీమది /

పొందలేక మనిషి కందిపోవు//

ఉన్నదానిలోన నుండు సంతృప్తిని /

పుండలీకుమాట పూలబాట//(పుట-7 , పూలబాట శతకం)

కడారి పద్య ఝరి కడారి దశరథ్ గారు కదరి పద్యఝరి అనే శతకాన్ని రచించారు. వానల్పాడకు చెందిన కవి

ఆ.వె: మదిలో యున్న బాధ మదిలోన యుంచిన /

చింత దీర్చు నెవరు చెంతజేరి //

చింత తోడ యున్న కాంత ఎవ్వరు యౌనొ /

తెలుపునట్టి వారు తెలివి పరులు // (పుట 11, కడారిపద్యఝరి)

శ్రీ రమణా శతకం అమర వేణి వెంకట రమణ గౌడ్ గారు శ్రీ రమణాశతకము మరియి అమరవేణి పలుకు అవని వెలుగు అనే మకుటంతో అమరవేణి శతకం రచించారు. సమకాలీన సమస్యల పై భావాల్ని హేతుకరించి పద్యాన్ని ఆయుధంగా చేసుకొని ఆ పద్యంలోనే చైతన్య స్పందనలను నాటేస్తారు.

కం : తన విలువను తానెరుగని/

మనుజుడెటుల మెచ్చు//

నితర మానవ విలువన్ /

కనగాలరే పామరులిక//

వినిపించెడి సత్య వాక్కు విలువను రమణా (పుట 18 -శ్రీ రమణా శతకం )

వాసుదేవ శతకం : సారంగ పూర్కర్ సుమతి గారు వాసుదేవ శతకమును రచించారు.

ఆ.వె: మంచి మాట నీవు మనసుపెట్టి వినుము /

విన్ననీకు గలుగు విజయమెపుడు//

ధనము కన్న మిన్న ధరణిలో పలుకేర/

వందనాలు తండ్రి వాసుదేవ// (పుట -22 వాసుదేవశతకం)

సత్యసూక్తి శతకం: గడ్డం సత్యపాల్ రెడ్డి గారు సత్య సూక్తి శతకమును రచించారు. దీనిని ఆటవెలది పద్యాలలో ఇమిడింప చేశారు..భారతీయ సంస్కృతీ ఔన్నత్యం విలువలను ఆకాంక్షించారు. సమకాలీన సామాజిక అంశాలను పద్యాల్లో దర్శింపజేశారు.సామాజిక మార్పు ఆశించి , ఆలోచనలను స్పందనలను రాజేసే ప్రయత్నం చేశారు. ఈ శతకంలో కవి శీర్షిక పేరుతో ప్రతి పద్యానికి అంశ ప్రకటన చేసి శతకానికి వినూత్నతను తెచ్చారు . మానవులు శాస్త్ర సాంకేతికంగా ఏంతో ఉన్నతంగా ఎదిగిన పర్యవరణాన్ని కాపాడుకోవటంలో వైఫల్యంచెందటం వలన, ఋతువులు గతి తప్పి వర్షాకాలం కురవాల్సిన వర్షాలు కురువకపోవడాన్ని, కరువు కు కారణం ఎవరు అని ప్రశ్నిస్తున్నారు. అదేసమయమంలో ప్రకృతిని కాపాడుకోవడానికి మారవలసిన అవసరాన్ని గుర్తుచేస్తున్నారు.

ఆ.వె : వర్ష ఋతువు వేళ వర్షాలు కరువాయె/

మేఘుడేల నేడు మేను దాచె//

కరువు కళ మొచ్చె కారణమెవ్వరు /

సత్యపాలు మాట సద్దిమూట// (పుట -41, సత్యసూక్తి శతకం )

పార్వతి శంకర శతకం , డాక్టర్ ఎల్మల రంజిత్ కుమార్. ఆదిలాబాద్ సాహిత్య సమగ్ర అధ్యయనం అనే అంశం మీద పిహెచ్ డి చేసి పట్టా పొందారు . యువతుల సున్నితమైన మనస్తత్వాన్ని, అమాయకత్వాన్ని ఆసరా గా చేసుకొని , చనువుతో కొందరు యువకులు మాన బంగాలు లోతో శీలాన్ని దోసుకోవడం దురదృష్టకరం పరిణామం గా ఆవేదనను వ్యక్తం చేస్తూ కవి హర దేవ మహాదేవా శంభోళా శంకర అనే మకుటంతో ఈ శతకాన్ని భక్తీ శతకంగా రాశారు. కొత్త ఛందస్సులో రాశారు.

మారుమాట లాడకుండc మౌనవ్రతము నా

చరించుచున్న యువతుల శీలము నప

హరించునే మోస పురుషులు చనువుతోన్

హరహర మహాదేవా! శంభోళా శంకర (41 పద్యం పుట సంఖ్య 9 పార్వతీ శంకర శతకం )

దివ్య నరసింహ శతకం:దీనిని శేషం శఠగోపం నరేశాచార్య గారు రచించారు

ఆ. వె : నీలి మబ్బు మనకు నీరిచ్చి కాపాడు

/ చెరువు తోడ పైరు చెలిమి జేయ

చెట్లు పెంచుమెపుడు చినుకురాలు కొరకు

/ దివ్య నారసింహ దీనబందు (పుట – 9,దివ్యనరసింహ శతకం)

చెట్లు పెంచడం తో మబ్బుకు, చినుకుకు, చెరువుకు,మరియు పైరుకు ఉన్నచెలిమి ని చెపుతూ, వాటి చక్కటి చెలిమిని కాపడటం లోనే మానవ మనుగడ ,జీవ వైవిధ్యం దాగిఉందనే ఎరుకను కలుగజేసి తప్పక చెట్లు పెంచవలసిన ఆవశ్యకతను గుర్తుచేస్తాడు. ఆజ్ఞాపిస్తాడు.

**ముగింపు:**

నిర్మల్ ప్రాంత కవులు భక్తీ ,నీతి సామాజిక ప్రకీర్ణ శతకాలలో . తమ సమకాలీన సమాజాన్ని నిశిత దృష్టితో పరిశీలించి . సంఘంలో నిత్యం జరుగుతున్న అవినీతి , అన్యాయం , అధర్మం మొదలగు అంశాల పట్ల స్పందించి, స్వీయ వేదనల్ని స్పష్టంగా తెలియజేశారు. ప్రతి శతకం నిండా వ్యక్తీ శ్రేయస్సు మరియు సమాజ శ్రేయస్సును కోరి సామాజిక స్పృహ తో, సూటిదనం సరళత సుబోధకంగా ఉండే రత్నలాంటిపద్యాలతో శతకాలు వెలువరించారు . ఆధునికంగా ఎన్నో ప్రక్రియలు ఉన్నప్పటికీ పద్యం

ఆలంబనగా ఉండే శతక ప్రక్రియవైపు ఇక్కడి కవులు మొగ్గుచూపడం విశేషం . భక్తి , ఆర్తి నీతి సామాజికతలోని భిన్నపార్శ్వాలను వస్తువుగా చేసుకొని సరళ శైలిలో అన్వయకాఠిన్యం లేకుండా సామాజిక స్పృహని పరిపుష్టంచేసే ప్రయత్నం శతక కర్తలు చేయడం గుర్తించదగిన అంశం.

మున్ముందు శతకాలలోని తెలంగాణా జీవ/వాడుక పదాల వినియోగం , శతకాలలోని జాతీయాల మరియు సామెతల వినియోగం మీద అధ్యయనం జరగాల్సిన అవసరం ఉంది.నూతన జిల్లా వ్యాప్తంగా వెలువడిన శతకాలపై లోతైన పరిశోధనలు జరిగితే ఎన్నో విషయాలు వెలుగులోకి వస్తాయి . ఒకనాటి సమాజాన్ని శతకం ప్రతిబింబిస్తుందా ? అనే అంశాలకు ఇక్కడి కవులు శతకాలు వెలువరించి సమాధానంగా నిలిపారు. వెయ్యి సంవత్సరాలకు పైగా చరిత్ర కలిగివున్న తెలుగుపద్యాన్ని , దాని వైభవాన్ని సురక్షితంగా కాపాడుతూ వస్తున్న సాహిత్యంలోని ప్రక్రియ శతకమే కదా. అన్నట్లు అందుకు మద్దతుగా శతకాలు రాయడం అభినందిం చదగిన విషయం

**ఆధార గ్రంథాలు:**


గిరిజా మనోహరబాబు, జి.(2012).*తెలుగు శతకాలు*, పొట్టి శ్రీ రాములు విశ్వవిద్యాలయం, హైదరాబాద్.

గోపాలకృష్ణరావు, కే. (1976). *ఆంధ్ర శతక సాహిత్య వికాసం*, ప్రతిభా ఆర్ట్స్ ప్రింటర్స్, హైదరాబాద్.

తెలంగాణా సారస్వత పరిషత్.(2024). నిర్మల్ జిల్లా సమగ్ర స్వరూపం, హైదరాబాద్

దశరథ్ కదారి.*కదారి పద్య ఝరి*.2017.

దివాకర్ మంగ్లారపు.(2008). *మధుసూధన శతకం,* శ్రీ కళాంజలి గ్రాపిక్స్, హైదరాబాద్:

ద్వా.నా శాస్త్రి .( ). *తెలుగు సాహిత్యచరిత్ర.*

నరేశాచార్య శఠగోపం.(2016).***దివ్యనరసింహ శతకం***, తెలుగు సాహితీ పీఠం

పురుషోత్తంరావు బొందిడి. (2016). *కరోనా వైరసీయం*, సాహితీ కళా పరిషత్ , వైదుర్యపురం.

పుండలిక్ రావు పాటిల్ జాదవ్. (2021).*పూలబాట శతకం*,కవియాత్ర ప్రచురణలు.

భద్రయ్య మడిపల్లి. (2019).*బ్రతుకు బాటశతకం*,దేవి కల్యాణి ప్రింటర్స్, హైదరాబాద్.

రంజిత్ కుమార్ ఎల్మల.(2011). *పార్వతీశంకర శతకం*,కర్షక ప్రింటర్స్,హైదరాబాద్.

రమణ గౌడ్ అమరవేణి. (2004).*శ్రీ రమణా శతకం*,శివాజీ ఆఫ్సెట్ ప్రింటర్స్, ఖానాపూర్:

శ్రీనివాసాచర్యా కోవెల. (1983). *శ్రీ పెంబి వెంకటేశ్వర శతకం*,

సత్యపాల్ రెడ్డి గడ్డం. 2019*సత్యసూక్తి శతకం*.2019.నిర్మల్: ఉమా పబ్లికేషన్

సుమతి సారంగ పూర్కర్.( 2021).*వాసుదేవశతకం*, లేపాక్షి ప్రింటర్స్ , హైదరాబాద్


*********

# 58. బాల సాహిత్యము - బాలికల జీవన చిత్రణ

**జి. కళావతి,**

పరిశోధక విద్యార్థిని, తెలుగు విభాగం,

ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాద్- 500007

చరవాణి: 8790283431

మెయిల్: kalavathiguntipally@gmail.com

**సాహిత్యం**

సమాజ హితమును కోరుకునేది సాహిత్యము. సాహిత్య ప్రయోజనాలలో అత్యున్నతమైన అంశము సమాజ హితమే. మనిషి జీవనాన్ని, పయనాన్ని, చరిత్రను సాహిత్యం నమోదు చేస్తుంది. మనిషి సంఘజీవి కాబట్టి మనిషికీ మనిషికీ మధ్య ఉండే సంబంధ బాంధవ్యాలు, అనుబంధాలు, వైరుధ్యాలు, ప్రేమలు, సర్దుబాటు మొదలైనవన్నీ సాహిత్యకారుల పరిశీలనలో ఉంటాయి. కొన్ని వారి స్వీయ అనుభవాలలో కూడా ఉంటాయి. అలాగే ప్రకృతికీ మనిషికీ నడుమ ఉండే సంబంధాన్ని, సమన్వయాన్ని కూడా సాహిత్యం నిర్వచిస్తూ ఉంటుంది. మనిషి యొక్క కలలు, ఆకాంక్షలు, ఆశలు, ఆశయాలు కూడా సాహిత్యంలో ప్రతిఫలిస్తాయి. ఇదివరకు మనిషి జీవనం ఎలా ఉన్నది, ఇప్పుడు ఎలా ఉంటున్నది, ఇకముందు ఎలా ఉండబోతున్నది అనే విషయాల్ని పరిశీలించడం, అర్థం చేసుకోవడం, అంచనా వేయడం మరియు విడమరచి చెప్పడం అనేవి సాహిత్య సృజనలోని కీలక అంతర్లీన మరియు బహిర్గత విషయాలు. ఆయా విషయాల్ని సాహిత్యం ఎంత ప్రతిభావంతంగా చెబితే అంత ప్రభావవంతంగా అవి సమాజంలో నిలిచి ఉంటాయి. సాహిత్యం కేవలం అభిప్రాయాల వ్యక్తీకరణ కాదు. కవులు, రచయితలు తమకు కనిపించిన విషయాలను పలు రూపాల్లో వ్యక్తీకరించడము, వివరించడమే కాదు, కొన్ని నిర్ధారణలు, కొన్ని సూత్రీకరణలు, కొన్ని పరిష్కారాలు ఇస్తారు, కొత్త మార్గాలను చూపుతారు. వీటన్నింటిని సాహిత్యం ద్వారా సున్నితంగా మరియు సృజనాత్మకంగా నిర్వహిస్తారు. అందుకే ప్రపంచంలో ఏ మూల ఏ మార్పు జరిగినా, ఏ ఉద్యమం జరిగినా దాని వెనుక సాహిత్య సాంస్కృతిక పునాది తప్పకుండా ఉంటుంది, ఇదొక చారిత్రక వాస్తవం. నిజమైన సాహిత్యం మనిషి గమనాన్ని, గమ్యాన్ని బాధ్యతాయుతంగా చూపుతుంది. ఆ క్రమంలో మానవుని యొక్క ప్రతి ఉద్వేగానికి ఒడి పడుతుంది. మనిషి జీవనంలోని ముఖ్యమైన భావోద్వేగాలు సంతోషం, బాధ, దుఃఖం, కోపం, ఆగ్రహం, హాస్యం, ఈర్ష్య, అసూయ, ద్వేషం, ప్రేమ, ఆత్మీయత, ఆదరణ, కరుణ, దయ, జాలి, ఆవేశం మొదలైనవన్నీ సాహిత్యంలో చోటు పొందుతాయి. సాహిత్యం మనిషి జీవనానికి సంకేతాల్ని చూపుతుంది, సందేశాన్ని అందిస్తుంది, సంపూర్ణత్వాన్ని తీసుకురావడానికి ప్రయత్నిస్తుంది. ఇట్లా బాధ్యతగా వెలువడిన సాహిత్యం పదికాలాల పాటు తనదైన ప్రతిష్టను కలిగియుంటూ తనదైన వెలుగును పంచుతుంది. మనిషి నీడలాంటి, మనిషి ప్రతిబింబం లాంటి, మనిషి హృదయం లాంటి సాహిత్యంలో ఉన్న ఈ అనేకానేక అంశాలను తిరిగి పరిశీలించే పనిని పరిశోధనలు చేస్తాయి. ఈ పరిశీలనల, పరిశోధనల ఫలితాలు అటు మనిషి జీవనాన్ని ఇటు సాహిత్యాన్ని మరింత అభివృద్ధి క్రమంలోకి నడిపిస్తాయి. అందుకే సాహిత్యంలోని ప్రతి అంశాన్ని మరల మరల సునిశితంగా పరిశీలించడమనేది ఆవశ్యకమైనదిగా ఉంటుంది.

**బాలికలు**

సమాజంలో బాలికలు ఒక భాగం. భారతదేశ సమాజానికి వేల సంవత్సరాల సంస్కృతీ పరంపర ఉన్నది. ఆ సంస్కృతి యొక్క పరిసరాలలో మనిషి సుదీర్ఘ పయనంలో ఎన్నో మారిన అంశాలున్నవి. అట్లాగే మారని జీవన చట్రం, అలవాట్లు, ఆచరణ, ఆచారాలు, సంప్రదాయాలు, వ్యవహారాలు ఉన్నవి. ఎన్నో తిరుగుబాట్లు ఉన్నవి, పోరాటాలున్నవి, పర్యవసానాలున్నవి, ఫలితాలున్నవి. ఆధునిక

కాలంలో స్వాతంత్ర్యానికి పూర్వం ఓవైపు మహోజ్వలమైన, ఉత్కంఠభరితమైన, త్యాగశీలమైన విప్లవోద్యమం కొనసాగగా మరోవైపు ఉదార వాద, ఆదర్శవాద, సంస్కరణ వాద జాతీయోద్యమం కొనసాగింది. వాటి ప్రభావాలు ఈ నాటికీ భారత సమాజం మీద ఉన్నవి. కుల మతాలను అధిగమించి సాగిన వర్గ పోరాటం దేశంలోని ప్రతి ప్రాంతం మీద తనదైన ముద్రను వేసిన పరిస్థితులున్నవి. వర్గ పోరాటాల కాలంలో ప్రజలు కులమతాలకతీతంగా ఏకమై చైతన్యంతో ఉద్యమించిన చరిత్ర ఉన్నది. వర్గపోరాటాలు, సంస్కరణ ఉద్యమాలు మరియు అస్తిత్వ ఉద్యమాలు తమవైన ఫలితాలను సాధించడంతో పాటు కొన్ని సమస్యలను తెచ్చిన సందర్భాలున్నవి. వర్తమాన కాలంలో భారత సమాజంలో కులం ప్రాతిపదికగా రాజకీయాలు నడుస్తున్నవి. సమాజంలో అవినీతి, రాజకీయాలలో వైరుధ్యాలు, ప్రజా ఉద్యమాలు ప్రతి కాలంలోనూ ఏదో ఒక శాతంలో కనిపించడం ఉంది. ఈ మొత్తం నేపథ్యంలో సమాజంలో కులాలు, మతాలు, స్త్రీలు, పురుషులు, బాలురు, బాలికలు వంటి ఎన్నో విభజిత సమూహాలున్నవి. ఒక్కో సమూహానికి ప్రత్యేకమైన సంస్కృతి, చరిత్ర, తనదైన వ్యాప్తి, పరిమితి మొదలైనవి ఉంటాయి. కాలక్రమంలో ఆధునిక విజ్ఞాన శాస్త్రం అభివృద్ధి చెందడం వల్ల మూఢ నమ్మకాలు కొంత వరకు తగ్గినవి. ప్రజల జీవితాలలో ఇంకా మారవలసిన అంశాలున్నవి మరియు కాపాడుకోవలసిన విలువలున్నవి. వీటన్నింటినీ సాహిత్య సమకాలీనంగా నిరంతరంగా చర్చిస్తూనే ఉంటుంది. ఆ చర్చ కథ, కవిత్వం, నవల, వ్యాసం, లేఖ, నాటకం, బుర్రకథ తదితర ఎన్నో ప్రక్రియలలో కొనసాగుతుంది.

సమాజంలో బాలికల జీవనం ఎన్నో అంశాలతో ముడిపడి ఉన్నది. పితృస్వామ్య భావజాలం, సనాతన సంప్రదాయాలు, ఆచారాలు, సామాజికార్థిక, రాజకీయ, సాంస్కృతిక పరిస్థితులు బాలికల జీవనం మీద చూపించిన ప్రభావాలున్నవి, వెలుగునీడలున్నవి. అయితే ఆధునిక తెలుగు సాహిత్యంలో స్త్రీల సమస్యల మీద, స్త్రీల జీవనం మీద జరిగినంత పరిశోధన బాలికల సమస్యల మీద, బాలికల జీవనం-మీద జరగలేదు. పుట్టుక నుండి యుక్త వయస్సు వరకు బాలికల జీవితాలలో ఎన్నో ఆటుపోట్లు, ఎన్నో కలలు, ఎన్నో కాంతులు, ఎన్నో వింతలు, ఎన్నో చింతలు ఉన్నవి. సమాజంలో, కుటుంబంలో బాలికల స్థానం, భాగస్వామ్యం, సాధికారత మొదలైన ముఖ్యమైన అంశాలు తరతరాలుగా ఎలా ఉన్నాయో చూడవలసిన అవసరముంది. బాలికల జీవనంలో ఆటలు, పాటలు, విద్య, పని, ఆహారం, ఆహార్యం మొత్తంగా వాళ్ళ ఎదుగుదల, అభివృద్ధి, తల్లిదండ్రులు, కుటుంబము, సమాజము బాలికలను పరిగణించే విధానములను ఆధునిక తెలుగు సాహిత్యం ప్రతిబింబించిన సందర్భాలు మరియు బాలికల మీద ఉన్న వివక్షను పెకిలించిన సందర్భాలను సాహిత్యం ఏ విధంగా చర్చించిందీ వెలుగులోకి తెచ్చిందీ సవివరంగా చూడవలసిన అవసరమున్నది.

**బాలసాహిత్యంలో బాలికల జీవన చిత్రణ**

సాహిత్యంలో బాలసాహిత్యానిది ప్రత్యేకమైన స్థానం. బాల్యంలో చిట్టిపొట్టి మాటలు, అల్లిబిల్లి పదాల నుండి మొదలిడి ఆటపాటలు, లాలిపాటలు, జోల పాటలు, చిట్టి కథలు మొదలుకొని పిల్లలు ఎదిగే కొద్దీ క్రమంగా గాఢతను పెంచుకొనే సాహిత్యం పిల్లల కొరకు సృజించబడుతూ ఉంటుంది. కాలక్రమంలో సామాజిక ఆవరణంలో వచ్చే మార్పులను నిబిడీకృతం చేసుకుంటూ కొత్తగా బాలసాహిత్య సృజన జరుగుతూనే ఉంటుంది. ప్రకృతితో మమేకమై ఉండే కథలు పువ్వులు, పక్షులు, జంతువులు పాత్రలుగా ఉండే బాలసాహిత్యం పరిమాణాత్మకంగా ఎక్కువ. అధునాతన సమాజాన్ని ప్రతిబింబిస్తూ సెల్‌ఫోన్లు, కంప్యూటర్లు, రోబోలు, రాకెట్‌లు ఉండే కామిక్స్ కూడా ఇందులో ఉంటాయి. వీటితో పాటు పిల్లల అలవాట్లు, ఆహార్యము, మనుషులతో బంధాలు, స్నేహము, అల్లరి, అమ్మానాన్నలతో జీవితము, చదువు మొదలగు సాంఘిక ఆవరణములోని విషయాలతో కూడిన బాలసాహిత్యము కూడా ఉంటుంది.

''ఉదయం రోజును ప్రతిబింబించినట్లు బాల్యం మనిషిని ప్రతిబింబిస్తుంది'' అన్నాడు మిల్టన్. బాలసాహిత్యం గురించి జాన్ రాండోల్ఫ్ ఈ విధంగా చెప్పాడు-''బాలసాహిత్యం వైవిధ్యంలో కొనసాగుతూ ఉంటుంది. ప్రేమ, విశ్వాసం, న్యాయం, నిజాయితీ, కపటం

లేకుండటం, ధైర్యం, ఆనందం, నిస్వార్థం, మంచి క్రీడాకారులకుండే ఉత్సాహం, ఆత్మవిశ్వాసం, ఆత్మ గౌరవం, బాధ్యత మొదలైన కాలాతీత విలువలు గల సద్గుణాలను బోధించడానికి
తోడ్పడుతుంది.''

బాల సాహిత్యంలో బాలికల జీవన చిత్రణ ఎలా ఉందనే విషయాన్ని పరిశీలిస్తే అనేక విషయాలు బోధపడతాయి. ఈ సమాజం ఆడపిల్లలను పరిగణిస్తున్న తీరు, బాలికల ఆటపాటలు, బాలికలకు బోధించబడిన విషయాలు, బాలికల మీద వివక్ష చూపబడిన సంగతులు తదితరాలను గమనించవచ్చు. ఈ విషయాలు ఒక్కో ప్రాంతంలో ఒక్కో విధంగా ఉండటాన్ని కూడా అర్థం చేసుకోగలము.

**బాలికలు - అందం వర్ణన**

చిన్నారి పాపాయి అందాన్ని వర్ణించే మరొక గేయం కూడా ప్రశస్తి నొందింది

''మా పాప అందం మాతాబీల చందం

మా పాప వాక్యం జిలేబీల పాకం

మా పాప హాసం గులాబీ వికాసం

మా పాప కోపం పకోడీల కారం ''18

ఇందులో పాప అందాన్ని, పాప మాటను, పాప నవ్వును, పాప కోపాన్ని ప్రస్తావించడమైనది. గిడుగు సీతాపతి గారు రాసిన ఈ గేయం చక్కని ఉపమానాలతో బాలికలకు హాయిగొలుపుతుంది.

'పసిడి మనసుల లాలిపాటలు' పుస్తకంలో వింజమూరి లక్ష్మి గారు రాసిన గేయం

''కొండ మీద కోవెల కోవెలలో దేవుడూ

చిన్నారి పాపాయి చిరునవ్వున దేవుడూ

బంగారు పల్లకీలో ఊరేగును దేవుడూ

రంగారు పాపాయి మనసే ఒక దేవుడూ...''19

ఇందులో పాపాయి స్వచ్ఛమైన నవ్వు, స్వచ్ఛమైన మనసు దేవుడితో సమానమని చెప్పబడింది. ప్రశంసిస్తూ పాడిన పాటలు బాలికల హృదయాలపై చెరగని ముద్ర వేసి వారు గుర్తు పెట్టుకుని పాడేలా ఉంటాయి.

చింతా దీక్షితులు ''లక్క పిడతలు'' లో బాలికల ఆహార్యాన్ని, అలంకారాన్ని తెలిపే 'అమ్మణ్ణి' గేయం ఈ విధంగా ఉంది.

''గంధం మెడకూ పూసుకుని

పసుపూ కుంకం రాసుకుని

కంటికి కాటుక పెట్టుకొని

ఆడవె ఆడవె అమ్మణ్ణి !

చేతికి గొలుసులు పెట్టుకొని

దండలు మెడలో వేసుకొని

ఆడవె ఆడవె అమ్మణ్ణి

పువ్వులు తలలో ముడుచుకొని

తిలకం నదుటూ దిద్దుకొని

బుగ్గన చుక్కా పెట్టుకుని

ఆడవె ఆడవె అమ్మణ్ణి!

ఈ గేయంలో తెలుగు ప్రాంతంలోని బాలిక యొక్క వేషధారణ తెలుపబడింది. బొట్టు, కాటుక, గంధము ధరించడం తెలుగు సమాజంలో ఆనవాయితీగా కొనసాగింది. బాలికలకు దిష్టితగులుతుందని కొందరు తల్లులు, అందంగా కనిపించాలని కొందరు తల్లులు బుగ్గన చుక్క పెడుతుంటారు. ఈ విషయాలన్నీ తెలుపుతూనే హాయిగా ఆడుకొమ్మని బాలికకు సందేశం ఇవ్వబడింది.

బాలికలు ధరించే వస్తువులు- వర్ణన

బాలికలు ధరించే గాజులను వర్ణించే గేయం మౌఖిక గేయాల నుండి సేకరించిన కూర్పులో ఈ క్రింది విధంగా ఉంది

''చిన్నారి పొన్నారి గాజుల్ల శెట్టి
తేవె మా అమ్మాయికి తేనె గాజుల్లు
నవ్వుతూ తొడిగిస్తు నల్ల గాజుల్లు
పాడుతూ తొడిగిస్తు పచ్చ గాజుల్లు
ఏరి యేరి తొడిగిస్తు యెఱ్ఱ గాజుల్లు
నిలుచుని తొడిగిస్తు నీలి గాజుల్లు!''6

ఇందులో పాపాయి కోసం రంగు రంగుల గాజులను తీసుకురమ్మని చెప్పడం కనిపిస్తుంది. కూతురు పుడుతూనే ఆమె కోసం ఏమేమి సమకూర్చాలా అని ఆలోచించే తల్లిదండ్రుల తాపత్రయం ఇందులో చూపబడింది. పాపాయికి రంగుల గురించి నేర్పే ప్రయోజనం కూడా ఉన్నది. ఈ వర్ణన వల్ల బాలికలకు ఆ వస్తువుల మీద ఇష్టము ఏర్పడుతుంది, ఉత్సాహం కలుగుతుంది.

**బాలికలు - ఆటపాటలు**

బాలికల ఆటపాటలను తెలిపే గేయములున్నవి. కోలాటం అనేది బాలికలు ఆడే ఆటలలో ఒకటి. ఈ క్రింది గేయము దానికి సంబంధించినది

''కోలాటంబు వేయుదమా
కోరిక తీరగ మనమందరమూ
చాలా సంతోషంబుగను
సభికులు మెచ్చెడి తీరుగను
గుప్పు గుప్పున గంతులు వేస్తూ
ఒప్పుగ జడలు వేయుదమా
ఒప్పుగ వేసిన జడలన్నీ
ఓపిక తోడ విప్పుదమా
సరిగరి సరిగరి యనుచు
సభ్యులు మెచ్చెడి రీతిగను
రత్నగిరి కోలాటము
రమ్యముగాను వేయుదము''8

కోలాటమును ప్రదర్శించే ఆనవాయితీ తెలుగు ప్రాంతంలో ఉంది. ఆడపిల్లలు పొడవాటి జడలతో అందంగా ముస్తాబై కోలాట ప్రదర్శనలు చేస్తారు. సంతోషంగా, అందరూ మెచ్చే విధముగా కోలాటము వేద్దాము అని బాలికలు తమలో తాము మాట్లాడుకునే

సందర్భం గేయంలా మలచబడింది. ఈ విధంగానే లక్కపిడతలు, వనగుంటలు, గచ్చకాయలు, బొమ్మరిండ్లు, పెండ్లి ఆటలు, బతుకమ్మ ఆటపాటలు, బొడ్డెమ్మ ఆట పాటలు, అట్లతద్ది పాటలు, గొబ్బెమ్మ పాటలు మొదలగునవి బాలసాహిత్యంలో కనిపిస్తాయి.

**బాలికలు – ఆటలు**

బాలికల ఆట అయిన చెమ్మాచెక్కా ఆటకు సంబంధించిన పాట బహుళ ప్రచారంలోనున్నది.

''చెమ్మా చెక్కా చారడేసి మొగ్గా

అట్లు పొయ్యంగ ఆరగించంగ

రత్నాల చెమ్మ చెక్క రంగులేయంగ

ముత్యాల చెమ్మచెక్క ముగ్గులేయంగ

పగడాల చెమ్మ చెక్క పందిరేయంగ

పందిట్లొ మా అన్న పెళ్ళి చేయంగ

ఆడబోదామా చూడబోదామా...''12

ఇట్లా కొనసాగే ఈ గేయం మరికొంత నడుస్తుంది. ఒక్కో ప్రాంతంలో చిన్న చిన్న మార్పుతో కొన్ని పదాలు వేరువేరుగా పాడుకొంటారు. బాలికలు రెండు చేతులూ ఒకరివి ఒకరు పట్టుకొని వంచి టెక్క వేసి చప్పట్లు చరిచి మళ్ళీ చేతులు ఎత్తి ఒకరి చేతులతో ఒకరి చేతులను తాకుతారు. ఇద్దరు గానీ, చాలా మంది గానీ కలిసి ఆడుకొంటారు. బాలికల యొక్క ఆనందకరమైన ఆటలలో ఇది ఒకటని చెప్పబడింది.

**బాలికలు – బొమ్మల పెళ్ళి ఆటలు**

ఆడపిల్లల పెళ్ళికి సంబంధించిన గేయాలు బాలసాహిత్యంలో ఎన్నో ఉన్నవి. పెళ్ళి తంతును చెప్పేవి, పెళ్ళి సందర్భంలోని హాస్యాన్ని చెప్పేవి, పెళ్ళి వేడుకను సంతోషాన్ని వర్ణించేవి కనిపిస్తాయి.

'' రాయాకు పాపమ్మ ఆడవే పాప

రాజులందరు గూడి చూడవచ్చేరు

చూడ వచ్చిన వారు ఏమి తెచ్చారు?

పట్టాభి ఉంగ్రాలు పెళ్ళి బటువులు

నన్ను గన్నా తల్లి చీరెట్టవమ్మా

పమిటికి రత్నాల పేరెట్టవమ్మ

పేరుకీ పట్టెలతో సొమ్మెట్టవమ్మ''9

ఇందులో అమ్మాయిని చూడటానికి రాజులంతటి వాళ్ళు చూడవస్తారని, అట్లా వచ్చేటప్పుడు అమ్మాయి నచ్చితే ఖాయం చేసుకోవడానికి ఉంగరాలు, ప్రత్యేకమైన పెళ్ళి బటువులు తెస్తారని చెప్పబడింది. కన్నతల్లిని అమ్మాయికి చీరపెట్టాలని, ఆ చీరెలకు పేరు పెట్టాలని, పెట్టెల నిండా సొమ్ములు పెట్టాలని కోరడమైనది. తమ ఇంటి ఆడపిల్లల పెళ్ళిళ్ళు చేసే సందర్భంలో ఒంటి నిండా లేదా తమ తాహతు మేర బంగారు నగలు పెట్టడం, పట్టు చీరలు పెట్టడం, పెళ్ళి చీర, ప్రదానం చీర, కన్యాదానం చీర అనే రకరకాల పేర్లు పెట్టి సందర్భానికో చీర పెట్టే ఆచారాలున్నవి. ఆ విషయాలు ఇందులో చెప్పబడినవి.

బాలికల ఆటలలో కూడా పెళ్ళి ఆటలుంటాయి, వాటికి సంబంధించిన పాటలుంటాయి.

''తాటాకు బొమ్మకు కాటుకెట్టి

చీర సింగారించి పోతు చేసారు

గాజు పూసల పేరు మెళ్ళో వేసారు

పాప పేరంటాళ్ళు కాచుకున్నారు

పానకపు బిందెలు తెచ్చియున్నారు!''10

ఇందులో తాటాకు బొమ్మను సింగారించి, కాటుక పెట్టి, మెడలో పూసల దండలు వేసి పెళ్ళికూతురిని చేసి పేరంటాళ్ళందరూ వరుని కోసం వేచియున్న సందర్భం చూపబడింది. దాదాపు అన్ని నిజమైన పెళ్ళిళ్ళలో ఈ దృశ్యాలు కనిపిస్తాయి. బాలికల జీవనంలో పెళ్ళి ఆటలు, పెళ్ళి పాటలు ఒక భాగంగా ఉంటాయి.

**బాలికలు - బొమ్మరిండ్ల ఆటలు**

బాలికలు బొమ్మరిండ్లు కట్టి ఆడుకునే సందర్భంలో పాడే ఈ క్రింది గేయం చాలా ప్రాచుర్యంలో ఉన్నది

''చిట్టి చిట్టి మిరియాలు చెట్టు కింద పోసి

పుట్టమన్ను తెచ్చి బొమ్మరిల్లు కట్టి

బొమ్మరింట్లో పిల్ల పుడితె

బొమ్మ తలక నూనె లేదు

నా తలకి నూనె లేదు

అల్లవారింటికి చల్లకుపోతె

అల్లవారి కుక్క భౌ భౌ మనెను

నా కాళ్ళ గజ్జెలు ఘల్ ఘల్ మనెను!''13

ఈ గేయంలో కుటుంబాలలో జరిగే సంఘటనలకు సంబంధించిన అంశాలున్నవి. ఇంట్లో స్త్రీలకు కాన్పు అయినపుడు పేదరికం వల్ల చంటి బిడ్డకు మరియు తల్లికి మాడుపై వేయడానికి నూనెలేని పరిస్థితి చెప్పబడింది. కడుపు చల్లబరచుకుందామని తమకు తెలిసిన అల్లవారింటికి చల్ల కోసమని వెళ్తే వాళ్ళ కుక్క గట్టిగా అరిచిందని తాను పరుగెత్తుకొని వచ్చేసరికి తన కాళ్ళ గజ్జెలు ఘల్లు ఘల్లు మన్నాయని పాప పాడుతుంది. పుట్టమన్నుతో బొమ్మరిండ్లు కట్టడం గ్రామీణ ప్రాంతాలలో బాలికలు తరచూ ఆడుకొనే ఆటలలో ఒకటి. అది ఇక్కడ గ్రామీణ ప్రాంతాలలో పరిపాటి అయిన పేదరికం గురించి పరోక్షంగా తెలిపింది. కాబట్టి బాలికల ఆటలకు, జీవనానికి ఉన్న సంబంధం అర్థమవుతున్నది.

**బాలికలు - పండుగ సందర్భాలు**

బాలికలకు పండుగలను పరిచయం చేసే గేయాలు కూడా ఉన్నవి.

''చిట్టి మరదలు చిట్టి మరదలు ఎక్కడికెళతావు?

గున్న అంటు మావులున్న తోటకెళతాను.

చిట్టి మరదలు చిట్టి మరదలు ఏమి తెస్తావు?

మంచి మంచి మామిడి కాయలు ఏరి తెస్తాను.

చిట్టి మరదలు చిట్టి మరదలు ఏమి చేస్తావు?

వస్తూ ఉన్న ఉగాదికి పచ్చడి చేస్తాను.''15

ఈ గేయంలో ఉగాది పండుగ వస్తే కొత్త మామిడికాయలు తెచ్చి పచ్చడి చేయడం గురించి చెప్పబడింది. మరియు గ్రామాలలో అందరూ కుటుంబాల వల్ల ఏర్పడిన వరసలు పెట్టి ఆప్యాయంగా పిలుచుకుంటారు. బావా మరదళ్ళ సంభాషణలు, పాటలు, హాస్యాలు, నవ్వులు గ్రామాలలో సాధారణం. ఈ గేయంలో 'చిట్టి మరదలా' అనే సంబోధన ఆ విషయాన్ని తెలియజేస్తున్నది.

శ్రీరామ నవమి పండుగ గురించి చెప్పే ఒక గేయం

''చిన్నారి పాపాయి శ్రీరామ నవమి
విచ్చేసినది నేడు వేడుకలు చూడు
ఈ నవమి నాడె ఇల జనియించినాడు
సీతా మనోహరుడు శ్రీరామ విభుడు
సీతమ్మ తల్లికీ శ్రీరామునకు
తలపై బోసారు తలబ్రాలు జనులు
బుట్టెడు వడపప్పు పెట్టిరందరికీ
పానకం బిందెడూ పంచిరందరికీ!''16

ఈ గేయంలో శ్రీరామ నవమిని జరుపుకునే విధానమును చిన్నారి పాపాయికి తెలుపుతున్నారు. ఆ రోజున శ్రీరాముడు పుట్టాడని, అదే రోజు శ్రీరామునికి సీతకు తలలపై తలంబ్రాలు పోసి పెళ్ళి చేస్తారని, ఆ సందర్భంలో వడపప్పు, బెల్లం పానకం అందరికీ పంచిపెడతారని చెప్పబడింది.

బాలికలు - హాస్య సందర్భాలు

ఆడపిల్లలు చాలా నవ్వుకుంటూ పాడే పాటలున్నవి. హాస్యము, ఎగతాళి మిళితమైన బాగా ప్రాచుర్యం పొందిన పాట

''బుర్రు పిట్ట బుర్రు పిట్ట తుర్రుమన్నది
పడమటింటి కాపురం చేయనన్నది
అత్త తెచ్చిన కొత్తకోక కట్టనన్నది
మామ తెచ్చిన మెల్లపూలు మడువనన్నది
మొగుని చేత మొట్టికాయ తింటాన్నది!''20

ఇందులో హాస్యము, వ్యంగ్యము, ఎగతాళితో పాటు అలిగిన బాలికల మీద వ్యాఖ్యానమున్నది. కుటుంబాలలో ఆడపిల్లలు ఎవరితోనూ రాజీ పడకపోయినా, భర్త తిట్టినా కొట్టినా సర్దుకునే స్వభావమును కలిగియుంటారనే విషయమును కూడా ఇది తెలియజేస్తున్నది. బాలికలు ఒకరినొకరు ఏడిపించుకుంటూ ఈ పాట పాడుకొంటారు, చివరికి అందరూ కలసి నవ్వుకొంటారు.

నిత్య జీవితంలో హాస్యము ఒక భాగము. కుటుంబాలలో బాలికలు తమకు వదిన వరస గల వారితో పరిహాసాలాడటము, ఎగతాళి చేయడము ఒక అలవాటుగా ఉంటుంది. సందర్భానుసారంగా ఈ పరాచికాలుంటాయి. ముఖ్యంగా నలుగురూ కలిసిన చోట, పండుగలు, ఉత్సవాల సందర్భాలలో అందరూ హాయిగా నవ్వుకొనేలా సంభాషణలుంటాయి. ఈ క్రింది గేయాలలో ఆ సంగతులున్నవి.

''వైశాఖ మాసాన వారింట పెళ్ళి - వల్లభుడు అన్నయ్య పెళ్ళి చేయించె
మిళ్ళి తడియారకుండ బొట్టు పడకుండ - నేర్పుగా పెద్దొదినె నేతులొడ్డించె
అంతకంటే నేర్పరి చిన్నవదినె - ఆకాశాన మిళ్ళి ఆడించి పోయె ''

ఈ గేయంలో ఆడపడుచు అయిన బాలిక తన ఇద్దరు వదనల్ని ఎగతాళి చేస్తున్నది. 'మిళ్ళి' అంటే నెయ్యి వడ్డించే చిన్న చెంచా. పెద్దొదిన వచ్చి ఆ మిళ్ళి తడవకుండా అంటే నెయ్యి దానికి అంటకుండా, ఒక బొట్టు నెయ్యి కూడా విస్తర్లో పడకుండానే నెయ్యి వడ్డించే పని పూర్తి చేసిందని అండే వడ్డించకుండానే వడ్డించినట్లుగా నటించి వెళ్ళిపోయిందని వదినను ఎత్తి పొడుస్తున్నది. ఆ వెంటనే, ఇక చిన్న వదిన అయితే పెద్ద వదిన కంటే తెలివిగలదని, అందుకే మిళ్ళిని కిందికైనా దించకుండా, దానిని ఆకాశం కేసి చూపుతూ, కదిలిస్తూ అలా విస్తరి ముందు నుండి వెళ్ళిపోయినదని ఎద్దేవా చేస్తున్నది. ఇట్లాంటి వదినా మరదళ్ళ పరిహాసాలు చమత్కారంగానూ, సృజనాత్మక సంభాషణగానూ, హాస్యభరితంగానూ ఉంటాయి.

ఇలాంటిదే మరొక గేయంలో

''వదిన గారు మీరు వాసి గల వారు

వండబోయిన చోట కుండ నాకేరు''

అంటూ అమ్మాయిలు తమ వదినల్ని ఆటపట్టించడం కనిపిస్తుంది. వంట చేయునప్పుడు వదిన ఆ పదార్థాల్ని తినేస్తుందని, ఆఖరికి వండిన కుండను కూడా నాకుతుందని, అంటే ఏ కొంచెం ఉన్న వదిలేయక తినేస్తుందని మరదలు పరిహాసమడుతున్నది.

ఇంకొక గేయం బాలికలు పాడుకొనేది ఈ విధంగా ఉంది.

''వదినకు ఒక సరి, బిందెకు బిగసరి బంగారు జడకు కుచ్చుల మా వదిన

గోడ మీదున్న తేలును చూసి లోలాకులన్నది మా వదిన

చట్టి కిందున్న చుట్టను చూసి వడ్డాణమన్నది మా వదిన

కార్లో పోయే డ్రైవర్ని చూసి నా మొగుడన్నది మా వదిన'' 34

ఈ గేయంలో వదినకు ఆభరణాల మీద, సంపద మీద వ్యామోహమున్నదని మరదలు పరిహాసంగా మాట్లాడుతున్నది. బంగారు జడకుచ్చులున్న వదిన మంచి సంపద కలిగిన ఇంట్లోనే ఉన్నదని తెలుస్తున్నది. అయినా వదినకు నగలపై ఆశ ఉన్నందువల్ల గోడ మీద ఉన్న తేలును చూసి దానిని చెవికి పెట్టుకునే లోలాకులు అన్నదని, కుండ క్రిందున్న చుట్టబట్టను చూసి అది గుండ్రటి వడ్డాణం అనుకొన్నదని, అట్లాగే కారులో వెళ్ళే డ్రైవర్ని చూసి అతడు స్థితిమంతుడని భావించి, ఆ స్థితిమంతుడే తన మొగుడు అని అంటుందని మరదలు వెక్కిరిస్తున్నది. ఇట్లాంటి పరాచికాలు బాలికలకు కొన్ని ఆనంద సమయాలను ఇవ్వడంతో పాటు, కుటుంబ సంబంధ బాంధవ్యాలను దృఢపరచుకోవడాన్ని నేర్పుతాయి. దేనిని కోరుకోవాలో దేనిని కోరుకోకూడదో జ్ఞానం అందిస్తాయి. కొన్నిసార్లు ఇవి శృతి మీరితే అనుబంధాల స్థానంలో అపార్థాలు ఏర్పడతాయి. తెలుగు వాళ్ళ సంస్కృతిలో వదినలను ఆటపట్టించే ఆనవాయితీ ఉన్నది. దానిని ఈ గేయం తెలియజేస్తున్నది.

**బాలికలు- ఆరోగ్యం**

బాలసాహిత్యంలో బాలికలకు ఆరోగ్యాన్ని గురించి తెలిపే గేయాలు కొన్ని కనిపిస్తాయి.

''ఒప్పుల కుప్పా ఒయ్యారి భామా

మినపా పప్పూ - మెంతీ పిండీ

తాటి బెల్లం - తవ్వెడు నెయ్యీ

గుప్పెడు తింటే - కులుకులాడే

నడుము గట్టీ - నా మాట బట్టీ''35

ఈ గేయంలో బాలికలకు ఆరోగ్యం కోసం తినవలసిన పదార్థాలు సూచించబడినవి. బాలిక అందంగా ఉన్నదని అన్నీ మంచి పనులే చేస్తుందని మెచ్చుకోలు ఇస్తూ, మినప పప్పు, మెంతి పిండి, తాటి బెల్లం, నెయ్యి మొదలైన పదార్థాలు తింటే మంచిదని, ఎక్కువ తక్కువ కాకుండా రోజూ గుప్పెడు తింటే మంచిదని అట్లా తినడం వల్ల నడుము భాగం బలంగా ఉంటుందని ఈ గేయంలో చెప్పబడింది. ఆడపిల్లలకు రుతుస్రావ సమయంలో నడుము నొప్పి వస్తుంది. రక్తం పోతుంది కాబట్టి బలహీనపడతారు. అందువల్ల ఈ పదార్థాలు తింటే వారి ఆరోగ్యం బాగుంటుందని చెబుతూ ఈ మాట బట్టీ పట్టాలని అంటే కంఠతా గుర్తుంచుకోవాలని  కూడా చెప్పడం.

**ముగింపు:**

బాల సాహిత్యం యొక్క ప్రాధాన్యత ఏమిటంటే చిన్నతనంలో బాల బాలికలకు నేర్పబడిన బోధించబడిన విషయాలు వారి తదుపరి జీవితానికి ఒక దిక్సూచిగా పనిచేస్తాయి. అంతేకాకుండా,  సాహిత్యంలోకి వచ్చిన అంశాలు ఆయా కాలాలలో సమాజంలో బాలికల పట్ల ఉన్న భావనలను, బాలికలను సమాజం పరిగణిస్తున్న విధానాలను, ఆ సాహిత్యం ద్వారా సమాజానికి ఒనగూరిన ప్రయోజనాన్ని తెలియజేస్తాయి. కావున ఉత్తమ భావాలకు మరియు  ఆదర్శనీయ ఆచరణకు సంబంధించిన అంశాలు బాల సాహిత్యంలోకి ఆహ్వానించదగినవిగా ఉంటాయి.

*******

# 59. డా.ఆయాచితం నటేశ్వరశర్మ గారి నవ్యనీతి శతకం – సామాజికత చిత్రణ

**ఎం. వేణుగోపాల్ శర్మ**

తెలుగు ఉపన్యాసకులు

ప్రభుత్వ డిగ్రీ కళాశాల, మెదక్

9032528684

venugopalsharma1969@gmail.com

"హితేన సహితం సాహిత్యం'' అనేది ఆర్యోక్తి. సమాజానికి మంచిని చెప్పేది, బోధించేది సాహిత్యం. అందుకే సమాజానికి, సాహిత్యానికి అవినాభావ సంబంధం ఉంది. తెలుగు సాహిత్యంలో అనేక ప్రక్రియలలో శతకం ఒకటి. తెలుగు నాట శతకాల గురించి తెలియని తెలుగు వాడు లేడంటే అతిశయోక్తి కాదేమో. చిన్న పిల్లల నుండి పెద్ద వారి వరకు ఆబాలగోపాలాన్ని అలరించి వారికి ప్రేరణను, ఆసక్తిని, ఆనందాన్ని కలిగించే పద్య ప్రక్రియ శతకం.

తెలుగులో శతకమును ఒక ప్రక్రియగా పేర్కొన్న లాక్షణికులు విన్నకోట పెద్దన, అనంతుడు. క్రీ.శ. 13వ శతాబ్దానికి చెందిన సంస్కృత లాక్షణికుడు అమృతానంద యోగి శతకమును మొదటి సారిగా కావ్య భేదాలలో పేర్కొన్నాడు. తెలుగులో శతక ప్రక్రియకు మూలం సంస్కృత ప్రాకృతాలు. ఈ శతక ప్రక్రియ ఆశుకవితా శాఖకు చెందినది. శతకాలను భావగీతాలు అని కూడా పిలుస్తారు.

శతకం అనగా నూరు పద్యాలతో రచించే ఒక సాహితి ప్రక్రియ. "శత్'' అనే సంస్కృత శబ్దానికి "కమ్'' అనే ప్రత్యయం చేరి శతకము అనే పదం పుట్టింది. "శతేన శతకం ప్రోక్తమష్టోత్తర శతం పరమ్'' అని అమృతానంద యోగి తన అలంకార సంగ్రహం అను గ్రంథంలో చెప్పాడు. అనగా నూరు పద్యాలు గలది శతకము. ఈ నియమాన్ని అనుసరించి శతక కర్తలు శత సంఖ్య కల శతకాలు రచించారు.

తెలుగులో నన్నయ శ్రీమదాంధ్ర మహాభారతంలో ఉదంకోపాఖ్యానంలో నాగలోకానికి ప్రవేశిస్తున్న సందర్భంలో "మాకు ప్రసన్ను డయ్యెడున్'' అనే మకుటంతో నాలుగు పద్యాలలో నాగస్తుతి చేస్తాడు. బాహువన పాద పాబ్ధికుల పర్వత పూర్ణ సరస్సరస్వతీ సహిత మహా మహీభర మజస్ర సహస్ర ఫణాళి దాల్చిదు స్సహతర మూర్తికిన్ జలధి శాయికి పాయక శయ్యయైన అయ్యహి పతి దుష్కృతాంతకుడనంతుడు మాకు ప్రసన్ను డయ్యెడున్ .

ఈ పద్యం వలన క్రీ.శ. 12వ శతాబ్దానికి పూర్వమే శతక రచనకు బీజాలు పడ్డాయని పరిశోధకులు భావిస్తున్నారు. నన్నెచోడుని కుమార సంభవంలో దారిద్ర్య నిద్రావణ అనే మకుటంతో తొమ్మిది పద్యాలున్నాయి. ఇవి శతక రచనకు బీజ ప్రాయాలని నిర్ణయించారు.

తెలుగు శతక వాఙ్మయం 12వ శతాబ్దంలో ప్రారంభమయింది. తెలుగులో మొదటి శతక కర్త మల్లికార్జున పండితుడు. అతని శివతత్వసారం తెలుగులో మొదటి శతకం అని కొందరు అభిప్రాయ పడుతున్నారు. కానీ శివతత్వసారం మొదటి శతకం కాదనుటకు ప్రధాన కారణం అందులో శతక లక్షణాలలో ఒకటైన ఛందో నియమం తప్ప మరే లక్షణం కనబడుట లేదు. తెలుగులో సంపూర్ణ శతక లక్షణాలు కలిగిన శతకంగా పాల్కురికి సోమన రచించిన వృషాధిప శతకం అని చెప్పవచ్చు. సోమన శతక రచనకి గౌరవం, ప్రాచుర్యం కలిగించారు. అందుకే వారి యుగాన్ని శతక అవతార యుగంగా పేర్కొంటాం.

శతకాలు పురాణాల వలె కథా ప్రధానాలు కావు. ప్రబంధాల వలె వర్ణనా ప్రదానమైనవి కావు. గేయ కృతుల వలె సంగీత ప్రధానాలు కావు. ద్విపదల వలె దీర్ఘ పరిమితి ఉన్నవి కావు. ఇవి ముక్తాలు. అనగా ఏ పద్యానికి ఆ పద్యమే ప్రత్యేక అర్థంగా

విడివిడిగా ఉంటాయి. అనగా కథ వలె కాకుండా ఒక్కో పద్యం ఒక్కో అర్థాన్ని కలిగి ఉండటమే. కానీ మొత్తం శతకంలో ఏక సూత్రత ఉంటుంది. కవి యొక్క ఆత్మానుభూతి ప్రతి పద్యంలో కనబడుతుంది. చాలా శతకాలు చదవటానికి సులభంగా ఉంటాయి. అందువలన తెలుగులో శతక రచనకే కాదు. పఠనానికి కూడా విస్తృతమైన ప్రచారం వచ్చింది.

తెలుగులో వెలసిన శతకాలలో కొన్ని మాత్రమే అనువాదాలు. మిగిలినవన్నీ స్వతంత్రాలే. అందుకే తెలుగు సాహిత్యంలో శతకాన్ని స్వతంత్ర శాఖగా చెప్పవచ్చు. ఇక శతకాల ముఖ్య లక్షణాలను గురించి డా. గోపాల కృష్ణారావు గారు సమగ్రంగా పరిశీలించి వివరించారు.

సంఖ్యా నియమం, మకుట నియమం, వృత్త నియమం, రస నియమం ముక్తకత, ఆత్మాశ్రయత మొదలైన లక్షణాలను వీరు విషదీకరించారు.

**పత్ర సమర్పణలో స్వీకరించిన అంశము : నవ్యనీతి శతకం.**

తెలంగాణాలో ప్రసిద్ధి నొందిన కవులలో ఒకరు డా. అయాచితం నటేశ్వర శర్మ గారు ఒకరు. వీరు కామారెడ్డి జిల్లాలో జన్మించి సంస్కృత భాషలో పరిశోధన గావించి కామారెడ్డి ప్రాచ్య కళాశాలలో ప్రధానాచార్యులుగా పదవీ విరమణ చేసిరి. వీరు బహు గ్రంథ కర్తలు, అవధానులు చేపట్టని ప్రక్రియలు లేవు. వీరు రచించిన నవ్యనీతి శతకంలోని కొన్ని పద్యాలను ఈ పత్ర సమర్పణలో స్వీకరించుట జరిగినది.

వ్యక్తి గొప్పనా లేక సమాజం గొప్పదా అని ప్రశ్నిస్తే ఖచ్చితంగా సమాజమే గొప్పది అని చెప్పిన ధార్మిక నేల మనది. సమాజం నైతిక మార్గములో పయనించాలనే ఉద్దేశ్యంతో రాయబడే శతకాలే నీతి శతకాలు. కావ్య ప్రయోజనాలలో ఒకటైన " ఉపదేశం " నీతి శతకాల ద్వార అందుతుంది. సామాజిక సమస్యలపై వచ్చిన శతకాలలో నవ్యనీతి శతకం ప్రధానమైనదని చెప్పవచ్చు. "భవ్యమైన గీతి నవ్య'' నీతి అనే మకుటంతో నడిచిన ఈ శతకంలో భారతీయత ఉట్టి పడుతుంది. ప్రాచ్య సంస్కృతి సాంప్రదాయాల సారాన్ని గ్రహించక పోవడం వలన ఈనాడు మనకు ఈ దుస్తితి దాపురించినదని తెలియ చేశారు.

**బిచ్చమెత్తు కొనుట పెరిగి పోయెను**

**సులభ మార్గ మగుచు సోమరులకు**

**కూటి కొరకు వెలసె కోటి విద్యలిలను**

**భవ్యమైన గీతి నవ్య నీతి**

మనిషి ఎన్ని విద్యలు నేర్చినా, అవన్నీ కడుపు నింపుకోవడానికి మాత్రమే. కానీ నేటి సమాజంలో ప్రజలు కష్టపడి పని చేయకుండా భిక్షమెత్తు కోవడమనే సులభమైన మార్గాన్ని ఎంచుకొని సోమరులుగా మారి పోతున్నారని పేర్కొన్నారు.

సంసార పూరితమగు సమాజమును రూపొందింప ప్రయత్నించుటకు ఈ శతకం రాసినట్లగా శర్మ గారు చెప్పినారు. ఆధునికత పేరుతో యువతలో పెరుగుతున్న పాశ్చాత్య వ్యామోహాన్ని నిరసిస్తూ కవి యాదార్థాన్ని తెలియచేశాడు.

రాజకీయ పార్టీలు ప్రశాంతమైన పాఠశాలలో ఆలయములలో చిచ్చు పెట్టాయనీ, పాడి పంటలతో పల్లెటూళ్ళన్నీ పరవశిస్తున్నాయనీ, పట్టణాలు ప్రకృతికాలుష్యంతో కనుమరుగవుతున్నాయనీ, సమాజంలో ప్రజల మధ్య అంతరాలు పెరిగిపోతున్నాయనీ, మనిషిలో స్వార్థం పెరిగిన కొద్ది మానవత్వం నశిస్తున్నదనీ అటువంటి సమాజాన్ని ఎవరు సృష్టిస్తున్నారని కవి ప్రశ్నిస్తున్నారు.

శర్మ గారు సమాజము మెడిపండు లాంటిదని, దాని పొట్ట విప్పి పురుగుల్ని చూపించారు. సమాజంలోని అన్యాయాలకు దుర్మార్గాలకు కారణాలను అన్వేషించి నీతిబద్దమైన బాధ్యతగల సమాజాన్ని ఆకాంక్షించారు.

**చదువు తపముతీరు సాగెను పూర్వము**

**చదువు "కొనుట" నేడు సాగుచుండె**

**చదువు నడి బజారు సరుకయ్యె నక్కటా !**

**భవ్య మైన నీతి నవ్యనీతి**

పూర్వకాలంలో చదువు ఒక తపస్సు లాంటిది. ప్రస్తుత కాలంలో చదువును నది బజారులో అంగడి సరుకు లాగా కొనుక్కుంటున్నారని కవి ఆవేదన వ్యక్తం చేశారు.

**పంది బురద మెచ్చు పన్నీరు మెచ్చునా**

**కాకి యరచినంత కాదగునే కోకిల**

**మేడిపండు తీరు మేదిని జనులుండ్రు**

**తెగిన గాలి పటము తీరుగా నౌనులే**

వీరు రాసిన ప్రతీ పద్యము ఒక ఆణిముత్యమే. మూడవ పదాన్ని చక్కని ఉపమానం, లోకోక్తులతో పొందుపరచిన తీరు అద్భుతము.

**ముగింపు :**

శతకాలలో భక్తికి సంబంధించినవి, సమాజానికి ఉపయోగకరమైనవి, నీతిని తెలియచేసేవి, ఇలా ఎన్నో అంశాలను కలిగి ఉన్నాయి. శతక సాహిత్యానికి ఉన్న ఒక గుణం ఏమిటంటే జీవితాన్ని సమాజంలో బతకవలసిన విధానాన్ని, ముందు చూపును తెలియట చేస్తుంది. ఈ శతకంలో సామాజిక బాద్యతను నీతిని, విలువలను వివరించారు.

తెలుగు సాహిత్య ప్రక్రియలతో సామాన్య ప్రజలు కూడా చదివి అర్థంచేసుకోవదనికి వీలుగా ఉన్నవి శతకాలు. తెలుగు శతక పద్యాల ద్వారా సమాజానికి నీతిని బోధించి జ్ఞానాన్ని వికసింప చేయవచ్చునని నిరూపించాయి. తెలుగు శతకం శాఖోపశాఖలుగా విస్తరించి స్వరూప స్వభావాలతో ఎంతో మార్పును పొందింది. తెలుగులో శతకం నదీ ప్రవాహం వలె తెలుగు నేలపైన ప్రవహిస్తూనే ఉంటుంది.

**ఆధార గ్రంథాలు :**

1. ఆంధ్ర శతక సాహిత్య వికాసము - డా. గోపాల కృష్ణా రావు

2. నవ్య నీతి శతకం - డా. అయాచితం నటేశ్వర శర్మ

3. తెలుగు సాహిత్య చరిత్ర - ద్వా. నా. శాస్త్రి.

********

# 60. "అలిశెట్టి ప్రభాకర్ 'ఎర్రపావురాలు' కవిత సంపుటి- సామాజిక స్పృహ "

**సి.వి.ఎల్ నారాయణ,**

అసిస్టెంట్ ప్రొఫెసర్ తెలుగు

బి.జె.ఆర్ ప్రభుత్వ డిగ్రీ కళాశాల, విఠల్వాడి,

నారాయణగూడ, హైదరాబాద్.

9849601577,

ఈమెయిల్ ఐడి : laxman2107@gmail.com

తెలంగాణ తెలుగు కవులలో కరీంనగర్ జిల్లాకు చెందిన "అలిశెట్టి ప్రభాకర్" మనందరికీ సుపరిచితులే. అతడుచిత్రకారునిగా జీవితాన్ని ఆరంభించి, కవిగా స్థిరపడడానికి ఎంతకాలం పట్టిందో, తెలియని వారికి తెలియజేస్తూ,తెలిసిన వారికి గుర్తు చేస్తూ, మరోసారి తెలుగు వచన కవిత ప్రియులకు పరిచయం చేస్తూ, అతని కవిత్వంలోని రసగుళికలను మరోసారి మీకు చర్విత చర్వణం చేయించడమే ఈ పరిశోధన పత్ర సమర్పణ ప్రధాన ఉద్దేశం.

**అలిశెట్టి ప్రభాకర్ - జీవిత విశేషాలు:**

**"చటాకు మాంసం లేని వాడికి ఇంత తెగింప అనుకునే వారంతా"** ఇతని కవితలు చదివి', తన కళ్ళ ముందున్న ప్రపంచాన్ని **నుంచి కవితార్థ మైన వస్తువును నిక్కచ్చిగా ఏరుకొని, భావాన్ని గుండెల్లో గుచ్చుకునేలా, సూటిగా పేల్చడమే అలిశెట్టి ప్రభాకర్ కవిత్వ లక్ష్యం.**

**జీవిత విశేషాలు:**

**కరీంనగర్ జిల్లా జగిత్యాల** ఇతని జన్మస్థలం. మొదట ఆర్టిస్టుగా ఎదిగాడు. ప్రారంభంలో పత్రికలకు పండుగలు, ప్రకృతి,సినీ నటుల బొమ్మలు వేసేవాడు. తరువాత కొంత కాలానికి జగిత్యాలలో **'సాహితీ మిత్ర దీప్తి సంస్థ'** పరిచయంతో కవిత్వ రంగంలోకి ప్రవేశించాడు. 1947లో ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ముద్రింపబడిన **'పరిష్కారం'** ఇతని మొదటి కవిత. నిత్యజీవిక కోసం జగిత్యాలలో "స్టూడియో పూర్ణిమ ", కరీంనగర్లో "స్టూడియో శిల్పి ", హైదరాబాదులో "స్టూడియో చిత్రలేఖ" లను ఏర్పాటు చేసి జీవనానికి ఫోటోగ్రాఫర్ గా, జీవిత పోరాటంలో కవిగా ఎదిగిన వ్యక్తి ప్రభాకర్. **'ఎర్ర పావురాలు', 'మంటల జెండాలు, చురకలు, రక్త రేఖ', 'ఎన్నికల ఎండమావి', సంక్షోభగీతం', 'సిటీ లైఫ్'** అనేవి ఇతని అచ్చయిన కవిత్వ సంకలనాలు. అలిశెట్టి ప్రభాకర్ తండ్రి అలిశెట్టి చిన రాజాం. తల్లి లక్ష్మి. సహచరి భాగ్య, కుమారులు సంగ్రామ్, సంకేత్ లతో హైదరాబాదులో నివాసం. జీవించిన కాలం 12.01.1954-12.01.1993.

**"అలిశెట్టి ప్రభాకర్ 'ఎర్రపావురాలు' కవిత సంపుటి- సామాజిక స్పృహ "**

తెలుగు సాహిత్యంలో పెక్కు మంది పాఠకులను వరించి, అలరింప చేసిన ఆధునిక ప్రక్రియ వచన కవిత. **"అభివ్యక్తి"లో విషయం ఉంటే ప్రజల నాలుకలపై కలకాలం నిలిచి విస్తరించడానికి** పరిధి ఎక్కువ, రచనా పరంగా నియమాలు తక్కువ ఉన్న ప్రక్రియ **వచన కవిత.** అలాంటి ఒకానొక వచన కవితా సంపుటి **'అలిశెట్టి ప్రభాకర్'** "**ఎర్ర పావురాలు** ". ముందుగా కొత్త ప్రక్రియ పుట్టడానికి ప్రధాన కారణాలు తెలిపి, తదనంతరం రచయిత వివరాలు తెలియజేసి , చివరగా **ఎర్రపావురాలలో సామాజిక స్పృహను** కొద్దిగా, స్పృశిస్తూ **పత్ర సమర్పణం** చేస్తాను.

ఫ్రెంచి విమర్శకుడు **"పాల్ వాన్ టైఘమ్ "** ఏ సాహిత్యం లోనైనా వివిధ ప్రక్రియలు పుట్టడానికి విశిష్టమైన కారణాలుగా **రెండింటిని** పేర్కొంటాడు. " Each emotional taste, is social are religious need is the most of a different genre which Blossoms more or less happily "-( Pal van Tieghem ). వివిధ ప్రక్రియలు వెలువడడానికి మొదటి కారణం **రసభావాభిరుచి ;** రెండవది **సాంఘిక / మతపరమైన అవసరం.** ఇతిహాస, కావ్య,ప్రబంధాదులు రసభావాభిరుచిని బట్టి పుట్టాయి. పురాణం, శతకం, స్తుతి సాహిత్యం మొదలైనవి **మత అవసరాలకై** రూపొందించబడ్డాయి. నవల,నాటకం,కవిత,వ్యాసం, ఖండకావ్యం మొదలైనవి సాంఘిక అవసరాలను తీర్చడానికి వెలువడ్డాయి.

ఏ సాహిత్యంలోనైనా, ఏ ప్రక్రియలకైనా అవి వెలసిన కాలాలను **నిశితంగా గమనిస్తే ఆయా కారణాలు, వాటి ఉత్పత్తి వికాసాల వెనుక ఉన్న ప్రేరణలు తప్పక గోచరిస్తాయి.** ఈ ప్రక్రియలన్నీ **నిర్మాణ వైవిధ్యం, వస్తు వైవిధ్యం, కథా సూత్ర వైవిద్యం, అభిరుచి వైవిధ్యం** అనే అంశాలపై ఆధారపడి ఉంటాయి. ప్రతి ప్రక్రియలోనూ ప్రతిభావంతులైన కవులు ప్రయోగాలు చేసి ఆ ప్రక్రియను బహుదా విస్తరిస్తారు. ఇలా బహుముఖాలుగా విస్తరించిన ప్రక్రియగా " **వచన కవిత**"ను చెప్పుకోవచ్చు.

ప్రతి సాహిత్య ప్రక్రియకు **బహిరంతర రూపాలు** ఉంటాయి. ఆ ప్రక్రియ యొక్క **అంతరమైన రూపం కవి సాహిత్య దర్శన శక్తి నుంచి పుడితే, బహిర రూపం కవి సాధింపదలుచుకున్న ప్రయోజనం నుండి కానీ, ఉద్దేశించిన శ్రోతల అభిరుచి నుంచి గాని** పుడుతుంది. ఆ విధంగా కవి తనదైన ఒక విశిష్టమైన **రుచిని రచన ద్వారా కల్పించిన .... వాడు మాత్రమే ఉత్తమ కవిగా** పరిగణించబడతాడు. అలాంటి ఒకానొక కవి **అలిశెట్టి ప్రభాకర్.** ఇతని కవితల్లో **ప్రయోజనం కోసం వెలువడి బహిర రూపం తో పాటు, ప్రాణశక్తితో** వెలువడే **అంతర రూపమూ ముఖ్యంగా కనపడుతుంది. బహిరరూపం ప్రయోగ నైపుణ్యాన్ని వేలారిస్తే , అంతర రూపం కవి ప్రతిభాశక్తిని ప్రకటిస్తుంది.**

**"హితేన సహితమ్ సాహిత్యమ్ ", "సహితస్య భావ: సాహిత్యమ్** "( హితముతో కూడినది సాహిత్యము, సహితుని యొక్క భావము సాహిత్యం )అని దీని అర్థం. ఎవరికి హితము? అన్న ప్రశ్న వేసుకుంటే, తొలిగా కవికి, మలిగా సహృదయుడికి మేలు చేకూర్చేది. సమాజంలోనే కవి పాఠకుడు ఇద్దరూ ఉండేది. కనుక ప్రత్యక్షంగా, పరోక్షంగా 'సాహిత్యమ్'మేలు చేసేది సమాజానికే. కొడవటి కంటి కుటుంబరావు గారి ఉద్దేశాన్ని అనుసరించి **సాహిత్యం సృష్టించబడేది సమాజం నుంచే, సాహిత్యం ఉద్ధరించేది సమాజాన్నే- ఆ సాహిత్యాన్ని చదివి రసానందాన్ని పొందే పాఠకుడు ఉండేది సమాజంలోనే.** ఇంతకు చెప్పొచ్చేది ఏమిటంటే సమాజమే - సాహిత్యము. సాహిత్యమే – సమాజం. సమాజం, సాహిత్యము, సాహిత్యవస్తువు ఈ మూడింటి మధ్య విడదీయరాని అవినాభావ సంబంధం ఉంది.

ఇక **'ఎర్ర పావురాలు'** కవితా సంపుటిలో సామాజిక స్పృహ ఎలా ఉందో, రచయిత దాని ద్వారా ప్రజలను మేల్కొల్పే వైతాళికుడిగా ఎలా పనిచేశాడో ఒకింత పరిశీలిద్దాం. ప్రాచీన కాలంలో కావ్య ప్రయోజనాలను చెబుతూ....

**కావ్యం యశసే, అర్థకృతే, వ్యవహార విధే, శివేతరక్షతయే!**

**సద్య: పరనిర్వృతయే కాంతాతయోపదేశయుజే!!**

అనే మాటని" **కావ్య ప్రకాశం**"లో చెప్పి ఉన్నారు అనిపిస్తోంది.

**ఎర్ర పావురాలు - సామాజిక స్పృహ :**

ఈ కవితా సంపుటి మొదట్లో "**ట్రీట్మెంట్**" అనే కవితలో భారతదేశ ప్రజలకు కావాల్సిన లక్షణాలను గూర్చి చెబుతూ.....

**అందరూ ఒక్కొక్కరే**

**ముందుకు రండి.**

**చుక్కా చుక్కా కలిపి**

**చైతన్యం టానిక్ తీసుకురండి.**

అని చెప్తూ ప్రజల్లో చైతన్యాన్ని నింపుతాడు. అక్కడే కవిగా తన సామాజిక బాధ్యతను చెప్తూ........

**నేను డాక్టర్ని కాను బ్రదర్.**

**మీలోని అజ్ఞానం, సోమరితనం**

**బీడు భూముల్ని దున్నాలని పరితపించే ట్రాక్టర్ని.....**

అంటూ చక్కని సామాజిక స్పృహాన్ని కల్పిస్తూ, ప్రజలకు కావలసిన చైతన్యాన్ని, రగిలిస్తూ కవితా ఖండికను ప్రారంభిస్తాడు.

"**పెయింటింగ్** "అనే కవితలో ప్రజలందరూ స్వార్ధరహితంగా ఉండాలని చెప్తూ.......

**నీ లైఫ్ ని**

**బ్యూటిఫుల్ పెయింటింగ్ గా**

**మార్చుకోవడానికి**

**అట్రాక్టివ్ కలర్ రెడ్ కొరకు**

**రక్తం మాత్రం**

**ఎవరిది ఉపయోగించకు.**

అంటూ ఇతరుల రక్త మాంసాల ద్వారా ధనం,కీర్తి అర్జిస్తున్న వాళ్ళందరికీ విన్నపంలా- హెచ్చరిక చేస్తాడు.

"**బ్యాండేజీ కట్లు** " అనే మరో కవితలో దేశ ప్రగతి గురించి చర్చిస్తూ...

**ఈ దేశం దేహమంతా**

**నీ కళ్ళ కాళ్ళతో గాలించి చూడు**

**అప్పుడైనా**

**తెలుసుకుంటావేమో**

**అవి ప్రగతికి మెట్లు కావు**

**కుళ్ళిపోతే కట్టించుకున్న**

**బ్యాండేజీ కట్లు** అంటూ పేర్కొని.........

**"మన స్వాతంత్ర్యం ఒక మేడిపండు,**

**మన దారిద్రం ఒక రాచ పుండు** " అనే వాక్యాలను మనకు గుర్తు చేస్తాడు ప్రభాకర్.

పేదలకు ధైర్యం ఎంత అవసరమో చెప్తూ "**మినీ టానిక్**" అన్న కవితలో

**ధైర్యం**

**మనిషికి**

**మరో వీర్యం.**

అని చక్కగా ముక్తాయిస్తాడు.

ఆశ నిరాశల గురించి చెప్తూ "**దర్పణం**" అన్న మరో కవితలో

**ఆశ**

**విత్తనం లేకుండా**

**పెరిగిన మొక్క యొక్క**

**శ్వాస.**

**నిరాశ**

**నాభి లేని ఊబిలో**

**దిగబడక ముందే పొందే**

**ప్రయాస.**

ఈ కవితకు '**దర్పణం**' అన్న శీర్షిక చాలా చక్కగా కుదిరింది అని చెప్పవచ్చు. ఇందులో సామాజిక స్పృహ అత్యద్భుతంగా చెప్పబడింది.

ఇక అందరికీ ఆనందాన్ని పంచుతూ తన జీవితాన్ని వేదనకు గురి చేసుకుని వెలయాలి గురించి చెబుతూ "**వేశ్య** "అనే కవితలో

**తను శవమై...**

**ఒకరికి వశమై...**

**తనువు పుండై...**

**ఒకడికి పండై...**

**ఎప్పుడూ ఎడారై...**

**ఎందరికో ఒయాసిస్సై...**

అంటూ ఆలంకారిక ప్రయోగాలతో చక్కగా వర్ణిస్తాడు. మనుషుల మధ్య సహకారం ఎంతైనా అవసరం అనే ఉద్దేశంతో, ప్రతి మనిషి మరో మనిషికి అందించాల్సిన సాయం గురించి చెప్తూ " **చేయూత** " అనే కవితలో..........

**నా చూపులు**

**శూన్యం అరణ్యంలో**

**చిక్కుకున్నాయి,**

**నా అజ్ఞాతహస్తాలు**

**ఏదో రూపాన్ని**

**చెక్కుతున్నాయి,............**

**కిక్కిరిసిన జనం తొక్కిడిలో**

**చిక్కిన చిన్నపిల్లాడిలా**

**హృదయం బావురు.......** అంటూ

ఆ విపత్తు నుంచి తొలగించి విద్యుత్తును వెలిగించడం కోసం తను చేసే పనిని ఇలా పేర్కొంటాడు.

**అందుకోసం చైతన్యం ఉన్న ప్రతి మనిషిని**

**దేహి అని అర్థిస్తాను**

**ఈ అడుగులోంచి,వేడిలోంచి**

**నా దేశాన్ని పైకి లాగమని ప్రార్థిస్తాను.**

**వారితో నేను కలిసి ప్రయత్నిస్తాను.** అంటూ కుహనా కవుల లాగా ఒడ్డు నుండి చైతన్య పరుస్తాననకుండా తను కూడా దానిలో భాగమవుతాననడంలో అతని సామాజిక బాధ్యత ఏమిటో మనకు అర్థమవుతుంది.

కష్టజీవి తన కష్టాలను తలుచుకుంటూ నిద్రపోతున్నప్పుడు, తన హృదయ వేదనని గురించి చెబుతూ "**గుండె**" అనే కవితా ఖండికలో.

**పడుకొని ఉన్న**

**గుండె**

**గడియారం అవుతుంది. ఒక్కొక్కప్పుడది**

**నిద్ర పట్టనివ్వని**

**అలారమౌతుంది.**

అంటూ అతని బాధని తన బాధగా భావించి చక్కటి సామాజిక స్పృహతో రచన చేశాడు ఈ కవితని.

"**మురికిచిత్రం**" అన్న కవితలో......

**ఏదో ఒకటి పంపిస్తాడు.**

**బూరుగ చెక్క లాంటి**

**బొక్కలకు**

**ప్లాస్టిక్ కవర్**

**ప్యాకింగ్ వంటి దేహం.**

**.....**

**రెండు గుహల్లో**

**వెలగలేని దీపాలు కళ్ళు**

**....**

**ఒక చిన్న నలుచదరపు**

**అల్యూమినియం బిళ్ళ కోసం**

**కళ్ళ చేతుల్తోనే జోడించి**

**ప్రాధేయపడతాడు .**

ఈ కవితలో సామాజిక స్పృహ ఉంది అనడం కన్నా సామాజికతే యదార్థంగా చెప్పబడింది అనటం సమంజసమేమో అనిపిస్తోంది నాకు.

ఈ కవితను జాగ్రత్తగా గమనిస్తే **శ్రీ శ్రీ** రచించిన "**భిక్షువర్షీయసి** " కవితలలో లాగా

**"ముగ్గు బుట్ట వంటి తల**

**ముడుతలు తేరిన దేహం**

**కాంతిలేని గాజు కళ్ళు**

**తన కన్నా శవం నయం".**

ఈ పై కవితలాగే ప్రభాకర్ కవిత చదువుతూ ఉన్నప్పుడు ఆ వ్యక్తి రూపం మన కళ్ళ ఎదురుగా కనబడటం, ఇతని కవితా శిల్పం గా చెప్పవచ్చు.

ఇలాంటి శిల్పాన్ని సామాజిక బాధ్యతతో, సామాజిక స్పృహతో చేసిన కవి ప్రభాకర్ ఒక్కడే అనడంలో ఎటువంటి సందేహం లేదు.

అలాగే మనిషి జీవితానికి కానీ, మరో జీవితానికి కానీ, ఉండే ప్రయోజనం ఏమిటో చెబుతూ "**సార్థకత**" అనే కవితలో

**ఎన్నో బీళ్ళు ఉన్నాయి**

**వాటిపై**

**మరెన్నో మోళ్ళున్నాయి**

**కాసేపు**

**ఒక్క మోడు పైనైనా వాలి**

**పాడి పక్షివై నిలవాలి.**

అంటూ కష్టాలలో ఉన్నా కూడా ఎలా సార్థకతను చేకూర్చుకోవాలో కవి చెప్తూ చక్కటి సామాజిక స్పృహను కలిగించేది ఈ కవిత.

మరోచోట" **ఉదహరింపు**" అన్న కవితలో

**శిల్పం**

**చెక్కకు ముందు బండ**

**శిక్షణ పొందక ముందు**

**మొండి.**

అంటూ శిల శిల్పంగా మారడానికి ముందు ఎలా ఉంటుందో చక్కగా పేర్కొన్నాడు కవి. అక్కడే అంటాడు

**ప్రతిభ**

**వెనకాల**

**ఎంతో ప్రయాస.**

**సో...**

**కాలానికి**

**వదలకు భరోసా.**

అంటూ మనల్ని మనం రూపొందించుకోవడానికి మనదంటూ కొంత శ్రమ గురించి చెప్పి, ప్రతి వ్యక్తికి తమ సామాజిక బాధ్యతను గుర్తు చేయడం కవి బాధ్యతగా గ్రహించిన ఆధునిక కవి ప్రభాకర్.

"**సహృదయం**" అన్న కవితలో హృదయం ఉన్న ప్రతి వ్యక్తికి హృదయం ఉంటుందా అనేది వర్ణిస్తూ..

**ప్రతి**

**హృదయానికి**

**ఉంటాడొక వ్యక్తి. కానీ**

**ప్రతి వ్యక్తికి**

**ఉండదు హృదయం.**

ఒక్క కవితా ఖండికని పరిశీలిస్తేనే ఇన్ని సామాజిక అంశాలు స్పష్టంగా మనకు అగుపడ్డాయి అంటే అలిశెట్టి ప్రభాకర్ కవిత మొత్తం చదివితే మనమే ఒక సామాజిక రూపంగా తయారవుతాం అనడంలో ఎంత మాత్రము అతిశయోక్తి లేదు.

ప్రాచీన కాలం నుంచి చెబుతూ వస్తున్న మారని ఓటరులకు ఓటు గురించి చెబుతూ "**జాగ్రత్త** అన్న కవితలో...

**జాగ్రత్త!**

**ప్రతి ఓటు**

**ఒక... నీ పచ్చి నెత్తురు మాంసం ముద్ద**

**చూస్తూ చూస్తూ వేయకు ఏదో ఓ గద్దకి.**

**అది కేవలం**

**కాగితం మీద గుర్తు కాదు**

**జీవితం కింద ఎర్తు.**

**తూర్పు పడమరో నాక్కావలసింది**

**వెలుతురు అనుకోకు.**

**వెలుతురులను పంచే సూర్యుడే కావాలి**

**అందరం కలిసే తేవాలి.**

ఈ మాటలు అప్పుడే రచించబడినవైనా ఇప్పటి కాలానికి కూడా ఎంత చక్కటి సామాజిక బాధ్యతను సామాజిక స్పృహను కలిగి ఉన్నాయో చూస్తేనే, అర్థమవుతుంది. బహుశా కవులని క్రాంతదర్శులో అన్నది ఇందుకేనేమో అనిపిస్తుంది ఈ కవిత చదివాక.

మనిషి మనిషిగా మారడానికి సాధన అనేది ఎంతగా ఉపయోగపడుతుందో చెప్తూ

"**సాధనే కావాలి**" అన్న కవితలో

**ఒయాసిస్సుల్ని సైతం కోల్పోయిన**

**ఎడారులకు కూడా......**

**నేనెప్పుడూ సానుభూతి చెప్పను**

**సాధనే చేయమంటాను.**

అంటూ సాధన యొక్క ప్రయోజనాన్ని చక్కగా గుర్తు చేస్తాడు ప్రభాకర్.

ఔత్సాహికులకి, విద్యార్థులకి,మొదలైన ప్రతి పనిలోనూ ముందడుగు వేసే వారికి ఏది అవసరమో చెప్తూ" **ఉచ్ఛ్వాస**" అన్న **కవితలో**

**నువ్విప్పుడొక**

**విత్తనానివి**

**రేపు పూసే చిగురికి**

**సరికొత్త ఊపిరివి.**

**మరి...**

**మొలకెత్తకముందే**

**అలసిపోయి**

**చచ్చిపోకు**

**చచ్చిపోతూ**

**బలవంతంగా**

**మొలకెత్తకు**

**లోలోపలే**

**సమాధి వయితే**

**సహించదు మట్టి కూడా**

**వెలుపలకి**

**కుతూహలంగా చొచ్చుకొస్తే ఆకాశమంత ఎత్తునే చూస్తావు.**

అంటూ అందరినీ కార్యోన్ముఖుల్ని చేయడంలో ఉన్న సామాజిక చైతన్యం, సామాజిక బాధ్యత, సామాజిక స్పృహల గురించి ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరం ఇసుమంతైనా లేదు.

" న్యాయస్థానం" అనే కవితలో

**ఈ తరాని**

**ఈత రాని**

**నిరుపేదలకు**

**ఈ చట్టం**

**ఎత్తయిన నీటిమట్టం.**

చక్కటి 'ఛేకానుప్రాసాలంకారం'తో నిరుపేదలకు చట్టం ఎంత దూరంలో ఉంటుందో చెప్పకనే చెప్పిన ఈ కవితలు సామాజిక స్పృహ ఎలా ఉంది, ఎంత ఉంది అనేది పాఠకుల ఊహకే వదిలేస్తున్నాను. మన అభాగ్య భాగ్యనగరం గురించి చెబుతూ **"ప్లాస్టిక్ సర్జరీ"** అన్న కవితలో యాంత్రిక జీవనం ఎలా ఉంటుందో వర్ణించిన ఈ స్వాభావిక వర్ణన చూడండి.

**నైంటీ పర్సెంట్ హృదయానికి**

**క్లోరోఫామ్ ఇచ్చి మెదడును మాత్రమే**

**లెటస్ గో అంటుంటారు.**

**ఎంత చేసినా ఎవడికి**

**తీరిక దక్కదు. కోరికచిక్కదు.**

**మెర్క్యురీ నవ్వులు పాదరసం నడకలు.....**

**.......**

**అన్ని ప్లాస్టిక్ సర్జరీ చేసుకున్న ముఖాలు**

**ఎవరిది వట్టి డాబో**

**ఎవడు దొరబాబో అంతుచిక్కదు.**

అని నగర జీవితాన్ని వర్ణిస్తూ నగరాన్ని గూర్చి కూడా ఇలా అంటాడు.

**నగరం...**

**అర్థం కాని రసాయనశాల.**

**అందమైన స్మశాన వాటిక.**

**నగరం...**

**చిక్కు వీడని పద్మవ్యూహం,**

**చెక్కుచెదరని మయసభ.**

**నగరం...**

**మేడిపండు- వేడి పుండు**

**కొందరికిది**

**అక్షయపాత్ర - మరెందరికో**

**గుండెల పైనించి పయనించే**

**కాలం రాక్షస యాత్ర.**

**నగరం...**

**రహస్యం బద్దలు కాని**

**గర్భనిరోధం.**

ఇలా మనం చదువుకుంటూ పోతే పేర్కొనటానికి ప్రతి కవితా సామాజిక స్పృహతో, సామాజిక వర్ణనతో, స్వాభావికంగాను, ఆలంకారికంగాను, అద్భుతంగాను, అత్యద్భుతంగా ను వర్ణించి కవిత్వంతో చావుని గెలవాలనుకున్న పిచ్చివాడు గెలుస్తానని నమ్మినవాడు. నిజానికి ప్రభాకరే గెలిచాడు చావు ఆ కవిత్వమై తోక ముడిచింది.

**" నాస్తి తేషాం యశ : కాయే జరా మరణ జం భయం"**

****

**ఆధార గ్రంథ సూచి :**


1. అలిశెట్టి ప్రభాకర్ కవిత

2. భారతి సూచి

3. సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు

4. Genre the (monograph) 1982

5. Theory of literature

6. Understanding the elements of literature

7. Archive.org

8. Telugu thesis.com

9. Yuva Bharati prachur analu.


*******

# 61. షాజహానా కథలలో సామజిక జీవన చిత్రణ

**షేక్ జరీన బేగం**

తెలుగు అధ్యాపకురాలు

ప్రభుత్వ స్వయంప్రతిపత్తి కళాశాల,రాజమండ్రి

**ఉపోద్ఘాతం**

హితాన్ని చేకూర్చేది సాహిత్యం. సమాజ శ్రేయస్సును కోరుకునేది సాహిత్యం. అంతేకాదు మనిషిలోని భావాలను, ఊహలను, ఆనందాలను, ఎదుర్కొనే బాధలను, అసమానతలను, వైరుధ్యాలను తెలిపే కళాత్మకమైన సాధనమే సాహిత్యం అని చెప్పవచ్చు.

తెలుగు సాహిత్యం పరిణామశీలం గలది. కనుకనే తెలుగు సాహిత్యం నిరంతరం నవ్యతను సంతరించుకొని శోభిస్తుంది. తెలుగు సాహిత్యంలో ఆధునిక సాహిత్యంలో చాలా ధోరణులు వెలువడ్డాయి. భావ కవిత్వం నుంచి దళితవాదం వరకు వెలువడిన కవితా ధోరణులు తెలుగు సాహిత్యానికి కొత్తదనాన్ని, నిండుదనాన్ని కలిగించాయి. ఇదే విధంగా ఆధునిక తెలుగు సాహిత్యం లో వెలువడిన మరో కవితా ధోరణి ముస్లిం వాద సాహిత్యం.

మొట్టమొదటిసారి ఖాదర్ మొహియుద్దీన్ "పుట్టుమచ్చ" లో వినిపించిన ముస్లింవాద స్వరం తెలుగు సాహిత్య ప్రపంచాన్ని కుదిపివేసింది. పుట్టుమచ్చ 1991 ఫిబ్రవరిలో అచ్చయ్యింది. మనుషులుగా ఈ దేశ పౌరులుగా తమ అస్తిత్వానికి సంబంధించిన ముస్లిముల తొలి ప్రకటన ఇది. ముస్లింవాదం మొదట దళితవాద కవిత్వంలో భాగంగా కొనసాగింది. దళిత వాదంలో భాగంగా వచ్చిన చిక్కనవుతున్న పాట, పదునెక్కిన పాట, చిత్తరువు కవితా సంకలనాలలో ముస్లింవాద కవిత్వం ఉంది. ఆ తర్వాత దళితవాదం నుంచి వేరై ముస్లింవాదం ఒక ప్రత్యేక శాఖగా మారింది.

ముస్లీంవాదంలో ప్రధానంగా కనిపించే అంశాలు :

* తమపై వివక్షను అణిచివేతను నిరసించడం
* ఇస్లాం పేరిట మత పెద్దలు మైనారిటీ నాయకులు అనుసరిస్తున్న అవకాశవాదం ధోరణి ని వ్యతిరేకించడం
* ఇస్లాంలో మహిళలని అవమానపరిచే ధోరణిని తిరస్కరిస్తూ సంస్కరణలని అనుసరించడం.

" నేను పుట్టక ముందే  
దేశద్రోహుల జాబితాలో  
నమోదై వుంది నా పేరు  
కన్నబిడ్డని సవితి కొడుకుగా  
చిత్రించింది చరిత్ర  
అన్నదమ్ముల్ని చీల్చి  
నన్ను ఒంటరి వాణ్ణి చేసింది చరిత్ర  
క్షమించండి నా స్నేహితుల్లారా  
వక్రీకరణకి వత్తాసుగా  
పదబంధాన్ని సృష్టించి  
నన్ను వెక్కిరించడానికి వెనుదీయని

మహాకవిని నేను మన్నించలేను

మన్నించండి నా మిత్రులారా

రాజుకి పేదకి మధ్య

భేదాన్ని చూడలేని

ప్రజాకవి ఉద్రేకానికి నేను

ఊగ్రూతలూగలేను".

మహాకవి శ్రీశ్రీ కసాయి, సాయిబు అనే పదాల్ని కలిపి కసాయిబు అనే పదబంధాన్ని సృష్టించడం, ప్రజాకవి సుద్దాల హనుమంతు తురకలను తరిమేయాలని పాట రాయడం, నిజాం నవాబు ముస్లిం కాబట్టి ముస్లింలందరినీ తరిమేయాలని పిలుపునివ్వడం వంటి సన్నివేశాలు ఖాదర్ మొహియుద్దీన్ పుట్టుమచ్చ దీర్ఘ కవితకు కారణమయ్యాయి. అంతేకాదు ఈ కవిత ముస్లీంలు అనుభవిస్తున్న ప్రతి సమస్యను కళ్ళకు కట్టింది. ఇలా ప్రారంభమైన ముస్లింవాదంలో జావేద్ సికందర్ ఎండి,యాకుబ్ పాషా, సయ్యద్ గఫర్, ఖాజా,అఫ్సర్, స్కై బాబా, షాజహానా, మెహజబీన్ మొదలగు రచయితలు భాగస్వాములయ్యారు ముస్లీం వాదం లో ప్రధానంగా మతంలోని స్త్రీ ల పరిస్థితి మెరుగుపడాలని ఆశించేవారు. ఈ మార్పు కోసం ప్రయత్నిస్తున్న గొప్ప ముస్లింవాద రచయిత్రి షాజహానా గారు.

**రచయిత్రి సంక్షిప్త పరిచయం:**

షాజహానా ఖమ్మం జిల్లా కమలాపురంలో జన్మించారు. తల్లిదండ్రులు డాక్టర్ దిలావర్, యాకుబ్బి. నాన్న దిలావర్ నుంచి మంచి సాహిత్యాన్ని వారసత్వంగా పొందారు. షాజహానా అమ్మమ్మ ఊరు పూర్వ వరంగల్ జిల్లా రాజోలు. దిలావర్ ప్రముఖ రచయిత. సోదరుడు అక్బర్ కూడా కవి, ఈ మధ్యనే ఆరాధన అనే కవితా సంపుటి తీసుకొచ్చాడు. సోదరి షంషాద్ మహమ్మద్ రచయిత్రి. ఆమె కవిత సంపుటి పేరు "ఈ కిటికీ తెరుచుకునేది ఊహల్లోకి".

షాజహాన జీవిత సహచరుడు నల్గొండకు చెందిన స్కై బాబా ప్రముఖ ముస్లింవాద రచయిత. ఖమ్మం జిల్లా లోని వివిధ గ్రామాల్లోనూ కొత్తగూడెంలోనూ చదువు కొనసాగింది. కోఠి ఉమెన్స్ కాలేజీలో ఎంఏ తెలుగు, రాజమండ్రి తెలుగు యూనివర్సిటీలో ఎం.ఫిల్ (గోల్డ్ మెడల్) ఉస్మానియా యూనివర్సిటీ నుంచి తెలుగులో ముస్లిం వాద సాహిత్యం - పరిశీలన అంశంపై పిహెచ్. డి. చేశారు. అస్మిత షాహిన్ లాంటి ఎన్జీవోల్లో పనిచేశారు. అన్వేషి నుంచి దూదేకు స్త్రీల మీద ప్రాజెక్ట్ చేశారు. వెలుగు ప్రాజెక్ట్ లోను పనిచేశారు.

షాజహాన రచనలు ఇంగ్లీష్ హిందీ జర్మన్ కన్నడ భాషల్లోకి అనువాదమయ్యాయి. 'నఖాబ్' ముస్లిం స్త్రీ కవిత్వం - 2005, 'చాంద్ తార' స్కైబాబా తో కలిసి (2009), 'దర్ది' -2012 లో వెలువరించారు.అలావా ముస్లిం సంస్కృతి కవిత్వం సంపాదకత్వం (స్కైబాబాతోకలిసి2006) వహించారు. ముఖామి కవితా సంకలనానికి కూడా స్కైబాబా తో కలిసి సంపాదకత్వం వహించారు. 2016లో 'లదాఫ్ని' అనే కథా సంపుటి వెలువరించారు ముస్లిం స్త్రీల తొలి తెలుగు కథా సంకలనం'మొహర్' కు సంపాదకత్వం వహించారు.'ఫిజా' కవిత్వం 2021లో ప్రచురించారు.

'నఖాబ్' కవిత్వం కన్నడలోకి అనువాదమై పుస్తకంగా వెలువడింది. సిల్ సిలా కథ ఆంగ్లం లోకి అనువాదమై 'సంయుక్త' ( ఏ జర్నల్ ఆఫ్ ఉమెన్ స్టడీస్) లో అచ్చయింది. ఆక్స్ ఫర్డ్ ప్రచురణ ట్వంటీయత్ సెంచరీ తెలుగు పొయెట్రీలో, ఇండియన్ లిటరేచర్, సాహిత్య అకాడమీ, ఇంకా అనేక సంకలనాలలో కవితలు అచ్చయ్యాయి. 'జస్ట్ బిట్వీన్ అజ్ ' (ఉమెన్ స్పీక్ అబౌట్ థైర్ రైటింగ్స్) లోను 'స్వీపింగ్ ద ఫ్రంట్ యార్డ్ ' (స్పారో ప్రచురణ) లలోను ఇంటర్వ్యూలు వచ్చాయి.

మనదేశంలోని ఎన్నో రాష్ట్రాల్లో జరిగిన వివిధ కార్యక్రమాల్లో కవితా పఠనం చేశారు. ఆంధ్రప్రదేశ్, తెలంగాణ సాంస్కృతిక శాఖ నిర్వహించిన అనేక కవి సమ్మేళనాల్లో పాల్గొన్నారు.

తెలంగాణ ప్రభుత్వ రాష్ట్ర విశిష్ట మహిళ పురస్కారాన్ని 2017 లో అందుకున్నారు. రంగవల్లి మెమోరియల్ అవార్డు, రంగినేని ఎల్లమ్మ అవార్డు, నందివాడ శ్యామల - కుందుర్తి అవార్డు, వెంకట సుబ్బు అవార్డు, గుర్రం జాషువా అవార్డు, తెలుగు యూనివర్సిటీ కీర్తి పురస్కారం, రొట్టమాకు రేవు అవార్డు, లదాఫ్ని కథా సంపుటికి కొలకలూరి భాగీరథి అవార్డులే కాక ఢిల్లీలో సంస్కృతి ప్రతిష్టాన్ అవార్డు అందుకున్నారు.

భారత ప్రభుత్వం తరపున గౌరవ అతిథిగా ఫ్రాంక్ ఫర్ట్ బుక్ ఫెయిర్ ( జర్మనీ - 2006 ) మాస్కో బుక్ ఫెయిర్ ( రష్యా - 2009 ) లో కవితా పఠనం చేయడం విశేషం. తెలంగాణ ఉద్యమంలో పాల్గొని ఉద్యమ కవిత్వం రాశారు. లెక్చరర్ గా, ప్రింట్ అండ్ ఎలక్ట్రానిక్ మీడియాలో జర్నలిస్టుగా పనిచేశారు. ప్రస్తుత నివాసం హైదరాబాద్.

**షాజహానా కథలలో సామజిక జీవన చిత్రణ**

**వతన్ కథా సంపుటి :**

వతన్ కథా సంపుటి స్కైబాబా గారి సంపాదకత్వంలో వెలువడింది. షాజహానా గారు ఈ కథ సంపుటికి సంపాద వర్గంలో సభ్యులుగా ఉన్నారు. అంతేకాక ఆమె ఈ కథ సంపుటిలో రచించిన సిల్ సిలా కథ ఆంగ్లంలో అనువాదమై ఎంతో గొప్ప కథగా నిలిచింది. ఈ కథాసంపుటి గురించి చెబుతూ స్కై బాబా గారు ఇవి కహానీలు కావు జిందగీలు అని పేర్కొన్నారు. తెలుగు సాహిత్యంలో ముస్లింల జీవితాలను చిత్రీకరించడం మరియు వారి జీవితాలను కథలుగా పరిచయం చేయడమే ఈ కథాసంపుటి ప్రధాన ఉద్దేశం.

**షాజహాన - సిల్ సిలా :**

షాజహాన గారి రచనల్లో అసలైన నిజజీవన చిత్రణ వుంటుంది. ఈ కథలో కూడా దూదేకుల కులానికి చెందిన తన పెద్దమ్మ అనుభవించిన వేదన వుంటుంది

మసీదులో బయాన్ లలో నమాజులలో అందరూ సమానమే కానీ, పెళ్లిళ్లు చేసుకోవడంలో వక్ఫ్ బోర్డ్ ఎంపికలో, మౌల్వీల్ గా మారడంలో మాత్రం దూదేకులను, బోరేవాలే,ఫకీర్లు మొదలగు వారిని తక్కువగా చూడటం ముస్లిం మతంలో మనకు కనిపిస్తుంది. దూదేకులను సగం ముస్లింలుగా చూడటం ముస్లిం మతంలో జరుగుతుంది. సిల్ సిలా కథ కూడా అసమానతలు నుంచి పుట్టినదే ఈ కథ షాజహాన జీవితంలో జరిగిన సంఘటన కావడం విశేషం. అందుకే స్కైబాబా గారు ఈ కథలను జిందగీలు అంటే జీవితాలు అని అన్నారు.

" సెల్లే గరీబ్ దాన్నయితే అయిన గాని ఇంటికి వచ్చిన సుట్టాన్ని అప్పుదెచ్చయిన పానం తీర్గ జూసుకుంట గాదె. ఈ ఎండాకాలం సెల్వలన్నా మున్ని ని పంపరాదే" అన్న మాటలతో కథ ప్రారంభమవుతుంది. మున్ని వాళ్ళ పెద్దమ్మ ఈసారైనా వేసవికాలం సెలవులకి ఇంటికి రావాలని మున్ని వాళ్ళ అమ్మని అంటే తన చెల్లిని అడుగుతుంది. అయినా మాలాంటి పేదవారింటికి ఎందుకు వస్తారులే అంటూ బాధపడుతూ వెళుతుంది. మున్ని తన తమ్ముడితో కలిసి వాళ్ళ పెద్దమ్మ వాళ్ళ ఇంటికి వేసవి సెలవులకు వెళ్తుంది. ఇలా వెళ్లడానికి వాళ్ళ నాన్న అనుమతి తీసుకోవాల్సి వస్తుంది. అక్కడికి వెళ్ళిన తర్వాత వాళ్ళ పెద్దమ్మ వాళ్ళకి చాలా ఆప్యాయంగా ప్రేమగా రుచికరంగా వండి పెడుతుంది మున్ని వాళ్ళ పెద్దమ్మను నువ్వు ఎందుకు పెదనాన్నను పెళ్లి చేసుకున్నావు అని అడిగితే అప్పుడు పెద్దమ్మ దానికి కారణం చెబుతుంది.

వాళ్ళ నాన్నకు అంటే మున్నీ వాళ్ళ తాతకు నలుగురు అమ్మాయిలు. పెద్ద అమ్మాయిని రైల్వేలో పనిచేసే అతనికి ఇచ్చి పెళ్లి చేశారు. మూడోఅమ్మాయి ఐన మున్ని వాళ్ళ అమ్మ మరియు చివరి అమ్మాయి చాలా అందంగా ఉండే వారనీ, వారిని వివాహం చేసుకోవడానికి ముస్లిం కుటుంబం నుంచి సంబంధం వచ్చిందని, మరి వారి వివాహం జరగాలంటే వాళ్ళకంటే ముందు పుట్టిన తన వివాహం కావాలి

కాబట్టి తనను సన్నాయి, గజ్జెలు వాయించే మా పెదనాన్నకిచ్చి వివాహం చేశారని చెప్పింది. ఆరోజు మున్నీ, వాళ్ళ పెదనాన్న తాగి వచ్చి పెద్దమ్మని కొట్టడం కళ్ళారా చూసి బాధపడుతుంది. పెద్దమ్మ జీవితం ఇలా అవడం తనను చాలా కలవరపెడుతుంది. మున్నీ తిరిగి ఊరు వెళ్లే రోజు పెద్దమ్మ వద్దన్నా వినకుండా 300 రూపాయలు ఆమె చేతిలో పెట్టి తన కుమారుడి పెళ్లికి నెల రోజులు ముందు రావాలని ఆప్యాయంగా చెబుతూ, ఏడుస్తూ ఆటో ఎక్కిస్తుంది. మున్ని కూడా కన్నీళ్ళతో వాళ్ల పెద్దమ్మకు వీడ్కోలు చెప్పడంతో ఈ కథ ముగుస్తుంది.

సిల్ సిలా షాజహానా గారి మొదటి కథ. సిల్ - సిలా అంటే వరుస అని అర్థం. ఈ కథలో కూడా ఒకదానికొకదానికి సంబంధం ఉంటుంది. ఉదాహరణకి, మున్ని వాళ్ళ పెద్దమ్మ ఎందుకు పేదరికం గా ఉండాలి? వివాహం కారణం. ఎందుకతనిని వివాహం చేసుకోవాలి? తండ్రి కారణం. తండ్రి అలా ఎందుకు చేసాడు? మిగతా ఇద్దరు ఆడపిల్లల వివాహం జరగాలి కాబట్టి. ఇలా ఒకదానికొకటి చైన్ లాగా ఉంటుంది ఈ కథ

ఈ కథలో ముఖ్యంగా రచయిత ముస్లిం మతంలోని ఉపకులాల మధ్య వున్న వ్యత్యాసాలను చూపించారు. దూదేకులను ఎలా తక్కువ చేసి చూస్తున్నారో వివరించారు. మున్నీ వాళ్ళ తమ్ముడు ఊరిలోకి వెళ్లి లతీఫ్ గారి ఇల్లెక్కడా అంటే ఎవరు చెప్పరు. మున్ని వాళ్ళ అమ్మ మాటలు గుర్తుకు తెచ్చుకొని "అది గాదె తాత దూదేకు లత్తయ్య, దూదేకుల కరింబి వాళ్ళు లేరు.... గదేనే సన్నాయి లత్తయ్య గాలిల్లు" అనగానే గుర్తుపట్టి వాళ్ళ ఇంటికి తీసుకువెళ్తారు. ఒక వ్యక్తి సామాజిక ఆర్థిక స్థాయిని బట్టే కాక అతను ఉన్న కులాన్ని బట్టి కూడా గౌరవం మారిపోవడం మనం ఇక్కడ గమనించవచ్చు.

ముస్లిం మతంలోనూ ఉపకులాలైన దూదేకుల పట్ల వివక్షత ఉంది. దూదేకులకు పెద్ద ముస్లిం కుటుంబం నుంచి పెళ్లి సంబంధం వచ్చిందంటే చాలా అదృష్టంగా భావించేవారు. ఈ కథలో కూడా మున్ని వాళ్ళ తాతయ్య మిగిలిన ఇద్దరు పిల్లలకు ముస్లిం కుటుంబం నుంచి సంబంధం రాగానే సంతోషపడి అంగీకరిస్తాడు.

అలాగే ముస్లిం కుటుంబాలలో ఉండే ప్రధాన సమస్య అధిక సంతానం. పోషించే స్థోమత వున్నా లేకున్నా సంతానం మాత్రం అధికంగా వుండేది. దీని వలన చివరికి పేదరికంలో బ్రతకడం లేదా మున్ని వాళ్ళ పెద్దమ్మ జీవితంలా కుటుంబంలో ఆడపిల్లలు అన్యాయమై పోవడం జరుగుతువుంటుంది.

పెద్దమ్మ తన కథ చెబుతున్నప్పుడు మున్నీ కి వాళ్ళ నాన్న వాళ్ళ అమ్మని దూదేకులదానా అని తిట్టడం గుర్తుకొస్తుంది. ఈ మాటలు దూదేకులను ఎంత తక్కువగా చూస్తున్నారో తెలుపుతున్నాయి.

సిల్ - సిలా కథలో పేద పెద్దమ్మ జీవితం చిత్రీకరించబడింది. వర్గ వివక్ష జాతి వివక్షతలను చూపించింది. ధనంతో అనుబంధాలు ఎలా ముడిపడి ఉన్నాయో తెలిపింది. అందంగా వున్నారని వివాహం చేసుకుని సందర్భం వచ్చినప్పుడు కులం పేరుతో అవమానించడం ఈ కథలో మనం గమనించవచ్చు. పితృస్వామ్యం గురించి ఈ కథ వివరిస్తుంది. వర్గ, జాతి, పేదరికం లో, పితృస్వామ్యం లో కొట్టుమిట్టాడుతున్న దూదేకుల స్త్రీల జీవితాలను అత్యద్భుతంగా చిత్రీకరించింది ఈ కథ.

**లద్దాఫ్ని కథా సంపుటి :**

షాజహాన గారి మొదటి కథాసంకలనం ఇది. వాస్తవ సమాజాన్ని చిత్రీకరించడం ఈ కథల లక్ష్యంగా కనిపిస్తుంది. పదకొండు కథలతో కూడిన సంకలనం ఇది.

" లద్దాఫ్ని జీవిత చిత్రణ ను చేసిన షాజహానా కథలలో అమ్మాయిలు అంతకఠోరమైన జీవనపరిస్థితులలోను కలలు కంటారు. ముందుకు సాగే ప్రయత్నం చేస్తారు. వాడిపోతామని తెలిసినా చిన్న చిన్న ఆనందాలకు సంబరంగా నవ్వుతారు. ఈ జీవనోత్సవాన్ని తీసుకురావడం వల్ల షాజహాన్ కథలు ప్రత్యేకంగా నిలిచాయి". - ఓల్గా

ఈ కథా సంపుటి లో ఒక అద్భుతమైన కథ "సండాస్". పేదరికంలో వున్న ముస్లిం కుటుంబాలలో ఎంతోమంది స్త్రీలకు జరుగుతున్న అవమానానికి నిదర్శనమే ఈ కథ. మలం, బయటికి వెళ్లడం వంటి విషయాల పైన కూడా కథలు రాస్తారా? కవితలు రాస్తారా? అంటే అవి నిత్యం మనకు తప్పనిసరిగా కావాల్సిన అవసరాలు అవి లేకపోతే మన జీవితాన్ని ఊహించగలమా? అలాంటి వసతులు కూడా లేని జీవితాలను ముస్లిం స్త్రీలు గడుపుతున్న దుస్థితిని చూపించడమే ఈ కథ యొక్క ప్రధాన లక్ష్యం.

"ఏమైందీ....వలీమా అయి ఒక్క రోజన్నా కాలే, అప్పుడే పోవుదేంది ఏ ఇంట్లనన్న నీకన్నా ఉన్నదా గిసువంటి రీతి రివాజు?" అనే మాటలతో ప్రారంభమవుతుంది ఈ కథ. ఎన్నో కలలతో వివాహం చేసుకున్న కొత్త పెళ్లికూతురి కథ ఇది. ఎవరింట్లోనైనా పాయ్ ఖాన దొడ్లు బాగా లేకపోతే వారింటికైనా వెళ్ళని ఆడపిల్ల, పెళ్లయిన తర్వాత పాయిఖానానే లేని ఇంటికి కోడలిగా వెళ్లాల్సి వచ్చింది. ఆమె తండ్రి చనిపోవడంతో తల్లి గత్యంతరం లేక ఆమెను సైకిల్ షాప్ అతనికి ఇచ్చి వివాహం చేసింది. ఆ ఇంట్లో ముగ్గురు అమ్మాయిలు ఉన్నా పాయ్ ఖానా లేని దుస్థితి అక్కడ ఒక్క సండాస్ మాత్రమే ఉంది. నాలుగు కర్రలు పాతి గోనిసంచలు కట్టి లోపల ఒక గొయ్యి తవ్వి వుంది. అందులోనే అందరూ ఒక లోటా నీళ్లతో వెళ్లి వస్తుంటారు. దీనినే సండాస్ అంటారు. ఆ గొయ్యిలో నుంచి పురుగులు ఎలుకలు బొద్దింకలు వస్తూ ఉంటాయి. దీనిలోకే వెళ్ళాలి ఆ ఇంట్లో వారంత. పెళ్లికూతురు షమీమ్ అందులోకి వెళ్లలేక ఆమెకు దుఃఖం వస్తుంది. తనకి తన పుట్టిల్లు గుర్తుకొస్తుంది. ఆ రోజు రాత్రి అన్నం కూడా తినకుండా పడుకుంటుంది. ఆ తర్వాత వుండలేక కడుపునొప్పి అని చెప్పి పుట్టింటికి వెళ్తుంది. అక్కడ తన పెళ్లి కోసం ఇల్లు అమ్మేసారని ఇప్పుడు వారు ఒక అద్దె ఇంటికి వెళ్తున్నారని అమ్మ చెప్తే తెలుసుకుంటుంది. చిన్న చెల్లి వచ్చి పాప" ఓ ఘర్ మే పాయిఖానా భీ నై హై.... ఖాళీ సండాస్ హై " అంటుంది దిగులుగా. అంటే తాము వెళ్ళబోయే ఇంట్లో కూడా మరుగుదొడ్డి లేదని కేవలం సండాసే ఉందని తెలుపుతుంది. ఈ మాటలతో కథ ముగుస్తుంది.

పేదరికంతో తిండి లేని పరిస్థితులు చూసి వుంటాం. కానీ సండాస్ లోకి వెళ్లలేక తినని దుస్థితి ఈ కథలో చిత్రీకరించబడింది. ఇంత నవనాగరిక సమాజంలో వున్న మనకి తెలియని వేదనలను కథలుగా మలచి చిత్రీకరించింది షాజహాన. ఈ కథలో రచయిత ఒక దగ్గర వూర్లో ముస్లింలు కాని వాళ్లు ఊరి బయటకి వెళ్తారు కదా వీళ్లకు కూడా వెళ్తేంది అనే మాటలు ఆలోచింపజేస్తాయి. ఊరి బయటకు వెళ్లడమే దుస్థితి అనుకుంటే అందుకు కూడా నిషేధింపబడిన స్త్రీల పరిస్థితిని ఏమని నిర్వచించాలి. అందుకే ఈ కథలో షాజహాన గరీబ్ ముస్లిం ఆడాళ్ల బతుకులు ఇంతేనా? అని వాపోతోంది.

అలా ఈ కథా సంపుటిలో ఒక్కొక్క ముస్లిం స్త్రీల జీవితం సాక్షాత్కరిస్తుంది. ఊరిలో అగ్రవర్ణాలు, కరణాలు, వ్యాపారస్తులు నిస్సహాయ స్త్రీలను ఎలా లొంగపరుచుకుంటారో ఖతిజా గఫూరే కథలో చెప్పింది. పితృస్వామ్యం, స్త్రీలపై లైంగిక అణచివేత వంటి అంశాలు వాద కథలో కనిపిస్తాయి. ఒక మంచి మనిషి కోసం జీవితంలో సాగే వెతుకులాట 'మంచిరాయి కథ' ఇలా ఈ కథలు వాస్తవిక జీవనాన్ని ప్రతిబింబించాయి.

**ఆధార గ్రంథాలు**


1. తెలుగు సాహిత్య చరిత్ర - ద్వాదశి నాగేశ్వర శాస్త్రి
2. తెలుగులో కవితోద్యమాలు - తెలుగు అకాడమీ
3. వతన్ కథా సంపుటి - స్కైబాబా
4. లద్దాఫ్ని కథా సంపుటి - షాజహాన


*******

# 62. యిక్కుర్తి నరసింహారావు గారి కలంచిందులు కవిత్వం`సామాజిక స్పృహ

**డా|| పి. శ్రీనివాసరావు,**

ప్రిన్సిపాల్, ప్రభుత్వ డిగ్రీ కళాశాల,

చింతలపూడి, ఏలూరుజిల్లా,

ఆంధ్రప్రదేశ్. సెల్ : 9390883982,

E-Mail.:johnveslyp@gmail.com

యిక్కుర్తి నరసింహారావుగారు గుంటూరు పట్టణంలో 1949 ఏప్రిల్ 23 వ తేదీన వీరరాఘవరావు, శకుంతలమ్మ పుణ్యదంపతులకు జన్మించారు.

కలం చిందులు ` సామాజిక స్పృహ :

ఉపోద్ఘాతము :

వాఙ్మయం, సారస్వతం రెండూ సమానమైన అర్థానిచ్చే పదాలు సాహిత్యము వాఙ్మయంలోని ఒక విభాగం '' సహితస్యభవతీ ఇతి సాహిత్యమ్ '' అని సాహిత్యానికి వ్యుత్పత్తి. హితంతో కూడినది సాహిత్యం అని అర్థం. సాహిత్య ప్రక్రియలలో ఒకటి కవిత్వం మొదట్లో కేవలం ఛందోబద్ధమైన పద్యరచననే కవిత్వం అని భావించేవారు. ఆధునిక కాలంలో వచనంలో రాసినా దాన్ని కవిత్వమనే అంటున్నారు.

కవిత్వం ద్వారా ఎన్నో సామాజిక సమస్యలను మనస్సుకు తట్టేలా గొప్పగా చెప్పవచ్చుననే అవగాహనే యిక్కుర్తిని కవిత్వం రాసేలా ప్రేరేపించింది. ఇందులో రచయిత వివిధ సామాజికాంశాల పట్ల తన మనస్సులో చెలరేగిన అనుభవం, స్పందన, భావవీచిక, విషాదం, విలాపం అన్నింటినీ 'కలం చిందులు' పేరుతో 98 చిన్న కవితలలో అందించాడు.

కలం చిందుల్లోని సామాజికాంశాలు

కలం చిందులు సాంప్రదాయాన్ని గౌరవిస్తూ గణపతి స్తుతితో మొదలవుతుంది. అయితే అది నేటి సమాజాన్ని విమర్శనాత్మకంగా ఖండిస్తూ సాగుతుంది. ఆఖరికి వినాయకునికి నైవేద్యం పెట్టే సందర్భంలో కూడా కల్తీ వస్తువులే పెడుతున్నారని సమాజంలోని అవినీతిని ఎండగడుతున్నాడు.

గణపతి స్తుతి తరువాత పేర్కొన్న ఉపశృతిలో

''అందరి కోసం నా ఆరాటం

అన్యాయంతో నా పోరాటం'' అని తన గమ్యాన్ని ప్రకటించాడు. కలం చిందుల ద్వారా కవి కోరుతున్నది అవినీతిరహిత, అభ్యుదయ సమాజం.

సామాజికాంశాలు

1. అవినీతి
2. మానవ నైజం
3. కులమత భేదాలు
4. ఆధునిక జీవనచిత్రణ
5. వస్తు వ్యామోహం

అవినీతి: ఆధునిక జీవనంలోని అవినీతిని యిక్కుర్తి సూక్ష్మంగా గమనించి, దాన్ని ఖండిస్తున్నాడు. మనిషిలోని వంచనను బయట పెట్టి నిజాయితీతో కూడిన అవినీతి రహిత, అభ్యుదయ సమాజాన్ని ఆకాంక్షిస్తున్నాడు.

ఉదాహరణకు గణపతిస్తుతిలో..

ఓ బొజ్జ గణపయ్య నీకంటే ఎవరయ్య
ఉండ్రాళ్లలో రాళ్లు నెయ్యి కల్తీ అయ్య
ఉడికి ఉడకని పప్పు ముద్ద కట్టదయ్య
అందుకని ముందుగా నీ బొజ్జ నిండుగా
కలం చిందుల విందు ఆరగించవయ్య! (పుట.3)

దేవుని నైవేద్యాన్ని కూడా పవిత్రంగా భావించక, కల్తీకి పాల్పడే సమాజ అవినీతిని కలం చిందులు మొదట్లో నిరసిస్తున్నాడు కవి.

అవినీతి వ్యక్తుల స్థాయి నుండి వ్యవస్థ స్థాయికి ఎదిగితే ఉదాసీనంగా ఊరుకోకూడదు, దాని అంతు చూడాల్సిందే అనే ప్రబోధం ''పగ్గాలు'' కవితలో చూడవచ్చు.

''చట్టం, న్యాయం చుట్టాలైతే
అబద్ధం అవసరానికి అందలమెక్కుతుంది
నిజం నిజంగా నిలబడ్డానికి
అవినీతికి పగ్గం వేయాల్సిందే'' (పుట.44)

ఈ దేశంలో ధర్మం, నిజం, ఖూనీ చేయబడుతోంది. కర్మ భూమి కాస్తా ఖర్మ భూమిగా మారుతోంది అని 'మార్మికం' అనే ఖండికలో మనిషిలోని అనైతికతకు కారణం వెతుకుతున్నాడు ఇలా

''నా దేశం కర్మభూమి
అందుకే కాకూడదు ధర్మహాని
అంటూ చేస్తాడు నిజం ఖూని
నిజానికి కాకేమవుతుంది ఖర్మభూమి'' (పుట.21)

ధర్మ పన్నాగాలు వల్లించే వారే ధర్మహానికి పాల్పడి, నిజాన్ని ఖూని చేస్తున్నారని ఇలాంటి వంచన ఉన్నంత కాలం దేశం అదోగతిలోనే ఉంటుందని, పరిస్థితిని మార్చాలనే ఉద్బోధ చేస్తున్నాడు యిక్కుర్తి.

మానవ నైజం : మానవత మరిచిన మనిషి పతనమయ్యాక లోకం భుజంగాలు తిరిగే ప్రమాదస్థలి అయిపోయిందనే ''నిజాన్ని'' చెప్పుతున్నాడు.

''పులిని చూసి పడకు భయం
పాము కూడ నయం నయం
మనిషంటే భయం భయం
పడకుంటే బ్రతుకు నిజం'' (పుట.22)

మనిషి పాముకన్నా విషపూరితం అయిపోయాడని, ప్రమాదకారిగా మారాడని, లోకం ఆవాస యోగ్యం కాకుండా పోయిందని కవి ఆవేదన చెందుతున్నాడు.

లోకంలో తిరిగే అమాయకులను హెచ్చరిస్తూ ''తస్మాత్ జాగ్రత్త'' అంటూ చైతన్య పరుస్తున్నాడిలా...

''మూర్ఖత్వం మారు పేరు

దౌర్జన్యం ఇంటి పేరు

విష హాసం ఆభరణం

వంచన, లోభం వృత్తి ప్రవృత్తులు

ఎన్నెన్నో భుజంగాలు తిరుగాడే లోకం

ఇది తస్మాత్ జాగ్రత్త!'' (పుట.23)

మానవ హృదయం కాలుష్యంతో నిండిపోయిందని, మంచికి పోయినా చెడే ఎదురవుతుందని ''ప్రతిబింబం'' కవితలో మానవ నైజాన్ని ఇలా స్పష్టం చేస్తున్నాడు.

''కల్మషమైన అద్దంలోకి

నిష్కల్మషంగా చూసినా

బింబం కల్మషంగానే ప్రతిబింబిస్తుంది

లోకం.... ఇదే మానవ నైజం'' (పుట.12)

మానవ హృదయమనే అద్దమే మురికి పట్టిపోయిందని, మానవుని అంతరంగాలలో మంచికి స్థానం లేకుండాపోయిందనేది ఇక్కడ కవి ఆవేదన.

అయితే ఈ పరిస్థితిని ప్రశ్నించకపోతే ''ముప్పు'' తప్పదని హెచ్చరిక కూడా యిక్కుర్తి చేస్తాడు.

''కోడలికి కూడు పెట్టడం

కన్నవాళ్లకు కొరివెట్టడం

తప్పదు కదా అనడం తప్పుకదా

అడిగితే తప్పు... అడక్కపోతే ముప్పు'' (పుట.41)

అని చెప్పినచోట చెడును ప్రశ్నించి, ఎదుర్కోకపోతే ముప్పు తప్పదు అని కార్యాచరణను ప్రబోధిస్తున్నాడు యిక్కుర్తి.

తన ఆకాంక్షను ఇలా వెలిబుచ్చుతున్నాడు.

''ఐక్యత చచ్చిన జాతికి

అసూయ పెరిగిన మనిషికి

ద్వేషం మీసం మెలేసే రోజుకి

కక్షలు కాలు దువ్వే వ్యవస్థకు

కట్టాలి సమాధులు తిరిగి

లేవకుండా పునాదులు'' (పుట.36)

మానవత్వం నశించిన వ్యవస్థకు సమాధి కట్టాలని కవి యిచ్చిన పిలుపు చైతన్య ప్రేరితమైన కార్యాచరణ.

కులమత బేధాలు: ఆధునిక సమాజంలోనూ కులం మనుషుల్ని వేరు చేస్తూ ప్రగతికి అవరోదంగా మారుతుందని, మతం మనుషుల్ని ఏకం కాకుండా భేద భావాలకు కారణమవుతుందని యిక్కుర్తి తన కలంచిందుల్లో కుల, మతాలను నిరసిస్తున్నాడు. కుల నిర్మూలనకు

కులాంతర వివాహాలే పరిష్కారం అనే అంబేద్కర్ ఆలోచన ఆచరణలో నీరు కారిపోతుందని '' పాపం ప్రేమ'' అనే ఖండికలో ఇలా చెబుతాడు.

''కులం పునాదులు కూల్చాలంటూ
మైకులు బద్దలు కొట్టే
విశ్వనాథశాస్త్రి గారి మూడో అమ్మాయి సరళ
రామచంద్రారెడ్డి గారి అబ్బాయిని ప్రేమిస్తే
ఏకాకైంది ప్రేమ
రామకృష్ణ శర్మకు
అర్ధాంగిగా మిగిలింది ఆమె'' (పుట.11)

ఆధునిక జీవన చిత్రణ : ఆధునిక జీవితంలో అన్నీ అమ్మకపు వస్తువులుగా మారాయనీ, మానవ విలువలు పతనమవుతున్నాయనే కవి ఆవేదన కలం చిందుల్లో ప్రత్యేకంగా గమనించవచ్చు.

వ్యాపార విలువలు, మార్కెట్ విలువల మధ్య మానవ విలువలు మంటకలుస్తున్నాయని వీటికి కారణమైన ఆధునిక జీవన విధానాన్ని యిక్కుర్తి నిరసిస్తున్నాడు.

'నాట్‌ఫర్ సేల్' అనే కవితలో దేన్నయినా అమ్ముకో కానీ మనసుని మాత్రం అమ్ముకోకు అని హితబోధ కనిపిస్తుంది.

''మనసుకు మనసమ్ముకో
మమతకు మమతమ్ముకో
మనిషికి మాత్రం విలువ కట్టి
అమ్ముకోకు మనసు మమత (పుట.14)

మనసు, మమత అనే మానవ విలువల్ని అమ్మకం వస్తువుగా చూడకూడదనేది కవి ఆకాంక్ష.

డబ్బు సంపాదించాలనే యావ ప్రజల్లో పెరిగిపోయిందని ప్రజలలో సంతృప్తి అనే భావనలేదని 'కోటులో' అనే కవితలో ఇలా విశదం చేస్తున్నాడు.

''ఒకప్పుడు
లక్షణంగా లక్ష
ఇప్పుడు బిక్షాధికారి
కోటైనా కొరతే ఇప్పుడు
అప్పుకోసం 'కోటే'శ్వరరావు'' (పుట.38)

డబ్బుకి మార్కెట్‌లో కొనుగోలు శక్తి తగ్గిందని అందుకే అధిక సంపద కోసం వెంపర్లాట మొదలైందని, పది రూపాయల నోటుని తీసుకొని అది ధనవంతుడికి ఎలాంటిది? పేదవాడికి ఎంత విలువ గలది? బజారులో
దాని కొనుగోలు శక్తి ఏమిటి? అని ఒక ఆర్థిక శాస్త్రవేత్తలాగా విశ్లేషణ చేస్తాడు 'నోట్' అనే కవితలో...

''కలిమి కలవాని జేబిలో ఆవగింజ
లేనివారికి పులివంటి మేకపోతు
కళకళ లాడెను నిండు బజారులో

నిముషముండలేని పిరికిపంద
పరిశీలించగా అది పది రూపాయల నోటు'' (పుట.26)

ఒకవైపు డబ్బు కోసం ఆరాటం, మరో వైపు వస్తు వినియోగ సంస్కృతి పోటీపడుతూ పెరుగుతూ పోతున్నదని, ఈ పరుగులో మానవ విలువలు పతనమవుతూ పోతున్నాయని, కవి సమకాలీన సమాజాన్ని విశ్లేషణ చేసి చూపిస్తున్నాడు.

వస్తువ్యామోహం: కవిత్వం సమకాలీన సమాజానికి ప్రతిబింబం అనే నిర్వచనానికి కలం చిందుల్లో అనేక ఉదాహరణలు ఉన్నాయి. భార్యభర్తల బంధం కూడా ఈ పతనానికి దూరంగా ఉండలేకపోతుంది. ఈ వైనాన్ని 'షరామామూలే' అనే కవితలో ఇలా తెలియజేస్తాడు.

''పండక్కి చీర కొంటేనే ఆమె ముఖం
రాగి కళాయి
కొనకపోతే వీధి కొళాయి
కొన్నాక పొరుగింటామెతో పోతుంది
బడాయి
ఆ రాత్రి ప్రక్కింట్లో మొదలవుతుంది
లడాయి'' (పుట.6)

ఇది అక్కడితో ఆగదు. అందరూ వస్తువ్యామోహంలో పడి మనశ్శాంతి పోగొట్టుకుంటూ ఉంటారు.

ఒక భార్య తన భర్తకు కొనవలసిన వస్తువుల జాబితా చెబుతుంది. 'ఇండెంట్' అనే కవితలో ఈ ఇండెంట్‌కి అంతా ఉండదు. ఆ కవిత ఇలా సాగుతుంది.

''ఈ నెలలో మీరు కొత్త సూట్
కొనుక్కోవాలి!
పై నెల ఎరియర్సుతో మీరు రింగ్
చేయించుకోవాలి
అలాగే....
షూస్ బాగా నలిగిపోయాయి
క్రొత్తవి తెచ్చుకోండి
అలాగే...
డైలీ షేవ్ చేసి ఎవర్‌గ్రీన్‌లా ఉండాలండి!
అలాగే...
వెంటనే నాకో జత బంగారుగాజులు కూడా చేయించాలి!
ఎ.......లా.......గో.....! (పుట.8)

ప్రస్తుతం అన్ని ఇళ్ళలలో టి.వి.లు, సెల్‌ఫోన్‌లు రకరకాల వస్తువులతో నిండిపోతున్నాయి. మనిషి కంటే వస్తువు విలువైనదైపోతుంది.ఈ స్థితిని వ్యంగ్యంగా యిక్కుర్తి విమర్శిస్తున్నాడు. ఉదాహరణకు
'వ్రజ పసాదం' అనే ఖండికలో టి.వి.ని గురించి ఇలా వర్ణిస్తాడు.

''మారణాయుధం లేకుండా / హింసనేది చేయకుండా

మనుషుల్ని జోకొట్టి మట్టి కరిపించే / సాధనం కావాలని వరమడిగినప్పుడు

ఇచ్చిందే దేవుడు టీ.వి.'' (పుట.36)

ఈ ఇడియట్ బాక్స్ ముందు కూర్చుని వచ్చే సీరియళ్ళను చూస్తూ కాపురాలను చెడగొట్టుకుంటున్నవారెందరో? అలాగే సెల్‌ఫోన్‌ల వినియోగాల గురించి కూడా మరో వ్యంగ్య కవిత వినిపిస్తుంది. దాని శీర్షిక 'ఆల్ ఈజ్ వెల్'.

''హలో అంతా వెల్ / అన్నంత వరకు ఓకే సెల్

చెవికి రాసావో ఫెవికాల్ / పడుతుంది జేబుకి చిల్లు / ఆపైన హెల్లు'' (పుట.37)

ఒక ఇంట్లో ఐదుగురు ఉంటే వారికి పదికి పైనే సెల్లులుంటాయి. వీటి వాడకంతో మనుషుల మధ్య దూరం పెరిగిందా? లేక దగ్గర పెరిగిందా అంటే చెప్పలేం! ఒకే ఇంట్లో కూర్చుని ఒకరితో ఒకరు మాట్లాడుకోకుండా తలా ఒక సెల్ ఫోన్ పట్టుకొని గదుల్లో ఒంటరిగా కూర్చుని మాట్లాడుకుంటూ ఉంటారు. దీనికి తోడు మెసేజ్‌లు, ఫేస్‌బుక్‌లు కూడా తోడయ్యాయి. మనిషి సమూహంలో ఉంటూనే ఒంటరిగా మారిపోయాడు. సెల్‌ఫోన్ వాడకం ఆధునిక జీవితంలోని ''హెల్'' ని యికుర్తి చూచాడు. దాని నుండి బయటపడమని ఉద్బోధిస్తున్నాడు.

సెల్‌ఫోన్ వాడకం చివరకు నరకప్రాయం అని చెప్పడం చూస్తే కవికున్న సామాజిక బాధ్యత అర్థమవుతుంది జేబులోని డబ్బు ఖర్చు అవడమే కాదు అది మనిషి ఆరోగ్యానికి, పర్యావరణ పరిరక్షణకు వినాశనకారిగా మారడాన్ని సూచిస్తుంది.

**ఉపసంహారం :**

మొత్తంగా ఆధునిక జీవితం నరకప్రాయం అయిపోతుందని, అసమానతలతో నిండి పోతోందని కవి ' కలం చిందులో' నేటి సామాజిక అంశాలను గుర్తుచేస్తున్నాడు. సమాజం ఎటువైపుకి పోతుందో చూడమంటూ మానవ విలువలు మంట కలుస్తున్నాయని వాటిని

కాపాడుకోకపోతే ముప్పుతప్పదని సామాజిక స్పృహ కల్పిస్తున్నాడు.

'' అనురాగం నా ఆరవ ప్రాణం / అభిమానం ఊపిరి, కృషి, ఆయుష్యు'' (పుట.4)

అని మానవత్వం పట్ల ప్రేమ కలిగినవాడు కాబట్టి సమానత్వాన్ని కోరుకుంటున్నాడు.

పేదరికం, శ్రమ దోపిడి పోవాలని, మానవులందరూ సుఖ శాంతులతో ఉండాలనే తన ఆకాంక్షను, ఫలశృతిగా ఇలా తెలియజేస్తున్నాడు.

ప్రతి ఉదయం / మీ హృదయంలో

ఆనందాలు గంపెడు / వెదజల్లాలని కోరుకుంటున్నా / వాటా అందరికీ పంచమంటున్నా

ఆ ఆనందంలో కూడా అందరికీ సమాన వాటా ఉండాలని తన సామాజిక బాధ్యతను చాటుకుంటున్నారు. అభ్యుదయ కవి యిక్కుర్తి నరసింహారావుగారు.

**ఉపయుక్త గ్రంథసూచి :**


1. సాహిత్య శిల్ప సమీక్ష ` పింగళి లక్ష్మీకాంతం
2. ఆధునికాంధ్ర కవిత్వం ` సంప్రదాయములు `ప్రయోగములు డా|| సి.నారాయణరెడ్డి
3. కలం చిందులు ` యిక్కుర్తి నరసింహారావు


*******

# 63. తెలుగు నవలల్లో అసమర్థుని జీవయాత్ర – సామాజిక దృక్పథం

**డా. హెచ్. కిషన్,**

అసోసియేట్ ప్రొఫెసర్ ఆఫ్ తెలుగు,

బి.జె.ఆర్ ప్రభుత్వ డిగ్రీ కళాశాల,

నారాయణగూడ, హైదరాబాద్ -29

చరవాణి : 9848170041,

Email : drkishanh@gmail.com

**సంగ్రహ వ్యాసం :** తెలుగు నవలకు వంద సంవత్సరాలు గడిచాయి. ఈ వంద సంవత్సరాలలో కొన్ని వేల నవలలు వెలువడి ఉండవచ్చు. సమాజాన్ని అత్యంతమూ ప్రభావితం చేసిన రచయితను, ముఖ్యంగా నవలా రచయితలను, వేళ్ళమీదనైన లెక్కించాలంటే కష్టమే అవుతుందని అక్కిరాజు రమాపతిరావు ''మహతి''లో పేర్కొన్నారు. ఎవరెన్ని చెప్పినా తత్త్వం కొలిచే యంత్రాలు లేవు. అందువల్ల అది మహా భారతమంత పెద్దది కావచ్చు. రామాయణమంత చిన్నది కావచ్చునని నోరి నరసింహశాస్త్రి, ''మహతి సమీక్ష వ్యాస సంకలనం''లో పేర్కొన్నారు. 1872లో వచ్చిన మొట్టమొదటి నవల శ్రీరంగరాయచరిత్రం (గోపాలకృష్ణ సెట్టి, భావవీణ, పుట.108) 1872 నుండి నేటి వరకు కోకొల్లాలుగా వచ్చాయి. నేటి సమాజానికి చాల దగ్గరగా ఉందనే దృక్పథంతో ఈ ''అసమర్థుని జీవయాత్ర'' 1994లో గోపీచంద్ రాసిన ఈ నవలనే ప్రధానంగా తీసుకొని ఇందులోని పాత్రల పరిశీలనతో పాటు మనదైన ఆలోచనని విశ్లేషణతో కూడిన వివరణలు అందించడమే సంగ్రహ వ్యాసం యొక్క ఉద్దేశం.

**కీలకపదాలు :** 1. సీతారామరావు 2. వీరభద్రుడు 3. రామయ్య 4. రత్తమ్మ 5. ఇందిరా 6. వెంకమ్మా 7.శీనయ్య 8. కాంతమ్మ 9. సుబ్బయ్య 10. పార్వతి పరమేశ్వరులు 11. భస్మాసురుడు 12.వైశ్వానరుడు 13. శూద్రనౌకరు 14. ఎరుకల్ది 15. సౌమ్యమూర్తి 16. సూర్యారావు 17.శాతవాహనుడు 18. బైరాగి 19. బాలకృష్ణుడు 20. శివరావు 21. ప్రొప్రయిటరు 22.పరబ్రహ్మశాస్త్రి 23. నాగలింగం 24.రాంబొట్లు 25. చైతన్యస్వామి.

**నిర్వచనం**

నవలలోని కథ వాస్తవ జీవితానికి దగ్గరగా ఉంటుంది. వాస్తవ జీవితాన్ని ఆధారంగా చేసుకొని రచన చేయాలిగాని యధాతథంగా గ్రహించి రాస్తే అది నవల అనిపించుకోదు. నవలలోని కథ మానవుడి జీవితాన్ని పరిపూర్ణ మానవ చేష్టలను గురించి వ్యాఖ్యానం చేయాలి. నవల కల్పనలతో కూడిన ఒక సుదీర్ఘమైన ఊహా నిర్మిత కథ. ఇందులో వాస్తవ జీవితానికి సంబంధించిన స్త్రీపురుష ప్రాంతీయ సన్నివేశాలు, సంఘటనలు మొదలగునవి కలిసిపోయి ప్రకాశిస్తాయి.

**వస్తువు**

రచయిత నవలా రచన రాయాలని అనుకున్నప్పుడు అతనికి ముందు ఏ విషయం మీద రాయాలనే ఆలోచన వారికి కలగాలి. ఆలోచన వచ్చిన వస్తువులు తీసుకుని అన్వేషణ మొదలు పెడతాడు. ఒక అంశాన్ని ఎన్నుకొని సమకాలీన సమాజం నుంచి లేదా తన జీవితానుభవాలనుంచి వస్తువును ఎంపిక చేసుకుంటాడు. ఏ రచనలోనైనా రచయిత ఎన్నుకునే వస్తువుకు ప్రాధాన్యం ఇస్తాడు. 'అసమర్థుని జీవయాత్ర' నవలలో వస్తువు గంభీరమైంది. ఎందుకంటే సీతారామరావు పాత్రను గోపీచంద్ సంక్షిప్తంగా వర్ణించాడు.

**పాత్ర చిత్రణ:** నవల పాత్రలతో నడుస్తుంది. కథకు జీవశక్తిని అందించేది పాత్రలు. పాత్రలో లేని నవలలను రాయడం అసాధ్యం. నవల పాత్రల కోసమే పుట్టింది. పాత్రల ద్వారానే పాఠకులలో భిన్న భావోద్వేగాలు పడతాయి. పాత్రల స్వభావాలు కథను మలుపు తిప్పుతాయి.

సమాజంలో తారసపడే వ్యక్తుల మనోప్రవృత్తుల ఆధారంగా రచయిత తన నవలల్లోని పాత్రలను మలచుకుంటాడు. అప్పుడే అవి సహజమైన వ్యక్తులకు సన్నిహితమవుతాయి. అసమర్థుని జీవయాత్ర నవలలో వివిధ పాత్రలు దర్శనమిస్తాయి.

**ఇతివృత్తం**

నవలకు వస్తువును ఎంపిక చేసుకున్నాక రచయిత దాన్ని ఏ విధంగా చెప్పాలనే ప్రణాళిక వేసుకుంటాడు. ఒక వ్యక్తి జీవితం కేంద్రంగా తీసుకొని నవల రాస్తాడు. కార్యాచరణ సంబంధాలు గల సంఘటనల సమాహార క్రమాన్ని ఇతివృత్తంగా వ్యవహరిస్తాడు. సంఘటనల్లో ఉత్సుకత సంఘర్షణలు చోటు చేసుకుంటేనే పటిష్టమైన ఇతివృత్త నిర్వహణగా గుర్తిస్తాడు. కథలోని పాత్రల చర్యలు ఇతివృత్తానికి జీవం పోషిస్తాడు. ఇతివృత్త నిర్వహణ ద్వారానే కథాగమనం ఆసక్తిదాయకంగా మలుస్తాడు. నవలను పాఠకుల చేత చదివిస్తాడు. అసమర్థుని జీవయాత్ర నవలల్లో కథానాయకుడు సీతారామారావు. ఇతని జీవితంలోని అనుభవాలను ఎదుర్కొన్న అవరోధాలను, ఎన్నో మలుపులు తిప్పిన సంఘటనలను గోపీచంద్ నవలలో సంఘటనలతో, సహజమైన సన్నివేశాలతో పాఠకులను ఆకర్షించే విధంగా వివరించారు. నాటి నుండి నేటి వరకు గోపీచంద్ రాసిన 'అసమర్థుని జీవయాత్ర' నవలను పాఠకులు సాహిత్య ప్రియులు మొదలగువారు చదువుతున్నారు.

**ఉపోద్ఘాతం :** నవలా రచనకు కొంత సామాజిక చేతన అవసరం (ప్రజల మనిషి). ఆలోచించి చూస్తే ఈ ప్రపంచంలో ఏముంది. ఏం చేయ్యటానికైనా! కాదు. ఈ ప్రపంచం, అనుక్షణం మారుతూ ఉంటుంది. ఈ మార్పు ఎందుకు వస్తుందో ఎవ్వరికీ అర్థం కాదు. ఈ మార్పుకి ఆదర్శం ఉన్నట్లు కనబడదు. ఇక మానవుడు చేసేది ఏమిటి? కొంత మంది ''సంఘ సంస్కరణ విప్లవం'' అంటూ తిరుగుతూ ఉంటారు. ఏదో పెద్ద పని చేస్తున్నట్లు కేకలు వేస్తారు. వాళ్ళను చూచి జాలి వేసేది సీతారామారావుకు. వీళ్ళు చేసేది ఏమిటి? సంఘానికి పరిపక్వదశ అనేది లేదు గదా! మరి దేనికోసం వీళ్ళ ఆరాటం? మనిషికి ఏదో ఒక సమస్య వస్తూనే ఉంటుంది. ఆ సమస్య నుంచే మరొక సమస్య పుట్టుకొస్తుందని పెద్దలు అనుభవంతో చెప్తారు. ఇది ప్రపంచ పరిణామం అంటారు. మనిషిని ఇబ్బంది పెట్టే సమస్య ఏదో ఒకటి ఉంటుంది. మరి ఈ సమస్యకు పరిష్కారం ఉంటుందా! అనేది పెద్ద ప్రశ్న ఎందుకనగా!

ఇంతమంది నాయకులు, మేధావులు, శాస్త్రవేత్తలు ఉన్నారు. వీళ్ళకు తెలియదా? తెలియకనే వీళ్ళు ఇంత కష్టపడుతున్నారా? వీటికి వెంటనే జవాబు దొరకదు. సంఘం కోసం చాలా మంది కష్టపడుతారు. గౌరవం, విమర్శ వచ్చే మాటల గురించి ఆలోచించకుండా కష్టపడతారు. పేరు గౌరవం వచ్చే సమయానికి వీళ్ళు ఉండరు. ఇన్ని రోజులు కష్టపడ్డది శూన్యమేనా అని బాధపడతారు. కాని సత్యం తెలిసినా పైకి చెప్పకుండా యథాప్రకారం జీవయాత్ర సాగిస్తారు. (పుట:18,19) ఈ అసమర్థుని జీవయాత్ర నవల గురించి తెలుసుకుందాం. తెలుసుకోవడానికి ప్రయత్నం చేద్దాం.

సమాజంలో చిత్ర విచిత్రమైన వ్యక్తులు ఉన్నారు. వారు తమ ఇష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తారు. అటువంటి వాళ్ళ గురించి తెలుసుకుందాం !

**పాత్రలు**

**సీతారామరావు :** సీతారామారావు జీవితం విచిత్రమైనది. తన తండ్రి మరణ శయ్య మీద ఉండి ''బాబూ మన వంశం పేరు నిలబెట్టాలి. అంతకంటే నేను చెప్పేది ఏమి లేద''ని చెప్పాడు. అవే అతని చివరి మాటలు. ఆస్తి సంగతి లెక్క ఇతర విషయాలు చెప్పలేదు. వంశం పేరు నిలబెట్టుమన్నాడు అదే వారి గొప్పతనమని అందురూ పొగిడారు. ఆ గొప్పతనం వాళ్ళ వంశంలోనే ఉందని ఇరుగుపొరుగు వారు అన్నారు. ఎందుకంటే వాళ్ళ ముత్తాత, తాతలు ఆ ఊరికి అనేక సేవలు చేశారు. అందుకని సీతారామారావును వంశం పేరు ప్రఖ్యాతులు నిలబెట్టుమని అనడంలో ఉన్న అంతరార్థం ''తండ్రికి మించిన చెయ్యి'' అన్నారు అందరు. ''ఎముక లేని చెయ్యి'' అన్నాడు ఒక కవి. (పుట.516).

**వీరభద్రుడు :** ఇతడు కర్ర చేత్తో పట్టుకొని బజారులో నడుస్తుంటే, ఇతణ్ణి చూసి భయపడి ఆడవాళ్ళు ఇంట్లోకి పరుగెత్తే వాళ్ళు. పిల్లలు భయపడేవాళ్ళు. ఆ గ్రామంలో దేవాలయం గుడి కట్టిచ్చాడు. ప్రతి సంవత్సరం దేవుని ఉత్సవం జరిపించేవాడు. ఆ ఉత్సవానికి అయిన ఖర్చులు తనే పెట్టుకొనేవాడు. అడిగిన వాళ్ళకు దాన ధర్మాలు చేసేవాడు. ఇంత గొప్ప సహృదయం గల్గిన వాడు వీరభద్రుడు. (పుట.6)

**రామయ్య :** రామయ్య ఆ గ్రామంలో వృద్ధ పండితుడు. ఇతణ్ణి ఆ గ్రామస్తులందరు ''తాతా'' అని పిలుస్తారు. సీతారామారావు కుటుంబం అంటే చాల అభిమానం కలవాడు. బాబు! నీవు కుర్రవాడివి. ప్రపంచ అనుభవం తక్కువ. కొంచెం తెలుసుకొని మెలగాలని సలహా ఇచ్చాడు. రామయ్య నేను తెలిసే చేస్తున్నా తాత అనేవాడు సీతారామారావు ''చేతుల్లో నాలుగు రాళ్ళుంటే అందరు మన చుట్టే ఉంటారు. తరువాత మన మొఖం చూసే వాళ్ళు ఉండరని చెప్పాడు.'' మళ్ళీ మొఖం చూస్తారనే ఆపేక్షలోనే నేను పనులు చేయటం లేదు తాత! చేయడం కోసమే చేస్తున్నాను అన్నాడు ''నేను ప్రతిఫలం కోరుకోవడం లేదు తాత'', ''అది ఒక్కటే చాలదు బాబు'' అని సీతారామారావుకు లౌక్యం చెప్పాడు రామయ్య తాత (పుటలు.9,10).

**రత్తమ్మ :** రత్తమ్మ పెళ్ళై చాల సంవత్సరాలు అయింది. ఎప్పుడు ఇంటి గడపదాటి వెళ్ళలేదు. పర పురుషుడి మొఖం చూడలేదు. నా భర్తకు రత్తమ్మ మీద కోపం వస్తూనే ఉంటుంది. ఆ కోపాన్ని రత్తమ్మ తన పిల్లల మీద తీర్చుకొని కుటుంబాన్ని దాటేస్తుంటుంది. ఎవరో ఒకరు ఆలోచించాలి. సర్దుకొని పోవాలి. లేదంటే ఇద్దరి మధ్య గొడవలు తప్పవు. అర్థం చేసుకొని సంసారాన్ని నడిపించాలి. పిల్లలను పోషించాలి. (పుట.11)

**ఇందిర :** ఇందిర గురుకులంలో చదువుకుంది. ఒకరిని ప్రేమించి పెళ్ళి చేసుకుంది. తండ్రి పోలీసు ఉద్యోగి. సంతానం కలగకుండా జాగ్రత్తపడాలని అనుకున్నది. కాని ఐదు సంవత్సరాలు దాటేటప్పటికి ఇద్దరు పిల్లలు పుట్టారు. (పుట.13).

ఇందిరా దేవిగారని పిలిచాడు సీతారామారావు. వెంటనే ఆమె పిలిచింది. అతని హృదయం ఆనందంతో నిండిపోయింది. ''రామూ'' అని ఇంకొంచెం గట్టిగా పిలిచింది. అతని వొళ్ళో తలదాచుకుంది. అతడు తల నిమురుతూ పరవశత్వం పొందాడు. ఇంత ఆనందం ప్రపంచంలో ఎవ్వరు అనుభవిస్తున్నారు ''ఆనందో బ్రహ్మ'' (పుట.93) అని అనుకున్నాడు సీతారామారావు.

**వెంకమ్మా :** వెంకమ్మా ప్రతి రోజు ఇందిరకు పాలు పోస్తాది. పాల బాకి ఉన్నావు. ఇస్తావా అని అడగింది. ఇందిర ఎంత ఇవ్వాలని అడిగింది. మొత్తం ముప్పై ఆరు రూపాయల తొమ్మిది అణాలు ఇవ్వాలని లెక్క చెప్పింది. వెంకమ్మా ''ఆగిందానివి ఎట్టాగో ఆగావు'' ఈ రోజు కూడా ఆగు వెంకమ్మా వారింకా నిద్రలేవలేదు. లేవగానే ఇస్తాను అంది ఆమె. ''సరేలే అమ్మా'' అని వెళ్ళిపోయింది వెంకమ్మా. అడగ్గానే డబ్బు ఇవ్వలేకపోయానని ఇందిర బాధపడింది. సమయానికి ఎవరి దగ్గర డబ్బులు ఉండవు. అవసరాలు ప్రతి మనిషికి ఉంటాయి. కాని వెంకమ్మా డబ్బులు అడిగే సరికి ఇవ్వలేక పోయినందుకు ఇందిరా బాధపడింది. మంచి వాళ్ళు ఎప్పుడైనా ఎదుటి వ్యక్తి అవసరాలను అర్థం చేసుకోవాలి (పుట.27).

**శీనయ్య :** శీనయ్య పల్నాటి సీమ నుండి బ్రతుకుదెరువు కోసం వచ్చాడు. లాగుడు బండి అద్దెకు తీసుకున్నాడు. నూటపదహారు రూపాయలు సంపాదించాడు. తన సొంత గ్రామానికి వెళ్ళి పెళ్ళి చేసుకోవాలని కోరిక ఉందని అన్నాడు. ఇందిర ఇంట్లో శీనయ్య నీళ్ళు పోసి వచ్చాడు. ''కొంచెం బజారుకి వెళ్ళి రావాలి శీనయ్య'', ''కట్టెలు తెచ్చి పెట్టాలి'' డబ్బివ్వండి తెస్తాను అని అడిగారు. ఇందిర కాంతమ్మ దగ్గర బదులు అడగి ఇచ్చింది (పుట.28). ఇచ్చిపుచ్చుకోవడం చాలా మంచిది.

**కాంతమ్మ :** 'ఇబ్బందులు ప్రతి ఒక్కరికి ఉంటాయ'ని చెప్పుకుంటు డబ్బులు తెచ్చి కాంతమ్మ ఇందిరకు ఇచ్చింది. (పుట.31) ఇరువురికి సహాయం చేసే గుణం ఉంటే బాగుంటుంది. సమాజంలో సహాయం చేసే గుణం ప్రతి ఒక్కరికి ఉండాలని కోరుకుందాం.

**సుబ్బయ్య :** సుబ్బయ్యది చిల్లర కొట్టు దుకాణం. అది కూడ ఇంటి దగ్గరలోనే ఉంది. అక్కడి నుండి కావలసిన వస్తువులన్ని తెచ్చుకుంటుంది కాంతమ్మ. (పుట.32) ఇంట్లో అవసరానికి ఉపయోగపడే వస్తువులను దూరం వెళ్ళకుండా దగ్గరలోనే తీసుకుంటే సమయం కలిసి వస్తుందని చెప్పవచ్చు.

**పార్వతీ పరమేశ్వరులు :** పార్వతీ పరమేశ్వరులు ఇద్దరు వ్యక్తులు కారు అర్ధనారీశ్వరులు. ఒకే ఆకారంలో సగం పార్వతీ, సగం శివుడు. సీతారామారావుని పలకరించేందుకు శివపార్వతులు తమలో తాము మాట్లాడుకుంటున్నారు. ఏమిటి బిడ్డా అని ప్రశ్నించారు. ''నా వరం ఇంకొకళ్ళకివ్వ కూడదు''. ''ఇవ్వను'' అని మాట ఇచ్చాడు శివుడు. వెంటనే తన భర్త నోరు జారాడు. పార్వతీకి భయమైంది. వెళ్దామని తొందర పెట్టింది. ''వెళ్దాం'' అన్నది. పార్వతి ''వెళ్దాం'' అన్నాడు శివుడు. ''ఇంకొక వరం అడుగుతాడు'' అన్నది పార్వతి. ''అడగనివ్వు'' అన్నడు శివుడు. ''అడిగి అడిగి చివరకి మీ నెత్తినే చెయిపెడతాడు భస్మాసురుడ్ని జ్ఞాపకం చేసుకొండి నాథా!'' అన్నది పార్వతి. (పుట:37,40)

**భస్మాసురుడు :** భస్మాసురుడి పేరు ఎత్తేసరికి శివుడు భయపడ్డాడు. ఇతని భారి నుండి తప్పించడానికి చాల కష్టాలు పడ్డాడు. వెంటనే జ్ఞాపకం తెచ్చుకొని సీతారామారావుని ''బిడ్డా నీకు శుభమగుగాక''! అని దీవించి ఇద్దరు అంతర్థానమయ్యారు. (పుట.40)

**వైశ్వానరుడు :** వైశ్వానరుడు ''భాంఙ్'' అని అరిచాడు. ఆ అరుపుకు భూమి దద్దరిల్లింది. కొండలు పిండి అయ్యాయి. కోతులు చెట్లమీద నుంచి, చెట్ల మీద పండిన కాయలు రాలినట్లైనాయి. పక్షులు మళ్లీ ఆకాశంలోకి వెళ్ళిపోయినాయి. సీతారామారావు చుట్టూ పెరిగిన పుట్ట చెల్లాచెదరైంది. గడ్డం ఊడి గాలిలో నాట్యం చేసింది. స్వర్గలోకం తూట్లుపడింది. ఆ తూట్లలో నుంచి ఊర్వశీ, రంభ, తిలోత్తమా మొదలైన అప్సరసలంతా పంచభక్ష పరమాన్నాలు పళ్ళాల్లో పెట్టుకొని సూర్యకిరణాల వలే కిందికి దిగారు. ఒకతే సీతారామారావు తొడమీద కూర్చొని తినిపించడం మొదలు పెట్టింది. మిగిలిన వాళ్ళు హాయిగా పాడుతూ, కన్నులు పండుగ్గా నృత్యం చేశారు. (పుటలు. 40, 41).

**శూద్రనౌకరు :** మామయ్య రైతుగదా, ఇన్ని సంవత్సరాల నుండి పొలం మరమ్మత్తు చేయించకుండా ఎందుకు ఊరుకున్నాడని సీతారామారావు అడిగాడు శూద్రనౌకర్ని. ''ఏమోనండి మిగిలిన పొలం అంటే పసిపిల్లని చూసినట్టు చూపేవాడు. ఈ పొలం మాట ఎత్తేప్పటికి కస్సుమని లేచేవాడు'' మరమ్మత్తు చేస్తే ఫలసాయం ఎక్కువ వచ్చేదిగా? ''రాకే మండి మీరే చేసుకుంటారని ఊరుకున్నారేమో'' అన్నాడు శూద్రనౌకరు. (పుట.64).

**ఎరుకల్ది :** దొంగ తనాలు కూడా కడుతున్నావా అమ్మా! ఇన్ని సంవత్సరాలు మీ కూడు తినే మేము జీవించాం అమ్మా! లేకపోతే మాకు తినడానికి కూడు ఎక్కడిది అన్నది ఎరుకల్ది. ఇందిరతో ''కొడితే మాత్రం మళ్ళీ కొడతావా'' సీతారామారావు మళ్ళీ కొట్టాడు తన కూతుర్ని. ఎరుకల్ది అక్కడే నిలబడి ఉంది. ఇంకా అక్కడే నిలబడి చూస్తుంటే కోపం వచ్చి ఇంకా నువ్వు ఇక్కడే నిలబడి చూస్తున్నావని గట్టిగా అనేసరికి వెళ్ళిపోయింది ఎరుకల్ది. (పుట.73).

**సౌమ్యమూర్తి :** సౌమ్యమూర్తికి పిశాచం భయపెట్టింది. ఇతనికి పిశాచం శరీరం పెరుగుతున్నట్లు అనిపించింది. బయటికి వెళ్ళి చూశాడు. ఎక్కడికో వెళ్ళాలని అనుకున్నాడు. తన ఈ దుస్థితికి స్నేహితుడే సూర్యారావు కారణం అనిపించింది. వాళ్ళు జీవిత ప్రవాహంలో కలవలేక, వెనకపడి ఎవరికి వాళ్ళె ఒక చిన్న ప్రపంచంగా, ద్వీపకల్పంగా తయారై తమ పిల్లలను తామే మొయ్యలేక పోతున్నారని బాధపడిపోయాడు సౌమ్యమూర్తి. (పుట.94).

**సూర్యారావు :** సూర్యారావు ఒకప్పుడు కథలు వ్యాసాలు రాసేవాడు. ప్రస్తుతం రాయడం మానుకున్నాడు. మన దేశంలో పేరున్న రచయితలు, ఇతర దేశ రచయితల నుంచి ఏమేమి కాపీ కొట్టి పేరు గడించారో, పరిశోధనలు చేస్తున్నారో, లేదా ఏ పుస్తకం బాగుందన్నా అతను సహించేవాడు కాదు. వెంటనే ఏ ఇంగ్లీషు పుస్తకం కాపీయో చెప్పేస్తాడు. అలా పుస్తకం పేరు చెప్పటానికి ఏదైనా ఇబ్బంది కలిగితే ''నేను ఎక్కడో చదవినట్లుంది. ఇది తప్పకుండా కాపీయే! లేకపోతే మనవాళ్ళు ఇంత బాగా రాయలేరు అంటాడు. ''పోని నువ్వు బాగా

రాసి చూపరాదా'' అంటే ''రచన చేస్తే ఉత్తమ రచనే చెయ్యాలి'' అంటాడు సూర్యరావు. ఏ రచన చేయాలన్నా సమాజం మెచ్చుకొనే విధంగా ఉండాలని వీరి అభిప్రాయం. (పుట.95). ఏ రచన చేసిన సమాజానికి ఉపయోగపడే విధంగా ఉండాలి. వర్తమాన భూత భవిష్యత్తు కాలాలను దృష్టిలో పెట్టుకొని రచన చేయాలి.

**శాతవాహనుడు :** శాతవాహనుడు విచిత్రతా కలిగినవాడు ఇడ్లీ మీదికి కారప్పొడి ఇతనికి ఇష్టం. ''నేను సుఖపడను, ఇతరులను సుఖపడనివ్వను అంటాడు. ఈ విషయాన్ని గురించి అతనొక గేయం రాసి చెప్పాడు. ఒక ఉదా|| ''ఎందుకు పసిపిల్లలంటే నీకింత కంటకం'' అడిగితే అతను చెబుతాడు. ''పళ్ళులేని పసిపిల్లలు కళ్ళులేని కబోది పక్షులు'' అంటాడు. సమాజంలో ఇలాంటి వాళ్ళు ఉంటారు కాని తను సుఖపడకున్నా పర్వాలేదు. ఇతరులను మాత్రం ఇబ్బంది పెట్టకూడదు. (పుట.97)

**బైరాగి :** శాతవాహనుడు స్నేహితుడైన బైరాగికి క్షమాపణతో అంటాడు. తన బాధలన్నిటిని చెబుతాడు. తన జీవితంలో సుఖపడే పెద్ద అవకాశం ఆ కాఫీ హోటలు సర్వరూ ఇంట్లో తన తల్లి పొట్టన బెట్టుకున్నాట్టు బాధపడుతూ తన స్నేహితుడైన బైరాగికి చెబుతాడు. బైరాగి వాటి నన్నిటిని శ్రద్ధతో వింటాడు. సమాజంలో వివిధ రకాల విచిత్రమైన మనుషులు ఉంటారని గోపీచంద్ గారు తెలియజేశారు. (పుట.98)

**బాలకృష్ణుడు :** బాలకృష్ణుడి తండ్రి భవిష్యత్తులో ఏమి జరగబోతుందో ముందే పసిగట్టి చెబుతాడు. అందుకే బాలకృష్ణుడు తండ్రి ఉన్నాడు చూశారా! ఆయన దివ్యదృష్టి అమోఘం అంటాడు. కొంత మంది చెప్పినవి జరుగుతుంటాయి. అది దేవుడు ఇచ్చిన వరం సరస్వతి దివేనలు. తండ్రి గొప్పతనం గురించి కొడుకులు గమనించాలి. (పుట.98)

**శివరావు :** శివరావుకి ప్రపంచంలో ఎవరన్నపడదు. తన గురించి ఎవరైనా గొప్పగా చెబితే పడిచస్తాడు. అతిగోప్యంగా ఉంచవలసిన కుటుంబ వ్యవహారాలు కూడా స్నేహితుడితో చర్చిస్తాడు. తన దగ్గరకు వచ్చి ''ఏమోయ్ - నా భార్య సంగతి నాకు అనుమానంగా ఉంది. ఏం చెయ్యమంటావు'' అని అడుగుతాడు శివరావు. మనుషులు ఇలా ఉంటారని అంటాడు. భార్య భర్తల విషయాలు ఎంత దగ్గరి స్నేహితుడైన బంధువులైనా చెప్పకూడదు. రహస్యంగా ఉంచుకోవడం మంచిది. (పుట.100)

**ప్రొప్రయిటరు :** ప్రొప్రయిటరు భయపడుతూ కూర్చున్నాడు. ఆ కొట్టులో ఖాత ఉన్నా న్యాయవాది ప్రొప్రయిటరుకి జరుగుతున్న అన్యాయం సహించలేక తాగుతూ ఉన్నా కాఫీ ఆపి ''ఇవ్వవోయ్ మాట్లాడక'' అన్నాడు. వెంటనే సీతారామారావు న్యాయవాదిని జాలిగా చూచి ఇష్టం వచ్చినట్లు తిడ్తాడు. న్యాయవాది తిట్లుబడి ఉపన్యాసం ఇస్తారు. అది కూడా తెలుగులో మానవసేవ మాధవసేవ మీరంతా మానవసేవ చేయండి అంటారు న్యాయవాది. (పుట.115)

**బోగంవాళ్ళు :** బోగంవాళ్ళు ప్రత్యేకంగా ఒకపేట కట్టుకొని ఉంటారు. ఒకే వృత్తిలోనున్న వాళ్ళు అంత ఒకేచోట ఉంటారు. వీళ్ళందరు ఒకే దగ్గర ఉండాలని కోరుకుంటారు. వీళ్ళ గురించి తెలుసుకోవాలని అనుకుంటాడు సీతారామరావు. బోగం వృత్తిలోనున్న అమ్మాయిని అడిగాడు. ఆమె ఏ విషయం చెప్పలేదు. సమాజంతో సంఘం ఉంది. సంఘంలో వీళ్ళు ఉన్నారని వీళ్ళ గురించి తెలుసుకొని బాధ్యత నాకు ఉందని అనుకుంటాడు సీతారామారావు.

వెంటనే నేనసలు బాపనపిల్లని. నా తల్లిని ఒక బాపన కుర్రాడు మోసం చేశాడు. పెళ్ళి కాకముందే నేను పుట్టాను. నన్ను నా తల్లి బోగం వాళ్ళకు ఆమ్మేసింది. అందుకే నేను ఈ వృత్తిలో ప్రవేశించానని అంటుంది సీతారామారావుతో. సమాజంలో బతకడానికి వృత్తి వాళ్ళు కూడా ఉన్నారని తన మనస్సులో అనుకుంటారు సీతారామారావు (పుట.119).

**పరబ్రహ్మశాస్త్రీ :** మీటింగు జరుగుతుంది. జనాలు తండోపతండాలుగా వచ్చి ఉన్నారు. పరబ్రహ్మశాస్త్రి వేదిక పైన కూర్చొని ఉపన్యాసం ఇచ్చాడు. అంతలోనే సీతారామారావు వేదిక పైకి ఎక్కాడు. ఇతను ఇందాక మీకు శీలాన్ని గురించి అద్భుతమైన ఉపన్యాసం ఇచ్చాడు. మీరంతా చప్పట్లు కొట్టారు. ఇతను చేసే పనేమిటి? ఇతని మరదలుకు ఎందుకు పెళ్ళి కాలేదో అడగండి! ఎప్పుడు ఇతని ఇంట్లోనే

ఉంటుందో అడగండని తరలి వచ్చిన జనాలకు పరబ్రహ్మశాస్త్రి సంఘ నాయకుడు చేసే తప్పులను తెలియపర్చాడు. సీతారామారావు సంఘంలో ఎవరైనా తప్పు చేస్తే మందలించి మార్చవలసిన ఇతను సంఘానికి విరుద్ధంగా ప్రవర్తించాడు. సంఘానికి ఆదర్శంగా ఉండాలి నాయకుడు. (పుట.125)

**నాగలింగం :** వేదిక పైనా ఉపన్యాసం ఇచ్చిన నాగలింగం మీకందరికి తెలిసినవాడని సీతారామారావు ఇతని గురించి జనాలకు చెబుతాడు. వేదిక పైకి ఎక్కి ఇతనికి ఎప్పుడు టైపిస్టుగా మళయాళీ అమ్మాయి ఎందుకు పెట్టుకుంటాడో ఆడగండి. ఎర్రగా, సన్నగా మృదువుగా ఉండే అమ్మాయిలను తప్ప మిగిలిన వాళ్ళు టైపు చెయ్యటానిక పనికిరారా? ఎవరూ లేనప్పుడు తన టైపిస్టు తల నిమురుతూ కూర్చోవటం ఎందుకు? అడగండి. ఇతనికి చేనేత పరిశ్రమంటే ఎంత ఇష్టమే అడగండని అంటాడు. ఇతను చేసే చెడు అలవాటును ప్రజలకు తెలియజేస్తాడు. ప్రజలకు ఆదర్శంగా ఉండే వాళ్ళు ఇలాంటి ప్రజలకు నచ్చని పనులు చేయడం ఎంత వరకు సత్యము. సమాజం శ్రేయస్సు కోరే నాయకులు ఇలా చేయడం తప్పు. (పుట.126)

**రాంభోట్లు :** రాంభోట్లు వేదిక పైన నుండి ప్రజలను ఉద్దేశించి ఉపన్యాసం ఇచ్చాడు. ఇతను చేసిన పెద్ద తప్పు వీళ్ళ అమ్మా గొంతు పిసికి అరవై మేలు కాజేసినాడని సీతారామారావు చెప్పాడు. ప్రజలకు వేదికపై నుండి డబ్బులకు ఆశపడి సొంత తల్లిని చంపిన దుర్మార్గుడని చెప్పాడు. (పుట:126).

**విశ్వేశ్వరరావు :** విశ్వేశ్వరరావు వేదిక పైన ఉపన్యాసం ఇచ్చాడు. ఇతను పెద్దవాడు బుద్ధి ఉందా! మొన్న అభం శుభం తెలియని పది సంవత్సరాల పిల్లను ఇంట్లోకి పిలిచాడు. ఒక నెల రోజులు ఎవ్వరికి తెలియకూడదని రహస్యంగా పెట్టాడని చెప్పాడు. ఇతణ్ణి బహిష్కరించాలని తీర్మానం చేశారు. ఇలాంటి వ్యక్తి విశ్వేశ్వరరావు సీతారామారావు వేదికపై నుండి ప్రజలకు తెలియజేశాడు. (పుట.126).

కన్నకూతురులాగా చూసుకోవలసిన పది సంవత్సరాల అమ్మాయిని మోసం చేసిన నీచుడు. ఇలాంటి వాణ్ణి సమాజం సహించదు సహించకూడదు కూడా!

**సూర్యప్రకాశరావు:** సూర్యప్రకాశరావు సంగతి మీ అందరికి తెలిసిందేనని అంటాడు సీతారామారావు. ఇతను ధర్మసత్రం డబ్బులు పదివేలు తిన్నోడు. ఇతని ఇంటి ప్రక్కనే ఉన్న పాపయ్య ఇల్లు తాకట్టు పెట్టాడు. డబ్బులు వడ్డీకి ఇచ్చాడు. పాపయ్య భార్యను వశం చేసుకున్నాడు. పాపయ్యకు తెలుసు కాని తెలియకుండా ప్రవర్తించాడు. ఏమన్నా అంటే ఇల్లు వేలం వేయిస్తానని బెదిరించాడు. పాపయ్యకు పిచ్చెక్కించాడు ఇతను నీతులు చెప్పే గొప్పవాడు. లోక కళ్యాణార్థం ధర్మోపన్యాసాలు చేసే త్యాగమూర్తి. ఇలాంటి తప్పులు చేశాడని సీతారామారావు ప్రజలనుద్దేశించి వివరించి చెప్పాడు. (పుట.126).

**చైతన్యస్వామి :** ''సీతారామారావు ఇదిగో అధ్యక్షుల వారి సంగతి వివరిస్తాను వినండని అన్నాడు. ఇతను స్వాముల వారు శుద్ధ చేతన స్వరూపం గలవాడు. సర్వసంగ పరిత్యాగి గలవాడు. ఇతను చేస్తున్నా పనులేమిటో కొంచెం తెలుసుకొండి'' గట్టిగా అన్నాడు. చైతన్యస్వామి ముఖాన నెత్తురు లేకుండాపోయింది. అక్కడే కుర్చిలో చతికిలపడ్డాడు. ''చెప్పు చెప్పాల్సిందే'' నని సీతారామారావుతో ప్రజలు కేకలు వేశారు.

''స్వాముల వారు ఈ ప్రపంచం మధ్యన చెబుతాడు. జీవి తన జీవితమంతా భగవంతుని జేరటానికి ప్రయత్నించాలని బోధ చేస్తాడు. ఇతను ఏం చేస్తున్నారో అడగండి ఈ బోధలు నియమాలు తాము అనుసరించవలసిన అవసరం లేదంటాడు. ఇవన్నీ అజ్ఞానుల కోసం ఏర్పడ్డవి. జ్ఞాని వీటికి అతీతుడు అంటాడు. తాను జ్ఞాని కనుక, ఏమి చేసిన తప్పు లేదని తనకు అంటవనీ చెబుతాడు. ఈ రకంగా ఉపన్యాసం ఇచ్చి ప్రజలను మోసం చేస్తాడు. చైతన్యస్వామిని సీతారామారావు తండోపతండాలుగా ఉపన్యాసం వినడానికి వచ్చిన ప్రజలను వివరించి చెబుతాడు. (పుట.127)

**బాబు :** బాబు మనస్సు కలవరపెడుతుంది కదూ! జ్ఞానం ఉందని అంగీకరించాడు. గత జ్ఞానం ఒకటే మానవుని అభివృద్ధికి సహాయపడదు. దాన్ని సంఘ శ్రేయస్సుకు ఉపయోగపడే మనస్తత్వం ఉండాలి. కత్తి ఉంది దాన్ని ఉపయోగించే ఉత్తమ లేక సర్వనాశనానికి ఉపయోగపడుతుంది. అధికారం ఉంది. అంతే, జ్ఞానం కూడా అంతేనని సీతారామారావు సంఘ శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని జ్ఞానం, అధికారం ఈ రెండింటి గురించి బాబుకు వివరించాడు. (పుట.133)

**ఉపసంహారం :** పెళ్లి చేసుకోవాలి. భార్య భర్తలు అన్యోన్యంగా ఉండాలి. ఇద్దరు ఒకర్ని ఒకరు అర్థం చేసుకోవాలి. కలిసి మెలిసి ఉండాలి. భర్త భార్యను కష్టపెట్టకూడదు. భార్య భర్తను కష్టపెట్టకూడదు. ఇరువురికి నమ్మకం ఉండాలి. ఆ నమ్మకమే సంసారాన్ని ముందుకు తీసుకుపోతుంది.

మనిషి నిరాశ పడకుండా ఉండాలి. ఆశతో ముందుకు వెళ్ళాలి. బ్రతకటానికి ఏదో సాధించాలనే తపన కోరిక ఉన్నవాడు సృజనాత్మకంగా ఆలోచించి ముందుకు వెళాతాడు. అసమర్థుడు, పిరికివాడు, పని చాతకానివాడు చనిపోతాడు. చావడమే పరిష్కారం కాదు బ్రతికి చూపించాలి.

ఈ సమాజంలో మనిషి జీవితం ప్రవాహం లాగా వేగంగా సాగిపోతుంది. అందులో ఎవరెవరి సంస్కారాన్ని బట్టి వాళ్ళు తమ సుఖం కోసం పోట్లాడుకుంటున్నారు. ఇదొక పెద్ద సంగ్రామం. ఈ సంగ్రామంలో పిరికి వాళ్ళకు అసమర్థులకు చోటులేదు. ఉండకూడదు. కాబట్టి కష్టపడే తత్వ్వం ఉండాలి. ధైర్యంగా బయపడకుండా ముందుకు వెళ్ళాలి లేదంటే బ్రతకడం కష్టం.

సమాజంలో మానవులు రకరకాల మనస్తత్వం కలిగిన వాళ్ళు ఉంటారు. వాళ్ళు సుఖపడరు. ఇతరులను సుఖపడనివ్వరు. ఈలాంటి స్వార్థ బుద్ధి గలవాళ్ళు జీవితంలో సుఖపడరు. దీన్ని తొలగించుకుంటే బాగుంటుంది.

భార్య భర్తల విషయాలు ఎంత దగ్గరి మిత్రుడైనా, బంధువైనా, రహస్యాలు చెప్పకూడదు. చెప్పి ఎదుటి వ్యక్తి ముందు తక్కువ కాకూడదు. దీన్ని ప్రతి ఒక్కరు గమనించాలి.

చదువుకున్న వాళ్ళు ప్రజల శ్రేయస్సును, కోరుకోవాలి గాని అమాయక ప్రజలను మోసం చేయకూడదు. అసమర్థుని జీవయాత్ర నవలలో పరబ్రహ్మశాస్త్రి, నాగలింగం, రాంభొట్లు, విశ్వేశ్వరరావు, చైతన్యస్వామి వీళ్ళను నమ్మి తండోపతండాలుగా తరలి వచ్చిన ప్రజలను ఉద్దేశించి త్యాగమూర్తులుగా ఉపన్యాసాలు ఇచ్చారు. కాని వీళ్ళు ప్రజలను అనేక రకాలుగా మోసాలు చేశారని సీతారామారావు తెలియజేశాడు. నమ్మిన వారిని మోసం చేయకూడదు.

గోపీచంద్ రాసిన నవలా రివాల్వరు నుండి ఆధునిక సమాజం వైపు దూసుకొచ్చిన తుపాకీ గుండు ఈ అసమర్థుని జీవయాత్ర.

**ఆధారగ్రంథాలు**


1. అసమర్థుని జీవయాత్ర, గోపీచంద్, పునర్ముద్రణ, సెప్టెంబరు, 1994, పల్లవి పబ్లికేషన్స్, ఏలూరు రోడ్, విజయవాడ-2.
2. ప్రజల మనిషి (తెలంగాణ తొలి నవల) వట్టికోట ఆళ్వారుస్వామి. మారుతి బుక్ డిపో గుంటూరు – 522 001.
3. భావవీణ, తెలుగు సాహిత్య సాంస్కృతిక భాషాధ్యయన పత్రిక, ఏప్రిల్ 2019.
4. మహతి, సమీక్షవ్యాస సంకలనం, యువభారతి ప్రచురణ, సికింద్రాబాదు, 1972.
5. తెలుగు VI సెమిస్టర్, సియా పబ్లికేషన్, 2024.


********

# 64. తెలుగు భాష పరిరక్షణ - తక్షణ కర్తవ్యం

**విల్లూరి. అప్పల సత్యనారాయణ,**

తెలుగు అధ్యాపకుడు,

శ్రీ గురజాడ అప్పారావు ప్రభుత్వ డిగ్రీ కళాశాల,

ఎలమంచిలి,

అనకాపల్లి జిల్లా.

చరవాణి : 9247231382

తెలుగు నేల పైన తిరుగాడునప్పుడు

తెలుగు మాట నోట బలికినపుడు

తెలుగువారి కథలు తలపోసినప్పుడు

పొంగి పోదు గర్వమునను నేను[1]

అని అన్నారు వేదుల సత్యనారాయణ శాస్త్రి గారు.

ఇది స్వాతంత్ర్యానికి పూర్వము, ఆంధ్ర రాష్ట్రం ఏర్పడడానికి ముందు నాటి స్థితి . తెలుగుదనాన్ని గుండెలనిండా నింపుకున్న ఆనాటి ఆంధ్రజాతి పరిస్థితి. ఆనాడు దేశానికి స్వాతంత్ర్యాన్ని తీసుకువచ్చే జాతీయోద్యమంలో దేశ నాయకులతో పాటు ఆంధ్రులు కూడా విశేషమైన కృషి చేశారు. స్వాతంత్ర్యానంతరం ఆంధ్ర రాష్ట్రం ఏర్పడడానికి పొట్టి శ్రీరాములు వంటి త్యాగజీవులు తమ ప్రాణాలను తృణప్రాయంగా సమర్పించారు. నిస్వార్థపరులైన మహనీయుల త్యాగాల వలన పొందిన స్వాతంత్ర్యం ,ఆంధ్రరాష్ట్రం సాధనాలకు కారకమైన అంశాల్లో ప్రముఖమైన అంశం భాష. మన మాతృభాష - తెలుగుభాష . అటువంటి తెలుగుభాష ఈనాడు గత వైభవాన్ని కోల్పోయి దీనావస్థలో నిలబడి ఉంది. "ఏవి తల్లీ నాడు కురిసిన హిమ సమూహము లేవి తల్లీ" అని మహాకవి శ్రీ శ్రీ గారు అన్నట్టుగా ఉంది మన రాష్ట్రంలో తెలుగు భాష పరిస్థితి. ఇటువంటి పరిస్థితులలో తెలుగు భాషను మరల గత వైభవ స్థాయికి తీసుకు వెళ్లేలా ప్రయత్నించడం ప్రతి తెలుగువాడి తక్షణ కర్తవ్యం.ఆ కర్తవ్యాన్ని గుర్తుకు చేయడమే ఈ వ్యాసం ముఖ్యోద్దేశ్యం.

ప్రశంస

కమ్మని తెల్గటంచు నుడికారము సొంపుల నీ విశాల వి

శ్వమ్మున దీని బోలిన వచస్సు నభస్సుమమంచు వేయి వా

క్యమ్ముల నేను మెచ్చుటయ కాదు రసజ్ఞులుదారులెల్ల ఖం

డమ్ముల మెచ్చిరిచ్చిరి వినమ్రతమై గవురం పుటారతుల్[2]

అని తెలుగు లెంక తుమ్మల సీతారామమూర్తి చౌదరి గారు మన మాతృభాషను మనమే కాకుండా పొరుగు భాషీయులైన అప్పయ దీక్షితులు పరభాషీయులైన నికొలోయ్ - డి - కాంటి, సి.పీ.బ్రౌన్ వంటివారు కూడా మెచ్చుకున్నారని ప్రశంసించారు. ఇంతటి ప్రశస్తి కలిగిన మన మాతృభాష తెలుగు క్రీస్తుకు పూర్వం నుంచి వాగ్వ్యవహారంలో అనంతరం శాసన సాహిత్య వ్యవహారాలలో ఉండి తన ప్రత్యేకతను నిలుపుకుంది.

పరిచయం

క్రీస్తుపూర్వం అయిదవ శతాబ్ది నాటికే "ఆంధ్ర "జాతి ఉన్నట్లుగా మనకు ఋగ్వేదానికి చెందిన 'ఐతరేయ బ్రాహ్మణం' వల్ల తెలుస్తున్నది. తదుపరి దేశపరంగా, భాషాపరంగా 'ఆంధ్ర 'శబ్దం ప్రయోగించబడింది . ఆంధ్ర పదానికి తెలుగు, తెనుగు అనేవి పర్యాయ పదాలు గా పేర్కొన బడ్డాయి.అలాగే "నాగబు " అనే మాట తొలి తెలుగు మాట గా మొన్నటివరకూ పండితులు భావించారు.అయితే క్రీస్తుపూర్వం రెండవ శతాబ్దికి చెందిన ఒక ప్రాకృత శాసనం అనకాపల్లి జిల్లా ఎలమంచిలి దగ్గరి కొత్తూరులో బయలు పడింది. బ్రాహ్మీ లిపిలో ఉన్న ఆ ప్రాకృత శాసనంలో బౌద్ధ బిక్షకులకు తంబయ్య అనే తెలుగు వ్యక్తి చేసిన దానం గురించి వివరించబడింది. దీనిలోని' తంశయ దానం ' అన్న మాట 'తంబయ్య దానం' అన్న పదానికి సమానమని ప్రముఖ పత్రికా సంపాదకుడు శ్రీ ఏబి కే ప్రసాద్ గారు ఒక వ్యాసంలో తెలిపారు. ఇక క్రీస్తు శకం ఒకటవ శతాబ్దికి చెందిన శాతవాహన రాజు హాలుదు సంకలనం చేసిన గాథా సప్తశతి లో.. అత్తా ,పిలు ఆ, ఫలహి, పంది, అద్దాప....... వంటి తెలుగు పదాలు ఎన్నో ఉన్నాయని శ్రీ తిరుమల రామచంద్ర గారు నిరూపించారు. క్రీస్తుశకం ఆరవ శతాబ్ది నాటి రేనాటి చోళుల కాలం నుంచి తెలుగు వచన శాసనాలు లభిస్తున్నాయి.కాగా క్రీస్తుశకం 848 నాటి తూర్పు చాళుక్య రాజు గుణగ విజయాదిత్యుని సేనాధిపతి పండ రంగడు ప్రకాశం జిల్లా అద్దంకిలో వేయించిన శాసనంలో ఒక తరువోజ పద్యం బయల్పడింది .ఇదే తెలుగులో తొలిపద్యంగా పండితులు పేర్కొంటున్నారు. నాటి నుంచి అనేక తెలుగు పద్య శాసనాలు వెలుగు చూసాయి. క్రీస్తు శకం 1023 నాటి నుంచి ఆంధ్ర మహాభారతం వంటి మహా గ్రంథం తో తెలుగు సాహిత్యం ప్రారంభమై పురాణ ఇతిహాస కావ్యాదులను సంస్కృతం నుంచి తెలుగులోనికి అనువదిస్తూ సంస్కృతభాషకు దీటైన భాషగా ప్రసిద్ధి చెందింది. నిజానికి ఆనాడు దేశ భాషలలో సంస్కృతం గొప్ప భాష.అన్ని భాషలకు తల్లిభాష సంస్కృతం అని నమ్మిన ఆకాలంలో తెలుగు భాష కూడా తన గొప్పతనాన్ని నిలబెట్టుకుని దేశ భాషలలో తెలుగు లెస్స అని కీర్తిని పొందింది. ఈ సందర్భంలో శ్రీనాథుడు రచించిన క్రీడాభిరామంలోని క్రింది పద్యం పరిశీలనాత్మకము.

జనని సంస్కృతంబు సకల భాషలకును
దేశ భాషలందు తెలుగు లెస్స
జగతి తల్లి కంటె సౌభాగ్య సంపద
మెచ్చుటాడు బిడ్డ మేలు గాదే?[3]

అని అన్ని భాషలకు తల్లి సంస్కృతమే అయినప్పటికీ దేశభాషలలో తెలుగుభాష మేలైనది.(లెస్స ).లోకంలో తల్లికంటే అధిక సౌభాగ్య సంపద కూతురికుంటే మంచిదే కదా! అంటూ సంస్కృతం కంటే తెలుగు భాష గొప్పదిగా చమత్కారంగా ప్రశంసింపబడింది. తదాదిగా ఎందరో మహాకవులు గొప్ప గొప్ప కావ్యాలను రచించారు. తెలుగు సాహిత్యాన్ని పరిపుష్టం చేశారు. ముఖ్యంగా 16వ శతాబ్దం నాటికి ప్రబంధ యుగం ఆవిర్భవించి తెలుగు సాహిత్యాన్ని స్వర్ణ యుగంలోనికి తీసుకువెళ్ళింది. ఆనాటి సాహితీ సమరాంగణ సార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయలు కూడా పైన ఉదహరించిన దేశభాషలందు తెలుగు లెస్స అన్న సూక్తిని గ్రహించి తాను కూడా తన ఆముక్తమాల్యద ప్రబంధంలో శ్రీకాకుళ ఆంధ్ర మహావిష్ణువు చేత క్రింది విధంగా చెప్పించాడు

తెలుగదేలయన్న దేశంబు దె లుగేను
దెలుగు వల్లభుండ దెలుగొకండ
యెల్ల నృపులు గొలువ నెరుగవే బాసాడి
దేశ భాషలందు తెలుగు లెస్స[4].

తెలుగు - అది ఎందుకూ? అని అంటావేమో? నేను వెలసినది తెలుగుదేశం ,నేను తెలుగురాయడను రాజులందరి చేతా కొలువబడే నీకు తెలుసును కదా ! దేశ భాషలందు తెలుగు లెస్స ( మేలు ,బాగు )అని ప్రశంసించాడు.

16వ శతాబ్దంలో తన వైభవాన్ని, ఘనతను చాటిన తెలుగు భాష కాలక్రమంలో తనప్రభావాన్ని క్రమంగా కోల్పోయింది .ఆపై భారత దేశంలోనికి వ్యాపార ప్రయోజనాల కోసం వచ్చిన బ్రిటిష్ వారు క్రమంగా దేశంపై తమ రాజకీయ ఆధిపత్యాన్ని ప్రదర్శించి అధికారాన్ని హస్తగతం చేసుకున్నారు .అప్పటివరకు భారతదేశంలో ఆయా ప్రాంతాల ప్రాంతీయ భాషలు తమ వైభవాన్ని ప్రదర్శించాయి. బ్రిటిష్ వారు వారి పరిపాలనకు సౌకర్యంగా ఉండేందుకు పరిపాలనా భాషగా ఆంగ్ల భాషను ప్రవేశపెట్టారు. అంతేకాకుండా ఆంగ్లభాష నేర్చుకున్న వారికి ఉద్యోగ ఉపాధి అవకాశాలు లభిస్తాయని చెప్పారు. అందువల్ల అనేకమంది ఆంగ్ల భాషను అభ్యసించారు. ఆనాటి ప్రపంచంలో ఆంగ్లేయులు అనేక దేశాలను జయించి ప్రపంచంపై తమ ఆధిపత్యాన్ని ప్రదర్శించారు. అలాగే ఆంగ్ల భాషను పరిపాలనా భాషగా ప్రపంచానికి పరిచయం చేశారు. ఫలితంగా ఆంగ్లభాష వివిధ దేశాలకు అనుసంధాన భాష కావడం జరిగింది. పారిశ్రామిక విప్లవం తర్వాత ఇంగ్లాండ్ అమెరికా వంటి ఆంగ్లభాషా ఆధిపత్య దేశాలు అభివృద్ధి చెందిన దేశాలుగా మారడం, ఆధునిక విజ్ఞానం వికాసం కు చెందిన జ్ఞానం ఆంగ్ల భాషలోని పుస్తకాలలో ఉండడం వలన ప్రపంచం పై ఆంగ్లం ప్రభావాన్ని చూపించింది.

భారతదేశ స్వాతంత్రోద్యమంలో భాగంగా బెంగాల్ విభజన జరిగినప్పుడు ఆ విభజనకు వ్యతిరేకంగా బెంగాల్ భాషీయులు పెద్ద ఎత్తున ఉద్యమం చేశారు.దీనిలో భాగంగా బిపిన్ చంద్రపాల్ ఆంధ్రదేశంలో పర్యటించారు . చిలకమర్తి లక్ష్మీనరసింహం వంటివారు బెంగాల్ విభజన వ్యతిరేక ఉద్యమంకు సంఘీభావం తెలిపారు. బెంగాల్ విభజన రద్దయ్యాక తెలుగు వారికి ఒకపక్క భాషైక్యత వలన ప్రయోజనాలు, మరొకపక్క మద్రాసు రాష్ట్రంలో భాగంగా తమిళ భాషీయుల వలన తెలుగువారికి జరుగుతున్న నష్టాలు, కలుగుతున్న కష్టాలు తెలిసొచ్చాయి.తెలుగు భాష మాట్లాడే వారికి ప్రత్యేక రాష్ట్రం ఉంటే తమ సమస్యలు పరిష్కార మవుతాయని ఆశించారు.అందుకోసం ఆనాటి జాతీయ కాంగ్రెస్ నాయకులను సంప్రదించారు. అయితే జాతీయ ఉద్యమ ప్రథమ ప్రాధాన్యం స్వాతంత్రోద్యమం కాబట్టి స్వాతంత్ర్య అనంతరం తెలుగు భాష మాట్లాడే వారి కి ప్రత్యేక రాష్ట్రం ఇద్దామన్న ఆనాటి జాతీయ నాయకుల అభిప్రాయాన్ని మన్నించి తెలుగువారు ప్రత్యేక రాష్ట్ర భావనను కాస్త పక్కన పెట్టి జాతీయోద్యమానికి కృషి చేశారు. తర్వాత కాలంలో భారతదేశ స్వాతంత్ర్యానంతరం రాష్ట్ర ఏర్పాటు అంశం ముందుకు సాగకపోవడంతో అమరజీవి పొట్టి శ్రీరాములు గారి ఆత్మార్పణతో ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటయింది. ఈ అంశాలన్నింటిలోనూ తెలుగువారిని ఉద్యమ బాట పట్టించింది తెలుగు భాష .తెలుగు భాషలోని సాహిత్యం. ముఖ్యంగా కవిత్వం, పాటలు,పద్యాలు, ఇతర రచనలు,ప్రసంగాలు వంటివి ప్రజల్లో జాతీయోద్యమ రాష్ట్రోద్యమ స్ఫూర్తిని కలిగించాయి.

రాష్ట్ర సాధన అనంతరం తెలుగు భాష పునర్వైభవానికి తగిన కృషి జరగలేదు . గ్రాంథిక వ్యవహార భాషా వివాదాలతో పాటు మాధ్యమ(మీడియం) భాష, మాతృభాష ,అధికార భాష అనే చర్చోపచర్చలతో తెలుగుభాష ఔన్నత్యం దెబ్బతినే పరిస్థితి వచ్చింది. మన విద్యా వ్యవస్థలో 1948 నాటి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ కమిషన్, అలాగే 1964 - 1968 నాటి కొఠారి కమిషన్ వంటివి మాతృభాష బోధనను, ఉన్నత విద్య కూడా ప్రాంతీయ భాషల్లో జరగాలనే అభిప్రాయాన్ని నివేదికల రూపంలో ఇచ్చాయి .కానీ ఇవి వాస్తవంలో తెలుగుభాష కు అంత ప్రయోజనాన్ని కలిగించలేదు.మరొక పక్క తెలుగువారికి తమభాష పట్ల ఉన్న నిర్లిప్తత కారణంగా పరభాషా ప్రయోజనాల్ని ఆశించి తెలుగువారు తెలుగుభాష కంటే ఇతరభాషలకే ప్రాధాన్యం ఇవ్వడం మొదలపెట్టారు.ఫలితంగా తెలుగుదేశంలో తెలుగుమాధ్యమానికి,తెలుగు భాషకు తిలోదకాలిచ్చే స్థితి వచ్చింది.ఇలాంటి పరిస్థితులు తెలుగుభాష ఉనికికే ప్రమాదాన్ని తీసుకు వచ్చాయి .

**యునెస్కో నివేదిక**

ఐక్యరాజ్యసమితికి చెందిన యునెస్కో - (యునైటెడ్ నేషన్స్ ఎడ్యుకేషనల్ సైంటిఫిక్ కల్చరల్ ఆర్గనైజేషన్) వారు ప్రపంచ భాషలపైన, వాటి మనుగడపైన ఒక నివేదికను తయారు చేశారు. యునెస్కో అట్లాస్ ఆఫ్ ది వరల్డ్ లాంగ్వేజెస్ ఇన్ డేంజర్ అన్నది ఆ నివేదిక

పేరు.దానిలో భాషల మనుగడ గురించి శాస్త్రీయ దృక్పథంతో నివేదికను తయారుచేసి దానిని ప్రకటించారు. దాని ప్రకారం - ఒక భాషను మాట్లాడే ప్రజానీకంలో 30 శాతం మందికి ఆ భాష చదవడం, రాయడం రాకపోతే కాలక్రమంలో ఆ భాష అంతరిస్తుంది. ప్రపంచంలో ఈ విధంగా చాలా భాషలు అంతరించాయని ఇంకెన్నో భాషలు అంతరించే ప్రమాదం ఉందని యునెస్కో ఆ నివేదికలో తెలిపింది. భారతదేశంలో ఈ రకంగా అంతరించబోయే భాషల్లో తెలుగు భాష కూడా ఉందని యునెస్కో హెచ్చరించింది. యునెస్కో చేసిన ఈ హెచ్చరిక, పైన మనం పేర్కొన్నటువంటి అంశాలను పరిగణనలోనికి తీసుకున్నప్పుడు ఆ అభిప్రాయం సత్య దూరం కాదనిపిస్తుంది. ఎందుకంటే భాష మనుగడ ప్రజలు, ప్రభుత్వాల మన్నన పై ఆధారపడి వుంటుంది.మన రాష్ట్రంలో ప్రజలకు,ప్రభుత్వాలకు "పొరుగింటి పుల్లకూరే రుచి " అన్నదే విధానం.ఎంత బంగారు పళ్లెమైనా గోడ చేరుపు లేకుంటే శోభించనట్టు తెలుగుదేశంలో తెలుగుప్రజల , ప్రభుత్వాల ఆదరణ లేకుండా తెలుగు శోభించదు.అందుకే రాష్ట్రంలో తెలుగు పరిస్థితి 'నానాటికీ తీసికట్టు నాగంబొట్లు' అన్నట్లు తయారైంది.మన రాష్ట్రంలో తెలుగు మాధ్యమం లేదు. తెలుగు భాష అభ్యసించాల్సిన పరిస్థితి తప్పనిసరి కాదు. ఈమాత్రానికే ఏం కొంపలు అంటుకుపోయాయని ,రాష్ట్రంలో ప్రజలంతా మాట్లాడేది తెలుగు భాషే కదా అనిప్రగతిశీలురమనుకొనేవారు అనుకోవచ్చుగాక. ప్రస్తుతానికి వ్యావహారికంగా తెలుగుకు ప్రమాదం లేకపోయినా ఒకటి రెండు తరాలు దాటేసరికి పైన యునెస్కో చెప్పినట్లు తెలుగు భాష అంతరించే ప్రమాదం ఉంది. ఇది మనకు మంచిది కాదు.ఇటువంటి పరిస్థితుల్లో కొత్త ఆశాకిరణంలా కేంద్ర ప్రభుత్వం నూతన జాతీయ విద్యా విధానం 2020ని తీసుకొని వచ్చింది . ఈ విధానం వలన భారతదేశంలోని ప్రాంతీయ భాషలకు మన్నన చేకూరి మళ్లీ వాటికి పునర్వైభవాన్ని తీసుకువస్తుందని మేధావులు చెపుతున్నారు.

బహుభాషా వాదం, భాష శక్తి

జాతీయ విద్యా విధానం 2020 ప్రకారం మాతృ భాషలో విద్యా విధానాన్ని ఈ నివేదిక బలపరిచింది .ముఖ్యంగా బహుభాషా వాదం భాష శక్తి అన్నటువంటి 4.11 అన్న పేరాలో మాతృభాష లేదా ప్రాంతీయ భాష లేదా స్థానిక భాషల గురించి చక్కని అభిప్రాయాన్ని క్రింది విధంగా వెలువరించింది.

"చిన్నపిల్లలు అనేక విషయాలను తమ ఇంటి భాషలో/ మాతృభాషలో అయితే చాలా త్వరగా సులభంగా నేర్చుకోగలుగుతారు అర్థం చేసుకోగలుగుతారనేది అందరికీ తెలిసిన సంగతే ఇంటి భాష సాధారణంగా మాతృభాష లేదా స్థానిక సమాజం మాట్లాడే భాష అయి ఉంటుంది.అయితే కొన్ని సందర్భాలలో బహు భాషలు మాట్లాడే కుటుంబాల్లో ఇతర కుటుంబ సభ్యులు మాట్లాడేది ఇంటి భాష అవుతుంది .ఒక్కోసారి అది మాతృభాషకు లేదా స్థానిక భాషకు భిన్నమైనదిగా కూడా ఉండొచ్చు . వీలైన ప్రతి చోట కనీసం 5 వ తరగతి వరకు ఇంకా వీలైతే 8 వ తరగతి వరకు ఆ పై వరకు కూడా బోధనా మాధ్యమంగా ఇంటిభాష/ మాతృభాష/స్థానిక భాషే వుండాలి.ఆ తదనంతరం ఇంటి / స్థానిక భాషను ఒక భాషగా బోధించడాన్ని కొనసాగించవచ్చు.ఈ విధానాన్ని ప్రభుత్వ ప్రైవేటు పాఠశాలలు రెండూ కూడా పాటించాలి."[5]

**ప్రముఖుల అభిప్రాయాలు - తక్షణ కర్తవ్యం**

"If you talk to A Man in a language he understands, that goes to his head.if you talk to him in his language, that goes to his heart." ( ఒక వ్యక్తితో ఒక భాషలో మాట్లాడితే అది అతని మస్తిష్కం ను మాత్రమే చేరుతుంది.అదే ఒక వ్యక్తితో అతని మాతృభాషలో మాట్లాడితే అది అతని హృదయాన్ని తడుతుంది.) ఇటీవల కాలంలో - నెల్సన్ మండేలా. చెప్పిన ఈ మాటలు మాతృభాష యొక్క గొప్పతనాన్ని చాటి చెపుతున్నాయి. ఎంతో మంది ప్రముఖులు మాతృభాష లో చదువు ప్రగతికారణం అనే అభిప్రాయాలను ఎప్పుడో వెల్లడించారు. "మాతృభాష సరిగా నేర్వని వారికి ఇతర భాషలు లొంగవు "అని జార్జి బెర్నార్డ్ షా అంటే 'సొంత భాషలో

చదువుకోవడం తల్లి పాలు తాగి పెరగడంతో సమానం' అని కొమర్రాజు వెంకట లక్ష్మణరావు గారు చెప్పారు. ఇదే విషయాన్ని నార్ల చిరంజీవి గారు పద్యంలో క్రింది విధంగా వెలువరించారు.

మధుర మధురమైన మన భాష కంటెను

చక్కనైన భాష జగతి లేదు

తల్లిపాల కంటే తనయులకే పాలు

బలమునీయగలవు తెలుగు బిడ్డ![6].అని మాతృభాష ప్రాధాన్యాన్ని వివరించారు.ఈ విధంగా ఎందరో మహనీయులు మాతృభాష ప్రాధాన్యాన్ని వివరించినప్పటికీ తెలుగు భాష ను,మాధ్యమాన్ని విస్మరించారు ఇప్పటివరకూ. ఈ నేపథ్యం లో వచ్చిన జాతీయ విద్యా విధానం 2020 మనల్ని తెలుగు భాష పరిరక్షణ కు కర్తవ్యోన్ముఖం చేస్తుంది .పైన వివరించిన జాతీయ విద్యా విధానం లోని మాతృభాషా మాధ్యమం, మాతృభాషాబోధన లకు ఇకనైనా మనం నడుం బిగించాలి .అప్పుడు మాత్రమే మనం ప్రపంచంలో మన ఉనికిని చాటుకోగలం, మన భాషా వారసత్వాన్ని భవిష్యత్ తరాలకు అందించి తలెత్తుకొని స్వాభిమానం తో తిరగగలం.

ఈ సందర్భంలో తెలుగుపూలు లో నార్ల చిరంజీవి గారి పద్యం స్మరణీయం.

జన్మభూమి కన్న స్వర్గంబు వేరేది!

మాతృభాష కన్న మధురమేది?

తల్లికన్న వేరె దైవమింకేదిరా?

తెలియమోయి నీవు తెలుగుబిడ్డ[7.]

**ఆధార గ్రంధాలు:**

1. తెలుగుతల్లి - ముక్తఝరి సంపుటి 1968.
2. మాతృభాష - రాష్ట్ర గానం 1939
3. క్రీడాభిరామం శ్రీనాథుడు / వినుకొండ వల్లభ రాయడు.
4. ఆముక్త మాల్యద పీఠిక
5. జాతీయ విద్యా విధానం 2020 - అంతర్జాలం
6. తెలుగుపూలు సంకలనం 1977
7. తెలుగుపూలు సంకలనం 1977.

********

# 65. కవికోకిల జాషువా గబ్బిలం - ఎండ్లూరి వారి కొత్త గబ్బిలం సామాజిక స్పృహ - చారిత్రక నేపథ్యం

**డా|| మునుగు శ్రీనివాసరావు,**

సహ ఆచార్యులు & పీఠాధిపతి

చరిత్ర, సంస్కృతి & పురావస్తు శాస్త్ర పీఠం,

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం,

శ్రీశైల ప్రాంగణం, ఆంధ్రప్రదేశ్.

srao.musugu@gmail.com

Mobile No:94413 70591

**సంగ్రహం :**

ఆధునిక తెలుగు సాహిత్య చరిత్రలో పరిచయం చేయనవసరంలేని వ్యక్తి కవికోకిల, నవయుగ కవి చక్రవర్తి గుర్రం జాషువా. సమకాలీన ఆధునిక తెలుగు సాహిత్య రచనలలో పరిచయం చేయనవసరంలేని మరొక వ్యక్తి, దీర్ఘకావ్య సుధాకరుడు ఆచార్య ఎండ్లూరి. ప్రస్తుత పరిశోధనా శీర్షిక, ''**కవికోకిల జాషువా గబ్బిలం-ఎండ్లూరి వారి కొత్త గబ్బిలం-సామాజిక స్పృహ, చారిత్రక నేపథ్యం**''.

వృత్తి రీత్యా చరిత్ర, పురావస్తు శాస్త్రాల అధ్యాపకుడనైనప్పటికీ తెలుగు సాహిత్యంపై అంతగా పట్టులేకున్న మాతృభాషపై నాకు, గల మమకారంతో ఇరువురు మహాకవుల సాహిత్యాలను పఠిస్తూ ఉంటే, ప్రతికూల పరిస్థితులెన్నింటినో ఎదుర్కొని, దళిత జాత్యోద్ధరణ కోసం, సమాజ హితం కోసం 'కవితా యుద్ధం' చేసినవారు గుర్రం జాషువా మరియు ఆచార్య ఎండ్లూరి సుధాకర్ గార్లు. జాషువా రచనల్లోని 'గబ్బిలం', ఎండ్లూరి రచనల్లోని 'కొత్త గబ్బిలం' రెండిరటిలోని కథావస్తువు 'గబ్బిలంను ఎన్నిక చేసుకోవడం ఓ విశేషం. మహాకవి కాళిదాసు మేఘసందేశం జాషువా గబ్బిలానికి ప్రేరణ అయితే, ఎండ్లూరి కొత్త గబ్బిలానికి జాషువా గబ్బిలం ప్రేరణ అయింది. ప్రస్తుత పరిశోధన పత్రం యొక్క ముఖ్య ఉద్దేశ్యం 'గబ్బిలం' మరియు 'కొత్త గబ్బిలం' కావ్యాలు సామాజిక స్పృహను ఏ విధంగా కల్గించాయనే చారిత్రక విశ్లేషణమే.

**కీలక పదాలు :** కవికోకిల, నవయుగ కవి చక్రవర్తి, జాషువా, గబ్బిలం, ఏండ్లూరి, కొత్తగబ్బిలం, ఆధునిక సాహిత్యం, సామాజిక స్పృహ, చారిత్రక నేపథ్యం.

చారిత్రక మూలాల్లోకి వెళితే క్రీ.శ.1895 సెప్టెంబరు 28వ తేదీన వీరయ్య, లింగమాంబ పుణ్య దంపతులకు గుర్రం జాషువా, వినుకొండలోని చాట్రగడ్డపాడులో జన్మించారు.[1] వీరయ్య యాదవ కులమునకు, లింగమాంబ మాదిగ కులానికి చెందినవారు. కులాంతర వివాహం కారణంగా వీరయ్య సంఘ బహిష్కరణకు గురైనారు. వీరయ్య క్రైస్తవ మతం స్వీకరించి, బైబిలు శిక్షణ పొంది వినుకొండ బాప్టిష్టు చర్చిలో 'ఫాదరు'గా ఉద్యోగం చేశారు. జాషువా ప్రాథమిక విద్యాభ్యాసం వినుకొండ మిషన్ పాఠశాలలోను, 5వ తరగతి ఊరిబడిలో ప్రారంభమైనది. బాల్యదశ నుండి అంటరానివాడిగా కులవివక్షతకు గురైనాడు. స్వయంగా అస్పృశ్యతా జాఢ్యానికి గురైన జాషువా తన అనుభవంతో అవకాశం ఉన్న ప్రతిచోట అస్పృశ్యతను ఖండిరచారు జాషువ.

**జాషువా సంగ్రహ జీవిత చరిత్ర :**

జాషువా ప్రాథమిక విద్య వినుకొండ మిషన్ పాఠశాల, 5వ తరగతి ''ఊరిబడి'' - 'అంటరానివాడి'గా తోటి విద్యార్థులు, ఉపాధ్యాయుల నుండి అవమానించబడ్డారు.[2] 1910లో (తల్లి ఊరు) చాట్రగడ్డపాడులో టీచర్‌గా 'మేరి'తో వివాహం జరిగింది.[3]

హిందూ మత కథలు రాస్తున్నాడనే అభియోగంపై క్రైస్తవ మిషనరీలు జాషువా ఉద్యోగాన్నీ పీకివేయడం ` జీవన భృతి కోసం ఉద్యోగం అన్వేషిస్తూ, రాజమండ్రి చేరుటతో సంఘసంస్కర్త శ్రీ కందుకూరి వీరేశలింగం గారితో పరిచయం, టూరింగ్ టాకీస్‌లో మూగ చిత్రాల కథా వాచకుడుగా, చింతామణి నాటక మండలికి నాటకాలు రాసి కీర్తి పొందాడు. గోదావరి నది ఒడ్డున కవులు - పండితులతో ఇష్టాగోష్టులు జరిపేవారు. 1919లో తిరిగి గుంటూరులో లూథరన్ మిషనరీ స్కూలు పండితుడుగా పనిచేస్తున్నప్పుడు అక్కడి ప్రధానోపాధ్యాయుడి నిరంకుశ వైఖరి కారణంగా రాజీనామా చేశాడు. జాగర్లమూడి కుప్పుస్వామిగారి సాయంతో బాపట్ల బోర్డు పాఠశాలలో తెలుగు పండితుడుగా చేరి 1942 వరకూ, పండిట్ డిగ్రీ లేనందున తొలగించబడ్డారు. 1942`45 రెండవ ప్రపంచ యుద్ధం ` నెల్లూరులో యుద్ధ ప్రచారకుడుగాను సేవలందించారు. 1945 తరువాత 1959 వరకు మద్రాస్ ఆకాశవాణిలో పనిచేశారు. 1961లో విమలమ్మతో రెండో వివాహం - 1964వ సం॥లో శాసనమండలిలో (ఎం.ఎల్.సి)గా సేవలందించారు. [4]

1971 జులై 24న గుంటూరులో పరలోక పయనం. గుంటూరు సీమను గురించి ''పేరు మోసిన వీర గుంటూరు క్షితికి నయలొనర్పని ఆంధ్ర మానసము గాదే'' అని అభిమానాన్ని ప్రకటించాడు జాషువ.[5]

**బిరుదులు :**

కవికోకిల (1936) - కవితా విశారద (1933) - కవి దిగ్గజ - నవయుగ కవిచక్రవర్తి (1947) -మధుర శ్రీనాథ (1952) - విశ్వకవి సామ్రాట్ (1964) - కళాప్రపూర్ణ (1970) -పద్మభూషణ్ మొదలగు బిరుదుల పొందారు.

ప్రతికూల పరిస్థితులెన్నింటినో ఎదుర్కొని, దళిత జాత్యోద్ధరణ కోసం, మంచి సమాజం కోసం కవితా యుద్ధం చేశాడు జాషువాగారు. కుల రహిత, మత రహిత, ఆర్థిక అసమానతల రహిత సమాజాన్ని ఆశించాడు. నాకు గురువులు ఇద్దరు (1) పేదరికం (2) కులమత బేధం, ఒకటి సహనాన్ని నేర్పితే, రెండవది నాలో ఎదిరించే శక్తిని పెంచింది. స్వయంగా అస్పృశ్యతా జాఢ్యానికి గురయ్యారు గనుక ఆ అనుభవంతో తన కవిత్వంలో అవకాశమున్న ప్రతిచోట అస్పృశ్యతను ఖండించారు జాషువాగారు. అస్పృశ్యతను నిర్మూలించి జాతిమతాలతో సంబంధంలేని నూతన సమాజాన్ని స్థాపించాలని వాంఛించి అందుకు అనుకూలంగా ప్రజలను మలచడం కోసం తన కవిత్వంలో ప్రతి విషయాన్ని హేతువాద దృష్టికి గురిచేశారు. జాషువా గారి రచనల్లో ... అభ్యుదయ వాదం, మానవతావాదం, సంఘ సంస్కరణ దృష్టి, స్త్రీ వాదం, దళిత వాదం మొదలగు సామాజిక దృక్పథంతో కూడిన అనేక కోణాల్లో జాషువాగారి కవిత్వం పురుడుపో న్నది. ఆయన రాసిన 'గబ్బిలం' ఒక సంస్కరణ కావ్యం. సామాజిక విప్లవం కోసం 'తన కవితను' ఒక ఆయుధంగా రaుళిపించారు. ఆయన 'నవభావ విప్లవ కవి' సమాజాన్ని నూతనమైన పునాదులపై పునర్నిర్మింపచడానికి ప్రయత్నించారు. జాషువాగారు సహజకవి. ఆయన కవిత్వం హృదయ ప్రధానమైనది.

**అత్యాధునిక యుగంలో ఉన్న నేటికినీ ...**

కులం, మతం, జాతి, వర్గం, వర్ణం మొదలగు ఛాందస వాదాలు, తీవ్రవాదం ప్రజలను కలవరపెడుతున్నాయి. కుహానా మేధావులు, సనాతనవాదులు పాత భావాలకు చిత్రికలు పట్టి వక్రభాష్యాలు చెబుతున్నారు. కుల, వర్గ సమాజ పునరుద్ధరణకు మార్గం సుగమం చేస్తున్నారు. మానవ జాతి పురోగమించాలంటే ప్రజలకు, ముఖ్యంగా యువతరానికి, గతం పట్ల సరైన అవగాహన ఉండాలి. సమాజ గత చరిత్ర, దాని పరిణామం, సామాజిక, ఆర్థిక సంఘర్షణలు అధ్యయనం చెయ్యాలి. దోపిడికీ, అణచివేతకు గురైన పీడిత, దళిత జాతుల జీవితాలను అవగతం చేసుకుని, స్ఫూర్తిని పొందాలి.

జాషువాగారి కవితాహృదయాన్ని, ఉన్నత భావాలను భావితరాలకు అందించే క్రమంలో వారి రచనా విశ్లేషణలను ప్రజలకు తెలిపి చైతన్యవంతుల్ని చేయాల్సి బాధ్యత ప్రస్తుత సమాజాల మీద ఉన్నది.

ఆయన జీవితం వడ్డించిన విస్తరి కాదు...

నడిచింది పూలబాట అంతకంటే కాదు... ఎన్నో ఆటుపోట్లకు గురైనాడు జాషువా

**''ఆయభాగ్యుని రక్తంబు నాహరించి**

**ఇనుపగజ్జెల తల్లి జీవనము సేయు**

**కసరి బుసగొట్టు నాతని గాలిసోక**

**నాల్గు పడగల హైందవ నాగరాజు''**

ఒకరోజు జాషువా గారు వెంకటగిరి రాజాగారి దర్శనార్థమై రైలుబండిలో ప్రయాణం చేస్తున్నారు. ఆ సమయంలో ఒక అగ్రకుల పండితునితో పరిచయం ఏర్పడిరది. అతను జాషువా చేతిలోని గ్రంథాన్ని చదివి, ఆయన రచనా పాటవాన్ని కీర్తించి, కులం తెలుసుకుని చివాలున లేచిపోయాడు. ఈ హృదయ విదారకమైన సంఘటనను రాజావారికి ఇలా నివేదించాడు. 'నా కథ' లో జాషువా...

**''నా కవితా వధూటి వదనంబునెగాదిగ చూసి, రూపరే**

**ఖా కమనీయ వైఖరులు గాంచి, భళీభళియన్న వారె మీ**

**దేవుల మన్న ప్రశ్న వెలయించి చివాలున లేచిపోవుచో**

**బాకున గ్రుమ్మినట్టగును ప్రార్థివ చంద్ర ! వచింప సిగ్గగున్''**

` సాహిత్య రచన ప్రారంభించిన తొలిదశలో అనేక ఒడుదుడుకులు ఎదుర్కొన్నారు. ఒక సాహిత్య సభలో ఒక స్వర్ణకవి కులపంగా కించపర్చినప్పుడు, తనదైన రీతిలో సమాధానం ఇస్తూ...

**''గవ్వకు సాటిరాని పలుగాకుల మూకలసూయచేతన**

**న్నెవ్విధి దూరినన్ ననువరించిన శారద లేచిపోవునే**

**యివ్వసుధాస్థలిన్ బోడిమరే రసలుబ్ధలు? ఘంటమూనేదన్**

**రవ్వలు రాల్చేదన్ గరగరల్ పచరించెద నాంధ్రవాణికిన్''**

నిజంగా కాకుల మూకలను లెక్కచెయ్యక రవ్వలు రాల్చాడు. నిరాశ, నిస్పృహలకు లోనుగాకుండా, మొక్కవోని ధైర్యంతో ఎదుర్కొడ్డాడు. ఒక సవాలు విసిరాడు. మీసం దువ్వాడు. స్వీయ కవితా సామర్థ్యాన్ని, ప్రగాఢ ఆత్మవిశ్వాసాన్ని ప్రకటించారు జాషువా. 'వాణి నా రాణి' నను వరించిన వారద లేచిపోనే' అని ఎలుగెత్తి చాటారు.[6]

ఆయన ఓ మానవ హక్కుల ప్రబోధకుడు. సమాజంపై కత్తికట్టాడు. ఆయన (నా) కత్తి 'కవిత' - నా కత్తికి సమాజంపై కోపం లేదు. దాని విధానంపైనే ఉంది. సామాజిక న్యాయ సాధన కోసం నిరంతర సాహిత్య కృషి సల్పాడు. ఒక నూతన విధానం కోసం ఆయన హృదయం ఆరాటపడిరది. ఆ ఆశయ సాధనలో అడ్డు నిలబడ్డ గోడలను నిర్మూలించడానికి ప్రయత్నించారు! వేదాంత జ్ఞానం పేదవాడి ఆకలి తీర్చదని, ఇటువంటి భావాలు నమ్మవద్దన్నారు. హేతువాద దృక్పథంతో క్రూర దురాచారాలపైన మత మూఢత్వంపైన కాపట్యం పైన తిరుగుబాటు చేశారు.

కులగోత్రాలు ప్రపంచసభ్యతకే సిగ్గుచేటని వాపోయాడు. 'కులం కాదు గుణం ప్రధానమని' చక్కని కవితకు కులమతాలు లేవని ఎలుగెత్తి చాటాడు. నాడు సమాజం నాలుగు వర్ణాలుగా... కులాలుగా వర్గీకరించబడిరది. పుట్ట రాని చోట పుట్టడం కారణంగా అనేకమంది దళితుల తెలివితేటలు మొగ్గలోనే వాడిపోయాయి. నిమ్నజాతుల వేడి కన్నీటి మేఘాలు (బిందువులు) పిడుగులై ఈ దేశాన్ని కాల్చివేస్తాన్నారు జాషువా.[7]

` పంచమ కులాలకు దేవాలయ ప్రవేశం లేదు. దైవదర్శనానికి వాళ్ళు అనర్హులు. ఈ దేశంలోని దేవతలు దళితులు అర్థించినా మరాలివ్వరు. మొక్కులు స్వీకరించరు. ''పంచముడు బహిష్కృత భారతీయుడు''.ఇటు మానవుల చేత, అటు దేవతల చేత వెలివేయబడ్డవాడు, బలిjైనాడు. వీరి కన్నా గబ్బిలమే మెరుగు.

**''ఆలయంబున నీవు వ్రేలాడు వేళ**

**శివుని చెవి నీకు గొంత చేరువుగ నుండు**

**మౌని ఖగరాజ్ఞి, పూజారి లేని వేళ**

**విన్నవింపుము నాదు జీవిత చరిత్ర''** [8]

గబ్బిలం దేవాలయంలో వేలాడుతుంది. నైవేద్యం ఆరగిస్తుంది. పూజాదికర్మలను చూస్తుంది. ప్రకృతి వైపరీత్యాలు ఏర్పడినప్పుడు గుళ్ళు గోపురాలలో తలదాచుకుంటుంది. పాపిjైన పంచమునికి ఈ అదృష్టం లేదు.

` 1) హేతువాదిగా విలక్షణమైన వ్యక్తి, గాలి, నీరు, వెలుతురు అందరికీ సమాన హక్కు

2) మూఢవిశ్వాసాలను ఖండిరచుట

3) స్త్రీ స్వాతంత్య్రం

4) వర్ణవ్యవస్థపై నిరసన

5) విగ్రహారాధన

6) అహింసావాది

7) జాషువ - మహిళ

8) సాంఘీక దురాచార ఖండన, బాల్య వివాహాలు, సతీసహగమనం, వైధవ్యం, స్త్రీ విద్య

9) నాటక కర్తగా, గొప్ప రచయితగా జాషువా ` ఖండకావ్యాలు ఏడు (సంపుటాలు), గబ్బిలం (2 సంపుటాలు, పిరదౌసి, రుక్మిణీ కళ్యాణము, ముంతాజ్ మహల్, నా కథ (3 భాగాలు), నేతాజీ, క్రీస్తు చరిత్ర, తెరచాటు, కాందిశీకుడు, మొదలగు రచనలు చేశారు.[9]

1918`19లో రాజమండ్రిలో ` చింతామణి నాటక నిర్వాహకులు, సత్యవోలు గున్నేశ్వరరావు- రుక్మిణీ కళ్యాణం

**ఇక ఎండ్లూరి వారి విషయానికొస్తే ...**

ఎండ్లూరి సుధాకర్ పూర్తి పేరు ఎండ్లూరి సుధాకరరావు. 21 జనవరి, 1959వ సంవత్సరము. ఎండ్లూరి దేవయ్య, శ్రీమతి శాంతాబాయిలకు నిజామాబాదులోని పాముల బస్తీలో జన్మించారు. భార్య కీ.శే.డా॥ పుట్ల హేమలత, మానస, మనోజ్ఞ కుమార్తెలు. కీ.శ.1985 నుండి 1990 వరకు తెలుగు పండిట్‌గా సికింద్రాబాదులోను, 1990 నుండి 2018 వరకు పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో అధాపకత్వం, 2018 నుండి 2022 వరకు హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయంలో ఆచార్యునిగా పనిచేశారు. తెలుగు విశ్వవిద్యాలయంలో సహాయ, సహ`ఆచార్యులుగాను, ఆచార్యునిగా, వాఙ్మయి పత్రిక సంపాదకునిగా, శాఖాధిపతిగాను, పీఠాధిపతిగా వివిధ హోదాల్లో పనిచేశారు. ఎండ్లూరి రచనల్లో వర్తమానం (కవిత సంపుటి), జాషువా నా కథ, జాషువా సాహిత్యం- దృక్పథం-పరిణామం, మల్లెమొగ్గల గొడుగు (మాదిగత ఆత్మ కథలు), నల్లద్రాక్ష పందిరి, వర్గీకరణీయం, గోసంగి మొదలగు రచచలు పేరెన్నిగన్నవి. కవిరత్న, నవయుగ వచన కవితా చక్రవర్తి మొదలగు బిరుదులు వీరు పొందారు. వివిధ విశ్వవిద్యాలయాలకు పాఠ్యగ్రంథాల రచయిగాను, కేంద్ర సాహిత్య అకాడమీ తెలుగు సలహా సంఘ సభ్యులుగా (2013 నుండి 2017 వరకు) సేవలందించారు.[10]

తెలుగు కవులలో, ఆధునిక కవులలో నిబద్ధుడైన కవి, నిమగ్నుడైన కవులు చాలా తక్కువ కనిపిస్తారు. అలా తక్కువ మంది ప్రముఖ కవులలో కీ.శే.ఎండ్లూరి సుధాకర్ ఒకరు. జాషువాకు నిలువుటద్దం లాంటి వారు. ముమ్మాటికీ ఎండ్లూరి వారే అంటారు ద్వా.నా.శాస్త్రి.[11]

''ఆగ్రహం దాని అక్షరం జ్వలించదనీ
ఆర్థ్రత లేని వోళ్ళు పండిరచదనీ
నా అనుభవం నేర్పిన కవిత్వ పాఠం
నాలుగు మెతుకులే నా అక్షరాలు
సలుగురు మనుషులే నేను చదివిన ప్రబోధలు
నా బాల్య దృశ్యాలే నేను చూసిన అలంకార శాస్త్రాలు
ఆకలి రసం నాలోని రచనా రహస్యం
అవమాన విషయం - నా కళ్ళలోని నీలామృత విశేషం
మా బీద బస్తీలే నన్ను కవిని చేశాయి
నాలోని భావుకత్వానికే.,
బాధల తత్త్వానికీ బాటలు వేశాయి.

మా వీధి కుక్కలు జీవితాన్ని, జీవించడాన్ని నేర్పాయి'' అంటాడు. [12]

కీ.శ.1916`1919 మధ్యకాలంలో సినిమా కథ వాచకుడిగా, ఉపాధ్యాయునిగా జాషువా గారు వినుకొండను విడిచి రాజమండ్రికి వస్తే, ఎండ్లూరి సుధాకర్ గారు 1990లో ఉద్యోగ రీత్యా హైదరాబాదు నుంచి రాజమండ్రికి రావడం జరిగింది. అద్దె ఇంటి కోసం వెదికేటప్పుడే సుధాకర్ గారి జీవితంలో ''మీరేవుట్లు'' అనే ప్రశ్న (వివక్షత)ను రుచి చూశాను.[13]

రాజమండ్రిలో జాషువాగారికి తోలేటి వెంకట సుబ్బారావు గారు నాస్తిక పండితుడు తోడు దొరికితే, ఎండ్లూరి వారికి నాటి తెలుగు విశ్వవిద్యాలయ పీఠాధిపతి ఆచార్య బేతవోలు రామబ్రహ్మ పండితుడు తోడు దొరకడం యాదృశ్చికం. ఎండ్లూరి వారి 'కొత్త గబ్బిలం' ఒక ప్రతీక. నగర జీవన చిత్రిక మరియు వారి ఆత్మ కథానాత్మాక కావ్యం.

జాషువా గబ్బిలం ద్వారా 'శివునికి' సందేశం పంపితే, కవికోకిల వారసత్వం పురుడు పోసుకున్న ఎండ్లూరి తెల్లని ట్యూబ్‌లైటు గుడిలోకి నల్లబ్యాడ్జీలా రెపరెపలాడుతూ ప్రవేశించిన 'కుర్ర గబ్బిలాయి' తో 'జై భీమ్' అంటూ పలుకరించి, రాజమండ్రి నుండి హైదరాబాద్ రాజధాని నగరాన్ని దండోర ముట్టడికి వెళ్తు గబ్బిలాన్ని ప్రేమగా కౌగిలించుకొని నా జాతి జనుల దప్పుల దరువు ఆలకించమంటూ కావ్యాన్ని ఆరంభించారు. ఈ దేశం 'చెప్పు'ను మింగేసిందనీ, దప్పును కోసేసిందని, తిరగబడిన చెప్పులు దండోరా జెండాలై పైకిలేచాయని, గబ్బిలం పాదాలకు 'కవి' తన కవిత్వపు కొత్తజోళ్ళు తొడుగుతున్నాననీ, రామాయణం కాదు, ఇది నెత్తిన పెట్టుకోవడానికి, శ్రీవారి సన్నిధి కాదు వెండి చెప్పుతో మాదు మీద కొట్టుకోవడానికి, ఇది నా కన్నీటితో కుట్టిన 'నా గుండె జోళ్ళు' అంటారు. రాజమండ్రి ఊరు దాటేటప్పుడు జాషువాగారు కాపురమున్న 'కోటిలింగాల రేవు పేట'లో నీ ముత్తాత జాషువా పాద చిహ్నాలు కనబడితే కళ్ళ కద్దుకో, కాశీ దాకా వెళ్ళి శివుడిని కల్సుకోవడం కంటే సెక్రటేరియట్‌లో సి.యం.ని కలవడం తేలికంటారు. తాడేపల్లి గూడెం నుండి తణుకు, ఏలూరు మీదుగా బెజవాడ చేరితే, గుణదల గోపురం పె ఉన్న 'కన్నె మరియమ్మ'కు వందనాలు చెప్పమంటారు. నల్లనిదైన ఆ గబ్బిలం 'నల్ల గాలి' సోకి అంటరాని పిట్టవని 'కనకదుర్గమ్మ' నిన్ను చూసి కసురుకుంటే, మొండి మొలతో మాతంగ చించెయ్, తెల్లమొగమేసి తలదించుకుంటుందని కులవ్యత్యాసాలని ఎత్తిచూపుతారు. దళిత భక్తుడవై రహస్యంగా అమ్మవారికి దండం

పెడదామని దొంగదారిలో గుళ్ళోకి దూరితే, నగల కేసులో నిన్నిరికించి పగల దీస్తారు పోలీసువారు. నీ నెత్తిన ముళ్ళ కిరీటం పెట్టి అది అసలో, నకిలీయో చెప్పమని 'సాహూ' కుమారుడ్ని చేసి నిన్ను చెట్టుకు వ్రేలాడదీస్తారు జాగ్రత్త అంటూ, నడిరేయి వెన్నెల దెబ్బ గబ్బిలానికి తగులుతుందేమోనని, చల్లని కృష్ణానది ఇసుక సోఫాలో కొద్దిసేపు విశ్రమించమంటారు.

విజయవాడ దాటగానే తెలంగాణా పోలిమేరలు చీకటట్లో పులి కళ్ళులాగా మెరుస్తాయి. అక్కడ గరిక పోచల్లోంచి పోరాట గాథలు, కోట్ల గొంతుల విప్లవ వీణలు, నిత్య హింసల నెత్తుటి కోనలలో జాగ్రత్త అంటారు. ఏ బూటకపు ఎన్‌కౌంటరు జరిగినా దారితప్పిన బుల్లెట్లు నిన్ను అమరుణ్ణి చేస్తాయి జర భద్రం బిడ్డా, నీ ప్రయాణం భాగ్యనగరి చేరాలి కదా అని వర్ణిస్తారు. రాత్రంతా నిద్రపోకుండా రుద్రమదేవిని తలచుకొంటూ, పోతన పుట్టిన ఓరుగల్లు చేరుకొని పాల్కురికి సోమనాథుని ముందు ప్రణమిల్లి, వేయిస్తంభాల గుడి చుట్టూ ఆత్మీయంగా తిరిగి, అక్కడి దళిత కవులకు తన మద్దతు తెల్పమంటారు కవి. తెలతెల్లవారు చుండేప్పుడు పొగమంచులోంచి సికింద్రాబాదు తాజా డబల్ రోటీలా కనిపిస్తుంది, క్లాక్‌టవర్ 'ఆల్ఫా' హోటల్లో కమ్మని 'ఇరానీ చాయ్' తాగి, నాలుగు చక్కర్లు కొట్టు. అక్కడ 'నాయర్' అనే పాత్రికేయుడు దళితుల్ని కించపరుస్తూ ప్రతిభ లేని వాళ్ళుగా రాసిన నాయాళ్ళ నెత్తి మీద కసిగా రెట్టవేసి రమ్మంటారు. ముషీరాబాద్ జైలు గదుల మీద ఎగిరెప్పుడూ దుష్టుడు కడుపు రగిలి మానవహక్కుల గురించి మాట్లాడావో 'నాకీయులు' నీ బొక్కలు అరుగగొట్టి బొక్కలో వేస్తారు, అయినా నిజాన్ని నిర్భయంగా ప్రకటించమని హితబోధ చేస్తారు. బన్సీలాల్‌పేట బొందల గడ్డ దగ్గర నగర కాలుష్యాన్ని నిరసిస్తూ రావి చెట్టు మీద తలక్రిందులుగా ధర్నా చేస్తుంటారు నీ 'గబ్బిలం తండా'ని గుర్తుచేస్తారు. బొందలగడ్డ సమాధులు దొడ్డిలో బుక్కా చల్లుకుంటూ ఏ శవమైనా ఎదురుపడితే ఆ పాడె ముందు ప్రణమిల్లమంటాడు. అందులకు కారణం, వర్గబేధం లేకుండా చివరి చూపు చూడమంటాడు కవి.

ఇక, హుస్సేను సాగర్‌లో నిలవెత్తు రాతి రూపమై నిల్చొన్న 'బుద్ధుని' చుట్టూ తిరిగి 'బుద్ధం శరణం గచ్ఛామి' అంటూ 'నీలి సలాం' చేయమంటారు. అక్కడ ఉన్న 'తెలుగు వెలుగుల నిక్షిప్త కళా ప్రాంగణం' (టాంక్‌బండ్) లోని నీ తాత (జాషువా) గారి ప్రతిమ చుట్టూ ప్రదక్షిణచేసి, తాతా! నువ్వు కలలు గన్న 'కొత్త లోకాన్ని' నీ మీసాల మీద నిలబెట్టే రోజు ఏదో ఒకరోజు వస్తుందని సగర్వంగా శపథం చేసి రమ్మంటారు. తాను పుట్టి పెరిగిన దో మహల్ గూడ (దోమలగూడ) లోని గగన్‌మహల్ బస్తీలో నివాసముంటున్న తన తల్లిగారైన శాంతబాయి తన కోసం పొగచూరిన కళ్ళతో ఎదురుచూస్తూ ఉంటుందని, సుధాకర్ గారి పేరు చెపితే 'వారి అమ్మగారి ముఖం క్రిస్మస్ తారలా వెలిగిపోతుందని, వారి అమ్మగారి జీవితమే ఒక కర్మాగారమనియూ, వారి బ్రతుకే ఒక శిలువ భారమనియూ, నిన్ను చూడగానే తనను చూసినంత ఆనందం తన తల్లికి కల్గుతుందనీ, తన తల్లి పడే కష్టాన్ని, మాతృప్రేమని వర్ణించుకుంటారు. గబ్బిలాయి తన దగ్గర నుండి వారి యొద్దకు వచ్చినదని తెల్సికొని, వారి తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ చుట్టూ మూగి మురిసిపోతారని ` పేదరికానికి ప్రేమ విలువ ఎక్కువని తెల్పుతారు. ఎండ్లూరి వారు చిన్నతనం నుండే కవిత్వాలు రాసేవారనడానికి సాక్షిగా, ఏ పాత గోడ మీదనైనా బొగ్గుతో తాను రాసిన 'బాల కవితలు' దొరుకుతాయేమో చదివిరమ్మంటారు.14 లాల్‌దర్వాజా కమాను గుండా వెళ్ళేప్పుడు నింగిలో నుండి తొంగి చూస్తే, చిరిగిన బురఖాలు ధరించిన బూబమ్మల్ని నడిచే గబ్బిలాలని భ్రమించకు, ఆ సోదరీమణుల గంతల కళ్ళ వెనుక యుగయుగాల నాటి గాథలు ఎన్నో ఉన్నాయనీ సమానత్వం లేని పరదా పద్ధతిలో నివసించే ముస్లీం స్త్రీలు బాధల్ని వర్ణించారు కవి.

విద్యానగర్, కాచీగూడ సందుల్లో నుండి కాషాయ పతాకాలతో 'భజరంగ దళం' ఎదురుపడి 'మనమంతా హిందువులం, గంగా జల బిందువులు, అంతా బంధువులమే' అంటే., ఆర్యులారా, ఎలా మీకు మేం బంధువులం, ఎప్పటి నుండి హిందువులం అని ఎదురు నిలబడి బెదరిపోకుండా తర్కించి, జై భీమ్ అని గద్దించు, అంబేద్కర్ వాదం రఁలిపించు, జగజ్జీవన బాబు ఉత్తేజాన్ని స్మరించి, ఈ దేశంలో మేమే మాలదాసులమని నిరూపించమంటారు. హైదరాబాదు నగరంలో ఎక్కడ చూసినా. బాటా, కరోనా షోరూంల ప్రక్కన

గోనెపట్టాల గొడుగుల కింద తాతల నాటి పనిముట్లతో, గూటాలూ, తంగటాలు, ఎదురార్లు తెగిన చెప్పులు కుట్టుకొనే మోచీలను చూస్తునే కళ్ళల్లో కన్నీటి మేకులు గుచ్చుకున్నాయంటారు ఎండ్లూరి వారు.[15]

ముందు చెప్పాల్సిన మాట చివర చెబుతున్ననంటూ, వెంకటాపురం (నిన్న మొన్నటి వరకూ భూదేవి నగర్) లో నివాసముండే అమరజీవి, కామ్రేడ్ గద్దరన్నను ఆత్మీయంగా పలకరించారు, అంటూ, గద్దరు గురించి ఇలా వర్ణిస్తారు ఎండ్లూరి. [16]

''ప్రజాకోటి పాడగాడు - గాయపడిన విలుకాడు
తుపాకుల తూటాలను తమలపాకుల్ని నమిలి ఊసిన వాడు
చావుని చావగొట్టి పంపిన మొండి వీరుడు
ఎర్రన్నకు కులం లేదంట
ఒళ్లంతా తడిమి పులకరించి రమ్మనీ, ఆదను చూసి అన్న కాళ్ళకు
నల్లగజ్జెలు కట్టి రమ్మనీ, విప్లవ యుగాల యుద్ధభేరి గద్దర్''
ఈ రాజ్య హింసకు సవాలంటాడు (గద్దరు గారి మరణానికి ముందు రాసిన కావ్యం)

ఇకపై కారంచేడులూ, చుండూరు దాడులు, వేంపెంట నెత్తుటి మంటలు జరగటానికి వీల్లేదని, ఖండితంగా చాటించమంటారు. నేడు హక్కుల కోసం దళితులు రెండు చెక్కలైనా (దండోరా-మహానాడు), ఎవరి మీద కత్తిపడ్డా ఒక్కటవుతారని ప్రకటించి, దండోరా వేయించమంటారు కవి.

ముగింపులో, నారాయణగూడలోని సమాధుల తోటలో తన తండ్రి కీ.శే॥ ఎండ్లూరి దేవయ్యగారి సమాధి తల ముందు 'నా కవిత్వపు కొవ్వొత్తి వెలిగించు`నలిగిన తన గుండె గులాబీ రేకులు, తన తండ్రి పాదాల మీద వర్షించుమంటాడు.

గబ్బిలమా! నా మనోబలమా! నువ్వు ఈ దేశపు శ్వేతపత్రం మీద నల్లసంతకానివని, బహుజన వసంతానివని వర్ణిస్తూ, తిరుగు ప్రయాణంలో రాజ్యాంగ పిత అంబేద్కరు చూపుడు వేలుకు 'నల్లదస్తీ'లా చుట్టుకుంటే, ఆ మహానుభావుడు గౌతముని సూత్రానికి ఒక సరికొత్తమార్గాన్ని చూపిస్తారు. అసెంబ్లీకి వెళ్ళి దానిపైన అధికార పతాకం నాట్యమాడి, ఎండ్లూరి గారు కలలుకనే మతాతీత, కులాతీ, సమత దేశాన్ని స్థాపించాలి. మనిషి మనిషిగా బ్రతికే సాంఘిక సమానత్వం ఒనగూర్చాలని, ఇప్పుడు అన్ని కులాలు ఏకోన్ముఖంగా కులీనం కావాలని, అన్ని వర్ణాలు ఆర్థిక విలీనం కావాలని, అనగా తాను, కవికోకిల కలలు కనే 'సమసమాజ స్థాపన' జరగాలని కోరుకుంటూ ఇదే తన సందేశమనియూ, గబ్బిలం త్వరగా తిరిగి రాజమండ్రికి చేరుకోవాలని, గబ్బిలాన్ని చూస్తే తనను చూసుకున్నట్లేననీ, తన అమ్మను, హైదరాబాదు నగరాన్ని, తన వారి జాతి భవిష్యత్తు చూసినట్లేనని ఎండ్లూరి వారి ఆరాటం. ఆ ఆశ తీరకముందే 28, జనవరి, 2022న ఎండ్లూరి సుధాకర్‌గారు అనంత లోకాల్లో అమరుడైనాడు.

**అథోజ్ఞాపికలు :**


1. హేమలతా లవణం : మా నాన్నగారు, విజయవాడ, 1972, పుట.8
2. సుందరరావు, ఆర్, ఆర్ : మహాకవి జాషువా వ్యక్తిత్వం, హైదరాబాదు, 1986, పుట.41
3. జాకబ్ సొంగా : గుఱ్ఱం జాషువా-నవయుగ కవి చక్రవర్తి, హైదరాబాదు, 1999, పుట.52
4. సుందరరావు, ఆర్, ఆర్ : అఫ్.సిట్.పుట.61
5. జాషువా : గబ్బిలం, మొదటి భాగం, పుట.16
6. జాషువా : ఖండకావ్యం, 4వ భాగం, Ê సుందరరావు, ఆర్, ఆర్ : అఫ్.సిట్.పుట.119

7. జాషువా : గబ్బిలం, రెండవ భాగం, పుట.1

8. జాషువా : గబ్బిలం

9. సత్యవతి తేళ్ళ : హేతువాది జాషువా (వ్యాసం)

10. సుధాకర్ ఎండ్లూరి : కావ్యత్రయం, పుటలు.154`155

11. ద్వానా శాస్త్రి : 'నేటి నిజం' పత్రిక, హైదరాబాద్, తేది :8`1`2005

12. సుధాకర్ ఎండ్లూరి : కావ్యత్రయం, పుటలు.31`32

13. పైదే. పుట.9

14. సుధాకర్ ఎండ్లూరి : కావ్యత్రయం, రాజమండ్రి, 2016 పుట.3

15. పైదే. పుటలు.38`39

16. పైదే. పుటలు.46`47

******

# 66. విజయనగర కాలంలో తెలుగు, సంస్కృత సాహిత్యంలో విశిష్టత – సామాజిక స్పృహ

**డా. మూరే విజయ కుమార్ రెడ్డి**
చరిత్ర అధ్యాపకులు, ఆంధ్ర లొయోల కళాశాల
విజయవాడ - 520 008, సెల్ : 9346665557
mpvkreddy14@gmail.com

**డా. బండి కళ్యాణి**
చరిత్ర అధ్యాపకులు, ఆంధ్ర లొయోల కళాశాల
విజయవాడ - 520 008, సెల్ : 9640684707
bandikalyani84@gmail.com

**ఉపోద్ఘాతం**

విజయనగర సామ్రాజ్యం (1336–1646) భారతీయ సంస్కృతి, సాహిత్యం, కళలకు ఒక సువర్ణ యుగంగా నిలిచింది. హంపి కేంద్రంగా ఆవిర్భవించిన ఈ సామ్రాజ్యం కేవలం రాజకీయ పరిపాలనలో మాత్రమే కాకుండా, విద్యా, సాహిత్య, కళారంగాలలో కూడా గొప్ప ప్రాచుర్యాన్ని సాధించింది. ఈ సామ్రాజ్యం సంస్కృతం, తెలుగువంటి భాషల సాహిత్యానికి విశేషంగా ప్రోత్సాహం అందించింది. సంస్కృతం ధార్మిక, శాస్త్రీయ రచనల భాషగా మారితే, తెలుగు ప్రజల జీవన విధానాన్ని, భావజాలాన్ని ప్రతిబింబించే భాషగా అభివృద్ధి చెందింది.

శ్రీ కృష్ణదేవరాయల వంటి రాజులు సాహిత్యాన్ని ప్రోత్సహించి, సంస్కృతం, తెలుగు భాషలలో అనేక సాహిత్య కృతులకు పునాది వేసారు. తెలుగు సాహిత్యానికి శ్రేష్ఠమైన కావ్యాలు, ప్రసిద్ధ రచనలు ఈ కాలంలో వెలువడగా, సంస్కృతంలో శాస్త్రీయ గ్రంథాలు, ధార్మిక వ్యాసాలు వెలుగులోకి వచ్చాయి. ఈ సామ్రాజ్యం అంతటా విద్యా, సాహిత్యానికి ప్రాధాన్యం ఇస్తూ, భాషల పరస్పర ప్రభావాన్ని కూడా కలిగించింది.

**కీలక పదాలు :** శ్రీకృష్ణదేవరాయలు, అష్ట దిగ్గజాలు, సాహిత్య రీతులు, తెలుగు సాహిత్యం, సంస్కృత సాహిత్యం

## విజయనగర కాలంలో సాహిత్య అభివృద్ధి

### తెలుగు సాహిత్యంలో విశిష్టత

విజయనగర కాలంలో సాహిత్య అభివృద్ధి అంటే తెలుగు భాషా సాహిత్యంలో ఒక మహత్తరమైన కాలం. ఈ కాలంలో విజయనగర సామ్రాజ్యం సామ్రాజ్యాధిపత్యానికి మాత్రమేకాదు, సాంస్కృతిక ప్రాభవానికి కూడా కేంద్ర బిందువైంది. ఈ సామ్రాజ్యాన్ని కృష్ణదేవరాయల కాలంలో సాహిత్యం అత్యున్నత స్థాయికి చేరుకుంది. ఈ కాలంలో తెలుగు భాష కేవలం ప్రజల మధ్య సంభాషణా భాషగానే కాకుండా, రాజభాషగా మన్నన పొందింది. సాహిత్య కవిత్వం, ప్రబంధ రచనలు, శాస్త్రీయ గ్రంథాల ప్రక్రియలు, భక్తి ఉద్యమ సాహిత్యం, మరియు శిల్పకళా సంబంధిత వర్ణనాత్మక రచనలు విజయనగర కాలంలో అత్యంత ప్రాచుర్యం పొందాయి. కవులు రాజ ప్రాసాదాలకు ప్రాణం పోసినట్టు తమ సాహిత్యంతో సామాజిక, సాంస్కృతిక మరియు ఆధ్యాత్మిక విలువలను ప్రతిఫలించారు.

**ముఖ్యాంశాలు:**

**1. కవులు మరియు సాహిత్య ప్రోత్సాహం:**

- కవిత్వానికి, నాటకాలకు, శాస్త్రీయ రచనలకు విస్తృతస్థాయిలో ప్రోత్సాహం ఇచ్చారు.
- ముఖ్యంగా, శ్రీకృష్ణదేవరాయలు(మహారాజాధిరాజు) స్వయంగా ఒక ప్రముఖ కవి. ఆయన రచించిన *ఆముక్తమాల్యద* తెలుగు కవిత్వంలో చిరస్మరణీయమైన రచన.

- 'అష్ట దిగ్గజాలు' అనే ప్రముఖ కవులు ఈ కాలంలో ఆయన ఆస్థానాన్ని అలంకరించారు. వీరంతా తెలుగు సాహిత్యానికి మహోన్నత కీర్తి తెచ్చి పెట్టారు.

**2. అష్ట దిగ్గజాలు:**

అష్ట దిగ్గజాలు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో ఉన్న ఎనిమిదిమంది ప్రఖ్యాత కవులు. వీరిలో:

- **అల్లసాని పెద్దన:** *మనుచరిత్ర* (ప్రబంధ కవిత్వానికి ఆదికవి).
- **నంది తిమ్మన:** *పారిజాతాపహరణం.*
- **ముద్దన:** అలంకార శాస్త్రంలో ప్రవీణుడు.
- **ధూర్జటి:** శివభక్తి కవితలు.
- **తెనాలి రామకృష్ణ:** హాస్య సాహిత్యానికి ప్రసిద్ధుడు.

**3. ప్రబంధ సాహిత్యం:**

ఈ కాలంలో ప్రబంధ సాహిత్యం ప్రాధాన్యమైంది. ప్రబంధం అనేది కథా ప్రక్రియలో ఒక మహత్తరమైన ప్రక్రియ. ఇది తెలుగు సాహిత్యానికి ఆణిముత్యంగా నిలిచింది.

- **ముఖ్యమైన ప్రబంధాలు:** *మనుచరిత్ర, పాండురంగ మహాత్మ్యం, ఆముక్తమాల్యద.*

**4. మతపరమైన కవిత్వం:**

శైవ, వైష్ణవభక్తి సాహిత్యం విస్తృతంగా అభివృద్ధి చెందింది.

- శ్రీ వైష్ణవ సంప్రదాయంలో కృష్ణదేవరాయలు అత్యంత ప్రాచుర్యం పొందినవారు.
- భక్తి ఉద్యమంలో ఈ కాలం కీలకపాత్ర పోషించింది.

**5. సాహిత్య రీతులు మరియు శైలులు:**

- ప్రకృతికి సంబంధించిన కవిత్వం, శృంగార రసంతో కూడిన రచనలు, ధార్మిక మరియు శాస్త్రీయ కృషి విశేషంగా అభివృద్ధి చెందాయి.
- వ్యాకరణానికి మరియు ఛందస్సుకు సంబంధించిన పరిశోధనలు కూడ ఈ కాలంలో ఉన్నాయి.

**6. తెలుగు భాషా వికాసం:**

ఈ కాలంలో తెలుగుభాషకు రాజభాష స్థానం లభించింది. రాజ ప్రాసాదిక సాహిత్యం ప్రబలంగా పెరిగింది.

**సంస్కృత సాహిత్యంలో విశిష్టత**

విజయనగర సామ్రాజ్యం (1336–1646) కాలం భారతీయ సంస్కృతి, విద్యా, కళారంగాలకు కొత్త ఒరవడి చూపించింది. ముఖ్యంగా సంస్కృత సాహిత్యానికి ఈ కాలం ఒక చారిత్రక స్వర్ణయుగంగా నిలిచింది. విజయనగర రాజులు తమ పాలనావిధానంలో సాహిత్యాన్ని, భాషను, పండితులను ఎంతో ఆప్యాయంగా ఆదరించి, సంస్కృత భాషకు ఒక విశిష్ట స్థానం కల్పించారు. ఈ కాలంలో అనేక గొప్ప రచనలు వెలువడటం మాత్రమే కాకుండా, సంస్కృత భాషా సంప్రదాయాలను పునరుద్ధరించడానికి వారు కృషి చేశారు.

**సంస్కృత సాహిత్యం ప్రధానాంశాలు**

**రాజ సమర్థత:**

విజయనగర సామ్రాజ్యంలోని రాజులు, ముఖ్యంగా శ్రీకృష్ణదేవరాయలు, సంస్కృత భాష మరియు సాహిత్యానికి అత్యంత ప్రాముఖ్యత నిచ్చారు.

- రాజసభలో అనేక గొప్ప కవులు, పండితులు పని చేశారు.
- వారు సంస్కృతంలో రచనలు చేయడాన్ని మాత్రమే కాకుండా, స్థానిక భాషలతో సంస్కృత భాష యొక్క మేళవింపును కూడా ప్రోత్సహించారు.
- కవులకు, రచయితలకు, ధార్మిక గ్రంథాలకు అధిక ప్రాముఖ్యత ఇచ్చి సాహిత్య అభివృద్ధికి పునాది వేసారు.

**ప్రతిష్ఠిత కవులు:**

విజయనగర రాజసభ అనేక గొప్ప సంస్కృత కవులను, రచయితలను ఆశ్రయించింది.

- ఈ కవుల రచనల్లో ధార్మిక, తత్వశాస్త్ర, శాస్త్రీయ, సామాజిక, రాజకీయ అంశాలు స్పష్టంగా ప్రతిఫలించాయి.
- శ్రీకృష్ణదేవరాయల కాలంలో వారి ఆస్థానంలోని సార్వభౌమ అష్టదిగ్గజాలు సంస్కృత సాహిత్యానికి కూడా కీలకంగా మారారు.
- వారి కృషి కారణంగా సంస్కృత సాహిత్యం ప్రాంతీయ భాషల మీద కూడా ప్రభావం చూపింది.

**గొప్ప రచనలు:**

విజయనగర కాలంలో సంస్కృతం కేవలం కవిత్వం, కావ్యాలు మాత్రమే కాకుండా శాస్త్ర గ్రంథాలకు కూడా కేంద్రీకృతమైంది.

- ధర్మశాస్త్రాలు, అర్థ శాస్త్రాలు, అలంకార శాస్త్రాలు, గణిత శాస్త్రాలు, ఖగోళ శాస్త్రాలు వంటి అనేక శాస్త్ర రుచులలో రచనలు వెలువడ్డాయి.
- రామాయణం, మహాభారతం వంటి మహాకావ్యాలపై వ్యాఖ్యానాలు, పున: రచనలు విస్తారంగా జరిగాయి.
- శ్రీమద్భాగవతం వంటి సాహిత్య ప్రక్రియలకు ఈ కాలంలో పునరుజ్జీవనంలా మారింది.

**విద్యా కేంద్రాలు:**

హంపి రాజధాని మాత్రమే కాకుండా, విజయనగర సామ్రాజ్యంలో అనేక ప్రదేశాలు విద్యా, సాహిత్య, కళల కేంద్రాలుగా మారాయి.

- విద్యా కేంద్రాల్లో కేవలం ధార్మిక విద్య మాత్రమే కాకుండా, శాస్త్రీయ విద్యకు కూడా ఎక్కువ ప్రాముఖ్యత ఇచ్చారు.
- ఈ కేంద్రాల్లో పండితులు, కవులు తమ రచనలను అభివృద్ధి చేసేందుకు అవసరమైన వాతావరణం లభించింది.

**ఆధునికత మరియు పూర్వ స్మృతి:**

విజయనగర సామ్రాజ్యంలో సంస్కృతం కేవలం పాతతరం ధార్మిక అవసరాలకు మాత్రమే పరిమితం కాకుండా, ఆధునిక అవసరాలకు కూడా అనుగుణంగా మార్పులు పొందింది.

- కొత్త వస్తువులు, సాంకేతికతలతో సంబంధిత అంశాలను సంస్కృతంలో చేర్చడం జరిగింది.
- సంస్కృత రచనల శైలిలో నూతనతను, ప్రాచీనతను కలిపి, సమీకృత రచనలకు ప్రాధాన్యం ఇచ్చారు.

**ప్రధాన రచయితలు మరియు రచనలు**

1. **సాయణాచార్యులు:**

   వేదభాష్యాల రచన ద్వారా సంస్కృత సాహిత్యంలో చారిత్రక స్థానం సంపాదించారు.

   - సాయణభాష్యాలు వేదాలను పునర్వ్యాఖ్యానించే ప్రయత్నంలో అత్యంత ప్రాముఖ్యంగా నిలిచాయి.

2. **విద్యారణ్య:**

   తత్వశాస్త్రం, ధర్మశాస్త్ర రచయితగా ప్రసిద్ధి పొందారు.

   - ఆయన రచనలు భారతీయ తత్వశాస్త్రం, ధార్మిక జీవితానికి దిశానిర్దేశంగా నిలిచాయి.

3. **ఆచార్యరాయ సముద్రం:**

అలంకార శాస్త్రానికి సంబంధించిన రచనలు చేశారు.

- సంస్కృత సాహిత్యాన్ని శాస్త్రీయపద్ధతిలో పునర్నిర్మాణం చేశారు.

**సంస్కృత సాహిత్యంలో ఔన్నత్యం**

విజయనగర సామ్రాజ్యంకాలంలో సంస్కృతం స్థానికభాషలైన తెలుగు, కన్నడ, తమిళ భాషల మీద గాఢమైన ప్రభావం చూపింది.

- సంస్కృతం యొక్క ధార్మిక, శాస్త్రీయ మూలాల నుంచి స్థానిక భాషలకు అనువాదాలు, కొత్త రచనలు వెలువడడం జరిగాయి.
- ఈ ప్రభావం వల్ల స్థానిక భాషల సాహిత్యం కూడా గాఢమైన చైతన్యాన్ని పొందింది.

**ముగింపు**

విజయనగర సామ్రాజ్యం తెలుగు భాషా సాహిత్యానికి ఒక పునాది వేసిన ప్రాచీన సాంస్కృతిక ధ్రువతారంగా నిలిచింది. కవులు, రచయితలు, మరియు సాహిత్యాభిమానులు కలిసి సాహిత్య అభివృద్ధికి అపారమైన సేవలు చేశారు.

ఈ కాలం తెలుగు సాహిత్య చరిత్రలో ఒక స్వర్ణ యుగం.

విజయనగర సామ్రాజ్యం భారతీయ సంస్కృతి, సాహిత్యంలో విలక్షణమైన పాత్ర పోషించింది.

- సంస్కృతం ఈ సామ్రాజ్యంలో కేవలం భాష మాత్రమే కాకుండా, జ్ఞానానికి, అభివృద్ధికి, వారసత్వానికి ప్రతీకగా నిలిచింది.
- ఈ కాలంలో వెలసిన సంస్కృత రచనలు భారతీయ ఆత్మను ప్రతిబింబిస్తూ, ఆధునిక కాలంలో కూడా ఎంతో ప్రాధాన్యం సంతరించుకున్నాయి.

**సూచనలు (References)**


1. **శ్రీనివాసాచార్యులు, ఎ.సి.**_(1995)_: _విజయనగర సామ్రాజ్యం - సాహిత్యవికాసం_, హైదరాబాదు: ఆంధ్ర ప్రదేశ్ సాహిత్యఅకాడమీ.
2. **రామశర్మ, ఎన్.ఆర్.**_(1982)_: _The Vijayanagara Empire: Literature and Culture_, Delhi: Motilal Banarsidass Publishers.
3. **శ్రీనాథ్, చ.**_(1975)_: _తెలుగు సాహిత్యం - సమగ్రచరిత్ర_, విజయవాడ: ప్రజాశక్తి ప్రచురణలు.
4. **రామకృష్ణయ్య, పి.వి.**_(1987)_: _తెలుగు సాహిత్య వైభవం విజయనగరకాలంలో_, తిరుపతి: ఎస్వీ యూనివర్సిటీ.
5. **శ్రీరంగచార్యులు, కె.ఎస్.**_(1965)_: _Sanskrit Scholarship in the Vijayanagara Period_, Mysore: Karnataka Historical Society.
6. **పాండురంగయ్య, ఎం.ఎల్.**_(1972)_: _The Contribution of Vijayanagara Kings to Telugu Literature_, Madras: University of Madras.
7. **ఫర్స్టర్, వి.ఎస్.**_(1900)_: _A History of Vijayanagara Empire with Focus on Literature_, Oxford: Clarendon Press.
8. **సుబ్రహ్మణ్యశాస్త్రి, ఆర్.**_(1990)_: _వేద సాహిత్య ప్రాముఖ్యత విజయనగరంలో_, చెన్నై: నవభారత ప్రచురణలు.


********

# 67. తెలంగాణ రాష్ట్ర ఆవిర్భావానంతర కథలు - సామాజిక స్పృహ

**ఈర్ల కమలాకర్**

PhD – 5th year

University of Hyderabad

8985666620

Kamalearla8985@gmail.com

**ఉపోద్ఘతం:**

తెలుగు వాళ్లకు అనేక వందల సంవత్సరాల క్రితమే కథా వాఙ్మయం ఉంది.కానీ నిర్దిష్టమైన రూపం మాత్రం 20వ శతాబ్దంలో ఏర్పడింది. ఆంగ్ల సాహిత్య ప్రభావంతో ఏర్పడిన సాహిత్య ప్రక్రియల్లో కథా ప్రక్రియ ఒకటి. కథ అనే పదానికి సంభాషించు, చెప్పు అనే అర్థాలు కలవు. క్లుప్తత , నిర్దిష్టత , పరిధి తక్కువగా ఉండటం మొదలైన లక్షణాల వల్ల మిగిలిన సాహిత్య ప్రక్రియలతో పోలిస్తే 'కథ' విశేషంగా పాఠకుల ఆదరణను పొందింది. ఏది మొదటి కథ అనే విషయంలో భిన్నాభిప్రాయాలు ఉన్నప్పటికీ కూడా, ఆధునిక లక్షణాలతో 1910 లో "ఆంధ్రభారతి" పత్రికలో వెలువడిన గురజాడ రచించిన "దిద్దుబాటు" అనే కథ మొదటిది.

తెలుగు సాహిత్య చరిత్రలో ఆధునిక కవులు, రచయితలు, విమర్శకులు తమ ప్రతిభతో వివిధ ప్రక్రియల్లో తెలుగు సాహిత్యాన్ని పరిపుష్టం చేశారు, చేస్తున్నారు. ఏ ప్రాంతానికి సంబంధించిన వారు ఆ ప్రాంతానికి సంబంధించిన సామాజిక అంశాలను తమ కథల ద్వారా తెలియజేసే ప్రయత్నం చేశారు,చేస్తున్నారు. వారు రాసిన కథలు వివిధ పత్రికలల్లో అచ్చు అవుతున్నాయి. అలా తెలంగాణ ప్రాంతానికి సంబంధించిన కథా రచయితలు కూడా తెలంగాణ రాష్ట్రం ఏర్పడక ముందు, ఏర్పడిన తరువాత కూడా వివిధ సామాజిక అంశాలను తమ కథలలో వస్తువుగా తీసుకుంటున్నారు.

**తెలంగాణ రాష్ట్ర ఆవిర్భావానంతర కథలో సామాజిక స్పృహ:**

1. పేదరికం:

సమాజాన్ని నాటి నుంచి నేటి వరకు పట్టి పీడిస్తున్న సామాజిక సమస్యలో పేదరికం, కులం, మతము మొదలయినవి ప్రధానమైనవి.

బుక్కెడు బువ్వకోసం పేదలు పడే ఆరాటం, చేసే పోరాటం అంతాయింతా కాదు.నోటిలోకి అన్నం పోవాలంటే నానా మాటలు పడాల్సిందే, అవమానాలు భరించాల్సిందే. మూడు రోజుల నుండి తిండి లేక అలమటిస్తూ చావు బ్రతుకుల మధ్య కొట్టుమిట్టాడుతున్న బిచ్చగానికి ఆస్తి పాస్తులు ఏమి లేవు ఉన్నదల్లా ఒకటే ఆస్తి. అదే అన్నం అడుక్కునే బొచ్చే (సత్తు గిన్నె). ఆ గిన్నెను పట్టుకొని బుక్కెడు బువ్వ కోసం "అమ్మా ..నీకు దండం పెడతాను తల్లె ... కాసింత బువ్వుంటే ఎయమ్మా..తల్లే .. మూడు రోజులైందమ్మ బువ్వతిని ...ఒక్క ముద్దుంటే ఎయమ్మా.." అంటూ జీవనం సాగిస్తున్న బిచ్చగాడు తిరగని ఊరు, ఇల్లు ఉండదు అయినా అతనికి ఒకపూట అన్నం దొరకకపోగా అవమానాలు ఎదురవుతాయి.

పేదరికం వలన దేశంలోని బిచ్చగాళ్ల దయనీయమైన స్థితిని, వారు ఎదుర్కునే అవమానాల గురించి "బుక్కెడు బువ్వ" అనే కథలో రచయిత ఎంతో హృదయ విదారకంగా పాఠకులకు తెలియజేశాడు.

**2. మత వైషమ్యాలు:**

అవమానాలను దిగమింగుకుంటూ ఆకలితో అలసిపోయి ఒక దగ్గర కూర్చున్న బిచ్చగానికి రాత్రి సమయంలో దావత్ చేసుకొని తిని వదిలేసిన బీఫ్ బిర్యాని దొరుకుతుంది.దాన్ని తీసుకొని వెలుతురు ఉన్న గుడి దగ్గరికి వచ్చి చేతులు కడుక్కొని తినడం మొదలుపెడుతున్న సమయంలో మతాభిమానం కలిగిన వ్యక్తులు వచ్చి కొడక నిన్ను ఈ గుడి దగ్గరికి ఎవరు రానిచ్చరూర ఏమి తింటున్నావుర ఇక్కడ అని అడిగితే ఎవరో తిని పారేసిన అన్నం దొరికిందయ్య తింటున్నాను అంటాడు.దాన్ని చూసి నువ్వు మేము పవిత్రంగా భావించే ఎద్దుకూర తింటవార అని బిచ్చగాడు తినే గిన్నెను తంతాడు. బిచ్చగాని చేతులో ఉన్న బిర్యాని కిందపడుతుంది.

అదే “బుక్కెడు బువ్వ” అనే కథలో రచయిత మత వైషమ్యాలు సమాజంలో ప్రజల మధ్య ఎంతటి దూరాన్ని కలిగిస్తుంది అనే విషయాన్ని వ్యక్తపరిచాడు.

**3. మానవీయ విలువలు:**

అప్పటికే ఆకలితో అలమటిస్తున్న బిచగానికి ఆగ్రహం వచ్చి “నా కొడకల్లారా..మూడు రోజుల నుండి తిండి లేదు. ఒక్క ముద్ద బువ్వ పెట్టమంటే ...ఏ నా కొడుకూ పెట్టలేదు.అటువంటి నా కొడుకులందరికి ఇప్పుడు నేను తినే తిండిని మాత్రం వద్దనే అధికారం,హక్కు ఏ నా కొడుకిచ్చాడు...?”

పెట్టని వాడికి అడిగే హక్కు లేదని అంతరించి పోతున్న మానవీయ విలువలను ఇదే “బుక్కెడు బువ్వ” కథ ద్వారా తెలియజేసాడు.

**4. మత సమస్య:**

పొట్ట కూటి కోసం నల్గొండ ప్రాంతం నుండి హైదరాబాదుకి వలస వచ్చిన మర్తమ్మ , ఓబులేసు కుటుంబం అపార్టుమెంటులో వచిమెన్ గా ఉంటూ జీవనం సాగిస్తు,అపార్ట్మెంట్లో ఉండే వివిధ కులాల,మతాల వారితో ఎలాంటి భేదాభిప్రాయాలు లేకుండా వల్ల అపార్ట్మెంట్లో ఎవరికి ఏ కష్టం వచ్చిన తమ సొంత వ్యక్తులకు వచ్చినట్టు పనులు చేస్తూ ఉంటారు.

అలా సజావుగా సాగుతున్న ఆ అపార్ట్మెంట్ లోకి మతపరమైన చాందస భావాలు అధికంగా కలిసిన ఒక కుటుంబం వస్తారు. ఎలాగైనా ఓబులేసు, మర్తమ్మ వారిని అపార్ట్మెంట్ నుండి బయటకి వెళ్లగొట్టాలనే నెపంతో “కులం తక్కువ, మతం తక్కువ వెదవల్లారా ఇది మీ పనేరా. రాత్రి మీరు తప్ప ఎవరూ లేరిక్కడ్ మీరే చేసుంట్ారు” , “దేవుడి చేయి వీరిచే అంత ధైర్యం ఎవరికీ ఉంటుంది. ఈ జాతి కొడుకులే ఇలాంటి పనులు చేసేది. తల్లి పాలు తాగి రొమ్మునే తన్నే కొడుకులు.....” అంటూ దూషిస్తూ ఉంటారు.పోలీసులు వచ్చి గంట లోపల అపార్ట్మెంట్ ఖాలీ చేసి వెళ్ళకపోతే కేసు పెట్టి జైల్ లో వేస్తామని బెదిరిస్తారు.

అన్యమతస్తుల దయనీయ స్థితిని, మతం ముసుగులో అంతరించిపోతున్న విలువలను, మతం మత్తులో మునిగితే ఎంత ప్రమాదమో అనే విషయాన్ని “మత్తయి” అనే కథ ద్వారా రచయిత తెలియజేశారు.

**5. కరువు,రైతుల ఆత్మ హత్యలు:**

భారత దేశం ప్రధానంగా వ్యవసాయ ఆధారిత దేశం. వ్యవసాయానికి గ్రామీణ ప్రాంతాలే పట్టు కొమ్మలు.

తన దగ్గర కొత్త బట్టలు కుట్టించుకోవడానికి వచ్చిన ఆడపడుచు వారం రోజులైన బట్టలు తీసుకోవడానికి రాకపోవడంతో “పాపం ఇష్టంకొద్ది కుట్టించుంది...ఎన్నిసార్లు బట్టలకోసం తిరిగిందో... ఇయ్యల్ల ఇయ్యకుంటే నేను మునుగుత” అనుకుంటూ ఆ అమ్మాయి దగ్గరికి బయలుదేరుతాడు. ఆ క్రమంలో తెలిసిన విషయం ఏంటంటే వ్యవసాయం చేస్తూ సమయానికి నీళ్లు సరిగా రాక తద్వారా పంటలు పండక, ఊరిలో పెత్తందార్లు దగ్గర అప్పులపాలు అవ్వటం వల్ల తన అక్క, అలానే అప్పులు చేసి పంట చేతికి వచ్చే

సమయంలో అకాల వర్షం వలన పంట దెబ్బతిని నష్టం రావటం వల్ల ఆ బాధను భరించలేక అదే పత్తి మందు తాగి మరణించిందన్న విషయం తెలుస్తుంది.

వ్యవసాయం చేసే రైతుల దీన పరిస్థితులు, వారి జీవితాలు, సమస్యలు,అకాల వర్షం వలన రైతుల ఆత్మ హత్యలు మొదలగు సామాజిక అంశాలను 'గుండెలో వాన' కథలో రచయిత స్పృశించాడు.

6. **స్త్రీ స్వేచ్ఛ:**

సెహన, సాదిక్ భార్య భర్తలు. భర్త ఒక సాఫ్ట్వేర్ ఉద్యోగి. సెహన ఇంట్లోనే ఉంటుంది. సెహనకి ఇంట్లో ఒంటరిగా ఉంటూ ఏ పని చేయకుండా ఖాళీగా ఉండటం ఇష్టం ఉండదు. ఏదైనా జాబ్ చెద్దమనుకుంటే సాదిక్ వద్దని చెప్పేవాడు.

ఇంట్లో ఉంటూ జీవితాన్ని కొనగిస్తున్న తరుణంలో తెలంగాణ ఉద్యమం పట్ల ఆసక్తి కలిగి తను కూడా ఉద్యమంలో పాల్గొనాలి అనుకుంటుంది. ఈ విషయాన్ని ఎలాగైనా సాదిక్ కి చెప్పి ఒప్పించి సగరహారానికి వెళ్ళాలి అనుకుంటుంది. కానీ దానికి సాదిక్ ఒప్పుకోకపోగా "ఏమనుకుంటున్నావ్ నువ్వు ఎంత చెప్పిన అర్థం కాదేంటి నీకు....అసలెట్ల పెంచారు నిన్నిల మొండిగా"? అంటూ ,"నాకు ఇష్టం వచ్చినట్టు నువ్వు ఉండాలి". నాకు నచ్చినట్టే ఉండాలి. నేను చెప్పిందే చేయాలి. అలా చేయకపోతే బాగోదు. ఏమనుకుంటున్నవ్ అంటూ తన పురుషాహంకరాన్ని ప్రదర్శిస్తాడు. ఇలా పురుషంకరం ప్రదర్శిస్తున్న తన భర్త దగ్గర ఉండి స్వేచ్ఛను హరించుకోకుండ "పని లేని ఈ పనిమనిషి ఉద్యోగంలో నా యజమానికి రెసిగ్నేషన్ లెటర్ ఇవ్వాలని అనుకుంటున్నా" అని, తను ఇంట్లో ఒక్కదాన్నే ఉంటూ అనుభవిస్తున్న ఒంటరితనాన్ని గురించి బాధ పడుతుంది.

సమాజ మూల బిందువు స్త్రీ పురుష బాంధవ్యం. సమాజానికి స్త్రీని మూలంగా చెప్పవచ్చు. స్త్రీ లేని సమాజాన్ని ఊహించలేము. అలాంటి స్త్రీలు సమాజంలో చాలా సంవత్సరాల నుండి అవమానాలకు, అణచివేతలకు గురవుతున్నారు. వారి ఇష్ట ఇష్టాలకు,వారి అభిప్రాయాలకు కనీస మర్యాద లేకపోగా అడుగడుగునా వివక్షణను అనుభవించారు. అలాంటి స్త్రీ కి స్వేచ్ఛను కల్పించడం పురుషుల కనీస బాధ్యత.

స్త్రీకి స్వేచ్ఛ ఉండాలని, స్త్రీలు స్వేచ్ఛగా బతకాలని, ఆలోచించాలని స్త్రీల మానసిక సంఘర్షణను రచయిత్రి పంచి ఔర్ ప్రింజా అనే కథ ద్వారా తెలియజేస్తుంది.

7. **స్వలాభ రాజకీయాలు:**

రాజకీయం అంటే దేశం కోసం, దేశ ప్రజల బాగోగుల కోసం పాటుపడే నిస్వార్థ సేవ. అంతేకానీ రాజకీయ నేతల స్వార్థం కోసం దేశాన్ని దేశ ప్రజల్ని సైతం అన్యాయం చేసి తమ జేబులు నింపుకోవడం కాదు. నేటికీ మనదేశంలో రాజకీయ నాయకుల అనిశ్చితి కనిపిస్తూనే ఉంది.

"కానీ వాడి మీద కోపం ఉంది కాబట్టి ...వాడు ట్రాక్టర్ తిప్పుకోకుండా ఉండేందుకు నలభై, యాభై మంది బడి పిల్లలకు, ఊరోళ్ళకు రోడ్డు లేకుండా చేద్దామా?" - అనే మాటలను గమనించినట్లయితే రాజకీయ నాయకులు తమ పదవి కోసం, అధికారం కోసం ఎంతటి దుర్మార్గానికైనా వెనకాడరని తెలుస్తుంది.

'ద్వాలి' అనే ఈ కథలో రాజకీయాలను గ్రామ ప్రజల శ్రేయస్సు కోసం,పిల్లల చదువు కోసం ఉపయోగించాలే తప్ప కుట్ర పూరిత రాజకీయాలు చేస్తూ తమ బాధ్యతను విస్మరించి ప్రజలకు ఎంతటి అన్యాయం చేస్తున్నారు అన్న విషయాన్ని స్పష్టంగా తెలియచెప్పాడు.

**ముగింపు:**

పై విధంగా తెలంగాణ ప్రాంతానికి సంబంధించిన కథారచయితలు ఆ ప్రాంతంలో మాత్రమే కాకుండా సమాజం మొత్తం మీద ఉన్న కుల, మత, ప్రాంత, లింగ వివక్షలను, రైతు సమస్యలు, కరువు, స్త్రీ స్వేచ్ఛ వంటి ఎన్నో సమస్యలను కథా వస్తువుగా చేసుకుని కథలను సృజించి, తద్వారా సామాజిక సమస్యలను తెలియజేస్తూ, సమసమాజ స్థాపన నిర్మాణం కోసం కృషి చేస్తున్నారు.

**ఆధార గ్రంథాలు:**


1) దక్షిణామూర్తి, పోరంకి. ***కథానిక స్వరూప-స్వభావాలు***, హైదరాబాద్, విప్లవ్ కంప్యూటర్ సర్వీసెస్, 2009.
2) శ్రీదేవి, వేలూరి. ***తెలంగాణ తెలుగు కథా వికాసం***, వరంగల్,శ్రీ శివసాయి ప్రచురణలు,2016.
3) శరత్ జ్యోత్స్నా రాణి, ఎస్. ***తెలుగు కథా సాహిత్యం ఆధునిక దృక్పథాలు***, జ్యోత్స్నా కళాపీఠ ప్రచురణలు,హైదరాబాద్,2007.
4) ***అలుగు***, తెలంగాణ కథా సంకలనం, సం.సంగిశెట్టి శ్రీనివాస్, వెల్దండి శ్రీధర్,సింగిడి,హైదరాబాద్,2016.
5) **కథ,** కథా సాహితీ సంకలనం,సం. పి.సత్యవతి, కె. పి.అశోక్ కుమార్.2017
6) ***దావత్,*** తెలంగాణ కథా సంకలనం, సం.సంగిశెట్టి శ్రీనివాస్, వెల్దండి.2018
7) **కొత్త కథ,** సంకలనం, సం. కె.సురేష్, మహమ్మద్ ఖదీర్ బాబు. 2019


******

.

# 68. తెలుగు సినిమా పాటలు - సామాజిక దృక్కోణం

**కొత్త శ్వేత,**

PhD – Telugu,

University of Hyderabad,

8331936858,

Swetha.kotha123@gmail.com

**పరిచయం:**

సినిమా పాట త్రిముఖాత్మకమైనది. అవి 1. సాహిత్యం, 2. సంగీతం, 3. సన్నివేశం. ఈ మూడు కలిస్తేనే సినిమాపాట విజయవంతం అవుతుంది. సినిమా పాటకు ఏదోక విధమైన నిర్దిష్ట ప్రయోజనం ఉంటుంది. అయితే ఆ ప్రయోజనం ఎప్పుడు సామాజికంగా ఉంటుందని మాత్రం చెప్పలేం. సినిమా పాటల్లో అన్ని సామాజిక అంశాలను చెప్పలేక పోయినప్పటికీ, కానీ కొన్ని పాటలు ప్రజల్లో ఎంతోకొంత చైతన్యం కలిగించింది అనటంలో ఎటువంటి అతిశయోక్తి లేదు. ఇలాంటి ఎన్నో సామాజిక దృక్కోణాలను వ్యక్తం చేసే నాటి పాటల నుంచి నేటి పాటల వరకు క్లుప్తంగా ఈ పరిశోధన వ్యాసంలో చర్చిస్తాను.

**అంశం :**

సాహిత్యం - సమాజం రెండూ కూడా విడదీయరానివి. సమాజ ప్రతిబింబమే సాహిత్యం. అయితే సాహిత్యం అనేది కళా ప్రక్రియ కాబట్టి కల్పితంశాలను కూడా కలిగి ఉంటుంది. సినిమా పాట కూడా సాహిత్యంలో ఒక ప్రక్రియ. ప్రక్రియ ఏదైనాప్పటికీ కూడా సమాజ హితం ఎంతోకొంత కచ్చితంగా ఉంటుంది. అందుకే సినీ కవులు కూడా తమ పాటలలో సామాజిక దృక్కోలాన్ని ఆవిష్కరించారు. సినిమా పాటల ద్వారా సినీ కవులు అనేక సామాజిక సమస్యల్ని ఎత్తిచూపారు.

రాను రాను తెలుగు సినిమా పాట పరిణతి చెందుతూ వస్తుంది. అప్పుడప్పుడు పక్కదారి పడుతున్నప్పటికీ కూడా మంచి సాహిత్య విలువలతో పాటు సామాజిక స్థితిగతులను ప్రతిఫలించే పాటలు కూడా వస్తూనే ఉన్నాయి, ఉంటాయి కూడా. ప్రజలకు సినిమా పాటల పట్ల ఆసక్తి రాను రాను పెరుగుతూ ఉండటం, కవులు కూడా శనివారం వైపు ఆకర్షితులే పోటీపడి మరి పాటలు రాస్తుండటం, అందులో సినిమా నేపథ్యానికి తగినట్లుగా అప్పుడప్పుడు సందర్భోచితంగా భావపరంగా ఉన్నత ప్రమాణాలను కలిగి ఉండే పాటలను రాస్తున్నారు.

1931 లో పుట్టిన తెలుగు సినిమా పాట ఒక సామాజిక అవసరంతో ఉద్భవించిందనే చెప్పాలి. సాహిత్యం ప్రజల పరం కావడం, సమాజంలో వర్గ తారతమ్యాలు లేకుండా సినిమా అనేది అందరినీ ఆకర్షించే ఒక విశిష్టమైన సమాహారం కళ. నాటి నుంచి ఆయా కాలాలకు అనుగుణంగా ఆనాటి పరిస్థితులలో అద్దం పట్టేలా ప్రభోదాత్మకత, సంస్కరణ పూర్వకత, దేశభక్తి, కాల్పనిక .... అంటూ ఎన్నో అంశాలు సినీమా పాటల్లో ఏదోక రూపంలో ప్రతిఫలిస్తూనే ఉన్నాయి.

తొలితరంలో ప్రసిద్ధ సినిమా కవులుగా చెప్పుకుంటున్న సీనియర్ సముద్రాల, తాపీ ధర్మారావు, పింగళి, మల్లాది, దేవులపల్లి, ఆత్రేయ, ఆరుద్ర, కొసరాజు, జూనియర్ సముద్రాల, శ్రీ శ్రీ, దాశరథి, సినారె, వేటూరి మొదలైన వారితో పాటుగా ఆధునిక కవులైనటువంటి సిరివెన్నెల సీతారామశాస్త్రి, భువనచంద్ర, చంద్రబోస్, అనంత శ్రీరామ్, రామజోగయ్య శాస్త్రి, వెన్నెలకంటి, సుద్దాల అశోక్ తేజ, వనమాలి, శ్రీమణి... ఇలా ఆధునిక సినీ కవులు కూడా తమ పాటలు సామాజిక స్పృహను కలిగి ఉండే పాటలను రక్షిస్తూనే ఉన్నారు.

**తెలుగు సినిమా పాటలు - సామాజిక దృక్కోణం:**

కాలగమనంతో పాటు తెలుగు సినీ పరిశ్రమ అంచలంచెలుగా ఎదుగుతూనే ఉంది. "తెలుగు సినిమా పాటలు" అనేది అపారమైన సంపదతో నిండి ఉంది. ఇంతటి గొప్ప సినిమా పాటల ప్రవాహంలో కొన్ని పాటలను పరిగణలోనికి తీసుకుంటూ ఆ పాటలలో ఉన్నటువంటి సామాజిక దృక్కోణాలను గురించి ఇప్పుడు వివరిస్తాను.

1. సినిమా: Money

   పాట: చక్రవర్తికి వీధి బిచ్చగత్తెకి....

   రచయిత: సిరివెన్నెల సీతారామశాస్త్రి

*"చక్రవర్తికి వీధి బిచ్చగత్తెకి... బంధువవుతానని అంది మనీ మనీ*
*అమ్మ చుట్టము కాదు అయ్యా చుట్టము కాదు... ఐన అన్ని అంది మనీ మనీ*
*పచ్చ నోటుతో లైఫ్ లక్ష లింకులు పెట్టుకుంటుందని అంది మనీ మనీ*
*పుట్టడానికి పాడే కట్టడానికి మధ్య అంతా తానే అంది మనీ మనీ"*

మానవుని ప్రగతికి అనూ వికాసానికి జ్ఞానమనేది ఆధారం అయినప్పటికీ కూడా లౌకిక జగతిలు మనిషి మనుగడకు ప్రాణవాయువు కంటే డబ్బే ప్రధానం అయిపోయింది. అందుకే డబ్బు సంపాదించడమే ప్రధాన లక్ష్యంగా రోజురోజుకీ మనిషి ఒక యంత్రంగా మారిపోవటం మనం కళ్లారా చూస్తూనే ఉన్నాం. ఇదే విషయాన్ని గురించి పై పాటలో విపులంగా కథాంశాన్ని బట్టి సినిమాలో ఈ పాటను రచయిత రూపొందించడం జరిగింది.

2. సినిమా : బడ్జెట్ పద్మనాభం

   పాట: ఎవరేమీ అనుకున్నా నువ్వుండే రాజ్యాన...

   రచయిత: చంద్రబోస్

*"ఎవరేమీ అనుకున్నా నువ్వుండే రాజ్యాన...*
*రాజు నువ్వే బంటూ నువ్వే మంత్రీ నువ్వే సైన్యం నువ్వే*
*ఏమైనా ఏదైనా నువ్వేళ్ళే బడి లోన...*
*పలకా నువ్వే బలపం నువ్వే ప్రశ్నా నువ్వే బదులూ నువ్వే...*
*అవమానాలే ఆభరణాలు.. అనుమానాలే అనుకూలాలు...*
*సందేహాలే సందేశాలు.. ఛీత్కారాలే సత్కారాలూ...*
*అనుకోవాలీ... అడుగేయాలీ*
*ముళ్ళ మార్గాన్ని అన్వేషించాలీ...*
*అలుపొస్తున్నా కలలే కన్నా... పూల స్వర్గాన్ని అధిరోహించాలీ...*
*ఎవరికి వారే లోకంలో... ఎవరికి పట్టని శోకంలో...నీతో నువ్వే సాగాలీ..."*

ప్రతి మనిషికి తన జీవితం పట్ల అమితమైన ప్రేమ ఉండాలి. రేపటి రోజు కోసం కలలు కనాలి. భవిష్యత్తు మీద ఆశతో ఒక్కొక్క అడుగు వేస్తూ ముందుకు సాగాలి. అలా కలక లేకపోతే మన జీవితం మనకి గుదిబండగా మారిపోతుంది. మోయలేని భారంగా మన బ్రతుకు తయారవుతుంది. కాబట్టి మనిషికి తన జీవితం పట్ల ఆశావాద దృక్పథం కలిగి ఉండాలి. ఇదే విషయాన్ని సినీ కవి పై పాట ద్వారా శ్రోతలకు తెలియజేస్తున్నాడు.

3. సినిమా: శభాష్ రాముడు

పాట: జయమ్ము నిశ్చయమ్మురా...

రచయిత: కొసవరాజు

*"జయమ్ము నిశ్చయమ్మురా భయమ్ము లేదురా*
*జంకు గొంకు లేక ముందు సాగిపొమ్మురా... సాగిపొమ్మురా*
*కష్టాల కోర్చుకున్ననే సుఖాలు దక్కును... సుఖాలు దక్కును*
*విద్యార్థులంత విజ్ఞానం సాధించాలి... విద్యార్థులంత*
*విశాలదృష్టి తప్పకుండ బోధించాలి... బోధించాలి*
*పెద్దలను గౌరవించి పూజించాలి... పూజించాలి*
*ఈ లోకమందు సోమరులై ఉండకూడదూ... ఉండకూడదూ*
*పవిత్రమైన ఆశయాలు మరువకూడదు... మరువకూడదు "*

తనపై తనకు నమ్మకం ఉండటమే ఆత్మవిశ్వాసం. మానవుడు ఎప్పుడూ కూడా నమ్మకంతో ముందుకు సాగితే ఎంతటి కష్టమైన పనినైనా సాధించగలడు. అలాంటి ఆత్మవిశ్వాసాన్ని, ఎన్ని కష్టాలు ఎదురైనా వాటిని ఓర్చుకొని ధైర్యంగా ముందుకు వెళ్లి తత్వాన్ని పైన వివరించిన సినిమా పాట ద్వారా శ్రోతలకు సరళమైన భాషలో వివరించాడు.

4. సినిమా: పెళ్లి చేసుకుందాం రా

పాట: నువ్వేమి చేసావు నేరం...

రచయిత: సిరివెన్నెల సీతారామశాస్త్రి

*"నువ్వేమి చేశావు నేరం – నిన్నెక్కడంటింది పాపం... చినబోకుమా*
*చేయూతనందించు సాయం... ఏనాడు చేసింది సంఘం... గమనించుమా*
*కన్నీటి వర్షానికి కష్టాలు చల్లారునా*
*మార్గం చూపే దీపం కాదా ధైర్యం*
*జరిగింది ఓ ప్రమాదం – ఏముంది నీ ప్రమేయం*
*దేహానికైన గాయం – ఏ మందుతోనో మాయం*
*విలువైన నిండు ప్రాణం - మిగిలుండడం ప్రధానం*
*అది నిలచునంత కాలం – సాగాలి నీ ప్రయాణం*
*స్త్రీల తనువులోనే శీలమున్నదంటే... ఇల్లాలి దేహాల్లో శీలమే ఉండదనా*
*భర్తన్న వాడెవడూ పురుషుడు కాదు అనా*
*శీలం అంటే గుణం అని అర్థం "*

మానవ సమాజం ఎంతగా అభివృద్ధి చెందుతున్నప్పటికీ కూడా నాటి నుంచి నేటి వరకు స్త్రీలపై అత్యాచారాలు, ఆకృత్యాలు జరుగుతూనే ఉన్నాయి. ఇదంతా ఒక ఎత్తు అయితే అన్యాయం చేస్తున్న వాళ్లని ఎదిరించకపోగా అన్యాయం అయిపోయిన వాళ్లని ఇంకా ఇంకా అవమానిస్తూ బాధపెట్టే సమాజంలో మనం బ్రతుకుతున్నాం. అలాంటి సమాజం పైన గురిపెట్టి కళ్ళు తెరిపించే ఒక బాణం లాంటిది పైన చూపించిన పాట.

జీవితంలో దెబ్బతిన్న వాళ్లు, అత్యాచారానికి గురైన వాళ్ళు, వేరే ఏదైనా కారణం చేత సమాజంలో కృంగిపోయిన వారిలో ఆత్మవిశ్వాసాన్ని, భవిష్యత్తుపై ఆశని కలిగించే విధంగా పైన చూపించిన పాట భావపరంపరను వ్యక్తం చేస్తున్నది.

5. సినిమా: వకీల్ సాబ్

   పాట: మగువా మగువా... లోకానికి తెలుసా నీ విలువ

   రచయిత: రామ జోగయ్య శాస్త్రి

*"మగువా మగువా లోకానికి తెలుసా నీ విలువా...*

*మగువా మగువా నీ సహనానికి సరిహద్దులు కలవా...*

*అటు ఇటు అన్నింటా, నువ్వే జగమంతా...పరుగులు తీస్తావు ఇంటా బయట...*

*అలుపని రవ్వంత అననే అనవంట... వెలుగులు పూస్తావు వెళ్లే దారంత...*

*నీ కాటుక కనులు విప్పారకపోతే ఈ భూమికి తెలవారదుగా....*

*నీ గాజుల చేయి కదలాడకపోతే ఏ మనుగడ కొనసాగదుగా...*

*ప్రతి వరసలోను ప్రేమగా అల్లుకున్న బంధమా అంతులేని నీ శ్రమా అంచనాలకందునా... ఆలయాలు కోరని ఆదిశక్తి రూపమా నీవులేని జగతిలో దీపమే వెలుగునా...*

*నీదగు లాలనలో ప్రియమగు పాలనలో ప్రతి ఒక మగవాడు పసివాడేగా...*

*ఎందరి పెదవులలో ఏ చిరునవ్వున్నా ఆ సిరి మెరుపులకు మూలం నువ్వేగా... "*

స్త్రీ గొప్పతనాన్ని, ఔన్నత్యాన్ని చాటి చెప్పే సినిమా పాటలలో ఇది కూడా చిరస్థాయిగా మిగిలిపోయే పాట. ఆలిగా, అమ్మగా, చెల్లిగా...ఇలా భిన్నమైన పాత్రలలో తన బాధ్యతలను నెరవేరుస్తూ నేటికీ స్త్రీ ఎన్నో ఉన్నత శిఖరాలను అధిరోహిస్తూ, కుటుంబ బాధ్యతలను కూడా ఎంతో చాకచక్యంగా నిర్వర్తిస్తుంటుంది. అదే విషయాన్ని ఈ పాట ద్వారా కవి మనకి చెప్పదలుచుకున్నాడు.

6. సినిమా : సంసారం ఒక చదరంగం

   పాట : సంసారం ఒక చదరంగం .

   రచయిత : వేటూరి

*" స్వార్థాల మత్తులో ఆడే ఆటలో ఆవేశాలు ఋణపాశలు టెంచే వేళలు ... '*

*'ప్రళయాలు రేగిన, తిమిరాలు మూగిన మమతా జ్యోతి వెలిగించాలి ... '*

*గుండెలే బండగా మారేటి స్వార్థం ...*

*ఆలిని.... తల్లి....... తాళిని డబ్బుతో తూచు బేరం "*

ఈ పాట కుటుంబాలలో నేడు కనుమరుగైపోతున్న అనుబంధాల గురించి, డబ్బే ప్రధానం అని భావించి తల్లిని, తాళిని కూడా దూరం చేసుకుంటున్న నేటి మనిషి దౌర్భాగ్య స్థితి గురించి చక్కగా కళ్ళకు కట్టినట్లు చూపించే ప్రయత్నం చేశారు.

ముగింపు :

కమర్షియల్ పర్పస్ కోసమే సినిమా ఉన్నప్పటికి అందులో తప్పనిసరిగా సమకాలీన సమాజం ఉండటం సహజం. అలా సినిమాలో సామాజిక అంశాలు ఉన్నప్పుడు కథా సందర్భానికి తగినట్లుగా సినీకవులు అలాంటి సామాజిక దృక్కోణం నుంచి పాటలు రాయాల్సి వస్తుంది.

వ్యాపారం కేంద్రంగా సాగే సినిమాలు, అందులో పాటలు కేవలం వినోదాన్ని మాత్రమే పంచుతాయా? అంటే కాదు. మనిషిలో నేడు లుప్తమవుతున్న మానవతా విలువలు, సమ సమాజ నిర్మాణానికి దోహదపడే ఎన్నో సామాజిక అంశాలతో కూడిన పాటలు కూడా ఉంటాయి. అలాంటి పాటలలో కొన్నింటిని మాత్రమే పైన ఉదహరించాను.

పాటలోని రాగాన్ని కమ్మగా పాడినప్పుడు మాత్రమే పాటకు తియ్యదనం, మనస్సుకు ఆనందం వస్తాయి. అటువంటి పాటకు మంచి సాహిత్యం తోడైతే పాట ఇంకో మెట్టు ఎక్కినట్లే. సినిమా పాటలు ప్రజలపై అధిక ప్రభావం చూపుతాయి కాబట్టి అందులో మంచి సాహిత్యాన్ని పొందుపరచి ఉంచడం సినీకవుల కనీస బాధ్యత.

**ఆధార గ్రంధాలు:**


1) ఆరుద్ర - సమగ్ర సాహిత్యం , ప్రజాశక్తి బుక్ హౌస్ – హైదరాబాద్
2) కృష్ణశాస్త్రి దేవులపల్లి – మేఘమాల, ఓరియంటల్ లాంగ్వేజ్ – హైదరాబాద్
3) గౌరీ శంకర్. టి - తెలుగు సినిమా పాటల్లో సాహితీ మూల్యాలు (సిద్ధాంత వ్యాసం), ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాద్
4) నరసయ్య కాట్రగడ్డ - తెలుగు సినిమా పరిశ్రమ, ఆంధ్రప్రదేశ్ దర్శిని విశాలాంధ్ర పబ్లిసింగ్ హౌస్, హైదరాబాద్
5) పైడిపాల. డా. - తెలుగు సినిమా పాట , స్నేహ ప్రచురణలు, మద్రాస్
6) పైడిపాల. డా. – తెలుగు సినీగేయ కవుల చరిత్ర, శ్రీశ్రీ ప్రింటర్స్, విజయవాడ


******

# 69. వారణాసి నాగలక్ష్మి కథలు - మానవతా విలువలు

**గుడె శివశంకర్,**

పరిశోధక విద్యార్థి

తెలుగు మరియు ప్రాచ్య భాషా విభాగం

ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం

చరవాణి : 77990 91288

వర్ధమాన కథా రచయిత్రులలో 'వారణాసి నాగలక్ష్మి' రచనాపరంగా ప్రత్యేకతను సంతరించుకొన్న రచయిత్రి. నూజివీడులోని ప్లీడరుగారి తోటలో జన్మించిన ఈమె బిఎస్సీ డిగ్రీ నూజివీడులోని ధర్మ అప్పారావు డిగ్రీ కళాశాలలో పూర్తిచేసి, కేంద్రీయ విశ్వవిద్యాలయం హైదరాబాదులో రసాయనిక శాస్త్రంలో ఎమ్మెస్సీ పూర్తిచేసి, యం.ఫిల్. చేశారు. నాగలక్ష్మి సుమారుగా డెబ్భైకి పైగా కథలు రచించారు. అవి ఆలంబన, ఆసరా, వేకువపాట, మళ్లీ మనిషిగా అనే పేర్లతో కథా సంపుటాలుగా వెలువడ్డాయి. అంతేగాక ఈమె మంచి గీత రచయిత్రి కూడా. 'వానచినుకులు' అనే పేరుతో వీరి లలితగీతాల సంపుటి వెలువడిరది. ఈమె కథలు కౌముది, రచన, ఆంధ్రభూమి, స్వాతి, సాహితీ స్రవంతి, భూమిక వంటి ప్రముఖ వార, మాస పత్రికలలో ప్రచురితమయ్యాయి. అదే విధంగా ఈమె గీతాలు ఆకాశవాణి, దూరదర్శన్‌లలో ప్రసారమయ్యాయి. ఢిల్లీ తెలుగు అకాడమీ 'సలలితరాగ సుధారస సప్తాహం' కార్యక్రమంలో భాగంగా ఒకరోజు ఈమె పాటల సంగీత విభావరి నిర్వహించి, ఘనంగా సత్కరించింది. వారణాసి నాగలక్ష్మి మంచి చిత్రకారిణి కూడా. ఈమె తమ కథా సంపుటాలకు ముఖచిత్రాలు, సన్నివేశ చిత్రాలు స్వయంగా చిత్రించారు. వీరు ఉత్తమ చిత్రకారిణిగా మంచి గుర్తింపు సంపాదించారు. ఎలీ లిలీ సంస్థ నిర్వహించిన 'అంకాలజీ ఆన్ కాన్వాస్' అనే అంతర్జాతీయ చిత్రకళా పోటీలో వీరి 'బ్లూస్ అండ్ బ్లూమ్స్' చిత్రం ఎంపికై లండన్‌లోని రాయల్ కాలేజీ ఆఫ్ ఆర్ట్స్‌లో ప్రదర్శింపబడింది.

నాగలక్ష్మి కథలు మానవతను సంతరించుకొని మంచి సందేశాత్మకంగా ఉంటాయి. ఈమె కథల్లో సమస్యలకు సున్నితమైన పరిష్కారం, సానుకూల దృక్పథం ప్రధానంగా కనిపిస్తాయి. ఎక్కడా కాఠిన్యం కనిపించదు. కథ సహజంగా, సున్నితంగా సాగుతుంది. అంతేగాక ఈమె కథలు సరళమైన శైలిలో సహజధోరణిలో పాఠకులలో ఆసక్తిని రేపి చదివిస్తాయి.

ప్రస్తుత సమాజంలో వృద్ధాప్య సమస్య ప్రధానమైనది. అన్నీ ఉండి, అందరూ ఉండి కూడా వృద్ధులు ఏదో విధంగా బాధపడుతూనే ఉన్నారు. అలాగే ఏమీలేని, ఎవరూ లేని వృద్ధులు కూడా నరకప్రాయమైన ఒంటరి జీవితాన్ని గడుపుతున్నారు. బాగా పరిశీలించి చూస్తే 'వృద్ధాప్యం శాపమా?' అన్న ఆలోచన కలుగుతుంది. **'ఆలంబన'** కథలో రామశాస్త్రికి ఇద్దరు కొడుకులు ప్రభాకరం, సుధాకరం. భార్య మరణం కారణంగా విదేశాల్లో ఉంటున్న కొడుకులు స్వదేశానికి వచ్చి కర్మకాండలు పూర్తిచేసి విదేశాలకు వెళ్ళిపోతారు. రామశాస్త్రి కొడుకులతో విదేశాలకు వెళ్ళలేక, ఒంటరిగా ఇంటిలో ఉండలేక బాధపడుతూ ఉంటాడు. సుందర్రావు అనే వ్యక్తి ప్రేరణతో తన ఇంటినే 'ఆలంబన' అనే వృద్ధాశ్రమంగా మారుస్తాడు.

ఆ ఆశ్రమంలో అనాథ పిల్లలను కూడా చేర్చుకుంటారు. ఒక్కొక్క అనాథ పిల్లవాణ్ణి ఒక్కొక్క వృద్ధుడు దత్తతగా స్వీకరించి ఆ పిల్లవాని మంచి చెడులను, చదువు సంధ్యలను చూస్తూ ఆ పిల్లవాని అభివృద్ధికి కృషి చేయడం ఆశ్రమ నిబంధన. ఈ నిబంధన ప్రకారం రామశాస్త్రి ఒక అనాథను స్వీకరించి అతనిలో తన మనవలను చూస్తూ, తన భార్య విశాలాక్షికి పంచిన ప్రేమనే ఆ అనాథకు పంచుతూ, ఆ అనాథ పురోభివృద్ధి కోసం కృషి చేస్తూ తన శేష జీవితాన్ని ఆనందంగా గడుపుతాడు. ఈ కథలో రచయిత్రి వృద్ధాప్య సమస్యకు సానుకూలమైన పరిష్కారాన్ని సూచించారు. వృద్ధాప్యం కారణంగా భార్య పోయిన దిగులుతో రామశాస్త్రి ఒంటరి జీవితం నరకప్రాయంగా సాగింది అని చెప్పకుండా రామశాస్త్రి శేష జీవితం ఆనందంగా సాగిందని, ఒక అనాథను తన మనవడిగా భావించి

అతన్ని ప్రేమిస్తూ, ఆ అనాథకు మంచి భవిష్యత్తును కల్పించడానికి కృషి చేసినట్లు రాయడం విశేషం. దూర దేశాలలో ఉంటున్న తన వారు తనని పట్టించుకోని పరిస్థితుల్లో రామశాస్త్రి ఒక అనాథను తన వాడిగా భావించి ప్రేమిస్తూ, అతని అభివృద్ధికి సహకరించడం రామశాస్త్రిలోని మానవత్వానికి మంచి నిదర్శనం.

నేటి సంఘంలో అత్తాకోడళ్ళు బద్ధ శత్రువుల్లా వ్యవహరిస్తున్నారు. ఈ శత్రుత్వం ఈనాటిది కాదు. ఈ తరానికి మాత్రమే పరిమితం కాదు. ఏనాటిదో. ఇద్దరి మహిళల మధ్య అందునా అత్తాకోడళ్ళ మధ్య సయోధ్య లేకపోవడం ఎన్నో సమస్యలకు దారితీస్తున్న విషయం మనకు తెలిసినదే. ఈ కారణంగా మానవ సంబంధాలు క్రమంగా క్షీణించి కుటుంబ సభ్యుల మధ్య దూరం పెరుగుతోంది. ఇది ఇలా ఉంటే నేటి యువతరం ఎక్కువ భాగం ప్రేమ వివాహాల పట్ల మక్కువ చూపుతున్నారు. జీవితం సుఖమయం కావడానికి ప్రేమ వివాహాలు మంచివా ? లేక పెద్దలు కుదిర్చిన వివాహాలు మంచివా ? అన్న చర్చలు జరగడం పరిపాటై పోయింది.

వారణాసి నాగలక్ష్మి '**గెలుపు**' అన్న కథలో అత్తాకోడళ్ళ మనస్తత్వాన్ని చిత్రించడంతోపాటు, ప్రేమ వివాహాలైనా, పెద్దలు కుదిర్చిన వివాహాలైనా విజయవంతం కావడం అనేది ఆయా వ్యక్తుల సంస్కారం పైన, ఆలోచనా సరళిపైన, వ్యక్తిత్వం పైన ఆధారపడి ఉంటాయని నిరూపించారు.

సిద్ధూతల్లి ప్రేమవివాహాల కన్నా పెద్దలు కుదిర్చిన వివాహాలే సుఖ సంతోషాలతో ఉంటాయని, అందునా అయిన పిల్ల (సిద్ధూ అక్క కూతురు) అయితే ఆ దాంపత్యం ఇంకా బాగుంటుందని చెప్తూ, దానిని బలపరిచే విధంగా సుశీల కొడుకు ప్రభాకరం ప్రేమవివాహం చేసుకున్న తర్వాత ఏ విధంగా నరకం అనుభవిస్తున్నాడో తెలియజేసి తన మనవరాలు (కూతురి కూతురు) లలితని కోడలిగా చేసుకోవాలని ప్రయత్నిస్తుంది. సిద్ధూ తన తల్లి అభిప్రాయాన్ని కాదని తన అక్కకూతురు లలితని కాకుండా పూజని ప్రేమవివాహం చేసుకుంటాడు. సిద్ధూ తన అక్కయ్య కోరిక మేరకు లలితని సహోద్యోగి అయిన అనంత్ కిచ్చి వివాహం జరిపిస్తాడు. సిద్ధూభార్య పూజ, సిద్ధూతల్లి వలన బాధపడగా, అనంత్ తల్లి, కోడలు లలిత వ్యక్తిత్వం వలన బాధపడుతుంది. ఈ రెండు జంటలలో ఒక అత్త కోడలి ప్రవర్తన కారణంగా బాధపడటం, ఒక కోడలు అత్త ఈసడింపుల కారణంగా బాధపడటం గమనార్హం. ఎవరు బాధపడినా వారి వారి వ్యక్తిత్వం, ప్రవర్తన ప్రధాన కారణాలని రచయిత్రి ఈ కథలో నిరూపించారు. కారణాలేవైనా మానవ సంబంధాలు క్షీణించడమన్నది గమనించవలసిన విషయం.

కొడుకు సిద్ధూ తన మాటను కాదని తాను ప్రేమించిన పూజను చేసుకున్నాడని అత్తగారికి పూజపై ద్వేషం. **"రాగానే ఆ ఆఫీసు బట్టలు మార్చుకొని కాఫీ కలుపుకుంటే బావుంటుంది వీధుల్లో తిరిగొచ్చిన బట్టల్తో ఇల్లంతా తిరుగుతుంటే చికాగ్గా ఉంటుంది. కాళ్ళు కడుక్కోవడం దగ్గర్నించి నేర్పించాల్సి వచ్చేట్టుంది చూస్తుంటే..."** అలాగే లలిత ఇంటిని పరిశుభ్రంగా ఉంచుకోవడంలోనూ, ఇంట్లో వస్తువులను ఎక్కడివక్కడ సర్దుకోవడంలోనూ ఎక్కువ శ్రద్ధ చూపేది. అది పరిమిత స్థాయిలో ఉంటే ఎలాంటి ఇబ్బంది ఉండదు. "ఏమో... ఇది ఒంటిపిల్లి రాకాసి, ఇంట్లో వస్తువులన్నీ తళతళ లాడేలా తుడిచి పెట్టుకోవడం, సర్దిందే మళ్ళీ మళ్ళీ సర్దడం ఇంతేగాని ఆవిడతో అప్యాయంగా మాట్లాడినట్టే కనపడలేదు.... మొగుడితో బానే ఉంటుందేమో కాని, వాళ్ళత్త గారిని నిర్లక్ష్యం చేస్తున్నట్లనిపిస్తోంది..."' లలిత పరిశుభ్రత విషయంలో అతిగా ప్రవర్తించి వృద్ధురాలైన అత్తగారికి అసౌకర్యాన్ని కలిగించి ఆమెను తరచూ విసుక్కొంటూ, ఆమెపట్ల నిర్లక్ష్యంగా వ్యవహరిస్తోంది. ఈ కారణంగా అత్తగారు ఎంతో నిర్వేదానికి గురవుతోంది.

దీనిని బట్టి అత్తలందరూ చెడ్డవారని, కోడళ్ళందరూ మంచివారని లేక అత్తలందరూ ఉత్తములని, కోడళ్ళందరూ చెడ్డవారని నిర్ణయించకూడదని, అత్తాకోడళ్ళ మధ్య మానవ సంబంధాలు లోపించడానికి ఆయా వ్యక్తుల స్వభావాలే కారణమని రచయిత్రి ఈ కథలో నిరూపించారు.

కుటుంబసభ్యుల మధ్య ఉండవలసిన అనుబంధాలు చిన్న చిన్న కారణాల వలన పూర్తిగా దెబ్బతింటున్నాయి. సమాజంలోని ఈ పోకడ ఆందోళన కలిగిస్తోంది. భారతీయ సంస్కృతిలో ఎంతో ప్రాధాన్యాన్ని సంతరించుకున్న కుటుంబవ్యవస్థ చిన్నాభిన్నమై పోతోంది. ఈ దుస్థితికి బలమైన కారణాలేవీ లేకపోయినా పర్యవసానం మాత్రం ఎంతో తీవ్రంగా ఉంటోంది. ఈ వాస్తవాన్ని నాగలక్ష్మి '**ప్రశ్నార్థకం**' కథలో నిరూపించిన తీరు గమనించదగినది.

రామనాథం హృద్రోగి. తల్లిలేని తన కూతురు నీరజ సుఖాన్ని, భవిష్యత్తుని దృష్టిలో పెట్టుకొని ఆమెకు పెళ్లి చేస్తాడు. కాని రామనాథం ఆశించినట్టుగా కూతురి వైవాహిక జీవితం సాగలేదు. "**అపుడపుడు పుట్టింటికి వచ్చినా తన దిగులంతా కడుపులో దాచుకుని, నవ్వుతూ గడిపేసి వెళ్ళిపోయేది నీరజ, నీరసించిన ఆమె వదనం, కళాకాంతులూ లేని ఆమె కళ్ళూ ఆ సంసారపు తీరుని చెప్పక చెపుతూండేవి! ఎపుడైనా ఆమె సుఖంగా ఉందో లేదో నన్న అనుమానం రామనాథం వ్యక్తం చేసినా, చూలింత అనీ, బాలింత అనీ, చంటివాడి సంరక్షణలో అలసిపోతోందనీ జానకి సర్దిచెప్పేది!**" రోగగ్రస్తుడైన రామనాథం తన కూతురి సంసారజీవితం సుఖంగా సాగడం లేదేమోనన్న దిగులుతో మరణిస్తాడు. పొరుగింటి వారయిన సూరి, జానకిలు నీరజని ఆదరించి, ఆశ్రయమిచ్చి సొంత కూతురిలా చూసుకుంటారు.

విధిలేని పరిస్థితుల్లో నీరజ భర్తనుండి విడిపోయి కొడుకు అనిల్ తో విడిగా జీవిస్తుంది. సూరి జానకిల ప్రోత్సాహంతో కొడుకును ఎం.టెక్. వరకు చదివిస్తుంది. అనిల్ ఎం.టెక్. చదివే రోజుల్లో తోటి విద్యార్థినిని ప్రేమిస్తాడు. ఎన్నో కష్టనష్టాల కోర్చి, పెంచి, పెద్దచేసి, చదివించిన తన తల్లిని జాగ్రత్తగా చూసుకోవాలని అనిల్ తన ప్రేమికురాలితో పదే పదే చెబుతూ ఉంటాడు. ఈ మాటలు నచ్చని ఆమె అనిల్ ని తిరస్కరిస్తుంది. మనస్తాపానికి గురైన అనిల్ ఆత్మహత్య చేసుకుంటాడు. నేడు ఉన్నత విద్యావంతులుగా చలామణి అవుతున్న వారిలో పెద్దవారిని గౌరవించాలన్న భావం లేకపోవడం విచారకరం. ఈ విషయాన్ని అనిల్ ప్రేమికురాలు పాత్ర ద్వారా రచయిత్రి నిరూపించారు. వర్తమాన సమాజంలో మానవ సంబంధాలు ఏ విధంగా క్షీణిస్తున్నాయో రచయిత్రి ఈ కథలో వివరించారు. అలాగే కష్టపడి కని, పెంచి, విద్యాబుద్ధులు చెప్పించిన కన్నతల్లిని కూడా మరచిపోయి అనిల్ ఆత్మహత్య చేసుకోవడం తల్లీ కొడుకుల మధ్య ఉండవలసిన మానవ సంబంధాల లేమిని కూడా రచయిత్రి ఈ కథలో తెలియజేశారు.

నీరజ తన భర్త అనుచిత ప్రవర్తన కారణంగా విడిపోయింది. అంటే భార్యాభర్తల మధ్య సరైన సంబంధం లేదన్నమాట. అనిల్ తన తల్లిపై గల ప్రేమను తన ప్రేమికురాలికి చెప్పినప్పుడు ఆమె అతనిని అభినందించడానికి బదులు ఈసడిస్తుంది. అంటే ఆమెకు మానవతా విలువల పట్ల ఏ మాత్రం అవగాహన లేదన్నమాట. అయితే ఈ కథలో మనం గమనించవలసిన విషయం ఒకటుంది. నీరజ పుట్టింటి పొరుగు వారయిన సూరి దంపతులు కష్టకాలంలో ఉన్న నీరజను మానవతా దృష్టితో ఆదరించి ఆమెకు అండగా నిలబడటం కొసమెరుపు.

ప్రస్తుత సమాజంలో అన్ని రంగాలలోనూ వేగం పెరిగింది. క్షణం తీరిక లేని వేగం. ఏదో సాధించాలి, ఇంకేదో పొందాలి. ఎంతో సంపాదించాలి. ఇందుకోసం నిరంతరం ఒకటే పరుగు. నలుగురిలోనూ తనొక స్థాయిలో నిలబడాలనుకోవడం, తన పిల్లలను పెంచి, పెద్ద చదువులు చెప్పించి వారినొక ఉన్నత స్థితికి చేర్చాలనుకోవడం సహజం. దీనితోపాటు విలాసవంతమైన జీవితాన్ని గడపాలని అందుకవసరమైన ధనాన్ని పెద్ద మొత్తంలో సంపాదించాలని అనుకోవడం పరిపాటి. ప్రస్తుత సమాజాన్ని ఊపేస్తున్న సాఫ్ట్ వేర్ రంగంలో ధనార్జనే ప్రధానంగా ఉద్యోగులు తరచూ ఒక కంపెనీ నుండి మరొక కంపెనీకి మారుతుండటం మనం గమనిస్తూనే ఉన్నాం. ఇందుకు భిన్నంగా తనకవకాశమిచ్చి ప్రోత్సహిస్తున్న కంపెనీని విడిచి, డబ్బు మీద ఆశతో వేరొక కంపెనీలో చేరకుండా కృతజ్ఞతాభావంతో, మానవతా దృష్టితో అదే కంపెనీలో పని చేయాలన్న ఆదర్శాన్ని ప్రతిపాదిస్తూ '**సరళీ స్వరాలు**' అన్న కథను నాగలక్ష్మి రాశారు.

సురేష్ ఒక కంపెనీలో ఉద్యోగి. వేరే కంపెనీలో చేరితే ఎక్కువ డబ్బులు సంపాదించే అవకాశం ఉంది. ఈ విషయమై సురేష్ మనస్సులో కొంత తర్కించుకొని ఇలా నిర్ణయించుకుంటాడు. తనకు వస్తున్న ఆదాయం సంతృప్తిగానే ఉంది. పిల్లలు అంతర్జాతీయ స్థాయి

పాఠశాలలో చదువుతున్నారు. భార్యాపిల్లల్తో విలాసవంతమైన జీవితాన్ని గడపగల్గుతున్నాను. తన యజమాని మూర్తితో సత్సంబంధాలున్నాయి. అలాంటప్పుడు ఉన్న కంపెనీని వదిలేసి ఏదో ఆశతో ఎక్కడికో వెళ్ళడం అవివేకం అనుకొన్నాడు. సురేశ్ మానవతాదృష్టితో ఈ నిర్ణయానికి రావడానికి అతని తల్లి చేసిన ఈ క్రింది హితబోధే కారణం.

"బోల్డు డబ్బు సంపాదించి పిల్లల జీవితాలు తీర్చిదిద్దుదామనుకుంటున్నావు. ఈ సూపర్ ఫాస్ట్, ఈ మానసిక వైకల్యాల యుగంలో వాళ్లకి అవసరమైనది డబ్బు కాదు, మీ టైము! నీ సమయం వెచ్చించి డబ్బు సంపాదించి వాళ్లకివ్వడం కన్నా, నీ సమయాన్నే వాళ్లకిచ్చి, వాళ్లు మంచి వ్యక్తిత్వం ఏర్పరచుకుందుకు సాయం చెయ్యి..... జీవితంలో మెట్లెక్కడమే కాదు, దిగాల్సివచ్చినప్పుడు కుంగిపోకుండా దిగడమూ తెలియాలి. మంచి అలవాట్లు ఏర్పడేదాకా, సరైన వ్యక్తిత్వం సమకూర్చుకునే దాకా తల్లిదండ్రులు పిల్లలు వెంట ఉండాలి. చదువూ, తెలివీ ఉన్న భార్య, ముచ్చటగా ఇద్దరు పిల్లలు, అవసరాలకి సరిపడా డబ్బుంది. అయినా తృప్తి చెందక ఎండమావుల వెనుక పరుగెడుతున్నావేమో ఆలోచించుకో నాన్నా!"

మనిషికి ఆశ ఉండటం అవసరం. ఉండి తీరాలి కూడా, ఉద్యోగికీ, యజమానికీ మానవతా విలువలతో కూడిన మంచి అవగాహన ఉండాలి. యాజమాన్యం, ఉద్యోగులు పరస్పర ఆధారితాలు కాబట్టి ఒకరి భవిష్యత్తు కోసం మరొకరు సహకరించుకొంటూ, క్షణిక ప్రలోభాలకు లోనుకాకుండా ముందుకు సాగాలి.

ఒక తరానికి మరో తరానికి మధ్య లోపిస్తున్న అనుబంధాల తీరును వివరించే కథ '**మేఘన**'. సరోజ, నిరంజన్ లు భార్యాభర్తలు, ఇద్దరూ ఉద్యోగస్తులు. మేఘన వారి కూతురు. నిరంజన్ దంపతులు, అతని తల్లిదండ్రులు హైదరాబాద్ లోనే ఉంటున్నా ఎవరికి వారు వేరు ఉంటున్నారు. రెండు కుటుంబాల మధ్య ఉండవలసిన స్థాయిలో ప్రేమాభిమానాలు లేవు. ఏదో మొహమాటం కోసం అప్పుడప్పుడు పలకరింపులూ, పరామర్శలు. ఇలా ఉండగా కోడలు ఉద్యోగరీత్యా మూడు రోజులు వేరే ఊరు వెళ్ళవలసి వస్తుంది. అప్పుడు చిన్నపిల్ల అయిన 'మేఘన' ను ఎక్కడ ఉంచాలనేది సమస్య. సరోజ భర్త సలహా మేరకు అత్తమామలకు ఫోన్ చేసి తన కూతురిని వారి దగ్గర ఉంచడానికి అతికష్టం మీద వారిని ఒప్పిస్తుంది. సరోజ అత్తమామలు ఆ మూడు రోజులు మనవరాలితో పట్టీ పట్టనట్లు వ్యవహరిస్తారు. పరాయి పిల్లలా చూస్తారు.

మేఘన తల్లి రెండురోజుల తర్వాత మామగారికి ఫోన్ చేసి తన కూతురి యోగ క్షేమాలు అడుగుతుంది. అందుకు ఆయన ఈ విధంగా సమాధానం చెప్తాడు.

**"ఎప్పుడు తెల్లవారుతుందా అని చూస్తున్నామమ్మా! ఈ రెండు రోజుల్లో నీ కూతురు రెండు పుస్తకాలు చింపింది. నా పెన్ను ఏకీలుకాకీలు ఊడపీకి పెట్టింది. మీ అత్తగారికి చిన్న పిల్లలతో అలవాటు పోయి ముప్పయ్యేళ్ళయింది! నీ కాంప్ ఎప్పుడైపోతుందా, ఎప్పుడు తిరిగొస్తావా అని చూస్తున్నాం అదీ, నేనూ కూడా, అన్నారు మామగారు ఫోన్ తీయగానే ఏకబిగిన."**

ఈ విధమైన పెద్దల ప్రవర్తన పిల్లలలో అసహనాన్ని కలిగిస్తుంది. ప్రేమానుబంధాల స్థానంలో ఆ పసి మనస్సుల్లో ద్వేషం, నిర్లక్ష్యభావన నెలకొంటాయి. ఉత్తరోత్తర పిల్లల ప్రవర్తనపై వీటి ప్రభావం తీవ్రంగా ఉండే అవకాశం ఉంది. తరాల అంతరం అని సరిపెట్టుకోకుండా మంచి చెడూ తెలిసే విధంగా, వారి మనస్సులలో ప్రేమానుబంధాలు నెలకొనే విధంగా, పరిసరాల ప్రభావానికి లోనుకాకుండా జాగ్రత్తగా పెంచాలి. ఇదే ఈ కథ సందేశం.

ఈ విధంగా నాగలక్ష్మి కథలన్నింటిలోనూ మానవతా విలువలు, లోపిస్తున్న మానవ సంబంధాలు, వాటి వలన కలిగే దుష్పరిణామాలు ప్రస్తావించడం కనిపిస్తుంది. ప్రస్తుత సమాజంలో మానవ సంబంధాలు క్షీణించడం పెద్ద సమస్యగా మారి మేధావులను కలవరపెడుతున్నాయి. సాంకేతిక పరిజ్ఞానం దినదినాభివృద్ధి చెందుతుంది. దురదృష్టకరమైన విషయం ఏమంటే మానవ సంబంధాలు మాత్రం క్షీణించిపోతున్నాయి. రచయిత్రి సమాజంలో నానాటికీ లుప్తమౌతున్న మానవ సంబంధాలను తన కథలలో వివరిస్తూ, వాటి

ఆవశ్యకతను గుర్తించి పునరుద్ధరించుకోవలసిన అవసరం నేటి సమాజానికి ఎంతైనా ఉందని సోదాహరణంగా చెప్పారు. నాగలక్ష్మి కథలు ఆలోచింపజేసేవిగానూ, సామాజిక విలువలను పెంపొందించేవిగానూ ఉండటం విశేషం. రచయిత్రి తన జీవితంలో తారసపడ్డ వాస్తవ సంఘటనలనే కథలుగా మలచారేమోననిపిస్తుంది. ఏది ఏమైనా మానవతా విలువలకు, మానవ సంబంధాలకు ప్రాధాన్యమిచ్చి కథలు రాసిన **'వారణాసి నాగలక్ష్మి'** అభినందనీయురాలు. నాగలక్ష్మి కథలు పాఠకులను ఆలోచింపజేసి వారిని చైతన్యపరచగలవనడంలో ఎలాంటి సందేహం లేదు.

**ఉపయుక్త గ్రంథసూచి :**


1. వాన చినుకులు - లలిత గీత మాలిక వారణాసి నాగలక్ష్మి వారణాసి పబ్లికేషన్స్, 2003 సం||
2. ఆలంబన - కథా సంపుటి వారణాసి నాగలక్ష్మి వారణాసి పబ్లికేషన్స్, 2005 సం||
3. ఆసరా - కథా సంపుటి వారణాసి నాగలక్ష్మి వారణాసి పబ్లికేషన్స్, 2010 సం||
4. ఊర్వశి - నృత్య నాటిక వారణాసి నాగలక్ష్మి వారణాసి పబ్లికేషన్స్, 2014 సం||
5. వేకువ పాట - కథా సంపుటి వారణాసి నాగలక్ష్మి వారణాసి పబ్లికేషన్స్, 2015 సం||
6. మళ్లీ మనిషిగా - కథా సంపుటి వారణాసి నాగలక్ష్మి వారణాసి పబ్లికేషన్స్, 2024 సం||


*******

# 70. ఎల్లి నవల - సామాజిక స్పృహ

**డా. యు. ఝాన్సీ,**

తెలుగు మెంటార్,

రాజీవ్ గాంధీ వైజ్ఞానిక సాంకేతిక విశ్వవిద్యాలయం,

నూజివీడు, కృష్ణా జిల్లా, పిన్ : 521002

ఇ మెయిల్ : Jhansi.hcu@gmail.com

సంచారవాణి: 8096 405070.

స్వాతంత్ర్యానంతరం వచ్చిన నవలల్లో ఎల్లినవల ఒకటి. అరుణ రాసిన 'ఎల్లి' నవల ప్రధానంగా ఎరుకల జీవితానికి సంబంధించింది. ఎరుకల జీవన విధానం, వారి ఆచార వ్యవహారాలు, ట్టుబాట్లు, విశ్వాసాలు.. ఒక్క మాటలో చెప్పాలంటే ఎరుకల సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక జీవిత చిత్రణే 'ఎల్లి' నవలఈ నవల రెండు భాగాలుగా వెలువడింది. మొదటిభాగం 1992లో, రెండవ భాగం 1996లో వెలువడింది. ఈ నవలల్లో సామాజిక స్పృహ చాలా ఎక్కువగా కనిపిస్తుంది. అంతవరకు సాహిత్యానికి దూరంగా జీవిస్తున్న వారిని సాహిత్యంలో భాగం చేయడం గమనించదగ్గ అంశం.

ప్రధాన పాత్రలు :

ఎల్లి, ఎంకన్న-దురగ (ఎల్లి తల్లిదండ్రులు), పారోతి-బిచ్చాలు (ఎల్లి పిన్ని-చిన్నాన), మాలచ్చిమి (ఎల్లి నాయనమ్మ), నీలి, దువ్వ, జీవాలు, కత్రేణి, నెలబాలుడు మొదలైనవారు.

ఎల్లి నవల-వస్తువు :

ఎల్లి నవలలో వస్తువు కృష్ణా జిల్లాలో వన్నేటొడ్డున పందులు మేపుకుని బ్రతికే ఎరుకల కుటుంబాల గాథ. వారు ఆధునిక సమాజంలో ఉంటూ కూడా ఇంకా 'ఆహార సేకరణే' వారి జీవిత పరమావధిగా బ్రతకడం, వారి వెనుకబాటుతనం మొదలైన విషయాలు పాఠకుడిని ఆలోచింపజేస్తాయి.

ప్రధాన కథ :

ఈ నవలలో 'ఎల్లి' ప్రధాన పాత్ర. ఎల్లి ఎంకన్న దురగల కూతురు. ఆటపాటల్లో సాగిపోతున్న ఎల్లి బాల్యానికి ఫుల్‌స్టాప్ పెట్టి 12 సంవత్సరంలోనే తండ్రి ఆమెకు పెళ్ళి చేస్తాడు. పెళ్ళినాటికి ఎల్లి ఇంకా ఈడేరనందువల్ల రెండు సంవత్సరాలు పుట్టింట్లో ఉంచి, తరువాత అత్తారింటికి పంపుతారు.పుట్టింట్లో నుండి అత్తింట్లోకి అడుగుపెట్టిన దగ్గర నుండి ఎల్లికి కష్టాలు ప్రారంభమవుతాయి. ఎల్లి భర్త 'తిమ్మయ్య'. ఆయన తిరుగుబోతు, త్రాగుబోతు. అత్త మామలుపిసినారులు. ప్రతి చిన్న విషయం కూడా కొడుకుతో చెప్పి, ఎల్లిని కొట్టించేవారు. ఒకరోజు ఎల్లి చెట్టుమీది చిగురు కోస్తుండగా, ఎల్లి చిన్ననాటి స్నేహితుడైన 'దువ్వ' అటువైపు వచ్చి ఎల్లి కష్టసుఖాలు తెలుసుకొని చాలా బాధపడతాడు. కొన్ని సమయాల్లో దువ్వ, జీవాలు ఇచ్చే ధైర్యం, పంచే ప్రేమతో ఎల్లి తన కష్టం మరిచిపోయేది. ఒకసారి ఎల్లి తిమ్మయ్యతో కలిసి చేపలు పట్టడంలో సహాయం చెయ్యడానికి వెళ్తుంది. తిమ్మయ్య పట్టిన చేపను కాలువలోకి జారవిడిచిందని ఉగ్రుడై ఎల్లిని చావబాదుతుంటాడు. ఆ సమయంలో జీవాలు అక్కడికి వచ్చి ఎల్లిని భర్త చేతిలో నుండి విడిపించి, ఇంటికితీసుకువెళ్తాడు. పుట్టింటికి వచ్చిన ఎల్లి, తిరిగి అత్తింటికి వెళ్ళడానికి ఇష్టపడదు. మరసటి ఉదయం ఎల్లి మామ వచ్చి ఎల్లి చెప్పకుండా వచ్చేసిందని చెప్పి చెయ్యరాని తప్పు చేసినట్లు మాట్లాడతాడు. వారి మధ్య మాట మాట పెరిగి చివరికి 'పంచాయితీ'కి దారి

తీస్తుంది. ఎల్లి చేసిన తప్పుకి బూసియ్య తన వోలి తనకు కట్టమని, తిరిగి తన కొడుక్కి పెళ్ళి చేస్తానని మొండిపట్టు పడతాడు. ఎన్ని పంచాయితీలు జరిగినా, గొడవ ఒక కొలిక్కి రాదు. ఈ పంచాయితీల వల్ల ఇరుపక్షాల వారు ఆర్థికంగా బాగా దెబ్బతింటారు. ఎల్లి మామ (బూసియ్య) ఇక చేసేదిలేక తన వోలిలో సగం కట్టమని, లేదా ఎల్లిని తిరిగి పంపించమని అడుగుతాడు. వోలి తిరిగి చెల్లించలేని ఎంకన్న, తన కూతురిని అత్తవారింటికి పంపడం ఈ నవలలోని కథ.

ఎరుకల ఆర్థిక, సాంఘిక, రాజకీయ స్థితిగతులు :

1. ఆర్థిక స్థితి :

నవల ప్రథమాంకంలోనే రచయిత్రి వారి యొక్క ఆర్థిక స్థితిని కళ్ళకు కట్టినట్లు చూపించారు.ఎంకన్న గుడిసెను వివరిస్తూ ”పైన తాటాకులు ఎండకు ఎండి వానకి తడిసి వుగిలిపోయి నట్టున్నాయ్. పొగబారిన వాసాలు పుచ్చి, బెజ్జాలు పడి పొడి రాలుతోంది. వొక మూల తుప్పు పట్టిన ట్రంకు పెట్టె. దాని మీద లుంగచుట్టి పడేసిన గుడ్డలు. కాలిరిగిన చెక్కపెట్టె. దాని పక్కగా యెలిక తవ్విన కలుగు. అలకటం చేతకాని వాళ్ళు అలికినట్టున్న ఆ నేలమీదే పిల్లలు చాపేసుకుని అడ్డదిడ్డంగా పడుకున్నారు. ఆ చాప మీదే మాలచ్చిమి లేచి కూచుని ఉంది. అక్కడే వోరగా కూచున్న ఎంకన్న చుట్ట తాగుతున్నాడు.” (ఎల్లి-5 పేజీ)

ఈ ఒక్క పేర ఎరుకల ఆర్థిక స్థితికి నిదర్శనం అని చెప్పవచ్చు. సాధారణంగా ఎరుకల ఆహారంలో భాగమైన ‘పులినీళ్ళు’ (గంజి) గురించి రచయిత్రి వివరిస్తూ ... ఎల్లి తన చెల్లిని, తమ్ముడిని పులినీళ్ళు తాగడానికి పిలిచి, గిన్నెలో పోసి ఇస్తుంది. ఆ గంజి చూసి తమ్ముడు ‘కూసిని మెతుకులు కూడా లేవు. గంజి కూడా చిక్కగా లేదు. వుత్త నీళ్ళే” అని గొణుక్కుంటాడు. సర్వసాధారణంగా కుటుంబంలో ఉండే ఆర్థిక లేమి పిల్లలకు అంతగా తెలియదు. అయితే పై సందర్భంలో చిన్నపిల్లవాడు ఆ పులినీళ్ళ విషయంలో అక్కను ప్రశ్నించినట్లున్న తీరును బట్టి వారు ఎంతటి దుర్భర దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నారో తెలుస్తోంది. ఆకలితో అరుస్తున్న పందుల్ని చూసేటప్పటికి ‘ఎంకన్నకి కడుపులో కెలికినట్టయ్యింది”... అంటూ రచయిత్రి వివరిస్తారు. దాన్ని బట్టి మనుష్యులే కాదు పందులు కూడా ఆకలితో అలమటిస్తున్నట్లు అర్థమౌతోంది.

2. రాజనీతి :

ఎరుకలకు కూడా ఒక కట్టు బాటు ఉంది. అదేమిటంటే కులపెద్దలతో కూడిన ‘పంచాయితీ’. వాళ్ళు ఏది చెబితే అదే చట్టం. వాళ్ళ మాటే వేదంగా అందరూ పాటిస్తారు. ఏదైనా తగాద ఏర్పడితే పెద్దమనుషులే తీర్పు చెప్తారు. ఆ పెద్ద మనుష్యుల ఖర్చంతా అంటే కల్లుపోయించడం, భోజనాలు, చుట్టలు మొదలైనవన్నీ ఇరు వర్గాలవారు, వారివారి కులపెద్దల ఖర్చు భరించాలి. కొన్ని సందర్భాల్లో ఇరువర్గాల పెద్దలతో ఇద్దరు ముగ్గురు లాలూచీపడి, తగాదాను ఒక కొలిక్కి రానివ్వకుండా, కాలం సాగదీస్తూ లబ్ధిపొందే కుతంత్రం కూడా ఉంది.

ఎరుకల పంచాయితీని ధిక్కరించినవారిని వెలివేసే సంప్రదాయం కూడా ఉంది. అంతేకాక వెలివేసిన వారికి, ఎవరైనా సహాయ సహకారాలు అందిస్తే వారిని కూడా వెలివేస్తారు.

3. వివాహ వ్యవస్థ :

ఎరుకల వివాహ వ్యవస్థ మిగతా కులాల వివాహ వ్యవస్థకంటే భిన్నంగా ఉంటుంది. ఎరుకల కులంలో ‘ఓలి’ సంప్రదాయం ఉంది. ఓలి అంటే దాదాపు ‘కన్యాశుల్కం’ వంటిది అని చెప్పవచ్చు. అయితే ఓలికి, కన్యాశుల్కానికి మధ్య కొంత భేదం ఉంది. ఓలి తీసుకుని, పెళ్ళి చేసే తండ్రి లేదా అమ్ముకునే భర్త ఏదైనా కారణాలవల్ల అమ్మాయిని లేదా భార్యను తిరిగి తెచ్చేసుకోవాలనుకుంటే, ఆ వోలి తిరిగి చెల్లించి (అంటే ఎదుటి వ్యక్తి దగ్గర ఎంత ఓలి అయితే తీసుకుంటే అంత వోలి) తెచ్చుకోవచ్చు.

ఈ నవలలో వోలికి ఆశపడిన భర్తలు తమ భార్యలను అమ్ముకున్న సందర్భాలు ఎన్నో ఉన్నాయి. మాలచ్చిమి, పారోతి దీనికి

నిదర్శనాలు. ఒక సందర్భంలో మాలచ్చిమి "యేంబతుకురా నా బతుకు. పెంచుకున్నోడు అమ్ముకున్నాడు. కట్టుకున్నోడు అమ్ముకున్నాడు"... అని అంటుంది.

ఈ సందర్భాన్ని గమనించినట్టయితే స్త్రీని ఒక అంగడి వస్తువుగా ఆ సమాజం భావిస్తోందని తెలుస్తోంది.

ఎరుకల వివాహ వ్యవస్థలో బాల్య వివాహాలు ఉన్నాయి. 12 సంవత్సరాలు కూడా నిండకముందే, స్త్రీగా పుట్టినందుకు గృహిణిగా బాధ్యతలు మోయవలసి వస్తుంది. అప్పుడప్పుడే బాల్య ఛాయలు వీడుతున్న సమయంలో వివాహాలు చెయ్యడం వల్ల వారికి అనేక రకాలైన ఆరోగ్య సమస్యలు తలెత్తడంలో ఆశ్చర్యపోవలసింది ఏమీ లేదు. అంతేకాక సంతానం పట్ల అవగాహన లేనందువల్ల ఎక్కువ మంది పిల్లలను కని, అటు ఆర్థిక, ఇటు ఆరోగ్య లేమితో కొట్టుమిట్టాడడం సర్వసాధారణం.

3. సాంఘిక జీవనం :

ఎరుకలు ఎక్కడ జీవించినప్పటికి ఒంటరిగా జీవించరు. గుంపుగా జీవించడం వారి లక్షణం. సాధారణంగా ఒక గుంపులో 20 లేదా 30 కంటే ఎక్కువ కుటుంబాలు ఉండవు.ఉదయం లేవగానే పులినీళ్ళు తాగడం, పందులను మేపడానికి తోలుకువెళ్ళడం, పందులను మేపుతూ కట్టెలు ఏరుకోవడం, చింత చిగురు కోయడం, కాలువల్లో చేపలు పట్టడం, బుట్టలల్లి అమ్ముకోవడం. ఇదే వారి జీవన విధానం. ఎన్నో యేళ్ళుగా వారు నాగరిక సమాజంలోజీవిస్తున్నప్పటికి వారి జీవలక్షణాల్ని మార్చుకోకుండా, వారి ప్రత్యేకతను కాపాడుకుంటూ అంటే ఆచారాలు, సంస్కృతిని కాపాడుకుంటూ జీవించడం గమనించదగ్గ అంశం. అంతేకాక వారి భాషను కూడా వారు కాపాడుకోవడం మరో విశేషం.

4. ఎరుకలపై ఉన్నత వర్గాల దౌర్జన్యం :

మానవ సమాజం దొంతర్ల సమాజం గనుక అట్టడుగున ఉన్నవారిని పై స్థాయిలో ఉన్నవారు ఎప్పుడూ దోచుకుంటూనే ఉంటారు. సమాజంలో జరుగుతున్న ఈ దోపిడీ, ఎరుకల జీవితాల్లో ఎలా జరుగుతుందో ఎల్లి నవలలో అరుణ చక్కగా చిత్రించారు. మచ్చుకు కొన్ని:

4.1 జాజి కథ :

జాజి సుబ్బన్న, మాలచ్చిమిల కూతురు. జాజికి పెళ్ళి కుదురుతుంది. ఒకరోజు చిగురు కోసం వెళ్ళిన జాజిని ఉన్నత కులానికి చెందిన కుర్రోళ్ళు సామూహికంగా అత్యాచారం చేస్తారు. అప్పటి నుండి జాజి మగవాళ్ళంటే భయపడిపోయేది. పెళ్ళయిన తరువాత భర్తను కూడా దగ్గరకు రానిచ్చేది కాదు. చివరికి భర్త వదిలేస్తాడు. క్రమక్రమంగా జాజి మానసిక స్థిమితాన్ని కోల్పోతూ వస్తుంది. ఒకరోజు తన జీవితాన్ని నాశనం చేసిన వాళ్ళు కూర్చొని పేకాట ఆడుకుంటుంటారు. జాజి వాళ్ళ దగ్గరకు వెళ్ళి, వారిలో ఒకడిపై కాండ్రించి ఉమ్మేస్తుంది. వాడికి కోపం వచ్చి జాజిని రక్తం వచ్చేటట్టు కొడతాడు. అప్పటినుండి జాజి పూర్తిగా పిచ్చిదై, చివరికి కాలువలో పడి మరణిస్తుంది. ఈ విధంగా ఉన్నత వర్గం వారు జాజి జీవితాన్ని బుగ్గిపాలు చేస్తారు.

4.2 దువ్వ :

ఒకరోజు ఎల్లి చెల్లి 'సీత' పుల్లలేరడానికి వెళ్ళి ఆసామి తోటలో కంపలేస్తుంది. అది చూసిన ఆసామి సీతను పాలేరుతో బాగా కొట్టిస్తాడు. అటుగా వచ్చిన 'దువ్వ' ఆ పాలేరును కొడతాడు. తనముందు తన పాలేరును కొట్టడం అవమానంగా భావించిన ఆసామి దువ్వను దెబ్బతీయడానికి అవకాశం కోసం కనిపెట్టసాగాడు. ఒరోజు దువ్వ చెరుకుతోటలగుండా వస్తుండగా ఆసామి దువ్వను కాళ్ళు చేతులు విరిగేటట్లుకొట్టిస్తాడు.

4.3 సుబ్బన్న :

ఒకసారి సుబ్బన్న పంది ఆసామి తోటలోకి వెళ్ళిందని, సుబ్బన్న కాలు నరికించేస్తాడు. ఆసామి దృష్టిలో ఒక చెట్టుకి ఉన్న విలువకూడా మనిషి ప్రాణానికి లేదని దీనిని బట్టి తెలుస్తోంది.

ఈ విధంగా ఎరుకల జీవితాలు ఉన్నత వర్గాల జీవితాల్లో ఛిద్రమైపోతున్నాయి. ఎరుకలకు చైతన్యం లేకపోవడం వల్ల వారు తమ సమస్యలకు పరిష్కారాలు కనుక్కోలేక తరతరాలుగా ఉక్కు సంకెళ్ళలో నలిగిపోతున్నారు.

5. ఎల్లి – స్త్రీ జీవితం :

'ఎల్లి' నవలలో అరుణ ఎరుకల 'స్త్రీ' జీవితాన్ని కళ్ళకు కట్టినట్లు చిత్రించారు. స్త్రీ జీవితాన్ని బాల్యం, యౌవనం, వృద్ధాప్యం అనే మూడు దశల్లో వివరించినప్పుడే వారి స్థితిని మనం సరిగా అర్థం చేసుకోవచ్చు.

5. 1. ఎరుకల స్త్రీ – బాల్యం :

బాల్యం అనేది ప్రతి మనిషికి దైవమిచ్చిన వరం అని భావిస్తాం. అంతేకాక బాల్యం తియ్యని జ్ఞాపకాల నిధి. అయితే ఎరుకల స్త్రీ బాల్యం చేదు అనుభవాల, సంఘటనల కూర్పే, బాల్యం నుండి కూడా ఆర్థిక లేమి, ఆకలిదప్పులు, అనారోగ్యం వెంటాడు తుంటాయి. ఈ నవలలో ఎల్లి, తన తమ్ముడు, చెల్లి దారిద్ర్యం అనే రాక్షసి చేతుల్లో నలిగిపోయారు. తాగడానికి కనీసం చిక్కటి గంజి అయినా లేని పరిస్థితి. చెల్లికి మూర్ఛరోగం. వీరిద్దరు ఎరుకల బాల్యానికి ప్రతీకగా చెప్పవచ్చు.

ఆడే పాడే వయసులోనే తల్లి పాత్ర వహించే దయనీయ స్థితి వీరిది. ఎల్లియే దీనికి ఉదాహరణ. ఎల్లి, తల్లి చనిపోయిన తరువాత ఆమె, మిగిలిన పిల్లలకు తల్లిగా మారుతుంది.

ఎల్లి నవల కవర్‌పేజి చూస్తే ఈ విషయం అర్థమౌతుంది. తల్లి దండ్రులు తమ పిల్లల్ని ఇంటిదగ్గర వదిలేసి, ఆహార సేకరణకని వెళ్ళిపోతే, ఇంటిదగ్గర ఉండే పదిపన్నెండు సంవత్సరాల పిల్లలు వారికి తల్లులుగా మారిపోతారు. ఆడుకోవాల్సిన వయసులో మరొకరిని ఆడించి, వారి ఆలన, పాలనా, చూసుకోవలసిన స్థితి ఏర్పడుతుంది.

బాల్యవివాహాలు చెయ్యడం వల్ల అటు కన్నవారి ప్రేమకు, అవగాహన లేని దాంపత్యం వల్ల కట్టుకున్నవాడి ప్రేమకు ఆమడ దూరాన ఉండి, ప్రేమరాహిత్య జీవితాన్ని వెళ్ళదీస్తున్నారు.

5. 2. వివాహ జీవితం :

స్త్రీ అన్ని దశల్లోకంటే వివాహ దశ లేదా వివాహ జీవితంలో ఎక్కువ కష్టాలు అనుభవిస్తుంది. భర పోరు, అత్తమామల ఆరళ్ళు, మరుదుల మోసాలు అన్ని భరించాలి. ఈ నవలలో కత్రేణి, పారోతి, నీలి, మాలచ్చిమి జీవితాలే సాక్ష్యం.

అ) కత్రేణి జీవితం :

కత్రేణి 'సిలారు'ను ఇష్టపడి, అతనితో వెళ్ళిపోతుంది. కులాంతర వివాహం గనుక ఇరుకులస్థులు వారిని వెలేస్తారు. ఇద్దరు పిల్లలు పుట్టాక సిలారు కత్రేణిని విడిచి వెళ్ళిపోతానని అంటూ ఉండేవాడు. కత్రేణి ఏడ్చి, ఏదోలా ప్రయత్నించి అతన్ని వెళ్ళనివ్వకుండా చేస్తుంది. పూర్తిగా భార్య కష్టం మీదే బ్రతికే మనస్తత్వం సిలారుది. అయినా కత్రేణి మౌనంగా బ్రతుకుబండిని లాగుతుంది. తన కూతురు ఎవరితోనో లేచిపోయిందని తెలిసిన తరువాత సిలారు ఆత్మహత్య చేసుకుంటాడు. భర్త పిరికితనాన్ని గూర్చి కత్రేణి చెప్తూ "పిరికినా కొడుకు. యెప్పుడన్నా నీకు ఇది కావాలా అని గాని తిన్నావాన అని గాని ఆ పిల్లని అడిగిన తండ్రేనా ఆడు. ఆడబిడ్డ కోసం జచ్చాడని లోకం అనుకోవాలని సచ్చాడు. లోకం అనుకుందా. అనుకోలా. శవం మీద కూడా వూసింది. యింత పిరికినా కొడుకులు ఎందుకు పుడతారు. యిన్నాళ్ళు అనుకోలా నేను. యిప్పుడనుకుంటున్నా. వీడినా నేను నమ్ముకొని వచ్చింది. నేనన్నానా బిడ్డలన్నా కొంచెమైనా బెమతలేకపోయిందే యీ మాత్రం బతుకు బతకడానికి మొగుడే గావాలా. బజాట్టోనుంచుని జూ అంటే రావూ కుక్కలు' (పేజీ 208) అని అంటుంది.

ఈ మాటల్లో ఆమె వేదన, అక్కసు అన్ని వ్యక్తమౌతున్నాయి. ఒకడిని నమ్మి వెళ్ళినందుకు ఎంతగా హింస పొందిందో అర్థ మౌతుంది. అంతేకాక తల్లిదండ్రులకు తెలియకుండా పారిపోవడం లేదా లేచిపోవడంలో ఉన్న డొల్లును, తరువాత స్త్రీ అనుభవించే కష్టనష్టాలను

కత్రేణి పాత్ర ద్వారా రచయిత్రి వివరించారు.

అంతేకాక 'జీవితం' ఎంత గొప్పది అనే విషయాన్ని కత్రేణి పాత్ర ద్వారా రచయిత్రి వివరించారు. కష్టాల్లో సొమ్మసిల్లిపోవద్దని స్త్రీలకు సందేశమిచ్చారు.

(అ) నీలి జీవితం :

ఎల్లి నవలలో నీలి కథ ఒక ఉపకథ. వివాహ జీవితంలో ఓడిపోయినా, ధైర్యంగా నిలబడి, జీవితాన్ని తిరిగి ఆనందమయంగా చేసుకున్న స్త్రీ నీలి. నీలికి పెళ్ళవుతుంది. భర్త నక్కోరోడు (నపుంసకుడు). ఇది తెలిసిన నీలి నా కర్మ అనుకుని మౌనంగా భరిస్తుంది. ఒక రోజు నీలి మరిది, ఆమె చెయ్యి పట్టుకుంటాడు. దాంతో నీలి పెద్ద గొడవ చేస్తుంది. ఆ తర్వాత నీలి భర్త రైలు కింద పడి ఆత్మహత్య చేసుకుంటాడు. నీలి మామ నీలిని తీసుకొచ్చి, పుట్టింట్లో అప్పగించి వెళ్ళిపోతాడు.

నీలి, ఆమె తల్లి కోమలి ఏదోలా కాలం వెజునీజుబుచ్చు తుంటారు. నీలికి దువ్వ మీద ఇష్టం కలుగుతుంది. దువ్వ హాస్పిటల్‌లో ఉన్నప్పుడు నీలి దగ్గరుండి అన్నీ చూసుకుంటుంది. దువ్వ కోలుకున్న తరువాత నీలి, దువ్వ వేరే చోట కలిసి ఉండడం ప్రారంభించారు. నీలి మామ, తమ వోలి తనకు కట్టమని పంచాయితీ పెడతాడు. అప్పుడు నీలి లేచి "యిక్కడ మొలతాడు గట్టిన మొగోళ్ళందరికి ఒక దణ్ణం మీ పంచాయితీకో దణ్ణం. థూ మీరు మగోళ్ళ, సారానీళ్ళకీ చీకు ముక్కలకి చొంగలు కార్చుకునే నా కొడుకులు పంచాయితీ జేత్తారు. యెవడి మీద మీ పంచాయితీ. ఆ సంగడి కొడుక్కి నేను ఏ వొక్కరోజు సంసారం చెయ్యల. నేను ఆడి కోడలినే కాదు. ఆ గుడిసెకి నాకు యేం సమ్మందం లేదు. ఆడు కొన్న వోలి కంటే ఎక్కువే సేసా" అని చెప్పి దువ్వ, నీలి ఆ పంచాయితీ నుండి వెళ్ళిపోతారు. పంచాయితీలో ఉన్న లొల్లినంతటిని తన మాటల ద్వారా వ్యక్తం చేసిన స్త్రీ నీలి.

3. వృద్ధాప్యం :

వృద్ధాప్యంలో ఒక ఎరుకల స్త్రీ ఎంత దయనీయ స్థితి అనుభవిస్తుంది అనడానికి మాలచ్చిమి నిదర్శనం. మాలచ్చిమి మూడు తరాలకు ప్రతినిధిగా నిలబడింది. మాలచ్చిమి కూతురు 'జాజి', కొడుకు 'ఎంకన్న', ఎంకన్న కూతురు 'ఎల్లి'.

మాలచ్చిమి తన జీవితాన్ని గురించి నెలబాలుడితో చెప్తూ మొదటి భర్త ఆమెను అమ్మేసిన సన్నివేశాన్ని గుర్తు చేసుకుంటూ "గొడ్డులా మెడకి పొలుపేసి లాకొత్తంటే ఆళ్ళు అమ్మా అయ్యా అని కుచ్చిళ్ళలో మొహం దాచుకుని గగ్గోలుగా ఏడవడం యెట్టా మరుత్తా అని వొరే చాలా యెందుకురా నేనప్పుడే సావలేదు. నీ గుక్కెడి ప్రాణం యెందుకు బోలా. యెందుకు యింకా యెముకలరగ దీసుకుంటూ బతకుతున్నా. యేం బతుకురా నా బతుకు. బిడ్డ జచ్చింది కళ్ళ ముందే. వున్నోడు ముద్దెయ్యడు. బిచ్చపు బతుకు బతుకుతున్నా యేంగావాలని బతుకుతున్నా. యేం పొందాను నేను. యెప్పుడూ లోపల యెవరో నన్ను వాటేసుకుని యేడుస్తున్నట్టే వుంటుంది. నాలోపలంతా యేడుపే. నాకు బతకాలని లేదురా బాలా. నాకు సచ్చిపోవాలని వుందిరా. యెవరన్నా నా పీక నొక్కేస్తే యెంత బావుండును".

**ముగింపు :**

ఇంత వరకు తెలుగు సాహిత్యంలో వచ్చిన నవలల్లో అట్టడుగున ఉన్న స్త్రీల జీవితాన్ని చిత్రించిన నవలలు అరుదు. ఉన్న నవలల్లో ఎరుకల జీవితాన్ని చిత్రించిన ఎల్లి నవల ఉన్నతమైంది. ఈ నవలలో ఎలాంటి చైతన్యం లేకుండా, 'స్తబ్ధంగా ఉన్న జీవితాలను చాలా పదునైన భావజాలంతో అరుణ వ్యక్తం చేశారు. ఎరుకలు తాము ఒక ప్రత్యేక సమాజం అని అనుకుంటూ వాళ్ళంతట వాళ్ళే జీవించినంత కాలం వాళ్ళ జీవితాలు మారి, వాళ్ళలో చైతన్యం రావడం అన్నది కొంత కష్టతరమైనదే. అయితే వాళ్ళు ప్రధాన జీవన స్రవంతిలో కలిసినపుడే వారి అభివృద్ధి సాధ్యం అవుతుందని చెప్పవచ్చు.

********

# 71. సాహిత్య పాఠ్యాంశాల ఎంపిక-బోధనలో సామాజిక స్పృహ

**డా. టి. జాన్ కిరణ్ బాబు,**

అకాడెమిక్ ఆఫీసర్,

కళాశాల విద్య కమీషనరువారి కార్యాలయం,

మంగళగిరి, గుంటూరు జిల్లా , ఆంధ్రప్రదేశ్.

9440382140

johnkiranbabut@gmail.com

---

**కీలక పదాలు :** సాహిత్య పాఠ్యాంశాలు – నిర్ణాయక సంఘం – బోధన – జాతీయ నూతన విద్యావిధానం (NEP) – ఫలితాధారిత విద్య (Outcome Based Education) – లక్ష్యిత సమూహం (Target Group)

**పత్ర సంగ్రహం:** సమాజ సాహిత్యాలు పరస్పర ప్రభావితాలు అయినప్పుడు, సమాజంలో గల విభిన్న కోణాల్ని ఆవిష్కరించే సాహిత్యాన్ని పాఠ్యాంశాలుగా ఎంపికచేసే – నిర్ణయించే - బోధించే క్రమంలో భవిష్యత్తు సమాజాన్ని శాసించే, నడిపించే విద్యార్థులపై అవి చూపే ప్రభావానికి సంబంధించిన దృష్టి, సంబంధిత విద్యావేత్తలు కలిగిఉండవలసిన స్పృహపై కొన్ని మౌలిక భావనలను ఈ పత్రంలో చర్చించడమైనది. జాతీయ నూతన విద్యా విధానంలో తలమానికంగా నొక్కివక్కాణింపబడే ఫలితాధారిత విద్య (Outcome Based Education)నేపథ్యంలో నిర్ణయింపడిన పాఠ్యాంశాల అధ్యయన ఫలితాలపై దృష్టి సారించవలసిన ఆవశ్యకతపై కొన్ని సూచనలు.

*****

సమాజ సాహిత్యాల పరిధి ఎంతో విస్తృతమైనది. వీటి మధ్య గల అవినాభావ సంబంధం విడదీయలేనిది. సమాజం సాహిత్యంలో ప్రతిఫలిస్తుంది. సాహిత్యం సమాజాన్ని ప్రభావితం చేస్తుంది. ఈ రెండూ ఒకదానిపై మరొకటి అజమాయిషీ చేయనంత వరకు పరస్పరం ఆరోగ్యకరమైన సత్ఫలితాలనిస్తాయన్నది చారిత్రక సత్యం. అయితే సాహిత్యం సమాజాన్ని శాసిస్తున్నదని, సమాజం సాహిత్యంపై పెత్తనం చేస్తున్నదన్న ఆరోపణలు అడపా దడపా వినిపిస్తూనే ఉన్నాయి. (సమాజము – సాహిత్యము: 4) ఈ నేపథ్యం నుండి పరిశీలిస్తే రచయిత పరిధి కూడా ఎంతో విశాలమైనది. కథా/కవితా వస్తువుకు కాల్పనికత ఎంత జోడించినప్పటికీ, అది సుఖాంతమైనా, విషాదాంతమైనా వాస్తవాన్ని కళ్ళకు కట్టినట్టు చూపించడానికే రచయితలు మొగ్గు చూపుతారు. ఆ క్రమంలో సామాజిక-రాజకీయ-ఆర్థిక వ్యవస్థలలో గల సకల అక్రమాలు, అవినీతి, సామాజిక జాడ్యాలు, వికృతత్వం, నైతికపతనం, అరాచకత్వం, కులతత్వం, మతతత్వం, ప్రాంతీయతత్వం, లంచగొండితనం, పరువు హత్యలు, ముఠా కక్ష్యలు, కుళ్ళు, కుట్రలు, కుతంత్రాలు, విలువల పతనం, జీవితంపై విరక్తి, నిర్వేదం,అంతర్గత కలహాలు, విదేశీ వ్యామోహం, పాశ్చాత్య విష సంస్కృతులు తదితరాలన్నీ కూలంకషమైన చర్చకు వస్తాయి. రచయితల target group (లక్ష్యిత సమూహం) కూడా విస్తృతమైనదే. పాఠకుల అభిమానం చూరగొనే క్రమంలో వైవిధ్యభరితమైన కథనాలతో విభిన్న అభిరుచులు గల పాఠకులను సంతృప్తి పరిచే లక్ష్యంతో ప్రతీ సుక్ష్మాంశాన్నీ సునిశితంగా స్పృశించే రచయిత స్వేచ్ఛకు అడ్డు ఉండదు. ఈ పందెంలో సదరు రచన కలిగించే సామాజిక ప్రభావం గురించిన ఆలోచన కంటే, ఆ రచనలో ఆవిష్కరించబడిన సామాజిక కోణాల ఆకర్షణ వైపే పాఠకలోకం మొగ్గుచూపుతుంది/ నెగ్గుతుంది. వాస్తవిక రచనను కళానైపుణ్యంతో ఎంత అందంగా ఆదర్శవంతంగా తీర్చి దిద్దినప్పటికీ. . . రచయిత మాత్రం సమాజం పట్ల తనకున్న నైతిక బాధ్యతను విస్మరించకూడదు. "రచయిత కవితాకళకు లొంగి ఉండవల్సినవాడే అయినప్పటికీ ఒక దోషమో, దుర్నడతో ఆకర్షవంతం అయ్యే పరిస్థితి

రాకూడదు. మానవ సమాజం పట్ల రచయితకు ఒక మహత్తరమైన బాధ్యత ఉన్నది. ఎందుకంటే జీవితం ఎంతో గంభీరమైనది (Life is very serious) ఎట్టి తృణీకారభావమూ లేకుండా జీవితాన్ని ఎంతో గంభీరమైనదిగా భావించాలి. " (గురజాడ లేఖలు: 79-80). ఈ వాస్తవాన్ని విస్మరించడం వల్లనే చాలా రచనల్లో జీవితం అవహేళనకు గురౌతున్నది. భవిష్యత్తు అంధకారమయమైపోతున్నది. వ్యవస్థపై విశ్వాసం సన్నగిల్లిపోతున్నది. కుటుంబ వ్యవస్థ పునాదులు కదిలిపోతున్నాయి. సంస్కృతులు విషతుల్యమైపోతున్నాయి. ముందుతరాల మనుగడ అగమ్యగోచరమైపోతున్నది. ప్రవాహంలో పడి కొట్టుకుపోతూ కేవలం క్షణికానందం/ తాత్కాలిక సంతృప్తి వెతుక్కునే సాధారణ పాఠకుడికి ఇవేవీ తీవ్రతరంగా తీసుకోవాల్సిన విషయాలుగా అనిపించకపోవచ్చు. అయితే భవిష్యత్తు తరాలను సామాజికంగా, మానసికంగా బాధ్యతాయుత పౌరులనుగా తీర్చిదిద్దే ఉత్కృష్టమైన విద్యారంగంలో ఉన్నవారికి మాత్రం కచ్చితంగా పట్టించుకుని తీరవలసిన అత్యవసర విషయమిది. అంతమాత్రంచేత వాస్తవాల్ని విస్మరించమనో, ఉన్నవి లేనట్లు- లేనివి ఉన్నట్లు మభ్యపెట్టమనో కాదు. ఈ నభోంతరాళాలు నిలిచియున్నంతకాలం మానవ మనుగడ ప్రశ్నార్థకం కాకూడదన్న వాస్తవాన్ని మాత్రం విస్మరించకూడదు. ఎంతో మంది పాఠకుల్ని దాటుకుని, కాలపరీక్షకు నిలబడిన సాహిత్యాన్ని లేదా సాహిత్య భాగాల్ని భిన్న స్థాయిల్లో పాఠ్యాంశాలుగా నిర్ణయించే/బోధించే క్రమంలో ఎదుగుతున్న లేతమనసుల్లో జీవితకాలం మట్టుకు వారిపై అవి చూపే సామాజిక – మానసిక ప్రభావాల్ని దృష్టిలో ఉంచుకోవలసిన స్పృహ ఎంతైనా ఉన్నది.

ఇక్కడే 2020 నూతన జాతీయ విద్యా విధానం నొక్కి వక్కాణిస్తున్న outcome based education (ఫలితాధారిత విద్య)కు ప్రాసంగికత ఉన్నది. చదువు విజయవంతంగా పూర్తిచేసుకున్న విద్యార్థికి అంతిమంగా చేకూరే లబ్ది ఏమిటి అన్నది ముందుకొచ్చి నిలబడుతున్న ప్రశ్న. కేవలం పట్టా పేరుతో చేతిలోకి వస్తున్న మార్కుల జాబితానా? ఉపాధిని అందించే నైపుణ్యాలా? స్వంతకాళ్ళమీద నిలబడే ఆత్మవిశ్వాసమా? సమాజంలో నెగ్గుకురాగలిగిన నేర్పరితనమా? వీటిలో ఏ ఒక్కటి లోపించినా విద్యార్థికి భవిష్యత్తు ఏటికి ఎదురీతగా పరిణమిస్తుంది. అయితే ఇవన్నీసమ్మిళితమై సమగ్రంగా విద్యార్థిలో ప్రోదిచేసుకుంటే , సదరు విద్యార్థి భవిష్యత్తు నల్లేరు మీద నడకగా సాగుతుంది. ఏ విద్య యొక్క పరమ ప్రయోజనమైనా ఇంతకుమించి ఏముంటుంది. విద్యార్థితో పాటు గా వారి తల్లిదండ్రులకు కూడా అంతకు మించిన ఆనందం ఏముంటుంది? ఈ సూత్రాన్ని దృష్టిలో పెట్టుకున్నప్పుడు . . . విద్యార్థులకు పాఠ్యాంశాలుగా నిర్ణయించే సాహిత్యపాఠాల అధ్యయనం యొక్క అంతిమ ప్రయోజనాన్ని గురించి కూడా యోచించవలసిన ఆవశ్యకత ఉన్నది. యుగాలవారీగా, భావజాలపరంగా, ప్రక్రియాపరంగా ప్రధాన స్రవంతిలో అంతస్రవంతిగా సాగే అనంత సాహిత్యసాగరం నుండి అపురూపమైన ఆణిముత్యాలను విద్యార్థులకు అందించే ప్రయత్నంలో దేశ సమగ్రత – సార్వభౌమత్వం, సంస్కృతి – విలువలు, విద్యార్థులపై శారీరక - మానసిక – సామాజిక ప్రభావం, భవిష్యత్తు తరాల మనుగడ, ప్రాచ్య -పాశ్చాత్య సంస్కృతుల ప్రభావం, కుటుంబ వ్యవస్థ వంటి కీలకాంశాలను పరిగణనలోకి తీసుకోల్సిన ఆవశ్యకత ఎంతైనా ఉన్నది.

**పాఠ్యాంశాల నిర్ణాయక మండలివారి బాధ్యతాయుత స్పృహ :** విభిన్న స్థాయిలలో తరగతులవారీగా సాహిత్య పాఠ్యాంశాలను ఎంపిక చేసే సభ్యుల బాధ్యత ఎంతో ఉదాత్తమైంది. వైవిధ్యభరితమైన సంస్కృతులు – కుటుంబ నేపథ్యాలలో ఎదుగుతున్న విద్యార్థులపై ఒక్కొక్క పాఠం జీవితకాలం పాటు చూపే ప్రభావం విస్మరించలేనిది. ఎంతో మందికి తరగతిగదిలో నేర్చుకున్న సాహిత్యపాఠాలు జీవనగమనంలో గుణపాఠాలుగా బ్రతుకును బోధించిన జీవితపాఠాలుగా నిలిచాయి. చదువులు పూర్తిచేసుకుని వివిధ స్థాయిలలో ఎదిగి జీవితానుభవాల్ని కాచి వడపోసిన వారి మధురస్మృతులలో నిలిచిపోయిన సాహిత్యపాఠాలు కోకొల్లలు. సాహిత్య పాఠ్యాంశాల ఎంపిక- నిర్ణయంలో గడిచిన తరాల వారి ముందుచూపు, నిబద్ధత, విశాల దృక్పథం, భవిష్యద్దర్శనం ఆదర్శప్రాయం, అనుసరణీయం. కాలానుగుణంగా మారుతున్న అభిప్రాయాలు, సంస్కృతులు, విలువల నేపథ్యంలో సాహిత్య పాఠ్యాంశాలను ఎంపిక చేసే బృందం కూడా దూరదృష్టితో ఈ విషయాలను పరిగణనలోకి తీసుకోవాలి.

వైవిధ్యభరితమైన సంస్కృతీ సంప్రదాయాలు, జాతులు-తెగలు, భాషలు, మతాలు గల ప్రజాస్వామ్య భారతీయ సర్వసమగ్రత పరిరక్షించబడాలి.

భిన్నత్వంలో ఏకత్వ సూత్రం సాధన దిశగా . . . వ్యక్తిగత ఆత్మగౌరవం తో పాటు – సమూహ అభిప్రాయ (మనోభావాలు) సిద్ధాంతాలు కూడా పరస్పరం గౌరవింపబడాలి.

అత్యంతవిలువైన మానవ జీవితం వెక్కిరింతలపాలు కాకూడదు . . . జీవితం అపహాస్యంగా, నిష్ప్రయోజనంగా, నిర్వేదంగా పరిణమించకూడదు

నైతికవిలువలు, మానవతావిలువలపై విశ్వాసం పెంపొందాలి

భవిష్యత్తు శూన్యంగా, అంధకారంగా, నిస్సారంగా, నిరాశాజనకంగా, అగమ్యగోచరంగా భ్రమింపజేయబడకూడదు.

ఇరుగు పొరుగు సమాజాల దేశాల అలవాట్లు, జీవనశైలి, సంస్కృతి సంప్రదాయాలపై సద్భావన, సహృదయత కలిగించాలి తప్ప . . . ఏవగింపు, చిన్నచూపు కలిగించబడకూడదు.

విద్యార్థులలో ఆత్మవిశ్వాసం, విశాలదృక్పథం, సవాళ్ళు ధీటుగా ఎదుర్కొనే క్రీడాస్ఫూర్తి, పోరాట పటిమ పెంపొందించబడాలి. ఆత్మన్యూనత, పిరికితనం, పలాయనం వంటి వాటిని జయించే మనోధైర్యాన్ని ప్రోదిచేయాలి.

పర్యావరణ పరిరక్షణపై ఆచరణాత్మకమైన సదవగాహన పెంపొందించబడాలి.

హింసా ప్రవృత్తి, పగ, కక్ష్యలు, ప్రతీకారవాంఛ వంటివి ప్రేరేపింపబడకూడదు.

కాబట్టి సాహిత్య పాఠ్యాంశాలను ఎంపిక చేసే నిర్ణాయక బృందం విశాల దృక్పథంతో, భవిష్యద్దర్శనంతో బాధ్యతాయుత సామాజిక స్పృహను కలిగి ఉండాలి.

**సాహిత్య పాఠ్యాంశాల బోధనలో సామాజిక స్పృహ :** నిర్ణయించబడిన పాఠ్యాంశాలలో ఒక్క పాఠమైనా శృంగారరస ప్రాధాన్యత కలిగినదై ఉంటుంది. వికసిత దశలో ఉత్సుకతతో ఉండే విద్యార్థులు ఇటువంటి పాఠ్యాంశాల పట్ల అధికమైన మక్కువను ప్రదర్శిస్తూ ఉంటారు. కొన్ని సందర్భాలలో బోధించేవారిని సైతం ఇటువంటివి ఇరకాటంలో పడేస్తాయి కాబట్టి ఆచితూచి వ్యవహరించవలసి ఉంటుంది. అత్యుత్సాహవంతులైన విద్యార్థులు ఇటువంటి పాఠ్యాంశాలను ఆసరాగా తీసుకుని తరగతి గదిలో తోటి విద్యార్థులను, అధ్యాపకులను ఇబ్బందికి గురిచేస్తుండడం గమనిస్తుంటాం. జీవితం నవరసభరితం. విద్యార్థుల జిజ్ఞాస నిర్వీర్యం కాకుండేటట్లుగా శృంగారం రసరాజమే అయినప్పటికీ అదే జీవితపరమావధికాదు అనే భావనపై విద్యార్థులలో సదవగాహన కలిగించవలసిన ఆవశ్యకత ఎంతో ఉన్నది.

తరగతి గదిలో వైవిధ్యభరితమైన విద్యార్థులు ఉంటారు కాబట్టి ఉద్యమ సాహిత్యానికి సంబంధించిన పాఠ్యాంశాలను బోధించేటప్పుడు సైతం సామరస్య పూర్వకవాతావరణం విచ్ఛిన్నం కాకుండేటట్లు జాగ్రత్తపడాలి. ఉద్యమ నేపథ్యం – స్వరూపస్వభావాలు – వికాసాలపై బహుముఖీనమైన విశ్లేషణలతో అన్ని కోణాలు ఆవిష్కరింపబడాలి. ఈ నేపథ్యంలో విద్వేషాలు, ప్రతీకారవాంఛలు, కక్ష్యలు వంటి విషబీజాలు విద్యార్థులలో నాటబడకూడదు.

సామాజిక రుగ్మతలకు సంబంధించిన పాఠ్యాంశాల బోధనలో వ్యవస్థలోగల విషసంస్కృతుల పట్ల విముఖత కలిగించగలగాలి తప్ప వ్యక్తులపట్ల, సామాజిక స్థాయిల పట్ల వైమనస్యం కలుగకూడదు. గతంలో జరిగిపోయిన ఘోర తప్పిదాలకు ప్రస్తుతకాలపు వ్యక్తులు బాధ్యులుగా చేయబడకూడదు.

సాహిత్యాన్ని బోధించే అధ్యాపకులు విద్యార్థులపాలిట ఆత్మీయ నేస్తాలు. భాషాసాహిత్యాల్ని బోధించే అధ్యాపకులతో విద్యార్థులు అరమరికలు లేకుండా సన్నిహితంగా మెలగడానికి ప్రయత్నిస్తారు. అధ్యాపకులు జీవితంలో అంతర్భాగమైన నవరసాల

స్వరూపస్వభావాలను సాహిత్యమాధ్యమం ద్వారా సాక్షాత్కారం చేసే క్రమంలో విద్యార్థులు తమ వ్యక్తిగత విషయాలు కళ్ళముందే ఆవిష్కరింపబడుతున్నట్లు భావిస్తారు కాబట్టి సాహిత్యపాఠాల ద్వారా బ్రతుకుపాఠాలు రంగరించిపోయడానికి అదొక అపురూపమైన తరుణం.

**సాహిత్యంశాల అభ్యసనం/అధ్యయనంలో సామాజిక స్పృహ:** ఒకవేలితో ఎదుటివారిని చూపిస్తే మూడువేళ్ళు మనవైపు చూపిస్తాయి. . . కత్తికి రెండువైపులా పదునుఉంటుంది . . . వంటి మాటల్ని సాహిత్య విద్యార్థులు – పరిశోధకులు ఈ సందర్భంగా పరిగణనలోకి తీసుకోవలసి ఉంటుంది. సాహిత్యంలో ఆవిష్కృతమైన పాత్ర చిత్రణ – సన్నివేశ పరికల్పన . . . ఇలా . . . దేన్ని తీసుకున్నా . . . మనకు తోచిన ఏదో ఒకే దృష్టి కోణం నుంచి చూడడం – అంచనా వేయడం – ఒక నిర్ణయానికి రావడం ద్వారా సదరు రచన యొక్క ఫలితార్థం సిద్ధించదు. పరిణతి గల పాఠకులుగా పరిశోధకులుగా విభిన్న నేపథ్యాలనుంచి వాటిని అధ్యయనం చేయవలసి ఉంటుంది. ఈ క్రమంలో ఏ ఒక్కరి అభిప్రాయమో స్థిరప్రమాణం కాదు. మానవ జీవితం – మానవ సమాజం – మానవ మనుగడ అనేవి అంతిమంగా నిలబడే/ నిలబడవలసిన స్థిరప్రమాణాలు. సహృదయత – సద్భావన- సానుకూల దృక్పథం అనేవి సాహిత్యలోకానికి వన్నె తెచ్చే ఆభరణాలు.

**ముగింపు :** జీవితానుభవాన్నిరంగరించి, విశాలమైన దృక్పథంతో, ప్రజాస్వామ్య పునాదులపై అపారమైన విశ్వాసం గల రచయితలు సాహిత్యంలో సమతౌల్యాన్ని పాటిస్తారు. జీవితపు అత్యంత అంధకారమయమైన అసహ్యకరమైన చీకటి కోణాల్ని ఆవిష్కరిస్తూనే . . . జీవితగాంభీర్యాన్ని (life is serious అనే భావనను) నిలబెడతారు. పలు రకాల సంస్కృతుల విషపుకోరల్నిఅనుశీలిస్తూనే . . . పర్యవసానాలపై జాగరూకత కలిగిస్తారు. వైకల్యాల్ని విశ్లేషిస్తూనే ఆత్మవిశ్వాసాన్ని నింపుతారు. అవినీతి అక్రమాల్ని ఎద్దేవా చేస్తూనే కర్తవ్యాన్ని బోధిస్తారు. వ్యక్తిత్వపతనం – వ్యక్తిత్వ వికాసాల మధ్య తారతమ్యాల్ని దృష్టాంతాలుగా నిలుపుతారు. ఇటువంటి సాహిత్యాన్ని పాఠ్యాంశాలుగా నిర్ణయిచడం – బోధించడం ద్వారా . . . జీవితం అత్యంత విలువైందిగా పరిగణింపబడుతుంది. వ్యవస్థపై విశ్వాసం నిలుస్తుంది. విలువలు మనుగడ సాగిస్తాయి. భవిష్యత్తుపై నమ్మకం నిలుస్తుంది. కుటుంబ వ్యవస్థ - మానవ సంబంధాలు బలపడతాయి. వైవిధ్యభరితమైన సంస్కృతులు పరస్పరం గౌరవింపబడతాయి. వ్యక్తిత్వ వికాసం ద్వారా మనోధైర్యం ఆత్మవిశ్వాసం రెట్టింపవుతాయి. తద్వారా భవిష్యత్తరం లక్ష్య సాధన దిశగా విజయతీరాల్ని చేరుకోగలుగుతుంది.

**వనరుల జాబితా:**

1. అప్పారావు గురజాడ (1958): లేఖలు (సం. అవసరాల సూర్యారావు) విశాలాంధ్ర, విజయవాడ

2. ఆర్. ఎస్. సుదర్శనం (1978) : సమాజము – సాహిత్యము, చిత్తూరుజిల్లా రచయితల సహకార ప్రచురణ సంఘం , చిత్తూరు

3. భారతదేశ కేంద్ర ప్రభుత్వం వారి 2020 జాతీయ నూతన విద్యావిధానంలో నొక్కి వక్కాణిస్తున్న ఫలితాధారిత విద్య (Out Come Based Education) మౌళిక భావనల ఆధారంగా)

*******

# 72. తిక్కన విదురునీతి-సామాజిక స్పృహ

**ఆర్.ఎస్.సంధ్య**

తెలుగు అధ్యాపకులు

విజ్ఞాన జ్యోతి ఇనిస్టిస్ట్యూట్ ఆఫ్ ఆర్ట్స్ అండ్ సైన్స్ డిగ్రీ కళాశాల,

వెస్ట్ మారేడుపల్లి, సికింద్రాబాద్, తెలంగాణ రాష్ట్రం

rssandhya6@gmai.com చరవాణి: 9676125579

భారత జాతీయ కావ్యంగా, పంచమ వేదంగా, భారతీయ విజ్ఞాన సర్వస్వంగా ప్రసిద్ధిగాంచిన 'ఆంధ్ర మహాభారతం' 18 పర్వాల శాస్త్రేతిహాసం. మహాభారతంలో ఉండేదే ఎక్కడైన ఉంటుంది. మహాభారతంలో లేనిది ఎక్కడా ఉండదని 'ఉగ్రశ్రవణుడు' శౌనకాది మునులకు భారతకథ అంతా చెప్పిన తర్వాత అంటాడు. మహాభారత ఇతిహాసంలో వ్యాసమహర్షి ` ధర్మం, అర్థం, కామం, మోక్షం అనే చతుర్విధ పురుషార్థాలు రాబట్టడానికి కావలసిన జ్ఞానాన్నంతా దాచి ఉంచాడు. మన భారత సనాతన గ్రంథాలైన వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఉపనిషత్తుల సారం మహాభారతంలో కనిపిస్తుంది.

వ్యాస మహాభారతాన్ని నన్నయగారు ఆది, సభ, అరణ్యపర్వం నాలుగో అశ్వాసం వరకు, విరాటపర్వం మొదలుకొని స్వర్గారోహణ పర్వం వరకు పదిహేను పర్వాలు తిక్కనగారు, అరణ్యపర్వ శేషంతో పాటు భారత పరిశిష్ట గ్రంథం అయిన 'హరివంశం' అనే గ్రంథాన్ని ఎర్రనగారు రచించి తెలుగులో 'కవిత్రయంగా' వెలుగొందారు.

మహాభారతంలో విశిష్టపర్వమైన ఉద్యోగపర్వంలో తిక్కన సోమయాజి విదురనీతుల ద్వారా నేటి సమకాలీన సమాజానికి కావలసిన సందేశం అందించడం జరిగింది. సామాన్య ప్రజానీకానికి, నేటి యువతరానికి 'తిక్కన తీర్పులు'గా విదురనీతులు నిలవాలనే ఆకాంక్షతో 'విదురనీతులు`తిక్కన తీర్పులు' అనే శీర్షికలో తెలియజేయాలనుకోవడం జరిగింది.

మహాభారతంలో విదురుడు ధర్మప్రవర్తకుడు. 'విదురుడు' అనగా ఎరిగినవాడు, జ్ఞాని అని అర్థం. సాక్షాత్తూ యమధర్మరాజే విదురునిగా జన్మించాడని శాస్త్రాలు చెబుతున్నాయి. ధర్మానికి మారుపేరు, ధర్మంపై అనురక్తి కలవాడు. ఒక 'దాసి'కి జన్మించిన కారణంగా పాండురాజు, దృతరాష్ట్రుల సోదరుడు అయినప్పటికీ రాజ్యాధికారం పొందే అర్హత లేనందున విదురుడు దృతరాష్ట్రుని వద్ద మంత్రిగా కర్తవ్య నిర్వహణ గావిస్తాడు. కురువంశ పితామహులైన భీష్ముని వద్ద శిక్షణ పొందాడు. దృతరాష్ట్రునికి రాజ్య వ్యవహారాలలో సలహాలు చెబుతూ హితమును ఉపదేశిస్తూ ఉండేవాడు. ఇటు పాండవుల మేలుకోరే శ్రేయోభిలాషి విదురుడు. దృతరాష్ట్రుడు రాజ్య వ్యవహారాలన్నింటిలో విదురుని సలహాలు తీసుకునేవాడు. విదురుడు దృతరాష్ట్రుని కుటిల బుద్ధిని, స్వార్థపు ఆలోచనలు ఎరిగినవాడు. అతనికి మంత్రిగా తన సలహాలు, సూచనలు దృతరాష్ట్రునికి నచ్చినా, నచ్చకపోయినా ఉన్నది ఉన్నట్లుగా మంచి`చెడులను వివరించేవాడు. ధర్మానికి కట్టుబడి, ధర్మసూక్ష్మములను ఆచరించి చూపినవాడు. ఎప్పటికప్పుడు కౌరవుల క్రూరచర్యలు, వ్యూహాలు ముందుగానే గ్రహించి పాండవులను ఆపదల నుండి రక్షించినవాడు. రాజ్యానికి మహారాజు కాకున్ననూ గుణములలో అగ్రగణ్యుడు. లోకానికి నీతులను, హితోక్తులను, మానవీయ విలువలను విదురుడు దృతరాష్ట్రునికి బోధించినవే మన సమాజానికి 'మార్గదర్శక సూత్రాలు'గా చెప్పవచ్చు. తిక్కన సోమయాజి రాసిన 'ఆంధ్ర మహాభారతం' ఉద్యోగ పర్వం ద్వితీయాశ్వాసంలో గల 'విదుర నీతులు' లోకానికి తీర్పులుగా ప్రసిద్ధిగాంచాయి.

పాండవులు అరణ్యవాసం, అజ్ఞాతవాసం పూర్తి చేసుకొని అర్ధ రాజ్యం కోరతారు. పాండవులకు అర్ధ రాజ్యం ఇవ్వవలసి వస్తుందని, రాజ్యం కోల్పోవలసి వస్తుందని దృతరాష్ట్రుడు సందిగ్ధంలో పడతాడు. అరిషడ్వర్గాలకులోనై తన మనస్సుకు స్వాంతన

చేకూరేటట్లు హితాన్ని, కర్తవ్యాన్ని ఉపదేశింపమని విదురుని అడుగుతాడు. విదురుడు ముక్కుసూటిగా ఏమాత్రం సంకోచించకుండా దృతరాష్ట్రునికి నీతులు బోధిస్తాడు.

> డక్కెను రాజ్యమంచు నకటా! మిటు దమ్ముని భాగమీక, నీ
> వెక్కటి మ్రింగ జూచె, దది యెట్లఋగున్? విను, మీను లోలతన్
> గ్రక్కున నామిషంబు చవిగాలము మ్రింగిన చాడ్పు సూవె యి
> ట్లుక్కివుడైన నీ కొడుకు నుల్లము నున్నటు లాడగూడునే?

విదురుడు దృతరాష్ట్రునితో ''రాజ్యం దక్కించుకోవాలనే కోరికతో నీ తమ్ముడి కుమారులకు రాజ్యభాగం ఇవ్వకుండా నీ కుమారులకే దక్కాలనే దురాశను కలిగివున్నావు. చేప జాలరి వేసిన గాలమునకు చిక్కిన మాంసమును తిని ఆరగించాలనే ఆశతో గాలానికి చిక్కి నాశనము అయినట్లుగా నీవు రాజ్యకాంక్షతో ధర్మాత్ములైన పాండవులతో యుద్ధానికి సిద్ధం అవుతున్నావు. తర్వాత జరిగే పర్యవసనాన్ని గ్రహించలేకపోతున్నావని హెచ్చరించాడు. యుద్ధ పర్యవసనాన్ని విస్మరించకుమని తెలిపాడు. కురువంశ నాశనము జరగకుండా ఉండాలంటే ధర్మప్రవర్తులైన పాండవులకి వారి రాజ్యభాగం అప్పగించి అన్నదమ్ములందరు శాంతితో పరిపాలించేటట్లు చేయమని చెప్పాడు. నీ కుమారుడు దుర్యోధనుడు ప్రవర్తిస్తున్న విధముగా నీవు నడుచుకోకుండా పెద్దతండ్రిగా నీ కర్తవ్యాన్ని, బాధ్యతను నిర్వర్తించమని కోరాడు.

దుర్యోధనుడి చర్యలు మన ప్రస్తుత సమాజంలో అగుపిస్తున్నాయి. ఆస్తుల కోసం అన్నదమ్ముల మధ్య తగాదాలు ఏర్పడుతున్నాయి. కౌరవులు నూరుగురు, పాండవులు ఐదుగురు. కౌరవుల సంఖ్య ఎక్కువ కావున రాజ్యం సగభాగం పాండవులకు అప్పగిస్తే పాండవులు అర్ధ రాజ్యాన్ని ఏలుకుంటారు. మిగతా సగ భాగం తన నూరుగురు కుమారులకి సరిపోదన్న దురాశ. చెట్టు మీద పండును మగ్గకుండా కోస్తే, ఆ పండు రుచిగా ఉండదు. విత్తనం కూడా చెడిపోతుంది. ఎదుటివారి మనస్సు నొచ్చుకోకుండా కార్యఫలాన్ని పొందాలి'' అని విదురుడు దృతరాష్ట్రునికి కర్తవ్యబోధ చేస్తాడు. నేటి నాగరిక సమాజంలో మానవ సంబంధాలు కనుమరుగవుతున్నాయి. తాత తండ్రుల నుండి వచ్చిన వారసత్వ ఆస్తిని ఎలాంటి అరమరికలు లేకుండా సమానంగా పంచుకుంటే ఏ బాధలు ఉండవు. ఒకరితో మరొకరు పోల్చుకోవడంతో వస్తుంది సమస్య. 'కలసి ఉంటే కలదు సుఖం' అన్న పెద్దల మాటను ఆచరిస్తే 'ఉమ్మడి కుటుంబ వ్యవస్థ' మళ్ళీ ఏర్పడతాయి. ఈ ధర్మాచరణలని ముందుగా పెద్దలు ఆచరించి చూపిస్తేనే ముందుతరాల వారికి ఆమోదయోగ్యమవుతుంది. పెద్దల బాటలోనే పిల్లలు నడుస్తారు.

ఒకవైపు తండ్రిని కోల్పోయిన పాండవులకు పెద్దతండ్రిగా తన బాధ్యతను నిర్వర్తించమని, లేకపోతే లోకవ్యవహారంలో అపఖ్యాతి తెచ్చిపెడుతుందని, పాండవులకు హాని తలపెట్టడము తప్పని పలుమార్లు దృతరాష్ట్రునికి చెప్తాడు విదురుడు. హితమును శ్రవణము చేయడమే కాదు ఆచరించాలంటాడు. తాను తప్పు చేస్తూ ఆ తప్పును ఇతరులలో ఎత్తి చూపువాడు 'అధముడు'. తాను అసమర్థుడని తెలిసినా పైకి గర్వాన్ని, కోపాన్ని ప్రదర్శించేవాడు 'మూర్ఖుడు' అని అర్థం. కనుక రాజు అన్నవాడు తనకి తాను తెలిసినవాడై ఉండాలి. ఎల్లప్పుడు తన కర్తవ్యనిర్వహణలో లోపాలు రాకుండా చూసుకొనే బాధ్యత రాజుదే. దృతరాష్ట్రుని మనసులో ఉన్న లోపం 'బలహీనత'. పుత్రులపై వ్యామోహం. తన బలహీనతే బలము అనుకొని పుత్రులను వెనకేసుకొని రావడం సమంజసం కాదని చెప్పాడు. పాడవులు తన కుమారులకన్నా బలవంతులు, వినయశీలురు అని తెలిసినా అధికార గర్వంతో అసూయాద్వేషాలను ప్రదర్శించకూడదని, రాజ్యాధికారానికి అనర్హులైన తన కుమారులకు రాజు అయ్యే అర్హత లేదని, ధర్మరాజు వంటి ఉత్తముడిని రాజును చేస్తే రాజ్యం, రాజ్యంలోని ప్రజలు సుఖశాంతులతో జీవిస్తారని పేర్కొన్నాడు. 'కయ్యానికైనా వియ్యానికైనా మనతో సమస్థాయిలో ఉన్నవారినే ఎంచుకోవాలి. రాజుగా తమ స్థాయికి తగ్గట్లుగా ఉన్నవారితోనే స్నేహాన్ని ఏర్పరచుకోవాలి. రాజ్యానికి రక్షణగా, సామంతులుగా

వ్యవహరించినవాళ్ళతోనే రాజ్య వ్యవహారాలు జరిపించాలి. బలములో, గుణములో అధికుడైనవాడినే రాజుగా నియమించాలి. దుష్టులైన నీ కుమారులలో ఎలాంటి సద్గుణా లేకున్ననూ వారిని రాజును చేయడం తగదని చెప్పాడు. పాండవుల రాజ్యాన్ని చేజిక్కించుకొని, వారిని హతమార్చాలని పగతో రగిలిపోయే నీ కుమారులకు రాజ్యం అప్పగించడంవల్ల రాజ్యంలో శాంతిభద్రతలకు లోటు జరుగుతుంది. ప్రజలు ఎల్లప్పుడు తమని కన్నబిడ్డల వలె చూసుకొనే రాజునే కోరుకుంటారు. సంపదను ప్రజలు అవసరాలకు ఖర్చుపెట్టేవాడు, సరిj్ౖైన ప్రణాళికను రచించి, రాజ్య వ్యవహారాలు నడిపేవాడే నాయకుడు. అటువంటివారినే ప్రజలు ప్రభువుగా గౌరవిస్తారని తెల్పాడు. మనుషుల యందు విశ్వాసం, ఓర్పు, జాగరుకతతో శత్రువుతో వ్యవహరించే తీరు, రాజ్యాధికారం నిలబడటానికి ఎలాంటి పరిస్థితులైన తట్టుకొని నిగ్రహించుకొనే శక్తి రాజులకు ఉండవలసిన ప్రధాన లక్షణములు. కపట జూదమాడిన దుర్యోధనుడికి, నిండు సభలో ద్రౌపది వస్త్రాపహరణం చేసిన దుశ్శాసునికి రాజ్యం అప్పగిస్తే ప్రజలు నీతి తప్పే ప్రమాదం ఏర్పడుతుందని బాధపడతాడు విదురుడు.

పరుల ధనమునకు, విద్యా
పరిణతికిం, దేజమునకు, బలమునకు మనం
బెరియగ నసహ్యపడున
న్నరుడు దెవులు లేని వేదనంబడు నదిపా

ఇతరుల కంటే తానే అధికుడనే భావము 'మదము'. ఇతరుల సంపద, వారి వైభోగాన్ని చూసి ఈర్ష్యపడటమే మాత్సర్యం. మనిషి జీవితంలో తాను సంపాదించుకున్నవాటితో తృప్తిగా బ్రతకాలి. ఈ భూమి మీద జీవరాశులన్ని ఏరోజు ఆహారాన్ని ఆ రోజుకు సమకూర్చుకుంటాయి. ఒక్క మనిషి మాత్రమే సంపదపై వ్యామోహం పెట్టుకుంటాడు. భౌతికమైన, అశాశ్వతమైన ధనం కోసం పరిగెడుతుంటాడు. తనవద్ద ఉన్నవాటితో సంతృప్తిచెందక ఎదుటి మనిషితో పోల్చుకోవడంతో వస్తుంది సమస్య. కౌరవులు పాండవుల అర్ధరాజ్యంపై కాంక్షతో అసూయతో రగిలి మోహాంధకారంలో యుద్ధానికి సిద్ధమయ్యారు. ధృతరాష్ట్రుడు కుమారులకు బుద్ధి చెప్పవలసిపోయి పాండవులపై అసూయాద్వేసాలను పెంచుకొని తనకి, తన కుమారులకి ఆపద కొనితెచ్చుకున్నాడు. నీ మనసులో అరిషడ్వర్గాలనే మేఘాలను తొలగించుకొని, నీ కుమారులను కాపాడుకొమ్మని విదురుడు బోధించాడు. మానసికంగా అరిషడ్వర్గాలకు లోనైన మనిషి గాయపడటానికి ఆయుధాలు అవసరం లేదు. తన మనసే తన అస్త్రంగా మారి ఏ రోగం బారిన పడకున్నా బాధపెడుతుంది. మనసు ఆరోగ్యంగా ఉంటేనే శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. మన మనసు చేసే ఆలోచనలు, కార్యాచరణనే భవిష్యత్తుని నిర్దేశిస్తాయని చెప్పాడు.

చెలిమియు, బగయును దెలివియు
గలుయు, ధర్మంబు, బాపగతియును, బెంపుం
దులువతనంబును వచ్చును
బలుక బడిన, కాన బాసగ బలుకగ వలయున్

మనిషికి ప్రాణం కన్నా విలువైనది శీలం, వ్యక్తిత్వం. అవి లేకపోతే మనిషి జీవనం నిరర్ధకం. మనసా వాచా కర్మణా మనం చేసే పనులు మన వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దుతాయి. సాటిమనిషితో స్నేహబంధం ఏర్పడాలన్నా, శత్రుత్వం ఏర్పడాలన్నా మన మాటల బట్టి మనకు ఏర్పడతారు. రాజధర్మం, సామాన్య ధర్మం ఎల్లవేళలా మనిషి నైతిక, ధార్మిక జీవనాన్ని నిర్దేశిస్తాయి. ఇంద్రియాలను అదుపు చేసుకున్నవాణ్ణి, ఇతరుల మనసును గెలిచినవాణ్ణి లోకం కీర్తిస్తుంది. మనిషి శరీరం ఒక రథం వంటిది. ఆత్మ అనేది సారథి వంటిది. రథానికి గుర్రాలు ఇంద్రియాలవంటివి. జాగురకతతో నిపుణుడైనవాడు గుర్రములను నియంత్రిస్తూ రథాన్ని ముందుకు నడిపిస్తాడు.

ఇంద్రియ నిగ్రహం లేనివాడు కామక్రోధాలను అదుపు చేయలేక మార్గమధ్యలోనే కింద పడిపోతాడు. కనుక లోకధర్మం అర్థం చేసుకొని ప్రవర్తించేవాడిని విజయం వరిస్తుందని విదురుడు బోధించాడు.

బ్రదుకు చేటు, పొగడు వడుట, దూఱొందుట

యీగి, వేడుకొనుట, యిట్లు మఱియు

గలుగు సౌఖ్య దుఃఖములు వచ్చు నడవడి

వాని కింత యేల వగవ నధిప!

కాలం అనునది ఎప్పుడు ఏవిధంగా ఉంటుందో ఎవరికి తెలీదు. భవిష్యత్తులో ఏమి జరుగనున్నదో ఎవరూ ఊహించలేరు. వర్తమానం మాత్రమే మన చేతుల్లో ఉంది కనుక ఈరోజు రాజ్యమంతా నీ సొంతం అనుకుంటున్నావు. పాండవులు నిన్ను యాచిస్తున్నారని చులకనగా చూడకుమని, వారి శక్తి సామర్థ్యాలు, ధర్మప్రవృత్తిని దృష్టిలో పెట్టుకొని వ్యవహరించమని చెప్పాడు. మనకన్నా తక్కువ స్థాయిలో ఉన్నారని, మనమే గొప్పవాళ్ళమని తలచి గర్వించే మనిషికి కాలం ఏదో ఒక రూపంలో వచ్చి కాటు వేయక తప్పదని హెచ్చరించాడు. సుఖదుఃఖాలు జీవితంలో భాగము మాత్రమేనని, రాజ్యకాంక్షను విడిచిపెట్టమని కోరాడు. విదురుని హితోపదేశం దృతరాష్ట్రుడు విని ఉంటే కురుక్షేత్ర సంగ్రామం జరగకపోయేది. ధర్మరాజు పెద్దతండ్రితో సంధి కార్యము చేసుకోవడానికి ప్రయత్నించాడు. అర్ధ రాజ్యం కాకున్నను కనీసం ఐదుగురికి ఐదు ఊళ్ళు ఇవ్వమని కోరినా దృతరాష్ట్రుడు ఒప్పుకోలేదు. తాను పోగు చేసుకున్న అజ్ఞానం పాండవుల ధర్మప్రవృత్తిని గుర్తించలేకపోయాడు.

కౌరవ కుమారులు ప్రవర్తించినట్లుగానే తండ్రియు వారి చర్యలను వెనకేసుకుంటూ వచ్చాడే తప్ప వారిని సక్రమమైన దారిలో పెట్టలేదు. 'చేతులు కాలాక ఆకులు పట్టుకున్న' ప్రయోజనం ఏమి ఉండదు. పాండవులను ఆదరించి, వారికి సముచితమైన స్థానాలని కల్పించమని, అన్నదమ్ములు కలసి ఉంటే లోకంలో వారికి ఎదురుగా ఎవరు నిలబడలేరని విదురుడు బోధించినాడు. మొదట రాజ్యం కాదు నీవు గెలువవలసింది నీ మనసును గెలవమని చెప్పాడు. విదురుడు కౌరవ రాజ్యంలో మంత్రిగా పని చేసినా వారి దుశ్చర్యలకు అడ్డుగా నిలబడ్డాడే తప్ప చెడును అంటించుకోలేదు. 'బురదలో తామరపువ్వు స్వచ్ఛంగా, నిర్మలంగా వికసిస్తుంది. బురదలో పెరిగిన తామరపువ్వుకు ఎలాంటి మలినం అంటుకోదు. తామరాకు మీది నీటిబొట్టు వలె మనిషి ఎలాంటి ప్రదేశంలో నివసిస్తున్నా సద్గుణవంతుడైన మనిషికి దుర్గుణాలు అంటుకోవు. ఒక దాసికి జన్మించిన విదురుడు నడిచిన విధానం, ధర్మాచరణములు ఆచరించి చూపినవాడు కాబట్టి భారతంలో ఎన్ని పాత్రలున్నా విదురుడు విదురుడే!

మహాభారతం కేవలం ఇతిహాసం మాత్రమే కాదు. ఇదొక ధర్మశాస్త్రం. ఇదొక వేదాంత శాస్త్రం. నీతిశాస్త్రం, మహాకావ్యం, లక్షణగ్రంథం, పురాణం కూడా అవుతుందనీ మూలంలో వ్యాసమహర్షి చెప్పాడు. కవిత్రయంవారు కూడా ఆంధ్ర మహాభారతంలో నీతి, ధర్మ, వేదాంత విషయాలను కథా సందర్భానుసారంగా సమాజానికి ప్రబోధం చేసారు. మనిషి జీవితంలో ఎదురయ్యే సంఘర్షణలన్నింటికి భారతకథలో సమాధానాలు దొరుకుతాయి. మనిషికి కావలసినవన్ని వివరించి చెప్పే పవిత్ర గ్రంథంగా మహాభారతం మానవాళి మనుగడ ఉన్నంతవరకు ప్రకాశిస్తూనే ఉంటుంది. ముఖ్యంగా ఆంధ్ర మహాభారతంలో ఉద్యోగపర్వంలోని 'విదురనీతులు' తిక్కన సమాజానికి ఉపదేశించిన తిరుగులేని తీర్పులుగా నిలుస్తాయనడంలో ఎలాంటి సందేహం లేదు. అందుకేనేమో తెలుగు ప్రజలు 'తింటే గారెలు తినాలి ` వింటే భారతం వినాలి' అని అంటారు.

*******

# 73. శతక సాహిత్యం - సామాజిక స్పృహ – పరిశీలన

**డాII పసగడుగుల శివాజీ**

తెలుగు అధ్యాపకులు

ఎస్. వి . ఆర్ . ప్రభుత్వ డిగ్రీ కళాశాల

నిడదవోలు, తూర్పు గోదావరి జిల్లా

**ఉపోద్ఘాతము ;**

**శతకము -పరిచయం ;**

శతకములు పురాణముల వలె కథా ప్రధాన మైనవి కావు. ప్రబంధముల వలే వర్ణనా ప్రాధాన్యములు గావు, గేయ కృతులవలె సంగీత ప్రాధాన్యములు గావు, కాని తెలుగు నాట పండిత పామరులనే తారతమ్యము లేక, పిల్లలు- పెద్దలు అనే తేడాలేక, చదువురాని వారితో సహా.... అందరి లోనూ బహుళ ప్రచారము నొందినది శతక సాహిత్యము. ఇంతటి బహుళ ప్రాచుర్యమును పొందిన తెలుగు సాహిత్య ప్రక్రియ మరొకటి లేదు అనడంలో సందేహం లేదు. ఇంతవరకు ఉపలబ్ధమైన పాత తెలుగు గ్రంథాలలో సంఖ్యా పరంగా చూస్తే శతకాలదే ప్రథమ స్థానమని చెప్పడంలో అతిశయోక్తి లేదు. శతక రచనా ప్రక్రియ నాటి నుండి నేటి వరకు అవిచ్ఛిన్నంగా కొన సాగుతూనే ఉంది. ఇక తెలుగుకు సజాతీయములైన కన్నడ, తమిళము, మలయాళము భాషలలో వెలువడిన శతకముల సంఖ్య అతి తక్కువ. కన్నడ భాషలో శతక రచన తెలుగు భాష కంటే ముందు ప్రారంభ మైనను ఆ భాషలో శతక సాహిత్యానికి ప్రాధాన్యత ఎంత మాత్రము లేదు. తెలుగుకు మాతృక యైన సంస్కృతమున కూడా ఇన్ని శతకములు లేవు. తెలుగులో మాత్రమే శతక సాహిత్యము ప్రత్యేకతను చాటుకున్నది. తెలుగు సాహిత్యం ప్రసిద్ధి చెందింది

1. **గృహస్థ ధర్మము:**

భారత భాగవతాది కావ్యములందును ఇతర కావ్యములందును కవులు సందర్భానుసారముగ వివరించిన గృహస్థ ధర్మములు మెదలగు నీతి పద్యములను సరస్వతిదేవీ శతక రూపమని , ఈ శతకమును నన్నయ మహాభారతము నందలీ శకుంతలోపాఖ్యానం, మార్కండేయుడు ధర్మరాజునకు చెప్పిన పతివ్రతా ధర్మములు. కణ్వమహర్షి శకుంతలకు ఉపదేశించిన పద్యం

ఎట్టిసాధ్వికులకు బుట్టినయిండ్లను

పెద్ద కాలమునికి తద్ధతగదు

పతులకడన యునికి సతులకుధర్మవు

సతులకీడు గడయు బతులుచూదె

ఎటువంటి పతివ్రతా స్త్రీలైనా పుట్టిన ఇంటిలో ఎక్కువ కాలము ఉండడం మంచిది కాదని , ఎంతటి వారైనా భర్త దగ్గరే ఉండడం భార్యకు ధర్మమని చెప్పి శకుంతలను కణ్వ మహర్షి అత్త వారింటికి పంపిస్తారు.

2. **ఆహారపదార్థాలు :**

కప్పు లోని ఈగ కాదుగాని సాసర్లు

నిన్న మిగులు ఇడ్లి నేటి ఉప్మా

అంతులేని బాధ అయ్యారు బాదరా

విశ్వదాభిరామ వినురవేమ

ఆహార పదార్థాల విషయంలో టీలో ఈగ పడినా తీసుకొని తాగడంలో , పరిశుభ్రత లోపించిన విధానాన్ని , గుర్తు చేస్తూ, ఆహార పదార్థాలను పొదుపు చేసి విషయాన్ని కూడా ఇడ్లిని ఉప్మాగ చేసుకొని తినే పద్ధతిని చాటి చెప్పడం జరిగింది. ఇటువంటి బాధ తీర్చలేని భాధ అని కవి నిందిస్తూనే, మంచి విషయాలను తెలియజేయడం జరిగినది. దీనినే నీతి ఆర్ధిక శతకమనవచ్చును.

3. <u>పశ్చాత్తాపం:</u>

వేమన తన తప్పిదము తెలుసుకొని <u>పశ్చాత్తాపం</u> పొంది నిజ జీవితములో కొన్ని నీతి విషయాలు సమాజానికి అందించారు

ఇంటియాలు విడిచి యిల జారకాంత ల

వెంట తిరుగువాడు వెర్రివాడు

పంట చేను విడిచి పరిగి ఏరినట్లు

విశ్వదాభి రామ వినుర వేమ

పై పద్యంలో తన ఇల్లాలు తనను విడిచిపెట్టి, వేశ్య వెంట తిరిగినవాడు పిచ్చివాడని, చెప్పి తన ఇల్లాలు గొప్ప తనం గ్రహించమని పంట పండి చేనును విడిచి పెట్టి చిన్న చిన్న పరిగె వంటి ధాన్యాన్ని ఏరుకోవడం మంచిది కాదని వేమన వ్యక్తపరిచారు

4. **సజ్జనులు:**

ఉప్పు కప్పురంబు నొక్క పోలికనుండు

చూడ చూడ రుచులు జాడవేరు

పురుషులందు పుణ్యపురుషులు వేరయ

విశ్వ దాభి రామ వినురవేమ

పురుషులు వేరు, పుణ్య పురుషులు వేరని తెలియజేస్థూ, వారిద్దరు, ఉప్పు కర్పూరము వలె ఒకే విదంగా కనిపించిన వాటి రుచిని బట్టి గ్రహించినట్టు, సజ్జనులు, దుర్జనులు వంటివారి ప్రవర్తన నడవడిక, జీవనం లో ఉండే విధానాన్ని బట్టి మనము గ్రహించడం జరుగుతుంది అని విశ్వ కవి వేమన తెలియజేశారు. దీనిలో సమాజిక స్పృహను మనము గ్రహించాలి. అలాగే సజ్జనులు దుర్జనుల లక్షణము కూడ ఈ పద్యం లో వివరించారు.

5. **రామభక్తి :-**

ముదిగొండ వెంకట రామసిద్ధాంతి గారు భక్తి ప్రదానముగా శ్రీరామ శతకమును రచించి, పోతన వలె వీరు భక్తి తత్వముగల వారని క్రింది పద్యం లో గ్ర హించగలము

నుడివెడిది రామశతకము

నుడివించెడి వాడు నతనే, నూతన ఫణితిన

నుడివిన భవహరమగునిక

నుడివేద నితరమది యేల నుడువగ రామా!

రామ అను పదమునకు తాత్వికార్దమును సూచించిరి. నన్ను నడిపించేది శతకమును రాయించేది అంతా రామభద్రుడనేనని గ్రహించినట్లు మనకు అర్దం అవుతుంది

జీవులనేకులు పశువులు

భావింపగ బకృతి బంధము పాశం

భావృత్తములనంబశువులు నందువులు

నివారెంటకి బతివి విరుపమహిమా

పై పద్యములో పాశుపత సిద్ధాంతము తెలియజేసినటు గమనించగలము

సుమతీ శతకమునందలి పెరుగుట విరుగుట కొరికే అను పద్యభావాను పద్ధతిని ఒక పద్యము నందు ఇలా ఉంది.

6. **జీవనము:**

దూషణ అసూయ కొరకే

భాషాంతర రచన యెల్ల బ్రతుకుల

కొరకే వేషము వంచన కొరకు.

పై పద్యంలో దూషించడమనెది అసూయ వల్ల జరుగుతుందని,ఏ భాషలో రచన అయినా మనము జీవించటానికే నని,ఏ వేషము అయినా మోసము చేయటానికే న ని,ఇవన్నీ సమాజములో కనిపిస్తుంటయని వాటిని గ్రహించి జీవనము సాధించాలని కవి యొక్క భావన.

7. **సత్యము:**

సత్యమె యముదు మూలము

సత్యమె భవమోహపాశ సంస్కృతి బాపు

సత్యమె శెలవు నిలుపును

సత్యములో నెట్టి వ్రతము చాలదు నగజా

సత్యం కీర్తికి మూలమని, సత్యమే కోరికలను భవచంధాలను సృజింపజేస్తుందని ఆ సత్యమే శీలాన్ని నీ కాపాడుతున్నది,సత్యానికి మించినది ఏదీ లేదని గ్రహించిన.

8. **సహనం ఓర్పు:**

చూడనాగిని గాలి సుత్తి దెబ్బలకొరిచి

మేలి సొమ్ములగుచు మరియు పసిడి

బాదనార్చుకొన్న భవిత వర్ధిల్లురా

అబలలోన్మిత్ర ఆంధ్ర పుత్ర --- ఆంధ్ర పుత్ర శతకం.

బంగారం అగ్నిలో కాలి సుత్తిదెబ్బలను ఓర్చుకుని విలువైన ఆభరణంగా తయారవుతుంది,అదే విధంగా బాధలను తట్టుకుని మనుగడసాగిస్తే మంచి భవిష్యత్తు ఉంటుంది ఇస్మాయిల్ గారు తెలిపారు కావున సమాజంలో జీవనం సాగించే ప్రతివ్యక్తి బాధలను ఒర్చుకొగలిగే సహనం,వంటివి కలిగి ఉన్నట్లైతే మంచి వ్యక్తిగా సమాజంలో వెలుగొందుతాడని అప్పుడే మంచి సమాజాన్ని ఏర్పరిచే శక్తి సామర్థ్యాలు కలుగుతాయని చెప్పగలము.

9. **ఆత్మాభిమానం:**

మనవంతుడైనవాని మనం బంత్యా

దశల గూడ నున్నాంతాబి యగున్

మునిగిపోవూ వేళలను సూర్య కిరణముల్

మీది ప్రక్క గాదె మొరయు చుడు

ఆత్మాభిమానం కలవారు చివరిదశలో కూడా ఉన్నతంగా జీవిస్తారు సూర్యుడు అస్తమించే సమయంలో కూడా వెలుగును ప్రసాదిస్తాడు కదా

10. **పిసినారి:**

చీమలు పెట్టిన పుట్టలు
పాముల కిరవైన న యట్లు పామరుడు దగన్
హిమంబు గూడ బెట్టిన
బూమేశుల పాలజోరు బుమీలో సుమతీ

పై పద్యంలో చీమలు కష్టపడి పెట్టిన పుట్టలలో పాములు చేరుతాయి. అదే విధంగా మూర్ఖుడు తినకుండా కూడ బెట్టిన సంపద బంగారాన్ని వారికి చెందకుండా ఇతరులు అనుభవించడం జరుగుతుందని బద్దెన వివరించారు.

11. **మనస్సు :**

చిత్త శుద్ధి గలిగి చేసిన పుణ్యంబు
కొంచెమైన నదియు కొదవ కాదు
విత్తనంభు మర్రి వృక్షంబు నెంత
విశ్వ దాభి రామ వినురవేమ.

మంచి మనస్సుతొ చేసిన కొద్దిపాటి పుణ్యకార్యమయినా తక్కువేమీ కాదు ఎట్లనగా చిన్నదైన విత్తనం మహా వృక్షమయిన మర్రిచెట్టుకు జన్మనిస్తుంది కదా.

12. **విద్య:**

దొరలు దోచలేరు , దొంగ లెత్తుకు పోరు
భ్రాతృ జనము వచ్చి పంచుకోరు
విశ్వవర్ధనంబు విద్యా ధనంబురా
లలిత సుగణజాల తెలుగు బాల

విద్యా ధనాన్ని దొరలు దోచుకుపోలేరు, దొంగలు ఎత్తుకు పోలేరు అన్నదమ్ములు వచ్చి పంచుకోలేరు ఈ విద్యా ధనం ప్రపంచ అభివృద్ధికీ మూలం. సమాజానికి విద్య చాలా అవసరమని తెలియజేసారు

13. **మంచి, చెడులు :**

కోకిలమ్మ చేసికొన్న పున్యాంబెమి
కాకి చేసికొన్న కర్మమేమి
మధుర భసనమున మర్యాద ప్రప్తించు
లలిత సుగణజాల జాల తెలుగు బాల

కోయిల చేసుకున్న మంచితనమేమిటీ? కాకి చేసికొన్న కీడు ఏమిటీ మంచిగా మాట్లాడితే మనుషులకు గొప్ప గౌరవం లభిస్తుంది. కరుణశ్రీ తెలుపుతూ మంచి పౌరునిగా ఎదగాలంటే మంచిగా మాట్లాడాలని, అప్పుడే మంచి సమాజాన్నీ ఏర్పరచగలరని ఈ పద్యం తెలుపుతుంది.

14. **ధర్మం :**

ఒరులేయవి యొనరించిన / నరవర! యప్రియము తన మనంబు నకగు దా

నొరలకు నవి సేయకునికి / బరాయణము పరమ ధర్మ పథములకెల్లన్

ఇతరులు ఏ పని చేస్తే తన మనస్సుకు బాధ కలుగుతుందో , ఆ పని తిరిగి తాను ఇతరులకు చేయకుండా వుండటమే అన్ని ధర్మమార్గాల లోనూ గొప్పది.

15. **మనిషి విలువ :**

ప్రశ్న నుండి పుట్టు పరణతి జ్ఞానమ్ము / ప్రశ్నతోడ పెరుగు ప్రాభవమ్ము

ప్రశ్నలేక ప్రగతి ప్రశ్నార్థకమ్మురా / నవయుగాలమాట నార్ల మాట

ప్రశ్నకు జవాబు వెతకటం ద్వారానే ఈ లోకంలో జ్ఞానం వృద్ధి చెందుతుంది . ప్రశ్నించడం వల్లనే సమాజంలో మనిషి విలువ పెరుగుతుంది . ప్రశ్న లేకపోతే ప్రగతి శూన్యం అవుతుంది.

16. **కొబ్బరికాయ ఔచిత్యం:**

మూడు కన్నులుండు ముక్కంటీ యాకాడు / గడ్డమలరు మౌనిగాడు జూడ

వలసినపుడు మనకు నిలిచిన దొరుకును / దీనిభావమేమి తిరుమవేళ

ఈ శతకము నందలి సామాన్య సమస్యలు, చిత్రవిచిత్రములైన సమస్యలు బాలబాలికలకు వినోదము తో వివరించారు పై పద్యములో కొబ్బరికాయ అనే అర్థాన్ని స్ఫురింపజేసే విధంగా ,విద్యార్థులకు విజ్ఞానాన్ని అందించారు. దీనిలో మూడు కన్నులున్నా, పరమేశ్వరుడు కాదని, గడ్డము ఉ న్నా మునీశ్వరుడు కాదని , వలచినపుడు మూడు కన్నులు, మునీశ్వరునీకీ ఉన్నటువంటి గడ్డము, నిలిచి అది కొబ్బరికాయగా కవి భావనని తెలుపడం జరిగింది.

**ముగింపు ;**

నేటి ఆధునిక కాలంలో శతకసాహిత్యం వలన సమసమాజము ఏర్పడుతుంది .శతక విద్య తో సమాజంలో నైతికవిలువలు మెరుగుపడతాయి శతకాలు సామాజికంగా , ఆర్థికంగా , రాజకీయంగా కూడా ఎంతో ప్రయోజనాన్ని కలిగి ఉంటాయి . విద్యార్థులకు తోడ్పాటును అందించడానికి మంచి నడవడిక, జీవన విధానాన్ని మెరుగు పరచుకోవడానికి శతకాలు ఎంతో ఉపయోగపడతాయి. శతకాలు చదవడమేకాకుండా, ఆచరణలో ఉన్నట్లయితే విలువలతో కూడిన నూతన సమాజాన్ని నిర్మించగలుగుతాము.

**ఆధార గ్రంథాలు**

1. ఆంధ్ర శతక సాహిత్య వికాసము - డా. కె . గోపాలకృష్ణారావు

2. వేమన శతకము -వేమన

3. సుమతీ శతకము - బద్దెన

4. తెలుగు బాల శతకం - కరుణశ్రీ

5. నార్లవారి మాట శతకము - నార్ల వెంకటేశ్వరావు

*******

# 74. చంద్రశేఖర అజాద్ కథలు - మనస్తత్వ చిత్రణ.

అందె గోపికృష్ణ

పరిశోధక విద్యార్థి

తెలుగు మరియు ప్రాచ్య భాషా విభాగం

ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం.

9966610737.

చంద్రశేఖర అజాద్ మంచి కథా రచయితగా గుర్తింపు పొందిన రచయిత. ఈయన ఇప్పటి వరకూ 750కి పైగా కథలు రాశారు. ఇంకా రాస్తూనే ఉన్నారు. అంతేకాక చంద్రశేఖర అజాద్ కు మంచి నవలాకారునిగా గుర్తింపు లభించింది. ఇప్పటి వరకూ 85నవలలు, 18నవలికలు రచించినట్లు తెలుస్తుంది. అంతేకాక ఈయన 100కి పైగా కవిత్వాలు, 70కి పైగా రేడియో నాటకాలతో పాటు 700కి పైగా పత్రికా వ్యాసాలు రచించి సుప్రసిద్ధ రచయితగా సాహితీ లోకంలో స్థానం సంపాదించారు. అంతేకాక బాలసాహిత్యంలో తనకంటూ ఒక ప్రత్యేక గుర్తింపు తెచ్చుకున్నారు. వీరికి అనేక సంస్థల నుండి అనేక సన్మానాలను, పురస్కారాలను అందుకొన్నారు. అందులో కొన్ని ముఖ్యమైనవి. 2004 సంవత్సరం విజయనగరంలో అధికార భాషా సంఘం అవార్డు. 2005వ సంవత్సరానికి గాను నవలా విభాగానికి పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి "కీర్తి పురస్కారం". 2005వ సంవత్సరంలో అడవిపూలు లఘుచిత్రానికి సంభాషణలకు గాను నంది అవార్డు. 2014, 15వ సంవత్సరాలలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారి ఉగాది పురస్కారం, కళారత్న(హంస) అవార్డు. 2018వ సంవత్సరంలో కథా,నవల ప్రక్రియకు గాను పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం పురస్కారం లభించాయి. వీరు కేవలం రచయిత మాత్రమే కాదు మంచి నటులు కూడా. అనేక నాటకాలు, సినిమా, సీరియల్స్ లో నటించారు. తన రచనల ద్వారా ప్రజల ఆలోచనల్లో మార్పులు తీసుకురావడమే వీరి ప్రధాన ధ్యేయం.

చంద్రశేఖర అజాద్ తాను రచించిన వివిధ కథలలో ఆయా పాత్రల పరంగా మనస్తత్వ చిత్రణ చేసిన తీరు పరిశీలనార్హం. చంద్రశేఖర అజాద్ అనుసరించిన ఈ విధానం ఆయన కథలకు మంచిపుష్టిని, సహజత్వాన్ని, నిండుతనాన్ని సమకూర్చింది. అంతేకాక ఆయా కథలలోని భిన్న మనస్తత్వం గల పాత్రలు పాఠకుడిని ఎంతగానో ఆకర్షిస్తూ కథలను చదవాలన్న ఉచ్చుకతను కలిగిస్తాయి. కొన్ని పాత్రల ఆలోచనా విధానం, మనస్తత్వం పాఠకుల ఆలోచనా విధానానికి, మనస్తత్వానికి దగ్గరగా ఉండటం ఈ కథల ప్రత్యేకత.

"అమ్మ మనసు" కథలో ప్రధానపాత్ర 'సుబ్బారావు అక్క'. నిజానికి ఈ పాత్ర పేరేమిటో ఎవరికి తెలియదు. ఆమె తమ్ముడు సుబ్బారావు కావడం చేత ఆమెను అందరు సుబ్బారావు అక్క అని పిలుస్తుంటారు. 'చిన్నతనంలోనే పెళ్ళి చేస్తే భర్త చనిపోతే వితంతువుగా మిగిలి నలభై సంవత్సరాలకే శరీరం ముడతలు పడి పళ్ళు ఊడిపోయి మాసిపోయిన చీరతో కూలి కొచ్చేది'. రచయిత ఈ కథను ఆత్మాశ్రయ పద్దతిలో నడిపించారు . ఈ కారణంగా కథకు కేంద్ర బిందువు అయిన పాత్రకు పేరు లేదు. కథ మొత్తంలోనూ రచయిత నేను నాకు అంటూ ఆ పాత్ర స్వగతాన్ని కథలో ప్రకటించారు. ఆ పేరు లేని వ్యక్తి పెద్ద కాంట్రాక్టర్ దగ్గర గుమస్తా గా పని చేస్తుంటాడు. కూలీల చేత దగ్గరుండి పని చేయించడం, వారికి హాజరు వేయడం, కూలి డబ్బులు ఇవ్వడం ఇతని విధులు. సుబ్బారావు అక్క సదరు గుమస్తా ను తన కొడుకుగా ఊహించుకొని సంతోషిస్తుంది. ఇతనికి ఆమెకు రోజుకు వచ్చే రూపాయి కూలి డబ్బులలో నుంచి పావలా ఖర్చు చేసి పూసమిఠాయి కొని పెడుతుంది. ఇది గమనించిన తోటి కూలి జనం కొన్ని రోజులు గడిచిన తరువాత గుమస్తాను చూపి నీ కొడుకు, నీ కొడుకు అని అంటూ ఉండేవారు. తోటి కూలీలు గుమస్తాతో సుబ్బారావు అక్కంటే ఏంటనుకున్నారు అలా ఉంటుంది గాని దాని పేరు మీద అరెకరం పొలం ఉంది. దాని తదనంతరం మీకే రాసిస్తుంది అనేవారు.

సుబ్బారావు అక్క ఎంతో అమాయకురాలు. తనకు కొద్దిపాటి జ్ఞానం లభించే నాటికి ఆమె వితంతువు. నన్ను చూడగానే ఆమెలో ఒక్కోసారిగా మార్పు వచ్చేది. ఆడ కూలీల్తో అరుస్తుంటే అదిగో మీ అబ్బాయి వస్తున్నాడు అంటే ఒక్కోసారిగా ఆగిపోయేది. తెలిసీతెలియని వయసులో భర్త దూరమైన సుబ్బారావు అక్క తన జీవితంలో ఏవేవో ఆలోచించడం, ఊహించుకోవడం సహజం. తన భర్త బ్రతికి ఉంటే గుమస్తా లాంటి కొడుకు తనకు కూడా ఉండేవాడు కదా అని ఆలోచించి మానసికంగా వేదనను అనుభవించి ఉంటుంది. తనకు కొడుకు లేని లోటును గుమస్తా ద్వారా తీర్చుకొని తనకు పుట్టని కొడుకును గుమస్తాలో చూచి మురిసిపోతుంది ఆ అమాయకురాలు. ఇలా ఊహించుకోవడం, భావించుకోవడం సర్వసాధారణం. తనదికానిదాన్ని, తనకులేనిదాన్ని వేరే వారిని చూచి ఊహించుకొని సంతృప్తి పడటం ఆ వ్యక్తి జీవితంలో కొంత ఊరటను మనశ్శాంతిని కలిగించవచ్చు. ఈ కథలో సుబ్బారావు అక్క పాత్ర మానసిక స్థితిని పరిశీలించినప్పుడు ఆ పాత్ర పట్ల జాలి, సానుభూతి కలగడం సహజం.

సుబ్బారావు అక్కకు చిన్నతనంలోనే భర్త మరణించాడు. కొడుకు ప్రసక్తి లేనే లేదు. చిత్రమేమంటే ఈమె ఎవరెవరినో చూచి మరణించిన తన భర్తను గురించి ఆలోచించడం గానీ, ఊహించుకోవడం గానీ చేయలేదు. అదే ఈ పాత్ర ప్రత్యేకత. సాధారణంగా స్త్రీలందరూ మాతృత్వానికే ప్రాధాన్యత ఇస్తారు. ఒక సినీ కవి అన్నట్లు ' మాతృత్వంలోనే ఉంది ఆడ జన్మ సార్ధకం. అమ్మ అనిపించుకొనుటే స్త్రీ మూర్తికి గౌరవం' ఇది అక్షర సత్యం. విద్యావిహీన అమాయకురాలు అయిన సుబ్బారావు అక్కలో గుమస్తాను చూడగానే మాతృత్వం పొంగిపొరలింది.

వంతెన నిర్మాణం పూర్తికాకముందే గుమస్తా తొందర పని మీద వాళ్ళ ఊరు వెళ్ళిపోయాడు. గుమస్తా ఊరికి వెళ్ళిన విషయం కూలీలకెవ్వరికీ తెలియదు. పది సంవత్సరాలు కాలగర్భంలో కలిసిపోయాయి. ఇటీవలి కాలంలో గుమస్తా మనసులో ఏదో సంఘర్షణ. ' ఈ నడుమ నా కలలో ఎవరో పిలుస్తున్న భావన. ఓ చల్లని హస్తం మృదువుగా నా బుగ్గలు నిమిరినట్టు ఎక్కడి నుంచో నీటి అలల మీద బంగారపు వెలుగు ప్రవహిస్తున్నట్టు ఏదోపాట వినిపిస్తున్నట్లు ఉంది అందుకే వచ్చేశాను'. గుమస్తా సుబ్బారావు అక్క ఇల్లు వెతుకుంటూ వెళ్ళాడు. ఆ సమయానికి ఆమె జీవితానికి అంతిమ ఘడియల్లో ఉంది.

సుబ్బారావు తన అక్కతో గుమస్తాను చూపి ' "ఒసేయ్ అప్పా... ఎవరొచ్చారో చూడు... బాబొచ్చాడే" దగ్గరగా అరుస్తున్నాడు సుబ్బారావు. ఆ గుంటకళ్ళలో ఎక్కడో కదలిక... ఆమె పెదవులు విచ్చుకున్నాయి. నేను మంచం మీద కూర్చుని చేతులు పట్టుకున్నాను. ఎందుకో ఆమె సిగ్గు పడినట్లనిపించింది. నాకేసి నిండుగా చూసుకొంది. ఏదో చెప్పాలని ప్రయత్నం చేస్తోంది. సుబ్బారావుకేసి తిరిగింది. ఏమిటే అన్నాడు. అతికష్టం మీద దిండుకేసి చూపించింది. "దీనికెప్పుడూ ఇదే గొడవ" అన్నాడు సుబ్బారావు. వణుకుతున్న చేతుల్తో నాకు అందించింది. ఆ కంటి కొనలనుండి ఓ నీటి బొట్టు ముడతలు పడ్డ శరీరాన్ని తడుపుతోంది. అది సంతోషమో, దుఃఖమో నాకు తెలియదు. ఆమె చేతిని నేను విడువలేదు. ఎందుకో నాకేసి చూస్తున్న ఆమె కళ్ళు జీవం కోల్పోయినట్లనిపించింది. నేను పొట్లం విప్పాను... పూస మిఠాయి అమ్మ హృదయంలా వుంది'.చంద్రశేఖర అజాద్ స్త్రీకి సహజ లక్షణమైన మాతృత్వ స్వభావాన్ని 'అమ్మ మనసు' అనే కథలో సుబ్బారావు అక్క పాత్ర ద్వారా ఆవిష్కరించిన తీరు ఎంతో సహజ సుందరం. కథలోని ముగింపు అద్భుతంగా సాగింది.

చంద్రశేఖర అజాద్ చిత్రించిన మరో పాత్ర 'అమ్మ' కథలోని "అమ్మ" పాత్ర. ఒక కుటుంబంలో పేదరికం కారణంగా రెండు రోజుల నుండి తిండి లేదు. ఆ ఇంటి ఇల్లాలు అదే అమ్మ ఎవరినో పది రూపాయలు అప్పడిగి బియ్యం, నూనె, వగైరా సరుకులు తెమ్మని తన కొడుకును పంపుతుంది. సరుకులు తీసుకొని తిరిగి వస్తున్న కొడుకును ఒక సైకిల్ గుద్దుతుంది. ఫలితంగా సరుకులతో పాటు పిల్లవాడు కూడా దుమ్ములో పడిపోతాడు. సరుకులు మొత్తం మట్టిపాలైపోతాయి. ఈ సంగతి తెలిసిన తల్లి తీవ్రమైన కోపంతో కొడుకును ఎడాపెడా మీదపడి కొడుతోంది. అదే రోజు సాయంత్రం దెబ్బలు తిన్న కొడుకు మూలుగుతుండటం చూసి విపరీతంగా బాధపడుతుంది.

"దరిద్రపు మొఖమోడా ! కళ్ళు నెత్తిన పెట్టుకొని నడుస్తావురా ! ఎన్నిసార్లు చెప్పినా అంతే. ముదనష్టపోడా ! నువ్వు చచ్చినా బాగుండేది". అని తిట్టిన తల్లి తరువాత "ఈ పాపిష్టి చేతులు విరిగిపోను వీటితోనే నా బిడ్డను కొట్టాను అని బాధపడుతుంది. తల్లి బిడ్డను కొట్టితిట్టడం వెనుక తల్లికి బిడ్డపై ఏలాంటి ద్వేషం లేదు. రెండు రోజుల నుండి ఇంట్లో ఎవరికీ తిండి లేదు. ఈ రోజైన కాసిని గంజి కాసుకొని తాగొచ్చునని ఎవరినో అడిగి పది రూపాయలు అప్పుతెచ్చి సరుకులకు పంపిన కొడుకు ఆసరుకులను మట్టిపాలు చేయడంతో ఆమెకు తీవ్రమైన కోపం వచ్చింది. ఆరోజు కూడా అన్నానికి నోచుకోకపోగా అదనంగా పది రూపాయలు అప్పు మిగిలింది. ఈ దుస్థితిలో ఏ తల్లి మాత్రం ఏం చేస్తుంది. అదే తల్లి కొడుకు బాధలను చూడలేక తనను తాను నిందించుకుంటూ బాధపడుతుంది.

నిజానికి తల్లికి కొడుకు మీద ఎలాంటి కోపం లేదు. ఆమె కొడుకుపై చేయి చేసుకొని తిట్టడానికి పేదరికమే కారణం. అదే తల్లి తొందరపడి కొడుకును కొట్టినందుకు ఎంతగానో విచారించడాన్ని మనం గమనించాలి. రచయిత మాతృ హృదయాన్ని 'అమ్మ మనసు'లో ఒక కోణంలో నుంచి 'అమ్మ' లో మరొక కోణంలో నుంచి ప్రతిపాదించారు. ఎన్నివిధాల చెప్పినా మాతృ ప్రేమను మించినది ఈ ప్రపంచంలో లేదు. అది అనుభవైక వేద్యం. పిల్లల పట్ల తల్లిదండ్రులకు ఉన్న ప్రేమ పిల్లలకు ఉండటం లేదు. ఇది ఒక సామాజిక సమస్యగా పరిణమించింది. పిల్లలు డబ్బుకిచ్చిన ప్రాధాన్యం కనిపెంచిన తల్లిదండ్రులకు ఇవ్వడం లేదు. "ప్రపంచంలో అన్నింటికంటే భయంకరమైనది డబ్బు ! అది సమగ్రం. డబ్బుకు ఎలాంటి పాక్షికత్వం లేదు. సంపూర్ణంగా అన్ని అనుభూతుల్ని, అనుబంధాల్ని ధ్వంసం చేయగల శక్తి దానికే ఉంది. అయినా అది శాశ్వతం కాదు...కాదు...కాదు !". చంద్రశేఖర అజాద్ రచించిన మరో మంచి కథ 'బుడగ'. ఇది మనోవిశ్లేషణాత్మక కథ. ఈ కథలోని ప్రధాన పాత్రకు పేరు లేదు. రచయిత ఉత్తమ పురుషలో ఈ కథను కొనసాగించారు. ప్రధానపాత్ర స్వగతం అంతా రచయిత నోటి వెంటే వెలువడుతుంది. ఇంక అసలు విషయానికొస్తే ప్రధానపాత్ర హోటల్ లో ఒక యువతిని చూస్తాడు. ఆమెకు తమ్ముడు తప్ప ఎవరూ లేరు. హోటల్ నిర్వహణా భాద్యతంతా ఆ అమ్మాయి పైనే ఆధారపడి ఉంటుంది. వివాహమై భార్యతో కలిసి పదిహేనేళ్ళు కాపురం చేసిన ఆ వ్యక్తిలో విపరీతమైన భావ సంఘర్షణ చోటుచేసుకుంటుంది. "నా దృష్టిలో కామని కంటే ఆ అమ్మాయి దగ్గర నేను పొందిన విశ్రాంతికే ఎక్కువ ప్రాధాన్యత ఉంది. ఎందుకిలా జరిగింది?. ఆ అమ్మాయి దగ్గర నాకెందుకా అనుభూతి కలిగింది ?. ఆ అమ్మాయితో కూర్చుని దశాబ్దాల తరబడి మాట్లాడాలని ఎందుకనిపించింది ?. ఎందుకని ఆ అమ్మాయి చిరునవ్వు చూస్తూ కాలం గడిపేయాలనుకోవడం ?. ఎందుకని ఆ అమ్మాయిని నా హృదయానికి హత్తుకోవాలనే భావం కలగటం ?. ఓ తండ్రి లేని బిడ్డ అనే భావం... ఓ ఆధ్యాత్మిక భావంతో పాటు ఎక్కడో కామపు వికారం లాంటి దుంటే దాన్నే ప్రధానంగా తీసుకోవాలా ?. నాకు పెద్దకొడుకు ఉంటే ఆ అమ్మాయిని కోడలిగా చేసుకోవాలనిపించింది. పెళ్ళి కాని తమ్ముడుంటే వారికి ఆ అమ్మాయినిచ్చి వివాహం చేయాలని ఆరాటం కలిగింది. నాకు తెలిసిన వారెవరైనా ఆమె చేయి అందుకుంటే బాగుండనిపించింది".

మనసు కళ్లెం లేని గుర్రం లాంటిది. కళ్లెం లేని గుర్రం ఎటుపోతుందో, ఎక్కడికి పోతుందో దానికే తెలియదు. ఆయా సందర్భాలలో అంటే కొందరు వ్యక్తులను చూచినప్పుడు, కొన్ని సంఘటనలను విన్నప్పుడు మన ప్రమేయం లేకుండానే మన మనసులో ఏవేవో అలజడులు, వికారాలు, ఆందోళనలు, అర్థం పర్థం లేని ఊహలు, ఉశ్చనీచాలకు అతీతంగా ఆలోచనలు చెలరేగి మనలను కలవరపెడతాయి. వీటి అన్నింటికి మూలం మన మనసే. మనలో ఉన్న మనసును అదుపు చేసే స్థితిని మనం కోల్పోతాం. ప్రతివ్యక్తికి ఎప్పుడో ఒకప్పుడు ఈ విధమైన మానసిక సంఘర్షణ తప్పదు. అయితే ప్రతివారు ఏమి ఎరుగనట్లు గుంభనంగా ఉంటారు. ఈ యదార్థాన్ని చంద్రశేఖర అజాద్ 'బుడగ' కథలో ప్రధానపాత్ర పరంగా వివరించారు. "మన ఏవ మనుష్యాణాం!కారణం బంధమోక్షయోః.

******

# 75. క్షుద్ర శక్తులపై ఎక్కుపెట్టిన అస్త్రం యజ్ఞం

**డా. కె.వి. శాంత కుమారి,**

తెలుగు అధ్యాపకులు,

ఎస్ ఆర్ ఆర్ & సి వి ఆర్ (స్వయం ప్రతిపత్తి) కళాశాల,

విజయవాడ.9912579570.

**డాక్టర్ పోలుమాటి అన్నవరం సత్యనారాయణ**

తెలుగు శాఖ అధ్యక్షులు

ప్రభుత్వ కళాశాల అటానమస్

రాజమహేంద్రవరం. Ph 9492566950.

**పరిశోధనా పత్ర సంగ్రహం**

**దళిత సమస్యేతర దళితుల సాహిత్యం**

దళిత సాహిత్యం అంటే దళితుల సమస్యల గురించి దళితులు మాత్రమే రాసిందని లేదా దళిత సమస్యల గురించి దళితేతరులు కూడా రాసింది అని అర్థం చేసుకుంటాం. కానీ దళిత సాహిత్యం అంటే దళితులు రాసి దళితులు సృష్టించిన ఏ సాహిత్యమైనా దళిత సాహిత్యమే అవుతుంది. అంటే దళితుల సాహిత్యంలో దళిత సమస్యలే ఉండక్కర్లేదు. వారి ప్రపంచ అనుభవాలన్నీ కళాత్మకంగా ఆవిష్కరించబడడం దళిత సాహిత్యం గా ఇక్కడ మనం గుర్తిస్తాం. సమకాలీన సమాజాన్ని సమాజం పట్ల దళిత కవి ప్రాపంచిక దృక్పథం కళాత్మకంగా ఆవిష్కరించబడడాన్ని మనం పరిశోధిస్తున్నప్పుడు ఎన్నో వినూత్నమైన విభిన్నమైన అంశాలు మనకు కనబడతాయి. ముఖ్యంగా సహబాధితులు ఎవరైనా వారి పట్ల సహానుభూతి వర్గ పరిమితులను దాటి వారి గురించి మాట్లాడేటట్టు చేయడం విద్య సాధించిన ఒక పరిణామ వికాసంగా చెప్పుకోవచ్చు.

శ్రీశ్రీ బాధ అంతా ప్రపంచపు బాధ అన్నట్టు యజ్ఞం కవిత సంపుటి ద్వారా కవి దళితేతర సమస్యలను అంటే స్త్రీల పక్షంగాను, వర్గాల కతీతంగాను అవినీతిని అండగట్టడం లాంటి సమస్యలను సాహిత్యీకరించడం కనిపిస్తుంది. ఇక్కడ దళితేతర సమస్యలు అంటే ఉమ్మడి సమస్యలు అని అర్థం చేసుకోవాలి. ఈ ఉమ్మడి సమస్యలు అనుభవిస్తున్న వారిలో దళితులు కూడా ఉండవచ్చు అయినప్పటికీ దళిత సాహిత్యం రూఢిలో కేవలం దళితుల గురించి మాత్రమే చర్చిస్తుంది అని అర్థం చేసుకుంటాం కాబట్టి ఇక్కడ పీడితులందరి తరుపున సమస్యలను సాహిత్యీకరించడం దళితుల దళితేతర సాహిత్యంగా చెప్పడం జరుగుతున్నది. సహ పీడితుల ఉమ్మడి సమస్యలన్నింటికీ ప్రాతినిధ్యం వహిస్తూ మేధోపరమైన మద్దతు ప్రకటిస్తూ తగిన కార్యాచరణ వైపుకు నడిపిస్తూ చైతన్య పరచటం ఈ కవితా సంపుటిలోని యాభై కవితలు ద్వారా తెలుస్తుంది.

**కీలక పదాలు**

నిబద్ధ సాహిత్యం , స్త్రీ వాదం, దళిత వాదం, వస్తువు , సమష్టి ప్రయోజనం, ప్రాతినిధ్యం, మేధోపరమద్దతు, భిన్నత్వంలో ఏకత్వం. వుమ్మడి ప్రయోజనం. శ్రేయో రాజ్యం.

**ఉపోద్ఘాతం:** ప్రముఖ దళిత సాహిత్య విమర్శకుడు, కవి ఆదికవి నన్నయ విశ్వవిద్యాలయం ఆచార్యులు డాక్టర్ తరపట్ల సత్యనారాయణ రచించిన యజ్ఞం అనే కవితా సంపుటిని పరిశోధించడం జరుగుతున్నది. దీనిలో దళితుల సమస్యలనే కాకుండా దళితేతర సమస్యలు

అంటే పీడుతుల ఉమ్మడి సమస్యలన్నింటినీ చర్చించడం జరిగింది. దీనిలో ప్రధానంగా అవినీతి స్త్రీలపై దోపిడీ నిరుద్యోగం పేదరికం అనే నాలుగు అంశాలను సాహిత్యీకరించడం జరిగింది ఈ కవితా సంపుటిలో మొత్తం 50 కవితలు ఉన్నాయి ప్రతి కవిత దానిదైన నిర్మాణ శిల్పంతో అభివ్యక్తి సౌందర్యంతో వస్తు వైవిధ్యంతో తీర్చిదిద్దబడ్డాయి అయితే మనం కేవలం ఈ కవితా సంపుటి నుంచి వస్తు దృక్కోణం నుంచి మాత్రమే ఈపరిశోధన పరిమితం చేయబడింది. శిల్ప అభివ్యక్తి నైపుణ్యాలను గురించి తర్వాత చర్చించడం జరుగుతుంది.

**విషయం**

దళితులు రాసిన సాహిత్యం అంటే వారి సాధక బాధకాల గురించి మాత్రమే అనుకోవడం సహజం. దళితుల రాసిన సాహిత్యంలో ప్రధానంగా అంటరానితనం వివక్షలు చారిత్రకంగా సమకాలీనంగా ఎన్ని వెర్రి తలలు వేసాయో వాటిని నిర్మూలించడం ఎలాగో లాంటి విషయాలు కళాత్మకంగా చర్చించడం జరిగింది. కానీ దీనికి భిన్నంగా దళితులు తమ స్వీయ సమస్యల గురించి మాత్రమే కాకుండా దేశంలోని అన్ని రకాల అసమానతల మీద, అన్ని రకాల పీడిత వర్గాల పక్షాన మాట్లాడడం మనకు కొత్తగా కనిపిస్తుంది. ఎంతసేపు చారిత్రకంగా సమకాలీనంగా వారు ఎలా అణిచివేతకు గురైంది మాత్రమే చర్చనీయఅంశాలు అవుతున్న నేపథ్యంలో జాతి తరపున, పీడిత వర్గాల అందరి తరపున ప్రాతినిధ్యం వహించడం చాలా వినూత్న అంశంగా కనిపిస్తుంది. వివక్ష గురించి అంటరానితనం గురించి దళితేతరులు కూడా రాశారు. ఇలాంటి నిబద్ధ సాహిత్యం చారిత్రకంగా మనకు ఎక్కువగా కనిపిస్తుంది. దీనికి భిన్నంగా దళితులు వారి సమస్యల గురించి వారే అక్షరాస్యత పెరిగిన తర్వాత రాసుకోవడం కూడా మనకు కనిపిస్తుంది. కానీ దళిత మేధావులు కేవలం వారి వర్గ ప్రయోజనాల దృష్ట్యా మాత్రమే కాకుండా పీడితుల అందరి పక్షాన మాట్లాడడం, ముఖ్యంగా ఆర్థిక అసమానతల గురించి మాత్రమే కాకుండా సమకాలీన సమస్యలు అయిన నిరుద్యోగం, పేదరికం, అవినీతి, స్త్రీ సాధికారత లాంటి అంశాల గురించి కళాత్మకంగా వ్యక్తీకరించడం ఆహ్వానించదగిన పరిణామం.

సమాజం ఆయా వర్గాలుగా విడిపోతూ తమ తమ వర్గ ప్రయోజనాల కోసం మాత్రమే మాట్లాడుతున్న నేపద్యంలో ఇలాంటి సమైక్య గానం ఎంతైనా అవసరం. సాధారణంగా దళిత సాహిత్యం లో దళిత వాదంతో పాటు దళిత స్త్రీవాదం కూడా అంతర్భాగం అయినప్పటికీ దోపిడీ మీద, లింగపరమైన దోపిడీ మీద పురుషులు మాట్లాడడం అందులోనూ దళిత పురుషులు మాట్లాడడం ఆహ్వానించదగిన విషయం. అంటే దళితేతురులు దళితుల గురించి ఆలోచించినట్టుగా, ప్రగతిశీలవాదులు అన్ని రకాల పీడితులందరి గురించి పట్టించుకున్నట్టు గా దళితులు కూడా పీడితులందరి పక్షాన మాట్లాడడం ప్రగతిశీల అంశం . అంటే దళితులు తమ గురించే కాకుండా ఇతరులకు ప్రాతినిధ్యం వహించే దశకు చేరుకున్నారు అన్నది దీనివల్ల మనకు తెలుస్తుంది. ఇదంతా 74 ఏళ్ల స్వతంత్రం ప్రతిఫలమే అని మనకు అర్థమవుతుంది. దళితులు విద్యావంతుల అవటం వల్ల మరింతగా వారి సమస్యలు పరంగానే కాకుండా ఇతర పీడితుల పక్షాన నిలబడే మేథోపరమైన సహకారం అందించే వాతావరణం మనకు కనిపిస్తుంది. ఇది దేశం ప్రగతిశీల పథంలోకి ప్రయాణం చేస్తుంది అనడానికి ఒక ఆనవాలు.

ఇంతకుముందు దళితుల పక్షాన కొంతమంది సంస్కర్తలు మాట్లాడవలసి వచ్చేది. ఆ సంస్కర్తలు ఉన్నత తరగతులకు చెందినవారు అయి ఉండేవారు. దళితులు విద్యావంతులు అయిన దగ్గర నుంచి వారి సమస్యల గురించివారే వారి వర్గాలకు ప్రాతినిధ్యం వహిస్తూ మాట్లాడుకోవడం కనిపించిన నేపథ్యంలో కళాత్మక వ్యక్తీకరణలు అనేకం వెలువడ్డాయి . అంటే దళితులు చదువుకోవడమే కాదు చదువుకున్న వాళ్ళ సాహిత్యానికి ఏ మాత్రం తీసిపోకుండా ప్రత్యామ్నాయ సాహిత్యాన్ని సృష్టించగలిగారు ఇది ఒక ప్రగతిశీల పరిణామం. అంతకుమించి ప్రస్తుతం దళిత మేధావులు విద్యావంతులైన అన్ని రంగాలలో స్థిరపడడమే కాకుండా సాహిత్య రంగంలో కూడా వారు నిలదొక్కుకుని సమకాలీన సాహిత్య ప్రక్రియలను గతకాలపు సాహిత్య చరిత్రను అధ్యయనం చేసి ఆకళింపు చేసుకుని కావ్య వస్తువులోను కావ్య అభివ్యక్తీలోనూ వినూత్నతను చాటుకుంటున్నారు. అదిమాత్రమే కాకుండాదీనివల్ల జ్ఞానం ఒకరి సొమ్ము మాత్రమే

కాదు అని మరోసారి రుజువుతున్నది. విద్యావంతులైనప్పటికీ సమాజంలోని మెజారిటీ వర్గాల జనానికి విశాల దృక్పథం అలవడదు సంకుచిత దృక్పథంతోనే వ్యవహరిస్తూ ఉండడం మనకు తెలిసిన అంశమే . దళితులులో చాలామంది మొదటి తరం విద్యావంతులు గానే నేటికీ ఉన్నారు వారు ఇతరుల పక్షాన మాట్లాడడం అంటే వారి సమస్యలను సహానుభూతి చెందటం అంటే వారి మేధో వికాసంతో పాటు మానసిక వికాసం కూడాపెరిగింది అని దీని ద్వారా అర్థం అవుతుంది. మానసిక పరిణితి చాలామందికి తెలివితేటలు పెరిగినప్పటికీ ఉండకపోవడం గమనార్హం.

జ్ఞానాన్ని తమ సొంత లాభం కోసం మాత్రమే వాడుకునే సమాజంలో మొదటి తరం విద్యావంతులుగా ఉన్నప్పటికీ వారికి విద్యా నేపథ్యం లేనప్పటికీ పూర్వీకులు జ్ఞాన బోధలు అలవడనప్పటికీ దళిత మేధావులు వారి స్వీయ సమస్యలను లేదా వారి వర్గ సమస్యలు మాత్రమే కాకుండా సామాజిక ఉమ్మడి సమస్యలు అన్నిటి గురించి ఇవాళ మాట్లాడడం, వాటిని కళాత్మకంగా వ్యక్తీకరించడం వారి మేధో వికాసమే కాదు మానసిక పరిణితి, మానసిక వికాసం, సంపూర్ణమూర్తిమత్వం వైపుకు వారు ప్రయాణిస్తున్నారు అని మనకు అర్థమవుతుంది. ఇది కోటలను గోడలను ఆయా వర్గాల మధ్య నిర్మూలించే దిశగా పనిచేస్తుందని నొక్కి వక్కాణించవచ్చు. 'సొంత లాభం కొంత మానుకుని పొరుగు వాడికి తోడు పడవోయ్' అన్న మహాకవి గురజాడ మాటలు దళిత మేధావులలో అంకురార్పణ చెంది ఫలించాయి అని చెప్పవచ్చు. మహాకవి వారసత్వాన్ని పుణికి పుచ్చుకు వైతాళిక గీతం పాడుతున్న దళిత మేధావుల కృషి ప్రశంసనీయం. దీనివల్ల కేవలం వర్గ ప్రయోజనాలు మాత్రమే కాకుండా వ్యష్టి ప్రయోజనాలు మాత్రమే కాకుండా సమిష్టిగా కృషి చేయడం ఎలాగో తెలుస్తుంది సమష్టి గురించి ఎక్కువగా మాట్లాడడం జాతికి మంచి చేస్తుంది ఇది దళితేతరులకే కాదు దళితులకుకూడా మంచి చేస్తుంది వర్గ భావనలను అధిగమించి ప్రాంతీయ భావనలను ధిక్కరించి ముందుకు వెళ్ళడం గా మనం చూడవచ్చు.

'మంచి అన్నది మాల అయితే మాలనేనవుతాను' అన్నట్టుగా ఎవరైనా సరే వారి పక్షాన కుల మత ప్రాంత వర్గ లింగ పరిమితులు, ప్రాతినిధ్యాలు దాటి మాట్లాడడం ఎవరికైనా ఆదర్శం అవుతుంది అని గమనించాలి. చాలామంది రచయితలు కవులు కళాకారులు తమ తమ వర్గాలకు మాత్రమే ప్రాతినిధ్యం వహించడం, వాటి పరిధిలోనే ఉండిపోవటం, ఆయా పరిమితుల్లోవాటి కోసమే బతకటం, నిలబడడం సర్వసాధారణం. ఆయా నేపథ్యాల భూమిక ఏమాత్రం లేకపోయినప్పటికీ అసమానతలకు వ్యతిరేకంగా గళం విప్పడం, సహానుభూతి చెందటం, ఆయా సంకుచిత పరిమితులను అతిక్రమించటం, అధిగమించటం శుభ పరిణామం. మహిళల గురించి మహిళలే రాయాలి దళితుల గురించి దళితులే రాయాలి మిగిలిన వారి ఉదార స్వభావం సానుభూతి మాకు అక్కర్లేదు అనుకునే వారు ఉన్నారు. అది మనకు సంబంధం లేని వ్యవహారం అని కొంతమంది వర్గీయులు అనుకునే అవకాశం ఉంది మొత్తం మీద మానవ ప్రగతికి దోహదపడే ఏదైనా తనదిగా భావించే వైఖరి సన్నగిల్లుతున్న తరుణంలో పీడితుల తాడితుల బాధితుల అందరి తరపున ఉమ్మడి ప్రాతినిధ్యం వహించే సాహిత్యం రావడంఆహ్వానించదగ్గ పరిణామం. 'ఆడది తిరిగి చెడింది మగవాడు తిరగక చెడ్డాడు' అన్న నానుడి మనకు తెలిసిందే. స్త్రీల గురించి పితృ స్వామ్య భావజాల వైఖరి దీనికి ఆధారం ఎవరు ఎవరి గురించైనా మాట్లాడవచ్చు ఎవరు ఎవరి సమస్యనైనా సాహిత్యీకరించవచ్చు. కావ్య వస్తువు మీద ఎవరికి గుత్తాధిపత్యం ఉండబోదు. ఫలానా సమస్య గురించి పలానా వాళ్లే రాయాలి అన్న నిబంధనలు చెరిపేసుకొని వర్గ, ప్రాంత, కుల, లింగ వివక్షలకు పరిధులకు వ్యతిరేకంగా ప్రగతిశీల సాహిత్యాన్ని సృష్టించవచ్చు.

'దేశమంటే మట్టి కాదు దేశమంటే మనుషులు' కాబట్టి కేవలం నైసర్గిక స్వరూపాలను నదులను కీర్తించడం కాకుండా తోటి మనుషులను పట్టించుకోవడం వారి హక్కులను గుర్తించడం రక్షించడం లాంటి పనులకు సహకరించే భావజాలాన్ని పెంచి పోషించడం ముఖ్యం అని యజ్ఞం కవితా సంపుటి ద్వారా కవి వ్యక్తం చేస్తున్నాడు. దేశమాత గురించి మాట్లాడడం అంటే దేశం గురించి మాట్లాడడం దేశం గురించి మాట్లాడటం అంటే దేశంలోని ప్రజల గురించి మాట్లాడడం దీనినే దేశమాతను ప్రతీకగా చేసుకుని దేశంలో ఉన్న

సమస్యలన్నింటి గురించి కవి యాకరువు పెడుతున్నాడు వాటి పరిష్కార మార్గాల గురించి ఆలోచించమని వాటిని మన దృష్టికి తీసుకు వస్తున్నాడు. దేశంలో ప్రధాన బాధితులైన దళితులు, ఆదివాసీలు, మహిళలు గురించి మాత్రమే కాకుండా దేశంలో రాజ్యాంగ శక్తులుగా చెప్పబడే కార్యనిర్వాహక, శాసన, న్యాయ శాఖలలో ఉన్న అధికార యంత్రాంగం పక్షపాత ధోరణితో ధనవంతులకు కొమ్ముకాయటాన్ని కవి నిరసిస్తున్నాడు. శాసనకర్తలుగా రాజకీయ నాయకులు స్వీయ ప్రయోజనాలకు, అవినీతికి పాల్పడడం అసమానతలను పెంచి పోషించడం, వారికి పెంపుడు కుక్కలుగా వ్యవహరించే కార్యనిర్వాహక శాఖ అధికార యంత్రాంగాన్ని దుయ్యబట్టడం మనకు యజ్ఞం కవితా సంపుటిలో కనిపిస్తుంది.

రాజ్యాంగానికి వెలుపల ప్రజాహిత ప్రయోజనాల కోసం సిద్ధాంతాల కోసం ప్రాణాలు అర్పించే ప్రాణాలు తీసే సైద్ధాంతిక భూమికపై నిలబడి  పనిచేసే మావోయిస్టుల పై సానుభూతి విశ్వసనీయత కవి కనపరచడం కూడా మనకు కనిపిస్తుంది ప్రజాధనం తీసుకుంటూ ప్రజలకు సేవ చేయాల్సింది పోయి ధనవంతులకు కొమ్ముకాసే అధికార యంత్రాంగం మీద కవి తిరస్కారాన్ని ప్రకటిస్తున్నాడు. దళితుల సాహిత్యం రాజ్యాంగ భూమిక మీద నిలబడి వికాసం చెందింది గా మనకు మొదటి నుంచి కనిపిస్తుంది. హింసాత్మక చర్యలు దీనికి వ్యతిరేకం. ప్రజాస్వామ్య సూత్రాలకు అనుగుణంగానే దీని భావజాలం ఉంటుంది. స్వేచ్ఛ, సమానత్వం, స్వాతంత్రంలాంటి వైఖరులను దేశ ప్రజలందరిలో పాదుకొల్పడానికి ఈ సాహిత్యం పని చేస్తుంది. యజ్ఞం కవితా సంపుటిలో కవి తనదైన నిర్దిష్ట గ్రంథ నిర్మాణ సూత్రాలు పాటించినట్లు కనిపిస్తుంది ప్రారంభంలోనే తన ఎజెండాను కవిత్వీకరించటం మనకు తన మేనిఫెస్టో ను క్లుప్తంగా చెప్పినట్టయింది. దళిత సాహిత్యం అంటేనే కేవలం ధిక్కారస్వరం తిరుగుబాటు బావుటా, ఒక విమర్శాస్త్రంగా మాత్రమే భావించడం . దాదాపు ప్రతి దళిత కవిలోను మనకు కనిపించే సామాన్య అంశం. ఇంతకుమించి దళిత సాహిత్యం నుంచి మరి ఏమీ ఆశించలేమా ? అన్న కోణంలో కూడా దీన్ని అధ్యయనం చేయాల్సి ఉంటుంది .

ఎద్దేవా చేయటం వెక్కిరించడం లో భాగంగా ఒక నమూనాకు పేరడీగా మాత్రమే దళిత సాహిత్యం మిగిలిపోవాలా? సమాంతరంగా ప్రయాణం చేయటంలో దళిత సాహిత్యం ఉపశ్రేణి కాకుండా లేదా ప్రధాన స్రవంతికి ఉపపాయగా కాకుండా మరి ఏ సాహిత్య దృక్పథానికి తగ్గకుండా తన సమానత్వాన్ని, సరిలేని తనాన్ని కాపాడుకోవాల్సిన ఆవశ్యకతను గుర్తించాల్సి ఉన్నది. అమృతం కురిసిన రాత్రి కవితా సంపుటిలో తిలక్ వాక్యాలను తలపించేటట్టుగా డాక్టర్ తరపట్ల తన మేనిఫెస్టోను కవిత్వీకరించడం కనిపిస్తుంది. అంతేకాకుండా 'స్మశానాల్లాంటి నిఘంటువుల్ని దాటి...'  అన్న శ్రీశ్రీ వాక్యాలను కూడా ఈయన కవిత తలపింప చేస్తుంది . కులం మతం లింగ వర్గ ఆధిపత్యాలకు వ్యతిరేకంగా అన్ని రంగాలలోనూ సమానత్వాన్ని ప్రతిష్టాపించాలనేదే కవి సంకల్పంగా తేటతెల్లమవుతుంది .

సుకుమారమైన చమత్కారం సాహిత్య పరమైన వెక్కిరింతలను కలగలిపి అరాచకత్వాన్ని ఎద్దేవా చేయటం నేను అన్న కవితలో చెబుతాడు. పాదరక్షలు వాటి ప్రాథమిక అవసరాన్ని మించి కులాధిపత్య సమాజం నుంచి రక్షగా కూడా భావించడం కనిపిస్తుంది. వస్తుజాలం సామాజిక అంతస్తులు పెంచే ఉపకరణంగా ఉపశ్రేణి వర్గాలుగా భావించబడే వారు భావించడం గమనార్హం. ప్రాథమిక అవసరాలు తీర్చుకోవాలి. గతాల్లోనుంచి వచ్చిన ఈ వర్గాలు న్యూనతకు కూడా గురైన క్రమంలో నుంచి 'నా కాళ్ళకు జోళ్ళు ఖచ్చితంగా తొడుక్కుంటాను రోడ్లపై రాళ్లు గుచ్చుకుంటాయని కాదు"(యజ్ఞం పుట 28 ) అన్న వాక్యాలను గమనించాలి. అంబేద్కర్ మను ధర్మ శాస్త్రాన్ని తగలేసినప్పటినుంచి బౌద్ధ మతాన్ని స్వీకరించినప్పటి నుండి ఆయన అనుచరులుగా దళితుల హిందూ మత వ్యతిరేకంగా ప్రవర్తించడం కనిపిస్తుంది. హిందూ మత అనుయాయులైన కొంతమంది తోటి దళితుల్ని విమర్శించడం కూడా వినిపిస్తుంది. ఇదంతా గోడలకు సమాంతరంగా గోడల్ని కట్టడం లాంటిది గోడల్ని కూల్చి యిరువర్గాలను కలిపే వంతెనలు ఇప్పుడు అవసరం. పారంపర్యంగా కులపరంగా మతపరంగా విడగొట్టబడి ప్రధాన ప్రతిపక్షాలుగా నిత్యం వైరంలో కొట్టుమిట్టాడుతున్న వాళ్లను సమైక్యం చేయాల్సిన

అవసరం ఎంతైనా ఉంది. కులం మతపరమైన న్యూనతలతో పాటుగా దళితులు ప్రధాన స్రవంతి నుంచి పేదలుగా కూడా న్యూనతకు గురయ్యారు ఆకలి దగ్గరే ఆగిపోయిన వారికి పారిశ్రామిక విప్లవం తరువాత అపరిమిత వస్తుజాలం అందుబాటులోకి వచ్చింది. ప్రపంచీకరణ నేపథ్యంలో వస్తువు మనిషి కోసం కాదు మనిషి వస్తువు కోసం అన్నంతగా వస్తు వినిమయ సంస్కృతి పెరిగిపోయింది ఒక విధంగా కారు చౌకగా లభించే వస్తుజాలం ఉపశ్రేణి వర్గాలలో ఆత్మ గౌరవాన్ని పెంచడానికి ఉపకరించింది. అందుకే కవి కాళ్ల చెప్పులు, కళ్ళజోడు శరీర రక్షణకే కాదు ఆత్మగౌరవ రక్షణకూ ఉపకరిస్తాయి అన్నాడు.

దళితుడు ఈ దేశాన్ని ఒక సువిశాలమైన పెద్ద మత మౌఢ్యపు స్మశానం గానే ఎందుకు చూస్తున్నాడు? ఈ వర్గ వైరుధ్యానికి అంతం ఎక్కడ? అన్న ప్రశ్నలకు సమాధానాలు వెతకాల్సి ఉంది. ఆధిపత్య కులాల వాళ్ళ మతం కూడా ఆధిపత్యంలో ఉంటుంది. ఈ మతమే అన్ని సామాజిక రుగ్మతలకు కారకం అయింది ఈ మతం సృష్టించిన వర్ణ వ్యవస్థ ప్రస్తుతం కుల వ్యవస్థగా రూపాంతరం చెంది అస్తిత్వంలో ఉన్నది.

దేశాభివృద్ధికి వ్యతిరేక శక్తులుగా కులమతాలనేకాకుండా అవినీతి అధిక జనాభాలను కూడా కారణాలుగా కవి ఎత్తి చూపిస్తున్నాడు. అవినీతికి మూలాలు పేదరికం, అసమానతలు, విద్య లేకపోవడం తదితరాలు అని తెలుస్తుంది దీనికి తోడు అధిక జనాభా కూడా కారణమే అనడం చర్చనీయాంశం. నియంత్రణ పేరుమీద ప్రపంచవ్యాప్తంగా వృద్ధ జనాభా పెరిగిపోతున్న తరుణంలో అత్యధిక వయోజనులు ఉన్న ఈ దేశం మానవ అభివృద్ధి సూచిలో ముందు వరుసలో ఉండటానికి తన శక్తివంతమైన మానవ వనరుల్ని సద్వినియోగం చేసుకోవాల్సి ఉన్నది. సుశిక్షితులైన మానవ వనరులు దేశాభివృద్ధికి వెన్నెముక కాగలవు. కాబట్టి అత్యధిక యువ జనాభాను, సహజ వనరులను సద్వినియోగం చేసుకోగలిగే సుశిక్షిత మానవ వనరులుగా తీర్చిదిద్దే కార్యాచరణను వేగవంతం చేయకుండా కేవలం అధిక జనాభాను ప్రతికూలతగా, చూడటాన్ని పునః పరిశీలించుకోవాల్సి ఉంటుంది. దేశమాతను పెర్సానిఫికేషన్ చేస్తూ కవితాత్మకంగా కవి భారత మాతకు చందాలు వేసుకుని కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించాలని అంటాడు.

'నా అక్షరాలు' అన్న కవితలో కవిత్వం ఎలా ఉండాలో, ఎలా ఉండకూడదో చెబుతూ కవి తన నిబంధన వెల్లడిస్తాడు. అసమానతలను పరోక్షంగా తగ్గించడానికి ఉపకరించే యంత్ర నాగరికత పర్యవసానాలైన ఆధునిక వస్తుజాలం వివక్షకు కవచం అని అభిప్రాయపడటం 'నేను' అన్న కవితలో కనిపిస్తుంది.

'ఎక్కడ చూసినా' అన్న కవిత ద్వారా కులమతాల కల్లోలంలో అస్తవ్యస్తమైన దేశాన్ని పునర్నిర్మించాలని కవి యువతకు పిలుపునివ్వడం చూస్తాం. 'పొడుపు కథ' రచన, శైలిలో న్యాయదేవత, పాత పత్రిక, జెండాలు; అవసరం తీరాక నిరాదరణకు గురవుతున్నాయంటూ మనుషులకు కృతజ్ఞత లేకపోవటాన్ని అధిక్షేపించడం అనేది 'నేనెవరో తెలుసా' అన్న కవిత ద్వారా చెబుతాడు.

ఆర్థిక దోపిడీకి వ్యతిరేకంగా మధ్యతరగతి పక్షాన నిలబడి ఆవు పులి ప్రతీకలతో ప్రశ్నించడాన్ని, ప్రతిఘటించటాన్ని 'కొత్త గొంతు' కవిత ద్వారా నేర్పుతాడు. రాజ్యాంగ మౌలిక సూత్రం అయిన లౌకిక వాదాన్ని పునరుద్ధరింపజేసే ప్రయత్నంలో భాగంగా మతసామరస్యాన్ని రేపటి కోసం బోధిస్తాడు.

పేదరికం,దరిద్రాలకు అధిక జనాభాయే కారణం అంటూ తల్లి భారతికి కుటుంబ నియంత్రణ అవసరం అని ప్రతీకాత్మకంగా 'ఆపరేషన్ చేయించుకో భారతి' అన్న కవితలో సలహా ఇస్తాడు.

భిన్నత్వంలో ఏకత్వం అన్న భావనను గౌరవించని పాలక పక్షాలు విద్వేషాలతో కాషాయీకరణకు పాల్పడుతున్నాయని ఉగాది రోజున గొంతు ఎత్తితే కాల్చి పారేస్తారు కాబట్టి పాట పాడకూడదు అంటూ కోయిలకు సందేశం ఇవ్వటం 'గొంతేతకే కోకిల' అన్న కవితలో కనిపిస్తుంది. నల్లవాడిని తెల్లవాడు దోచుకోవటం కంటే నల్లవాడిని నల్లవాడే దోచుకోవటం ఎక్కువ అని ఈ దోపిడీని

భారతమాతకు జరిగే మానభంగం గా కవి అభివర్ణిస్తాడు. 'మా స్త్రీ జాతి' అన్న కవితలో వరకట్నపు హత్యలను నిరసిస్తాడు సాటి మనిషిని నిర్లక్ష్యం చేస్తూ ఆధ్యాత్మికత పేరిట రాళ్లు రప్పలకు రత్న కిరీటాలు చేసే మతమౌఢ్యాన్ని నిరసిస్తూ మానవీయ ప్రబోధం చేస్తాడు

'నా దేశం' అన్న కవితలో ఇక్కడ అన్న కవితలో కుక్కలు, గాడిదలు, రాజకీయ నాయకులను ప్రతీకలుగా తీసుకొని వారిని వ్యంగ్యంగా విమర్శించడం కనిపిస్తుంది. సామాన్యులను చీమలతో పోలుస్తాడు. సామాన్య ప్రజానీకాన్ని దేశంగా సంభావించి మళ్లీ దేశానికి మాతను ప్రతీకగా చేసుకొని ఆ మాత మోసపోయిందంటూ సమకాలీన రాజకీయ స్థితి గతులను ఉటంకిస్తూ చెబుతాడు .

'నన్ను వరించిన శారద లేచి పోవునే' అన్న గుర్రం జాషువాను తలపుకు తెస్తూ 'ఇక్కడ శారద లేచిపోయింది' అంటున్నాడు ఇక్కడ అక్షరం కులం తక్కువ వాడి పక్కలో కులుకుతుంది. భాషాప్రవీణులారా ఉలిక్కిపడకండి మీరు కుదిర్చిన చందోబద్ధ కావ్యాలను కాలదన్ని పదాలు లేచిపోతున్నాయి, వర్ణక్రమాలు వాడలకు వలస పోతున్నాయి అన్న సతీష్ చందర్ ను తలపిస్తూ అందంగా తిరుగాడే సాహిత్యాన్ని భూమార్గం పట్టించాను అన్న శ్రీ శ్రీ వాక్యాలను గుర్తు చేస్తూ, జనపదంలోకి ఇప్పుడు సాహిత్యం వచ్చిందంటూ, శారద లేసిపోయిందట అన్న కవితలో చెబుతాడు. ప్రకృతిశక్తులను మానవాతీత శక్తులుగా భావించి మన పూర్వీకులు వారి ప్రసన్నత కోసం కోరికలు తీరుస్తారు అన్న విశ్వాసంతో యజ్ఞయాగాలు చేసేవాళ్లు బలిదానాలు కూడా చేసేవారు వీటికోసం మూగజీవాలను అమాయక మనుషుల్ని కూడా వధించేవారు. ప్రస్తుతం కవి సమ సమాజాన్ని నిర్మించడం కోసం ఆటంక వాదులైన రాచక శక్తుల ను హవిస్సులుగా, సమిధులుగా చేసుకుని శ్రేయో రాజ్యాన్ని స్థాపించాలని కలగంటున్నాడు. మేకలని బలిస్తారు కానీ సింహాలను కాదు అని అంబేద్కర్ అంటాడు. ఇప్పుడు బలహీనులను బలవంతులు దోపిడీ చేసినట్టుగా బలవంతులను బలహీనులు అణగదొక్కాలని తద్వారా సమ సమాజాన్ని నిర్మించాలని కవి ఆకాంక్షిస్తున్నాడు. ఇది ఒక ప్రతీకార చర్యగా చరిత్రను తిరగరాయాలన్న దృఢ సంకల్పంగా కనిపిస్తుంది. "ఏకలవ్యుడు రాముని వధిస్తున్నాడు శంభూకుడు రాముని వధిస్తున్నాడు, ఏకలవ్యుడు ద్రోణుడి బొటనవేలు తెగ నరుకుతున్నాడు" అన్న శివ సాగర్ వాక్యాలు స్ఫూర్తిగా చేసుకుని కవి మాట్లాడుతున్నట్టుగా ఉన్నది. శివసాగర్ కవితాత్మక వాక్యాలు అయితే కులం తక్కువ వాళ్లుగా పరిగణించబడి దోపిడీలో ధ్వంసం అయిన పీడిత వర్గాల అభ్యున్నతి కోసం రాసిన మాటలు. కానీ కవి ఇక్కడ కుల వర్గ మత లింగ ప్రాంత వివక్షలను పరిధులను అధిగమించి సమస్త పీడిత తాడితులందరి పక్షాన ప్రాతినిధ్యం వహిస్తూ సమ సమాజ నిర్మాణానికి చేయూతనిమ్మని అడుగుతున్నాడు.

గొప్ప వ్యంగ్య వైభవంతో ఎత్తిపొడుపులతో ధ్వన్యాత్మకంగా పెత్తందారులను అధిక్షేపిస్తూ కావ్యాసంతం పీడిత తాడిత జనులందరినీ చైతన్య పరుస్తున్నాడు ఆయా పరిధిలో గీసుకుని ఏ ఒక్కరి పక్షానో మాత్రమే నిలబడి మాట్లాడడం వల్ల ఒరిగేదేమీ ఉండదని పైగా అలాంటి దృక్పథం చాలా సంకుచితమైనదని సర్వ మానవాళి కి హక్కులు రక్షించబడాలని సమానత్వం సిద్ధించాలని కవి ఆకాంక్షగా కనిపిస్తుంది. కాబట్టి సంకుచిత పరిధులను అధిగమించి అతిక్రమించి సమ సమాజం దిశగా తన ప్రాంత వర్గ లింగ నేపథ్యాలను అధిగమించి మాట్లాడడం చాలా పరిణిత దృక్పథం అని తెలుస్తుంది. మానవహితం కోరుకోవడంలో ఎల్లలు పనికిరాని కవి తోటి ప్రగతిశీల వాదులకు పరోక్ష ప్రవచనం చేస్తున్నట్టుగా కూడా మనకు కనిపిస్తుంది ఇలాంటి సమైక్య గానం ఎవరికైనా మార్గదర్శకమే అని చెప్పక తప్పదు.

**ఉపసంహారం**

శ్రేయోరాజ్యం కోసం సమసమాజ నిర్మాణం కోసం అరాచక శక్తులు అంతం చేయాల్సి ఉన్నది సాయుధ మార్గం ద్వారానే సాధ్యమవుతుంది కవి నమ్ముతున్నట్లు మనకు కనిపిస్తుంది అందుకే ఈ కవితా సంపుటికి యజ్ఞం అని పేరు పెట్టాడు ఈ యజ్ఞంలో సమిధులుగా అప్పుడు అమాయకులను దోపిడీ చేస్తున్న ఈ అరాచకాలు వాడుకోవాలని అంటున్నాడు మతం కులం సమాజాన్ని విడదీసిందని ఈ సంప్రదాయ మార్గం నుంచి విడివడి ఆధునిక ప్రగతి సేలం సమాజాన్ని నిర్మించాలని అంటూనే మత సంబంధిత

ప్రతీకలను తన కవిత్వ అభివృద్ధిగా వాడుకోవడం విశేషం ఇది శ్రీ శ్రీ మార్గాన్ని తెలియజేస్తుంది శ్రీశ్రీ కూడా సంప్రదాయాన్ని నిరసించడానికి సంప్రదాయ కావ్య సామగ్రిని ప్రతీకలుగా వాడుకున్నాడు మొత్తం మీద నూతన సమాజ నిర్మాణం కోసం దిగంబరకవుల నిరసన స్వరాన్ని స్వీకరించి, శ్రీశ్రీ విప్లవ మార్గాన్నిచేపట్టి కవి ప్రగతి శీల సమాజాన్ని నిర్మించాలని ఆకాంక్షిస్తున్నట్టు తెలుస్తుంది. ఈ ఆశయ సాధనలో భాగంగా కవి తన ఊరు తన ప్రాంతం తన రాష్ట్రం తన దేశం పడతాడు అయితేసంకుచిత పరిధిలో మాత్రం ఉండిపోకుండాఅందరివాడు లా అరాచక శక్తులకు వ్యతిరేకంగా అందరికీ అన్నిటికీ ఉమ్మడి ప్రాతినిధ్యం వహిస్తాడు.

మొత్తం మీద సంప్రదాయ కావ్య ప్రతీకలతో చాందసవాదాన్ని చాందసభాషలో వ్యవహారిక భాషను కలగలిపి నిరసన వ్యక్తం చేస్తూ కుల మత వర్గ లింగ ప్రాంత పరిధులను అధిగమించి లోక కళ్యాణం కోసం ప్రతి ఒక్కరూ పాటుపడాలని సమాజానికే కాదు కవులకు మేధావులకు కూడా బోధిస్తాడు..

"ప్రాచీన సాహిత్యం లో విలువలు వేరు ఆధునిక సాహిత్యంలో విలువలు వేరు ఆ విలువలు ఈ సాహిత్యంలో చూసే ప్రయత్నం చేయరాదు. ఈ విలువలు ఆ సాహిత్యంలో పలికించే ప్రయత్నం తప్పు ప్రాచీన సాహిత్యం లోని విలువలు నేటి సాహిత్యంలో లేకుండా పోవడానికి కారణం వస్తు పరిణామం"(ఆ .సా. వి.సూ. పుట 174) అన్నది గమనార్హం.

**పాదసూచికలు**

యజ్ఞం - సత్యనారాయణ. తరపట్ల- యూనివర్సల్ ప్రింటర్స్ రాయపేట చెన్నై 2022.

ఆధునిక సాహిత్య విమర్శ సూత్రం- ఇనాక్ కొలకలూరి.

**పరిశోధన కొనసాగింపు**

దళిత సాహిత్యంలోసాధారణంగా కనిపించే అన్ని రంగాలలో దళితుల పట్ల కనిపించే వివక్ష అసమానతలను మాత్రమే కాకుండా దళితుల ప్రాపంచిక దృక్పథాన్ని సమగ్రంగా చర్చించే పరిశోధనలు, రచనలు మరియు విమర్శ రావాల్సి ఉన్నది.

**ఉపయుక్త గ్రంథాలు:**

తెలుగు సాహిత్య సమీక్ష ఒకటో భాగం డాక్టర్ జి నాగయ్య నవ్య పరిశోధక ప్రచురణలు, తిరుపతిఆగస్టు 2004.

తెలుగు సాహిత్య సమీక్ష రెండో భాగం డాక్టర్ జి నాగయ్య నవ్య పరిశోధక ప్రచురణలు తిరుపతి, ఆగస్టు 2004.

ఆధునిక కవిత్వము సంప్రదాయములు ప్రయోగములు డాక్టర్ సి.నారాయణరెడ్డి విశాలాంధ్ర ప్రచురణలు విజయవాడ 2017.

యజ్ఞం డాక్టర్ తర పట్ల సత్యనారాయణ. యూనివర్సల్ ప్రింటర్స్ చెన్నై 2022

తెలుగులో కవితోద్యమాలు తెలుగు అకాడమీ ప్రచురణలు హైదరాబాదు.2010

ఆధునిక సాహిత్య విమర్శ సూత్రం ఆచార్య కొలకలూరి ఇనాక్. జ్యోతి గ్రంథమాల తిరుపతి 2010.

విలువల పునర్ మూల్యాంకనం డాక్టర్ పోలుమాటి అన్నవరం సత్యనారాయణ, జాస్మిన్ పబ్లికేషన్స్ రాజమహేంద్రవరం 2023.

*******

# 76. నాటకం సామాజిక - స్పృహ

**యస్. యాకోబు**

తెలుగు లెక్చరర్

శ్రీ వై.యస్.కళాశాల (ఎ), నరసాపురం – 534 275

సెల్ నెం.9441346888

సర్వసృష్టిలో మానవుడు పుట్టినప్పటి నుండి వృద్ధాప్యం వరకు ఆయా దశలలో వయస్సుకు తగినట్లుగా ప్రవర్తిస్తాడు. సమ సమాజంలో మనుషుల మనసులకు మరింత చైతన్యం అందించుటలో నాటకం యొక్క ప్రభావం ఎంతైనా ఉంది అని చెప్పవచ్చు. 'కావ్యేషు నాటకం రమ్యం' 'నాటకాంతం హి సాహిత్యం' అని నాటక ప్రక్రియను ఎంతో రమ్యంగా భావించారు పండితులు. సంస్కృతంలోని దశ విధ రూపకాలలో నాటకం ఒకటి కాని ఆధునిక ప్రపంచంలో ప్రదర్శింపబడుతున్న నాటకానికి పూర్వం ఉన్న నాటకానికి కొంచెం కూడా ఏవిధమైన పోలికలు లేవు. ఇప్పుడు వస్తున్న నాటక ప్రక్రియలు అన్నీ ఆధునికమైనవే. నాటకంలో ఇతివృత్తం ప్రధానమైనది. ఇతివృత్తం లో కథ ఉంటుంది. వివిధ పాత్రలు ఉంటాయి. ఆ పాత్రలే కథలను నడిపించి, ప్రజలలో సామాజిక స్పృహను కలిగిస్తాయి. ఆధునికాంధ్ర సాహిత్యంలో నాటకం ప్రజలను చైతన్యం చేయుటకే నాటకాలు రచించబడ్డాయి. ఈ నాటకాలు ప్రజల మనోభావాలు, ఆచార వ్యవహారాలు, మూఢ నమ్మకాలు పోగొట్టే జీవన విధానంలో పెనుమార్పులు తెచ్చినవి నాటకాలు.

పాశ్చాత్యుల, పార్శీల నాటక రంగ ప్రభావంతో తెలుగు నాటక రంగం 19వ శతాబ్దంలో ఆరంభమైంది. దీని వ్యాప్తిని వివరిస్తూ తెలుగు నాటక రంగాన్ని ప్రారంభ దశ, వికాస దశ, వైవిద్య దశ, అభ్యుదయదశ, ఆధునిక ధోరణులు, అధ్యాతన యుగం అని విభజించటం జరిగినది.

తెలుగులో 1860 లో రచించబడిన మొట్ట మొదటి నాటకం కోరాడ రామచంద్ర శాస్త్రి గారి మంజరీ మధుకరీయం. నవయుగ వైతాళికుడు, సంఘ సంస్కర్త కందుకూరి వీరశలింగం పంతులుగారు 1880 లో చమత్కార రత్నావళి, రత్నావళి, ఈ నాటకాలు రంగ స్థలం మీద ప్రదర్శించబడ్డాయి. రాయలసీమలో ధర్మవరం రామకృష్ణమాచార్యులు ఆంధ్రా నాటక పితామహులు గా పేరు పొందారు. వీరు రచించిన సారంగధర తెలుగు సాహిత్యాలలో మొట్టమొదటి విషాదాంత నాటకంగా పేరు పొందింది.

కీచక వధ, గయోపాఖ్యానం నాటకాలు చిలకమర్తి లక్ష్మీ నరసింహం పంతులు గారు రచించిన నాటకాలు సామాజిక స్పృహను కలిగించాయి. సంఘ సంస్కరణ కు ఈ నాటకాలు పాదులు వేసాయి. తెలుగు నాటకాలలో సంఘ సంస్కరణతో బాటు వినోదం కోసమే కాకుండా సామాజిక స్పృహను కలిగించు నాటకరంగమును తారా స్థాయికి చేర్చిన కొన్ని నాటకాలు.

గురజాడ అప్పారావు గారు రచించిన కన్యా శుల్కం, వేదం వేంకట రాయ శాస్త్రి గారి ప్రతాప రుద్రీయం బలిజేపల్లి లక్ష్మీకాంతం కవి సత్య హరిశ్చంద్ర నాటకం ప్రజల స్థితిగతులు ఆచార వ్యవహారలలో వచ్చిన మార్పులు తెలుగు నాటకంలో ప్రతిబింప చేసి, సామాజిక చైతన్య దృక్పదంలో రచనలు చేసిన వారిలో ఆత్రేయను మార్గదర్శకుడుగా చెప్పవచ్చు. N.G.O. కప్పలు, అశోక్ సామ్రాట్ నాటకాలు రచించారు. నాటక రంగానికి మార్గ నిర్దేశకుడై నాటక రంగ యుగంను స్వర్ణయుగంగా మార్చి నాటకాలలో సామాజిక స్పృహను తెచ్చిన నాటక రచయితగా ఆత్రేయను పేర్కొనవచ్చును. నాటకాలు ద్వారా సామాజిక స్పృహను కలిగించిన ఆంధ్ర నాటక కళా పరిషత్ వారి కృషిని కూడా కీర్తించదగినది.

బోయి భీమన్న గారి కూలిరాజు, పాలేరు నాటకాలు, పాలగుమ్మి పద్మరాజు గారి రక్త కన్నీరు, పద్మశ్రీ, డి.వి. నరసరాజు గారి వీలునామా, పెంకుటిల్లు నాటకాలు, బెల్లంకొండ రామదాసు గారి ఆకాశరామన్న నాటకం, కె.ఎస్.టి.సాయి గారి భోగి మంటలు, శ్రీ

ధవళ సత్యం గారి నిన్న – నేడు - రేపు నాటకం, నిన్న - నేడు - రేపు నాటకం 7 నంది అవార్డులు వరించింది. సామాజిక స్పృహ తెచ్చిన నాటకాలలో ఒకటిగా ఘనత కెక్కినది. ఇదే కోవలో సామాజిక స్పృహను తెచ్చిన నాటకాలు మరికొన్ని యమ్.జి.రామారావు గారి ఇరుసు నాటకం, ఎన్.ఆర్.నంది గారి మహా మహోంజోధర్ నాటకం, గొప్ప సామాజిక స్పృహను కలిగించిన నాటకాలు. కొర్రపాటి గంగాధరరావు గారి యధారాజ తథా ప్రజా నాటకం కూడా సామాజిక స్పృహ కలిగించిన నాటకం. గణేష్ పాత్రో, గొల్లపూడి మారుతీరావు గారు, మెత్కూరి జాన్సన్ గారు, డాక్టర్. దాసరి నారాయణరావు గారు మొదలైనవారు ఎందరో తమ నాటకాల ద్వారా సమాజంలో నిద్రిస్తున్న మానవజాతిని మేల్కొలుపుతూ సామాజిక స్పృహను కలిగించారు. ముఖ్యంగా పన్నీరు – కన్నీరు, నేను నా స్కూలు, ఏప్రిల్ ఫూల్ వంటి నాటకాలను రచించి ఆంధ్రప్రదేశ్ అంతట ప్రదర్శింప జేసి సామాజిక స్పృహను కలిగించిన డా.దాసరి నారాయణరావు గారు దర్శక రత్నగా ప్రపంచ సనీ చరిత్రలో గిన్నీస్ బుక్ రికార్డ్ ను సాధించారు. అంటే దానికి పునాది సామాజిక స్పృహ కలిగిన నాటకాల ద్వారా వెండి తెరపై తాత – మనవడుకు దర్శకత్వం వహించే అవకాశం వచ్చింది.

పైన పేర్కొన్న సామాజిక స్పృహ కలిగిన నాటకాలు అనేకం ఉన్నప్పటికి నేడు పాలేరు నాటకంలో సామాజిక స్పృహను వివరించుచున్నాను.

పాలేరు స్థాయి నుండి పద్మశ్రీ స్థాయి వరకు ఎదిగిన గొప్ప నాటక రచయిత డాక్టర్. బోయి భీమన్నగారు, తూర్పుగోదావరి జిల్లా నేటి డా|| బి.ఆర్.అంబేద్కర్ కోనసీమ ప్రాంతంలో రాజోలు మండలం, మామిడికుదురు గ్రామంలో బోయి పుల్లయ్య, నాగమ్మ పుణ్యదంపతులకు 1911 సెప్టెంబర్, 19న జన్మించారు.

నగరం, రాజోలు, కాకినాడ లలో విద్యాభ్యాసం చేసినారు. సాహిత్యంపట్ల మక్కువ కలిగిన భీమన్నగారు పాలేరు నాటకం ద్వారా సాహిత్యంలో రారాజు అయ్యారు. భీమన్న గారు చదువుతున్న రోజులలోనే సామాజిక స్పృహను అలవర్చుకున్నారు. కనుక తన పాలేరు నాటకం ద్వారా సామాజిక స్పృహను నాటకం అంతా అద్దారు.

డాక్టర్. బోయి భీమన్న గారు పాలేరు నాటకంలో వెంకన్న, కుబేర్రావు, ఉపకారి, సుందరం, పుల్లయ్య, వీరేశు, రామం, దొంగ రామన్న, బంట్రోతు, కొందరు రైతులు ఇవికాక స్త్రీ పాత్రలు, వనబాల, సీత, ఇట్టి పాత్రలతో అద్భుతమైన కథను పాలేరు నాటకంలో నడిపారు.

ప్రేమ, నీతి, క్షమాపణ, మంచి, చెడు, చదువుల పట్ల అందరి దృష్టి పడేటట్లు చదువుకుంటే వచ్చే గౌరవం ఇందులో చూపించారు. ఈ నాటకం చూసిన నిరక్ష రాస్యుడైన అక్షరాస్యుడు అవ్వవలసిందే అందులో సందేహం లేదు. ఎందుకంటే ఈ నాటకంలో సామాజిక స్పృహ మనిషిని తట్టి లేపుతుంది. కాకి మాధవరావు గారు ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రధాన కార్యదర్శి 'డా.బోయి భీమన్న గారి పాలేరు నాటకం నేను చూసి ఉండకపోతే, చదివి ఉండకపోతే ఈరోజున నేను ఈ స్థితిలో ఉండేవాడిని కాను' అన్నారంటే పాలేరు నాటకంలో ఉన్న సామాజిక స్పృహ ఎంత చైతన్యవంతమైనదో ఆనాటి సామాజంలో ఎంతమందిని నిదుర లేపిందో వేరే చెప్పనవసరం లేదు.

"బానిస తనమును బాపుమురా

భారత భూమికి భాగ్యం తేరా

......................................

ప్రభువు సేవకుడు లేని సంఘమును

పదిలముగా నిర్మింపుమురా

సౌఖ్యము, సంతోషం, మానవులకు

సమకూర్చుమురా! వీరా" పాలేరు నాటకములో ప్రారంభ గీతంలోనే ఆనాటి సమాజంలో ఉన్న అసమానతలు ధ్వనిస్తాయి. సుఖము, సంతోషం, సామాన్య ప్రజలకు లేవని అవి సమకూర్చాలని నవసమాజాన్ని తీసుకొచ్చే ప్రయత్నం పాలేరు నాటకం ద్వారా కవి చేశారు.

ఆడపిల్లను వంటిల్లుకే పరిమితం చేసి, మగ బిడ్డలకు కర్రచేతి ఇచ్చి పాలేరుగా చేసే రోజుల్లో చదువు యొక్క అవసరతను చెప్పి ఉపాధ్యాయుడు ఉపకారి పాత్ర ద్వారా "శక్తి కంతకు మూలం చదువు బడికి పంపుడు మీ వంశ వర్ధనులను" అన్నాడు అంటే చదువు విలువ తెలిసిన కవి చదువు ద్వారా సామాజిక స్పృహను సాధించ వచ్చని భావించిన దీశాలి డా.బోయి భీమన్న గారు.

దేశం స్వేచ్ఛా స్వతంత్రాలతో సౌఖ్యవంతం కావాలంటే ప్రజలు విజ్ఞానం సంపాదించాలని ఉపకారి పాత్ర ద్వారా ప్రబోధం చేయటం జరిగింది. నిరక్షరాస్యత పోతే పాలేరు తనం కూడా పోతుంది అని కవి ఆశించారు. రాత్రిపూట చదువు చెప్పించి పగలంతా పాలేరుతనం చేసి, రాత్రికి ఇంటికి వచ్చిన యువకులకు ఎంతో నేర్పుగా, ఓర్పుగా అక్షరాలను నేర్పిన గురువుగా ఉపకారి పాత్ర ద్వారా సామాజిక స్పృహ కలిగించిన తీరు కవిని కొనియాడ దగినది.

వెంకన్న చిన్నపాలేరు, తండ్రి పుల్లయ్య పెద్దపాలేరు. వారిలో వీరేశు తోడిపాలేరు. కామందు సామర్థ్యాన్ని బట్టి పాలేర్ల సంఖ్య ఉండేది. ఈ నాటకానికి పాలేరు అని పేరు పెట్టడం కూడా గొప్ప మహా ప్రస్తానమే ఎందుకంటే పాలేరు నుండి వెంకన్న చదువుకొని డిప్యూటీ కలెక్టర్ అవ్వడం ఉన్నతమైన ప్రయాణమే. పాలేరు తనం చేయలేనివారు కూడా ఒక మనిషే అంటారా? అనుకొనే మూఢత్వం నుండి విముక్తి కలిగించి చైతన్యాన్ని రగిలించిన సామాజిక స్పృహ కలిగిన నాటకం. చదువు వైపు మళ్ళించిన పాత్ర ఉపకారి పాత్ర అయితే. ఊరుకే కూర్చుంటే అదృష్టం రాదని వెంకన్నలో స్పృహను కలిగించిన పాత్ర వనబాల పాత్ర.

ఉపాధ్యాయుడు మంచిని బోధిస్తాడు అనుటకు ఉపకారి పాత్ర వెంకన్నలో స్పృహను తెచ్చింది. " సహాయం వచ్చిన చోటల్లా పొంది చదువుకో అదృష్టం ఉంటే పైకొస్తావు అప్పుడు పునః సహాయం చేస్తావు" ఈ మాటలు వెంకన్న జీవితాన్ని మార్చాయి. ఒక ప్రక్క సీత మరో ప్రక్క ఉపకారి మాష్టారు అంతా తానైన వనబాల వెంకన్నను చదువు వైపు మరలించాయి.

మనుషుల జీవితంలో చీకటి ఎల్లకాలం ఉండదు. వెంకన్న వేంకటేశ్వరరావు అనే పేరుతో బి.ఎ. పూర్తిచేసి పై చదువులకు వెళ్ళాలట అనే ఉత్తరం చదివిన వార్త ఉపకారి ద్వారా వనబాల ఉత్తరం చదివి తన మెడలోని కాసులపేరు ఉపకారి మాష్టారుకిచ్చి పై చదువులు వెంకన్నను చదవమని చెప్పండి అనటంలో వెంకన్న పై వనబాలకు ఉన్న ప్రేమ వ్యక్తం అవుతుంది. ప్రేమ ద్వారా వ్యక్తులలో సామాజిక స్పృహను తేవచ్చు అనే మరోకోణం ఈ నాటకంలో కనిపిస్తుంది.

వనబాల తన ప్రేమను సీతకు చెప్పినది. వెంకన్న అంటే ఇష్టమని. అందుకు సీత "అయినా పై కొచ్చిన వాణ్ని పై వాళ్ళు పై నుంచే ఎగరేసుకు పోతే, ఇక మాకు మిగిలేదేమిటండమ్మ" అనుటలో దళిత వర్గంలోని వారు మంచి చదువులు చదివి ఉన్నతమైన ఉద్యోగాలు చేసినవారిని పై వర్గం వారు వారి ఉద్యోగం చూసి వివాహాలు చేసుకోవడం ఆనాటి సమాజంలో ఉంది. ఇది కూడా గొప్ప సామాజిక స్పృహయే. ఎందుకంటే చదువుకుంటే మంచి స్థితి వస్తుంది. మంచి ఉద్యోగం, మంచి స్థితి ఉంటే కులంతో పనిలేదని కూడా రచయిత సీత పాత్ర ద్వారా సమాజాన్ని ఆలోచింపజేశారు.

**పరిశీలించిన గ్రంథాలు :**


1. పాలేరు నాటకం - డా. బోయి భీమన్న గారు
2. కన్యా శుల్కం - గురజాడ అప్పారావు గారు
3. వర విక్రయము - శ్రీ కాళ్ళకూరి నారాయణరావు గారు


******

# 77. గురజాడ ,తిలక్ రచనలలో సామాజికస్పృహ

డా యు.వి.యస్.యస్.శాస్త్రి

డా వారణాసి వేంకటేశ్వర శర్మ

గాయత్రీ విద్యాపరిషత్ డిగ్రీ మరియు పిజి కళాశాల[అటానమస్]

విశాఖపట్నం

6281793978 , 9440632432

varanasivenkateswara@gmail.com

కవి సంఘజీవి కావడం వలన సాంఘికపరిస్థితుల ప్రభావం కవిపైన ఉండడం సహజం . సామాజిక ధర్మం, లోకధర్మం,వ్యక్తిజీవన వికాసం, భావనామార్గం, నైతిక విలువలు ఇవన్నీ కవుల రచనలలో ప్రతిఫలిస్తాయి.వ్యధార్తజీవుల యధార్థదృశ్యాలు ఆధునిక కవుల కవితాసృష్టిలో బహుముఖీనంగా ప్రదర్శితమయింది. “Poets are unacknowledged legislators of the world” అని షెల్లీ కవిగారు చెప్పినా “విశ్వశ్రేయ: కావ్యమ్” అవి మమ్మటుడు చెప్పినా వాటిలో సారం ఒకటే. కవులు ఎన్నుకోబడని శాసనకర్తలుగా విమర్శకులు అభివర్ణించిన మాటలలో సామాజికస్పృహ వ్యక్తమవుతున్నాయి. ప్రజలు నివసించే సమాజంలోని వారి కష్టసుఖాలు,ఒడిదుడుకులు ఆలోచనలు అన్నీ సమకాలీన కవులరచనలలో ప్రతిఫలించడం సహజం . సాహిత్యం ఒక సామాజిక వ్యవస్థ అవుతుంది. Literature is the criticism of life. సామాజిక జీవితానికి సాహిత్యం అద్దం పడుతుందన్నారు విమర్శకులు. ఇది వ్యక్తి యొక్క బహిరంతరప్రపంచాలను స్పృశిస్తుంది. పరిశీలిస్తుంది.

ప్రతీ కవి రచయిత తాను సమాజంలో జీవితానుభవ భాగస్వామి అయిన వ్యక్తి. సమాజంలో అణగారిన అన్నార్తుల బాధామయ కన్నీటిగాధలకు ప్రతినిధిగా తన స్వరాన్ని వినిపిస్తారు.నవ్యకవిత్వాన్ని పద్యం నుండీ గేయం వైపు మలుపు తిప్పి కందుకూరి వీరేశలింగం గారి సాంఘికవిప్లవాన్ని , గిడుగు పిడుగు వాడుకభాషా విప్లవాన్ని తనలో రంగరించుకుని సామాజిక అభ్యుదయ సాధనకు సాహిత్యాన్ని ప్రబలసాధనంగా చేసుకుని సాంఘిక దురాచారాలను నిర్మూలించిన నవ్యాంధ్ర సాహిత్యానికి యుగకర్త గురజాడ అడుగడుగునా పండితులను ఎదిరించి ఛాందస వాదులను తన రచనలతో సమాధానం చెప్పి సామాజిక పరివర్తన సాధించిన గురజాడ వారి గేయాలలో సామాజిక స్పృహను అదేరీతిగా చిన్న వయసులోనే కన్ను మూసినా తన దృష్టి పరిసరాలలో దీనుల , హీనుల, అన్నార్తుల , అనాధల దీనాతిదీన , హీనాతిహీన దుర్భరపరిస్థితికి హృదయం ద్రవించి సమాజాన్ని , విలాసవంతులను , రాజకీయ నాయకులను సూటిగా తన ప్రశ్నలతో నిలదీసి “ అగ్ని జల్లినా అమృతం కురిసినా అందం ఆనందం దాని పరమావధి “ అని ఘంటాపథం గా తెలియజేసి కవితాసృష్టిలోని ప్రతీ అక్షరం లో సామాజిక స్పృహను సహృదయ పాఠకలోకానికి ప్రత్యక్షం చేసిన దేవరకొండ బాలగంగాధర తిలక్ రచించిన “ అమృతం కురిసిన రాత్రి “ కవితాసంపుటిలో కొన్ని ఖండికలను పరిశీలించడం ప్రస్తుత వ్యాసం లో ప్రధానమైన ఉద్దేశం.

పందొమ్మిదవ శతాబ్దం చివరి రోజులలో తెలుగు భాషా సాహిత్యాలను కొత్త పుంత తొక్కించిన గురజాడ అప్పారావు గారు ఆధునిక యుగానికి సాహితీ పరంగా వైశిష్ట్యాన్ని తీసుకుని వచ్చిన మహనీయులు. నాడు సమాజంలోని బాల్య వివాహాలను ఖండిస్తు సంఘసంస్కరణల దృక్పథం తో రచించిన “ కన్యాశుల్కం “ ఒక ప్రసిద్ధ సాంఘిక నాటకం . సజీవ పాత్రచిత్రణలో , చక్కని సంభాషణలతో గిరీశం లాంటి నయవంచకుల పాచికలు పారగా “ డామిట్ కథ అడ్డం తిరిగింది “ అని పలాయనం చిత్తగించే వరకు పాత్రలు మన కన్నుల ముందు కదలాడుతాయి .1910 వ సంవత్సరం లో తెలుగు భాషలో గురజాడ వారు కొత్తగా సృష్టి చేసిన “

ముత్యాల సరాలు " అనే గేయ ఛందస్సు అందరినీ అలరించింది . పాతకొత్తల మేలు కలయికతో తేటతెనుగు మాటలతో మహాకవుల వాక్కులు సరళంగా ఉంటుందనే మాటను నిజం చేసిన నవ్య కవితా స్రష్ట గురజాడ .

"దేశభక్తి" అనే గేయంలో " దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్ " అని దేశం అనగా నేల,పర్వతాలు కావని దేశం అనగా జనులని , ఊరికే దేశభక్తి కలదని డప్పు కొట్టుకోకుండా దేశమునకు మేలు కలిగించే పని చేసి చూపించవలసినదిగా , జాతీయోద్యమం లో యువతరం తప్పు తోవ పట్టకుండా ప్రబోధించిన తీరులో కవి ఆశయం సుస్పష్టమవుతోంది. చెట్టాపట్టాలు పట్టుకుని దేశస్థులంతా అన్నదమ్ముల వలే మెలగుతూ పాడి పంటలు పొంగి పొర్లే దారిలో పాటుపడుతూ మందగించక ముందడుగు వేయాలని సందేశం లో సామాజిక స్పృహ దాగి ఉన్నది.

" పుత్తడి బొమ్మ పూర్ణమ్మ " అనే గేయం ద్వారా చిన్నపిల్లలను వృద్ధులకిచ్చి వివాహం చేసే దురాచారాలను ఖండించారు. సాటి ప్రాయము వారి వ్యంగ్య వచనాలను వినలేక పూర్ణమ్మ దుర్గ గుడిలో ఆత్మార్పణ చేసుకున్న సన్నివేశాన్ని ఎంతో ఆర్ద్రంగా , కవితామయంగా గురజాడ వారు ఈ రీతిగా వివరించారు . " కన్నుల కాంతులు కలువల చేరెను , మేలిమి చేరెను మేని పసల్ , హంసల చేరెను నడకల బెడగులు , దుర్గను చేరెను పూర్ణమ్మ "- ఈ నాలుగు పంక్తులు గురజాడవారిని మహాకవుల శ్రేణీలో నిలబెడుతుంది. ఎంతటి కర్కశ హృదయమైనా ద్రవీభవింప రచనమిది . మానవులు జాతిమత భేదాలు సంకెళ్ళు తెంచుకుని మనసులొకటై మనుషులుంటే జ్ఞానమున్నది నిలిచి వెలుగును , ఎల్లలోకం ఒక్క ఇల్లై ప్రకాశిస్తుందని గురజాడ వారు అందించిన సందేశం అమూల్యమైనది .

తిలక్ రచించిన అమృతం కురిసిన రాత్రి అనే కవితా సంపుటికేంద్రరాష్ట్రసాహిత్య అకాడమీల అవార్డు గెలుచుకున్న అత్యుత్తమ రచన. వ్యక్తిగత జీవితం , రచనాజీవితం సమాజాన్ని ప్రభావితం చేస్తాయి అనడానికి ఈ గ్రంథం నిదర్శనం. అందరికీ సుపరిచితులైన అసలు సిసలు తెలుగు కవిగా తనను తాను ఆవిష్కరించుకుని సామాజిక రుగ్మతలను దర్శించి విచలితుడై ఆర్తితో సమాజాన్ని తూర్పారబెట్టిన ప్రముఖ మానవతావాది తిలక్ . వీరిని తెలుగు కవితా సరస్వతికి నిత్యరసగంగాధర తిలకమని శ్రీ శ్రీ ప్రశంసించారు. నిరంతరం పుస్తకాలను చదవడంలో మునిగి తేలిన వీరు పశ్చిమ గోదావరి జిల్లా మండపాక లో జన్మించారు. ఎవరైనా వారిని కలిసినపుడు వారు చెప్పే మాట ఒక్కటే మనిషికి విశ్వాసం,పరోపకారబుద్ధి ఉండాలి. ఇవి లేనివాడు మానవుడు కానే కాడు అనే వాడు.దీనివలన వారి హృదయాంతరాలలో నిండి నిబిడీకృతమైన సామాజిక స్పృహ మనకు తెలుస్తుంది. తిలక్ తాను నమ్మిన సిద్ధాంతాన్ని నిష్కర్షగా చెప్పే వ్యక్తి . అడ్డదారులలో అక్రమంగా సంపాదిస్తూ బయటకు శ్రీరంగనీతులు చెప్పేవారిని వీరు అసలు క్షమించరు. పద్యం , గేయం , కథానిక , వ్యాసాలు , లేఖలు ఏ రకమైన ప్రక్రియ చేపట్టీన అందులో చక్కని సందేశం ఇచ్చే నవ్యకవి తిలక్ . వీరి అమృతం కురిసిన రాత్రి ఆంగ్ల భాషలోనికి కూడా అనువదింపబడటం విశేషం.ఇందులో ప్రతీకవితలో సమాజం పట్ల కవికి గల స్పృహ అన్నార్తులు అభాగ్యుల పట్ల ఆవేదన కనిపిస్తుంది. " కాస్మో పోలిటన్" అనే కవితలో " దేవుడూ మానవుడూ వీరిద్దరే మిజరబుల్ ఫెయిల్యూర్స్ " అటు కనిపించని దైవం , ఇటు కనిపిస్తున్న సాటి మనిషి సామాజిక దుస్థితిని పట్టించుకోనప్పుడు ఆత్మవేదన నుండీ ఆవిర్భవించిన అక్షరసృష్టి వీరి నవ్యకవిత. " కవివాక్కు" , "నవకవిత"," త్రిమూర్తులు" అనే కవితల గురించి పేర్కొంటూ " నా కవిత్వం లో నేను దొరుకుతాను " అని తెలియజేసారు. కవిత్వం ఒక " ఆల్కెమీ" అని దాని రహస్యం మహాకవి కాళిదాసుకి మాత్రమే తెలుసంటారు.

"ప్రార్థన" అనే కవితాఖండికలో " దేవుడా రక్షించు నా దేశాన్ని , పవిత్రుల నుండీ ,పతివ్రతల నుండీ, పెద్ద మనుషుల నుండి , పెద్ద పులుల నుండీ , నీతుల రెండు నాల్కలు సాచి బుసలు కొట్టే నిర్హేతుక కృపాసర్పాలనుంచి, లక్షలాది దేవుళ్ళ నుండీ , వారి పూజారుల నుండీ , వారి వారి ప్రతినిధుల నుండి, సిద్ధాంత కేసరుల నుండీ, సిద్ధుల నుండి, శ్రీమన్మద్గురు పరంపరనుండి" అని వ్రాయడంలో

నటించే పతివ్రతలను , అద్భుతంగా మాయ మాటలతో అమాయక ప్రజలను బురిడీ కొట్టించే పాముల కంటే భయంకరులైన స్వాముల గురించి తెలియజేసి సమాజాన్ని జాగృతపరచడం కనిపిస్తుంది.సామాజిక చైతన్యం కోసం కలం పట్టిన నవ్య కవి , అక్షర శిల్పి తిలక్ కవి .

ఆర్ద్రత , దు:ఖం, ఆవేదన ఇత్యాది కరుణరసార్ద్ర ప్లావితమైన ఆర్తగీతం " కవితాఖండికలో అణగారిన జీవితాలలో అదృష్టరేఖలు వెల్లివిరియాలనే నిజమైన తపన కనిపిస్తుంది. ఇందులో మర్రిచెట్టు కింద ఆకలి తో మరణించిన ముసలి వానిని, కుండపోత వానలో వంతెన క్రింద ప్రసవించి మూర్ఛిల్లిన నిండు చూలాలిని ఆకలితో తనవైపు చూసే సంతతి వైపు నిస్సహాయంగా చూస్తున్న ప్యూను వీరయ్యను,క్షయగ్రస్త భార్య బ్రతకదని తెలిసిన తరువాత " ప్రచండ వాతూలహత నీపశాఖ వలె గజగజ వణుకుతూ నిలబడిన అరక్త అశక్త గుమస్తాని ఐదారుగురు పిల్లలు గలవాని, తల్లిలేక తండ్రి లేక కాలవ ప్రక్క ఆకలితో రోదిస్తున్న పసివాడిని ఈ కవితా ఖండికలో దృశ్య సరణిలో వర్ణించిన విధానం దయార్ద్రహృదయావిష్కృతము " ఇది ఏ నాగరికతకు ఫలశ్రుతి , ఏ విజ్ఞానప్రకర్షకు ప్రకృతి , ఏ బుద్ధదేవుని జన్మభూమికి గర్వస్మృతి " అని నిలదీసి కవి ప్రశ్నిస్తారు ." మానవతలేని లోకాన్ని స్తుతించలేనని , మానవునిగా శిరసెత్తుకు తిరగలేనని , ఈ నాగరికతారణ్యవాసం భరించలేనని నిలువునా కవి నీరుగారిపోయి పేదల దుస్థితికి శోకిస్తారు.

ఈ రీతిగా ఆధునిక సాహిత్యానికి అడుగుజాడలు వేసిన గురజాడ , సామాజిక చిత్రణమే సాహిత్య పరమావధిగా కన్నీటి జడులలో తడిసిన దయాపారావతాలుగా అక్షరాలను సృష్టించిన ఇద్దరూ ఇద్దరే. ప్రాత: స్మరణీయులు

**ఆధార గ్రంధాలు:**


1. ఆంధ్ర సాహిత్య చరిత్ర
2. ఆధునికాంధ్ర కవిత్వము –సంప్రదాయములు
3. తిలక్ – రసగంగాధర తిలకం


*******

# 78. డా|| ఎన్. గోపి నానీలు ` సామాజికాంశాల చిత్రణ

**డా|| బి. భవాని**

అసోసియేట్ ప్రొఫెసర్

ప్రభుత్వ డిగ్రీ కళాశాల

కూకట్‌పల్లి, మేడ్చల్ మల్కాజ్‌గిరి జిల్లా

తెలంగాణ

ఫోన్: 9959151051

bachalabhavanivp965@gmail.com

ఆంధ్ర లోయెల కళాశాల (స్వయంప్రతిపత్తి) విజయవాడ వారి ఆధ్వర్యంలో 13, 14 మార్చి 2024 తేదీలలో నిర్వహిస్తున్న జాతీయ సదస్సునకు ఆన్‌లైన్‌లో సమర్పిస్తున్న పత్ర సమర్పణ వ్యాసం పేరు : ''డా. ఎన్. గోపి నానీలు ` సామాజికాంశాల చిత్రణ''

వచన కవితా రూపంలో వచ్చిన లఘు కవితా రూపాలు నానీలు. అత్యాధునిక కాలంలో విస్తరించినవి. నాలుగు పాదాలతో కనిపిస్తున్న నానీలు చిన్న పద్యంలా ఉంటుంది. కానీ పద్యం కాదు. గాఢత, సంక్షిప్తత ప్రధాన లక్షణంగా కొనసాగేవి నానీలు. వీటికి ఆద్యుడు డా|| ఎన్. గోపి. వీరి ''నానీలు'' సంకలనం 1998 సం||లో వెలువడిరది. ఈ నానీలలో ఉన్న సామాజికాంశాల పరిశీలనను నా పరిశోధనా లక్ష్యంగా గ్రహించాను.

నానీలు అంటే నావీ నీవి వెరసి మనవి అని అర్థం అని తానే స్వీయపతికలో స్వయంగా చెప్పారు. మనవి అంటే సమాజంలో ఉన్న సమకాలీన సమస్యలపట్ల అవగామన కలిగి ఉండడం. కవి అనేవాడు నిరంతరం స్పందనశీలిగా ఉన్నప్పుడే సమర్థవంతంగా సామాజికాంశాలను చిత్రీకరించగలడు. గోపి నానీల్లో వివిధ వస్తువులతో ఉన్న అంశాలు కన్పిస్తాయి..... అంతా సీమల్లోకి వెళ్ళి అమాభూతుల్లో తడిసి వచ్చి సమాజీకరణం చెందిన సన్నివేశం.... ఈ నానీలలో వస్తువు, అంతర్జాతీయత, వ్యావహారిక భాష, స్త్రీ సమస్య, సమకాలీనత, ప్రభోదాత్మకత, రైతు సమస్యలు, ప్రాంతీయతలను పరిశీలిస్తాను.

**కవితా వస్తువు :**

కవితా వస్తువు నానీల్లో సమాకాలీనమై ఉండాలి. ''కవిత్వ వస్తువు అనగానే కథో, సంఘటనో అనుకుంటారు. ఇది మాత్రమే కాదు, అనుభవం, ఆలోచన మొదలైనవి కూడా వస్తువులేనని విమర్శకుల భావన''[2], తెలంగాణ ప్రాంతం గురించి విముక్తిని గురించి

తన ఊళ్ళో
తానే పరాయిదైంది
తెలంగాణ పల్లె
గాయపడిన చెల్లె

అని ప్రస్తావించారు. ఇందులో కవి యొక్క ప్రాంతీయాభిమాన అస్తిత్వమే కవితావస్తువుగా మారింది.

కుటిల రాజకీయాల స్వార్థపరత్వం వలన చెరువులు మాయమైపోవడం, కబ్జాకి గురికావడం నేడు మనం చూస్తూనే ఉన్నాము. దాని వలన ప్రజలు పడే అవస్థలు అన్నీ ఇన్నీ కావు. ఇదే విషయాన్ని సమకాలీన సంవేదనతో `

చెరువులో

బంగళాలు మొలిచాయి

నీటి తల్లికి

ఇన్ని సమాధులా !

అని ప్రశ్నించారు

**అంతర్జాతీయత :**

శ్రీలంక

గడ్డకట్టిన రక్తబిందఋవు

సముద్రానికి

నిద్ర కరువైంది

లాంటి నానీలను పరిశీలిస్తే కవికి జాతీయ, అంతర్జాతీయ విషయాల పట్ల అవగాహన, సూక్ష్మపరిశీలన ఉందనే విషయం అర్థమవుతోంది.

**మానవత :**

నేటి మనిషి పల్లెలను మరచిపోతున్నాడు. ప్రపంచీకరణలో కొట్టుకుపోతూ మానవత్వానికీ, మానవ సంబంధాలకు దూరమవుతున్నాడు. ఆర్థిక, సామాజిక అభివృద్ధి మాట అటుంచి మనిషి తన అస్తిత్వాన్ని మరచిపోతున్నాడని ఆవేదనతో

మనుషుల మధ్య

రూపాయే వంతెనైతే

మానవత్వం పని

అంతే మరి !

అని అంటారు

**వ్యావహారిక భాష:**

సామాజిక స్పృహ కలిగిన కవి తన భావాలను ప్రకటించడానికి సమర్ధవంతమైన సాహిత్య ప్రక్రియను ఎంచుకుంటాడు. వ్యావహారిక భాషలో వ్యక్తపరుస్తాడు. ''ఏరచనకైనా ఒక సందర్భం ఉండి తారాలి. ఆ సమాకాలీన సందర్భమే ఆ రచనకు ఒక ప్రత్యేకతను నిర్ణయిస్తుంది''[3] మరో కోణాన్ని చూపిస్తుందని

ఎవరు చచ్చారు?

నక్సలైట్లా పోలీసులా??

చచ్చింది

ప్రజాజీవనం కూడా

అర్థమవుతుంది

**స్త్రీ సమస్యలు:**

ప్రతి విషయంలోనూ స్త్రీల పట్ల జరుగుతున్న అన్యాయాలను స్త్రీ వాదం ప్రశ్నిస్తూనే ఉంది. వారి జీవితాలలోని సంఘర్షణ, దోపిడీకి సాక్ష్యంగా నిలిచిన పోరాటాలు, ఆలోచనల్లో వచ్చిన మార్పును

ఇవాళ స్త్రీ

ఉపగ్రహం కాదు

అణచివేతపైన

అక్షరాగ్రహం

అంటూ కవి ఎన్నో నానీల్లో వివరించాడు.

**సమకాలీనత:**

"నిత్యం మనం చూసే సంఘటనలు, పొందు అనుభూతులు జరిగే వింతలు, సామాజిక సమస్యలు, పరిణామాలు, ప్రకృతి దృశ్యాలు, ఆర్థిక అసమానత్వ ఫలితాలు, రాజకీయపుటెత్తులు... ఘర్షణ..."[4] సాహిత్యం చుట్టూ పెనవేసుకొని ఉంటాయని

అమ్మ చేట ముందేసుకుంది

పిల్లాడి ఉద్యోగం కోసం

దేట్లు లెక్కిస్తుంది

అనే నాని కవి యొక్క సామాజిక చైతన్యాన్ని అద్దం పడుతోంది. సమాజంలో నిరుద్యోగం ఎంత ప్రబలంగా ఉంది అనే విషయాన్ని ''ఓట్లు లెక్కిస్తుంది'' అనే పదం సమర్ధవంతంగా పాఠకుల హృదయాలను మేల్కొల్పుతుంది.

**ప్రభోదాత్మకత :**

కవి అంటే సమాజానికి దిశా "నిర్ధేశం చేసే ప్రబోధాత్మకుడు కూడా"... అందరూ ఆలోచించినట్లు కొందరు ఆలోచించలేరు. అందరూ చెప్పినట్లుగా కొందరు చెప్పరు. విభిన్నంగా, వినూత్నంగా చెప్దామనుకుంటారు. అందే వారి ప్రత్యేకత"[5] దేశ భవిష్యత్తు యువత మీద ఆధారపడి ఉంది. వారి మనోభావాలు, సంఘర్షణలు, ఎంచుకునే మార్గాలు జీవితాలను నిర్దేశిస్తాయనే కవి

చెయ్యి అదే

కత్తిపడుతుందీ

తెడ్డు వేస్తుంది

ఎంచుకోవడంలో ఉంది!

అని ప్రభోదాత్మకంగా చెప్పారనడంలో అతిశయోక్తి లేదు

**రైతు సమస్యలు:**

రైతులు లేకపోతే మనిషికి మనుగడ లేదు. దేశానికి వెన్నుముకలాంటి రైతు ప్రభుత్వాల మీద యుద్ధాలను ప్రకటించడం, ఉద్యమాలు చేపట్టడం నేడు మనం చూస్తున్నాము. రైతుల పట్ల ప్రభుత్వాల దృక్కోణం మారాలనే

లైటు లేకున్నా

సర్ధుకుంటాం

కరెంటుతో

పొలాలకు నీళ్ళివ్వండి

కవి సూచన ఈ నానీలో మనకు కనిపిస్తోంది.

**ప్రజలను చైతన్యపరచడం :**

సమాజంలోని పరిస్థితులను, ప్రభుత్వాల తీరును గురించి ప్రజలకు అవగాహన కలిగించే కవులంటే అవినీతిపరులకు దోపిడీదారులకు హడలే. వారిని ఎప్పుడూ అణచివేయడానికి ప్రయత్నిస్తూనే ఉంటాడు. సామాజిక స్పృహ కలిగిన కవి నిరంతరం స్ఫురిస్తూనే ఉంటాడు. సన్నివేశాలను కల్పిస్తూనే ఉంటాడు.

జడివానలకు

జడిసేది లేదు

అక్షరాలను

పడవలుగా వదుల్లా!

నని హెచ్చరిస్తూనే ఉంటాడు

ప్రాంతీయత:

భావము, సంక్షిప్తత నానీలకు ప్రధానమైన విషయాలు. అత్యల్పాక్షరాలలో అనల్పార్థ భావము ఇమిడి ఉండేవి. కవికి తమ ప్రాంతానికి సంబంధించిన స్పృహ ఉంటేనే సృజనాశీలంగా తన భావాలను వ్యక్తీకరించగలడు. ప్రాంతీయ అస్తిత్వ స్పృహ ను డా॥ ఎన్. గోపి

పరాభవంలో

దిగబడిపోకు

లేచి ప్రవహించడమే

చరిత్ర !

అని సమర్థవంతంగా పాఠకుడి ముందు ఉంచగలిగాడు. ఆలోచన రేకెత్తించగలిగాడు. ఉద్యమం లోకి నడిపించగలిగాడు.

**ముగింపు:**

సామాజికాంశాలు అనేది ప్రధానంగా కవి యొక్క సమాజ పరిశీలనకు సంబంధించినది. సమాజాన్ని లోతుగా అధ్యయనం చేయగలిగిన కవి మాత్రమే సమర్థవంతంగా రాయగలడు. తన చుట్టూ ఉన్న పరిస్థితులను తెలియ చెప్పి మార్పునకు కృషి చేయగలడు. రచన చిన్నదైనా, పెద్దదైనా అందులోని భావము హృదయానికి హత్తుకునేలా చేయగలగాలి. సాహిత్యం ద్వారా సమాజాన్ని ఆవిష్కరించ వచ్చని సృజనశీలి మరియు స్పందన శీలి అయిన డా॥ ఎన్. గోపి నానీలు చదివితే అర్థమవుతుంది.

**పాదసూచికలు**


1. నానీలు ` డా॥ ఎన్. గోపి ` విపుల ప్రింటర్స్, హైద్రాబాద్ 1998. పుట : ix
2. తెలంగాణ సాహిత్యం ` కాశీం వస్తు శిల్ప 'కళ' నేత జూకంటి కవిత్వం ` సూర్య గ్రాఫిక్స్ ` హైదరాబాదు ` 2015, పుట : 128
3. అదె. పుట : 107
4. అదె ` పుట : 38
5. పాలపిట్ట ` మాస పత్రిక ` రానిపుస్తకానికి రాసిన సమీక్ష ` విశ్లేషణ ` అయినపూడి శ్రీలక్ష్మీ ` సంచిక 11, డిసెంబర్ : 2017 ` పుట : 62.


******

# 79. మాదిగ విజయం నవల – సామాజిక స్పృహ

**డాక్టర్ గడ్డం లింగరాజు**

గెస్ట్ లెక్చరర్

హుజూర్ నగర్ ప్రభుత్వ డిగ్రీ కళాశాల

హుజూర్ నగర్,సూర్యాపేట జిల్లా

ఈ–మెయిల్: gksraju1@gmail.com

ఆర్థికంగా, సామాజికంగా, సాంస్కృతికంగా తరతరాల నుండి అణచివేతకు గురిచేయబడ్డవారు దళితులు. తరతరాలుగా అనుభవిస్తున్న అవమానాల్ని పోగొట్టుకోవాలని, అందరిలాగే తాము గుర్తింపబడాలని, ఆత్మ గౌరవాన్ని కాపాడుకోవాలని, సాంస్కృతికంగా తమకో అస్తిత్వాన్ని కల్పించుకోవాలని, సమాజంలో అన్ని రంగాలలో సమాన ప్రాతినిధ్యం కోసం పోరాడుతున్న వారి జీవితాలను గురించి తెలియజేసేదే మాదిగ విజయం నవల. ఈ నవల దళితుల జీవన విధానాన్ని ప్రతిబింబింప చేస్తుంది. ప్రతి దళితుడు కూడా వారి వారి జీవితాన్ని తొంగిచూసినట్లుగా ఉంటుంది.

దళితులు అనుభవిస్తున్న దైన్య స్థితిని ఎంత హృదయ విదారకంగా వివరిస్తారో అంతే స్ఫూర్తితో దళితుల్లో చైతన్యం రావాలనే విషయాన్ని కూడా అంత సూటిగా రచయిత చెప్తారు. కాలువ మల్లయ్య దళితులు సామాజికంగా ఎదుర్కొనే అవమానాలు, అన్యాయాల్ని, నిరంకుశత్వాన్ని గురించిమాదిగ విజయం నవలల్లో తెలియజేశారు.

**1. మాదిగ విజయం నవల:**

కాలువ మల్లయ్యగారి 'మాదిగ విజయం' నవలను సామాజిక భారత్ బి.వి.వి. ఛారిటబుల్ ట్రస్టు, హైదరాబాద్ వారు 2015 ఏప్రిల్ లో ముద్రించారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ భాషా సంస్కృతిక శాఖ నిర్వహించిన నవలల పోటీల్లో (2013–2014) బహుమతి పొందిన నవల ఇది. ఈ నవలలో నాలుగు తరాల మాదిగల జీవితం, పరిణామం, అభ్యుదయం ప్రత్యక్షమవుతాయి. ఒక తరం బుచ్చయ్యది. రెండోతరం బుచ్చయ్య కొడుకు పేరయ్యది. మూడవ తరం బుచ్చయ్య మనవడు ఎల్లయ్యది (ఆనందరావుది). నాలుగవ తరం ఆనందరావు పిల్లలైన ఆజాద్, శ్రీకాంత్ లది. ఇది దాదాపు నూరేళ్ల మాదిగల జీవితాన్ని ప్రతిబింబించిన నవల. ఈ నవల దళిత బహుజన రాజ్యాధికారాన్ని కోరుతూ రాయబడిన నవల. యుగయుగాలుగా వేదనకు, పీడనకు, అంటరానితనానికి గురవుతున్న దళితులు చైతన్యం పొంది అభివృద్ధి పథంలో నడుస్తున్న వైనాన్ని ఈ నవల చిత్రీకరించింది. ఆ చైతన్యాన్ని ఉపయోగించుకొని మంద కృష్ణ మాదిగ, కృపాకర్ మాదిగ రాష్ట్రంలోని మొత్తం మాదిగల్ని కదలించగల నాయకులుగా ఎదిగారు. నిజంగా దళిత జీవితంలో ఎంతో వైవిధ్యముంది. కష్టపూరితమైన బ్రతుకే అయినా సర్వసంపదలకు సృష్టికర్తృత్వం వహించడం దళిత జీవితంలో ఉంది.

**2. వస్తు విశ్లేషణ:**

ఈ దేశంలో అత్యధికంగా అణగారిన జాతియైన మాదిగలకు తద్వారా దళితులకు రాజ్యాధికారం వచ్చినప్పుడే దేశాన్ని పీడిస్తున్న కుల సమస్య తద్వారా అనేక సమస్యలకు పరిష్కారాలు లభిస్తాయి. తరతరాలుగా వేదనకు, పీడనకు, అంటరానితనపు దౌర్భాగ్యం అనుభవిస్తున్న దళితులకు, పేరయ్య, చిలుక రామయ్యలాంటి కుటుంబాలకు రాజ్యాధికారం రావాల్సిందే. తాము మాదిగవాళ్లమని చెప్పుకోవడానికి సంకోచించే దశ నుండి వారి పేరు వెనుక మాదిగ అని పెట్టుకోవడానికి తాము మాదిగలమని చెప్పుకోవడానికి గర్వకారణంగా భావించే స్థితికి కారణం ఈ నవలలోని ఆనందరావు కుటుంబ విజయం. అదే మాదిగ విజయం. వివిధ రకాల ఉద్యమాలు, ఆనందరావు లాంటివారు విజేతలుగా నిలువడం, చదువులతో ఉన్నత స్థితికి వెళ్ళిన శ్రీకాంత్, ఆజాద్ లు ఆదర్శంగా

నిలవడం లాంటివి పీడిత జాతుల వెలుగుగా చెప్పవచ్చు. ఇరవై ఒకటవ శతాబ్దం ఖచ్చితంగా పీడిత జాతులదే అని నిరూపిస్తూ జరుగుతున్న పరిణామాల వెలుగులో ఇలాంటి విజయాలు ఎన్నో జరుగుతున్నాయి. అన్ని రంగాలలో ముందుకు వెళ్తూ దళిత రాజ్యాధికారం దిశగా అడులేస్తున్న దళిత చైతన్యపు వీరులు ఎంతోమంది ఉన్నారు. తెలంగాణలో ఆనందరావు తరంతో ప్రారంభమైన విజయ పరంపర దళితుల నుండి ఆచార్యులు, న్యాయవాదులు, కలెక్టర్లు, రచయితలు, రాజకీయ నాయకులు, కళాకారులు, తత్త్వవేత్తలుగా పరిణామం చెందుతూనే ఉన్నారు. ఒక్క ఆనందరావు విజయంతోనో అలాంటి కొద్దిమంది విజయంతోనో 'మాదిగ విజయం' పూర్తయినట్టు కాదు. విజేతలైన వారంతా అంబేద్కర్ పీడిత జన పక్షపాత సిద్ధాంతాల వెలుగులో ఇప్పటికీ హీనదశ స్థితిలో ఉన్న దళిత సోదర సోదరీమణులను విజేతలుగా నిలిపినప్పుడే మాదిగ విజయం పూర్తవుతుంది.

ఈ ఇరవై ఒకటవ శతాబ్దంలో దళితులదే జయమని ఒబామా, మాయావతి ఎన్నికలలో గెలువడం రుజువుగా కనబడుతుంది. ఓ దళితుడు దేశాధ్యక్షుడు కావడం వెనుక ప్రత్యక్ష, పరోక్ష పోరాటాల ఫలాలెన్నో ఉన్నాయి. తరతరాల పీడన అనుభవించిన దళితుడు రాజ్యాధికారం కొంతకాలమైనా చేయాల్సిందే. తెలంగాణలో మాదిగలు ఎక్కువగా ఉన్నారు. వివిధ ఉద్యమాలు తెలంగాణలో వచ్చిన తరువాత ఫ్యూడల్ దొరలతో పీడితులైన మాదిగల్లో చైతన్యం వచ్చింది. ఆ చైతన్యాన్ని ఉపయోగించుకొని మందకృష్ణ మాదిగ, కృపాకర్ మాదిగ రాష్ట్రంలోని మొత్తం మాదిగల్ని కదిలించగల నాయకులుగా ఎదిగారు. మందకృష్ణ మాదిగ ఒక చారిత్రక స్థితిని ఉపయోగించుకోగలిగే చైతన్యవంతమైన పాత్రను నిర్వహిస్తున్నాడు. శాసనసభల్లోను వారి సమస్యలే ఎక్కువ చర్చకు వచ్చేంత స్థితికి ఉద్యమాన్ని తీసుకువెళ్లాడు. అందుకే దళిత కులాల వర్గీకరణ జరగాలన్న ఆందోళన తీవ్రమైంది. ఉన్న రిజర్వేషన్ సౌకర్యాలను కొద్దిమంది మాత్రమే ఎక్కువగా ఉపయోగించుకుంటున్నారని ఎవరి వాటా వారికి చెందాలని అందుకు కులాల వర్గీకరణయే మార్గమని పోరాటాలు చేసి వారిని ఎ, బి, సి, డి గ్రూపులుగా విభజించడం జరిగింది. వారి జనాభాను ఇతర పరిస్థితులను అనుసరించి రిజర్వేషన్ శాతాన్ని పెంచుతూ జి.వో. జారీ చేయడం జరిగింది. పీడితులు అయిన పల్లెల్లోని మాదిగలు భూమి, చదువు, అధికారం పొందటంవల్ల నలుగురితో సమానంగా గౌరవంగా నిలుస్తారని భావించి రచయిత ఈ నవల రాశాడు. స్వాతంత్ర్యం రాకముందు సూర్యారావు లాంటి దొరల ఆగడాలు తెలంగాణలో ఏ స్థాయిలో ఉండేవో తెలుసుకున్నాం. స్వాతంత్ర్యం వచ్చాక సమాజంలో వచ్చిన మార్పులు, అది దళితుల జీవితంలో వచ్చే పరిణామాలు జాగ్రత్తగా సమన్వయ దృష్టితో వ్రాశాడని చెప్పవచ్చు. ఒక మాదిగ కుటుంబం తెలంగాణలో ఈ శతాబ్దంలో పొందిన అభ్యుదయాలను చిత్రించిన నవల ఇది. ఇది దళితులకు మేలుకొలుపు వంటిది. ఇది సమాజం గ్రహించి విజయం పొందటానికి కరదీపిక లాంటిది.

**3. దళితుల మత మార్పిడి విధానం:**

నైజాం పాలనలో నిజాం నవాబు ఎలాంటి మత ప్రచారాలకు అనుమతించలేదు. పోచమ్మ, మైసమ్మలాంటి క్షుద్ర దేవతల గుళ్ళు కట్టుకోవడాన్ని ప్రోత్సహించారు. నిజాం ఎంత ప్రతిఘటించినా ఢిల్లీలో ఉన్న పాలకులది క్రైస్తవం కాబట్టి పరిమితంగానైనా క్రైస్తవ మత ప్రచారానికి అనుమతించక తప్పలేదు. అందుకే స్వాతంత్ర్యానికి పూర్వం కోస్తా ప్రాంతంలో స్వీకరించినంతగా తెలంగాణలో క్రైస్తవాన్ని స్వీకరించలేదు. అన్ని మతాలవారు మత మార్పిడిలకు దళితులనే ప్రోత్సహించారు. అన్ని ప్రాంతాల్లోను తమ మీద ఉన్న పీడనను, అంటరానితనాన్ని భరించలేక దళితులే ఎక్కువ మంది మతం మార్చుకున్నారు. క్రైస్తవ మత ప్రచారకులు ఊళ్లలో తిరిగి మత మార్పిడిని ప్రోత్సహించారు. తమ మతంలో చేరితే అంటరానితనం ఉండదని, అందరితోపాటు చర్చికి వెళ్లొచ్చని ప్రార్థనలు జరుపుకోవచ్చని, చదువుకోవడానికి కూడా అవకాశాలు కల్పిస్తామని ప్రచారం చేశారు.

ఆ ఊరి దళిత యువకులకి గుళ్లోకి ప్రవేశం లేదు, పండుగలనైనా తమ ఇష్టానుసారం చేసుకునే అవకాశంలేని మతంలో ఉండటం ఎందుకన్న ఆలోచన వచ్చి వారిలో తర్జన భర్జనలు మొదలయ్యాయి. దసరా తరువాత వారం రోజులకి దళిత యువకులు,

మిగతా కొంతమంది కొండయ్య ఇంటి ముందు చర్చించారు. అక్కడికి క్రైస్తవ మత ప్రచారకుడు ఒకరు వచ్చారు. అతని మాటలను అర్థం చేసుకొని కొందరు మత మార్పిడికి అంగీకరించారు. కొంతమంది నిజాం నవాబుకి భయపడి బాధలు అనుభవించడం ఎందుకు అని ఆలోచించి మత మార్పిడిని విరమించుకున్నారు. తమ మతంలో తారతమ్య భేదాలు లేవని చదువు, ఉద్యోగాల విషయంలో తమ సాయం ఉంటుందని ఇంకా అనేక విషయాలు ప్రచారకుడు చెప్పాడు. అయితే అతడెన్ని విషయాలు చెప్పిన చివరకు రెండు కుటుంబాల వాళ్లు మాత్రమే తమ మత మార్పిడికి అంగీకరించారు. ఆ కుటుంబ సభ్యులందరిని ఊరి బయట ఉన్న చెరువు దగ్గరికి తీసుకువెళ్ళి కొన్ని ప్రతిజ్ఞలు చేయించాడు. వాళ్లకు బాప్టిజం ఇప్పించాడు. ఆ రెండు కుటుంబాల వారు క్రైస్తవులయ్యారు. మంచి క్రైస్తవులు ఎలా ఉండాలో బైబిల్లోని వాక్యాలను కోట్ చేస్తూ కొద్దిసేపు ప్రసంగించాడు. జానయ్య అనే వ్యక్తి జాన్సన్ గా పేరు మార్చుకున్నాడు. తిమ్మయ్య థామ్సన్ అయ్యాడు.

**4. దళితుల జీవన విధానం:**

చాలా ఊళ్ళకున్నట్టే ఆ ఊరికి ఓ దళితవాడ ఉంది. ఊరి చిట్టచివరన మాదిగవాడ ఉంది. ఆ వాడను ఆనుకునే మాలవాడ ఉంది. రెండింటిని కలిపి మాదిగమన్నేపొల్లవాడని, దళితవాడని అంటారు. ఆ వాడలో అన్ని పాకలే ఉన్నాయి. రెల్లుగడ్డి, వరిగడ్డి తాటాకు కప్పులతో ఉండే ఆ గుడిసెలను ప్రతి సంవత్సరం సదరాల్సిందే. ఆ వాడకున్న ప్రతి ఇంట్లో ఓ చేద బావుంది. ఆ బావుల్లో ఉండే నీళ్లు ఉప్పునీళ్లు అవి స్నానాలకు, ఇతర గృహావసరాలకు వాడుతారు. తాగడానికి, వంటకు మాత్రం చెరువు నీళ్లు వాడుతారు. ఆ ఊరిలో మంచి నీళ్ల బావి ఉన్న ఆ నీళ్ళను దళితులు ముట్టుకోకూడదు. వారి కోసం వేరే బావి తవ్వించడానికి ఏ అధికారి, నాయకుడు ముందుకు రాడు. ఉన్న మంచి నీళ్లబావి నీళ్లు తీసుకోవడానికి, వివాదం సృష్టించడానికి దళితులు సిద్ధంగా లేరు. ఆ వాడలోని వీధులన్ని మురికి మురికిగానే ఉంటాయి. ప్రతి గుడిసె ప్రక్కన ఉన్న పెంట దిబ్బలో మురికి పదార్థాలు, చెత్తచెదారం వేస్తారు. ఆ వాడలో చాలామంది శరీరాల మీద చొక్కాలు ఉండవు. మొలకు మాత్రం చిన్న పంచెలు ఉంటాయి. తలపాగాలు ఉంటాయి. స్త్రీలు బొంతల్లాంటి దొడ్డు చీరలు ధరిస్తారు. ఒక్కో స్త్రీకి రెండుకంటే ఎక్కువ చీరలుండటం అరుదు. పిల్లలకు గోచీలున్న వారు కొందరైతే అవి లేనివారు చాలామంది ఉంటారు. ఊళ్లో ఉన్న వందలాది ఎకరాల భూముల్లో దళితులెవరికి భూములున్న దాఖలాలు లేవు.

ఊరి వాళ్లందరికి మాలలు, మాదిగలు అంటరానివాళ్లే. మాదిగవాళ్లు తాకితే పెద్ద ముట్టుడుగా భావిస్తారు. దళితవాడకు వెళ్లితే వారి గుడ్డపీలికలు కాళ్లకు తగులకుండా జాగ్రత్త పడతారు. ఒకవేళ తగిలితే ఇంటికొచ్చి స్నానాలు చేస్తారు. దళితుల్లో చాలా ఉపకులాలు ఉన్న మాల, మాదిగల సంఖ్యే ఎక్కువ. ఊరంతటికి మాలమాదిగలు అంటరానివాళ్లు అయితే మాలలకు మాదిగలు అంటరానివారు. వీరి మధ్య కంచం, మంచం పొత్తుల్లేవు. ఈ కులాల వారికి గుళ్లోకి పోయే అవకాశం లేదు. దళితులంతా పోచమ్మ, మైసమ్మ, ఎల్లమ్మ లాంటి మాతృస్వామ్య దేవతలను పూజిస్తారు. కొన్ని క్షుద్ర దేవతల కొలుపులు చెప్తారు. మాదిగవారిలో చాలామంది తమ వృత్తి పనులు చేసుకుంటూనే బతుకుతున్నారు. చెప్పులు కుట్టడం, తాళ్లు పేనడం, వ్యవసాయదారులకు ఉపయోగపడే తలుగులు, దందెడలు, పగ్గాలు పేనడం లాంటి పనులు చేస్తూ బతుకుతున్నారు. కొంతమంది వెట్టివాళ్లుగా, పాలేర్లుగా, కూలీలుగా బతుకుతున్నారు. మాలలు పాలేర్లుగా, కూలీలుగా, సుంకర్లుగా, నీరటికాళ్లుగా వ్యవసాయాధారిత ఇతర పనులు చేస్తూ బతుకుతున్నారు. మాదిగవాళ్ల ఇంట్ల పందిర్లపై, గుడిసెలపై పశువుల తోళ్లు ఆరేసుకుంటారు. ఇంటి నిండా ఉత్పత్తితో సంబంధమున్న వస్తు సామాగ్రి ఉన్న,ఇంట్లో మాత్రం దుర్భర దారిద్ర్యం విలయతాండవం చేస్తూంటుంది. చాలాచోట్ల దళితవాడల పరిస్థితి ఇలాగే ఉంటుంది.

దళితులు వారి సాంప్రదాయం ప్రకారమే పెళ్ళి చేసుకుంటారు. దళితులకు పెళ్ళిళ్లు చేసే మిత్తిరయ్య వారి పురోహితుడు. జోడు నాగలెత్తుకొని వ్యవసాయానికి పోవడం, విత్తనాలు వేయబోవడం, అలుగు పోవడం లాంటి పెళ్లి తంతు కార్యక్రమాలు అన్ని పద్ధతి ప్రకారమే జరుగుతాయి. దళిత ముత్తైదువలు పాన్పులేసే పాటలు పాడుతారు. కల్లు, గుడాలతో విందు జరుగుతుంది. అప్పగింతల

సమయంలో పెళ్లికూతురు వారి తరుపువారు ఏడుస్తూ ఆమెను అప్పగిస్తారు. దళితులకు ఇతర కులాలవారికి ఉన్నట్టుగా అన్ని పండుగలు జరుపుకునే అవకాశం లేకున్నా అవెప్పుడు తమవి కావని భావించలేదు. సంక్రాంతి పండుగ వీరు జరుపుకునేవారు. వ్యవసాయదార్లకు ఇది పెద్ద పండుగ.

దళిత కుటుంబాల్లో చాలావరకు తల్లే యజమానురాలుగా ఉండటం కనిపిస్తుంది. భార్యాభర్తలిద్దరూ పనిచేస్తూ సంపాదిస్తుండటం వల్ల ఇంటి యాజమాన్యంలో సగం వరకు స్త్రీ పాత్ర కూడా ఉంటుంది. దళిత కుటుంబాల్లో, మధ్యతరగతి కుటుంబాల్లోలాగా స్త్రీ మీద పురుషుడి ఆధిక్యం పెద్దగా కనిపించదు. దళితులు ఎక్కువగా గటిక, అంబలి, కుడుములు, గంజుపిండి, జొన్నరొట్టె, పచ్చి పులుసు, చేపల పులుసులతో తినేవారు. అప్పటితో పోల్చితే ప్రపంచీకరణ ప్రభావం వలన ఇప్పుడు వారి జీవన విధానంలో చాలా మార్పులు వచ్చాయి. వారిలో వచ్చిన చైతన్యం కూడా వారి జీవ విధానాన్ని మార్చిందని చెప్పవచ్చు. వారిలో కొందరు ఈరోజు ఉన్నత స్థాయి జీవితాన్ని గడుపుతున్నట్లుగా మనం చూడవచ్చు. ఆనందరావుతో ప్రారంభమైన వారి మార్పు ఇంకా వారిలో చాలా మార్పులు రావాలని జీవన విధానంలో వీరు ఎంతో ఉన్నత స్థాయికి ఎదుగుతారని ఆశిద్దాం.

**5. దళితుల సంస్కృతి:**

ఎవరూ అనుకరించని సంస్కృతి ఏ విదేశీ వాసనలు, మోజులేనిసంస్కృతి. దాన్ని కాపాడుకుంటున్నాడు దళితుడు. ఈ దేశంలోని ఆదిమ భారతీయుడు దళితుడే. నిజమైన జాతీయవాది దళితుడే. ఎంతో వైవిధ్యమున్న సంస్కృతి, సాంప్రదాయాలు, ప్రకృతి వైపరీత్యాలను ఎదుర్కొన్నాడు. నాగరికతను పెంపొందించినవాడు దళితుడు. హక్కుల కోసం, ఆత్మగౌరవ కోసం, రాజ్యాధికారం కోసం పోరాటాలు చేస్తున్నాడు దళితుడు. భూములను సస్యశ్యామలం చేయడానికి ఘర్మ జలాన్ని ధారబోస్తున్నవాడు. నాగరికత విలసిల్లడానికి చెమటోడ్చుతున్న శ్రమజీవి దళితుడు. ప్రాజెక్టులను కట్టినవాడు, కొండలను పిండిచేసేవాడు ధన్యజీవి దళితుడు. దళితులు చాలామంది పాలేర్లుగా, కూలీలుగా, చెప్పులు కుట్టేవాళ్లుగా, డప్పు కొట్టేవాళ్లుగా, నీరటికాళ్లుగా, తాళ్లు పేనేవాళ్లుగా, చిన్న చిన్న వ్యవసాయదారులుగా ఉంటూ రెక్కాడితే కాని డొక్కాడని పరిస్థితుల్లో ఉన్నారు. ఇప్పుడు ఆ వృత్తులకు కూడా విఘాతం ఏర్పడి సంక్షోభంలో ఉన్నారు. దుబాయికి వెళ్లడం, కమ్యూనిస్టులుగా మారడం లాంటి అనేక సంఘటనలు జరుగుతున్నాయి. ఓ దిక్కు చాపకింది నీరులా అంటరానితనం, మరోదిక్కు పోరాటాలు జరుగుతూనే ఉన్నాయి. సర్వ సంపదలకు సృష్టికర్తలైన దళితులకు తాము పోరాడి గెలుచుకున్న జీవితముంది. గెలుచుకోవాల్సింది ఇంకా ముందుంది. మాతృస్వామ్య దేవతారాధన, ఇండ్లల్లో జంతువులను పెంచడం, పిడకల మీద అగ్గిని మండించడం వంటి పనులను దళితులు చేస్తూనే ఉన్నారు. దళితుల్లోంచి చదువుకొని ఉన్నత స్థాయికి చేరినవారు కొంతమంది తమ కుటుంబాల వారికి సహాయం చేస్తున్నారు. మరికొందరు తమ మూలాలను మరిచిపోయి రెక్కలొచ్చిన పక్షుల్లా ఎగిరిపోయారు. ఇంకొందరు మాత్రం తమ జాతి అభ్యున్నతి కోసం పాటుపడుతున్నారు. దళిత వనం వికసిస్తూనే ఉంది.

దళితులను అడుక్కోవడానికి చిందు భాగోతులవారు ఊళ్ళోకి వస్తారు. వారి రాకతో దళితవాడ సందడిగా ఉంటుంది. వారు భాగోతాలాడుతూ దళితుల దగ్గర బాపతులు వసూలు చేస్తుంటారు. వాళ్లకు చదువు రాదు. అయినా వంశపారంపర్యంగా భాగోతాలాడే కళ ఒకరి నుండి మరొకరికి సంక్రమిస్తుంది. నిరక్షరాస్యులే అయినా నాటకాలాడుతుండటం వల్ల వారి భాష కొంచెం నాగరికంగా ఉంటుంది. అందులో ఓ ప్రత్యేకమైన యాస ఉంటుంది. వారి వల్ల దళితవాడలో రెండు నెలల వరకు పండుగ వాతావరణం ఉంటుంది.

**6. భూస్వామ్య వ్యవస్థలో దొరల పీడన:**

నిజాం పాలనలో నాలుగైదు శాతంగా ఉన్న భూస్వాముల చేతుల్లోనే భూములన్ని ఉన్నాయి. మిగతా వారంతా భూమిలేనివాళ్లే. భూస్వాముల భూముల్లో పాలేర్లుగా, కౌలుదార్లుగా పనిచేస్తున్నవాళ్లు ఎక్కువగా దళితులే. నైజాం జారీ చేసిన కొత్త పన్నుల చట్టం 'సర్వే సెటిల్మెంట్ యాక్ట్' రాకముందు భూస్వాములే కాక కొంతమంది రైతులకు కూడా స్వల్పంగా భూములుండేవి. చాలాకాలం వరకు

శిస్తులన్ని వస్తురూపంలో చెల్లించేవారు. కొత్త పన్నుల విధానం అమల్లోకి వచ్చిన తరువాత పన్నులు డబ్బుల రూపంలో చెల్లించాల్సి వచ్చింది. అమాయకత్వం, చదువుకోకపోవడం, అణచివేత దుర్మార్గంగా ఉన్న సమయంలో ప్రజలు తమ ధాన్యాన్ని డబ్బులకు అమ్ముకునే పరిస్థితులు లేవు. ఇతర ప్రదేశాలతో సంబంధాలు అతి తక్కువ. మిగిలే పంటే తక్కువంటే దాన్ని అమ్ముకునే సౌకర్యాలు మరీ తక్కువ కావడం వల్ల చిన్న రైతు పరిస్థితి అస్తవ్యస్తమైంది. క్రమక్రమంగా పన్నులు చెల్లించడం సాధ్యంకాక భూములు వదులుకోవాల్సి వచ్చింది. పన్నులు చెల్లించలేని రైతుల నిస్సహాయతను ఆసరాగా చేసుకొని భూస్వాములు, దేశ్ ముఖ్ లు, పట్వారీలు పలుకుబడి ఉపయోగించి వాటిని స్వాధీనం చేసుకున్నారు. ఇలా భూమ్మీద పనిచేసే రైతులు భూమిలేని వారైతే పట్వార్లు, పటేళ్లు, దొరలు భూస్వాములయ్యారు. ఇందులో అగ్రకులాల వారే ఎక్కువ. వారికి నిజాంతో, అధికార్లతో సత్సంబంధాలు ఉండేవి. దొరలు, పటేళ్లు, పట్వార్లు తనకు అండగా ఉండటంతో నిజాం నిరంకుశంగా రాజ్యమేలాడు.

పైన చెప్పిన నేపథ్యం ఉన్న గ్రామంలో నర్సింగరావు భూస్వామి, పెద్ద దొరగా నిజాం అండదండలతో అపరిమితంగా ఆస్తి సంపాదించాడు. మాదిగ రామయ్య దొర గడీకే అంకితమయ్యాడు. దొర పశువుల కొట్టానికే పరిమితమయ్యాడు. దొర భూములకే తన ఘర్మజలాన్ని అంత ధారపోశాడు. దొర కుటుంబం కోసమే తన రక్తమాంసాలను ధారపోశాడు. ఇంటి వాకిట్లోనో, పొలాల దగ్గరో కావలిగా పడుకునేవాడు. అతడెంత పనిచేసినా దొరతో, అతని మనుషులతో తిట్లు తినడం తప్పడం లేదు. దొర కుటుంబం వాళ్లంతా బియ్యపు అన్నం తినేవారు. పాలేర్లకు, వెట్టివాళ్లకు పనిచేసేవారికి మాత్రం మొక్కజొన్న గటికే వండిపెడతారు. ఒక్కోసారి వారు తినగా మిగిలిన పాచిపోయిన అన్నం, కూరలు పెట్టేవారు. అతని బతుకంతా దొర దగ్గర వెట్టి బతుకులాగా ముగిసింది. అతని కొడుకు బుచ్చయ్య కూడా తండ్రిలాగే పాలేరుగా సూర్యారావు దొర దగ్గర పనిచేశాడు. అతని కొడుకులైన లింగయ్య, పేరయ్యలను కూడా దొర దగ్గర పాలేరు పనికి ఉంచాడు. పేరయ్యను దొర దగ్గర పని చేయించడం ఇష్టం లేకున్న దొర ఆగ్రహానికి లోనై అతనిని కూడ ఎడ్లు కాయడానికి పాలేరుగా ఉంచాల్సి వచ్చింది. చిన్నవాడు అయిన పేరయ్య పెద్దవాళ్ల కంటే ఎక్కువ పనిచేసేవాడు. పేరయ్య కిరాయికో, గుత్తాకో భూములు దున్నుకుంటున్నాడంటా అని బుచ్చయ్య అనడంతో సూర్యారావు దొర ఆగ్రహంతో అన్న మాటలు ఇవి: "ఆహా... ఏమన్నావురా...? మాదిగ్గాడిది కొడుకులు గూడ భూములు దున్నుకుంటరంట... నీకేమున్నయని దున్నుతవురా...! మా మోచేతి కింది నీళ్లు తాక్కుంట బతికే మీకు భూములు కావాల్సి వచ్చినాయిర...? నీ యవ్వ మాదిగ పీసునా గొడుదు... బాగ కావుర మొచ్చిందిరా మీకు...? భూమి దున్నుతాడట... ఎవ్వరి భూమిరా నువ్వు దున్నేది...?" (మల్లయ్య, కాలువ.2015:పుట.6). ఈ సందర్భంలో దొర నోటికొచ్చినట్టు బూతులు తిట్టడం ద్వారా అతని యొక్క అహంకారం తెలుస్తుంది. ఓ మాదిగ కులస్థుడు సొంత వ్యవసాయం చేసుకుంటాననడం పెద్ద తప్పైనట్టు మాట్లాడడం చూసి పేరయ్యలాంటి దళితులు చైతన్యవంతులు కావడానికి ఒక ఉదాహరణగా దీన్ని తీసుకోవచ్చు. దొర దగ్గర పాలేరు పని మానేశాడు పేరయ్య. కమ్యూనిస్టుల ప్రభావంతో, ఉద్యమకారుల పోరాటాలతో కొంతకాలం తరువాత సూర్యారావు దొర, లక్ష్మణరావులు ఊరు వదిలి వెళ్ళిపోయారు.

**7.ముగింపు:**

*ఒకే దళిత* కుటుంబానికి చెందిన నాలుగు తరాల మాదిగల జీవితం, అభివృద్ధి ఇందులో ప్రత్యక్షమవుతుంది. ఇది దాదాపు వారి నూరేళ్ల చరిత్రను తెలియజేస్తుంది. సమాజంలో తరతరాలుగా అగ్రవర్ణాల చేత అణచివేయబడుతూ, దొరల దౌర్జన్యాలకు గురవుతూ వారి వద్ద పాలేర్లుగా పనిచేస్తూ అంటరానితనానికి, అణచివేతకు గురవుతున్న దళితుల జీవితాన్ని ఆవిష్కరింపజేశాడు. 21వ శతాబ్ది ఖచ్చితంగా పీడిత జాతులదే అని నిరూపిస్తూ రాయబడ్డ నవల ఇది. 21వ శతాబ్దం దళిత బహుజనులదేనని చెప్పవచ్చు. అన్ని రంగాల్లో ముందుకు వెళ్తూ దళిత రాజ్యాధికారం దిశగా అడుగులేస్తున్న దళిత చైతన్యపు వెలుగులు ఎంతో మందితో 21వ శతాబ్దిలో రాజ్యాధికరం దక్కుతుంది.

దళితుల ప్రత్యక్ష, పరోక్ష పోరాటాల ఫలితమే ఓ దళితుడు రాష్ట్రపతి కావడం. అతను విధులను నిర్వహించిన తీరు ప్రపంచంలోనే ఉత్తమ రాజనీతిజ్ఞునిగా నిలబెట్టింది. దేశవ్యాప్తంగా దళితుల హక్కుల గూర్చి, విద్యావకాశాల గూర్చి, రాజ్యాధికారం గూర్చి చైతన్యవంతమైన పోరాటాలు జరుగుతూనే ఉన్నాయి. దళిత చైతన్యం వెల్లివిరుస్తూనే ఉంది. సిద్ధాంత నేపథ్యంతో కూడిన దళిత బహుజన పార్టీ సిద్ధాంత బలంతో దళిత రాజ్యాధికారం వస్తే తప్ప,మిగతా దళితులు కూడా విజేతలు కాలేరు. ఒక్క ఆనందరావు విజయంతోనో అలాంటి కొద్దిమంది విజయాలతోనో మాదిగ విజయం పూర్తైనట్టు కాదు. మందకృష్ణ మాదిగ వ్యక్తిలాంటి వారు తెలుగు నేల పగ్గాలు చేపడితినే సంపూర్ణమవుతుంది. అంబేద్కర్ చెప్పిన దళిత రాజ్యాధికార చర్యే అసలు సిసలు మాదిగ విజయాలవుతాయి.

**ఉపయుక్త గ్రంథసూచి:**

1.మల్లయ్య, కాలువ. 2015. **మాదిగ విజయం**. హైదరాబాద్: సామాజిక భారత్ బి.వి.వి. . ఛారిటబుల్ ట్రస్టు.

2.వెంకటేశ్వర్లు,పంతంగి.2014.**తెలంగాణ తెలుగునవల**.వరంగల్: కాకతీయ విశ్వవిద్యాలయం.

3. ప్రతాపరెడ్డి, కాసుల. 2017. **తెలంగాణ నవలా వికాసం**. హైదరాబాద్: తెలంగాణ సాహిత్య అకాడమీ.

4.అయిలయ్య, బన్న. 2010. **కాలువ మల్లయ్య కథలు తెలంగాణా జనజీవితం**. వరంగల్:నానీ ప్రచురణలు.

5.జయప్రకాష్, ఎస్.2009. **పరిశోధన విధానం**. హైదరాబాద్: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.

6.సిద్ధారెడ్డి,నందిని.2008.**కులవృత్తులు తెలంగాణ సాహిత్యం**.హైదరాబాద్:తెలంగాణ రచయితల వేదిక.

*******

# 80. వాసాల నరసయ్య కథలు – సామాజిక స్పృహ

**డా. బి. భీమమ్మ,**

అసిస్టెంట్ ప్రొఫెసర్ ఆఫ్ తెలుగు

ఇందిరా ప్రియదర్శిని ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాల,

నాంపల్లి, హైదరాబాద్, తెలంగాణ.

**కీలక పదాలు :** నోరుమంచిదయితే, లింగయ్య కథ, ప్రతిజ్ఞ పట్టుదల, కళవిలువ, తాతా – మనవడు, పువ్వులేమన్నాయి.

**రచయిత పరిచయం:**

వ్యాస కర్త, బాలసాహితీ రంగంలో విశేషమైన కృషి చేసినవారు వాసాల నరసయ్య, పిల్లలకు వికాసాన్ని, వినోదాన్ని, విజ్ఞానాన్ని అందిస్తూ, చిన్న చిన్న కథలు, పొడుపుకథల ద్వారా పిల్లలకు నైతిక విలువలు, బాధ్యత, గురించి తెలపాలని ప్రయత్నించారు. ప్రస్తుతం పాఠశాలలో ఇంగ్లీషు మాధ్యమానికి ప్రాధాన్యత పెరుగుతున్నప్పటికి, బాలభారతం, పంచతంత్రం, తెనాలిరాముని నైతిక కథలు, నీతికథలు, బొమ్మరిల్లు, బాలమిత్ర, బుజ్జాయి, చందమామ కథలు, తెలుగు వెలుగు అనే శీర్షికలతో మాసపత్రికలు పిల్లలను ప్రోత్సహిస్తున్నాయి. చిన్నపిల్లలకు తెలుగు సాహిత్యం ఔన్నత్యాన్ని, ఆవశ్యకతను పెంపొందించడం కోసం పిల్లలకు పోటీలు పెట్టి గెలుపొందిన వారందరికి బహుమతులు ఇస్తూ ప్రోత్సహించాలని కోరడం జరిగింది. పిల్లలకు భాషపట్ల అభిమానం పెంచడంలో తల్లిదండ్రులే చర్యలు తీసుకోవాలని నరసయ్య గారు అభిప్రాయపడుతున్నారు.

వాసాల నరసయ్య 1942లో కరీంనగర్ జిల్లా చౌలమద్దిలో జన్మించారు. పన్నెండు సంవత్సరాల వయస్సు లోనే సాహితీ ప్రస్తానాన్ని మొదలుపెట్టారు. పౌరాణిక నాటకాలు, కవిత్వ వంటి అంశాలపై తన రచనలను కొనసాగించారు. స్కూలుమాస్టారుగా తమ ఉద్యోగ ప్రయాణాన్ని మొదలు పెట్టి, 2002 వ సంవత్సరంలో పోస్టు మాస్టారుగా రిటైరయ్యారు.

విద్యార్థి దశలోనే 1955 లో 'సౌగంధికాహరణము' అనే వీధి నాటకంను రచించారు. 1958 నుండి 1960 వరకు స్కూలు యజమాన్యం నడిపే 'అభ్యుదయ వాణి' అనే మాసపత్రికకు సంపాదకత్వం వహించారు.

వాసాల నరసయ్య గారు పిల్లలకోసం ప్రత్యేకంగా పొడుపు కథలను సృష్టించేవారు. పొడుపు కథల్లో వైవిధ్యమైన జ్ఞానాన్ని, హాస్యాన్ని కలిగించేవి. మహానగరాలలో '' సెంట్రల్ హిందీ డైరెక్టరేట్ న్యూఢిల్లీ వారి అభ్యర్థన మేరకు నవలేఖక్ శిభిరాలలో పాల్గొన్నారు. దిన, వార, మాస పత్రికల్లో బాలల కథలు, గేయాలు, గ్రంథ సమీక్షలు, వ్యాసాలు మొదలైన 17 గ్రంథాలను వెలువరించారు. తమకు తపాలాశాఖతో ఉన్న అనుభవంతో తపాల ప్రపంచం ఇ – డి ఉద్యోగులు రచించారు. 600 లకు పైగా కవితలు, గేయాలు రచించారు. వాటిలో ముఖ్యమైనవిగా కర్షకుడా! కార్మికుడా! ఈ దేశం, గమ్యం, శ్రమగీతం, బాలగేయ కుసుమాలు వంటి రచనలను సృష్టించారు.

**పురస్కారాలు :**

1992 లో నిజామాబాద్ లో తెలుగు వెలుగు సమాఖ్య అనే పురస్కారం, 2006 సంవత్సరం మచిలిపట్నం లో ఆంధ్ర సారస్వత సమితి పురస్కారం, 2007 లో జగన్నాథ్ సాహితీ సమాఖ్య నల్లజర్ల వారి బాలసాహిత్య పురస్కారం, 2017లో శ్రీ పి.వి నరసింహరావు మొట్టమొదటి సాహితీ పురస్కారాన్ని అదే క్రమంగా బాలసాహిత్యంలో కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారంను అందుకున్నారు.

**వ్యాస సంగ్రహం :**

నరసయ్య గారు 25 కథా సంపుటాలను రచించడం జరిగింది. వాటిలో ''ప్రతిభ – పట్టుదల'' అనే కథ కేంద్రసాహిత్య అకాడమి పురస్కారాన్ని పొందింది. చిన్న చిన్న కథల ద్వారా నేటి బాలల్లో నైతిక బాధ్యతలను, మానవత్వ విలువలను పెంపొందించడమే

లక్ష్యంగా ఉండేవి. ''మొక్కై వంగనిది మానై వంగదు కదా'' అందుకే పిల్లలకు మనం బోధించే ఈ నీతిసూత్రాలు, నైతిక విలువలు తమ భవిష్యత్తును ప్రశాంతంగా ఉంచడానికి బీజం వేస్తుందనడంలో ఎటువంటి సందేహము లేదు.

**నోరు మంచిదైతే కథ :**

అమెరికా వంటి సంపన్న దేశాలలో వారి పిల్లలు ఒక వయసు రాగానే తమ అవసరాల ఖర్చులకు తామే సంపాదించుకుంటారు. వారికి డబ్బులు లేక కాదు, పని విలువ, కాలం విలువ, ధనంవిలువ తెలయడం కోసం... కానీ మన దేశంలో పిల్లలకు ఎంత ఎదుగుతున్న తల్లిదండ్రులు ఆధ్వర్యంలోనే ఉండాలనుకునే వారే ఎక్కువగా ఉంటారు. ఆర్థికంగా శ్రీమంతులు కాకపోయినప్పటికి పెద్దల సమక్షంలో మన చుట్టు పరిసర ప్రాంతాలలోనే పిల్లలు డబ్బు విలువలను తెలుసుకోవాలను కుంటాం.

ఈ కథలో సుశీల అనే చిన్న అమ్మాయి ద్వారా కుటుంబ బాధ్యతను, అదే క్రమంగా సమాజంలో బ్రతుకు దెరువు సాగించాలంటే ఎంత చాకచక్యంగా మనమాట తీరు ఉండాలో నిరూపించారు. నిష్కల్మషమైన మనస్సు, స్వార్థచింతన లేని తలపు ఎప్పుడు ఉండటం చాలా అవసరం. ఒంటరి మహిళగా ఉంటూ సమాజంలో ఇద్దరి పిల్లలను చదివించలేని దీనస్థితిలో ఉన్న తల్లికి ఆలంబనగా నిల్చిన సుశీల పాత్ర మనందరికి ఆదర్శం. తండ్రి మరణించడం, తల్లి ఆరోగ్యం బాగా లేకుండా ఉండడం, తమ్ముడు రాజు చిన్నవాడై ఉండడం తన చుట్టూ ఎన్నో సమస్యలు ఉన్నప్పటికి, ఈ సమాజం మీద మనుషుల మీద విరక్తి చెందకుండా తను ఎలాగైనా చదువుకోవాలి, అమ్మకు అండగా ఉండాలనే తన ధృడసంకల్పం నేటి యువతకు ఎంతో మార్గదర్శకం.

సుశీల తన కుటుంబాన్ని పోషించుకోవడం కోసం ఇంటి దగ్గర ఉన్న బట్టలకొట్టులో పని చేయడానికి నిర్ణయించుకొని, ఇంటర్వ్యూకి వెళ్తుంది. వాళ్ళు అడిగిన ప్రశ్నలన్నింటిని నవ్వుతూ సమాధానాలను ఇస్తుంది. చివరి ప్రశ్నగా యజమాని ఈ షాపు ఎవరిది అనే ప్రశ్న వేయగానే కల్మశంలేని సుశీల మీరు పని ఇస్తే 'ఈ దుకాణం మనది అవుతుంది' అని చెప్పడంతో అక్కడ వున్న అందరినీ ఆశ్చర్య చకితుల్ని చేస్తుంది. చిరునవ్వు, కష్టపడి పని చేసే తన మనస్తత్వం వల్ల యజమాని ఆదరణ పొంది ఉద్యోగం పొందుతుంది సుశీల. ఒకవైపు పని చేసుకుంటూ, తన మధ్యలో ఆగిన ఇంటర్ విద్యను పూర్తిచేస్తుంది. మన నోరు మంచిదైతే, ఊరు మంచిదవుతుందనే అనే సామెతకు ఈ కథ నిరూపించింది.

**సామాజిక స్పృహ :**

మన ప్రధానమంత్రి నరేంద్రమోది నుండి మన తెలంగాణ ముఖ్యమంత్రి రేవంత్ రెడ్డి వరకు ఎంతో కష్టపడి ఉన్నత శిఖరాలను అధిరోహించిన వారిగా మనకు ఎంతో మంది మార్గదర్శకులు మనకు సమాజంలో కన్పిస్తారు.

**లింగయ్య కథ :**

ఉపాయం లేని వారిని ఊరి నుండి తరిమెయ్యాలి అనేది ఒకప్పటి పూర్వ సామెత. ప్రతి మనిషి సహజంగా ప్రజ్ఞ కలిగిన వారే. చదువకోవడం వల్ల ఆ ప్రజ్ఞకు సానెపెట్టి ఇంకా అభివృద్ధి చెందాలి. అంతేకాని ఏదో కొంత చదువు అబ్బడం వల్ల సాటివారిని చులకనగా చూడటం చాలా తప్పు అని లింగయ్య పాత్ర ద్వారా కవి మనకు సందేశాన్ని ఇచ్చారు.

పల్లెలో మన నివాసం అయినప్పుడు అందుకు తగ్గట్టుగా మన జీవనంను మలుచుకోవాలి. చదువుకున్నాననే అహంకారం వల్ల ఏ పని చేయకపోవడం మనిషి మనుగడనే ప్రశ్నిస్తుంది. గృహస్థాశ్రమంలో ఉన్న మగాడికి కుటుంబ పోషణే. ప్రథమ కర్తవ్యం. దానికి చదువు సహాయం చేస్తే మంచిదే, లేకపోయినా భౌతిక కష్టమో, వ్యాపారమో అతని బాధ్యత కావాలి, కాని లింగమయ్య బాగా చదువుకున్నాను అనే గర్వంతో ఏ పని చేయక, అందరిలో చులకనవడం, తన కుటుంబమే అతనికి మర్యాద ఇవ్వకపొయ్యే పరిస్థితి ఏర్పడుతుంది. లింగయ్య అహంకారమే తన వివేకాన్ని నశింపచేస్తుంది. ఆ వివేకం నశించినప్పుడు మన నిర్ణయాలు చాలా పొరపాటుగా ఉంటాయి. లింగయ్య ఈ ఊరిపై కుటుంబంపై విరక్తి చెంది అడవికి పారిపోతాడు. అక్కడ కన్పించిన సన్యాసి గురుబోధతో తన జీవితాన్ని

చక్కదిద్దుకున్నాడు. మనం చేసే పనిలో రెండు రకాలు. మంచి పని, చెడ్డపని. అంతేకాని పెద్దపని, చిన్నపని అంటూ ఏమి ఉండవు. మన మనస్సును బుద్దిని, శరీరంపై లగ్నం చేస్తే ఏ పనిలో అయినా విజయం సాధిస్తామని ఎంతో చక్కని గురుబోధతో తన తప్పును తెలుసుకుంటాడు.

లింగయ్య అడవిలో దొరికే మోదుగుఆకులతో విస్తళ్ళు తయారుచేసి వాటిని అమ్మి కుటుంబ బాధ్యతలను తీసుకొని వారిని సంతోషపెట్టారు. మనసుని లగ్నం చేసుకొని పని చేయడం మన కర్తవ్యం అని నరసయ్య గారు ఈ కథ ద్వారా తెలియజేసారు.

**తాత – మనవడు :**

పూర్వకాలం నుంచి మనం ఉమ్మడి కుటుంబాలనే ఎక్కువ ఇష్టంపడేవాళ్ళం. రాను రాను ఉమ్మడి కుటుంబాలు కనుమరుగైపోతున్నాయి. పిల్లలు వయసు పెరిగిన తల్లిదండ్రులపై ప్రేమ – ఆప్యాయతలు లేకుండా వారి అవసరాలు తీర్చడానికి భారంగా భావించి వృద్ధాశ్రమాలకు పంపించేస్తున్నారు. చిన్నపిల్లలు నాయనమ్మ, అమ్మమ్మ, తాతయ్య ల ప్రేమకు దూరం అవుతున్నారు. ప్రస్తుతం సమాజాన్ని దృష్టిలో పెట్టుకొని తాత – మనవడి బంధం గురించి నరసయ్య గారు చిన్మయ్ పాత్ర ద్వారా వివరించారు.

మనిషి జీవితం పుట్టుకతో మొదలై మరణంతో ముగుస్తుంది. మనిషి సంఘజీవి తన అవసరాలను ఇంటిలో సమాజంలో ఎక్కడైనా ఒకరికొకరు అవసరాలనిమిత్తమై సహాయ సహకారాల తోనే జీవితం నడుస్తుంది. నేటి సమాజం గురించి చెప్పనక్కరలేదు. కాలచక్రం కంటే వేగంగా మనిషి పరిగెడుతున్నాడా అన్పిస్తుంది. ఇలాంటి దశలో వృద్ధాప్యం ఒకశాపంగా పట్టిపీడిస్తుంది. 'తాతా – మనవడు' అనే కథ ద్వారా ఒక మనిషికి వృద్ధాప్యంలో కావాల్సినది మనం వారిపై చూపించే ప్రేమ, భరోసా, స్వాంతన అనేవి ముఖ్యమైనవి. మనవడి రూపంలో ఆ తాతకి దొరకడంతో సంతోషానికి అవధులు లేని సీతారామయ్య పాత్ర ద్వారా తెలియజెప్పారు.

అరవై ఏళ్ళ జీవితాన్ని ఎంతో గొప్పగా అనుభవించినప్పటికి మెల్ల మెల్లగా చిన్నపిల్లల మనస్తత్వాన్ని కలిగి ఉండటం. మతిమరుపురావడం, శరీరం సహకరించకపోవడం ముఖ్యమైనటువంటి మార్పులుగా మనం గమనించవచ్చు. మన బిజీ జీవితంలో వారిపట్ల కొంచెం నిర్లక్ష్యంగానే వ్యవహరిస్తుంటాము. వారికి సమయానికి భోజనం పెట్టడం ఒక్కటే మన బాధ్యత అనుకుంటే మనం చేసే పెద్ద తప్పు. భోజనం మాత్రమే కాదు, పెద్దలను అన్నివేళలా వారి అవసరాలను కనిపెట్టుకుని ఉండాలని మనవడు చిన్మయ్ పాత్రతో రచయిత మనకందరికి గొప్ప సందేశం ఇచ్చారు.

సీతారామయ్య తొంబై ఏళ్ళ పైబడిన వ్యక్తి. వయసు పెరగడంతో సమయానికి సరైన మందులు వేసుకోలేక చాలా బాధపడుతుంటారు. కొడుకు, కోడలు తీరికలేని జీవితంలో నిమగ్నం అవ్వడంతో వారికి చెప్పలేక సీతారామయ్యనే తికమకపడుతూ తనకు తోచిన విధంగా మందులు వేసుకుంటూ అనారోగ్యంగా ఎప్పుడు బాధపడుతుంటాడు. తాతయ్యను ఏ విధంగానైనా ఆరోగ్యవంతుడిని చేయాలని చిన్మయ్ ఆలోచిస్తాడు. ఉదయం వేసుకోవాల్సిన మందులను డ్రైనింగ్ టేబుల్ వద్ద, మధ్యాహ్నం వేసుకోవాల్సి మందులను టీ.వి దగ్గర, రాత్రి వేసుకునే మందులను పడుకునే దిండు క్రింద పెట్టి తాతయ్యకు సలహా ఇస్తాడు. మనవడు తనపట్ల తీసుకున్న శ్రద్ధకి తాతయ్యకి అనారోగ్యం నయమవుతుంది. తాత మనవడి చేసిన ఉపాయానికి పొంగిపోయాడు.

**పట్టుదల – ప్రతిజ్ఞ :**

ప్రతిజ్ఞ అనగానే మనకు భీష్ముడు చేసిన ప్రతిజ్ఞ గుర్తుకు వస్తుంది. ఎవరైనా మాటఇచ్చి, శపథం చేసి నెరవేర్చడంకై చాలా ఓర్పు, పట్టుదల ఉండాలి. సమాజంలో నేటి తరానికి అన్ని ఇన్ స్టంగ్ గా అంటే అప్పటికప్పుడే ఈజీగా వచ్చేయాలి. ప్రస్తుతం ఇచ్చిన మాట నెరవేర్చడం అనేది కలలో కూడా జరగడం లేదు.

ఒక మనిషి పట్టుదలతో ప్రయత్నిస్తే ఎలాంటి విజయమైన తన సొంతమవుతుందని ఈ కథ ద్వారా పిల్లలకే కాకుండా పెద్దలకి హితబోధ చేసారు. గంగారామ్ అనే వ్యక్తి మెట్రిక్యులేషన్ (ఇప్పటి ఇంటర్) పూర్తి చేసి తండ్రి అనుమతితో లాహోర్ (పాకిస్తాన్) పట్టణంలో

ఉద్యోగం కొరకు వెళ్తాడు. ఆఫీసులో పొరపాటున తెలియక ఇంజనీర్ గారి కుర్చీలో కూర్చోవడం చూసిన ఇంజనీర్ గా గంగారామ్ ను చులకనగా మాట్లాడడం జరిగింది. ఆ క్షణం చిన్నవాడైనా తను కూడా ఇంజనీర్ అవుతానని ప్రతిజ్ఞ చేశాడు. ఆవేశంలో శపథం చేయడం కాదు, గంగారామ్ ఎంతో పట్టుదలతో రూర్కీ ఇంజనీర్ కళాశాలలో చేరి ఫస్ట్ క్లాస్ లో ఉత్తీర్ణుడయ్యాడు. తనకు వచ్చే 50 రూపాయలు స్కాలర్ షిప్ లో సగం ఇంటికి పంపించేవాడు. అహోరాత్రులు కష్టపడి చదివి ఇంజనీర్ గా తనకు అవమానం జరిగిన కుర్చీలోనే కూర్చుంటాడు. ''సర్ గంగారామ్ '' గా కీర్తి ప్రతిష్టలను సంపాదించుకుంటారు. కృషి ఉంటే మనుషులు రుషులౌతారన్న సామెతను గంగారామ్ నిజం చేసి చూపారు. సహనం, శ్రద్ధ, పట్టుదలలే విజయ రహస్యాలన్ని నిరూపణ చేశారు గంగారామ్. ఏ ఇంజనీర్ అయితే గంగారామ్ ను హేళన చేసాడో వారిచేతనే ప్రశంసలు అందుకోవడం అనేది పిల్లలకే కాకుండా పెద్దలకి ఆదర్శమైన కథగా మనం భావించుకోవచ్చు.

**కళ విలువ :**

మనిషికి ఎప్పుడైన తన ప్రతిభ పట్ల అహంభావం, గర్వం, పొగరు ఉండరాదని తెలియజేశారు. ప్రకృతిలో మనకి ఎన్నో పువ్వులు ఉన్నాయి. మల్లె, గులాబి, సంపంగి ఇలా అనేక రకాలుగా వాటి పరమళాలను వెదజల్లుతూ వేటికవే ప్రత్యేకతను కలిగి ఉంటాయి. మనుషులలో ఎవరి ప్రతిభ వారిది, ఉదాహరణకు ఒక కార్ ని తీసుకుంటే బ్రేక్, క్లచ్, యాక్సిలేటర్ ఇలా మూడింటి పని మూడు రకాలుగా ఉంటుంది. అన్ని కలిసి పని చేస్తేనే కార్ ను సౌకర్యవంతంగా నడపగలుగుతాం.

ఈ కథలో నారయ్య, నాంచారయ్య అనే రెండు పాత్రలతో ప్రతిభ ద్వారా మనకు కలిగే గర్వం ఎంత ప్రమాదకరమో వివరించారు. నారయ్య పాటలు రాసేవాడు. నాంచారయ్య ఆ పాటలకు సంగీతాన్ని వాయిద్యాలను ఉపయోగిస్తూ మధురంగా సమకూర్చి పాడేవాడు. ఈ క్రమంగా ఇద్దరూ ఎంతో ఉన్నతంగా హాయిగా జీవితాన్ని గడిపేవారు. రెండు చేతులు కలిస్తేనే చప్పట్లు అన్నట్లుగా రెండు జత కలిస్తేనే పాట శ్రోతలకు వినసొంపుగా ఉంటుంది. నారయ్య రాసే పాటలకు అభిమానుల ప్రశంసలు అభినందనలు ఎక్కువ కావడం చేత, విచక్షణ కోల్పోయి అహంభావంను పెంచుకుని నారయ్య, నాంచారయ్య తో పాటలను పాడించకుండా తానే స్వయంగా పాటలు పాడుతూ ప్రదర్శనలు ఇస్తుంటాడు. కొద్ది రోజులలోనే తన అభిమానులు స్వరకల్పనను, కంఠాన్ని చూసి నవ్వడం మొదలుపెట్టారు. కలిసి ఉన్నప్పుడు ఎంతో ఆర్థికంగా జీవించిన నారయ్య నేడు ఒంటరిగా తన భోజన నిమిత్తం కూడా సంపాదించలేకపోయాడు. మెల్లగా చేసిన తప్పు తెలుసుకుని నాంచారయ్యను క్షమాపణ అడగడంతో చిరునవ్వుతో నారయ్యను క్షమించి కౌగిలించుకున్నాడు. మన స్నేహితులో, బంధువులో మనస్ఫూర్తిగా చేనిన తప్పుకు పశ్చాత్తాపపడి క్షమించమని అడిగినప్పుడు మనం తప్పకుండా క్షమించాలనే ఉదాత్తమైన సందేశాన్ని ఈ కథ ద్వారా అందజేసారు.

సమాజంలో మనం స్థిరంగా ముందుకెళ్ళాలంటే, అన్ని విద్యలు సమానమే. ఏ విద్య తక్కువ, ఎక్కువ కాదు. దేని విలువ వాటికే ఉంటుంది. భారతీయ కళలు 64 రకాలుగా మనిషికి ఉల్లాసాన్ని, ఉత్సాహాన్ని వైజ్ఞానికతను కలిగిస్తున్నాయి.

**పువ్వులేమన్నాయి :**

ఈ కథ మనిషికి గొప్ప కనువిప్పు కలిగిస్తుంది. మనిషి మానసిక స్థితిని గురించి వివరించడం జరిగింది. ఒక్కరోజే తమ జీవితం అని తెలిసినప్పటికి పరిమళించే పువ్వులను చూసి మానవజాతి ఎంతో తెలుసుకోవాలి. ప్రతి చిన్న విషయానికి, పరీక్షలో ఓటమికి, తక్కువ మార్కులు వచ్చాయని జీవితాన్ని చాలించుకునే యువతకు, ఈ పువ్వుల మనస్తత్వం ఆదర్శం కావాలనే ఉద్దేశ్యంతో, స్వామి రామతీర్థకు జరిగిన సంఘటనను పిల్లలకు కథ రూపంలో రచయిత వివరించారు.

ఒకసారి స్వామి రామతీర్థ మన భారతీయ సంస్కృతి విశిష్టతను ప్రచారం చేయడం కోసం విదేశాలకు వెళ్ళాడు. అక్కడ పూలప్రదర్శన జరుగుతున్నది. రామతీర్థం లోపలికి వెళ్ళాలనుకున్నారు. కానీ అక్కడ ఉన్న సెక్యూలరిటీ గార్డు ఆయన వేషధారణ చూసి

చులకన చేసి లోపలికి పంపించలేకపోతాడు. స్వామీ రామతీర్థం సెక్యూరిటీ గార్డుతో లోపలికి పంపించకపోయినప్పటికీ పర్వాలేదు అంటూ చిరునవ్వుతో నన్ను అక్కడ కన్పించే ఆ పువ్వుల దగ్గరకు పంపించు ఒక ప్రశ్న అడిగి వస్తాను అనే మాటలకు సెక్యూరిటీ గార్డు ఆశ్చర్యంగా స్వామిని లోపలికి పంపిస్తాడు. కాసేపు పువ్వుల చూసి తిరిగి వస్తున్న స్వామితో పువ్వులను మీరు ఏమని ప్రశ్నించారని గార్డు అడుగగా ''ప్రతి చిన్న విషయాలకి ఈ మనుషులు నిరుత్సాహపడి, నిర్వేదము చెంది, దు:ఖ పీడితులై ఉంటారు. కాని మీరు మాత్రం ఎప్పుడు ఆనందంగా హాయిగా సంతోషంగా నవ్వుతూనే ఉంటారు. ప్రకృతి మీకేమైనా వరంగాని ఇచ్చిందా అని ప్రశ్న వేసాను అని స్వామిజీ చెప్పగానే, దానికి వెటకారంగా గార్డు నవ్వుతూ మరి పువ్వులు ఏమి సమాధానం ఇచ్చాయి అని అడుగగా, మనషులంతా మా గుణాలను అలవాటు చేసుకుంటే మాలాగే మీరు ఎప్పుడు నవ్వుతూ ఉంటారు. మనుషులారా మీరంతా మారండి మమ్మల్ని చూసి నేర్చుకోండి అని సమాధానం ఇచ్చాయి. అని స్వామిజీ చెప్పడంతో గార్డు ఆలోచనలో పడ్డాడు. స్వామీజి అక్కడి నుండి వెళ్ళిపోతాడు.

చెట్లకి రాళ్ళు పెట్టికొట్టినా, మనకు ఫలాలనే ఇస్తుంది. పువ్వులు ఒకరోజే తమ జీవితం అని తెలిసినా మనకు పరిమళాన్నే వెదజల్లుతుంది. అలాగే మానవుడు శ్రమతో పట్టుదలతో చేసే పనికి ఎప్పుడు చిరునవ్వును జతజేస్తే మనకంతా ఆనందమే, ఆరోగ్యమే అనే గొప్ప సందేశాన్ని కవి వివరించారు.

**ముగింపు :**

పిల్లలకు అక్షరాల ద్వారా విలువలు నేర్పి సమాజంలో ఒక మంచి మార్పునకు కృషి చేస్తున్నారు వాసాల నర్సయ్య. చిన్నారులలో పఠనాశక్తిని, తెలుగు భాషపై మమకారాన్ని పెంచేందుకు ఎన్నో సంవత్సరాల నుండి కృషి చేసిన మాస పత్రికలు కనుమరుగవ్వడం పై విచారాన్ని వ్యక్తం చేశారు. బాలసాహిత్యం ద్వారా చిన్నారుల లేత మనస్సుల్లో ఎంతో మార్పు తీసుకురావచ్చు అనే గట్టి నమ్మకం రచయితది.

తాతా – మనవడి కథ ద్వారా మానవత్వం, నోరు మంచిదయితే కథలో బ్రతుకుదెరువును సాగించాలంటే మాట తీరు మంత్రంలా పనిచేయాలని, లింగమయ్య కథ ద్వారా మనసుని లగ్నం చేసుకొని కష్టపడి మనపై ఆధారపడిన కుటుంబాన్ని ఏ విధంగా పోషించుకోవాలో తెలియజేశారు. ప్రతిజ్ఞ పట్టుదల కథలో గంగారామ్ చేసిన ప్రతిజ్ఞ వారి జీవితాన్ని మలుపుతిప్పింది. దేశమే గర్వించదగ్గ సివిల్ ఇంజనీర్ ను చేసింది. కళ విలువ అనే కథలో ప్రతిభకు చిన్న – పెద్ద, ఎక్కువ – తక్కువ అనే భేదాలు ఉండవని చక్కని సందేశం ఇచ్చారు. పువ్వులేమన్నాయి కథ ద్వారా మనిషి జీవితం ఎల్లప్పుడు చిరునవ్వుతో ఉండడం మనిషి మానసిక ఆరోగ్యానికే కాక శారీరక ఆరోగ్యానికి ముఖ్యమేనని పువ్వుల ద్వారా అమోఘమైన పద్ధతిలో అందరికి గొప్ప సందేశం అందించారు. ఈ కథలు పిల్లలకే కాక ప్రతిఒక్కరికి చాలా అవసరమే అనే వాస్తవాన్ని గుర్తు చేశారు వాసాల నరసయ్య.

**వనరుల జాబితా :**

1. వాసాల నరసయ్య, 2017 కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం అందుకున్న సందర్భంగా వారితో జరిగిన ముఖాముఖి.

2. వాసాల నరసయ్య, పట్టుదల – ప్రతిజ్ఞ కథలు (బాల సాహిత్యం)

3. వల్లంపాటి వెంకట సుబ్బయ్య - కథాశిల్పం,

4. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి - మార్గదర్శి కథలు.

******

# 81. అమళ్లదిన్నె సాహిత్యం - సామాజిక స్పృహ

**పూజారి ఈరన్న**

పరిశోధక విద్యార్థి

తెలుగు & తులనాత్మక శాఖ

శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం

అనంతపురము.

ఫోన్ నెంబర్: 8500850242

వర్తమానాధ్ర రాయలసీమ కవులలో అవధాని, సాహిత్య పరిశోధకుడు, శతక ,నాటక, ప్రబంధ ,వ్యాస, ఖండకావ్యం మొదలగు బహుముఖీనరచనాకృషివలుడు. డాక్టర్ అమళ్లదిన్నె వేంకట రమణ ప్రసాద్ అనంత పద్యాన్ని పండించిన సేద్యగాడు. ఎన్నో బహుమతులు అందుకున్న సత్కృతి. సమకాలిన సమస్యల మీద పద్య కావ్యం రాయాలన్న ఆలోచన రచయితకున్న సామాజిక స్పృహకు దర్పణం. సామాజిక బాధ్యతతో, సమాజంలోని అంశాలనే సందర్భానుసారంగా తీసుకొని రచనలు చేసే రమణ ప్రసాద్ లాంటి రచయిత లోకానికి ఆదర్శం. ఈనాటి సమాజాన్ని సూక్ష్మేక్షికతో దర్శించి అందరి మంచి చెడులను అవగతం చేసుకొని ప్రతి సన్నివేశాన్ని విమర్శనా దృష్టితో దాన్ని వింగడించి పాఠకుల ముందు ప్రదర్శించడానికి తపిస్తాడు రచయిత. ఈయన పదప్రయోగం కంటే భావం ముందు పరిగెడుతుంది. బహుముఖ ప్రజ్ఞ, అసాధారణ కవితా సామర్థ్యం గల రమణ ప్రసాద్ సాహిత్యం రసజ్ఞులైన పాఠకులకు తెలియనివి కావు. ఇతని సాహిత్యంలో ఎక్కువ భాగం సామాజిక స్పృహను ,బాధ్యతను తెలియజేయడమే ప్రస్తుత వ్యాసోద్దేశం.

పద్య కవిత నిర్మాణ సంవిధానములో ప్రజ్ఞావంతుడు. సాహిత్య యుగధర్మం తెలిసిన కవి.వీరి భావుక సీమలో పురుడు పోసుకున్న కావ్యం 'నిఖిలావని చాప చరిత్ర'ను తెలిపే "కరోనా" కావ్యం మృచ్ఛకటికం పై పరిశోధించిన విద్వన్మూ ర్తికి మానవ మానవ జీవితం మృచ్ఛకటికమై పోవటాన్ని చూచి చలించిన సందర్భం. సామాజిక స్పందనకు తార్కరణం 'కరోనా 'కావ్యం.సామాజిక దృక్పథం లేని కవిత్వం ప్రాణం లేని శరీరం . కరోనాను సామాజిక సమస్యగా స్వీకరించి పద్య గ్రంథంగా రాయడం అంత సులువేమీ కాదు. ఈ శతాబ్దపు ప్రపంచ విలయ మహమ్మారి -విషూచిక -కరోనా కల్పించిన, కలిగిస్తున్న, వికృతి, వికారం, విపరీతం గురించి సంవేదనతో '' కరోనా"ని 'నిఖిలావని శాప చరిత్ర' అనే నిర్వచన పద్య కావ్యంగా రచించాడు. ఇందులో 207 పద్యాలలో అంటురోగాల చరిత్ర, కరోనా బీభత్సం, కరోనా కట్టడి, కరోనా వలన కలిగిన కనువిప్పు మొదలగు మూడు ఆశ్వాసాల గ్రంథమిది.

కవి నిత్య ప్రయోగ శీలుడు అనడానికి నిదర్శనంగా విమానము, అలసగతి,ప్రహేయము, రుగ్మవతి, అతివినయం, మంగళ మహా శ్రీ అనే విశేష వృత్తాలను కవి ప్రయోగించడం కరోనా మన దేశానికి 'విమానం'లో ఎక్కడి నుంచో వచ్చిన మారి, ఇది 'అలసగతి'లో చిన్నగా ప్రాకి ప్రాకి అంతటా క్రమ్ముకొన్న రోగం . అది అత్యంత 'ప్రహేయమై'న ఘోర రోగం. అంతేనా? రుగ్మతను కలిగించే గుణవతి. మనిషి శరీరంలో చేరి 'అతివినయంగా' అణిగిమనిగి ఉంటూ అసవులు తీస్తుంది. ఈ పీడలన్నీ తొలగి చివరకు దేశానా 'మంగళ మహా శ్రీ 'ఏర్పడుట గాక . అని ఇదొక చమత్కార విశేషం అని చెప్పవచ్చు.

రవికాంచనిచో కవి గాంచునే కాదా అన్న మాట ఈ కవికి చక్కగా సరిపోతుంది అనుకుంటున్నాను. ఎందుకంటే కరోనా సమయంలో దాని విలయతాండవాన్ని కేవలం టీవీలో మాత్రమే చూసి పరిశీలించి 113 పద్యాలలో రాయడం, అలాగే కరోనా కనువిప్పు కలిగించిన విషయాలను తెలియజేయడంలో వైద్యశాస్త్ర పరిజ్ఞానమునకు ఈ గ్రంథం మచ్చుతునక. పద్యం తెలుగువారి సాహిత్య సంపద. తరగనిది. పద్యాన్ని రూపుమాపాలని ఎందరు ప్రతిజ్ఞలు చేసినా అవి తెల్లారేసరికి కాలగర్భంలో కలిసిపోయాయి.

"చెడనిది పద్యంబొక్కటే

కుడియెడమల కీర్తి దోప గువ్వల చెన్నా !" అని

కవి ఏనాడో పలికిన మాట నేటికీ అదే సత్యం అని నమ్మి పద్యాన్ని ప్రేమించి అనేక భావాలను,సంఘటనలను పద్య కవితగా రాసి వాటన్నింటినీ ఒకచోట చేర్చినదె ఈ "పద్యరింఛోళి" అనే కంద కావ్యం. ఇందులో 21 ఖండికలున్నాయి. 20వ శతాబ్ది తొలి రోజుల్లో కరుణశ్రీ, జాషువా, తుమ్మల తదితర ప్రసిద్ధ కవులు ఈ ధోరణిలో ఆవేశపూరితంగా కవితలవిష్కరించి పాఠకుల ప్రశంసలందుకున్నారు. కవి సామాజిక స్పృహ కలిగిన రచనలు చేస్తాడు. ఇందులో సోమరి సత్రాలు, కొరగాని కొడుకు, మూడజనోపేక్షితుడు, క్షేత్ర జీవి అనె ఖండికలు రచయిత పొందిన మానసిక వ్యధను పద్య రూపంలో అద్భుతంగా చిత్రించారు. అంతటితో ఆగక తంజావూరునేలిన ప్రభువులు సత్ర నిర్మాణం చేసి, ప్రతి దినం వేల మందికి భోజన సదుపాయాలు కలిగించారు. దానివల్ల ప్రజల్లో సోమరితనం ప్రబలిందని ఈ రచయిత ఊహించి వాటికి 'సోమరి సత్రాలు' అనే పేరు పెట్టి ఆ పేరుతో ఒక కవిత కండికనే రాశారు.

'నృపులు సంక్షేమ పథకాల నెపము తోడ

బద్ధకము పెంచిలాగెడు పాలనంబు

తిరిగిరాలేము అన్నిటి పిరికితనము

సోమరుల పెంచి పోషించు చోద్యమగును'

సంక్షేమ పథకాల వల్ల ప్రజలలో బద్ధకము పెరుగుతుందని కవి భావిస్తున్నారు. పైగా పాలకులు మళ్లీ పదవిలోనికి రావటానికే ఈ పథకాలను ప్రవేశపెడుతున్నారని ఆక్షేపిస్తున్నాడు. ఈ కవి ఈ తరంలో జమీందారులుగా సాహిత్య సేవ చేసిన వారు కొందరు. సమాజ సేవ చేసిన వారు కొందరిని ఎన్నుకొని వారు చేసిన ఘనకార్యాలను ఎత్తిచూపడం రాబోయే తరాలకు వీళ్లను మార్గదర్శకులుగా గ్రహించి సామాజిక ఉత్తమ కార్యాలను చేసిన వారు యశశ్శరీరులై ఆచంద్రార్కం జరామరణ భయం లేకుండా ఉండగలరని ఉపదేశించటం , అభినందించదగిన విషయం. ముత్యాల రాజాగా ప్రసిద్ధుడైన వాసిరెడ్డి రామగోపాలకృష్ణ మహేశ్వర ప్రసాదు గారు కృష్ణా నదిపై నాగార్జున ప్రాజెక్టు పులిచింతల ప్రాజెక్టులను నిర్మిస్తే కోస్తా తీరమంతా పైరు పచ్చల తో పాడిపంటలతో కళకళలాడుతుందని భవిష్యత్తు గురించి ఆలోచించినా అభివృద్ధి స్వప్నికుడు నిస్వార్ధంగా వాటి నిర్మాణం జరగాలని ప్రచారం చేసి కొంత స్వార్జిత ధనాన్ని వెచ్చించిన దార్శనికుడు కవులను పోషించిన వాడు వారిని గురించి అమల్లదిన్నె వెంకటరమణ ప్రసాద్ ఒక గీత మాలికను రచించుట ఔచిత్యవంతం.

" అతడు ముక్త్యాల రాజా! యటన్నఘనుడు

వాసిగాంచిన రామ గోపాలకృష్ణ

వాసిరెడ్డి వంశమణియైవరలె శ్రీలు

జింద నాగార్జునయు పులిచింతలయును

గొప్ప ప్రాజెక్టులని పల్కికోరి సొంత

ధనమునిడిని నిస్వార్థ విధాయ కుండు

సాహితీ వేత్తల కవుల సత్కరించి

చిన్మయానంద గురువుల శేముషిగన

శ్రద్ధ గీతాధ్యరంబును సల్పినాడు

దీపమనదగు నితని సందీప్తి దలతు"

అని ప్రశంసించుట యోగ్య సముచితం అంతేకాకుండా 20వ శతాబ్ది తొలినాళ్లలో ఆంధ్ర తెలంగాణ రాష్ట్రాలలో పలువురు పధాన్యులైన జమిందారులకు రమణ ప్రసాద్ పద్య కవితా నీరాజనం అర్పించాడు. చరిత్రను అవలోడనం చేసి వారి ఘన కీర్తిని ప్రశంసించడం భావితరాలకు మార్గదర్శనం. ప్రముఖంగా పూసపాటి ఆనంద గజపతి, నాయని వెంకట రంగారావు, బులుసు బుచ్చి సర్వారాయుడు, ముళ్ళపూడి తిమ్మరాజు, పార్థసారథి అప్పారావు, ఎర్లగడ్డ అంకినీడు ప్రసాద్, రామేశ్వర రాయలు. రావు వెంకటకుమార మహీపతి సూర్యారావు, వెంకటాద్రి నాయుడు, శ్రీరామ భూపాలరావు, శ్వేత చలపతి రామకృష్ణ, సురభి వెంకట లక్ష్మణరావు అనే పేరా ఆచార్య తూమాటి దొణప్ప పరిశోధనాత్మక గ్రంథం రమణ ప్రసాద్ గారికి స్పూర్తి అనిపిస్తుంది. ఈ సంస్థానాధీశుల చరిత్ర ఆధారంగా కొందరి జీవన రేఖలను కవి పండిత సాంగత్యంతో మేళవించి ఒక బృహత్కావ్యం అమళ్లదిన్నె వారి కృషిలో భాగం కావాలి.

'కొల్లదొట్టి సంపద దోచుకొనుచు వారి

మాతృభూమికి తరలించు మార్మమతులు

స్థానికుల జీల్చు కార్యసాధకులు వారు

శిస్తులను దండుకొనుటయే శ్వేత బుద్ధి ' అని

తెల్లవారి స్వార్థపరత్వాన్ని వెల్లడిస్తూ నిరసించాడు. కవి ఈనాటి తెలుగు సమాజంలో సాగుతున్న కొన్ని దుష్టాచారాలను విమర్శించి ఖండించినారు. తల్లిదండ్రులను వృద్ధప్రాయంలో చూడకుండా వృద్ధాశ్రమాల్లో ఉంచుతున్నా పుత్రపుంగవలను, కనీసం వారి కపరకర్మలు కూడా సక్రమంగా నేరపబోని వారి దుశ్చేష్టితాలను ఎండగట్టారు. అంతటి తో ఊరుకోలేదు కవి. నేటి స్మార్ట్ ఫోన్లలో కాలం గడుపుతున్న విద్యార్థి శ్రేష్టుల ఆగడాలను తల్లిదండ్రులను వేధించి, బైకులు కొని ప్రమాదాలకులోనై కాళ్లు కీళ్లు విరిగి బాధపడే విషయాలనేన్నింటినో ఊటంకించారు. వీరికి మాతృభాషాభిమానం ఎక్కువ '' అనే పేరుతో రాసిన ఖండికలో

'తెలుగు మనోహరప్రచుర దీప్తిమ యూఖము భాషలందు సం

కలిత కళాకలాపము వికాస్వర నాదము శ్రావ్య మందు నౌ

దల ధరించు భవ్యగుణదామము దివ్యం దివ్యము గ్రాహ్యమందు నా

క్ఫల ములదేనేలం జిలుకు పాకము రమ్య కవిత్వమందిలన్ ' అని స్వభాషను ప్రశంసించారు.

స్త్రీలను మాతృమూర్తులుగా భావించి పూజించింది భారతీయ సంస్కృతి. ఎక్కడ స్త్రీలు గౌరవింపబడుతారో అక్కడ దేవతలు శ్రమిస్తారని వచించినాడు. వివేకానంద స్వామి చికాగో మత మహాసభలలో మాట్లాడుతుండగా ఒక సభ్యుడు లేచి "అనంత ప్రపంచం దర్శించే వ్యక్తికి నిధి భారతదేశమని ఎలా తెలుస్తుంది? అని ప్రశ్నించగా ఆయన "ఎక్కడ మహా పతివ్రతలు నివసిస్తారు అది భారతదేశంగా తెలుసుకో" అని సమాధానం చెప్పాడు.ఈ కవికి స్త్రీమూర్తులయంద ధిక గౌరవం. అంతేకాకుండా స్వాతంత్ర సంగ్రామం లో మన స్త్రీలు కూడా పాల్గొని కారా గృహబద్ధులై ఇడుములు పడినారు. అదే విషయాన్ని రచయిత ఇలా పద్య రూపంలో చెప్తారు

' దండి సత్యాగ్రహమున విదగ్ధమతులు

ప్రబలు నాంగ్లదానవతకు బాధపడిరి

జైళ్లల్లో గర్భవతులు విషాద ఘడియ

పురుడు పోసుకునిరి; కృష్ణమూర్తి పుట్టే!'

అన్నారు. అంటే శ్రీకృష్ణ స్వామి కారాగృహంలో జన్మించిన వృత్తాంతం జ్ఞప్తి చేస్తూ అలా అచట పుట్టిన వారంతా ఉన్నదోన్నత కార్యాలు చేసి ఉంటారని ధ్వనితం చేశారు.ఆధునిక కవులలో జాషువాలోకోతరుడు. ఆయన కవితా ప్రాభావాన్ని 'వరపుత్రుడు',' అనే రెండు ఖండికలు జాషువాకు నీరాజనం పట్టాయి.

'జెండాపై కగరాజు గబ్బిలము నుస్థేమ ప్రతీక స్పృహన్ దండోరా నినదింప

పల్కవలె;మీదార్ ద్యంబు కొండాడుచున్ రండంచున్ కడగొట్టుబిడ్డ

హరియి రాజ్యాధికారోగ్రవేదండంబున్ పడగొట్టి పైకొనెడి మతాంగప్రథన్ దుల్చగా ' అని

'రామదాసు డడాండ డాండ నినదంబు ' చేసిన రీతిలో రమణ ప్రసాద్ ముక్తకంఠంతో ఆంధ్రుల ఆధారాభిమానాల హృద్య పద్యంగా మలిచాడు 'మీ కవితా వధూటి నును మీగడ వాగునుండి మందానికివోలెదూకి కవితా ఝరికీవే విధాత' అని జాషువా కవి బ్రహ్మత్వాన్ని వేనోళ్ళ కొనియాడాడు.

పుట్టుకను జెప్పి దిట్టంపు పొలుపు బొగడి

మీద రాణించినాడని యేదొ వాగు

కొనుట లబ్ధప్రతిష్ఠుడైన నవకవికి

తప్పలేదు సభలలో క్రుధలు పెనంగ.'

ఆయన కవిత్వాన్ని కులంతో ముడిపెట్టి అవమానించిన అగ్రకుల దౌస్త్యాన్ని కవి ధ్వనింప చేశారు. ఈ విధంగా నేటి సాంఘిక స్థితిగతులను పరిశీలించి, సద్విమర్శ చేయడం రమణ ప్రసాద్ గారి రచన ప్రత్యేకతగా చెప్పవచ్చు. నేడు సమాజంలో అనేక దురాచారాలు, చెడు వ్యసనాలు మానవత్వాన్నే కాదు సమాజ పురోగమనాన్ని అడ్డుకుంటున్న విభిన్న అంశాలపై స్పందించి, తన పద్య ధారతో కవిత్వం చేసిన ఆధునిక పద్య కవి అమళ్లదిన్నె వెంకటరమణ ప్రసాద్. కవి ప్రజల నాలుక యందు నానుతుండాలంటే సామాజిక స్పృహతో, వర్తమాన అంశాలపై స్పందించి రచనలు చేసే రచయిత నేటి సమాజానికి ఎంతైనా అవసరం ఉంది.

*******

# 82. దళిత కవిత్వ సైద్ధాంతిక వికాసం - సామాజిక స్పృహ

**డా|| కె.వి.యన్.డి. వరప్రసాద్,**

ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.

తెలుగు శాఖాధ్యక్షులు,

ఆదికవి నన్నయ విశ్వవిద్యాలయం.

రాజమహేంద్రవరం-533 296, తూ||గో||జిల్లా.

చరవాణి : 94909 21345, 80740 38928.

1909లో వచ్చిన తొలి తెలుగు దళిత కవితతో తెలుగు సమాజంలో దళిత సాహిత్యం ప్రస్థానం ప్రారంభమైంది. అంటే ఇప్పటికి సుమారు 115 ఏళ్ల క్రిందటే తెలుగు సాహిత్యంలో దళిత స్పృహ ఉందని చెప్పుకోవచ్చు. అయితే ఈ వ్యాసానికి నేను నూరేళ్ళ దళిత సాహిత్యంలోని కవిత్వాన్నిపరిగణనలోకి తీసుకోవడం జరిగింది. 1909లో దళిత కవితకు అంకురార్పణ చేసి ఈ ప్రస్థానం వివిధ మలుపులు తిరగడానికి కారణమైన కవిత – " మాలవాండ్రపాట " . దీనిని రాసిన వారు అజ్ఞాతకవి అని ప్రస్తావిస్తున్నా దీనిని శ్రీ మంగిపూడి వెంకటశర్మ గారు రాశారని ఇంతకుముందు ఒక వ్యాసంలో ప్రతిపాదించాను.

సమాజంలో వస్తున్న మార్పులు సాహిత్యంపై ప్రభావాన్ని చూపిస్తాయని నిస్సందేహంగా చెప్పవచ్చు. అసలు సాహిత్యమే సమకాలీన సమాజానికి ప్రతిబింబం. కాబట్టి కాలానుగుణంగా దళిత సాహిత్యం నేటికి పూర్తిగా పరిణామం చెంది ఒక రూపాన్ని తీసుకుందని చెప్పవచ్చు.

కాలానుగుణంగా సామాజిక స్పృహతో దళిత సాహిత్య భావన పరిపూర్ణ సిద్ధాంతంగా పరిణామం చెందడానికి నూరేళ్ళు పట్టడం యాదృచ్ఛికం. దళిత సాహిత్యం అర్థించే స్థాయి నుంచి గర్జించే స్థాయికి ఎదగడానికి శతాబ్దం పట్టింది. అర్థించే స్థాయి నుంచి శాసించే స్థాయికి ఎదగడమే దళిత సాహిత్య పరమావధి. నూరేళ్ళ తెలుగు దళిత సాహిత్య మహాప్రస్థానానికి దళిత సామ్రాజ్యస్థాపనయే ధ్యేయం. దీని సాధనకు సాహిత్యంలో వందేళ్లు ఎక్కువగానే కనిపిస్తున్నా ఈ కాలచక్రంలో ఈ కాలం చాలా తక్కువనే చెప్పాలి. ఈ సందర్భంగా ఈ నూరేళ్ల ప్రస్థానంలో వివిధ దశల్ని పరికిస్తే...

నూరేళ్ళుగా దళిత సాహిత్యాన్ని సుసంపన్నంచేసిన మహనీయులెందరో ఉన్నారు. వందేళ్ల దళిత సాహిత్య ప్రస్థానంలో మైలురాళ్ల వంటి ఎన్నో కవితలు వచ్చాయి. వాటి నుంచి నాలుగు కవితలను తీసుకుని దళిత కవిత్వ సిద్ధాంత క్రమ పరిణామ వికాసం వివరించడానికి చేసే ప్రయత్నమే ఈ వ్యాస పరమావధి. నేను ఈ వ్యాసానికి ఎంచుకున్న కవుల్లో నలుగురు కవులు ఒకరికి తెలియకుండా ఒకరు ఆ సిద్ధాంతానికి స్పష్టతనిచ్చారు. ఈ నూరేళ్ళలోనూ నాలుగుదశలుగా ఒకేభావన ఆధారంగా వచ్చిన 1909లో వచ్చిన మాలవాండ్రపాట, 1941లో వచ్చిన కవికోకిల జాషువా రాసిన " గబ్బిలం " కావ్యంలోని "అప్పు"పద్యం, 1991లో వచ్చిన ఆచార్య సుదర్శనరాజు " వడ్డీ " కవిత , 2009లో వచ్చిన ఉన్నమట్ల మునిబాబు " దళితశంఖారావం " కవితలను సమన్వయం చేయడానికి నేను వస్తువులుగా ఎంచుకున్నాను. ఈ నలుగురు కవులు నాలుగు దశలకు ప్రతినిధులు. నాలుగు కవితల్లోనూ ఒక అంతస్సూత్రం ఉంది. ఆ అంతస్సూత్రం ఆధారంగా భావనలు పరివర్తన చెంది పరిపూర్ణ సిద్ధాంతంగా ఆవిష్కరించబడ్డాయి.

" మాలవాండ్ర పాట " రాసిన మంగిపూడి అస్పృశ్యతని పాటించవద్దని విజ్ఞాపన చేయడం దళితసాహిత్యానికి ప్రాథమికదశ. సహస్రాబ్దాలుగా తమకష్టానికి తగినఫలితాన్ని ముట్టచెప్పనందుకు, ' శ్రమను దోచుకున్నందుకు దేశం అప్పు పడిందని చెప్పడం

రెండవదశ, మహాకవి గుర్రం జాషువా ఈ ఆలోచనలకు ఆద్యులు. మూడవదశలో డా|| కొండపల్లి సుదర్శనరాజు కోల్పోయిన హక్కుల్ని పొందడంలో భాగంగా రిజర్వేషనల్ని వడ్డీలుగా భావించి జమకట్టుకోవడం, అసలు ఎప్పుడు తీరుస్తారని ప్రశ్నించడం జరిగింది . నాల్గవదశలో కవి మునిబాబు తమ నుంచి దోచుకొన్న అసలు, వడ్డీ కూడా సరిపెట్టమని హెచ్చరించారు. అసలు వడ్డీ అంటే కవి దృష్టిలో దేశ పరిపాలనాధికారాన్ని హస్తగతం చేసుకోవడమే.

శిఖరాయమానమైన నాలుగు కవితల్ని అనుశీలించి మూల్యాంకనం చేస్తే దళిత కవిత్వ వికాస, పరిణామం, పర్యవసానాలు తెలుస్తాయి. అందరం భరతమాత బిడ్డలమే అంటూ అందరం ఒక్కటిగా కలిసిమెలసి బతుకుదామనే ఆశయంతో వచ్చిన రచన మాలవాండ్ర పాట, దళితులే తమ గొంతు విప్పి చెప్పుకున్నట్టుగా ఆత్మాశ్రయరీతిలో సాగిన గొప్పరచన. తొలిదళిత కవిత ఆరంభాన్ని చూద్దాం.

అందారు పుట్టిరీ హిందమ్మ తల్లికి ...అందారు ఒక్కటై ఉందారి సక్కంగ

కష్టమ్ము లొచ్చినా నిష్టూర మొచ్చినా... ఇష్టమ్ము గానుండి కట్టూగ నుందాము||

కష్టాలలోనూ, నష్టాలలోనూ కలిసిమెలసి జీవిద్దాం, ఇష్టంగానే కలిసికట్టుగా ఉందాం, మేము అన్ని వృత్తుల్లోనూ రాణిస్తున్నాం అని చెబుతూ దళితేతర భారతీయులు దళితుల్ని తమ్ముళ్ళుగా చూడాలని అభ్యర్థించడం ఈ పాటలోని ప్రధానాంశం. అంటరానితనాన్ని పాటించకుండా, తమను సోదరులుగా చూడమని అభ్యర్థించడం తొలితెలుగు దళితకవితకు నేపథ్యం. దళితులపై సానుభూతితో వ్రాయబడిన కవితగా దీనిని భావించవచ్చు. మాలవాండ్రపాటలో ఎక్కడా దళితుల ధిక్కారస్వరం వినిపించదు. తొలి కవితలో సమాజం వారి పట్ల సానుభూతిని ప్రదర్శించాలనే ఆకాంక్ష బలంగా వినిపించడం జరిగింది.

వేలాది సంవత్సరాలుగా భారతీయులందరికీ అనేకవిధాలుగా దళితులు చేసిన సేవలు వెలకట్టలేనివి. దళితుల సేవలకు విలువను లెక్కగట్టి, వారి సేవలకు దేశం అప్పుపడిందనే విషయాన్ని **1941**లో గబ్బిలం కావ్యం ద్వారా మహాకవి జాషువా చెప్పారు. దేశంలోని అన్నివర్గాలు దళితుల సహకారాన్ని, సహాయాన్ని ఏదో రూపంలో తీసుకున్నాయి. కాని సేవకు ప్రతిఫలం మాత్రం వాళ్లకు అందలేదు. అందుకే భారతదేశం దళితులకు ఋణ పడిందని జాషువా చెప్పారు.

ముప్పుఘటించి వీనికులమున్ గలిమిన్ గబళించి దేహమున్

బిప్పి యొనర్చు నీ భరత వీరుని పాదము కందకుండగా

చెప్పులు కుట్టి జీవనము చేయును గాని నిరాకరింప లే

దెప్పుడు అప్పువడ్డది సుమీ భరతావని వీని సేవకున్

"అస్పృశ్యతని పాటించవద్దని విజ్ఞాపన" చేసే స్థాయి ప్రాథమిక దశ. దళితుల సేవకు ప్రతిఫలం అందలేదు కాబట్టి అప్పుపడ్డారని సౌమ్యంగా విడమర్చి చెప్పడం ద్వితీయ దశ. యావద్భారతజాతి దళితులకు ఋణపడిందని చెప్పడానికి ఆ రోజుల్లో ఎంతో సాహసం కావాలి. సాహసంతో చెప్పడం దళిత కవుల ప్రత్యేకత. ఆరోజుల్లో ఈ రచన విప్లవాత్మకమైన ఆలోచన.

శతాబ్దాలుగా అణచివేతకు గురౌతూనే, అనేక సాంఘిక రాజకీయ పరిణామాల ఫలితంగా దళితులు చైతన్యవంతులయ్యారు. రాజ్యాంగం అందించిన రిజర్వేషన్ల సౌకర్యంతో మరింత మెరుగైన జీవితాన్ని రూపొందించుకుంటున్నారు. రిజర్వేషన్లకు వ్యతిరేకంగా దేశం మొత్తం మీద అలజడి చెలరేగినప్పుడు, రిజర్వేషన్ల వ్యతిరేకోద్యమాన్ని వ్యతిరేకిస్తూ "మా పూర్వీకుల నుండి మా వరకు మేం చేసిన సేవలకు మీరు " మాకు అప్పు పడ్డారు. ఆ బాకీ అసలుతో సహా తీర్చేవరకు రిజర్వేషనల్ని వడ్డీలుగా జమకట్టుకుంటూనే ఉంటామని" **1991**లో దళితకవిరాజు డా|| కె. సుదర్శన రాజు తెగేసి చెప్పారు.

తరతరాల శ్రమదోచిన

ఋణగ్రస్తపు దొరలారా!

అసలెప్పుడు తీరుస్తారు?

వడ్డీలు మాత్రమే రిజర్వేషన్లు !

వడ్డీలు మాట సరే "అసలు" ఎప్పుడు తీరుస్తారో చెప్పమని ఎలుగెత్తి గాండ్రించడం పైకవితలో ప్రతిధ్వనించింది. మహాకవి జాషువా "అప్పువడ్డది సుమీ భరతావని వీని సేవకున్" అని చెప్పిన పద్యసూత్రానికి ఆచార్య సుదర్శన రాజు చెప్పిన కవిత ఒక మహా భాష్యం.

ఇంతవరకు చూచిన దానికంటే భిన్నమైన ధోరణి నాల్గవదశలో కనిపిస్తుంది. ఈ దశలో అర్రులు చాచి అడగడంలేదు. అభ్యర్ధనలు అంతకంటే లేవు. ఉద్యమించడం ఒక్కటే కనిపిస్తుంది. ప్రతిఘటించడం, అడుగడుగునా ఆత్మాభిమానాన్ని కాపాడుకోవడం కనిపిస్తుంది. తమ హక్కులు ఒకళ్ళు ఇచ్చేవికావు. ఎవరికీ  భయపడవలసిన పనిలేదు. ఎవరినీ దీనికి అభ్యర్ధించవలసిన అగత్యం అంతకంటే లేదు. ఈ దశలో కవి ఇంకో అడుగు ముందుకు వేశాడు. నూరేళ్ళుగా సాగుతున్న దళితోద్యమ సాహిత్యసాగరాన్ని మధించాడు. అమృతసదృశమైన కవిత చెప్పాడు. దళితులకు దేశాన్ని పాలించే అధికారం కావాలనే సిద్ధాంతానికి శ్రీకారం చుట్టాడు. ఉద్యమాన్ని ఊపిరిగా, అంటరానితనమనే గడ్డివెంటిని తగలబెట్టే మంటగా, అస్పృశ్యతా మేఘాల్ని చెల్లాచెదురుచేసే ఝంఝూ ప్రభంజనంగా దళిత చైతన్యానికి చిరునామాగా, దళితులకు కొండంత అండగా ఉన్న కవి ఉన్నమట్ల మునిబాబు.  అసలు, వడ్డీ ఏకకాలంలో సరిపెట్టమంటూ సరికొత్త గొంతుతో కొత్త సిద్ధాంతానికి తెరతీశాడు. 2009 దళిత కవిత్వ శతవసంతోత్సవ సంవత్సరం మునిబాబు కవిత దళితకవిత్వ శతజయంతికవితా వైజయంతిక....

ఆధిపత్యాన్ని వెలగబెడుతున్న

అగ్రవర్ణపు దొరలారా!

ఏళ్ళతరబడిగా దోచుకున్న

దళితుల శ్రమశక్తికి వెలకట్టండి

అసలెంతో లెక్కలుతేల్చండి

అసలూ వడ్డీ కలిపి చెల్లించండి...

సీట్లసర్దుబాట్లు, నోట్ల పంపకాలు,

బినామీ పేర్లతో పదవుల పందేరాలు,

అనామతు అధికారాలు మాకు వద్దు,

మీ ఆధిపత్యాన్ని తరిమికొడతా...

గెలుపు దిశగా పయనిస్తా! దేశాన్ని పరిపాలిస్తా !

అధికారం కోసం దళిత శంఖారావం వినిపిస్తా ! అనడంలో వ్యవస్థపై ధిక్కార స్వరంతోపాటు ఆత్మవిశ్వాసం అంబరాన్నంటుతుంది.

ఈ కవితలో ఇంకెంతకాలం వడ్డీలతో మాత్రమే సరిపెట్టుకోమంటారు అంటూ గర్జించడంతోపాటు రిజర్వేషన్లు అనే వడ్డీలు తీసుకుంటూ, ఆ వడ్డీలతోనే సంతృప్తిపడమంటే కుదరదంటున్నాడు. వడ్డీలు అలవాటుచేసి ఏమార్చవద్దంటున్నాడు. అసలెంతో లెక్కచెప్పమంటున్నాడు.

ఈ యువకవి చరిత్రమూలాలకు తగిలేలా "అసలు" అనే మాటను వాడాడు. ఈదేశం మట్టితోబాటుగా పుట్టిన మాకు ఈ దేశాన్ని పరిపాలించే హక్కు ఉంది. ఆ హక్కు ఆజన్మ సిద్ధం. అయినా దోచుకోబడ్డాం. తరతరాల నుంచీ నేటి దాకా, మా పెద్దల నుండి మాదాకా దోచుకున్న శ్రమ శక్తికి వెలకట్టమని గర్జించడం కనిపిస్తుంది. ఈ యువకవి దృష్టిలో అసలు, వడ్డీ కలిపితే దాని మొత్తం విలువ "అధికారం" - అంటే దేశాన్ని పరిపాలించే అధికారం. దాన్ని ఏనాటికైనా సాధించి తీరతామనే ఆత్మవిశ్వాసాన్ని ప్రకటించాడు. అధికారపగ్గాలు చేపట్టడమే దళితులు అంతిమ లక్ష్యం అని స్పష్టం చేశాడు. మార్పును కోరిన తీర్పు ఈ అక్షరాల కూర్పుగా చెప్పుకోవచ్చు.

మాలవాంద్రపాట, జాషువా అప్పు పద్యం, డా|| సుదర్శన రాజు వడ్డీ కవిత్వం, మునిబాబు దళిత శంఖారావం కవితల్ని పరిశీలిస్తే సుదీర్ఘమైన నూరు సంవత్సరాల దళిత సాహిత్య ప్రస్థానంలో వచ్చిన పదునైన ఆలోచనల క్రమ పరిణామం అర్థమౌతుంది. తరతరాలుగా సాగుతున్న ఈ ఉద్యమ ప్రస్థానంలోని ఆవేదన మనకు అవగతమౌతుంది. వందేళ్లకు పైగా వారు సమానత్వం కోసం జరుపుతున్న పోరాటాన్ని ఒక సిద్ధాంతంగా రూపొందించడానికి, క్రమ పరిణామ వికాసాన్ని అర్థంచేసుకోవడానికి ఈ కవితల్ని నేను ఎంచుకోవడం జరిగింది కానీ దళిత సాహిత్యం అనే మహాసాగరంలో ఇవి కొన్ని నీటి బిందువులు మాత్రమే.

*********

# 83. అవతలి గుడిసె – సామాజిక స్పృహ

Dr.D. Vijayakumari

Department of Telugu

School of Humanities

University of Hyderabad

Mobile No: 9491877705

Mail: dasara.vijayakumari@gmail.com

**ఉపోద్ఘాతం**

జయప్రకాశ్ కర్దమ్ "చప్పర్" అనే నవలను హిందీలో రాశారు. దానిని ఆచార్య వి. కృష్ణగారు తెలుగులోకి అనువాదం చేశారు. వీరు హైదరాబాదు విశ్వవిద్యాలయ హిందీ శాఖలో ఆచార్యులుగా ఉన్నారు. మానవీయ శాస్త్రాల విభాగానికి డీన్ గాను పనిచేశారు. ఆయన ఒక భాషలో రాసిన వెరొక భాషలోకి అనువాదం చేసి కృత కృత్యులయ్యారు. ఆచార్య వి. కృష్ణగారు 21 పుస్తకాలను ప్రచురించారు. 12 హిందీలోను,8 తెలుగులోను 1. ఇంగ్లీషులోను ప్రచురించారు. 2011 సంవత్సరంలో హైదరాబాదు విశ్వవిద్యాలయంలో "**Centre for Dalit and Adivasi Studies and Translations**" ని స్థాపించారు. ఆయన చేసిన సాహిత్య కృషికి గుర్తింపుగా అనేక అవార్డులు లభించాయి.

**అనువాద నిర్వచనం**

"ఒక భాషలోని భావాన్ని సమానంగా మరో భాషలో చెప్పడమే అనువాదం. మూల భాషలోని విషయాన్ని లక్ష్యభాషలోకి మార్చే కళా నైపుణ్య శాస్త్రమే అనువాదం. పాశ్చాత్యులు, భారతీయులు అనువాదాన్ని గురించి కొద్దిపాటి భేదాలతో నిర్వచనాలను అందించారు. ఎన్ని నిర్వచనాలను పరిశీలించినా అనువాదంలో ముఖ్యమైన అంశాలు మూడు. అవి 1. మూలభాష 2. లక్ష్యభాష 3.సమానార్థం."

"అనువాదం మూడు రకాల భాషా వ్యవస్థల మధ్య జరగడానికి వీలుంది అవి:

1. మూల లక్ష్య భాషలు భిన్న భాషా కుటుంబాలకు చెందిన రెండు భాషలుగా ఉండడం.
2. మూల లక్ష్య భాషలు ఒకే కుటుంబానికి చెందిన రెండు భాషలుగా ఉండడం.
3. మూల లక్ష్య భాషలు ఒకే భాషకు చెందిన భిన్న భాషాంతర్గతాలుగా ఉండడం. "

అని ఆచార్య జి అరుణకుమారి గారు "తొలి తమిళ సాంఘిక నవల – తెలుగు అనువాదం -విశ్లేషణ" అనే పరిశోధన వ్యాసంలో పేర్కొన్నారు. (దాక్షిణాత్య భాషా సాహిత్యాలు – తులనాత్మక అధ్యయనం. పుట:24) అనువాదానికి రెండు భాషలు తెలిసి ఉండాలి. ఒక సాహిత్యంలో ఉన్న సామాజిక, రాజకీయ, ఆర్థిక, సాహిత్య అంశాలు ప్రపంచానికి తెలియాలంటే ఒక భాషలో వెలువడిన రచనలు వేరొక భాషలోకి అనువదింపబడాలి. ఉత్తర్ ప్రదేశ్ దళితుల జీవనం, వారి నేపథ్యం అవతల గుడిసె నవల ద్వారా వ్యక్తమయింది. రచయిత మూల భాష హందీ, లక్ష్యభాష తెలుగు భిన్న కుటుంబాలకు రెండు కుటుంబాలను తీసుకుని అనువాదం చేశారు. ఈ నవల వ్యావహారిక భాషలో సామాన్యులకు కూడా అర్థమయ్యే విధంగా రాశారు. దీనిని చదువుతున్న పాఠకునికి ఆసాంతం చదవాలని అనిపిస్తుంది. ఆయనకు రెండు భాషలలోను ప్రావీణ్యం ఉందని వెల్లడి అవుతుంది.

**ఇతివృత్తం**

పశ్చిమ ఉత్తర ప్రదేశ్ లో గంగానది తీరంలో మాతాపూర్ అనే గ్రామం ఉంది. ఇక్కడ సంపన్నులు, సవర్ణులు గంగానదికి ఎగువ భాగంలోను, దళితులు దిగువ భాగంలో నివసిస్తున్నారు. ఈ దిగువన ఊర్లో అన్నింటికన్నా సుఖ్ఖా ఇల్లు ఉంటుంది. కూలిపోయి శిథిలా వస్థలో ఉన్న రెండు మూడు పూరి గుడిసెలు, పెంట కుప్పలు ఉంటాయి. దళితుడైన సుఖ్ఖా భార్య రమియా వారి కుమారుడు చందన్. అతడు చదువుకోడానికి పట్టణానికి వెళతాడు. అక్కడ గ్రామాలలో వలె ఆర్థిక మాంద్యం గాని, కూడు, గుడ్డ సమస్య, ఠాకూర్ మరియు జమీందార్ వంటి వ్యక్తుల హింస,వడ్డీ వ్యాపారుల దోపిడీ, అస్పృశ్యత వంటివి ఏవీ ఉండవని చందన్ భావిస్తాడు. అతడు పట్టణంలోని సంత్ నగర్ లో ఉంటాడు. అది కూడ మురికి వాడే అక్కడ చిన్న చిన్నగదులలో కార్మికులు చిన్న వ్యాపారం చేసేవారు, పండ్లు, కూరగాయలు అమ్మేవారు, మట్టి బొమ్మలు చేసేవారు, చాపలు అల్లేవారు ఉంటారు. వీరు పగలంతా కష్టపడి పనిచేసి అలసిపోయి రాత్రికి ఇంటికి చేరతారు. అప్పుడప్పుడు జానపద గేయాలు పాడతారు. గాయకుడు తాను పాడే పాట లయకు అనుగుణంగా నృత్యం చేస్తుంటాడు. ఇక్కడ ప్రజలలో పరస్పర సహకారం, ఒకరిపై మరొకరికి సానుభూతి గౌరవ మర్యాదలు ఉన్నాయి. వాటితోబాటు సంపాదించిన దానిని తాగుడికి, జూదానికి ఖర్చు పెట్టే దురలవాటు ఉంది.

చందన్ పట్టణం వచ్చిన కొత్తలో ఇల్లు వెతకడానికి ఆ మురికి వాడకు వెళతాడు. అతడు ఒక మారుమూల గ్రామం నుండి చదువుకోడానికి వచ్చానని చెబుతాడు. అప్పుడు చందన్ ని తన ఇంట్లో ఉండమని ఒక వ్యక్తి ఆహ్వానిస్తాడు. అతని పేరు హరియా. చందన్ తన సామాను తీసుకుని హరియా ఇంటికి వచ్చేస్తాడు. హరియా అతణ్ణి బయట వ్యక్తిగా భావించలేదు. అతడు చందన్ ని సొంత కొడుకు లా భావిస్తాడు. చందన్ కూడా హరియా ని తండ్రి లా అనుకుంటాడు. ఒకసారి చందన్ అద్దె గురించి హరియాని అడుగుతాడు. "చూడు బిడ్డా ఇక్కడ నీకు ఎంత కాలం ఉండాలనుకుంటే అంత కాలం ఉండు. పట్టణంలో ఉన్నన్ని రోజులు నా ఇంట్లోనే ఉండు. ఇక్కడే తిను – తాగు. ఏమైనా ఇబ్బంది అనిపిస్తే చెప్పు. అద్దె గురించిన ప్రస్తావన మాత్రం మళ్ళీ ఇంకెప్పుడూ తీసుకురాకు. ఈ ఇల్లు నీదే, నేను కూడా నీ వాడినే." (పుట:16) అని హరియా అంటాడు. మీ పరిస్థితే బాగుండ లేదు నేను మీకు భారం అని చందన్ అంటాడు. అపుడు హరియా చాలా మనస్తాపానికి గురవుతాడు. చందన్ ని అతడు భారంగా అనుకోలేదని, అతను తన దగ్గర ఉంటే బాగుంటుందని అనుకున్నానని చెబుతాడు. చందన్ కి ఎక్కడ సౌకర్యంగా ఉంటే అక్కడికి వెళ్ళమంటాడు. అతనికి ఒంటరిగా ఉండడం అలవాటైపోయిందని, ఇక ముందు కూడా ఎలా గొలా బతుకుతా అని అంటాడు. అతని మాటలకు చందన్ నిర్ఘాంతపోతాడు. హరియా ఎన్నో ఏళ్ళ నుంచి దూరమైన కొడుకు తన వద్దకు వచ్చినట్లుగా భావించాడు. అతడు చందన్ నిద్ర లేవగానే టీ తీసుకొచ్చి ఇస్తాడు. అతనికి మున్సిపాలిటీ నల్లా నుండి స్నానానికి నీళ్ళు తెచ్చి ఇస్తాడు. అతడు స్నానం చేసే లోపు టిఫిన్ కోసం పరాటాలు ఏర్పాటు చేస్తాడు. హరియాకి రాం ప్యారీ అనే కుమారుడు ఉండేవాడు. అతను కొంత కాలానికి మరణిస్తాడు. అతడు చందన్ లో తన కొడుకుని చూసుకుంటాడు. అందవల్లే హరియా చందన్ ని ఎంతో ప్రేమగా చూసుకుంటాడు. హరియాకి కమల అనే ఒక కూతురు కూడ ఉండేది. ఆమెకి యుక్తవయస్సు వచ్చిన తరువాత హరియా పనిచేసే యజమాని, మరికొంతమంది కలసి, ఆమెపై అత్యాచారం చేస్తారు. హరియా యజమానిపై దాడిచేస్తాడు. పోలీసులు అతనిని అరెస్ట్ చేస్తారు. ఆ తరువాత కమల ఆఊరు విడిచి వెళ్ళిపోతుంది. చందన్ పనిచేస్తున్న పాఠశాలలో కమల తన కొడుకుని చేర్చడానికి వస్తుంది. ఆమె ద్వారా వివరాలు తెలుసుకున్నఅతడు హరియాకు కమల గురించి చెప్పి, వారిరువురిని కలుపుతాడు. అందరూ ఆనందంగా జీవిస్తారు. ఒక సభలో చందన్ పై దాడి జరుగుతుండగా కమల అడ్డుకునే ప్రయత్నంలో తన ప్రాణాలు కోల్పోతుంది.

చందన్ తండ్రి అయిన సుఖ్జా రొట్టె తినడానికి కూర్చొన్న సమయంలో పన్ను కట్టని వారి భూమిని కబ్జా చేయడానికి అమీన్ సాహెబ్ వచ్చాడని చాటింపు వినబడుతుంది. అది విన్న అతడికి ఆకలి మందగిస్తుంది. భార్య రమియా కు విషయం చెబుతాడు. ఆమె వడ్డీ వ్యాపారి లాలా దుర్గాదాస్ దగ్గరకు వెళ్ళి డబ్బు అడగమంటుంది. అతడు సుఖ్జాకు అప్పు ఇవ్వడని రమియాకి తెలియదు. ఎందుకంటే సుఖ్జా ప్రస్తుతం పేదవాడు. మొదట్లో బాగానే ఉండే వాడు. కూలి చేసి రెండెకరాల భూమి కొంటాడు. ఒక గేదె కూడా ఉండేది. అతని కుటుంబానికి సరిపడా ధాన్యం పొలం నుండి మరియు ఠాకూర్, జమీందార్ల కల్లం నుండి వచ్చేవి. గేదె పాలను అమ్మగా వచ్చిన ధనం కూరగాయలకి, చందన్ ఖర్చులకి వచ్చేవి. కాని ఒక గేదె డిఫ్తీరియా వ్యాధికి గుర్రై చనిపోతుంది. ఆ తరువాత అతని ఇల్లు గడవడం కష్టంగా ఉంది. దానికి తోడు పరీక్ష ఫీజుకి 200 కావాలని చందన్ ఉత్తరం రాస్తాడు. అతని భార్యకు చెప్పులు కూడ కొనివ్వలేని పరిస్థితి. చందన్ 200 ఏవిధంగా పంపించాలి. ఆ విషయం గుర్తొస్తే మరింత దుఃఖమొస్తుంది. వారిరువురూ ఏమీ తినకుండ రోజంతా దుఃఖిస్తూనే ఉంటారు. చందన్ చదువుకోడానికి పట్టణానికి వెళ్ళినందుకు, ఆ ఊరి జమీందార్లకి, ఠాకూర్ కి, వడ్డీ వ్యాపారులకి, బ్రాహ్మణులకి అందరికి ఆగ్రహం కలుగుతుంది. ఎందుకంటే వాళ్ళ పిల్లలు పై చదువుల కోసం పట్టణాలకి వెళ్ళలేదు. మాదిగ కులానికి చెందిన సుఖ్జా కొడుకు చదువుకోడానికి పట్టణానికి వెళ్ళడం వారందరూ సహించలేక పోతారు. సుఖ్జాతో మెల్లె కన్ను పండితుడు శ్రీరాం శర్మ తగవు పెట్టుకుంటాడు. ఇతడు పౌరోహిత్యం, జోతిష్యం చెప్పడం వంటి పనులు చేస్తాడు. సుఖ్జా పొలాన్ని జప్తు చేస్తారు. షావుకారు ఇంటిని కబ్జా చేస్తాడు. జమీందార్లు సుఖ్జా తమ పొలంలో పనిచేయడానికి నిరాకరించారు. సుఖ్జా, రమియాలు ఊరు వదిలి వెళ్ళిపోయారు. పక్కనే టౌన్ లో చిన్న గుడిసె నిర్మించుకుని బతుకుతారు. వారి కొడుకు చందన్ త్వరలోనే చదువు పూర్తి చేసుకుని, ఒక హోదాకి చేరతాడని ఆశతో జీవిస్తారు.

చందన్ పట్టణం వచ్చిన కొత్తలో కాలేజి లోపల బయట ఒంటరిగా ఉండేవాడు. అతడు ఒంటరితనం వల్ల అన్యమనస్కంగా ఉండేవాడు. కాలేజిలో అతని కులంవల్ల విద్యార్థులు దూరంగా ఉంచేవారు. వారి సమూహాల్లో చేర్చుకునేవారు కాదు. అది తనకి చాలా అవమానంగా ఉండేది. ఆ తరువాత అతనే దళిత యువతతో కలసి ఒక సర్కిల్ ఏర్పాటు చేశాడు. ఆ సర్కిల్ లో చందన్ తో బాటు చదివే రామహేత్, రతన్ మరియు నందన్ లాల్ ఉండేవారు. అంతే గాక కార్కానాల్లో పనిజేసే వారు. మిల్లులలో పనిచేసే వారు, ఇతర పనులు చేసేవారు మొదలైన వారు ఉండేవారు. అందువల్ల వీరు విభిన్నమైన అభిప్రాయాలు కలిగి ఉండేవారు. కాని దోపిడీ అన్యాయం, మరియు అణచివేతకు వ్యతిరేకంగా పోరాడాలనే ఏకాభిప్రాయం కలిగి ఉండేవారు. రామహేత్ కొంచెం ధనిక కుటుంబానికి చెందిన వ్యక్తి కావడంవల్ల వ్యాపారం చేయాలనుకున్నాడు. చందన్ సమాజ అభివృద్ధికి పాటు బడాలనుకుంటాడు. సమాజంలో మనుషల మధ్య గల తారతమ్యాలు, అంటరానితనం, రూపుమాసిపోనంత వరకు వ్యాపారాలు సక్రమంగా నడవవు అనేది చందన్ అభిప్రాయం రామహేత్ కి ఆ మాటలు రుచించలేదు. వారిలో సంకల్పబలం ఉంటే ఏదైనా సాధించగలరని అతను భావిస్తాడు. చందన్ కి రామహేత్ మాటలు సరైనవే అనిపిస్తాయి. కాని అవి దళితేతరులకు వర్తిస్తాయి. కాని దళితులకు కాదు అని, అన్ని రంగాలలోను ప్రవేశించాలంటే సామాజిక గౌరవం కలిగి ఉండాలని, అప్పుడే అన్ని అవకాశాలు దక్కుతాయని చందన్ అంటాడు. రామహేత్, నందన్ లాల్ లకు అర్థమయ్యే విధంగా వివరిస్తాడు. వారిని చదివించడానికి వారి తల్లిదండ్రులు సమాజంలో వ్యతిరేకతను ఎదుర్కోవలసి వచ్చింది. స్కూళ్ళు, కాలేజీలలో వారికి ఎదురైన అవమానాలు, ప్రతికూల పరిస్థితులు మరచిపోరాదు. 'మనం కేవలం మన ఉన్నతి పట్లనే శ్రద్ధ వహిస్తే మనలను చదివించడం కోసం మన తల్లి దండ్రులు చేసిన త్యాగాలు సార్థకం కావు. మహా అయితే ఎక్కువ డబ్బులు సంపాదించవచ్చు. ఇతరుల మాదిరిగా ఐశ్వర్యవంతంగా ఆహ్లాద భరితంగా జీవనం గడపవచ్చు'. అని చందన్ అంటాడు. (అవతలి గుడిసె పుట:46)

అంటే అతడు సమ సమాజ స్థాపనకు కృషి చేయాలని భావిస్తాడు. "అయితే మనం మన జీవితాలను మార్చుకునే ప్రయత్నం చేయకూడదా! నాలుగు వైపులా రెండు చేతులతో సంపాదించడానికి జనాలు పరుగులు తీస్తుంటే మనమెందుకు వెనుకబడాలి. మనం కూడ మనుషులమే కదా! మనకు కూడా మనసులు ఉన్నాయి. చదువుకున్న వాళ్ళం మనమే ఏం చేయలేకపోతే చదివి ప్రయోజనమేమిటి! అని నందన్ లాల్ ప్రశ్నిస్తాడు.

ప్రతి మనిషికి తినడానికి తిండి, కట్టుకోడానికి మంచి బట్టలు, ఉండడానికి మంచి ఇల్లు అవసరం. వీటితో బాటు సమాజ ఉద్ధరణ జీవిత లక్ష్యంగా ప్రతి వ్యక్తి భావించాలని, తరతరాలుగా దళితులు బానిసత్వంతో ఖాళీకడుపులు, నగ్నశరీరాలు, పూరి గుడిసెల జీవనం సాగిస్తున్నారని వారి అభివృద్ధికి పాటుపడాల్సిన బాధ్యత వారిపై ఉందని చందన్ అంటాడు. వారిని చదివించడానికి తల్లిదండ్రులు చేసిన పోరాటం అందరూ చేయలేరు. కాబట్టి అటువంటి వారికి తాము అండగా ఉండాలని తన అభిప్రాయాన్ని స్నేహితులతో చెబుతాడు.

రామ హేతు వ్యాపారం చేసి తన కుటుంబ పోషణకు సరిపోగా మిగిలిన ధనాన్ని సమాజ అభివృద్ధి కోసం వినియోగిస్తానని అంటాడు. నందన్ లాల్ వకీలుగా చేసి దళితులపై జరిగే దోపిడీ అత్యాచారాల కేసులు ఉచితంగా వాదిస్తానని అంటాడు. రతన్ లాల్ పరిపాలనా రంగంలోకి ప్రవేశించి, దళితులకు సహాయం చేస్తానంటాడు. చందన్ దళితుల ఉద్ధరణ కోసం తన విద్యను వినియోగిస్తానంటాడు. సమాజంలో అస్పృశ్యతను రూపుమాపే విధంగా ప్రజలను చైతన్యవంతులను చేయాలని నిర్ణయించుకుంటాడు. చందన్ మధ్యాహ్నం వరకు కాలేజికి వెళ్ళి చదువుకొని ఆ తరువాత బస్తీలో పిల్లలకు చదువు చెబుతాడు. మొదట్లో తల్లిదండ్రులు వ్యతిరేకించారు. ఆ తరువాత అతనితో ఏకీభవించారు.

చందన్ నాయకత్వంలో సమాజం మార్పు బాట వైపు అడుగులు వేసింది. మనిషి పుట్టుక వల్ల గాక అతని గుణం చేసే పనులతో శ్రేష్ఠుడు, నీచుడుగా నిర్ణయింపబడతాడనే భావం వ్యాపించింది. ఎవరైతే నిజాయితీగా సత్య మార్గంలో నడుస్తూ సదాచారాన్ని ఆచరిస్తూ, కష్టపడి జీవితాన్ని సాగిస్తారో వారు శ్రేష్ఠులు. ఇతరులను మోసం చేస్తూ, దోపిడీ చేస్తూ, ఎదుటి వారిని భయపెట్టి ప్రలోభ పెట్టి, వారి కష్టార్జితాన్ని దోచుకుని బతికే వారు నీచులని చందన్ ఎంతో కష్టపడి ప్రజలకు వివరిస్తాడు. ప్రజలలో చైతన్యం రావడంతో మూఢ నమ్మకాలను వ్యతిరేకించారు. ఇది గమనించిన పండిత వర్గం వేరే వృత్తులను అవలంభించారు. కూలీలు భూస్వామ్య వ్యవస్థను వ్యతిరేకించారు. శ్రమకు తగిన ఫలితం కోసం పోరాటం సాగించారు. కూలీలు షావు కార్ల దగ్గర వడ్డీకి డబ్బు తెచ్చుకోవడం మానేశారు. దానితో షావుకార్లు ఇక్కట్ల పాలయ్యారు. సామాన్య ప్రజలు దృఢ చిత్తంతో ఉండడం వల్ల సహకార సమితులు ఏర్పాటు చేసి సమస్యను పరిష్కరించారు. ప్రజలు ఒకరికొకరు సహకరించుకుంటూ జీవనం సాగించారు. ఈ విధానం వల్ల షావుకార్ల అవసరం లేకుండా పోయింది.

మాతాపూర్ లో పరిస్థితి కూడా మారింది. మెల్లె కన్ను పండితుడు ఆ గ్రామం వదిలి వేరే ప్రాంతానికి వెళతాడు. కోమటి కులస్థుడైన దుర్గాదాస్ తన వైఖరిని మార్చుకుని అసలు తోపాటు తక్కువ వడ్డీని వసూలు చేసుకుని వ్యాపార నిమిత్తం పట్టణానికి వెళతాడు. ఠాకూరికి చాలా అవమానంగా ఉంది. అన్ని పనులు తనే చేసుకోవలసి వస్తుంది. అతను దారిలో ఎదురైతే ఎవరైతే పక్కకు తప్పుకునే వారు. కాని నేటి పరిస్థితులు మారాయి. వారిని చూసి ఠాకూర్ తప్పించుకుని తిరగవలసి వచ్చింది. అతనికి బతకడం కష్టమనిపిస్తుంది. అతనికి రజనీ అనే కుమార్తె ఉంటుంది. ఆమెకు వివాహం చేయాలని భావిస్తాడు. కాని ఆమె అందుకు అంగీకరించదు. జీవితంలో పెళ్ళికంటే ముఖ్యమైన విషయాలు ఉంటాయని అవి నెరవేర్చాలని తండ్రితో అంటుంది. తల్లిదండ్రులు పిల్లలకు పెళ్ళిచేయడంతో బాధ్యత తీరిపోదు. పిల్లలు ఆత్మాభిమానంతో జీవించేలా చూడడం వారి బాధ్యత కాదా! అని తండ్రిని ఆమె

ప్రశ్నిస్తుంది. సమాజంలో శతాబ్ధాలుగా అత్యాచారాలకు అణచివేతకు గురైనవారి సంతానం, ధనవంతులైన తరువాత తరాల సంతానంపై కోపం, ఆక్రోశం, అసహ్యం కలిగి ఉంటారు అని రజని తండ్రితో అంటుంది. ఠాకూర్ తాను సంప్రదాయాలను పాటించానని, వ్యవస్థతో పాటు బతికానని తన కూతురితో అంటాడు. అందుకు ఆమె అంగీకరించదు. సమాజంలో సంప్రదాయాలు ప్రజలకు వ్యతిరేకంగా అంటే వ్యవస్థ దోషపూరితంగా ఉంటే వాటిని వ్యతిరేకించాలి. ఒకవేళ వ్యతిరేకించే సామర్థ్యం లేకపోతే వాటిని పాటించకూడదని ఆమె తండ్రితో అంటుంది. సంప్రదాయాలు సృష్టించిన వారు వాటిని పాటించిన వారు ఇద్దరూ దోషులే అని అంటుంది. ఠాకూరు కూతురి ముందు దోషిలా నిలబడ్డాడు. రజని తన తండ్రి ప్రజలకు చేసిన అన్యాయాలకు ప్రాయశ్చిత్తం చేసుకోమంటుంది. వారిని క్షమాపణ అడగమంటుంది.

రజనీ చందన్ తల్లిదండ్రులకు అండగా నిలుస్తుంది. వారికి కావలసినవి సమకూరుస్తుంది. వారిని కలసి మాతాపూర్ లో వచ్చిన మార్పుల గురించి, ఠాకూర్ ప్రవర్తన లో కొంత మార్పు వచ్చిన విషయం చెబుతుంది. సుఖ్ఖా ఇంటిని కబ్జా చేసిన దుర్గాదాస్ ఊరొదిలి వెళ్ళిపోయాడు. కాబట్టి వారి ఇల్లు ఖాళీగా ఉందని, వారి పొలం మీద హక్కు తిరిగి లభించిందని చెప్పి, వారిని తిరిగి మాతాపూర్ కి తీసుకొని వెళుతుంది. చందన్ తల్లిదండ్రులను చూడడానికి మాతాపూర్ వస్తాడు. రజనీకి కృతజ్ఞతలు చెబుతాడు. ఆమెకు తన తండ్రి పట్ల ఉన్న ఆక్రోశాన్ని పోగొట్టి, ప్రేమ, శాంతిని నింపుతాడు. అతను మార్పుని కోరుకుంటాడు. ఆ మార్పు హింసతో కాకుండ అహింస, ప్రేమతో సాధించాలని రజనీకి చెబుతాడు. తప్పుచేసిన వ్యక్తిని శిక్షించే బదులు అతనిలో మార్పు వచ్చే విధంగా ప్రయత్నించాలని చెబుతాడు. ఠాకూర్ లో మార్పు వచ్చింది. దానిని అందరూ స్వాగతించాలని చెబుతాడు. ఠాకూర్ చందన్ ని ఎన్ని ఇబ్బందులకు గురిచేసిన, అతనిపట్ల ఎలాంటి హింసాభావం లేదు. అందుకు రజని అతన్ని గొప్పవాడిగా అభివర్ణిస్తుంది. ప్రజలందరూ తరతమ భేదాలను మరచి, ద్వేషాన్ని విడిచి, మాలిన్యాన్ని త్యజించి, పరస్పరం ప్రేమతో మెలగాలని, ఇతరుల కష్టాలలో పాలుపంచుకోవాలని చెబుతాడు. చందన్ మాతాపూర్ లో ఉండి తల్లిదండ్రులను చూసుకోవాలని భావిస్తాడు. చందన్ మాటలకు అతని తండ్రి పులకించిపోతాడు. సుఖ్ఖా వ్యక్తి కంటే సమాజం గొప్పదని, ముఖ్యమైనదని, చందన్ సమాజం కోసం ఏదైతే చేస్తున్నాడో అది తమకోసం చేసినట్టేనని, సమాజ హితంలోనే వారి హితం కూడ ఉందని, అతన్ని సమాజం కోసం అంకితం చేయాలని నిర్ణయం తీసుకున్నట్టు, వారి నిర్ణయాన్ని గౌరవించమని చెబుతాడు. చందన్ తల్లిదండ్రుల నిర్ణయాన్ని శిరోధార్యంగా భావించి, రెండు మూడు రోజులు మాతాపూర్ లో గడిపి పట్టణానికి తిరిగి వస్తాడు.

ఒకరోజు సాయంత్రం ఠాకూర్ బావిలోకి దూకే ప్రయత్నం చేస్తాడు. అక్కడే పొలంలో పనిచేసుకుంటున్న సుఖ్ఖా అతన్ని గట్టిగా పట్టుకుని ఆపుతాడు. పశ్చాత్తాపంతో కుంగిపోతున్న ఠాకూర్ కి అన్నీ మరిచిపోయి సమానత్వాన్ని పాటిస్తూ, ప్రేమానురాగాలు పంచుతూ అందరితో కలసి మెలసి ఉండమని హితబోధ చేస్తాడు. ఆ తరువాత సుఖ్ఖా, ఠాకూర్ ఒకరినొకరు పేరుతో పిలుచుకుంటూ స్నేహంగా మెలగుతారు.

**ముగింపు:**

"అవతలి గుడిసె" నవలలో దళితుడైన చందన్ ఎంతో కష్టపడి చదువుకుని సమ సమాజ స్థాపన కోసం కృషి చేసి సాధిస్తాడు. అంటరానితనం దోపిడీ, అత్యాచారాలు చేసిన వ్యక్తులను సైతం క్షమించి వారిపట్ల ప్రేమను చూపివారిలో మార్పుని తెచ్చిన వ్యక్తి. ఠాకూర్ కూతురైన రజని తండ్రిని ఎదిరించి దళితుల పక్షాన నిలుస్తుంది. ధనవంతులకి, దళితులకి తరాల మధ్య వ్యత్యాసం ఏవిధంగా వస్తుందో తండ్రికి వివరిస్తుంది. చందన్ తల్లిదండ్రులను తన తల్లిదండ్రులుగా భావించి, వారి బాగోగులను చూసుకుంటూ, వారి ఇల్లు, పొలం కబ్జా కాకుండ చూసి, వారిని తిరిగి మాతాపూర్ కి తీసికెళుతుంది. సమాజంలో రజనీ వంటి

ఉన్నత భావాలు గల వ్యక్తులు ఉన్నారని నిరూపించడానికి దీనిని నిదర్శనంగా చెప్పవచ్చు. దళితుల అభివృద్ధిని దళితులే అడ్డుకుంటున్న ఈ రోజులలో ఒక జమీందారి కూతురు దళితులకు అండగా నిలవడం ఎంతో అభినందించదగ్గ విషయం. ఆమె తన తండ్రి కూడ బెట్టిన ధనంతో ఆనందంగా జీవించవచ్చు. కాని ఆమె సర్వసుఖాలను త్యజించి చందన్ తో పాటు సమ సమాజ స్థాపన కోసం పోరాడుతుంది. సర్వ మానవ సౌభ్రాతృత్వాన్ని చాటి చెబుతుంది.

ఈ నవలలో చందన్ స్నేహితులైన రామహేతు, నందన్ లాల్, రతన్ లాల్ మొదలైన వారందరూ దళితుల అభ్యున్నతికై పాటుబట్టారు. ఈ నవల ఆద్యంతం ఒక వర్గానికి చెందిన జీవన విధానాన్ని, ఆ వర్గ కుటుంబ నేపథ్యాన్ని మాత్రమే తెలియజేస్తుంది. మూలాన్ని రాసిన రచయిత సమాజంలోని వివిధ వర్గాల జీవన విధానం, వారి కుటుంబ నేపథ్యాన్నికూడ వస్తువుగా తీసుకుని ఉంటే ఆ ప్రాంతంలోని సామాజిక నేపథ్యం వివరంగా తెలిసి ఉండేది. ఈ నవలా రచన ఏక పక్షంగా సాగిందని చెప్పవచ్చు. రచయిత ఈ నవలలోని పాత్రల చేత **"సమసమాజ స్థాపన"** అనే పదాలను పలికించారు. కాని నవలా వస్తువు లో దానిని పాటించలేదు.

**ఉపయుక్త గ్రంథాలు**

1. ఆశాజ్యోతి,కె. 2015. దాక్షిణాత్య భాష సాహిత్యాలు – తులనాత్మక అధ్యయనం. హిమాలయ పబ్లిషింగ్ హౌస్, బెంగుళూరు.

2. కృష్ణ, వి. 2021. అవతలి గుడిసె. ఛాయా పబ్లిషింగ్ సెంటర్, ఎల్లారెడ్డిగూడ, హైదరాబాదు.

3. భార్గవీరావు. 1996. సాహిత్యానువాదం- ఒక పరిశీలన, పాంచజన్య పబ్లికేషన్స్, హైదరాబాదు.

4. రాధాకృష్ణ, బూదరాజు. 2003. అనువాద పాఠాలు. మీడియాహౌస్ పబ్లికేషన్స్, హైదరాబాదు.

5. రామచంద్రారెడ్డి, రాచమల్లు. 2011. అనువాద సమస్యలు. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు.

********

# 84. చిలుకూరి దేవపుత్ర పంచమం -నవలా శిల్పం

**డాక్టర్ పేరాల జ్ఞానానందం**

తెలుగు అధ్యాపకులు

ప్రభుత్వ డిగ్రీ కళాశాల, మెదక్.

9502642955.

"ఎక్కడ ఉంది తనకి కానీ తన వారికి కానీ మరో ప్రపంచం మరో ప్రస్థానం. రామ రాజ్యం. దీని కోసం ఎంత పరుగు... ఇంకా ఎన్ని వేల ఏళ్ళు పరుగు తీయాలి... దీని కోసమే కదా తను ఉన్నతీ కరించుకున్నది. ఇక తప్పదు తనూ తన కులం అంటరానితనం మీద నిలబడక తప్పదు. అణచబడిన అంచుల మీద నుంచి ఆలోచించక తప్పదు. బీటలు బారిన జీవన దారిద్య్రాం నించే పిడికెడు ఆత్మ విశ్వాసాన్ని సంపాదించుకోక తప్పదు. దరి చేరనీయని నిస్సహాయతలోంచే తిరుగుబాటు నేర్చుకోక తప్పదు". (పుట 272) ఇది పంచమం నవల అంతరార్థం. తరతరాల స్తబ్దతలో నుంచి దళితుడికి వచ్చిన ఆలోచన ఇది. అస్పృశ్యతా శృంఖలాలలో విసిగి వేసారిపోయిన మనస్తత్వం లోనుంచి వచ్చిన భావన ఇది.

'పంచమం' దళిత ఉద్యమ ప్రభావంతో వచ్చిన నవల. చిలుకూరి దేవపుత్ర తన ఉద్యోగ జీవితంలో చవి చూసిన యదార్ధ సంఘటనకు. తను ఉద్యోగం చేస్తున్న రెవెన్యూ వ్యవస్థలోని అధికారుల లంచగొండి తనాన్ని, నడుస్తున్న దళిత ఉద్యమాలను జోడించి రాసిన నవల ఇది. దాదాపు 36 భాగాలలో 275 పుటలు గల సుదీర్ఘ నవల ఇది. 'ఆంధ్ర టు అమెరికా వెళ్ళిన నవల. కుల వర్గ దృక్పథాల నుండి దళిత సమస్యను విశ్లేషించిన నవల పంచమం. ఈ నవల రెండు ఆలోచనల నుండి సాగింది. 1 ఆంధ్రదేశంలో వచ్చిన భూ సంస్కరణల వల్ల దళితులకు లాభించింది ఏమిటి?.2 సమకాలీన సమాజాలలో దళితుడు ఎలా చైతన్యవంతం కావాలి?. ఈ రెండు ఆలోచనల నుండి ప్రారంభమై, మానసిక ఎదుగుదల లేనిదే దళితులకు వ్యక్తిగత జీవితం లేదు. అనే అంతరార్థం తో ఈ నవల ముగుస్తుంది.

రెండు దశాబ్దాలుగా తెలుగు కథా సాహిత్యాన్ని, నవలా సాహిత్యాన్ని సుసంపన్నం చేస్తున్న రాయలసీమ రచయితల్లో చిలుకూరి దేవపుత్ర ఒకరు. వీరు ఏప్రిల్ 24 1952 అనంతపురం జిల్లా, బెలుగుప్ప మండలం, కాలువ పల్లె అనే గ్రామంలో జన్మించారు. రాయలసీమలోని అనంతపురం కి ఒక ప్రత్యేక స్థానం ఉ ంది. ఈ అనంతపురం నుండి ఎందరో రచయితలు వచ్చారు. వీరిలో చిలుకూరి దేవపుత్ర ఒకరు. వీరి రచనా జీవితం 1977లో మొదలైంది. వందకు పైగా కథలు, రెండు కథాసంపుటాలు నాలుగు నవలలు రాశారు.

చిలుకూరి దేవపుత్ర ఒక దళితుడు కాబట్టి దళితులు అనుభవించిన బాధలు, దళితులను మోసం చేసే పెత్తందారులు, వారి కబంధహస్తాలకింద ఏ విధంగా బలైపోతున్నారో దళితుల జీవన గాథలను, కుల వివక్ష వల్ల, అస్పృశ్యత వల్ల, పేదరికం వల్ల, మతమౌఢ్యం వల్ల, దళిత బహుజనులు పడే బాధలు, ఆవేదనలు, అవమానాలకు చక్కటి అక్షరరూపం ఇచ్చిన రచయిత చిలుకూరి దేవపుత్ర.

**పంచమం నవల పరిచయం:**

దళితులకు ప్రభుత్వాలు చేస్తున్న చట్టాలు, ప్రవేశపెడుతున్న పథకాలు వైఫల్యం చెందుతున్న తీరును, సామూహిక చైతన్యం తప్ప ఉద్యోగాల్లోనో, చదువుల్లోనో నలుగురికి చోటు కల్పించినంత మాత్రాన దళిత జీవితాలు గట్టెక్క బోవని వివరిస్తూ వచ్చిన నవల

పంచమం. ఈ నవల ఉద్యమాల నేపథ్యంతో దళిత జీవన దృక్పథంతో రాసిన నవల, వీరికి పోలీస్ డిపార్ట్మెంట్ లోనూ, కలెక్టర్ ఆఫీసులో నూ పనిచేసిన అనుభవం ఉండటం వల్ల ఆ వ్యవస్థలో అడుగడుగునా కనిపించే వంచన, మోసం, లంచగొండితనం మొదలైన ఎన్నో అవలక్షణాలు ఈ నవలలో కనిపిస్తాయి.

**పంచమం నవలా శిల్పం:**

" కథలోని కేంద్రబిందువు 'కథాంశం'. కథాంశానికి రచయితకు మధ్య ఉన్న సంబంధం 'ఉద్దేశం', కథ, కథాంశమూ, ఉద్దేశమూ, వస్తువుకు సంబంధించిన అంశాలైతే కథా సంవిధానం (PLOT) పాత్రలు, )SETTING), (POINT OF VIEW), 5 (MODE OF NARRATION( శిల్పానికి సంబంధించిన అంశాలు." 1 కథకుడు ప్రదర్శించే కళా నైపుణ్యం శిల్పం అంటే కథను నడిపించే విధానం. కథ అమరికా అల్లికలే శిల్పం అంటారు.

**నేపథ్య శిల్పం:**

పంచమం నవలను రచయిత తన ఉద్యోగ జీవితంలో చవిచూసిన యదార్థ సంఘటనను, సమకాలీన సమాజం పట్ల ఉన్న అవగాహనను, ఉద్యమాల అనుభవాల నేపథ్యంలో, ఎప్పటికప్పుడు మిత్రుల చర్చలు, జరుగుతున్న పరిణామాలను విశ్లేషించుకుంటూ వాటికి అక్షర రూపం ఇచ్చాడు. చిలుకూరి దేవపుత్ర అనంతపురం జిల్లాలో ఆరగా పని చేస్తున్నప్పుడు ఒక ఊరి భూస్వామి భూమి 40 ఎకరాలు ప్రభుత్వం స్వాధీనం చేసుకొని దళిత బహుజనులకు పంచింది. ఆ భూస్వామి ల్యాండ్ సీలింగ్ ట్రిబ్యునల్ కు పోయి తన భూమిని రీ కన్వేకి ఉత్తర్వులు తెచ్చుకున్నాడు. ఈ విషయాన్ని ప్రజలకు తెలియజేయడానికి అర్భగా ఉన్న దేవపుత్ర ఆ ఊర్లో దండోరా వేయించడానికి తప్పెట కొట్టే మనిషిని పిలిసి విషయం చెప్పి దండోరా వేయమనగా అతను " నా భూమి కూడా మీరు పిక్కుంటారు. కదా స్వామి! నేను ఎట్లా దండోర ఏసేది. నావల్ల కాదు దేవరా! నన్నిడిసి పెట్టండి." అంటూ గుడ్లలో నీళ్లు కుక్కుకున్నాడు. అక్కడే పంచమం నవలకు బీజం పడింది. ఆ బీజమే ఈ నవల రాయడానికి ప్రేరణ కలిగింది.

**ఇతివృత్త కథాశిల్పం:**

రచయిత తీసుకున్నా ప్రధానమైన విషయాన్ని ఒక తాటి పైకి తెచ్చి ఒక క్రమ పద్ధతిలో రచించడాన్ని కదా వస్తువు లేదా ఇతివృత్తం అంటారు. అమెరికన్ నవలా రచయిత 'దాస్ పాసన్ ' రూపొందించిన న్యూస్ రీల్ కథనం ప్రకారం నవలకు సామాజిక వాస్తవికతకు దగ్గర సంబంధం ఉంటుంది. ఈ కథాకథన పద్ధతి పాటించటానికి రచయితకు కథా కథనానికి సంబంధించిన గొప్ప చైతన్యం ఉండాలి. పంచమం నవల ఇతిప్పత్తం 1975- 1998 కాలం నాటిది. కథ దళితుడి అచేతన దశనుంచి హక్కుల కోసం ఉద్యమాన్ని చేపట్టడం అనే దశ వరకు సాగుతుంది.

పంచమం నవలకు కేంద్రం అనంతపురం సమీపాన ఉన్న క్రిష్ణాపురం అనే గ్రామం. మాదిగ శివయ్య తన ఇంటర్ రిజల్ట్ చూడటంతో నవల ప్రారంభమవుతుంది. శివయ్య ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడై సవర్ణ పిల్లలు ఫెయిల్ అవ్వడం తో శివయ్య ఉత్తీర్ణత ఆ పూరి అగ్రకులాలకు మింగుడుపడదు. అనంతపురం కళాశాలలో శివయ్య బిఎస్సి చేరడం, అక్కడ పద్మ, కృష్ణశాస్త్రి, విద్య, పురుషోత్తములు అనే మిత్రులు పరిచయం అవుతారు. వారితో కలిసి లోకజ్ఞానాన్ని విస్తృతంగా తెలుసుకుంటాడు శివయ్య. ఈ క్రమంలోనే పద్మ శివయ్యని ప్రేమిస్తుంది. తక్కువ కులం అనే భావనతో, భయంతో శివయ్య తిరస్కరిస్తాడు. ఈ క్రమంలోనే చాకలి ఓబన్న శంకరప్ప కూతురు ప్రేమించుకున్నారన్న ఈ విషయం తెలిసి శంకరప్ప ఓబన్నను చంపుతాడు నెల తిరక్కుండానే కూతురికి పెళ్లి చేస్తాడు. అధికార పార్టీ అండదండలతో శంకరప్ప గ్రామ సర్పంచిగా, సీతారామప్ప మండల ప్రెసిడెంట్ గా గెలిసి శంకరప్ప తన భూమిని లాక్కనే ప్రయత్నం చేస్తాడు.

కాలక్రమంలో శివయ్య ఆర్డీవోగా అనంతపురానికి పోస్టింగ్ వస్తుంది. అంతకుముందే క్రిష్టాపురం లో దళితులపై అనేక దౌర్జన్యాలు జరుగుతాయి. ఆర్డీవోగా ఉన్న శివయ్య సీతారామప్ప మాటలు వినక పోవడంతో లంచం పేరుతో మోసగించి శివయ్యను సి.బి.ఐ అధికారుల చేతుల్లో పట్టుబడి సస్పెండ్ అయ్యేటట్లు చేస్తాడు. కొత్త ఆర్డీఓ వచ్చి కొత్తపల్లి లాకప్ డెత్ కేసు తో సహా సీతారామప్పా కేసుల్ని, శంకరప్ప భూమిని రీ కన్వే చేయించడం, వెట్టినారాయణప్పతో చాటింపు వేయడం ఈ నవల ముగింపు.

“మహా జనులారా మీకు తెలిపేదేమంటే పొద్దున్నే శివలింగం కింద గవర్ మెంటోళ్లు తీసుకుని పేదోళ్లకు పంచి పెట్టిండే భూమిని తిరిగి శంకరప్ప గొంచికానికే గవర్ మెంటోళ్ళు సోధీనం జేసినారని ఉత్తరు వులు ఇచ్చినారు. ఆ భూమిని పొందిన పేదోళ్లంతా కలిసి ఒగట్టిగా దానిని బేఖాతరు చెయ్యండహో... .” (50 274) పోయిన గుండెల్లో కదలిక పుట్టించిన చాటింపు ఇది. ఆరిపోయిన బతుకుల్లో ఆశ పుట్టించిన చాటింపు ఇది. భవిష్యత్ అంతా ఒక తాటిమీద నడవాలని నడుస్తున్నట్లు పదునెక్కిన నిర్భయత్వం మీద ప్రవహిస్తున్నట్లు వినిపించిన చాటింపు ఇది.

తన జాతికి కేవలం ఆఫీసుల్లోనో, విద్యాలయాల్లోనో, పరిపాలనలోనో రిజర్వేషన్లు కల్పించడం వల్ల రాజ్యాధికారం రాదని తమ జాతి యావత్తు శక్తిమంతం అయ్యి పోరాటం చేయాలని శివయ్య మనసుకి తెలిసి రాలేదు.

**పాత్ర శిల్పం:-**

కథలో జీవితాన్ని అనుభవించేది పాత్రలు. సమాజంలోని వ్యక్తుల పాత్రలకు నవనాడులు. పంచమం నవలలో ఫోటోగ్రాఫికల్ శిల్పం కనిపిస్తుంది. ఈ పద్ధతిలో ఏదైనా ఒక దృశ్యాన్ని మన కళ్ల ముందు నిలబెట్టి ఆ దృశ్యానికి అనుగుణంగా సన్నివేశాన్ని చిత్రించడమే ఈ శిల్పం యొక్క ప్రత్యేకత.

నవలా రచనకు ఇతివృత్తం ఎంత ప్రధానమో పాత్రలు కూడా అంతే ప్రధానం. ఈ పాత్రలు మూలంగానే కథ సాగుతుంది. రచయిత యొక్క ప్రతిభ పాత్రను సృష్టించడం దానికి అనువుగా ఆ పాత్ర జీవితాన్ని నడపడం లోనే కనిపిస్తుంది. పంచమం నవలలో కనిపించే పాత్రలు శివయ్య, సురేష్, పురుషోత్తం, శంకరయ్య, నారాయణప్ప, సీతా రామప్ప, పద్మ, విద్య మొదలైన పాత్రలు కనిపిస్తాయి.

ఈ నవలలో పాత్రలు జీవితం నుండి పుట్టుకొచ్చాయి. ఏ పాత్రకు ఆ పాత్ర సమకాలీన సామాజిక భావజాలం నుండి ఆవిర్భవించి నట్లుగా కనిపిస్తాయి.

పంచమం నవలలో శివయ్య కథానాయకుడు అయినప్పటికీ ఎక్కడ వీరోచిత కృత్యాలకు పాల్పడడు. తాను పుట్టి పెరిగిన వాతావరణం, హింస అవమానం, అణిచివేతల మధ్య తాను ఏ సాహసం చేయాలన్నా దాని వెనుక భయం, భీభత్సం, అభద్రతాభావం, అనిగి పోతున్నా కోరికలు కనిపిస్తాయి. రచయిత శివయ్య పాత్రను అచేతన దశనుండి పోరాట దశ వరకు ఈ పాత్ర పైనం సాగుతుంది తెలుగు నవలా సాహిత్యంలో శివయ్య పాత్ర గొప్ప ప్రయోగం.

ఈ నవలలో ‘ఇ యమ్. పాస్టర్’ విభజించిన ఒక సరళరేఖ మీద నడిచే ఫ్లాట్ కారెక్టర్స్ (ఉదా సీతా రామప్ప, శంకరప్ప సమయ సందర్భాలకు ఒదిగిపోయే రౌండ్ క్యారెక్టర్స్ (ఉదా శివయ్య, విద్య, పద్మ కనిపిస్తాయి చిలుకూరి దేవపుత్ర ఒక కాలాన్ని ఒక ప్రాంతాన్ని ఒక చరిత్రను సంస్కృతిని ఇచ్చి పాత్రలకు రక్తమాంసాలిచ్చి ప్రాణం పోసి సజీవంగా నిలిపిన పంచమం నవల పాఠకుడికి ఒక అనుభూతిని కదలికను చూపించక మానదు.

**సంభాషణా శిల్పం:** మనుషుల మధ్య మాటలు అనుబంధాలను సృష్టిస్తాయి. విభిన్న విషయాల భావ వినిమయానికి సంభాషణ ఉపకరిస్తుంది. పంచమం నవలలో దేవపుత్ర సృష్టించిన పాత్రల చేత అనేక విషయాలను సందర్భానుగునంగా మాట్లాడిస్తాడు. ఈ

మాటల ద్వారానే పాత్రల వ్యక్తిత్వాలు అర్ధమవుతాయి. కథానుగుణంగా జరిగే సంభాషణలు, సన్నివేశాలకు, సంఘటనలకు జీవం పోస్తాయి. సంభాషణల్లో అంతర్నిగూడంగా జవ తత్వాలు దాగి ఉంటాయి.

పంచమం నవలలో సందర్భాన్నిబట్టి భాష వాడబడింది. కథనం వ్యవహారంలోనూ, పాత్రల సంభాషణ వారి వారి స్థాయిని బట్టి వ్యవహారిక మాండలిక భాషలోనూ సాగుతాయి. మాండలికం పాత్రలు సంభాషణల్లో ఆ ప్రాంత ప్రజల మనస్తత్వాలను బయటకు తెస్తాయి. పాత్రల సంభాషణలు సహజత్వం వేగం ఆలోచనలు కలిగి ఉంటాయి.

దేవపుత్ర అచ్చమైన రాయలసీమ మాండలికాన్ని, అక్కడి ప్రజలు మాట్లాడు వివిధ పదాలు తీసుకుని దానికి అనుగుణంగా ఆయా పాత్రల చేత సంభాషణా కథన శిల్పాన్ని నేర్పుగా సాధించి సఫలీకృతుడయ్యాడు. దళితులు ఒక ప్రత్యేకమైన యాసతో కూడిన భాషలు మాట్లాడతారు. దేవపుత్ర ఈ నవలలో పండిత స్పర్శ లేని పామర భాషను యథాతథంగా ఏదాపరికం లేకుండా అనంతపురం యాసను ఉపయోగించాడు. " ఇట్లా ఇచ్చుకోండ్రా! మంచి రేగడి నేల ఊరికే ఉత్త పుణ్యానికే ఎట్లాస్తది. మీరు జెప్పేది నిజమే గొంచికాడా! మాది గేర్లోను, మాల గేర్లోను చెప్పి చూస్తాను." (పుట 63) "ఎవర్రా నువ్వు అంటే ఉలుకు పలుకు లేదేంవాయ్! నేను గొంచికాడ!. చెం... చె.. చెన్నప్ప కొడుకుని గొంచికాడ ! కుర్రోళ్ళు చెన్నప్ప, బలిజోళ్ళ చెన్నప్పు! కులం చెప్పలే! నీ యమ్మ! గో.. గో.. గోంచి కాద! మా... మా... మాల చెన్నప్ప కొడుకుని గొంచి కాద!. " ( పుట 134 ) ఈ విధమైన అనంతపురం మాండలికంలో కథ సాగుతూ పోతుంది. రచయిత కథను నడిపించడం తో పాటు వ్యాఖ్యానం కూడా కథలో చెప్తున్నా పాత్ర దృష్టికోణం నుంచి సాగుతుంది.

**కథాకథన శిల్పం:**

చిలుకూరి దేవపుత్ర ఈ నవలను మొదటి నుండి చివరి వరకు ప్రథమ పురుషలో కథను నడిపించాడు. ప్రథమ పురుష అనగా ఒక ప్రధాన పాత్ర తన దృష్టికోణం నుంచి మాత్రమే కథను నడపడం అన్నమాట. వాస్తవానికి దళిత జీవితంలో వుండే కళాత్మకతను వారి సంస్కృతిలోని వైవిధ్యాన్ని చక్కగా చిత్రీకరించారు రచయిత. కథలో ఉన్న విభిన్న సంఘటనలను అన్నీ కలిపి, ఒక సామాజిక ప్రయోజనానికి నవల రచన కార్యానికి దోహద పడటమే కథా కథన శిల్పం అంటారు.

పంచమం నవలలో' అలిగిరి' అని మరో కథా కథన శిల్పం కనిపిస్తుంది. ఇది తెలుగు సాహిత్యంలో అంతరార్థ కథా కథనానికి సమాంతరంగా ఉంటుంది. ప్రధాన కథకి సమాంతరంగా మరి కొన్ని గొప్ప కథలను జోడించి తన ప్రత్యేక కథాకథన శిల్పంతో నవలా రచనకు పూనుకుంటాడు రచయిత. ప్రధాన కథతో పాటు నాస్తికత్వం, మైనారిటీ వాదం, స్త్రీవాదం, దండోరా ఉద్యమాలు, హిందూ వాదం లాంటి ఎన్నో విషయాలు కనిపిస్తాయి.

ప్రముఖ స్త్రీవాద రచయిత్రి వసంత కన్నాభిరాన్ రాసిన ' విభజన రేఖ' అనే కవితను తీసుకుని నవలలో ఇమిడిపోయే విధంగా ' అవిభాజ్యం' అనే కథను అద్భుతంగా చిత్రించాడు. ఈ నవలలో వర్ణనకు ఎక్కువ ప్రాముఖ్యతను ఇవ్వలేదు. సాధ్యమైనంత వరకూ సూటిగా ఒకటి లేదా రెండు మాటలు చెప్పి కథలోకి వెళ్ళిపోతాడు. ఊరికి వచ్చిన ఆఫీసర్స్ గూర్చి ప్రస్తావిస్తూ " అప్పటికే నడి నెత్తి మీదకు వచ్చాడు సూర్యుడు, ఆవేళ ఎండాకాలంలో ఉన్నంత ఉక్కగా ఉంది. పీర్ల చావిడి లో ఆర్ ఐ, వి ఏ..." (పుట 13) మొదలైన వారు వచ్చారు అంటూ వర్ణన తక్కువ చేస్తారు.

**ముగింపు :-**

తరతరాల అణచబడిన అంచుల మీదనుండి, ఆలోచించి, బీటలు వారిన జీవిత కారిద్ర్యంలో నుండి పిడికెడు ఆత్మ విశ్వాసాన్ని సంపాదించుకుని, దరి వేతనియ్యాని నిస్సహాయతలోంచి తిరుగుబాటును నేర్చుకోవాలి అనేది ఈ నవల యొక్క ప్రధాన ఆశయం. "

దళితులు కేవలం ఆఫీసుల లోనో, విద్యాలయాల్లోనో, పరిపాలనల్లోనో రిజర్వేషన్లు కల్పించడం వలన రాజ్యాధికారం రాదని... శక్తిమంతం కాదని వివరిస్తూ... ఇక తప్పుడు తన తన కులం అంటరానితనం మీద నిలబడక తప్పదు. తన పట్ల కనపరిచే న్యూనత మీద నిలబడక తప్పదు. అంటూ నవల ముగుస్తుంది.

దళిత ఉద్యమాల చారిత్రక నేపథ్యంలో వచ్చిన నవల పంచమం భూసంస్కరణలు మొదలుకొని చుండూరు, కారంచేడు సంఘటనలు, నక్సలిజం విజృంభణ, దళిత యువత ఉద్యమించడం దళితులు సంపన్నవర్గాల కుల వివక్షకు గురై అగ్ర వర్ణాల చేతుల్లో కీలు బొమ్మలు కావటం, దండోరా, మాల మహానాడు, రిజర్వేషన్ల వర్గీకరణ లాంటి రెండు దశాబ్దాల చారిత్రిక సంఘటనలను రికార్డ్ చేసిన నవల, ఉద్యమ ప్రభావం అంతగా లేని రాయలసీమ నుండి ఉద్యమ నేపథ్యం గల పంచమం పుట్టడం ఆశ్చర్యకరం. ఈ నవలలో ఒక చరిత్ర, సంస్కృతి కాలం వస్తు శిల్పాలు సజీవంగా ఉన్నాయి. ఈ నవల పాఠకునిచదివించే నవలగాను, ఒక చారిత్రక నవలగా మిగిలిపోతుంది అని అనటంలో ఎటువంటి సందేహం లేదు.

**ఉపయుక్త గ్రంథ సూచి:**


1. నవలా శిల్పం – వల్లంపాటి వెంకటసుబ్బయ్య
2. పంచమం-చిలుకూరి దేవపుత్ర
3. ఆంధ్ర మహాభారత శైలీ పరిశీలన- పరిమి రామ నరసింహం
4. 1980 తర్వాత తెలుగు దళిత నవల-రాచపాలెం చంద్రశేఖరరెడ్డి, కె లక్ష్మీనారాయణ.
5. కథాశిల్పం-వల్లంపాటి వెంకటసుబ్బయ్య
6. పంచమం నవల దళిత జీవన చిత్రణ-పి జ్ఞానానందం
7. చిలుకూరి దేవపుత్ర రచనలు సమగ్ర పరిశీలన-దళిత దృక్పథం- డాక్టర్ పేరాల జ్ఞానానందం.


********

# 85. ఆధునిక సాహిత్యంలో ప్రజానాట్యమండలి పాత్ర - సామాజిక స్పృహ

**డా|| బండి కళ్యాణి**
చరిత్ర అధ్యాపకురాలు
ఆంధ్ర లొయోల కళాశాల, విజయవాడ.
సెల్: 9640684707
bandikalyani84@gmail.com

**డా|| మూరే విజయకుమార్ రెడ్డి**
చరిత్ర అధ్యాపకులు
ఆంధ్ర లొయోల కళాశాల విజయవాడ.
సెల్: 9346665557
mpvkreddy14@gmail.com

**ఉపోద్ఘాతం :**

ఆధునిక సాహిత్యంలో వివిధ కవులు, కళాకారులు వారి రచనల ద్వారా, వివిధ కళారూపాల ద్వారా సామాజిక స్పృహను కలుగజేసినారు, అట్టి వాటిలో ప్రజానాట్యమండలి పాత్ర ప్రముఖమైనదిగా చెప్పవచ్చును. సమాజంలోని ప్రజలను ఉత్తేజపరచలన్నా, చైతన్యపరచలన్నా పెద్ద పెద్ద ప్రసంగాలు, సభలు, సమావేశాలు, ఆదర్శాలు ఇవి ఏవి వారికి అర్ధమయ్యేవి కావు. కేవలం కళల ద్వారా మాత్రమే వారికి అర్ధమయ్యే సరళభాషలో వివరించేవారు, నాటి నుండి నేటి వరకు ప్రజలంతా ఎంతో కాయకష్టం చేసుకుంటూ తమ బ్రతుకుల్ని సాగిస్తున్నారు. అయితే అప్పటికే సుద్దాల హనుమంతుగారు నల్గొండతో పాటు ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ లో బుర్రకథలతో చాలా ప్రసిద్ధి అయ్యారు. శ్రీ నర్రా రాఘవరెడ్డిగారు పాటలు పాడిన, నాట్యం చేసిన, హనుమంతు కంటే బాగా చేసావు, బాగు పాడావు అని చెప్పడంతో, కష్టపడి ఇంకా వాటిలో ప్రావీణ్యం సంపాదించారు.

ఉదాహరణగా నర్రా రాఘవరెడ్డి జీవితంలో జరిగిన సంఘటన, తన తల్లి మరణించిన తరువాత పెంపుడు తండ్రి నర్రా వెంకట్రాంరెడ్డి ఆయన చెల్లెలు నర్రా కన్నమ్మ రాఘవరెడ్డిని ఎంతో ప్రేమతో గారాబంగా పెంచారు. ఆ సమయంలో మూడు పేటల వెండి మొలత్రాడు కట్టగా రాఘవరెడ్డిగారు దానిని అమ్మి గొల్లసుద్దులు, నాజర్ బుర్రకథలు, బుడ బుక్కల, పిట్టలదొర నేర్చుకున్నారు. అంటే కళలపై వారికి గల ఆసక్తిని తెలియజేస్తుంది. శ్రీరాఘవరెడ్డిగారు బాల్యంలో కూడా ఎక్కడైనా భాగోతులు, తోలుబొమ్మలు ఆట ప్రదర్శించిన రోజు సందకాడ నుండి తెల్లరిందాక తెంపులేకుండా చూసేవారు. మరుసటిరోజు తాను గతరాత్రి విన్న పాటల్ని ఏ మాత్రం తేడా లేకుండా పాడేవాడు. చూసిన దృశ్యాన్ని మాటలతో సహా యథాతథంగా వివరించేవారు, మంచి గ్రాహ్యశక్తి, జ్ఞాపకశక్తి, అనుకరణ ఉండటం వలన ఏ విషయానైనా రక్తికట్టించే విధంగా చెప్పేవారు.

**కళారూపాల ఆవిర్భావం :**

మానవుడు తన మనుగడకోసం సాగించే పోరాటం నుండే కళలు ఆవిర్భవించాయి. సమిష్టి శ్రమ చేసే క్రమంలో అది మనిషి అనేక రకాల పనిముట్లు తయారు చేసేవాడు. వేట ఒక సామూహిక క్రియ. దానికోసం రాతితోనూ, ఎముకలతోనూ అనేక రకాల పనిముట్లు తయారుచేసేవాడు, ఆనాటి మానవుని సామర్థ్యం, నైపుణ్యం, ప్రకృతి పరిజ్ఞానాన్ని బట్టి పనిముట్లు తయారయ్యేవి. ఈ పనిముట్లను ఏదో ఒక కార్యానికి ఉపయోగించేవాడు. తాను తయారు చేసిన పనిముట్టు తను చేయాల్సి పనికి ఉపయోగపడే విధంగా తయారైతే, తన ఆశకూ, ఆకాంక్షకూ అనుగుణంగా ఉంటే సంతృప్తి చెందేవాడు, ఆనందించేవాడు లేకపోతే అసంతృప్తి చెందేవాడు. నిరాశకు గురయ్యేవాడు. అది మానవుని పనిక్రమంలో ఆయనలో కలిగే ఈ అనుభూతులే ఆయనలో అలంకారశాస్త్రపరమైన భావాలు అంటే అందం, అనాకారితనం వంటి భావాలు ఏర్పడ్డానికి కారణమైనాయి. ఇవే తరువాత కళల అభివృద్ధికి మూలమైనాయి. ఒక

వస్తువు తయారయిన తరువాతనే కాదు. దాని కోసం శ్రమించడంలోనే అతను ఈ అనుభూతులు పొందేవాడు. అనేక మంది కలిసి ఒక ప్రయోజనకరమైన పనిచేయడమే అనుభూతులను కారణమయ్యేది. సామూహికంగా వేటాడటం ఒక తీవ్రమైన అనుభూతి. అందులో విజయం సాధిస్తే అంటే, వేట జంతువును చంపగలిగితే ఆనందం, సంతృప్తి పొందేవాడు. లేకపోతే నిరాశ, అసంతృప్తి పొందేవాడు. ఒక్కోసారి వేటలో ఎదురయ్యే ఈ అనుభూతులు రెండోసారి వెళ్ళేటప్పుడు ముందుగానే కలుగుతాయి కదా. ఉదాహరణకు ఒకసారి ఏనుగును వేటాడి చంపిన గుంపుకు అనేక అనుభవాలు ఎదురుకావచ్చు. ఏనుగు చనిపోతే ఆహారం దొరికిందనే ఆనందం కలగవచ్చు. లేకపోతే విషాదంగా తిరిగి రావచ్చు. రెండోసారి ఏనుగును వేటాడ్డా వెళ్ళినపుడు వారిలో గత అనుభవాల అనుభూతులు ముందుగానే కలుగుతాయి. అంటే మానవుని కార్యకలాపాలు అభివృద్ధిచెందుతున్న క్రమంలో అనుభూతులు వాస్తవ కార్యం నుండి విడివడడం జరిగింది. సృజనాత్మక కళలు ఈ అనుభూతుల నుండే అభివృద్ధి చెందాయి. అంటే దీనర్థం కళ శ్రమ నుండి వేరైందని కాదు. శ్రమ నుండి సృజనాత్మక కళ విడివడి శ్రమతో పాటే లేదా శ్రమకు సమానాంతరంగా పనిచేయడం ఆరంభమైంది. అప్పుడు కళలు స్వంతంగా అభివృద్ధి చేయడానికి అవకాశం ఏర్పడింది కళకు సామాజిక ప్రయోజనం కూడా అప్పుడే ఏర్పడింది.

అభివృద్ధి చెందిన సృజనాత్మక కళలు ఆదిమానవుని ఉత్పత్తి క్రమానికి ఎంతగానో తోడ్పడ్డాయి. ఆహారోత్పత్తి కార్యక్రమానికి నాటి మానవుని సన్నద్ధం చేసే సాధనంగా పనిచేశాయి. ఉదా||కు 1879లో స్పెయిన్ లో, ఆల్టామీరా అనే చోట బయటపడిన ప్రాచీన మానవుల గుహకుడ్యచిత్రాలు ఆ తరువాత స్పెయిన్ లోనూ, ఫ్రాన్స్ లోనూ బయటపడ్డ వందకుపైగా ప్రాచీన గుహల కుడ్యచిత్రాలు, శిల్పాలు ఈ విషయాన్నే చెబుతున్నాయి. క్రీస్తు పూర్వం 28,000 నుండి 10,000 సంవత్సరాల మధ్యకాలంలో నాడు నివసించిన ఆదిమానవులు ఆ చిత్రాలను గీశారని శాస్త్రజ్ఞులు కనిపెట్టారు. ఈ గుహల కుడ్యాల మీద బొచ్చు ఏనుగులు, ఎద్దులు, ఆవులు, గుర్రాలు, లేళ్ళు, అడవి దున్నల బొమ్మలున్నాయి. వాటిలో ఎన్నో జంతువులు బల్లెం గుచ్చుకున్నట్లు, రాళ్ళతో గాయపడినట్లు, లేదా వలలో చిక్కుపడినట్లు చిత్రించి ఉన్నాయి. అవి ఆనాటి మానవుల కళావైదర్యానికి రుజువులని కొందరు చెబుతుంటారు. నిజానికి అవి ఆనాటి మానవుడు వేటకు వెళ్ళే ముందు గుహల పై చెక్కుకున్న వేట నమూనాలు. ఒక ప్రయోజనం ఆశించి చిత్రించినవి. నాటి మానవులు జంతువేషాలు వేసుకొన్న మానవు చిత్రాలు కూడా గీశారు. జంతువుల చర్మాలను, తలలను, కొమ్ములను ధరించి నాట్యం చేస్తున్నట్టు మానవుల బొమ్మలు కొన్ని చిత్రించారు. అలాగే ఆనాటి గుహలలో దంతాలతో చేసిన స్త్రీ ప్రతిమలు కాళ్ళు చిన్నవిగా ఉంటాయి.

ఇవన్నీ కూడా వాటి కళకు ఒక సామాజిక ప్రయోజనం ఉన్నదని తెలియచేస్తున్నాయి. వేటకు వెళ్ళే ముందు వేట నమూనాలను చిత్రించడం, వేటలో పొందగోరే అనుభూతిని ముందుగానే చిత్రించడం ద్వారా మానవ సమూహాన్ని వేటాడడానికి ప్రేరణ కల్పించడం ఈ కళాఖండాల ప్రయోజనం.

వేసిందే. అదే విధంగా లయబద్ధమైన నృత్యం, (నేటి గిరిజన నృత్యాల వంటివి) పాటలు కూడా ఇటువంటి ప్రయోజనం కలిగి ఉన్నాయి. సామూహిక నృత్య, గాన ఉత్సవం ఆనాటి మానవులకు అటువంటి ప్రేరణనిచ్చేది. ఈ నృత్య-గానాలలో పంటకోతకు సంబంధించిన పాటపాడుతూ నృత్యాలు చేసేవారు. తాను చేయబోయే పనివల్ల వచ్చే ఫలితం ఎదురుగాలేదు. కాని ఈ ఫలితాన్ని ఊహించుకొని పాటపాడడం, లయబద్ధమైన నృత్యం చేయడం ద్వారా మానవులు ఊహాలోకాల్లోకి వాస్తవంగా కనిపించని పంటవారికి ఆ ఊహాలోకంలో కనిపించేవి. నృత్యం ఆగిపోయాక కూడా అతనిలో ఆ అనుభూతి మిగిలిపోయేది. ఆ అనుభూతే సేద్యానికి ప్రేరణనిచ్చేది. అందువల్ల కళలు ప్రారంభంలో మానవుని శ్రమ నుండి ఉద్భవించడమే కాదు అతన్ని శ్రమకు సన్నద్ధం చేసే సాధనాలుగా పనిచేశాయి. అంటే శ్రమకు సామాజిక ప్రయోజనం అనాడి నుండీ ఉన్నది.

ఆదిలో ఈ కళలు మానవత గల సామాజిక జీవనాన్ని నిర్దేశించే కొన్ని క్రతువులతో ముడిపడి వుండేవి. వేటకీ, సేద్యానికీ ముందుగా ఈ క్రతువులు నిర్వహించేవారు. పాట, నృత్యం, సంగీతం, మత క్రతువులూ ఇవన్నీ నాటి మానవ తెగలోని అంతర్గత శక్తిని వెలికితీసీ సమిష్టి కృషిని ప్రోత్సహించే సాధానాలుగా ఉండేవి. కళలు మానవుని సమిష్టి కృషిని ప్రోత్సహించే సాధానాలుగానే కాదు. పనిలో ఆనందాన్ని కలిగించే పనిని నిర్వహించేవి. నేటికీ మన జానపదులు వివిధ పనులు చేసేటప్పుడు వివిధ రకాల పాటలు పాడుతుంటారు. నాట్లు వేసేటప్పుడు, పొలం దున్నేటప్పుడు, పంటకోసేటప్పుడు, గింజలు నూర్చేటప్పుడు, కుప్ప వేసేటప్పుడు, ధాన్యం దంచేటప్పుడు, పిండి దంచేటప్పుడు, ఈ రకరకాలు పనులకు రకరకాల పాటలు వాడుకలోకి వచ్చాయి. ఇవన్నీ కూడా పనిలో మనిషికి కష్టాన్నిమరిపించేందుకూ, పనిలో సమిష్టి తత్వాన్ని ప్రోత్సహించేందుకూ ఉపయోగపడేవే. అంతేకాదు బోయీలు పల్లకీ మోసేటప్పుడు లయబద్ధంగా అడుగులేస్తూ పాటపాడుతూ ముందుకు సాగుతారు. బరువైన పనులు చేసే గ్యాంగ్ మెన్ వంటివారు కూడా తమ శ్రమ మరిచిపోయేందుకు పాటనో, లయబద్ధమైన సంగీతాన్నో ఆలపిస్తారు.

సమాజంలో శ్రమవిభజన పెరిగి, ఉత్పత్తి సాధనాలు వ్యక్తులపరమైనాక వర్గ విభజన జరిగింది. ఉత్పత్తి సాధనాలను సొంతం చేసుకున్న కొద్దిమంది అత్యధికుల శ్రమశక్తిని భుక్తం చేసే దోపిడి వ్యవస్థ ఏర్పడినాక కళలు శ్రమ నుండి వేరైనాయి. అంతకు ముందు పనితోబాటే అభివృద్ధి చెందిన కళలు ఇప్పుడు విశ్రాంతి సమయపు వృత్తులుగా మారాయి. కళాకారుడిప్పుడు సమిష్టిగా శ్రమ చేసేవాడు కాదు, ఒంటరివాడు. వర్గసమాజంలో సామాజిక చైతన్యం అనేది పాలక వర్గాల చైతన్యంగా మారిపోయింది. శ్రమకు విలువ తగ్గింది. విశ్రాంతిగా గడపడం సంఘంలో గౌరవప్రదం అయింది. అందువల్ల వర్గ సమాజం సోమరాతనాన్ని పెంపొందించింది. కళ అనేది పని నుండి వేరుపడిపోయింది. కళాకారుడు ప్రభువులను ఆశ్రయించి బ్రతకాల్సివచ్చింది. అందువల్ల అతని కళాసృష్టి ప్రభువుల చైతన్యానికి అనుగుణంగా మారింది. అంటే సోమరులుగా ఉండేవారికి కాలక్షేపంగా కళ మారింది. వారి భోగలాలసతను తీర్చే సాధనమైంది. వర్గ సమాజంలో కూడా కళకు ప్రయేజనముంది. అయితే అది చెప్పిన్నట్లు పాలకుల భోగలాలసతను తీర్చేదిగానూ, మరో వంక తమ వర్గ పాలనను కొనసాగించేందుకుగాను ఆశేష ప్రజానీకాన్ని మానసికంగా అణిచి పెట్టేందుకూ కళ ఉపయోగపడింది.

ఇక కళను అమ్మకపు సరుకుగా మార్చిన పెట్టుబడిరానీ సంస్కృతి విషప్రభావం అన్ని రంగాలలోనూ కనిపిస్తోంది. సినిమాలు, సాహిత్యం, పాటలు, సంగీతం, చిత్రం, శాల్పం అన్నీ అమ్మకం సరుకులు కావడంతో ధనసంపాదన కోసమే కళ అనే దృష్టా పెరిగింది. సెక్సు, హింస, క్షుద్రసాహిత్యం, హిరోయిజం, మూఢనమ్మకాలు మానవుని బలహీనతలన్నిటినీ సొమ్ము చేసుకొంటున్న ఈ కుళ్ళు సంస్కృతి వ్యతిరేకంగా పోరాడడం సాంస్కృతిక కళాకారుల ప్రధాన కర్తవ్యం. ప్రజలను ప్రజా పోరాటాల నుండి దూరంగా ఉంచేందుకు, ప్రక్కదారి పట్టించేందుకు ఈ సామ్రాజ్యవాద, ఫ్యూడల్, పుట్టుబడిదారీ విష సంస్కృతులన్నీ పనిచేస్తున్నాయి. కళ ప్రజల కోసమే, ప్రజా ప్రయోజనాల కోసమే అనే నినాదతో పనిచేస్తున్న సాంస్కృతిక రంగ కార్యకర్తలు ఈ మూడు సంస్కృతుల మీద త్రిముఖ పోరాటం నిర్వహించాల్సి వుంటుంది.

**మొదటిది**– మన ప్రజలపై సామ్రాజ్యవాద విష సంస్కృతి చేస్తున్న దాడులను గురించి, వాటిప్రభావాల గురించి విశ్లేషించి ఎండగట్టడం, మన ఆర్థికవ్యవస్థపై సామ్రాజ్యవాదులు పెరుగుతున్నపట్టును అర్థం చేసుకోకుండా, విశ్లేషించకుండా పై పనిచేయలేం. కేవలం సామ్రాజ్యవాద సంస్కృతివిషప్రభావం గురించి చెప్పినంత మాత్రాన సరిపోదు, దానికి ప్రత్యామ్నాయంగా దేశభక్తిని ప్రభోధించే కళలను ప్రజలకు ఆయుధంగా అందించాలి.

**రెండవది**- ఫ్యూడల్ సంస్కృతి, ఫ్యూడల్ సంస్కృతి యొక్క కుళ్ళును కులం, మతమౌఢ్యం మూఢాచారాలు, స్త్రీల విషయంలో ఉన్న బూజు పట్టిన భావాలు, గ్రామీణ పెత్తందారీతనం మొదలైన వాటికి వ్యతిరేకంగా పోరాడటం, కళారూపాల ద్వారా ఈ సంస్కృతిక దురాచారాలను ఎండగట్టి ప్రచారం చేయాలి.

**మూడవది** – ముఖ్యమైనదీ, కళలనూ, సంస్కృతినీ వ్యాపారమయం చేస్తున్న పెట్టుబడిదారీ సంస్కృతికి వ్యతిరేకంగా పోరాడటం. కళ కళ కోసం కాదు. ప్రజల కోసమే అనేది ఆంధ్ర ప్రజా నాట్యమండలి నినాదమైనది.

**ప్రజానాట్యమండలి అవతరణ**

1943 జనవరి ప్రాంతాల్లో అఖిల భారత కమ్యూనిస్టు పార్టీ మహాసభ బొంబాయిలో జరిగింది. ఆ సందర్భంలో అఖిల భారత ప్రజానాట్యమండలి మహాసభ, అఖిలభారత అభ్యుదయ రచయితల మహాసభ జరిగాయి. కొన్ని రాష్ట్రాల నుంచి వైజ్ఞానిక దళాలు వచ్చాయి. ఆంధ్ర వైజ్ఞానికదళం కూడా మన ప్రాచీన జానపద కళారూపాల బాణీలో కొన్ని ప్రదర్శనలను ప్రదర్శించి అందరి ప్రశంసలను అందుకుంది. ఆ తరువాత ఆంధ్రదేశంలో అప్రతిహతంగా పురోగమించింది. నాటక రంగస్థలంలో నవశకాన్ని ఏర్పరచి ప్రజలను జాగృతమొనర్చి దేశభక్తిని రగుల్కొల్పిన నాటి సంస్థ ప్రజానాట్యమండలి. కళ కళకోసం కాదనీ, అది ప్రజల కోసమనీ నిరూపించింది. కళ వ్యక్తుల సొత్తుకాదని, అది ప్రజలకు చెందిన ఆస్తి అని చాటింది. ఫాసిజానికి వ్యతిరేకంగా, సోవియట్ రష్యాకు అనుకూలంగా ఫాసిస్టు వ్యతిరేక ప్రచారం ఎన్నో వైజ్ఞానిక దళాలను తయారుచేసింది. ఎన్నో ఫాసిస్టు వ్యతిరేక శిక్షణా శిబిరాలను నడిపింది. ఊరూరా ప్రజానాట్యమండలి శాఖలు ఏర్పడ్డాయి. ఎన్నెన్నో కళారూపాలు ప్రదర్శించబడ్డాయి. ఫాసిజానికి వ్యతిరేకంగా అనేక గేయాలు వెలువడ్డాయి.

**ఆనాటి ప్రజానాట్యమండలి**

ఆనాటి ప్రజానాట్యమండలి బుర్రకథ, వీధినాటకం, జముకుల కథ, పిచ్చుగుంటలకథ, కత్తి-సుత్తి నృత్యాలు, చెంచు వేషాలు, ఫకీరు వేషాల, కోలాటం, పిట్టలదొర, సొదె, కోయవేషం, చెక్క భజనలు, హరిహర పదాలు, జంతరుపెట్టి తమాషా మొదలైన అనేక కళారూపాల ద్వారా, పాటలద్వారా, ఫాసిజానికి వ్యతిరేకంగా, రష్యాకు అనుకూలంగా ఎంతో ప్రచారం జరిపింది.

**జానపద కళారూపాలు-ప్రజాదరణ**

ప్రజానాట్యమండలి ప్రజా సమస్యల్ని పరిష్కరించడం కోసం కళారూపాలను తీసుకొన ప్రతిన బూనింది. ప్రతిభ చూపింది. దాని ప్రభావం కనిపించింది. 1943 లో ప్రజానీకాన్ని ఉత్తేజపర్చవలసిన అవసరం కలిగింది. వివిధ కళారూపాలు వెల్లివిరిసిన రోజులు. కీ. శే మద్దుకూరి బాట చూపించగా అమరజీవి రాజారావు ప్రోత్సహించగా ప్రజానాట్యమండలి జానపద కళారూపాలను ప్రదర్శించడంలో నైపుణ్యం చూపి అగ్రగామిగా నిలిచింది. దివి తాలుకా "కోడలి" క్యాంపుతో ప్రారంభమై "కాకినాడ" నుంచి "కొడవలూరు" వరకు శిక్షణ శిబిరాలు నడిపినారు.

"ఖండ ఖండాంతరాల భరతమాతా" అని కోలాటాలు, 'ఎందుకయ్యా జాగుచేయ భరతవీరుడా' అని జేగంట దీపాలతో వేషాలు - గొల్లసుద్దులు, కోయవేషాలు, పకీరు వేషాలు, చెంచువేషాలు వేసి ప్రజానీకాన్ని ముగ్ధుల్ని జేస్తుంటే చిద్విలాసంగా వుండేది. తక్షణ ప్రజాసమస్యల పరిష్కారమే ప్రధాన అంశం. బెంగాలు కరువు, రాయలసీమ క్షామం వచ్చినప్పుడు జోలి బట్టి రైల్వే ప్లాట్ఫారం, బస్టాండ్ల లో సైతం చిల్లర డబ్బులు, చినిగిన బట్టలు, ధాన్యం వసూలు చేస్తూ చిత్ర చిత్ర వేషాల ద్వారా

**"కరువు వచ్చి బెంగాల్ ప్రజ కాలుచున్నారు**

**అస్సాములో అన్నం లేక యున్నారూ తే యున్నారూ,**

**సాటి జనుల నాదరించి సాయము చేయి,**

**నేటి భరతమాత ఖ్యాతి నిలుపుము భాయి"**

అంటూ కరువు కాటకాలతో అల్లాడే ప్రజలను ఆదుకోవటానికి చేసిన ప్రచారం, పంపినసాయం అపారం మరుపురాని మహోజ్వల స్మృతులు. ద్వితీయ ప్రపంచ సంగ్రామ సమయంలో నాజీ 'హిట్లర్ స్వైర విహారం చేస్తున్నప్పుడు ప్రతిభావంతమైన 'హిట్లర్ పరాభవం' అను వీధినాటకాన్ని పల్లెల్లో, పట్టణాల్లో ప్రదర్శించి ఫాసిస్టు శక్తుల వినాశనానికి, ప్రజాస్వామిక శక్తుల విజృంభణకు, విజయానికి పాటు పడింది ప్రజానాట్యమండలి.

**ముగింపు**

ఈ విధమైన కళారూపాల ద్వారా వివిధ కళాకారులు సమాజంలో సామాజిక స్పృహను కల్గించి సామాన్య ప్రజల నుండి మధ్యతరగతి ప్రజల వరకు చైతన్యం కల్గించి, ప్రజలను సమ సమాజ స్థాపనవైపు నడిపించారనుటలో సందేహంలేదు.

ఈ కథలలో కస్తా పాటలు రూపంలో, బుర్రకథలు, సుద్దులు, పిట్టలదొర, బుడబుక్కల చాలా తేలికగా, ఆర్కెస్ట్రా ఏమి అవసరం లేదు. సంచిలో గొల్లదోతులు ఉండేవి, పిట్టలదొర, తూపాకీని చెక్కతో చేయించి మలిచి సంచిలో పెట్టుకునేవారు. కోటు వేసుకొని, లాగు ఒక కాలుకి పైకి లాక్కుని, ఒక కాలుది కిందికి లాక్కుంటే అది పిట్టలదొర వేషం. ఆరాటం లేకుండా ముగ్గురు మనుషులతో కథ చెప్పేవారు. చివరికి రాఘవరెడ్డిగారు ఉప ఎన్నికల సమయంలో చాలు ప్రాంతాలకు వెళ్ళేవారు. చాలా సమయాలలో కథను ఒక్కరే చెప్పేవారని తెల్పినారు.

**ఉపయుక్త గ్రంథాలు:**


నారాయణరెడ్డి. రావి: వీర తెలంగాణా-నా అనుభవా-జ్ఞాపకాలు, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్, 2010.

ప్రజాశక్తి బుక్ హౌస్, హైదరాబాద్: మంచి కమ్యూనిస్టు ఎలా ఉండాలి. ప్రజాశక్తి బుక్ హౌస్, హైదరాబాద్, 2011.

రఘుపాల్.జి & భూపతి వెంకటేశ్వర్లు :తెలంగాణ సాయుధ పోరాట యోధుల గాథలు సై సై ఓ నల్లగొండ వీరుండా, నవ తెలంగాణ, పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్, 2015.

రాఘవరెడ్డి.ఎస్ : లత్కోర్ సాబ్ (పిట్టలదొర, ప్రణాళికి ప్రగతి తీరు అరుణజ్యోతి ప్రచురణలు, 1981.

శేషగిరిరావు బద్రిరాజు : ఆంధ్రప్రదేశ్ లో రైతు ఉద్యమం, తెలుగు అకాడమీ, హైదరాబాద్, 1990.

హనుమంతరావు మోటూరు :ఆంధ్రప్రదేశ్ లో అరుణ పతాక విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్, 1995

అసెంబ్లీ భవనం : లైబ్రరీ నుండి వాల్యూమ్, శాసనసభలో ప్రముఖుల ప్రసంగాలు.

**మాసపత్రికలు**

- అరుణతార
- బహుజన కెరటాలు మాసపత్రిక (నవంబర్, 2009)
- సృజన.


********

# 86. అరాచకత్వంపై వేకువ పిట్ట విశ్రాంత పోరాటం

డా. పోలుమాటి అన్నవరం సత్యనారాయణ

తెలుగు శాఖాధిపతి

ప్రభుత్వ కళాశాల అటానమస్ రాజమహేంద్రవరం.

9492566950

కాకాక్షి న్యాయం మార్జాల కిషోర న్యాయం మర్కట్ కిషోర న్యాయం... ఇలా మనకు విద్యార్థి కల్పలతలో చాలా న్యాయాలే కనిపిస్తాయి. ఇంతకీ న్యాయాలు అంటే ఏమిటి ఈ పథ బంధాలలో కనిపించే విశేషం సహజస్వభావం ప్రకృతి సహజ సిద్ధం అన్న అర్థాలలో వాడబడటం మనం చూస్తాం. కాకి ఒంటికన్నుతో చూడడం, తల్లిని అంటిపెట్టుకుని పట్టుకునే బాధ్యత కోతి పిల్లదే అవ్వటం, పంటి కాటు కూనకు తగలకుండా పట్టుకుపోయే బాధ్యత పిల్లి తల్లిదే అనీ ; పై పదబంధాలు మనకు వివరిస్తాయి. అంటే వీటి ధర్మాలు మనకు ఇక్కడ భాసిస్తాయి.

మానవీయత మానవ స్వభావంగా ఉండాలనటం సర్వత్రా వాంఛనీయం. కానీ మనిషికి మానవత్వం స్థానంలో దానవత్వం ఉంటే అరిస్టం .ఇది మానవ సహజత్వానికి భిన్నం. అందుకే దానవత్వం చెలరేగిన చోట సాధారణ స్థితిని నెలకొంటుంది. తిరిగి సాధారణ స్థితి నెలకొల్పబడడానికి చట్టం సమాజం తమ పాత్రలను నిర్వహించినట్టుగానే కళ కూడా మానవీయత తిరిగి పున ప్రతిష్టించబడడానికి ఎక్కువ కృషి చేస్తుంది.దాని కృషి అత్యంత ప్రభావశీలమైంది.

చిన్న చేపను తిని పెద్ద చేప మనగడ సాగించడం మత్స్య న్యాయం.పెద్ద జంతువు చిన్న జంతువుల మీద ఆధారపడి బతకడం ఆటవిక న్యాయం. అయితే గుంపు జీవనం సహకార ప్రవర్తి సహానుభూతి సానుభూతి భూత దయా లాంటివి మనుషులకే కాదు ఇతర జీవులలో కూడా తమ జాతి మధ్య ప్రకటితం కావటం స్వభావసిద్ధ మైన అంశం. ఈ సహకార సహజీవన ప్రవృత్తికి భిన్నంగా అమానవీయంగా ఆటవిక న్యాయాన్ని మించిన ఆటవికతను వెళ్ళగక్కడం లాంటి హృదయ విదారక అవాంఛనీయ పరిస్థితుల్ని దుయ్యబట్టడం **పరువు** అన్న కవితలో మనకు కనిపిస్తుంది.

వేట ఆడడం, క్రూరత్వం జంతువులకు ఆకలేసినప్పుడే వాటిలో పొడచూపే లక్షణాలు కానీ మనిషిలో హింస ప్రవృత్తికి తన భౌతిక అవసరాలతో సంబంధం ఉండదు. అది మనిషికి వినోదం మాత్రమే. మూగజీవాలను వేటాడడమే కాదు అమాయకులైన సాటి మనుషుల ధన,మాన, ప్రాణాలను దోచుకోవటం బలవంతుల మానసిక అవసరంగా, అది తీవ్రమైన మానసిక అనారోగ్యంగా, రుగ్మతగా, తయారయ్యి మొత్తం సంఘానికే హానికారకంగా పరిణమిస్తుంది. చర్యకు ప్రతి చర్యగా హింస ప్రవృత్తి అంతా పరివ్యాప్తమై అసహజ వాతావరణన్ని ఏర్పరచి మొత్తం జీవావరణ వ్యవస్థను అతలాకుతలం చేస్తుంది .

అనాదిగా గుంపు జీవనం ఒక సామాజిక వ్యక్తిగత అవసరమయింది అదే ఇప్పుడు కుటుంబ జీవనంగా సామాజిక జీవనంగా పరిణమించింది. చివరకు అదే ఇప్పుడు వ్యక్తి స్వేచ్ఛకు ప్రతిబంధకం అయింది. ఒకప్పుడు వ్యక్తికి రక్షణ కవచంగా నిలిచిన గుంపు జీవనం ఇప్పుడు కుటుంబ సంఘ కట్టుబట్లుగా తయారయ్యి చివరకు యమపాశం గా తయారయింది. రక్షణ కవచాలుగా ఉండడం కోసం చట్టాలను ఏర్పాటు చేసుకుంటే వాటినే భక్షకాలుగా తయారు చేసి వ్యక్తి శ్రేయస్సుకు వ్యతిరేక శక్తులుగా మలచడం లాంటివి అన్నమాట. కుటుంబ జీవనం గ్రామీణ జీవనం విపరీతమైన లింగ వివక్ష కుల వివక్షలకు కారకాలయ్యాయి. అవి పురుష స్వామ్య పెత్తందారీల చేతుల్లోకి వెళ్లిపోయాయి .బలహీనుల హక్కులు ఆస్తులు అపహరించడామే కా దు చివరికి వాళ్ళ

మానప్రాణాలకు కూడా విలువ లేకుండా పోయాయి. దీనికి విరుగుడు విద్య. దీనికి వ్యతిరేకమైన అందరి హక్కులకు సమప్రదాన్యం వహించే మరో ప్రత్యామ్నాయ వ్యవస్థ .

ఇది సమాంతరంగా ఆటవిక తెగలలో ప్రకృతితో అతి సమీపంగా సహజీవనం చేసి ఆధిమ తెగలలో ఉన్నది. ఇలాంటి సమన్యాయం మళ్లీ మన సామాజిక వ్యవస్థల్లో ప్రతిస్టాపించబడాలంటే గ్రామీణ జీవనానికి బదులు పట్టణ జీవనం ఒక ప్రత్యామ్నాయ పరస్పర ఆధారిత వ్యవస్థను సంస్కృతిని నిర్మించగలుగుతుంది.

సంస్కృతి కంటే చట్టాల ప్రాధాన్యం అధిపత్యం ఎక్కువ ఉన్న వ్యవస్థలలో సామాజిక న్యాయానికి కొంతైనా చోటు ఉంటుంది. సంస్కృతి మీద కంటే చట్టాల మీద అవగాహనతో వాటి మీద ఎక్కువ ఆధారపడ్డ వ్యవస్థలలో కూడా తరగతులు అంతరాలు ఉంటాయి. అవి ఉన్నప్పటికీ ఉపశ్రేణి వర్గాల అణచివేత కంటే పరస్పర ఆధారిత వ్యవస్థల నిరంతరం సంతులితస్థితిలో ఉండడానికి ఎక్కువ దోహదపడతాయి.

అందుకే అంబేద్కర్ గ్రామంలో ఏముంది అజ్ఞానం అంధకారం ఆధిపత్యం తప్ప గ్రామీణ వ్యవస్థలన్నీ పట్టణీకరణ చెందాలి అని అంటాడు. అంటే పట్టణీకరణ ఎక్కువ పరస్పర ఆధారితంగా ఉంటూనే అది అదే సమయంలో తక్కువ వైయక్తిక జోక్యంతో వ్యక్తి స్వేచ్ఛకు ప్రత్యక్ష ఆటంకం కాని వైఖరితో నిర్మించబడుతుంది.

అందుకే అటు ఆటవి క జీవనం ఇటు గ్రామీణ జీవనాల్లోని అభద్రతను నిర్బంధాల నుంచి పట్టణీకరణ ప్రత్యామ్నాయ విముక్తి మార్గం గా కనిపిస్తుంది. ఇది పూర్తిగా విద్య మీద అది సృష్టించిన ఆధునిక సామాజిక ఆర్థిక రాజకీయ వైయక్తిక అవసరాల ఆధారంగా మనగ లుగుతుంది .

వ్యవస్థలు ఎంత పట్టణీకరణ చెందుతున్నప్పటికీ గ్రామీణ కుసంస్కారం అప్పుడప్పుడు తలెత్తుతూనే ఉంటుంది. పూర్తిగా సంస్కరించబడటానికి సమయం పడుతుంది.

వ్యక్తి శ్రేయస్సు నిమిత్తం అనివార్య అవసరం అయిన గుంపు జీవనం దాని ప్రాతిపదికన ఏర్పడ్డ కుటుంబ వ్యవస్థ రాను రాను కుటుంబ పెద్ద ప్రయోజనాల కోసం పనిచేయటం మొదలుపెట్టింది. కుటుంబ పెద్ద ప్రయోజనాలు అంటే అతడు అనుసరించే ఆర్థిక సాంస్కృతిక సామాజిక విధివిధానాలు. వీటికి వ్యతిరేకమైన అవసరాలు కోరికలు, కుటుంబంలో భాగమైన ఏ వ్యక్తికి ఉండకూడదు. ఉంటే శిక్షార్హం .ఆ విధంగా కుటుంబ పెద్ద గ్రామ పెద్దగా తనకు అనుకూలమైన శిక్షాస్మృతులు తయారు చేస్తాడు.

మొదట ఈ శిక్షాస్మృతులు కుటుంబ పెద్ద ఆర్థిక ప్రయోజనాలను దెబ్బతీసేలా ఉంటే కుటుంబ సభ్యుల నిర్ణయాలకు వ్యతిరేకంగా పనిచేయడానికి ఉద్దేశించబడినవి. కానీ రాను రాను అవి సాంస్కృతిక అంశాలుగా బలమైన కట్టుబాట్లుగా అనుల్లంఘనీయమైనవిగా తయారయ్యాయి. జీవితం కంటే జీవితం కోసం తయారు చేసుకున్న కట్టుబాట్లు సంస్కృతి పేరుతో ఆధిపత్యం సాధించాయి. ఇది ఎంతవరకు వచ్చింది అంటే జీవితం కంటే సంస్కృతి గొప్పది ఉన్నతమైనది దానికోసం ప్రాణాలైనా ఇచ్చే అంత ఉత్కృష్టమైనది అన్న కృతక విలువను ఆపాదించుకున్నది.

ఈ నేపథ్యంలోనే పెద్ద ల అభీ ష్టానికి వ్యతిరేకమైన ప్రేమికులు కుటుంబ పరువు ప్రతిష్టలు మంటగలిపారన్న నెపంతో అత్యంత హేయంగా పాచవికంగా సామూహిక దాడులకు గురికావడం పారిశ్రామిక యుగం కాదు కదా సాంకేతిక యుగంలో కూడా ముఖ్యంగా గ్రామీణ వ్యవస్థ లో నిత్య కృత్యంగా మనం చూస్తూ ఉంటాం. యువతి యువకుల వైయక్తిక మానసిక భౌతిక అవసరాలు సంబంధిత కుటుంబానికి సమాజానికి చేటు కలిగిస్తాయి అన్న అనాగరిక ఆశాస్త్రీయ ఆరోపణలతో సదరు వ్యక్తుల

మానప్రాణాలకు ముప్పు వాటిల్లేలా క్రియాత్మకంగా వ్యవహరించడాన్ని ప్రజాస్వామ్యవాదులు ప్రగతి సేవలు మానవ హక్కుల గురించి మాట్లాడే మానవతావాదులు జీర్ణించుకోలేని చేదు సత్యం.

**.... పెళ్లంటే మనసు శరీరం**

**చేతిలో చేయి వేసుకొని**

**నడవడం కదా అనుకుందేమో**

**ఆమె మైదానం వైపు వెళ్ళింది**

**మర్యాదస్తులంతా రాళ్లు విసిరారు**

**పెడరెక్కలు విరిచి రచ్చబండకు కట్టేశారు**

ఇంతమంది పరువు ఆమె అవయవంలో దాగుందా? (వేకువ పిట్ట పుట 43)అని కవిత్రి నిగ్గు తీసి అడుగుతుంది.

ఈ మూర్ఖత్వం నుంచి ఆటవికతను గ్రామాన్ని సమాజాన్ని సంస్కరించే దిశగా సాంస్కృతిక సామాజిక రంగాలలో సాహిత్యం ఇతర కళలని శక్తిమంతమైన మాధ్యమాలుగా మలుచుకుని మేధావులు కళాకారులు ఇంకా సంస్కరణోద్యమాలు చేయాల్సి రావడం దురదృష్టకరం. ఆదిమ దశ నుంచి ఆధునికత వైపుకు ఇన్ని శతాబ్దాల మనిషి ప్రయాణంలో కూడా మానవ హక్కుల ఉల్లంఘన లో ఇంత అనాగరికంగా అమాయకత్వంగా కుటుంబ గ్రామీణ వ్యవస్థల ఆధ్వర్యంలో జరగడం ప్రతి మానవతావాది ముక్కు మీద వేలు వేసుకునే టట్టు చేస్తుంది.

ఈ నేపథ్యంలో ఈ అకృత్యాలకు సమాంతరంగా కుటుంబ సామాజిక వ్యవస్థలకు మార్గదర్శనం చేయాల్సిన పరిస్థితి ఉన్నది దీనికి విరుగుడుగా చట్టాలలో సవరణ తీసుకువచ్చినంత మాత్రాన సరిపోదు ఆర్థిక సాంస్కృతిక సామాజిక రంగాలలో పెద్ద ఎత్తున మార్పులను మార్పులకు దోహదపడే కార్యాచరణను మేధావులు తల పెట్టాల్సి ఉంది ఈ అవిశ్రాంత మానవ హక్కుల పోరాటంలో భాగంగానే బూజుపట్టిన భావాల దుమ్ము దులప రచనలు రావడం ముదావహం.

ఈ నేపథ్యంలోనే డా .చల్లపల్లి స్వరూప రాణి రాసిన వేకువ పిట్ట కవితా సంపుటిని మనం చూడవచ్చు. మానవ హక్కుల ఉల్లంఘనఅంటే పీడితుల హక్కులను ఉల్లంఘించడం అని అర్థం చేసుకోవాల్సి ఉంటుంది ఇక్కడ దేశంలో దళితులు అత్యంత పీడతలు కాబట్టి దళిత సాహిత్యం వీరి హక్కుల రక్షణ కోసం నిరంతరం అవిశ్రాంత పోరాటం చేస్తూనే ఉంది ఇది ఎక్కడ దాకా అంటే సాంస్కృతికంగా ఆర్థికంగా రాజకీయంగా సామాజికంగా సమానత్వం సిద్ధించేదాకా అని అర్థమవుతుంది. ఈ నేపథ్యంతో సమకాలీన దళిత సాహిత్యం అవిశ్రాంత పోరాటం చేస్తూనే ఉంటుంది.

**ఆధార గ్రంథాలు:**


1. వేకువ పిట్ట 20018 భీమ్ భూమి ప్రచురణ విజయవాడ -డాక్టర్ చర్లపల్లి స్వరూప రాణి.
2. ఆధునిక సాహిత్య విమర్శ సూత్రం 2002 విశాలాంధ్ర ప్రచురణలు హైదరాబాదు - ఆచార్య కొలకలూరి ఇనాక్
3. ఒక వస్తువు భిన్న సందర్భాలు 2005 జాస్మిన్ ప్రచురణలు ఆచంట -డాక్టర్ పోలుమాటి అన్నవరం సత్యనారాయణ.
4. ముసి భాస 20016 బేతాళ పబ్లికేషన్స్ విజయవాడ - డాక్టర్ జివి రత్నాకర్.


*******

# 87. అన్నమయ్య సంకీర్తనలు - సామాజిక స్పృహ

**మరాటి నర్సింహులు**

తెలుగు సహాయాచార్యులు,

ప్రభుత్వ డిగ్రీ కళాశాల, శేరిలింగంపల్లి,

రంగారెడ్డి జిల్లా, తెలంగాణ రాష్ట్రం.

చరవాణి: 9030057994

పదకవితా పితామహుడిగా సాహిత్య సంగీత కళాప్రపంచంలో ప్రసిద్ధి పొందిన శ్రీ తాళ్లపాక అన్నమాచార్యులు(1408–1503)తెలుగులో మొదటి వాగ్గేయకారుడు.శ్రీ వెంకటేశ్వర స్వామికి భక్తి పరాయణంగా వేలాది కీర్తనలను రచించారు.ఆత్మప్రభోదాలు,ఆత్మానుభవాలు,స్వీయానుభూతులు అన్నమయ్య రచనల్లో కనిపిస్తాయి.ఆయన పాటలలో శ్రీ వెంకటేశ్వర స్వామిని కీర్తించదంతో పాటు భక్తి పథాన్నే కాకుండా, ఆధ్యాత్మికత, తత్త్వికత, మానవత అణువణువునా కనిపిస్తుంది.సామాజిక శాస్త్రవేత్తల దృష్టిలో భక్తి సామాజికాంశం మాత్రమే.

అన్నమయ్య కేవలం భక్తి, కర్మ మార్గాలను మాత్రమే బోధించలేదు. సమాజంలో ధర్మాన్ని, మానవతని స్థాపించడానికి, సంఘికచైతన్యం కలిగించడానికి కూడా కీర్తనలు రచించాడు. తనకు పరిచయమైన గ్రామీణ వాతావరణాన్ని ప్రజల ఆచార వ్యవహారాలను ప్రజల దురాశ దుర్బుద్ధులను చక్కగా వివరించి కనువిప్పు కలిగించాడు.

**చేతులార చేసేటి చేకొన్న కర్మానకు**

**ఘాతల కర్తగా నంటే కట్టుపడదు...**

అనడంలో మానవుడు దుర్మార్గాలు చేస్తూ భగవంతుని విధివిలాసం అని అతనిపై భారం వెయ్యడం అవివేకమని సూచించాడు. దుర్మార్గుడ్ని, మూర్ఖుడ్ని మార్చడం చాలా కష్టమని వివరించే ఈ పదాల్ని గమనించవచ్చు.

**భారమైన వేపమాను పాలుపోసి పెంచినాను**

**తీరని చేదేగాక తియ్యనుండేనా............**

అన్నమయ్య జానపద కవిలాగా ప్రకృతిని బాగా పరిశీలించాడు. ప్రకృతి, వైద్యం, పక్షులు, జంతువులు గురించి పిల్లల ఆటలు, వ్యవసాయాది వృత్తుల గురించి ప్రస్తావించాడు. వృత్తి పనులవారి జీవన విధానాన్ని, అనుభవాల్ని తెలిపాడు. అన్నమయ్య కులబేధాలను నిరసించాడు. బ్రహ్మమొక్కటే పరబ్రహ్మమొక్కటే అనే కీర్తనలో బ్రాహ్మణుడూ, చండాలుడూ అంతా సమానులే అని బోధించాడు.

**కలవు మతములు పెక్కు కర్మభేదములగుచు**

**కలవెల్ల నీ యందె కల్పితములే**

**కలరుదేవతలు బహుగతుల మహిమలమెరియ**

**అలరివారెల్ల నీయంగభేదములే....**

అని సమైక్యత చాటాడు. ఆనాటి సమాజంలో తాను చూసి భరించలేక పోయిన అన్యాయాలను అనేక పదాలలో గుచ్చి గుచ్చి వర్ణించారు అన్నమయ్య.

ఉదాహరణకు:

**దేహ మిచ్చినవాని దివిరి చంపెడువారు**

**ద్రోహి కాక, నేడు దొరయట...**

**తోడ బుట్టిన వాని తొడని చంపెడివారు**

**చూడదుష్టుడు గాక సుకృతియట...**

అని తల్లిదండ్రులను, అన్నదమ్ములను చంపి రాజులు ఒకరి తరువాత ఒకరు రాజులవుతున్నారని విమర్శిస్తారు. మరొక పదంలో దండయాత్రల సందర్భంగా మహమ్మదీయ మతానికి చెందిన రాజులు ఆయా గ్రామాలలోని పట్టణాలలోని ప్రజలపై చేసిన దుష్కృత్యాలను సుదీర్ఘంగా వేదనతో కరుణరస భరితంగా వర్ణిస్తారు. అయితే ఇటువంటి దుష్కృత్యాలకు మతభేదం ఏది లేదని చూపిస్తూ సమాజమంతట జరుగుతున్న అవినీతిపరమైన ప్రవర్తనలకు మరొక పద్యంలో ఇలా వర్ణిస్తారాయన.

**అన్నలు, చెల్లెండ్రు, ఆండ్లుమగలయిరి**

**వన్నెచెడి యతులు ధనవంతులయిరి**

**ఇన్నియును చేసితివి ఇంకనైనా నీకు**

**కన్నీరు రాదుగా కలికాలమా.....**

అని వావివరుసలు లేని వివాహాలు, సన్యాసం అనేపేరుతో ధనం సంపాదించుకోవడం మొదలైన దృశ్యాలన్నిటిని వేదనతో వర్ణిస్తాడు అన్నమయ్య.

**ఏ కులజుడయిననేమి ఎవ్వడైనానేమి**

**ఆకడన అతడే హరినెరిగిన వాడు**

అని స్పష్టంగా హరినెరిగినవాడు ఏకులజుడైన గొప్పవాడేనని కుండబ్రద్దలు కొట్టినట్లు ప్రకటిస్తాడు అన్నమయ్య. హరిభక్తుడయితే ఎవ్వరితో సహవాసం అయినా తనకిష్టమేనని చెబుతూ...**"సహజ వైష్ణవాచార వర్తనుల సహవాసమే మా సంధ్య"** అనికూడా అస్పృశ్యత మొదలైన ఆచారాలను పాటించి ఎద్దేవా చేసే వారికి సమాధానంగా చెప్తాడు. అన్నమయ్య కృతుల్లో వీరబ్రహ్మం గారి లాంటి తరువాత తరపు వాగ్గేయకారుల తత్త్వాలలోని మార్మికధోరణికి పునాదులు కన్పిస్తాయి.

అన్నమయ్య సమతావాది. ఆనాటి గొప్ప సంస్కర్తగా కనిపిస్తాడు. స్త్రీ పురుషులు ఇద్దరూ ఒకటేనని, భేదభావం తగదని హితవు పలికాడు.

**పొలతులు జీవులే పురుషులు జీవులే**

**తలప భావభేదములే కాని**

**బలిమి స్వతంత్రము పరతంత్రమొకరికి**

**ఎలమినిందులో చెల్లె హీనాధికములే**

నిర్మొహమాటంగా సూటిగా ప్రబోధం చేసే ఆయన ఓ సంకీర్తనలో...

**ఓపితే పుణ్యము చేయుము**

**ఒపకుంటే ఊరకుండుము**

**పాపము సేయకుంటే**

**పదివేలు జీవుడా..** అని అంటారు.

అన్నమాచార్యులలోని ఈ సంఘసంస్కరణ దృష్టి ఆయన అనుసరించిన విశిష్టాద్వైతి వేదాంత సంప్రదాయాలలో నుంచి కూడా లభించిందని చెప్పవచ్చు. ఏదేమైనా అన్నమాచార్యులు వారి కృతులలో వ్యక్తం అయిన భావాలే కాకుండా వాటిని వ్యక్తం చేసేందుకు తను ఎన్నుకున్న భాష, శైలి, పలుకుబడులు, జాతీయాలు, సామెతలు జన సమాన్యానికి దగ్గరగా ఉండటం.**"చాంగుబళా జాజర వురే"** వంటి విశేషణాలు వినూత్నంగా ఉండి పాడడానికి ఊపునివ్వడం లాంటి ప్రజా కవిత్వలక్షణాలు కూడా ఆయన సంఘసంస్కరణ దృష్టిలో భాగమని చెప్పవచ్చు.

**"ఏది తుద? యెన్నడు ముగుసును?**

**ఆదికి ననాది హరిమాయ**

**సాధించి సుజ్ఞానియైతే**

**యీదెస వెదికిన ఇహమే పరము"**

లాంటి పంక్తులు అన్నమయ్య కీర్తనల్లో కోకొల్లలు.ఈ విధంగా తెలుగు వారి దైనందిన జీవితంలో అన్నమయ్య పాటలు పెనవేసుకపోయినవి.అలాగే అన్నమయ్య స్పష్టంగా తెలియపరిచే ఆనాటి రాజకీయ సామాజిక ఆర్థిక మత పరిస్థితులనేకం తన కీర్తనల్లో పొందుపరిచాడు. కాలము విశేషమో లోకము గతియో సన్మార్గంబుల తేలువదలె సౌజన్యము కిందై పోయినది.

**"కాలము కాలము కాదు,**

**కపటాలే తరుచాయో,**

**కతలాయె చెప్పనేడు కలికాల మహిమ"**

అని ఆయన వగచిన సందర్భాలెన్నో వున్నవి. లంచాలు గురించీ, మారుముద్రలు గురించీ, రాజకీయంగా ఉపప్లవాలు జరిగినప్పుడు దేశంలో జరిగిన ఘోరాల్ని, అంగలార్చే కామికుల అంగభంగపు దోపుల్నీ, పాలకుల్లో కుఋచబద్దులయిన వారి దుర్మార్గాన్ని, ఇంకా రాణి వాసముల రహస్యాల్ని చాటుచేయకుండా నిర్భయంగా బయట పెట్టిన యీ పదకవితాపితామహుని సమాజిక స్పృహ గల్గిన నవసమాజపు కవిగా భావించవచ్చు. ఈ జీవితపు తోలుబొమ్మలాటల్ని పదకవితలనే తెరలమీద అనేక రతుల్లోకట్టి ప్రత్యక్ష పరిచిన నిపుణుడు అన్నమయ్య.

**"పావనములు హరిభక్తివి**

**భావనములు సర్వమంత్ర రహస్యాద్భావనములు గాయక నిక**

**రావనములు తాళ్లపాక యన్నమపదముల్"**

అని ప్రశంస పొందిన ఈ సంకీర్తనాచార్యుడు "ఆడిన మాటెల్లనమృత కావ్యము, పాడినపాటెల్ల పరమగానము" అనడం స్వభవోక్తి అవుతుందే తప్ప అతిశయోక్తి ఏ మాత్రం కాదు.

*******

# 88. స్త్రీవాద కవిత్వం- సామాజిక స్పృహ

**పెరుమాండ్ల శివ కళ్యాణి**

తెలుగు ఉపన్యాసకురాలు

తెలంగాణ గిరిజన సంక్షేమ గురుకుల బాలికల డిగ్రీ కళాశాల,

ములుగు.

చరవాణి: 8978905817

Email: saishivani1978@gmail.com

**స్త్రీవాద కవిత్వం పరిచయం:-**

తరాలు మారిన, తలరాతల మారినా ఏది ఏమైనా సరే నేటి సమాజంలో స్త్రీవాద కవిత్వం ఒక సామాజిక స్పృహను తీసుకువచ్చి అందరిని కూడా ఆశ్చర్య చకితులను చేసింది అని అనడంలో ఏమాత్రం కూడా సందేహించవలసిన అవసరం లేదని నొక్కి వక్కాణించి చెప్పవచ్చును.

ప్రాచీన కాలం నుండి నేటి ఆధునిక కాలం వరకు కూడా స్త్రీలకు సంబంధించిన అనేక రకాల స్త్రీవాద కవిత్వం మనకు నేడు కనబడుతున్నది. స్త్రీ అంటే సృష్టి స్థితి లయకారిణి అంటూ ఎన్నో విధాల మరెన్నో విధాలుగా ఆమెను గురించి చెప్పడం జరుగుతుంది.

స్త్రీ వంటింటి కుందేలు అన్న పాత చింతకాయ పచ్చడి లాంటి మాటలని తుంగలో తొక్కుతూ........

నేడు ప్రపంచ దేశాల్లో పురుషులతో పాటుగా సమానంగా అన్నిరంగాల్లో దూసుకెళ్తున్న మగువలకు సలాం చేస్తున్నాను.

**స్త్రీవాద కవిత్వం- సమాజంలో మార్పు:**

స్త్రీవాద కవిత్వం ద్వారా నేడు సమాజంలో అనేక మార్పులు అనేవి చోటు చేసుకున్నవి. అనేకమంది తమ రచనల ద్వారా సమాజంలో స్త్రీలు ఎదుర్కొంటున్న అవమానములను, వారికి జరుగుతున్న అన్యాయములను, వారికి సమాజంలో ఉన్న వారి యొక్క స్థానం ఏమిటి అన్న విషయాలను తమ కవిత్వాల ద్వారా తెలియపరచి స్త్రీమూర్తులందరిలో సామాజిక స్పృహను కల్పించారు. వీరికి తమ రచనల ద్వారా ఆలోచన విధానాన్ని అలవరిచి ఆ ఆలోచన ద్వారా సమాజంలో నా స్థానం ఏమిటి మరి నాలాగే ఇంకా ఎంతమంది ఉన్నారు వారి పరిస్థితి ఏమిటి అన్న ధోరణి వారిలో కలిగించిన ప్రతి స్త్రీవాద కవిత్వం మన అందరికీ ఆదర్శనీయమే.

**కందుకూరి వారి రచనలు పరిచయం:-**

కందుకూరి వీరేశలింగం పంతులు గారి రచనలు చూసినట్టు అయితే అందులో మనకు స్త్రీ విముక్తికి మార్గం వేయబడిన రచనలు కనబడతాయి.

1873వ సంవత్సరంలో వీరేశలింగం పంతులుగారు స్త్రీవిద్యను గురించి శ్లాఘిస్తూ.. ముద్దియ విద్దియ పెద్ద కార్యమనుట ప్రసిద్ధము అనే వ్యాసాన్ని రాసి స్త్రీవిద్యకు అనుకూలంగా తన వాదాన్ని బలంగా వినిపించినాడు. అంతేకాదు 'స్త్రీ నీతి దీపిక' అనే శతకంలో

**"విద్య వలన జ్ఞానంబు వెలయుగాన**

**నవని 'నిదిమంచి' 'యిది చెడ్డ' యనుచు దెలియ**

**బాలురును బోలెదప్పకు బాలికలును**

**విద్యనేర్వంగ వలయను హృద్యముగను"**

ఇలా విద్యకు ఆడ, మగ అనే తేడాలు లేవని ఒక బంగారు బాట చూపి సమాజంలో అసమానతలను తొలగించిన వారు కందుకూరి వీరేశలింగం పంతులుగారు. తరువాత వారి రచనలను మనం పరిశీలిస్తే చలంగారి రచనలలో మనకు ముఖ్యంగా స్త్రీకి స్వాతంత్ర్యం, వివాహ స్వేచ్ఛ కావాలని తన రచనల ద్వారా తెలిపాడు. అనేకమంది స్త్రీవాద రచనలు చేసేవారు కూడా ముందుగా స్త్రీలకు కావలసినది స్వేచ్ఛ, బానిసత్వపు సంకెళ్లను తెంచుకొని తాను ఎప్పుడైతే బందిఖానా నుండి బయటికి వస్తుందో అప్పుడు మాత్రమే ఆమె అన్ని విధాల ఆలోచించే శక్తిని పొందగలదు అని పేర్కొన్నారు. 1975-85 కాలాన్ని అంతము కూడా ఐక్యరాజ్యసమితి "అంతర్జాతీయ మహిళా దశాబ్దంగా ప్రకటించింది. పాశ్యత దేశాలలోని "ఫెమినిజం" తెలుగులో స్త్రీవాదంగా మారింది. ఆడది అంటే ఆడి పాడే బొమ్మ కాదు. ఆదిపరాశక్తిలా, అపర కాళికలా మారగల శక్తి స్వరూపిణి అన్న ఆలోచనలను సమాజంలో స్త్రీవాద రచనల ద్వారా మొదలై ఆడవారిని తక్కువ అంచనా వేసే ప్రతి ఒక్కరికి ఒక సవాల్ లా మారి వారిలో భయాందోళనలను కలిగించాయి. 1980 నుంచి స్త్రీవాద కవిత్వం విస్తృతంగా రావడం మొదలైంది. 1990లో "త్రిపురనేని శ్రీనివాస్" "గురి చూసి పాడే పాట" అనే సంకలనం ప్రచురించి స్త్రీవాద కవితలు అని పేర్కొన్నాడు.

**స్త్రీవాద రచనలు, వాని వివరాలు:-**

స్త్రీవాద కవిత్వం పురుషులు రాసే దానికన్నా స్త్రీలు రాస్తే ఇంకా ఎంత బాగుంటుంది.. ఎందుకనగా వారు తాము అనుభవించిన వాటిని స్వయంగా తమ రచనల ద్వారా అందరికీ తెలియజేస్తారు. అన్న ఆలోచన ధోరణి మొదలై ఈ నేపథ్యంలో "అస్మిత" వారు 1993, అక్టోబర్ లో "నీలిమేఘాలు" అనే పెద్ద స్త్రీవాద కవితాసంకలనం వెలువరించారు.

అయితే స్త్రీవాద కవిత్వంలో కొందరి కవితలు షాక్ ట్రీట్మెంట్ ని ఇచ్చాయని చెప్పవచ్చును. స్త్రీవాదంలోని ముఖ్య అంశాలను చూసినట్లయితే

1. పురుషాధిక్యత అనేది ఉండకూడదు.
2. అన్ని రంగాల్లో కూడా స్త్రీకి సమాన హక్కు, స్వేచ్ఛ ఉండాలి.
3. శారీరక ఇబ్బందులకి, ఆర్థిక ఇబ్బందులకి వివాహ బంధాలు అనేవి కారణం కాకూడదు.

స్త్రీ వాద కవితల్ని చూసినట్టయితే

**"అందమైన దోపిడికి**

**పవిత్రమైన హింసకూ**

**న్యాయమైన దాస్యానికీ**

**బలైపోయిన నేను**

**భారత స్త్రీని!"**

అని పేర్కొన్న ఓల్గాగారు భారత స్త్రీ దుస్థితిని ఆమె ఎదుర్కొంటున్న అవమానాలను మనకు తెలియపరచి ప్రతి ఒక స్త్రీకి ఆదర్శమైనారు.

"బందిపోట్లు" అనే కవితను రాసి సంచలనం సృష్టించిన సావిత్రి గారు

**"పాఠం ఒప్ప చెప్పకపోతే పెళ్లి చేస్తానని'**

**పంతులుగారన్నప్పుడే భయంమేసింది.**

**ఆఫీసులో నా మొగుడున్నాడు!**

**అవసరమొచ్చినా సెలవివ్వడని**

**అన్నయ్య అన్నప్పుడే అనుమామేసింది.**

**వాడికేం? మగమహారాజని**

**ఆడా మగా వాగినప్పుడే అర్థమైపోయింది.**

**"పెళ్లంటే "పెద్ద శిక్ష" అని**

**మొగుడంటే స్వేచ్ఛా భక్షకుడని**

**మేం పాలిచ్చి పెంచిన జనంలో**

**సగమే మమ్మల్ని విభజించి పాలిస్తోందని"**

ఎంతటి చక్కని రచన అండి. పండితులను సైతం ఆలోచింపజేసే రచన. అడుగడుగునా స్త్రీకి జరుగుతున్న, స్త్రీ ఎదుర్కొంటున్న బాధలను మన అందరికీ కూడా వివరిస్తున్న చక్కని కవిత్వ రచన అని తెలుపవచ్చును.

మరొక స్త్రీ మూర్తి తన రచన ద్వారా

**"నేనొక స్త్రీని**

**నేనొక నిషిద్ధ జీవిని**

**మొన్నటిదాకా నా నవ్వు నిషిద్ధం**

**నిన్న నా చదువు నిషిద్ధం**

**నేడు నా బ్రతుకు కూడా నిషిద్ధం"** అని పేర్కొన్నారు.

అంటే స్త్రీగా పుట్టిన పాపానికి ఆవిడకు మనిషిగా జీవించే స్వేచ్ఛగానీ, నవ్వే స్వేచ్ఛగానీ, చదివే స్వేచ్ఛగానీ, చిట్టచివరికి బ్రతికే స్వేచ్ఛగానీ లేదని చదివే ప్రతి ఒక్కరికి కూడా నేడు అర్థమవుతుందని తెలుపవచ్చును.

**స్త్రీవాద కవిత్వం- అమ్మ గొప్పతనం:-**

స్త్రీవాద కవిత్వాలలో అమ్మ ప్రేమను గురించి గొప్పగా చెప్పిన రచనలు కూడా మనకు కనబడుతున్నాయి.

బి. పద్మావతి "గుక్క పట్టిన బాల్యంలో" ఇలా అంటారు.

**"నవ్వే నక్షత్రంలా అమ్మ కావాలి.**

**లాలించే జీవనది అమ్మ కావాలి.**

**అమ్మ ఆకాశపు గుండెల మీద ఉయ్యాలలూగాలి**

**అమ్మ కావాలి- నాన్న చేత తన్నులు తినని అమ్మ కావాలి**

**సుడిగుండంలా అమ్మ ఏడుపు ముంచెత్తని సుఖనిద్ర రాత్రి కావాలి"**

అని పేర్కొన్నారు. అమ్మ ప్రేమకు ఇది నిదర్శనం. "నాన్న చేత తన్నులు తినని అమ్మ, సుడిగుండంలో అమ్మ ఏడుపు ముంచెత్తని సుఖనిద్ర కావాలి" అనడంలో ఇక్కడ పురుషుడి దగ్గర స్త్రీలు పడుతున్న బానిసత్వపు జీవితం ఇక్కడ కనబడుతుంది.

అలాగే జయప్రభ గారు స్త్రీవాద కవయిత్రుల్లో ప్రసిద్ధురాలు. స్త్రీవాద కవిత సంపుటాలు రాశారు. "పైటకొంగును తగలేయ్యాలి" అంటూ ఆవిడ రాసిన కవిత అప్పట్లో ఒక ప్రభంజనం సృష్టించింది.

స్త్రీవాద కవిత్వంలో 4 ప్రధాన ధోరణులను డా. కాత్యాయని విద్మహేగారు పేర్కొనటం జరిగింది. అవి:

1. స్త్రీ ఉనికికి సంబంధించిన కవిత్వం.
2. కుటుంబ సంబంధాల్లో తమ స్థానాన్ని గురించిన కవిత్వం.
3. కుటుంబం నుంచి బయటకు వచ్చినప్పుడు తనకు సంబంధించిన సమాజంలో వచ్చే స్పందనను చిత్రించే కవిత్వం.
4. సామాజిక పరిణామాలు, సామాజిక సమూహాలను తను చూసే పద్ధతికి సంబంధించిన కవిత్వం.

వీనిలోని ముఖ్య విషయాలను కనుక మనము ముఖ్యంగా గమనిస్తే స్త్రీ ఆలోచన శక్తికి మొదటి ప్రాధాన్యత ఇవ్వాలని మనకు కనబడుతుంది.

**ముగింపు:-**

ఇంకా ఎన్. గోపి, కీ.శే. ఎండ్లూరి సుధాకర్, భగ్వాన్ మొదలైన కవులు కూడా స్త్రీవాద కవితలు రాశారు.

ఇంకా ప్రస్తుతం నేటి సమాజంలో స్త్రీవాద కవితలు రాసే ప్రతి ఒక్కరూ కూడా ఈనాటికీ కూడా స్త్రీలపై జరుగుతున్న అన్యాయాన్ని అంతము చేయవలెను అన్న విధముగా తమ రచనలు చేయవలెను.

**ఆధార గ్రంథాలు- గ్రంథకర్తలు:-**

1. వెలుగు బాట- వీరేశలింగం, కందుకూరి వీరేశలింగం 1848-1919 (రచయిత)- ఆవంచ సత్యనారాయణ పేజి. నెం. -29, 42
2. డాక్టర్. దా.నా.శాస్త్రి- తెలుగు సాహిత్య చరిత్ర. పేజి. నెం. -554, 555, 556, 558.
3. తెలుగులో కవిత్యోద్యమాలు - తెలుగు అకాడమీ- హైదరాబాద్ పేజి. నెం.186,189.

*******

# 89.నారేయణ, వేమన యోగుల భావ సారూప్యత: తులనాత్మక అధ్యయనం

**హెచ్. గంగ రాజు,**

తెలుగు ఉపన్యాసకులు,

ప్రభుత్వ జూనియర్ కళాశాల,

పాతూరు, అనంతపురం.

7799211900.

h.gangaraju@yahoo.com

**కీలక పదాలు**

యోగి నారేయణ, వేమన, నైతిక విలువలు, కుత్సితుడు, ఎదుటివారి సొమ్ములు, పంటచేను, కలిమి గలవారు, చిత్తశుద్ధి.

**వ్యాస సంగ్రహం**

ఏక మనస్కులు ఎక్కడున్నా కానీ, ఒక్క తీరుగా ప్రవర్తిస్తారు. జీవన పోరాటంలో లోతుపాతులు, లోక సంసార పోకడ ఈ రీతిగా సాగుతున్నదని రోసి, సన్యసించినవారు కొందరు. అందులో యోగి వేమన, కైవారం నారేయణలు ముఖ్యులు. వీరు ఇరువురు, మనషుల ప్రవర్తనలోని అనేక పార్శ్వాలను తడిమి, సమాజానికి హిత సూచనలు చేసారు. వారి సారూప్య భావజాలం ఈ వ్యాసం వింగడిస్తుంది. వీరి రచనలను అధ్యయనం చేయుట, విలువలను బోధించుట, జన జీవన స్రవంతిలో నేటి కాలానికి అవసరం.

**ప్రస్తావన**

మనిషి బుద్ధి జీవి, సంఘజీవి. మనిషికి బుద్ధి పెరిగేకొద్దీ సూక్ష్మ పరిశీలన, తీవ్ర స్పందన ఎక్కువవుతోంది. ఈ నేపథ్యంలో ఆలోచనా విధానంలో మనుషుల మధ్య వస్తున్న వ్యత్యాసాలు, వారి మధ్య అంతరం పెరగటానికి కారణం అవుతున్నాయి.

భారతదేశ సాహిత్యం మనిషి హితాన్ని అభిలషిస్తుంది. ఆనందమే దాని పరమావధి. 21వ శతాబ్దపు ఉరుకుల పరుగుల జీవితంలో మనిషి తనను తాను మరచిపోతున్నాడు. ఎనిమిది గంటల నిద్ర, ఎనిమిది గంటల ఉద్యోగం, మిగిలిన సమయం ప్రయాణాలు, దూరదర్శినులు, చరవాణులతో గడచిపోతోంది. ఆత్మపరిశీలన చేసుకుంటే తనదైన జీవితం కోసం మనిషి తనతో తాను లేడు. నేటి మనిషి ఆర్థికపరమైన జీవితంలో, అర్థవంతమైన జీవితాన్ని కోల్పోతున్నాడు. మనిషికి ఆధ్యాత్మికత తోడైతే, అతని మనుగడ సార్థక మవుతుంది.

మనుషులకు లోకజ్ఞత అవసరం. అది నైతికమైనది, ధర్మ బద్ధమైనది, ఆచరణ యోగ్యమైనది అయితే మానవ మనుగడ ఎంతో ఉన్నతిని సంతరించుకుంటుంది. సమాజానికి హితమైన విషయాలు ఎన్నిటినో రెండున్నర శతాబ్దాల క్రితమే మనకు శ్రీ యోగి నారేయణ తాతయ్య, యోగి వేమనలు తెలిపారు. వాటిని నేటి సమాజం ఆచరిస్తే మనుషుల మధ్య అంతరాలు తగ్గి, వసుధైక కుటుంబంగా ప్రపంచం భాసిస్తుంది. అందుకు గాను, పాతవైనను కొత్తగా చెప్పటానికి ఎన్నో విషయాలు తాతయ్య రాసిన గ్రంథాలలో, వేమన పద్యాలలో ఉన్నాయి. వాటిని అధ్యయనం చేయటానికిగాను శ్రీ యోగి నారేయణ తాతగారి రచించిన *నాదబ్రహ్మానంద నారేయణ శతకము, వేమన శతకము*లను తులనాత్మక అధ్యయనానికి గ్రహించడం జరిగింది.

**యోగి నారేయణ:** కర్నాటకలోని చిన్నబళాపురం జిల్లా, చింతామణి తాలూకా, కైవారం గ్రామంలో క్రీ.శ. 1726 లో జన్మించిన యోగి నారేయణ, తాతయ్యగా ప్రసిద్ధులు. ఆంధ్ర, కర్నాటక, తమిళనాడు సరిహద్దు ప్రాంతాలలో 'ఏక దంతా మూషక వాహన

వేదమునిగణ వందితా' అని గణపతి ప్రార్థనతోనే భజనలు ప్రారంభం అవుతాయి. అంతటి ఖ్యాతి తాతయ్యకు ఉంది. '1. *నాదబ్రహ్మానంద నారేయణ శతకము*, 2. *అమర నారేయణ శతకము*, 3. *శ్రీ అమర నారేయణ వేదాంత సారావళి కీర్తనలు*, 4. *కాలజ్ఞానము* వంటి రచనలు చేసారు. తాతయ్య జీవిత అనుభవాలే, ఆయన కీర్తనల సారముగా కనిపిస్తాయి.

**యోగి వేమన**

వేమన గురించి ఆంధ్ర దేశానికే కాక, తమిళ, కర్నాటక ప్రాంతాలకు కూడా చిరపరిచితం. సి.పి. బ్రౌన్ లాంటి వారి వలన సాహిత్య ప్రపంచానికే పరిచితుడు.

**యోగి నారేయణ, వేమనల భావ సారూప్యత**

యోగి నారేయణ సంసారిక జీవన రోత వలనా, వేమన తనచుట్టూ ఉన్న సమాజంలో నిండిన కుళ్ళు వలన సన్యసించారు. యోగ సాధన చేసారు. చరాచర సృష్టిలో తమను తాము తెలుసుకున్నారు. లోకాన్ని సూక్ష్మ పరిశీలన చేసారు. తమ అనుభూతిని చెప్పారు.

**నారేయణ, వేమనల నైతిక విలువల బోధ**

మనిషిని మహోన్నతునిగా తీర్చునది అతని నడత. మనిషికి మోక్షాన్ని, దైవత్వాన్ని ఇచ్చునది అతని యౌగిక వర్తన. మోక్షం ఇహ లోకానికి సంబంధించినది కాకపోయినా, మనిషి తన పరమావధిగా మోక్షాన్ని అభిలషిస్తాడు. ఆ విధమైన మోక్షసాధనా దీక్షులై ఎంతో మంది పురాణ పురుషులు అయ్యారు. అర్వాచీన కాలంలో ప్రసిద్ధులైన శ్రీ పోతులూరి వీరబ్రహ్మం, ప్రజాకవి వేమన, సిద్ధయ్య, పోతులూరి ఈశ్వరమ్మ మొదలైనవారు తెలుగునాట ప్రసిద్ధులు. తెలుగువారు అయివుండి, రాష్ట్ర విభజనలో కర్నాటక ప్రాంతీయులు అయ్యారు యోగి నారేయణ.

గుణవంతునికి హిత సూచన

గతంలో ప్రతి గ్రామానికి కరణాలు ఉండటం సహజం. గ్రామానికి సంబంధించిన భూములు, ఆస్తుల వివరాల లెక్కలు గణించేవారు. వారితో వైరం మంచిది కాదు. దాని వలన మంచి కంటే చెడు జరుగుతుందని నారేయణ సూచించారు. అదే విధంగా వేరుకి పురుగు పడితే అది పైకి కనిపించదు, కానీ వేరుని కొంచెం కొంచెంగా తినేస్తూ ఒకనాటికి, మహా మహా వృక్షాలనే నేల కూల్చేయగలదు. పైకి చిన్నగా కనిపించే చీడ చెట్టంతా పాకి క్రమేణా ఆకులని, పువ్వులని, కాయలని నాశనం చేస్తుంది. అలాగే చెడు అలవాట్లు, దుర్బుద్ధులు ఉన్నవారి స్నేహం మన వ్యక్తిత్వాలని దెబ్బతీసి, ఒక నాటికి మనల్ని పతనావస్థ కి చేరుస్తుంది అని వేమన సూచిస్తారు.

| | |
|---|---|
| కరణము కంటైతే కాపులందరి చరచు | వేరు పురుగు చేరి వృక్షంబు చెరచు |
| ఇంతి చెడ్డదైతె యిల్లు చరచు | చీడ పురుగు చేరి చెట్టు చెరచు |
| కులహీన కుచితుండు కులమెల్ల చెరచురా | కుత్సితుండు చేరి గుణవంతు చెరచురా |
| నాద బ్రహ్మానంద నారేయణ కవి. | విశ్వదాభిరామ వినురవేమ |
| (నాద. పుట. 179) | (వేమన శతకం) |

**స్థానబల ప్రాముఖ్యం**

కరి, మకరి స్థానబలం వల్లనే వాటి గొప్పతనం గాని, తమ తమ నెలవుల దప్పిన భంగపాటుకు గురవుతాయని భాగవతం తెలుపుతుంది. అదే విధంగా యోగి నారేయణ స్థానబల ప్రాముఖ్యాన్ని సూచిస్తూ గూబ కాకులు వైరి వర్గాలు. పగటి పూట అవి ఒకే స్థానంలో నివసించలేవు. కానీ, రాత్రి వేళ ఉండగలవు. గూబ కాకుల వైరము సైతం సేదతీరే చీకటి ఒకటిగా బతుకనిస్తుంది. అలాగే, నీళ్ళలో ఉన్న చేప ఎంత దూరమైన చాలా తెలికగా పోగలదు. అదే చేప బయట మూరెడు దూరం వెళ్ళలేదు. తనలో అదే బలమే ఉన్నా కేవలం స్థాన సాన్నిధ్యం వలనే వాటి మనుగడ వ్యక్తమవుతందని వేమన తెలిపారు.

గూబకాకులక్యాల వైరవర్గము కలిగె
పగులు రాకూడదు రాత్రివ్యాళ
స్థానబలిమి కాని తనబలిమి లేదురా
నాద బ్రహ్మానంద నారేయణ కవి.
(నాద. పుట. 179)

నీళ్ళలోని మీను నిగిడి దూరము పాఱు
బయలు మూరెడైన బాఱలేదు
స్థానబలిమి కాని తన బల్మి కాదయా
విశ్వదాభిరామ వినురవేమ!
(వేమన శతకం)

**పరస్త్రీ వ్యామోహ వైముఖ్యం**

అనుకూలవతి, ప్రజావతి, పతివ్రత అయిన ఇల్లాలిని విడువకుండా, గృహస్థుడు మెలగాలి. అలా మెలగకుండా జార స్త్రీల వెంట తగిలి పోవువాడు వెర్రివాడు. మంచిగా పండిన పంటచేను వదలి, పంట కోసి, పరిగెలిడిచిన చేను వైపు పోవటంతో సమానమని నారేయణలు, వేమనలు తెలిపారు. నారేయణ పరకాంతల వలన చేటు చేసే వ్యాధులు కలుగుతాయని తెలిపారు.

పంటచేను విధము పణతి యింటను వుండి
వార కాంతల మీద వలపు యాల
చేతికాసు పోవును చేటువ్యాధి వచ్చురా
నాద బ్రహ్మానంద నారేయణ కవి.
(నాద, పుట. 179)

ఇంటియాలు విడిచి యిల జారకాంతల
వెంటఁ దిరుగువాఁడు వెఱ్ఱివాఁడు
పంటచేను విడిచి పరిగ యేరినయట్లు
విశ్వదాభిరామ వినర వేమ!
(వేమన శతకం)

**దేహమే దేవాలయం జీవుడే దేవుడు**

మనిషి చేసిన రాలూ రప్పలకు మహిమలు ఆపాదించి, మనిషిలోని, మానవత్వాన్ని త్యజిస్తున్న మనిషిని నారేయణ, వేమనలు నిలదీస్తారు. చట్టు బండల, రాళ్ళ పూజలు మాని, ఆత్మలో ప్రత్యక్షమై వెలిగే ప్రాణలింగాన్ని మనిషి గుర్తించాలంటారు. ఆత్మ శుద్ధి కలిగి పూజసేయకుంటే విలువేముందని ప్రశ్నిస్తారు.

ప్రాణలింగము తనలో ప్రత్యక్షమైయుండ
చరలింగపూజలు శాయన్యాల
చట్లు రాళ్ళు పూజ చాలింపవలేనయా
ఆత్మశుద్ధిలేని యాచార మదియేల

ఆశ పాశంబులు హతమయ్యెదనుకను
చిత్తమ్యాల నిలచు శివునిమీద
చిత్తశుద్ధిలేని శివపూజ యాలరా. నాద||

భాండశుద్ధి లేని పాకమేల?

చిత్తశుద్ధిలేని శివపూజ లేలరా?

(వేమన శతకం)

మనసు నిర్మలంగా లేకుండా దుర్బుద్ధితో చేసే అచారం ఎందుకు? వంట పాత్ర శుభ్రంగా లేని వంట ఎందుకు? అపనమ్మకంతో దూరాలోచనతో చేసే శివపూజ ఎందుకు అని వేమన అంటారు.

**సమాజంలో కలిమి కలుగుటే బలిమి**

సమాజంలో మనుషులు గౌరవంగా బతకటానికి, ఆర్థిక బలమే బలం. కులము, గోత్రము, చదువు, అందం అన్నీ ధనం వెనుకే అని నారేయణ, వేమనలు తెలిపారు.

కలిమి కలిగినవాడు కులమునకు మిండడు

కలిమి లేనివాడు కులముదిగుడు

యెల్ల కాలము కలిమి అదియాల వుండురా

నాద బ్రహ్మానంద నారేయణకవి (83)

కులము గలుగు వారు గోత్రంబు గల వారు

విద్య చేత విర్రవీగు వారు

పసిడి గల్గు వాని బానిస కొడుకులు

విశ్వదాభిరామ వినురవేమ.

కులం, గోత్రం, విద్య ఉండి ఎంత గర్వించేవారయినా డబ్బున్న వారికి దాసులే.

**తేరగా దొరికితే తియ్యన**

సమాజంలో ఉద్దరగా దొరికేది ఏదైనా, ఎంతవారికైనా దాన్ని పొందాలని అనిపిస్తుంది. అలాంటి బుద్ధి మానుకోవాలని నారేయణ, వేమనలు సూచిస్తారు.

గొల్లపల్లెలోన చల్ల కొల్లగవుండి

అడిగితే యివ్వరా యవ్వరైన

కలికి కృష్ణుండెంత కల్లవాడాయరా

(నాద. 102)

కృష్ణుడు చేసినది లీల అయినప్పటికి ఆయన్ను అడ్డంపెట్టుకుని, ఇతరుల సొమ్ముల మీద పడి తినేవారిని ఉద్దేశించి వేమన ఇలా అంటున్నారు. శ్రీ మహావిష్ణువు పాల సంద్రంలో పడుకుని ఉంటాడు; అయినా, ఆయన గొల్లవారి ఇళ్లల్లో పాలు, వెన్నలు దొంగిలించడం దేనికి? ఎదుటి వారి సొమ్ములు అంటే అందరికీ తీపే కదా.

**ముగింపు**

పామర జనానికి సులభగ్రాహ్యంగా లోకాధ్యయన విషయాలు తెలుపటం తాతయ్య, వేమనల ప్రత్యేకత. బుద్ధి చెప్పువాడు గుద్దితేనేమయా అనే రీతిగా కూడ కటువుగా చెప్పారు. మనుషుల చిత్తవృత్తిని, నైతిక, ఆధ్యాత్మిక, ధార్మిక చింతనల వైపు మళ్ళించే దిశగా బోధించిన తాతయ్య, వేమనల బోధలు నేటి సమాజానికి ఎంతో అవసరం.

*******

# వేమన సాహిత్యం- సామాజిక స్పృహ

**శ్రీమతి వేసిపోగు కళ్యాణి,**

పరిశోధన విద్యార్థిని,

సాహిత్య పీఠం, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం,

రాజమండ్రి

**ఉపోద్ఘాతము :**

వేమన కవి మాత్రమే కాదు. ఒక తత్వవేత్త, సామాజిక శాస్త్రవేత్త. సమానత్వాన్ని కోరుకున్నవాడు. సత్యాన్వేషి. సంఘ సంస్కర్త, గొప్ప మానవతావాది, సమాజకవి. విభిన్న సామాజిక పార్శ్వాలను తడిమిన తొలి తెలుగు కవి. సంఘజీవితం, మతం, జాఢ్యాలను, మూఢ విశ్వాసాలను నిర్మొహమాటంగా ఖండిరచి, కొత్త, విలువలను ప్రతిపాదించిన సామాజిక వేత్త. కవి సచ్ఛీలుడు వేమన. మతాతీత, కులాతీత మానవుడు. స్వచ్ఛమైన మానవీయ దృష్టి కలిగిన సమాజకవి. విప్లవోద్యమంలో వేగుచుక్క. విప్లవకవి, ప్రజాకవి, పామర కవి.

కొందరు 'భోగి' అని ..... కొందరు 'త్యాగి' అనీ.... మరికొందరు 'యోగి' అని అన్నారు. ఎందరో తిట్టుకవి అని .... మరికొందరు పుట్టకవి అని అన్నారు. కొందరు నారీ ద్వేషి అని... కొందరు బ్రాహ్మణ ద్వేషియనీ, కొందరు అల్పకులజుల అభిలాషి అన్నారు. కొందరు మహానుభావులు మాత్రం ఇతడు ''కవియే గాదు పొమ్మన్నారు'' కొందరు మాత్రమే 'ప్రజాకవి' అన్నారు. శ్రీశ్రీ, జాషువా, సినారె, వంటి వారు బహు కొద్ది మంది మాత్రమే 'విశ్వకవి', విప్లవ కవి అన్నారు.

కులమత కట్టుబాట్లకు, జాతి వివక్షతకు, సాంఘీక దురాచారాలకు, సనాతన చచ్చు సాంప్రదాయాలకు, బద్ధ శత్రువు వేమన.

వేమన ఆంధ్రులలో సాటిలేని వ్యక్తి, అతీంద్రియములైన తత్త్వములను తెలిసికొనవలెనను ఆశ, వాటిని అనుభవ పూర్వకముగా సాధించు సాహసము, తనకు తెలిసిన విషయములను నిర్భయముగా ప్రపంచానికి బోధించు ధైర్యము, దానికి సాధనమై యిరుప్రక్కల మఱుగులేని మంచి పదును గల చురకత్తి, వంటి కవితాశక్తి, గాయపు ముందు కత్తికే పూసి కొట్టినట్లు తిట్టుచునే నవ్వించు హాస్యకుశలత - ఇవన్నియు వేమనకు భగవంతుడు ఇచ్చిన సంపదలు.

**వేమన జీవిత చరిత్ర :**

వేమన గా పిలువబడుతున్న ప్రజాకవి పూర్తి పేరు. పైడిపాల పుల్లారెడ్డి. ఈయన కొండవీడు రాజవంశానికి చెందినవారు. క్రీ.శ.1652`1730 మధ్యకాలంలో జీవించిన కవి. పుట్టిన స్థలం - కొండవీడు. ప్రస్తుతం గుంటూరు జిల్లాలో ఉన్నది. వేమన కాలం గురించీ, జీవితం గురించే సి.పి. బ్రౌన్, వంగూరి సుబ్బారావు, వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రి, బండారు తమ్మయ్య, ఆరుద్ర, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, కట్టమంచి రామలింగారెడ్డి, త్రిపురనేని వెంకటేశ్వరరావు, ఎన్. గోపి పరిశోధనలు చేశారు.[1]

**వేమన పద్యాలలో అతని జీవితం :**

వేమన జీవితానికి సంబంధించిన క్రింది పద్యాలు ముఖ్యంగా ఉదహరింపబడినవి.

**నందన సంవత్సరమున**

**పొందుగ కార్తీక మందు బున్నమినాడీ**

**వింధ్యాద్రి సేతువులకును**

**నందున నొక వీరు పేరు పడరా వేమా!**

**ఊరుకొండవీడు వునికి పశ్చిమ వీధి**

**మూక చింతపల్లె మొదటి వీడు**

**అరశి చూడ బయలు అది ముక్తి, శివుడయా**

**విశ్వదాభిరామ వినురవేమ !**

బండారు తమ్మయ్య విశ్లేషణ ప్రకారం వేమన పూర్వులు మొదట మూగచింతపల్లి ఇల్లుగా కలవారు. వేమన కాలం నాటికి వారు ఊరు గుంటూరు జిల్లాలోని కొండవీడు గ్రామం. వీరు పశ్చిమ వీధిలో శివాలయం దగ్గర ఉండేవారు. ఈ విశ్లేషణ హేతుబద్ధంగా ఉందని వేమనపై పిహెచ్.డి. చేసిన పరిశోధకుడు ఆచార్య ఎన్.గోపి అంగీకరించారు.[2]

**శ్రీ వేమన - కవిత్వం :**

అసలు కవి అంటే ఎవరు? కవిత్వ మంటే ఎటువంటిది? అన్న ప్రశ్నలు ఉద్భవిస్తే, దాని జవాబు తెలుసుకోవడం అవసరమే. కవికి కుడి, ఎడమ హస్తాలుగా నిబ్బరము, నిర్భయము, లోచూపు, వెలి చూపు రెండు కళ్ళు. ఇక ఒళ్లంతా పరమార్థం. కవికి మెదడుకు కాస్త హృదయం, హృదయానికి కాస్త మెదడు ఉంటాయి. గుండె కాయ, తలకాయ సమదృష్టితో హృదయానికి ఉంటాయని చెప్పక తప్పదు.

రవి కిరణాలకు గూడ చోటు ఇవ్వని స్థలాన్ని కవి దర్శించగలడు. అందుకే వేమన ఇలా అన్నాడు.

**కం||** **‘‘రవి కాననిది కవి యెరుగును,**

**కవి యెరుగని చోటు రవియుగానడు ధరలో**

**రవి కన్న మిగుల నెక్కువ**

**కవిj్ౖెం విలసిల్లు నీవు గానర వేమా!’’** [3]

అని కవులపైన వేమన ఇచ్చిన సుప్రీం కోర్టు తీర్పు ఇది. ఇక దీనికి అప్పీలే లేదు.

‘‘ఋషి కాని వాడు కవి కాజాలడు’’. ‘‘నా నృషి కురుతే కావ్యమ్’’ అని అన్నాడు హేమచంద్రుడు తన కావ్యశాసనంలో శతాబ్దాల క్రిందట. ‘‘కవిత్వము భూమిపైన స్వర్గము యొక్క వెలుతురు’’. ‘‘వాస్తవం యొక్క అత్యుత్తమ కిరణం’’. (షెల్లీ).

వేమన సాహిత్యములో సామాజిక స్పృహను, ఆయన సంఘ సంస్కరణాభిలాషను, ఆయనకు ఉన్న తాత్విక, సృజనాత్మక దృష్టిని పరిశీలించవచ్చు. శ్రమ జీవుల నిత్యజీవితంలోని ముత్యాల మాటలూ, నుడులు, నానుడులూ, సామెతలూ, ఆమెతలూ, నీతులూ, స్త్రీలు, పురుషులు, ఆబాలగోపాలం పాడుకొని, ఆడుకొనే ఇంపూ, సొంపూ గల సమాసాలు, ఇవన్నీ పద్యాల రూపంలో, రత్నాలు రాసులు బోసి దండలు గట్టి, ప్రజలకే కంఠహారాలుగా అర్పించిన మహాకవి ఈ లోకంలో వేమన తప్ప ఇంకొకరు లేరంటే అతిశయోక్తి కాదు. ఇట్టి చెదలు ముట్టని, చిలుము పట్టని, ప్రజలు కూడబెట్టి దాచిపెట్టిన ఈ సజీవ సాహిత్యసంపద, ప్రపంచానికే వజ్రతుల్యమైన పిత్రార్జితం.

**వేమన - మకుటం :**

వేమన పద్యాలు లోక నీతులు సామాజిక చైతన్యం లక్షణం. వేమన స్పృశించని అంశం లేదు. సమాజంలోని అన్ని సమస్యలను భిన్న కోణాల్లోంచి దర్శించి, ఆ దర్శన వైశిష్ట్యాన్ని వేమన తన పద్యాలలో ప్రదర్శించాడు. ‘‘విశ్వదాభిరామ వినుర వేమ’’

అనే మాట వినని తెలుగువాడు ఉండడు. 'విశ్వ' = ప్రపంచం, 'దా' = ఇచ్చుటకు లేదా బోధించుటకు, లోకమందలి ప్రజలకు ఆదర్శాలను, నీతులను అభిరామంగా = అనగా మనోహరంగా మనస్సుకు ఆకట్టుకొనునట్లు, నిర్ణయించుకున్న ప్రజాకవి కావడం ఈ మకుటాన్ని పెట్టుటకు ఒక కారణంగా చెప్పవచ్చును.

వేమన తత్వవేత్త, సంఘ సంస్కర్త, కూడా కావడం, ఆనాటి సమాజంలోని కుళ్ళును ఓర్పుతో, నేర్పుతో అవసరమైతే ''బుద్ధి చెప్పువాడు గుద్దితే నేమయా'' అన్నంత కఠినంగా విశ్వవిప్లవ దృక్పథంతో మాటి మాటికి వివరించవలసి రావడం, ఈ మకుటానికి ఇంకొక కారణం.[4]

**వేమన - ఆటవెలది :**

ఆయన యోగమంతా అన్వేషణ, ఆ అన్వేషణలో అందివచ్చిన అనుభవాలను ఆటవెలదుల్లో అలవోకగా లోకానికందించాడా మహానుభావుడు. ఆయన సూక్తి, 'ఆయన అంతర్వక్తికి అద్దం పట్టిన అభివ్యక్తి, ఆయన అంతస్సాధన ఆయనకు ముక్తినిచ్చిందో లేదో కానీ, సూక్తిలోని శక్తి మాత్రం జాతికొక నూతన వ్యక్తిత్వాన్ని ప్రసాదించింది' అంటారు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం.[5]

తెలుగులో వృత్తాలు, కందాలు, యతి ప్రాసలు తప్పరాదనే కఠోర నియమం కలవి. కందం చిన్నదైనా, సంస్కృతములోని ఆర్యావృత్తానికి ప్రతిబింబం. వైవృతాలన్నీ సంస్కృత ప్రభావం కలది.

సీసము తెలుగు వృత్తమైనా పదాలను, భావాలను సాగదీసుకొని పోవాల్సి ఉంటుంది. అలాగే ద్విపద కూడా. మిగిలినవి ఆటవెలదులు, తేటగీతులు మాత్రమే తేటగీతల కంటే కూడ ఆటవెలది మరీ చిన్నది.

సంస్కృతంలో అన్నిటికంటే చిన్నదైన అనుష్టుప్ ఛందస్సులో ఆదికవి వాల్మీకి రామాయణ మహాకావ్యాన్ని రచించినట్లు, తెలుగులో మహాకవి వేమన నీతి కావ్యాన్ని రచించాడు. భారత సంస్కృతిలో రామాయణ ప్రభావం ఎట్లు చొచ్చుకొని పోయిందో, అట్లే వేమన నీతి, తెలుగు సంస్కృతిలో విడదీయరాని భాగమైంది.

**వేమన - మానవతావాదం :**

వేమనది వితండవాదం కాదు. మానవతావాదం. మనిషే దైవం మనిషిని సేవించడమే దైవదర్శనం అన్నాడాయన. ఆరుద్ర తన 'వేమన్న వేదం 'లో చెప్పిన వ్యాఖ్యానం గమనించదగ్గది.[5]

**వేమన జీవిత సందేశం :**

వేమన దృష్టిలో మనిషే దేవుడు. ఆయన మతం - మానవతావాదం. ''బాపడనగనేమి? భక్తు డనగనేమి ? జోగియనగనేమి ? (యముడు) పనితీర్చు'' అనే పద్యం ఈ వాదాన్ని బలపరుస్తుంది.

**వేమన సాంఘీక దురాచారాలపై ధ్వజం :**

నేటి సమాజంలో దాదాపు అన్ని రాజకీయ పార్టీల నాయకులు, విపరీతమైన మూఢవిశ్వాసాల మురికి కూపంలో ముక్కు బంటి దాకా మునిగియున్నారు. ఇక అగ్ర నాయకులు పోకడలు మరీ అధ్వాన్నం.

నిరర్థకపు పూజాపునస్కారాలూ, ఆరాధనలు, అర్చనలూ, జపాలు, తీర్థయాత్రలు, కళ్యాణ, కైంకర్యాలనూ వేమన తూర్పారబట్టినాడు.

**''పిండములను జేసి పితరుల దలపోసి,**

**కాకులకును బెట్టు గాడ్దె లారా !**

**పియ్య దినెడు కాకి పితరుడెట్లాయెరా !**

**విశ్వదాభిరామ వినుర వేమ!''**

చనిపోయిన తల్లిదండ్రులను తలంంచుకొంటూ, కాకులకు పిండాలు పెడుతూ ఉంటారు. మలం తినెడి కాకి వారి పితరుడెలా అవుతారని ప్రశ్నించుటను బట్టి, చనిపోయిన వారిపేరున దిన వారాలు, తద్దినాలు పెట్టడం వల్ల ప్రయోజనము ఉండదనియూ, ఇదియూ ఒక మూఢవిశ్వాసమే ననియూ, అలాంటి ఆచారాలను జరిపెడివారిని 'గాడితల'తో పోల్చినారు వేమన. [6]

**''నీళ్ల మును గనేల ? నిధుల మెట్టగ నేల ?**

**మొనసి వేల్పులకును మ్రొక్కనేల ?**

**కపట కల్మషముల కడుపులో నుండంగ**

**విశ్వదాభిరామ వినుర వేమ !''**

కొంగ జపం చేసే దొంగ భక్తులను, నొసలు భక్తుడైతే నోరు తోడేలని, ''భక్తి లేని పూజ పత్రి చేటని'', ఆత్మశుద్ధిలేని ఆచారాలు, భక్తి లేని భజనలు, భుక్తికి రాని తీర్థయాత్రలు, ముడుపులూ, మొక్కుబడులూ, ఒక్క ప్రొద్దులూ, దేవుళ్లకు రంగైన వలువలూ వగైరాలన్నీ శుద్ధ దండుగ'' అంటాడు.

**వేమన - అత్యాచారాలపై నిరసన :**

ఉన్న మదము, తిన్న మరము ఒళ్లు బట్టి కండకావరముతో ఆడబడచులపై ఆత్యాచారాలు సాగించే ''సింహబలులు, లంకాధిపతులకు, కుక్క చావు తప్పదని చాటి చెప్పుతారు.

**''లక్ష్మీమేలినట్టి లంకాధిపతి పురి,**

**పిల్ల కోతి ఫౌజు కొల్ల బెట్టె,**

**చేటు కాలమునకు చెరుప నల్పులె చాలు**

**విశ్వదాభిరామ వినుర వేమ !''**

రావణాసురుడి పట్టణమైన లంకను లక్ష్మీదేవి ఏలినప్పటికీ... ఈదే లంకను పిల్లకోతుల గుంపు నిప్పు అంటించి కొల్లగొట్టింది కదా.. అలాగే, ఎంత బలము గలవాడయిననూ కాలం కలిసిరానట్లయితే, ఏమీ చేయలేదు.

**''పెక్కు నోళ్లు గొట్టి పేదల వధియించి,**

**డొక్క కొరకు నూళ్లు దొంగిలించి,**

**ఎక్కడి కిని బోవనెరిగి యముడు చంపు**

**విశ్వదాభిరామ వినుర వేమ !''**

అంటూ నిరు పేదలను దౌర్జన్యంగా దోచుకొనేవారిని, హత్యలు చేసే నిరంకుశులైనవారు ఎక్కడికి వెళ్ళినా, యముడు చంపుతాడని, వారికి నాశనం తప్పదని, అటువంటి వారు వినాశనం నుండి తప్పించుకోలేరని ప్రజలకు ఆత్మవిశ్వాసము కలిగించేలా ప్రబోధించాడు.7

**వేమన నీతి బోధలు :**

వేమన నీతికవి. మానవుని నిర్మల ప్రవర్తనం మాత్రమే లోకాన్ని దిద్దుతుంది. 'వర కవులను' సృష్టిస్తుంది.

''వార్తలోని వార్త, వరకవి జేయురా'' అన్నది వేమన సూక్తి.. వార్త అంటే వర్తనము . లోక వర్తనము. అందులోని అనుభవాన్ని చెప్పే ''వార్త'' అనగా నీతి బోధ గొప్ప కవులను సృష్టిస్తుంది. వేమన కాలానికీ ''వార్త విద్యలెల్ల ధూర్తుల పాలాయె'' నీతి బోధలు దుర్మార్గులు స్వాధీనమై నీతి అవినీతిగా మారింది. అందుకే నీతి బోధలు నొక్కి చెప్పాడు వేమన.

**''పద్య మొకటి చెప్పి బడ బడ చదివిన**
**లోని యర్థ మెట్లు తేట పడును ?''**

చెప్పే నీతిని స్పష్టంగా, అర్థమగునట్లు, సూటిగా హృదయమునకు తగులునట్లుగా చెప్పగల నేర్పు వేమనదే. అందుకే వేమన నీతులు విసుగు పుట్టించవు. అతని నీతులు జీవితానుభవాన్ని తరచి, చూచి చెప్పేవి. నీతి మార్గబోధకుడు వేమన. ''సత్యం వద`ధర్మం చర'' అన్నవి వేమన ముఖ్యసూక్తులు.

**చిత్తశుద్ధిగల్గి చేసిన పుణ్యంబు**
**కొంచమైన నదియు కొదువగాదు**
**విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకు నెంత?**
**విశ్వదాభిరామ వినుర వేమ !**

మఱ్ఱివిత్తనం చిన్నదైనా అది మహావృక్షమైనట్లు శుద్ధమైన మనస్సుతో చేసిన ఉపకారం కొంచెమైనా అది తక్కుమేమి కాదు.

**అనగ ననగ రాగ మతిశయిల్లుచునుండు**
**తినగ దినగ వేము దీయనుండు**
**సాధనమున బనులు సమకూరు ధరలోన**
**విశ్వదాభిరామ వినుర వేమ!** [8]

తరచుగా పాడుచుండిన కంఠధ్వని మాధుర్యముగా ఉండును. ప్రతిదినము తినుచుండిన వేపవేరైనను తియ్యగ నుండును మానక ప్రయత్నము చేయుచుండిన పనులు నేరవేరును. ఈ ప్రపంచమున పద్ధతులు యీ విధముగ ఉండునని తెలియపరిచాడు.

**''చంప దగిన యట్టి శతువు తనచేత**
**చిక్కనేని కీడు చేయరాదు,**
**పొసగ మేలు జేసి - పొమ్మనుటే చావు**
**విశ్వదాభిరామ వినుర వేమ !''**

చంపదగిన శత్రువు అయినా చేతికి దొరికినపుడు, వీలైతే క్షమించి వదిలిపెట్టాలి. ఇంకా వీలైతే ఏదైనా సహాయం చేసి పంపించాలి. శత్రువు లేకుండా చేసుకోవాలి అంటే మార్గం శత్రువును చంపడం కాదు. ఆ మనిషిలోని శతృత్వపు భావాన్ని చంపడం. అది ప్రేమ, సహాయాలతోనే సాధ్యమవుతుంది. శత్రువులను దీవించుడి గాని శపించవద్దు అన్న బైబిలులోని క్రొత్త నిబంధనలోని సూక్తి వేమన తన పద్యం ద్వారా వివరించాడు.

**''దానములను సేయ ధరచేతులాడక**
**బహు ధనంబు గూర్చి పాతిపెట్టి**
**తుదను దండుగనిది మొదలు చెడు నరుడు**
**విశ్వదాభిరామ వినుర వేమ!''**

మానవుడు అపార ధనరాసులను సంపాదిస్తాడు కాని దాన ధర్మాల రూపంలో ఒక పైసా అయినా విదల్చడు. పైగా వాటిని భూమిలో పాతి పెడతాడు. దానాలు చెయ్యక అపరాధం చేసిన వానికి ద్రవ్యశిక్ష తప్పదు . అతని మరణానంతరం అది అధికారుల పాలో, రాజుల పాలో అవుతుంది. అది అతడు చెల్లించిన దండుగ. పుణ్యం మిగలని అతని జీవితం నిర్మూలమై పోయింది. కాబట్టి సంపాదించిన దానిలో కొంతైనా నలుగురి సాయానికి వెచ్చించడం మంచిది అని వేమన సందేశం.

నేరం చేసిన వారికి చెల్లించాలని విధించే సొమ్ము. అపరాధి నుండి అపరాధ పరిహారంగా అధికారి తీసుకునే దండుగ గురించి హనుమకొండ శాసనం (క్రీ.శ 1079) లో ఉంది.

ఈ దండుగను రాజులు ధనవంతుల నుండి బలాత్కారంగా తీసుకునేవారు. ఎవరినైనా బాధిస్తే దండుగ ఈనాం అని కూడా ఇచ్చేవారు. అంటే అనవసరంగా బాధించినందుకు ప్రతిఫలంగా ఇచ్చే భూమి.

(చేతులాడక అంటే మనసొప్పక అని అర్థం. ఇది మంచి నుడికారం)

**కన్యాశుల్క దురాచారం :**

వేమన కాలం నాటికి ఈ కన్యాశుల్క దురాచారం, ధనవంతులు బహు భార్యాతత్వమునకు, ముసలి ముప్పు పెండ్లిండ్లు దారి తీసింది. కన్యాశుల్కం బిడ్డలతో రమించే పాతకమనీ, తీవ్రంగా ఖండిరచినాడు.

**ముగింపు :**

మధ్యయుగ ఆంధ్రదేశ సాహిత్య చరిత్రలో ఒక ప్రత్యేకతను సంపాదించుకున్న వాడు వేమన. ఏ మానవునికైనా సంఘంలో అతనికి ఉండే ఉనికిని బట్టి అతని చైతన్యం ఉద్భవిస్తుంది. కానీ, చైతన్యాన్ని బట్టి ఉనికి ఉద్భవించదు. తాను తెలుసుకున్న, గ్రహించిన సత్యాన్ని యావత్ ప్రపంచానికి అతి సులువైన, సులభతరమైన పదప్రయోగాల ద్వారా పద్యరచన చేయడం వేమనకే దక్కింది. తన కవిత్వం నుండి జాలువారిన పదములు పండితులకే గాక పామరులకు సైతం అర్థమయ్యే రీతిలో రచించి, తెలుగు సాహిత్యం ద్వారా సామాజిక చైతన్యాన్ని కల్గించినాడు వేమన. ఈ విధంగా వేమన కవిగా మాత్రమే గాక సామాజిక తత్వవేత్తగా, సత్యాన్వేషిగా, విప్లవ వేగుచుక్కగా, జాతి, కులవివక్షతలను సామాజిక రుగ్మతలను ఎండగడుతూ, సామాజిక స్పృహను కల్గించిన కవితాయోధుడుగా తెలుగు సాహిత్య చరిత్రలో ఒక ప్రత్యేక స్థానమును సంపాదించుకున్నాడు.

**అథోజ్ఞాపికలు :**


1. వెంకటేశ్వర రావు త్రిపురనేని (1995). వేమన - పదహారేళ్ళ పరిశోధన, వేమన వికాస కేంద్రం.
2. ఎన్.గోపి, ప్రజాకవి వేమన, 2000, పుటలు 75-77,
3. గుర్రం వెంకటరెడ్డి & పోచన రామిరెడ్డి - విశ్వకవి వేమన, 2010, పుట. 135
4. గుర్రం వెంకటరెడ్డి & పోచన రామిరెడ్డి - విశ్వకవి వేమన, పైదే పుట.15
5. ఆరుద్ర - వేమన్న వేదం - విశాలాంధ్ర ప్రచురణ, విశాఖ - 2011.
6. శివారెడ్డి. జి - వేమనపద్యాలు, శ్రీశైలం, 2017, పుట`23
7. శివారెడ్డి. జి - వేమనపద్యాలు, శ్రీశైలం, 2017, పుట`24
8. మరువూరి కోదండరామిరెడ్డి, ప్రజాకవి వేమనయోగి, తిరుపతి, 2012, పుట.52

